

# ఆంధ్ర మహిళా సభ విద్యార్థినుల వివిధ పరీక్షా ఫలితాలు

## కాశీ విశ్వవిద్యాలయ పరీక్షలు

ఎడ్మిషన్ పరీక్షలకు వెళ్ళిన 39 గురు విద్యార్థినులలో, 19 గురు కృతార్థులైరి. విజయము పొందినవారి పేర్లు యీ దిగువ ప్రకటింపబడినవి.

* * * *

| | | | |
|---|---|---|---|
| ప్రథమ శ్రేణి : | ఎన్. మీనాక్షి. | | |
| ద్వితీయ శ్రేణి : | కె. భారతి, | కె. నిర్మలగుప్త, | ఎమ్. సి. నిర్మల, |
| | ఎస్. నిర్మల, | ఎస్. పద్మ, | ఎస్. పద్మావతి, |
| | ఎల్. రమణి, | కె. రాజ్యలక్ష్మి, | బి. సరస్వతి, |
| | జె. శాంతాదేవి, | ఎ. స్వర్ణకాంత, | ఎ. సి. యశోదా చౌదరి, |
| తృతీయ శ్రేణి : | పి. వాణి, | సి. హెచ్. సరస్వతి, | కె. సౌందర, |
| | బి. రామతులసి, | కె. ఎల్. ప్రమీళ, | ఎన్. లలితాబాయి. |

## ఎంబ్రాయిడరీ, కుట్టు ప్రభుత్వ పరీక్షలు

### కుట్టు

హయ్యర్ : పరీక్ష వ్రాసిన 10 మందిలో ఆర్గురు కృతార్థులైరి.

బి. సత్యనారాయణమ్మ, ఎన్. చంద్రాబాయి, ఆర్. కౌసల్యాబాయి,
ఎస్. సుందరవల్లి, బి. వేదవల్లి, ఎన్. సక్కుబాయి.

లోయర్ : పరీక్ష వ్రాసిన 11 మందిలో ఎనమండుగురు కృతార్థులైరి.

ఎమ్. ఎస్. రాజమ్, వి. రామమ్మ, సి. హెచ్. రత్నమాంబ,
ఎల్. బి. సావిత్రి, ఎ. సీతాదేవి, టి. సుభద్ర.
కె. రోహిణీ నాయక్, కె. భగీరథి,

### ఎంబ్రాయిడరీ

హయ్యర్ : పరీక్ష వ్రాసిన నలుగురిలో ఒక్కరు కృతార్థులైరి.

బి. సత్యనారాయణమ్మ.

లోయర్ : పరీక్ష వ్రాసిన 6 గురిలో ముగ్గురు కృతార్థులైరి.

బి. వేదవల్లి, కె. చంద్రకళ, కె. రోహిణీ నాయక్.

* * * *

విజయవంతులైన విద్యార్థినుల నభినందిస్తూ, వారి భవిష్యత్తుకు శుభాకాంక్షలనందిస్తున్నాము.

—ఆంధ్ర మహిళా సభ

# కిన్నెర

## సచిత్ర మాసపత్రిక



ఎడిటర్ : పందిరి మల్లికార్జునరావు,

అసిస్టెంట్ ఎడిటర్ : పందిరి మీరాబాయి.

ఆంధ్రదేశం సర్వతోముఖంగా అభివృద్ధిపొందాలంటే, అభ్యుదయం కలగాలంటే ఏయే జాతీయ జీవన రంగాలలో ఏయే పనులు జరగవలసినదీ, ఏయే పథకములు వేయవలసినదీ, వాటిని యెట్లు నిర్వర్తించవలసినదీ తెలిపే వ్యాసాలు, ఆంధ్రదేశానికి ప్రత్యేకంగా అనువర్తించే వివిధ సమస్యలను గురించిన వ్యాసాలు కిన్నెరలో ప్రకటింపబడతవి. ఒక్కొక్క విషయాన్ని గూర్చి సవిమర్శగా చర్చించి, రచించిన ఉత్తమ వ్యాసాలు ప్రతినెలా ప్రకటింపబడతవి.

---

భాష, సాహిత్యం, శిల్పం, కళ, ఆర్థిక రాజకీయ విషయాలు, శాస్త్ర విషయక వ్యాసాలు, కథలు, నాటికలు మొదలైనవాటితో సర్వాంగ సంపూర్ణంగా ముచ్చటైన ఆకారంతో ప్రకటింపబడుతుంది.

---

ఆంధ్రాభ్యుదయానికి కంకణంకట్టుకున్న పత్రిక కిన్నెర. ఆంధ్ర జనానీకం పత్రిక కిన్నెర. ఆంధ్ర సేవకై పుట్టిన పత్రిక కిన్నెర. మన సంఘం, మన ఆర్థిక జీవనం ఈ విషమ పరిస్థితులలో ఏవిధంగా పునర్నిర్మాణం కావలసిందీ, మన జీవిత సమస్యలూ, వాటిని యెట్లా పరిష్కరించవలసినదీ వర్ణించే హృదయంగమములైన కథలతోను వినోదాన్ని, విజ్ఞానాన్ని చేకూరుస్తుంది కిన్నెర.

విడి కాపీ 6 అణాలు — సంవత్సర చందా 4 రూపాయలు.



మేనేజర్:

కిన్నెర,

16, జోన్సు స్ట్రీట్, మదరాసు-1.

# ఆంధ్రమహిళ

## 8వ జన్మదిన సంచిక



ప్రఖ్యాత రచయితలు వ్రాసిన........
అనేక ఉత్తమ కథానికలు,
వివిధ విషయాలమీద వ్యాసాలు,
ఎన్నో విశేషాలూ, కావ్యాలూ,

రాధాకృష్ణుల ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రం,
'భక్తమీర' ఆర్ట్ సప్లిమెంటు........



మనోజ్ఞంగా తయారయ్యింది!

ప్రతులకు:—

మేనేజర్
ఆంధ్ర మహిళ,
మైలాపూర్, మద్రాసు-4.

# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: జూన్ '52 :: సంచిక 2

ముఖచిత్రం : బళ్ళారి ప్రాంతంలోని శృంగారవంతమైన గుహాపరిభాగం.

సంపాదకీయము ...
మహాత్ముని దృష్టిలో సంఘము–మతము ... శ్రీ వసంతరావ్ రామకృష్ణరావు
రాజకీయాలు ... శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు
పెద్ద వదిన—(పెద్దనాటకం) ... శ్రీమతి ఎ. రత్నమ్మ
చిదంబర రహస్యం ... శ్రీవణుకూరు బుచ్చిబాబు
ప్రతిజ్ఞా భంగం—(వెనుకటి తరువాయి) ... శ్రీమతి తాడికొండ రాధావసంత
పశ్చిమ తీర ప్రాంతాల్లో ప్రసిద్ధ దేవాలయాలు ... శ్రీ వారణాశి వెంకటాచలం
చీడపురుగులు ... శ్రీమతి ఆవంత్సమంగ
ఒకరు చెప్పినట్టు చేస్తే కాపురం చేసినట్టే ... శ్రీమతి జి. వి. కమలామణి
మా రోజుల్లో పండుగలు పబ్బములు ... శ్రీ గిడుగు సీతాపతి
విజ్ఞానపు వేయి పడగలు—(కొత్త శీర్షిక) ... శ్రీ 'భాస్కరాచార్య'
ఇంకా, బాలానందం, ఆహాహూషీ, వెలుగూ–నీడా, గ్రంధ సమీక్ష, వ్యాఖ్యలూ, కథలూ, కావ్యాలు.

సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.,
సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.,
ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 9 :: జూన్ '52 :: సంచిక 2

# స్త్రీల ప్రాతినిధ్యం

ఉపన్యాస వేదికనెక్కిన ప్రతి మహానుభావుడూ స్త్రీసామాన్యానికొక ఉద్బోధ ఉచ్చరిస్తేతప్ప, తమ ఉపన్యాసం పరిపూర్ణమైనదని భావించఁడు. ఉపన్యాసవిషయం ఏదైతేనేం, అందిమిడిన సారం ఎంతైతేనేం— తమసభాసదులలో స్త్రీలన్నవారొక్కరూ లేకున్నాగాని- కనీసం పరోక్షంలోనైనా, వారి పురుషులకైనా, స్త్రీలయొక్క విధయకాలను జ్ఞాపకం చేసితీరాలనుకుంటాఁడు. పాకశాస్త్రంనుండి పాశుపతాస్త్ర ప్రయోగంవరకూ స్త్రీలు నేర్వలేని, సాధించలేని శాస్త్రవిద్యలేమీ లేవు సరిగదా, స్త్రీలు పూనుకోకపోతే, ఏ ఒక్కసమస్యా చక్కబడదన్నవారి దృఢవిశ్వాసాన్ని బల్లగుద్దులతో బలపరుస్తూ ఉంటారు- శాంతి స్థాపనకు స్త్రీలే పూనుకోవాలి- క్షామనివారణ అసలు స్త్రీలపనే! ఆహార సమస్యా పరిష్కారం స్త్రీలు తక్క ఎవరు చేయగలరు? చివరకు పన్నులు చెల్లించడంకూడా స్త్రీల విధాయకమే.

ఈ ఉపన్యాసాలు విని విని, యిక స్వరాజ్యమంటే తమరాజ్యమేనని నమ్ముతూ, వెనుకటివలె తమకు ప్రత్యేకస్థానాలూ, ప్రత్యేక అవకాశాలూ కోరుకోవడం తమ హుందాతనానికి తక్కువని, స్త్రీలంతా శాసనసభలలో తమకు ప్రత్యేకస్థానా లక్కఱలేదని వదులుకున్నారు—

స్త్రీలయొక్క ప్రాధాన్యతను ఇంతగా ఉగ్గడించేవారు, ఎన్నికలలో ఎక్కువమంది స్త్రీలు పోటీలు చేయడానికి నియమించలేదెందుకో— కౌన్సిల్‌సభ్యుల నియామకంలోకూడా, వివిధపార్టీలవారు స్త్రీలవిషయం పూర్తిగా విస్మరించారనే చెప్పవచ్చు- కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూకూడ మంత్రులసంఖ్య అధికం చేశారు— ఉన్నపనులకన్నా మంత్రుల సంఖ్య అధికమేమోకూడా అనిపిస్తూవుంది— ఈ పరిస్థితిలో కేంద్రమంత్రివర్గంలో అమృతకౌర్‌కుతోడు మరొక స్త్రీయైనా లేకపోవడం, రాష్ట్రంలో స్త్రీలకొక్కస్థానమైనా లేకపోవడం, స్త్రీల ప్రాతినిధ్యాన్ని చిన్నచూపు చూచినట్లే భావించవలసివస్తూఉంది. ఇతర రాష్ట్రాలలో పరిస్థితి ఇంతకన్న మెరుగని చెప్పుకోలేము- అన్నిచోట్లా అవసరమైన స్త్రీల ప్రాతినిధ్యం, ప్రాధాన్యం, యీ పాలకవర్గాలలోమాత్రం ఎందుకు అవసరంకాదో విజ్ఞులు విడమర్చిచెప్తే సంతోషిస్తాం.


## కృతజ్ఞత

శ్రీమతి మహాసంపత్‌గౌరీ, కాటుపుత్తూరు జమీందారిణి, ఆంధ్ర మహిళాసభకు రు. 100/- చందా చెల్లించి యావజ్జీవ సభ్యురాలైరి. మరియొక రూ. 100/- తమ కుమారుని వివాహ సందర్భములో సభకు విరాళముగా నిచ్చిరి. వీరికి మా కృతజ్ఞత.

—ఆంధ్ర మహిళాసభ.

# ఆషామాషి

* "అవివేకి" *

## కొత్త నిర్వచనం :

రావణాసురుని చేజిక్కిన సీతామ్మవారిని హనుమ దాదుల సహాయంతో శ్రీరాములవారు "కటి కొట్టి తెచ్చి" నట్లుగా—— కాంగ్రెసు చీడపురుగుల చేతుల్లో చెదలుపట్టి, కాంగ్రెసేతర రాక్షసులచే దహింపబడనున్న ప్రజాస్వామ్య సముద్ధరణార్థం—— అపర శ్రీరామచంద్రులని అనుకుంటూ అనబడుతూ ఉన్న శ్రీ రాజాజీవారు తమ స్వర్గారోహణ సంరంభానికి తాత్కాలిక ప్రతిష్ఠంభన కల్పించుకున్నారు. హనుమజ్జాంబవంత సుగ్రీవాదులతో తుల తూగగల మిత్ర సహచర బృందంతో, ఒక్కమారు అమాంతంగా రాష్ట్ర నాయకత్వాన్ని ఆకళించుకున్నారు- జయయాత్రలని ఊహించుకుంటున్న తమ పర్యటనలలో- "భగవాను ఉవాచ'' అనదగు ధర్మసూక్తుల నుపదేశించుచున్నారు. అవి మరపురాని, మరువవగని, రత్నాలంటే, బుద్ధిమంతులెవ్వరూ కాదనలేరు- తప్పితే నాబోటి అవివేకులకవి రాళ్ళుగా కనిపిస్తాయి—— భౌతికరీత్యా రాళ్ళకూ రత్నాలకూ తేడా ఏమిగనుక——

స్వరాజ్యమంటే సక్రమంగా పన్నులు చెల్లించుకోవడమేనని ముఖ్యమంత్రిగారు యిటీవల కోయంబత్తూరులో ఉపన్యసిస్తూ చెప్పారు. తథాస్తు – (డబ్బివ్వకపోతే ఏమంగలి మాత్రం క్షౌరకర్మ చేస్తాడు ?) మునిసిపాలిటీ వారు దేనికో ప్రభుత్వ ఆర్థిక సహాయం కావాలంటే, ప్రజలకీ ఉపదేశం ఫలించింది- ఎక్కడా పన్నుల నిరాకరణోద్యమంలేని యీనాడు యీ సూక్తియొక్క అంతరార్థం, పరమాత్మునికే ఎఱుక ! యింకా బరువైన పన్నులు వేయవలసి ఉంటుందని—— ముందఱకాళ్ళకు బందాలు కాదుగదా? అయితే, యీ పన్నులు విధించడానికి స్వరాజ్యరక్షకులకు ఒక క్రమపద్ధతి ఉందా?

## ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డట్టు !

అదేమంటే ఆడవారు ఆభరణాలను విక్రయించైనా పన్నులు కట్టితీరాలిసిందే- అన్నారు– (కలిగినవారు- నాగరీకము కాదని- లేనివారు గత్యంతరంలేక- యీనాటి స్త్రీలు ఆభరణాలను విసర్జించారనుకోండి.) హిందూలా ప్రకారం స్త్రీలకు స్వంతఆస్తి యీ ఆభరణాలొక్కటే. స్త్రీలకు చిల్లిగవ్వ ఆస్తి ఇచ్చే హక్కులను ప్రతిఘటించడానికి తల్లకిందులా తపస్సైనా చేస్తామనే పురుషాగ్రేసరులు- స్త్రీలకు యీ ఆభరణాల రూపంగా ఉన్న స్వల్ప ఆస్తిని పన్నులు కట్టటానికి వినియోగించమంటే——

అసలు స్త్రీల ఆభరణాలలోని రహస్యం- అగర్భ శ్రీమంతులైన రాజాజీగారి కెట్లు అర్థమౌతుంది ! మన దరిద్రభూమిలో నూటికి 95 గురి దైనందిన సంసార జీవనంలోని కష్ట నిష్ఠూరాలు ఎట్లా బోధపడ్తాయి?

భర్తకు జబ్బుచేసి ఒక నెల ఉద్యోగానికి వెళ్ళకపోతే, కాలం ఖర్మం ఒనగూడి చేసుకుంటూన్న చిన్నవ్యాపారంలో నష్టంవస్తే, టైఫాయిడ్ జ్వరంతో బాధపడే ముసలి అత్తగారినో- పసిపాపనో ఉద్యోగులకందఱకూ దక్షిణలిచ్చుకుంటూ- వైద్యశాలలో జేర్పించుకోవాలంటే, కన్న కొడుకు ఉద్యోగానికి ధరావత్తు కట్టాలంటే, క్షయతో బాధపడే కుమార్తెకు నల్లమార్కెట్టులో స్ట్రెప్టోమైసిన్ కొని యిప్పించాలంటే, చివరకు అనేకమార్లు వాకిట్లో తమ రక్త బంధువుల మృతకళేబరానికి దహనసంస్కారం చేయించాలంటే- ఆదుకునేవి యీ ఆభరణాలే——

ఈ కష్టాలన్నింటికీ రాజాజీ ప్రభుత్వం ఆదుకొనేటట్టుగాఉండి, తమ సంసారాలలో కూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఉద్యోగం- సంతృప్తికరంగా సమకూర్చడానికి రాజాజీ ప్రభుత్వం నడుము కట్టిననాడు, స్త్రీలందరూ లోకసౌభాగ్యం నిమిత్తం ఒక్కుమ్మడిగా పన్నులు చెల్లించడమేకాదు : ఆభరణ సన్యాసం చేయటానికికూడా సిద్ధపడకపోరు.

## 'గౌ ర వ' —— బిరుదులు

బిరుదులంటే విసరగలరుగాని, ఆ బిరుదుకు జీవమైన గౌరవాన్ని ఎట్లా విసరగలరు, ఆసనాల నధిష్ఠించినంత మాత్రాన అందఱి వ్యక్తులపైనా? అంగడిలో దొరికే వస్తువైనా కాకపోయె ! ఐదేళ్ళ స్వంతపరిపాలన అయిన తరువాత మన ఆసాములు గ్రహించిన పరమసత్యం ఇది. అందుకే కాబోలు, మంత్రులపేర్లకు ముందు ఇకమీద గౌరవ బిరుదు ఉండబోదని కేంద్ర ప్రభుత్వం చల్ల చల్లగా యిటీవల ఒక ప్రకటన చేశారు. [రాష్ట్రమంత్రులు యింకా యీ విషయంలో కొంచం సందేహిస్తున్నారనుకోండి.]

# ఆ షా మా షీ

విక్రమార్కుని సింహాసనాన్ని గూర్చిన విచిత్రగాథ యీసమయంలో గతాలున స్ఫురణకు వస్తూవుంది. మంచి కింద మంటిలో కూరుకొని పోయినప్పటికీ, ఆ సింహాసనముయొక్క మహత్వం- మంచిమీద కాలుపెట్టిన వ్యక్తిలో దయాదాక్షిణ్య ధర్మశీలత్వాన్ని పురికొల్పేది. మంచి దిగిన తక్షణం ఆ వ్యక్తి, లోభ, మోహ, మాత్సర్యాలకు వశుడైన అతి సామాన్యునిగా రూపొందేవాడు. సింహాసనపు ఒక్కొక్క మెట్టుకూ గల ఒక్కొక్క బంగారు ప్రతిమకూ, ధర్మసూత్రాలపై తగిన సమాధానం చెప్పితేగాని, భోజరాజంతటి వానికికూడా ఆ సింహాసనాన్ని అధిష్టించే అధికారం కలుగలేదు.

అవి పుక్కిటిపురాణాలో, పూర్వపు గాథలోఅనుకొండి. కాని అందలి ఆదర్శం మాత్రం దేశకాలాతీతమైందని ఒప్పుకుతీరాలి- సింహాసనాన్ని అధిష్టించేవ్యక్తికి కొన్ని అర్హతలుండాలని— ధర్మబద్ధమైన పరిపాలకుల ఆసనాలకు గూడ ప్రత్యేకమైన మహత్తు, ఔచిత్యం, ఉంటాయని-

ఇక— వర్తమానంలో మనది ప్రజాస్వామ్యం- ప్రజాపాలకుడు కాగోరడానికి భారతపౌరుడు కావటం తప్ప మరే అర్హతా అవసరంలేదు. అంతకన్నా అర్హతలు నియమిస్తే— ప్రజాస్వామ్య ప్రధాన హక్కులను ప్రతిఘటించడం అవుతుంది. నిన్న మొన్నటి వరకూ కల్లంగడి లాభాలతో ఇళ్ళు కట్టిన ఆసాములు, అడ్డం అనుకొన్న వ్యక్తులను అట్టె యమలోకానికి సాగనంపిన ప్రజ్ఞావంతులు, నల్లమార్కెట్టులో ప్రజాసామాన్యాన్ని నల్లులవలె మాడ్వ వెరువని పురుషసత్తములు— ఇట్లా అనేక రకాలవారు యీ ప్రజాస్వామ్య ప్రవాహంలో ప్రాతినిధ్యాన్ని అందుకున్నారు- ఇంక ముందు ముందు యీ ప్రాతినిధ్యం ఏరూపాన్ని దాల్చగలదో ఊహించనలవికాదు. 100 కి 90 మంది నిరక్షరాస్యుల ప్రతినిధి నిశాందారుకావడంలో రూ 1-0-0 కు తను ఓటు నమ్ముకున్నవారి ప్రతినిధి, లంచగొండికారవడంలో, కల్లుతెచ్చినవాడికే తమ ఓటని చాటి చెప్పుకున్నవారి ప్రతినిధి, దొంగసారాయి వర్తకుడు కావడంలో ఆశ్చర్యమేమీ అక్కరలేదు, ఇంతటి అనాగరీక వ్యవస్థలో అర్హతలు నియమించడంగాని, అర్హులను ఎన్నుకోవడంగాని అసాధ్యమైన కార్యక్రమం- "పెళ్ళి కుదురుతేనేగాని పెళ్ళికుదరదు- పెళ్ళికుదురుతేనేగాని పిచ్చి కుదరదని" మన పెద్దలు ఒక సామెత చెప్తారు. అట్లాంటి అయోమయ పరిస్థితే ప్రస్తుతం మన ప్రజ - పరిపాలకుల నడుమ వెలసిన సంబంధ బాంధవ్యం.

ఈ అయోమయ అవ్యవస్థపు పరిస్థితులనుండి మనను ఉద్ధరించి, ఆసనాలకు ఔచిత్యం, అధిష్టించేవారికి అర్హతలు నియమించి, సాధించగల వ్యవస్థ ఏర్పడడానికి ఏదేవునికైనా మ్రొక్కుకోనైనా మ్రొక్కుకుందాం— మదరాసు మైసూరుల ముఖ్యమంత్రులు ఏమైనా సలహా చెప్తారేమో!

———:o:———

# అభినందనాలు

ఒకప్పుడు "బృందావనగోపీ" గా ఆంధ్రమహిళాసభ నృత్యశాఖలో విద్యనభ్యసించింది మా చిట్టి అన్నపూర్ణ- ఇప్పుడు మదరాసు విశ్వవిద్యాలయపు పట్టభద్రురాలైంది. మార్చిలో జరిగిన యూనివర్సిటీ పరీక్షలలో, ఎకనామిక్సు ఆనర్సులో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. యూనివర్సిటీ విద్యార్థినులలో ప్రథమస్థానమునను, మొత్తముమీద తృతీయస్థానముననూ నిలచినది. ఈమె విద్యార్థి జీవితం చాలా ప్రజ్ఞాయుతంగా గడచింది. పాఠాలలో శ్రద్ధ, తెలివిగాకుండా, ఆటలలో, వ్యాసరచన, వక్తృత్వపు పోటీలలో ఉత్సాహంగా పాల్గొనేది. వర్షావర్షం ఆంధ్రమహిళా సభ వారు జరిపించే దసరా పోటీలలో పాల్గొని పెక్కుమార్లు బహుమానాలు పొందింది. కాలేజీ హిందీ డిబేటులోనూ, ఇంగ్లీషు డిబేటులో లయోలా కప్పును, ఆంగ్ల వ్యాసరచనలో ఎల్‌ఫిన్‌స్టన్ బహుమతిని పొందింది. ఇంకా ప్రెసిడెన్సీ కాలేజి యూనియన్ కార్యదర్శిగా, మేగజిన్‌కు విద్యార్థి సంపాదకురాలుగాకూడా పనిచేసింది.

ఈమె ఆంధ్రమహిళాసభకు యావజ్జీవన సభ్యురాలు. వర్తమానంలో కార్యనిర్వాహక వర్గంలో ఒక సభ్యురాలు. ఆంధ్ర మహిళాసభ ప్రతికార్యకలాపంలో శ్రద్ధతో పాల్గొని నిర్వాహకులకు తోడుగానిలుస్తూ, అందటి అభిమానాన్ని పాత్రురాలైంది,

అన్నపూర్ణ హైకోర్టు న్యాయవాది శ్రీ కస్తూరి శేషగిరి రావుగారి కుమార్తె. తల్లిగారైన శ్రీమతి రుక్మిణమ్మగారు ఆంధ్రమహిళాసభ యావజ్జీవన సభ్యురాలుగానూ బహుకాలం కార్యనిర్వాహక సభ్యురాలుగా సన్నిహితంగా సేవ జేసిన వారు. ప్రఖ్యాత ఆంధ్రులు భారత ఉపాధ్యక్షులు నైన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి దౌహిత్రి.

చిన్నవయస్సులో యిన్నివిధాలుగా ప్రజ్ఞజూపిన ఈమె, భవిష్యత్తులో సర్వతోముఖ ప్రఖ్యాతి గడించి, అభివృద్ధి గాంచగలదని అభినందపూర్వక శుభాకాంక్షల నందించుచున్నాము.

—ఆంధ్ర మహిళా సభ.

★

# వెలుగూ — నీడా

* గిరి *

**ప్రముఖుల ప్రసంగాలు :**

మొన్న మే నెలాఖరులో నూతన భారత రిపబ్లిక్ అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్ పార్లమెంటులో– శ్రవణానందకరంగా– సుదీర్ఘోపన్యాసం చదివి వినిపించారు. సాధారణ కొలతబద్దతో కొల్చి చూస్తే, ఈ ఉపన్యాసానికీ, వెనకటి ప్రసంగాలకి అట్టే తేడా కన్పించదు– అదే ధోరణి– అదే పాతవాసన;...ప్రముఖుల ప్రసంగాలు ఎప్పుడూ అల్లాగే వుంటాయి. కాని...ఇప్పటి దాంట్లో ఒకానొక విషయంలో మాత్రం నూతనత్వం తొణికిసలాడుతూందని చెప్పక తప్పదు. ఇదివరకు, దేశాన్ని పీడిస్తున్న ఒక సమస్యను తీసుకునీ, తత్పరిష్కార మార్గంకూడా వీలైనంతవరకు సూచింపబడేది. ప్రస్తుత ప్రసంగంలో మీకు సమస్యల్ని సూచించడంలో నేం కొరత కన్పించదు. ఆహారసమస్యనుంచీ, అంతర్జాతీయ వ్యవహారాల వరకూ అన్నీ చక్కగా ఆకళించుకు చెప్పారు. ఎటొచ్చీ పరిష్కారమార్గాలే సామాన్యుడికి అగమ్యగోచరంగా వున్నాయి.

ఇప్పుడు తిండికి కటకట పడుతూన్నది సామాన్యుడే, మరే జీవనావసరానికైనా తికమక పడుతున్నదీ, అతనే. అందుచేత ఫలానా ఇబ్బందులు నువ్వు పడ్తున్నావని అతనికి బోధించడం: మహాసముద్రంలో కొట్టుకుపోతున్న వాడ్ని జూసి, "ఏమయ్యోయ్! చూశావా, నీచుట్టూ జలరాశి ఎల్లావుందో!" అన్నట్టుగానే వుంటుంది. ఇంతకీ, అలా కొట్టుకుపోతున్నవాణ్ణి రక్షించనూ "నడుం బిగించండని" ఎవరన్నా ఆజ్ఞాపించటంకంటే కూడా, స్వతః నడుం బిగించడం— ఎంతో సబబుగా వుంటుంది.

ప్రజలు ఉపన్యాసాల్ని ఆరగించి సజీవంగా వుండలేరు గనుక ఎప్పటికప్పుడు యాటం అణువుల్లా ముంచుకొచ్చే ఈ ఉపన్యాస మాలికలతో–వారికి ప్రమేయంలేదు.

నిష్క్రియారూపంలో–నిర్జీవంగా పరిణమించే ఏ ప్రసంగమైనా నిరుపయోగమే ననిపిస్తుంది.

**విఘ్నేశ్వరుడి పెళ్ళి :**

ప్రెసిడెంట్ గారు పేర్కొన్న సమస్యలెన్నిటిలోనో, భాషారాష్ట్రాల ఏర్పాట్ల ప్రసక్తికూడా లేకపోలేదు.

ఏది ఎల్లావున్నా ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రం పూజ్యమని ఋజువైంది. దీంతోబాటు స్వామి సీతారాంకు కూడా నిరసనవ్రతాలనించి విముక్తి లభించే శుభసూచనా, కన్పించటంలేదు.

ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి కేంద్రపార్లమెంటులో మరీ హాస్యాస్పదంగా తయారైనట్టుంది. రాష్ట్రంకోసం తహ తహ పడుతూ, విప్లవం లేవదీస్తున్న స్వామి సీతారాం త్యాగనిరతిని, అతని నిరసనవ్రతాల్నీ "వ్యక్తిగతానుక్రియ"గా భావించాలనీ, ఆంధ్రరాష్ట్ర రచన గురించి అయితే మాత్రం ఇంకా కొద్దిరోజుల్లో చర్చలు సాగించవచ్చునీ సెలవిచ్చారు పార్లమెంటు స్పీకర్ మావలంకర్!

విఘ్నేశ్వరుడి పెళ్ళిలాగ, ఎప్పటికప్పుడు, ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం వస్తూనే వుంది.

పోతే, ఈ సందర్భంలో ఆయా ప్రభుత్వాల సమయోచిత చాకచక్యాల్నికూడా చూచి ఆనందించాలి. రాయలసీమను ప్రత్యేకంగా కత్తిరించిపెడుతూ, కొన్ని కొన్ని విషయాల్లో హైదరాబాదునూ విడదీస్తూ "విశాలాంధ్ర" గురించి కలలుగనేవారికి, కలతనిద్ర కలుగజేస్తున్నారు. వీరివన్నీ దుస్స్వప్నాలగానే పరిణమించే సూచనలు త్రాచుపాముల్లా పడగలెత్తుకనుంచున్నాయ్.

సింహళంలోనూ, దక్షిణాఫ్రికాలోనూ ఆయా పాలకుల జాత్యహంకారాల అన్యాయాంధకారంలో కుమిలిపోతున్న మన భారతీయులపట్ల ఎంతో సానుభూతిని ప్రదర్శిస్తూ, వారికి న్యాయం సమకూర్చేందుకని తీవ్రమైన ఆందోళన జరిపాం, జరుపుతున్నాం. ఇతరదేశాలవారుకూడా నెహ్రూ మీదవున్న గౌరవంకొద్దీ, ఇండియా అంటే—గౌరవ పురస్సరమైన భావంతో చూస్తారు. ఈ కార్యాల్నయితే సాధించగల్గిన పండిట్ నెహ్రూకి, అతని అనుచరవర్గానికి ప్రత్యేకరాష్ట్రంకొరకు ముక్కోటి ఆంధ్రుల ఆక్రందన చెవిని బడటంలేదు.

ఈ సవితితల్లి చూపులోని అంతరార్థమేమిటో ఎవరికీ అవగాహనమవడంలేదు.

రైల్వేల అభ్యుదయం :

ప్రభుత్వం, ప్రజలసొత్తు... (అసలు 'ప్రజాస్వామ్యం' మంటే అర్థం అంతేనేమో).

రైల్వేలు ప్రభుత్వం సొత్తు. కనుక ప్రజల ఆస్తిగానే పరిగణించబడే ఈ రైల్వేలు, ప్రజలని అనుక్షణమూ, ఆవేదనలకు గురిజేస్తూండడం, అన్యాయం. మూడోతరగతి ప్రజలంటే- రైల్వేల ఆదాయానికి వెన్నెముకలాంటివారని ప్రతివారూ ఒప్పుకుంటారు. ఈతరగతి ప్రజకు, ప్రయాణాల్లో సౌకర్యాలు బహుతక్కువ. సౌకర్యాలు కలగజేయడానికి ప్రయత్నించడమనేమాట అటుంచి, ఎప్పటికప్పుడు ఛార్జీ పెంపకాలతో, ఈతరగతి ప్రజల పరిస్థితిని మరీ దుర్భరం గావిస్తున్నారు.

వీరిని గురించి ముచ్చటిస్తూ, బొంబాయి ముఖ్యమంత్రి బి. జి. ఖేర్ "యాచకుల"ని వర్ణించడం అక్షరాల నిజమని పిస్తుంది. తరగతుల విభజన తీసివెయ్యాలని అతను ఉద్ఘాటించడంకూడా భవిష్యత్తుమీద ఆశాకిరణాల్ని ప్రసరింపజేస్తుంది.

పార్లమెంటులో ఇటీవలనే హరీంద్రనాథ్ చటోపధ్యాయ కవిత్వ మల్లి చెప్పినట్లుగానే- విమానాల్లో- గాల్లో తేలియాడుతూ- విహరించే అమాత్యవర్యులకు- ముక్కుతూ మూలుగుతూ మూడోతరగతిలో- ముక్కుమూసుకుని ప్రయాణం చేసే వాడి కష్ట నష్టాలు అర్థం కావడం కష్టమే.

న్యాయమైన ఛార్జీలు- నిలకడగా వుండేలా—ఏర్పాట్లు జేసి ఇతోధిక సౌకర్యాలుకల్గించి సామాన్యుడికి తోడ్పడ్డం- ప్రజాప్రభుత్వం కనీస ధర్మం. సామాన్యుడు బాగుపడ్డరోజే దేశాభ్యుదయం రెండు రైల్వే పట్టాలమధ్యనే సంకుచిత రూపంలో వుండకుండా- ముందుకు విస్తరించగలదు.



# పవిత్రమయిన పాదాలు

★ శ్రీ అవసరాల రామకృష్ణారావు ★

భర్తకోసం నిరీక్షిస్తూ సుభద్ర వీధివాకిలిలో నిలుచుంది. రోజూ యీవేళకే యిలాగే తను నిలబడుతుంది. భర్త వస్తాడు. కోటు గుండీలనుంచి బూట్సు తాళ్ళవరకు విప్పుతుంది. కాళ్లు కడుక్కోడానికి నీళ్లు యిస్తుంది. విసనకర్రతో విసురుతూ అన్నం వడ్డిస్తుంది. భర్త అన్నం తింటాడు. వెళ్ళి పడుకుంటాడు. ఈరోజు, లోకమందు కూడా యిలాగే జరుగుతుంది. సౌఖ్యమన్నది ఆమె జీవితంలో కనపడని భావం. చిరునవ్వు అన్నది ఆమె జీవితపు పుటలో దొరకని పదం, చిగర్చడమన్నది ఆమె జీవితపు ప్రోదుకి జరగని సత్యం.

ఆడపిల్లల్ని కనడమే అపరాధమై తన తల్లితండ్రులు తన ముగ్గురి అక్కలకీ పెళ్ళిళ్ళు చెయ్యడానికి ఎంత కష్టపడ్డారో సుభద్ర అర్థం చేసుకోగలదు. అందుకనే సుభద్ర ఆనాడు తండ్రి దగ్గరకు వెళ్ళి 'మరేం ఫరవాలేదు, మీరేం విచారించకండి. మీకు నచ్చకపోయినా ఆయన నాకు నచ్చారు. రెండవ పెళ్ళయినా మీరేం వెనుదియ్యవద్దు' అని సర్వత్యాగం చేసి తండ్రి భారాన్ని తగ్గించింది.

అంతే. ఏనాడు యీాయన దగ్గరకొచ్చిందో సుభద్రకీ సుఖానికీ దూరమయిపోయింది. ప్రపంచం ధనలోపం చేసినా ప్రకృతి సుభద్ర తల్లిదండ్రులికి గుణలోపం చెయ్యలేదు. వారికీ పిల్లంటే ఎంతో ముద్దు. ఆఖరిపిల్ల అవడంచేత ఉన్నంతలో మిగిల్చిపెట్టి ఆమెనెంతో అభిమానంగా చూశారు. సుభద్ర అన్ని ముద్దులూ అత్తవారింట్లో అణిగిపోయాయి. అత్తగారు బ్రతికున్నన్నాళ్ళూ బీద పిల్లని యీమెను వీలయినంత హీనంగాచూసి కొడుకుకి అన్నీ బోధించి మరీ కళ్ళు మూసింది.

సుభద్రకీ భర్తకీ పదిహేనుళ్ళు తేడా. సుభద్ర అందమే, చిన్నవయసే; ఆమెకు విపరీతమయిన కష్టాలు తెచ్చిపెట్టాయి. ఆమె భర్తకి ఆమె కూర్చుంటే అనుమానం, నిల్చుంటే అనుమానం. ఒకసారి ఇంటికొచ్చేసరికి సుభద్ర పొరుగింట్లో

ఉందని భర్త ఆమెతో రెండు నెలలు మాట్లాడ్డం మానేశాడు! మరొకసారి చెప్పకుండా సినీమాకు వెళ్ళిందని ఆరు నెలలు ఆమె వైపే చూడలేదు!

ప్రపంచం అంతా అనుకుంటుంది 'సుభద్ర వాళ్ళ సంతానంలోకల్లా అదృష్టవంతురాలు, డబ్బున్న వాళ్ళింట్లో పడింది. సుభద్రకి వంటినిండా నగలున్నాయి, పెట్టినిండా బట్టలున్నాయి. ఆమె భర్తకి కావలసినంత డబ్బుంది'... ఈ ధనధాన్యాలేమీ ఆమెకు కించిత్తయినా సుఖం అందించలేకపోయాయి. ఆమె చేసుకున్న పాపమేమిటోగాని భర్త నుంచి ఒక్క అనురాగ అవలోకన, ఒక్క ప్రేమపూరిత ప్రియసంభాషణ, ఒక్క రమణీయ లాలన నోచుకోలేదు. భార్యల్ని భర్తలు హృదయాధి దేవతగా, మధుర మనోజ్ఞ మనోసుందరిగా చూసుకుంటారని వింది. కాని ఆమెను చూస్తున్న దెల్లాగు?

సుభద్ర రెండు చెంపలనుంచీ కన్నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి. కాని ఆ హిందూ స్త్రీకి అది తప్పుగా తోచింది. 'నా భర్త ఆరోగ్యంగా ఉన్నారు. అంతకన్న ఈ నిర్భాగ్యురాలికి కావలసిందేముంది? సంధ్యవేళ యీ కన్నీళ్ళేమిటని ఎవరయినా చూస్తే? " ... ఆమె కన్నీళ్ళు తుడిచేసుకుంది.

'ఊర్లో కంతా ఆయన మంచివారు. ఆయన ఉద్యోగంలోగాని, ప్రవర్తనలోగాని ప్రపంచంలో మంచిపేరేగాని చెడ్డపేరు లేదు. నేను నిర్భాగ్యురాల్ని కాబట్టి నా మొహం చూస్తే ఆయనలో నిర్దాక్షిణ్యత నాట్యం చేస్తుంది' అని ఆ త్యాగమయి చెమర్చిన కన్నీళ్లు మళ్ళీ తుడుచుకుంది.

హాల్లో గోడగడియారం కొట్టిన ఎనిమిది గంటలు విని సుభద్ర గుండె ఆత్రుతతో కొట్టుకుంది. ఎప్పుడూ ఆమె భర్త యింత ఆలస్యం చెయ్యలేదు. అశుభాన్ని సూచిస్తూ ఆమె కాళ్లు వణికేయి. దానికితోడు ఆయింటి వైపు వస్తున్న పెద్ద గుంపునుచూసి ఆమె అప్రయత్నంగా కెవ్వని అరిచింది. ఆమెకు చెవిన పడిన కబురు యిది. 'నీకన్న దురదృష్టవంతురాలు ఉండదమ్మా సుభద్రా! మీ ఆయన వస్తున్న కారు ప్రమాద వశాన్న రోడ్డు ప్రక్కనున్న లోయలో పడిపోయింది. శరీరమంతా చిదిగిపోయింది. పాదాలొక్కటే మిగిలేయి!' ఈ వార్త విన్న సుభద్ర ఒక్క అరుపు అరిచి తెలివి తప్పి పడిపోయింది.

సుభద్రకి తెలివి వచ్చేసరికి భర్తపాదాలదగ్గిర ఉంది. మొహం దగ్గరనుంచి మోకాళ్ళవరకూ శరీరాకృతి లేకపోవడంవల్ల గుడ్డ కప్పి ఉంది. ఈ పాదాలయినా ఎందుకు తెచ్చారో ఆమెకు మొదట బోధపడలేదు. కాని అడగకుండానే ఆమెకు జవాబు లభించింది. "సుభద్రమ్మతల్లీ! నీకన్న దురదృష్టవంతురాలు ఉండబోదు. భర్తముఖాన్ని కడసారయినా చూసే అదృష్టం నీకు లేకపోయింది. నీభర్త చిహ్నంగా నీకు మిగిలినవి యీ కాళ్ళు మాత్రమే! వీటినయినా కడసారి కళ్ళకద్దుకో" ............

సుభద్ర ఆ కాళ్ళవైపు చూసింది. అనేక అక్రమాల్ని ఆచరించి తనని అణగద్రొక్కిన ఆ పాదాలే! ... ... ఏ ప్రేమతో ఈ పాదాలు పట్టుకోవాలి?

కాని సుభద్ర హిందూ స్త్రీ; వెంటనే తన మూర్ఖతకి క్షమించమని దేముణ్ణి వేడుతూ, భర్తకాళ్ళు పట్టుకొని, మనస్సులోకూడా వాటిని కళ్ళకద్దుకుని భోరున ఏడ్చింది !!!



చైనా వెళ్ళిన ఇండియన్ కల్చరల్ డెలిగేషన్ సభ్యురాండ్రు, పెకింగ్ నగరంలోని పీ-హై పార్క్ నర్సరీ సందర్శించినప్పటి ఛాయాచిత్రం. ఇందులో శ్రీమతి విజయలక్ష్మీపండిట్, శ్రీమతి దుర్గాబాయిగారు మున్నగువారున్నారు.



ఆంధ్రదేశమంతటా అన్నిముఖ్యకేంద్రములలో

# త్వరలో విడుదల

పక్షిరాజా వారి

# కాంచన

తెలుగు

లలిత, పద్మిని, K.R.రామస్వామి,
దొరైరాజ్, ఋష్యేంద్రమణి, కుమారి,
రామశర్మ, దొరైస్వామి, నటించినది...

డైరెక్షన్... S.M. శ్రీరాములు నాయుడు

## మహాత్ముని దృష్టిలో

# సంఘము — మతము

* శ్రీ వసంతరావు రామకృష్ణారావు *

మహాత్ముడు ఇంగ్లాండు దేశములో విద్యనభ్యసించి తన్మూలమున క్రైస్తవమతముతో నత్యంత సన్నిహిత సంబంధముగలవాడైనప్పటికిని, భగవద్గీతా పారాయణమున ఎక్కువ భక్తిశ్రద్ధలు చూపెడివాడు. మహాత్మునకు జాతీయత అధికమైనను బైబిలుగ్రంథ ప్రాశస్త్యమును గుర్తించి, క్రీస్తు ప్రబోధించిన మత సూత్రములను ఆమోదించెను. క్రైస్తవమత విశిష్టతను బాగుగా గుర్తించినవారిలో మహాత్ముడు ఒకడు.

మహాత్ముని మొదటిసారిగా చూచినవారు ఆతడు క్రైస్తవుడే యని భ్రమపడెడివారు. దీనికి కారణము, గాంధీజీ నిజమైన క్రైస్తవునివలె క్రీస్తుమతసంప్రదాయములను అనుసరించుటయే. మానవుడు సంఘబద్ధమగు జీవి అనియు, మానవునకు ఆధ్యాత్మిక చింతనము, మతసాంప్రదాయానుసరణములు అవసరములనియు మహాత్ముడు గుర్తించెను.

మహాత్ముడు జన్మతః క్రైస్తవుడుకాడు; కాని క్రైస్తవమత సూత్రముల నాతడు అనుసరించినట్లు క్రైస్తవుడును అనుసరించియుండడు. ఒకానొక సమయమున క్రైస్తవమతమును స్వీకరింప గాంధీజీ నిశ్చయించుకొనెను. కాని మత స్వీకృతి విషయమున నాతడు నిశితమైన బుద్ధిని ప్రదర్శించెను. క్రైస్తవమత విషయముల నాతడు బాగుగా పరిశీలించి, తుదకు ఈ సూత్రములన్నియు హైందవ మతములోకూడ కానిపించుట గుర్తించి, గాంధీజీ క్రైస్తవమతస్వీకృతి ప్రయత్నమునుండి విరమించుకొనెను. తాను మొదట భారతీయుడు; హిందూమతము అనాదినుండి వచ్చుచున్న ఒక పవిత్రమైన శక్తివంతమైన మతము. అందువలన, హిందూమతమును విడనాడుటకు మహాత్ముడు ఎంతమాత్రమును ఇష్టపడలేదు. భగవంతుని దర్శించుటకే మతములు రూపొందినవి అనియు, మతములోని సూత్రములు ఎట్టివైనను, ఆధ్యాత్మిక చింతనము కల్పించి. మానవుల ఆత్మను ప్రక్షాళనచేయుటకే మతములుద్భవించెననియు, మహాత్ముడు నమ్మియుండెను.

మహాత్మునకు క్రైస్తవమత గ్రంథములతో సన్నిహిత సంబంధముగలదు. క్రీస్తు ప్రబోధించిన మతసూత్రములనే, మహాత్ముడు తన జీవితకాలములో ఇతరులకు ఉదహరించెడివాడు. క్రైస్తవమతవిషయములు గాంధీజీ జీవితలక్ష్యమును పునీతముచేసి, నిష్కళంకమైన ఆత్మవిశ్వాసమును ప్రసాదించి, ఆతనిని కార్యరంగమున నిలబెట్టినవి.

గాంధీజీ హిందువుడైనను మతసహనము ఆవశ్యకతను గుర్తించెను. అతనిదృష్టిలో మతములన్నియు సమానములే. అన్నిమతములలోను అనుసరింపదగిన పవిత్రసూత్రములు ఎన్నియోగలవు; మహాత్ముని నివేశములో క్రీస్తుచిత్రపటము మనకు ప్రధానముగా కనుపించెను. ప్రేమ, దయ, సత్యము, శాంతములకు చిహ్నమైన క్రీస్తు చిత్రము మహాత్మునికి ఆదర్శమైనది; అతనిని ప్రపంచంలో నొక గొప్పవ్యక్తిగ తయారుచేసినది. అహింసాయుతమైన సహాయనిరాకరణ ఉద్యమమును నడిపించుటకై గాంధీజీకి తగిన శక్తి సామర్థ్యములను ప్రసాదించినది క్రైస్తవమతమే.

స్థూలదృష్టికి, మహాత్ముడు కొనసాగించిన మహత్తర రాజకీయ ఉద్యమము, మతసూత్రములపై నాధారపడి యున్నది.

గాంధీజీ ఆత్మవిశ్వాసముగలవ్యక్తి. తాను విశ్వసించిన నైతిక, ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక సూత్రములకు కట్టుబడి, ఆతడు తన జీవితలక్ష్యములను సాధించెను. రాజకీయరంగములో క్రీస్తు సూచించిన సూత్రములను అనుసరించి అసామాన్యమైన విజయమును పొందెను. మతసూత్రానుసరణమువలన మహాత్మునికి సహనశక్తి, శాంతి స్వభావములు అలవడినవి. ఒక ధూర్తుడు తనను కొట్టినప్పటికిని గాంధీజీ న్యాయస్థానమునకు పోలేదు. ఆ చర్యపట్ల గాంధీజీ ఏవగించుకొనలేదు. బౌద్ధమతమునకు ప్రాతిపదికయైన అహింసాసూత్రమే మహాత్మునికి కార్యరంగమున విజయోత్సాహములను కలిగించినవి. ఎట్టి చిన్నజంతువునకైనను అపకారము

హాని చేయరాదని అతని విశ్వాసము. ఒక సమయమున నాలుగు విషోరగములు తన దగ్గరనుండియే, యెట్టిహానిని లేకుండ పోనిచ్చి, తన సౌజన్యమును చూపెను.

క్రైస్తవ మహమ్మదీయ మతములు రెండును మానవ సౌభ్రాతృత్వమును ప్రబోధించుచున్నవి అను విషయమును మహాత్ముడు గుర్తించెను. మన హిందూమతమునగల జాతిభేదమే, నేటి మన దేశములో ప్రజలమధ్య సౌభ్రాతృత్వమును, సౌహార్దమును నశింపచేసెనని గాంధీజీ విశ్వసించియుండెను. నిజమైన మతాభిమానముగల వ్యక్తి అలవర్చుకొనవలసిన మొదటిసూత్రము అందరిని సమానముగ గౌరవించుట. ప్రతిమతమును ఒక నిర్దుష్టమైన సత్యమును ప్రబోధించుచున్నది. దానిని గ్రహించకుండ, గ్రుడ్డిగా మతానుసరణ మొనరించుటవలన ఎట్టిప్రయోజనము కలుగదు. హిందూమతమైనను జాతివిచక్షణ చూపినది, మానవులమధ్య విభేదములు కల్పించలేదు.

గాంధీజీ భగవదారాధన ఆవశ్యకతను గుర్తించెను. భగవద్గీతాపారాయణముతో నాతడు భగవత్ప్రార్థన ప్రారంభించెడివాడు. తరువాత బైబిలునుండియు, కొరానునుండియు కొన్ని విశేషములను గ్రహించెడివాడు. అతడు పరమతముల నెన్నడును ఖండించియుండలేదు.

గాంధీజీ హైందవజీవనవిధాన ప్రాశస్త్యతను పూర్తిగా గుర్తించెను. హిందూసంఘమున స్త్రీ పురుషుల జీవనవిధానము లాదర్శప్రాయమైన లక్ష్యములతో కూడియున్నవి. కాని స్త్రీకి సంఘమున తగినంత గౌరవము లభించుటలేదని అతడు విచారించుచుండెడివాడు.

గాంధీజీ నిజమైన మతానుసారి. భగవదారాధనాతత్పరతయే మానవునికి జీవితలక్ష్యసాధనమున తోడ్పడగల ఒక పవిత్రశక్తియని ఆతడు గుర్తించెను. గాంధీజీ నైతికశక్తి సంపన్నుడు; భగవద్భక్తుడు; నిజమైన మతసూత్రానుసరణాభిలాషి.





# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

మే నెలలో ఎండవేడితో ఆకాశం భగ్గుమన్నట్లే, రాజకీయాకాశంలోకూడా, ఇంతవరకూ నివురు కప్పినట్లున్న అనేక సమస్యలు ఒక్కసారిగా భగ్గుమని నిప్పులు చెరగటం మొదలు పెట్టినవి. కరాచీ నగర వీధుల్లో ముస్లిం తెగలు విచ్చలవిడిగా కొట్టుకొనటం, కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి ప్రయత్నిస్తున్న మధ్యవర్తి గ్రాహం నెలరోజుల్లో దానిని తేల్చివేయాలని పాకిస్థాన్ కోరటం, ఆహార సబ్సిడీలను భారత ప్రభుత్వం రద్దు చేసినందుకు నిరసనగా దేశంలో సత్యాగ్రహాలు బయలుదేరటం, సింహళంలో భారతీయుల సత్యాగ్రహ ప్రారంభం, జర్మనీతో పశ్చిమ రాజ్యాలు ఒప్పందం చేసుకొనటం, కొరియాలో కమ్యూనిస్టులకు చివరి హెచ్చరికనుచేసి యుద్ధానికి సన్నాహపడాలని- అమెరికా అధ్యక్ష పదవికి పోటీచేస్తున్న సెనేటర్ కీఫొవర్ ప్రతిపాదించటం, కొరియా ప్రాంతంలోని అమెరికన్ సేనానుల- రాజకీయ వేత్తల బదిలీ, భాషారాష్ట్రాల స్థాపనకై కమ్యూనిస్టులు త్వరలోనే పెద్ద ఎత్తున ఉద్యమం ప్రారంభించబోతున్నారని- కమ్యూనిస్టు నాయకుడు గోపాలన్ ప్రకటించటం, ఈ అంశాలన్నీ ఎంతసేపటికీ తెగకుండా- ఉన్న వ్యవహారాల పట్ల విసుగుపుట్టి ఏదో ఒక పక్షంవాళ్ళు తెగబడుతున్నారని సూచిస్తున్నవి.

* * *

మే నెల మూడో వారంలో కరాచీ వీధుల్లో పాకిస్థానీ ముస్లింలు వాళ్ళలోనే ఒక తెగవారయిన అహమ్మదీయా ముస్లింల మీద రెండుసార్లు దౌర్జన్యాలు చేశారు. అహమ్మదీయాలు (వీళ్ళని కాదియానీలనికూడా అంటారు.) అసలు ముస్లింలేకాదనీ, వాళ్ళను ఒక మైనారిటీగా జమకట్టి, మైనారిటీలందరినీ చూసినట్టుగా చూడాలనీ కొందరు సనాతన ముస్లిం మతగురువులు అప్పుడే ప్రచారాన్ని ప్రారంభించారు. ప్రస్తుతం సజీవులై ఉన్న పాక్ రాజకీయవేత్తలందరిలోకీ మేధావి అయిన విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్ ఈ అహమ్మదీయా తెగకు చెందినవాడే; కాని ఈ తెగవాళ్ళ సభలో ఆయన మాట్లాడుతుండగా, సనాతన మతోన్మాదులు ఆయన్నుకూడా పరాభవం చేశారు.

మతవర్గవాదాన్ని ముస్లింలీగ్ ఏనాడు ప్రారంభించిందో ముస్లిం మతధర్మ శాస్త్రానుసారం పాకిస్తాన్ రాజ్యాంగం నడుస్తుందని ఏనాడు నిర్ణయమయిందో, ఆనాడే ఈ ఉన్మాదానికి అంకురార్పణ జరిగింది. మొట్టమొదట అగ్రజాతి హిందువులమీద దెబ్బ పడుతున్నప్పుడు జోగేంద్రనాథ మండల్ వంటి హరిజన నాయకులు తమకు ఫరవాలేదనుకుని లీగ్‌నాయకులకు తోడ్పడ్డారు. "నీకూ బెబ్బెబ్బె, నీ అబ్బకూ బెబ్బెబ్బె" అన్నట్టుగా హరిజనుల పరిస్థితి దుర్భరం అయేటప్పటికి మండల్‌గారు మిగిలివున్న హరిజనులను నట్టేట్లో వదిలి ఇండియాకు పారిపోయివచ్చారు. ఇటీవల పంజాబ్‌లో క్రైస్తవుల పరిస్థితీ, ఆంగ్లోఇండియన్ల పరిస్థితీకూడా బాగాలేనట్లు వార్తలు వచ్చినవి. ఇప్పుడు ముస్లింతెగలకే వచ్చింది ముప్పు.

భారత ప్రజలను చీలదియ్యాలన్న రాజకీయ ప్రయోజనం కోసం బ్రిటన్ ప్రోత్సహించిన ఈ మతవర్గ వాదం ఎన్ని కోట్లమంది క్షోభకు కారణ మయిందో మనం చూస్తూనే ఉన్నాము. అయితే బ్రిటన్ ఇంతటితో తృప్తిపడక,

కమ్యూనిజానికి ప్రతిఘటన వచ్చేట్లు చేయాలన్న ఉద్దేశ్యంతో, మధ్యప్రాచ్య దేశాలన్నిటిలోనూ ముస్లిం మతవాదాన్ని రెచ్చగొడుతున్నది. దీని ఫలితాలన్నిటికీ బ్రిటిష్ రాజకీయజ్ఞులే జవాబుదారీ వహించవలసి ఉంటుంది. మన దేశంలోకూడా, అంతరించిపోతున్న మతవర్గవాదాన్నీ, మత దురభిమానాన్నీ కమ్యూనిస్టు నిరోధానికి ఉపయోగించాలనుకునేవాళ్లు కనిపిస్తున్నారు. పిఖ్ఖ కొరివితో తల గోక్కు-నేందుకు ప్రయత్నించటమేకాక, "తా చెడ్డ కోతి వనమెల్ల చెరచె" అన్నట్లు దేశ భవిష్యత్తుకు తీరని హాని కలిగిస్తారు.

* * *

పాకీస్థాన్ చిక్కు-లు కేవలం మతవిషయకంగానేలేవు; ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సాంఘికంగానూ సాంస్కృతికంగానూకూడా పాకీస్థాన్ గగ్గోలు పడిపోతున్నది. జనుము, పత్తిపంటలను చూసుకుని పాకీస్థాన్ ఇంతవరకూ నిబ్బరంగా ఉండేది. కాని ఇప్పుడు ఇండియాలో కూడా జనుముపంట పెరగటంవల్లనూ, అమెరికా మొదలైన దేశాలు జనుముకు బదులు ఇతర వస్తువులను ఉపయోగించుటవల్లనూ జనుము గిరాకీ దెబ్బతిన్నది. ప్రపంచం అంతటిలోనూ నూలుగుడ్డల వ్యాపారం దెబ్బతినటంవల్ల, పాకీస్థాన్‌పత్తికి గిరాకీ తగ్గింది. ఇండియాకు గల ఇతర సంపదలేవీ లేకపోయినా, కనీసం ఆహార ధాన్యాలు ఉండేవి కనుక, పాకీస్థాన్ ఇంతవరకూ నెట్టుకుని రాగలిగింది. ఇప్పుడు దానికికూడా గండం వచ్చింది. పాకీస్థాన్ ఇప్పుడు ఇండియానే గోధుమలకోసం యాచించగా, తాను ఇతరులదగ్గర తెచ్చుకున్న నాలుగు గోధుమ ఓడల్ని ఇండియా అక్కు-డకు పంపింది.

రాజకీయ రంగంలో పాకీస్థాన్ పొరుగుదేశాలతో ఒక్కు-దానితోనయినా గట్టి స్నేహాన్ని సంపాదించలేకపోయింది. ఇండియా, ఆఫ్ఘనిస్థాన్, పర్షియాలలో కాశ్మీర్, పఠానిస్థాన్, బెలూచీస్థాన్‌ల విషయమై స్పర్థలు ఏర్పడ్డవి. ప్రపంచ ముస్లిం సభ పేరుతో కొంత ప్రతిష్ట తెచ్చుకుందామని ప్రయత్నించగా, అదికూడా విఫలమైంది. ఐక్యరాజ్యసమితిలో ట్యునీషియా మొదలైన సమస్యలపై ఆసక్తిని చూపటానికి కారణం అరబ్ రాజ్యాలను కాదనలేకపోవటమేనని, పశ్చిమ రాజ్యాలపట్ల ఇతర అంశాల్లో పాకీస్థాన్ అనుసరిస్తున్న వైఖరి స్పష్టపరుస్తున్నది. పాకీస్థాన్ పూర్తిగా బ్రిటన్, అమెరికాలకు లొంగిపోయినదని నమ్మకం కలగటంవల్లనే, రష్యా, అతి స్పష్టంగా, కాశ్మీర్‌లో యుద్ధస్థావరాల సంపాదనకే అమెరికా, బ్రిటన్‌లు ప్రయత్నిస్తున్నామని కుండ పగలకొట్టినట్లు చెప్పివేసింది.

సాంఘికంగా చూడబోయినా పాకీస్థాన్ వ్యవహారం అంతమాత్రంగానే ఉన్నది. లాహోర్ నగరవీధుల్లో ఒకటి రెండు నెలల క్రింద జరిగిన ఆహార దొమ్మీలు, ప్రభుత్వోద్యోగులు, కార్మికులు జరిపే సమ్మెలు పరిస్థితులేమీ బాగాలేనట్లు సూచిస్తున్నవి. ఈ అశాంతిని అణచటానికి శాంతి రక్షణ చట్టాలు ప్రవేశపెట్టగా, పత్రికా రచయితలుకూడ సమ్మెలు ప్రారంభించారు. 1947 లోనే స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ, ఇంతవరకూ సొంతరాజ్యాంగం తయారుకానందుకూ, కామన్వెల్తులో అధినివేశంగా ఉంటున్నందుకూ, ఏకపక్ష నియంతృత్వ వైఖరికీ, దేశమంతట అసంతృప్తి కనిపిస్తున్నది.

సాంస్కృతికంగా ఉపజాతిగా ఉన్న బెంగాలీలను ఉర్దూ ముస్లిములుగా మార్చటానికి పాక్ ప్రభుత్వం జరుపుతున్న చర్యలను, తూర్పు బెంగాల్‌లోని వివిధ వర్గాలూ తీవ్రంగా ప్రతిఘటించడం చూస్తే, తూర్పు, పశ్చిమ పాకీస్థాన్‌ను నమ్మలేకపోతున్నారు. సాయుధ సంఘర్షణలు జరుగుతున్నవి.

ఈ అంశాలన్నీ—ముఖ్యంగా పఠాన్ ప్రతిఘటన—పాకీస్థాన్ భవిష్యత్తు చాలా ప్రమాదభూయిష్టంగా ఉన్నట్లు సూచిస్తున్నవి.

* * *

కాశ్మీర్ సమస్య నాలుగు సం॥ల నుంచీ సమితిలో నానుతున్నప్పటికీ ఇంతవరకూ పరిష్కా-రం కాలేదు. మధ్యవర్తి గ్రాహం మూడోసారి సంప్రదింపులు జరుపు

తున్నాడు. తడవ తడవకూ పాకిస్థానుకు అనుకూల పరిస్థితి ఏర్పడుతున్నప్పటికీ, కాశ్మీర్ సమస్యతో ప్రజల్ని మభ్యపెట్టి ఉంచటం పాకిస్థాన్ ప్రభుత్వానికి కష్టం అయి పోతున్నది. అందువల్ల ఈ తడవ గ్రాహం ప్రయత్నాలు నెల రోజుల్లో తేలిపోవాలని పాకిస్థాన్ ఒక గడువు పెట్టిం దని విదేశాంగమంత్రి జఫ్రుల్లా వెల్లడించాడు.

ఈ షరతు పెట్టటంలో ఐక్యరాజ్య సమితిని—అంటే అమెరికా, బ్రిటన్‌లను—ఒత్తిడి పెట్టటమే పాకిస్థాన్ సంకల్పంగా కనిపిస్తున్నది. కాశ్మీర్ వ్యవహారం త్వరగా పరిష్కారమయేట్లు చూడమని అమెరికా, బ్రిటన్‌లు గ్రాహంకు సూచించటం ఈ అభిప్రాయాన్ని బలపరుస్తు న్నది.

* * *

దేశంలో ఉపజాతులపట్ల భారత ప్రభుత్వ విధానం పాక్ ప్రభుత్వ విధానంకన్నా మెరుగ్గా ఉన్నట్లేమీ కని పించటం లేదు. స్వాతంత్ర్యం వచ్చేవరకూ ప్రజల అభి వృద్ధికి అత్యవసరంగా కనిపించిన భాషా రాష్ట్రాలు ఇప్పుడు 'జాతీయైక్యత'కు భంగకారులయినవి. ప్రసక్తి వచ్చినప్పుడల్లా, ఏదో అడ్డుపుల్లవేసి తప్పుకుని పోవటం పరిపాటి అయిపోయింది. అయితే అధికారం నిలుపు కునే వీలుఉంటే కాంగ్రెసువాళ్ళు భాషా రాష్ట్రాలను ఏర్పాటు చేయటానికి వెనకాడరు. ఇంతవరకూ సిఖ్ఖులు కోరుతున్న పంజాబీ భాషా రాష్ట్రాన్ని ప్రతిఘటించిన కాంగ్రెసువాదులు, పెప్సూలో అధికారం చేజిక్కించుకునే నిమిత్తం తూర్పు పంజాబ్, పెప్సూలను కలిపివేయాలని ప్రతిపాదిస్తున్నారు!

ప్రజల జన్మ హక్కయిన భాషా రాష్ట్ర స్వపరిపాలనకు భంగం కలుగుతున్నందువల్ల, డార్జిలింగ్ ప్రాంతపు నేపా లీలు ఈశాన్య హిమాలయ ప్రాంతంలో స్వపరిపాలనా ప్రాంతానికి ఆందోళన ప్రారంభించారు. అస్సాంలోని నాగజాతీయులు స్వాతంత్ర్యంకోసం సమితికి ఫిర్యాదు చేయటానికికూడ తయారవుతున్నారు. ఈ సమస్య ప్రాధాన్యతను గుర్తించినందువల్లనే కమ్యూనిస్టులు తాము త్వరలోనే అన్ని వర్గాలనూ కలుపుకుని భాషా రాష్ట్రాలకై ఉద్యమాన్ని ప్రారంభించ నిశ్చయించుకున్నారు. కమ్యూ నిస్టు దురంతాలవల్ల భూమిమీద ఆంధ్ర ప్రాంతమే తుడచి పెట్టుకునిపోయే ప్రమాదం వచ్చినట్లు పార్లమెంటులో ఆరోపించిన ఆంధ్ర కాంగ్రెసు ప్రతినిధి కొత్త రఘు రామయ్యగారు, అదే ప్రసంగంలో భాషా రాష్ట్రాల విష యంలో తాను కమ్యూనిస్టులతో పూర్తిగా ఏకీభవిస్తున్నా నని చెప్పారు అంటే, ఈ విషయమై ప్రజల ఆవేదన ఎట్లా ఉన్నదో తెలుస్తున్నది.

* * *

లాంఛనప్రాయంగా కొత్త బడ్జెట్‌లను ప్రవేశపెట్టటం జరిగింది కాని, వాటిలో వీసమంత మార్పుకూడా లేదు. ఆహార సబ్సిడీల రద్దుకు కాంగ్రెసు మినహా ఇతర పార్టీ లన్నీ కలిసి సత్యాగ్రహాలు జరుపుతున్నవి. సేనాపతి బాపట్‌వంటి ప్రముఖ కాంగ్రెసు నాయకులుకూడా వీటిలో పాల్గొంటున్నారు. ప్రభుత్వం త్వరలో ప్రజల ఇబ్బందుల్ని తీర్చకపోతే, పరిస్థితులు చేయిదాటి పోవచ్చు.

* * *

యూరప్‌లో రష్యాతో పొత్తు కుదరదన్న నిశ్చయానికి పశ్చిమ రాజ్యాలు వచ్చి, పశ్చిమ జర్మనీతో ప్రత్యేక ఒప్పందాలు చేసుకున్నవి. దీనికి ఆటే ఇష్టపడని ఫ్రాన్సును బ్రిటన్, అమెరికాలు మెడలు విరిచి ఒప్పించి నవి. ఈ ఒప్పందం ఫలితంగా యూరప్‌లో పశ్చిమ రాజ్యాల సేనలకు లక్షన్నర మంది జర్మన్ సైనికులు లభి స్తారు. జర్మనీ ఐక్యతకు యుద్ధం తప్పితే మరొక మార్గంలేని పరిస్థితి ఏర్పడ్డది.

* * *

ఈజిప్టు, పర్షియాలు మితవాద నాయకులు యథాప్రకా రంగా, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకూ, తమ ప్రజలకూ పోటీలుపెట్టి నాటకం ఆడుతున్నారు. ప్రజలను చూపించి బ్రిటన్‌నూ, బ్రిటన్‌ను చూపించి ప్రజలనూ బెదరించాలని చూస్తున్నారు. బ్రిటన్‌తో రాజీ బేరాలవంకతో అభ్యుదయ

వర్గాలని అణిచివేసిన ఈజిప్టు ప్రధాని హిలాలీపాషా బ్రిటన్‌తో జరిపిన సంప్రదింపులు భగ్నమైనవి. పర్షియా ప్రధాని మొసాదిక్ తన నాటకంలో రష్యా బెదురునుకూడా ఉపయోగిస్తున్నాడు.

* * *

కొరియాలో యుద్ధ విరమణకు యుద్ధ ఖైదీల పరటా పెద్ద ఆటంకంగా ఉన్నది. అనేక వేలమంది కమ్యూనిస్టులు స్వదేశానికి పోవాలని కోరటంలేదనీ, వారిని బలవంతాన పంపేది లేదనీ అమెరికన్లు అంటున్నారు. చాంగ్‌కై షేక్, సింగ్మన్ రీల సేనలకోసం ఈ ఖైదీలు ఉంచబడుతున్నారని కమ్యూనిస్టులు ఆరోపిస్తున్నారు.

సర్వసేనాని రిడ్జివేని యూరపుకిబదిలీ చేయటం, నౌకా, వైమానిక సేనానుల స్థానంలో కొత్తవారిని నియమించటం, యుద్ధవిరమణ సంప్రదింపుల్లో పరిస్థితుల్ని కనిపెట్టిపోతున్న అమెరికన్ ప్రతినిధి ఎడ్మిరల్ చీయ్‌ని బదిలీచేయటం, కొరియాలో అల్టిమేటం ఇవ్వాలని సెనేటర్ కీఫావర్ సూచించడం—ఇవన్నీ చూస్తే, కొరియాలో అతిప్రధాన మార్పులు త్వరలోనే సంభవంగా తోస్తున్నవి.

—:o:—

## రాయలసీమ ఆంధ్రులకు సర్కారు సోదరుల సహకారం

గత మూడు నెలలుగా రాయలసీమ క్షామ పరిస్థితులు అతి దుఃఖభాజకంగా ఉన్నాయి. అనావృష్టివల్ల పంటలు లేక, పనులులేక, తిండిగుడ్డలకే కాకుండా చివరకు గుక్కెడు మంచినీళ్ళకు కూడ కరువాసిపోయిన అతి ఘోరపరిస్థితిలో బీద, మధ్యతరగతి ప్రజానీకం పడ్డ పాట్లు కటికి రాతిని కరిగింపజేసేటట్లుగా ఉన్నాయి. సానుభూతికీ, ఔదార్యానికీ పేరుపడ్డ సర్కారు ఆంధ్రులు తమతోటి సోదరుల కష్టాన్నిజూచి ఎట్లు ఓర్వగలరు!

ఆంధ్రప్రభ "రాయలసీమ క్షామ నివారణనిధిని" స్థాపించి, సహానుభూతితో ప్రజలు పంపిన ప్రతిదమ్మిడీని స్వీకరించి, రామకృష్ణమిషను దేశసేవకుల పరిముఖంగా క్షామపీడితులకు గంజికేంద్రాల స్థాపన, బావుల మరమ్మతుల మూలంగా సహాయపడడం అందఱం వింటున్నాము. రమారమి 2½ లక్షల నందుకున్న యీ నిధి వసూళ్ళ, 95% ఆంధ్రులనుండి వచ్చినవేననీ, అనేకమంది బీద ప్రజల హృదయపూర్వక సహానుభూతి, సుహృద్భావాలు 0-1-0 నుండి ప్రారంభమైన యీ విరాళాల్లో యిమిడి ఉందనీ ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

ఈ నిధిసేకరణలో, నేషనల్ ఆర్ట్సు థియేటర్సు లిమిటెడ్‌వారు, చేసిన కృషి అమోఘమైనదని చెప్పాలి. ప్రఖ్యాత తెలుగు సినీతారలు శ్రీ యన్. టి. రామారావు, శ్రీమతి జి. వరలక్ష్మి గార్లు తమ మిత్రబృందం సహకారంతో, రమారమి ఒక నెలరోజులు సర్కారులలో పర్యటించి, నాటకముల మూలంగా, యాచనలమూలగా, లక్షకు పైన మొత్తాన్ని సంపాదించడం మిక్కిలి అభినందనీయమైన విషయం. ఆరంభశూరత్వానికి పేరుపడ్డ ఆంధ్రులు స్థాపించిన ఉద్యమం యింత దిగ్విజయంగా ముగియడం ఒక అపురూపమైన విషయం. మంచి వడగాల్పురోజుల్లో అనేక శ్రమలకోర్చి, యీవిధంగా తోటిసోదరులకొరకై కృషిచేసిన నేషనల్ ఆర్ట్సు థియేటర్సువారి ఆదర్శం అమోఘమని, వారి కళ సార్థకమైనదని చెప్పితీరాలి.

ఒకరికి ఒకరికి మధ్య విభేదాలు కలిపించి పరిపాలించే విధానాన్ని బ్రిటిషువారినుండి వారసత్వముగా మన ప్రజాస్వామికులుగూడా పుణికి పుచ్చుకున్నారు. రాయలసీమ, సర్కార్లుగూడా ఆంధ్రజిల్లాలే- రెండింటా వాస్తవ్యులు ఆంధ్రులే- ఎప్పటి కప్పుడు ఎక్కడికక్కడికి, ప్రతి ఒక్క విషయంలోనూ, రాయలసీమను వేరుగానూ, సర్కార్లను మాత్రం ఆంధ్ర జిల్లాలుగానూ పరిగణిస్తూ, వ్యవహారములలో యీ విభజనకు స్థిరత్వాన్ని సమకూర్చే పన్నాగాలు పన్నుతూ, ఆంధ్రులందఱకూ తీరని అన్యాయాన్ని చేస్తూవుంది. అందఱనూ సమదృష్టితో చూడవలసిన మన ప్రభుత్వం- ఏకగర్భవాసులైన రాయలసీమ, సర్కారు జిల్లాల ఆంధ్రులు, చైతన్యము తెచ్చుకొని, తమకు శ్రేయోదాయకము కాకపోవుటయేగాక, ఆత్మహత్యా కారకములనదగు విభేదాలను విస్మరించి, ఐకమత్యం సాధించుకోడం ఉత్తమం. తమసోదరుల కష్టాలను తమవిగానే భావిస్తూ, ఉదార స్వభావంతో సహకరించిన సర్కారు ఆంధ్రులు మనమంతా ఒక్కటే సుమా అని ఒకసారి హెచ్చరిస్తున్నారు. ఐకమత్యానికి దోవ జూపుతున్నారు. రాయలసీమ సోదరులు ఇందలి యాదార్థ్యాన్ని గమనించాలని మనవి.

‘గోదావరి [illegible]’

★

కీ ర్తి శే షు లు

# శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారు

శ్రీమతి నాగరత్నంగారి గానలహరి ఇక వినిపించదు. ఈమె గాత్రమాధుర్యం ఎఱుగనివారఱుదు, దక్షిణాపథంలో. జన్మతః ఈమె మాతృభాష కన్నడమైనా, సంగీత విద్యా సాధనతోబాటూ, ఈమెలోవున్న సంస్కారాధిక్యతననుసరించీ – తెలుగు భాషామతల్లికి దత్తమై, తెలుగు వారి విశేష గౌరవాదరణలకు పాత్రురాలైంది.

ఈమె భోగినీకుల సంజాత. 1878 సం॥లో జన్మించింది. తల్లిపేరు పుట్ట లక్ష్మమ్మ. నాగరత్నమ్మ—తన జీవితకాలంలో 1931 సం॥ నాటికే దాదాపు 1235 గాన సభలు చేయగల్గిందంటే, తత్సాధన విషయమై అష్టకష్టాలు పడి- ఆఖరికి ఆమె జీవితాన్ని అంకితం చేసైనా- తోడ్పడ్డ తల్లి లక్ష్మమ్మను- ఆమె ఋణాన్నీ—మఱువలేదు.

వేల లెక్కలో గానసభలు జరిపి, లక్షలాదిగా ఆర్జించిన ధనాన్ని నాగరత్నంగారు దానధర్మాల నిమిత్తమనీ- ఇతర సత్కార్యాచరణలకనీ- సద్వినియోగమే చేశారు. ఈమెకు దైవభక్తి మెండు. తన ఆది గురువు త్యాగరాజస్వామి అన్నా, కులదేవుడు వెంకటాచలపతి అన్నా విశేష భక్తి శ్రద్ధలు. తిరువయ్యూర్ ప్రాంతంలో-వేలకొలది ప్రజలకు, ఆశ్రయం కల్పిస్తూ- భవ్యంగా వెలుగొందే త్యాగరాజాలయం, ఈమె నిర్మించిందే. ఏటేటా, ఈ ఆలయంలో త్యాగరాజవర్ధంతి, ఉత్సవోపేతంగా జరిపిస్తూండేవారు.

ధనకనకాది భూరి సన్మానాలతోబాటు, నాగరత్నంగారికి "విద్యాసుందరి", "గానకళావిశారద", "త్యాగసేవాసక్త" అన్న గౌరవనీయమైన బిరుదులున్నవి. సంగీతంలోనే కాకుండా, సాహిత్యం, వాక్చతురత, మున్నగు వివిధ రంగాల్లో ఈమెకు సునిశితపరిచయముండడం గమనించతగ్గది. ఈమె 1949 సం॥పు కేసరి స్వర్ణకంకణగృహీత. సంగీతాభివృద్ధికై కేసరి కన్యావిద్యాలయానికి రూ 2000/- విరాళాన్నిచ్చి, దానిమీదవచ్చు సాలు వడ్డీతో సంగీతంలో ప్రావీణ్యతపొందిన బీదవిద్యార్థినికి ఏటేటా సువర్ణపతకమిచ్చే ఏర్పాట్లు చేశారు.

మొన్న మే 19 న ఈమె అసువులు బాసిందని తెలియజేయడానికి విషాదిస్తున్నాం. ఈమె అస్తమయం కళారాధకులమధ్యనీ, మహిళాలోకానికిన్నీ తీరనిలోటు కల్గించింది.

---

# డాక్టర్ మేరీ మాంటిసోరి

అంతర్జాతీయ విఖ్యాతి నందుకున్న వ్యక్తి డాక్టర్ మేరీ మాంటిసోరి. మొన్న మే- 6 వ తేదీన ఈమె హాలెండులోని నార్దవిక్ అనే నగరంలో అసువులు బాసింది.

ఈమె ఇటలీ దేశస్థురాలు. 1870 సం॥లో జన్మించింది. రోం విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ పదవిని గడించిన ప్రప్రథమ మహిళ, మాంటిసోరియే. 1900 సం॥లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మానవ శరీర శాస్త్రాధ్యాపకురాలుగా ప్రవేశించింది. ఆ ఉద్యోగ నిర్వహణారంభంనుండీ, పిల్లల విద్యాభ్యాసం- శిక్షణ విషయంలో ఎక్కువ శ్రద్ధాసక్తులు కనబరుస్తూ వచ్చింది. తనదే అయిన ఒక ప్రత్యేక బోధనా పద్ధతి ప్రచారం చేయడం ప్రారంభించింది. "మాంటిసోరి పద్ధతి" అని దానికి పేరు. ప్రస్తుతం ఈపద్ధతి దేశదేశాల్లోనూ అమల్లో వుంటూ, ఆమె కీర్తిని చిరస్థాయిగాచేసింది. ఈమె శిక్షణా విధానానికి "శిశువే మానవుని తండ్రి" ("Child is the father of the Man") అన్న ఇంగ్లీషు సామెత - మూలాధారం. శిశువు జనించిన దాదిగా- ఐదేళ్ళ ప్రాయం వచ్చే దాకనే అసలు విద్యాభ్యాసకాలమంటే- అని బోధించింది మాంటిసోరి.

కాని మేడం మాంటిసోరి ప్రచారంచేసిన విద్యావిధానం, రంగంలో మంచి విప్లవాన్ని లేవదీసిందనే చెప్పాలి. శిశు శిక్షణ విషయంలో ("Deseases of the Child" మున్నగు) ఎన్నో ప్రసిద్ధ గ్రంథాలు రచించిందామె. పై పుస్తకం అనేక భాషల్లోకి అనువదించబడింది.




# ఆంధ్ర మహిళా సభకు

మీ సహకార సానుభూతులు కావాలి.

విద్యా విజ్ఞాన ప్రచారముద్వారా, స్త్రీ జనాభ్యుదయమునకూ, కుల మత పక్షరహితమైన సంఘ నిర్మాణమునకూ తోడ్పడుచున్న జాతీయసంస్థ. రాజపోషకులుగా, పోషకులుగా, యావజ్జీవ సభ్యురాండ్రుగా, సంవత్సర సభ్యురాండ్రుగా, ఆంధ్ర మహిళ చందాదారులుగా యీ ఉద్యమానికి తోడ్పడండి. నర్సింగ్ హోమ్ నిర్మాణానికి, పారిశ్రామిక విద్యాలయపు బీద విద్యార్థినుల భోజన నిధికి, విరాళములిచ్చి యీ సేవా సంస్థను పోషించండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజ పోషకులు | .... | రూ. 1.000/- | యావజ్జీవ సభ్యత్వం | .... | రూ. 100/- |
| పోషకులు | .... | ,, 500/- | సంవత్సర సభ్యత్వం | .... | ,, 10/- |

ఆంధ్ర మహిళ సం॥ చందా .... రూ. 6/-

మీ బిడ్డలకు, మీ పరిచితులకు, ఇందలి వివిధశాఖలలో కల్పింపబడ్డ అవకాశములను ఉపయోగించుకొండి.

—కార్యదర్శినులు.

*



# పెద్ద వదిన

*  *  *

పెద్ద నాటిక

*  *  *

....శ్రీమతి ఎ. రత్నమ్మ....

ఇందు వచ్చు పాత్రలు :

విశ్వపతి— 80 సంవత్సరాలు, తాసీల్దారు, మంచి పలుకుబడి కలవాడు.

శారదాంబ—అతని భార్య. 55 సంవత్సరములు. చక్కని దబ్బపండువంటిచ్ఛాయ, వృద్ధాప్యం ప్రవేశించినా చెక్కుచెదరని సౌందర్యము.

లీల—ఆయన కూతురు, బి.ఏ., వయస్సు 22 సంవత్సరాలు.

మనోహరరావు—వయస్సు 25, ఎం.బి.బి.ఎస్., 4 వ సంవత్సరపు స్టూడెంట్, ఆధునిక, జాతీయ భావాలుకలవాడు. చెల్లెల్నికూడ తన అడుగు జాడలకి నడిపిస్తాడు. విద్యార్థి ఉద్యమానికి నాయకుడు. విద్యార్థులంతా యితనంటే చాల ఇష్టపడతారు.

సుబ్రహ్మణ్య శాస్త్రి—వయస్సు 35. ఆ వూరిలో ప్రసిద్ధి చెందిన గొప్పలాయరు. చాలమంచి వాడని వూళ్ళో పేరు పొందాడు.

కమల, విమల—అతని చెల్లెళ్ళు. విమల వితంతవు.

అన్నపూర్ణ—అతని భార్య. వయస్సు 30 సంవత్సరాలు.

నరసింహం—ఎం. ఏ., స్టూడెంట్. ఆధునిక భావాలుగల యువకుడు. అన్నగారన్నా, తల్లి అన్నా విపరీతమగు గౌరవ ప్రేమలుకలవాడు. కాని వితంతు అక్కఅయిన విమలంటే ప్రేమతోపాటు ఒక విధమయిన భయం. బయట ఎన్ని ఉపన్యాసాలు దంచినా, యింటివారి వద్ద మాత్రము దద్దమ్మ.

గంగాయమ్మ—సుబ్రహ్మణ్య శాస్త్రి తల్లి. గయ్యాళి గంప అని వూరంతా పేరు మోగింది. మందుల మారి. కోడళ్ళమీద పెత్తనం చలాయించటంలో సాటిలేని ప్రావీణ్యత గలది.

———:o:———

## (ఒకటవ దృశ్యం)

(సాయంత్రము 5 గంటలయింది. విశాలమయిన భవనము ముందు తోటలో, ర్రాత్రి బెంచిమీద కూర్చుని విశ్వపతి యేదో ఆలోచిస్తున్నాడు. ఇంతలో లోపల్నించి శారదాంబ వొచ్చి ఆయన కెదురుగా వున్న బెంచిమీద కూర్చుంటుంది.)

విశ్వ :—ఏమే, వంట అయిందా? తీరుబడిగా వచ్చి కూర్చున్నావు. అమ్మాయి, అబ్బాయి రాలేదా?

శార :—5 గంటలేగా అయింది. వస్తారు 6 గంటలయ్యేసరికి. సరేగానండి, పెద్దమ్మాయిని గురించి యేమయినా కబురు తెలిసిందా?. నా పిచ్చి తల్లి యేం చేస్తోందో? వేళకు తింటూ వుందో లేదో (అని కళ్ళద్దుకుంటుంది).

విశ్వ :—(తానుకూడ కళ్ళనీళ్ళు తుడుచుకొని) ఇదంతా మన పూర్వజన్మ కర్మ ఫలం. కాకపోతే, ఒక పుష్కరం గడచిన తరువాతకూడ, కన్న కూతుర్ని కనులార చూచుకొనే అదృష్టం కలగక పోవట మేమిటి... చెప్పు

మానిచాను. ఈరోజు నేను సుబ్బరామయ్యగారింటికి వెళ్ళాను. ఆయన బెజవాడ వెళ్ళాడట. అల్లుడుకు ఆయనకు మంచి పరిచయము వుండుటచేత వారింటికి వెళ్ళాడట. అమ్మాయికి పెద్దపిల్లాడి తర్వాత ఇద్దరు ఆడపిల్లలట. మళ్ళీ మొన్ననే పురిటి స్నానం చేసిందట. ఆయన వెళ్ళిననాటికి అమ్మాయికి పురిటి మూడోరోజు. అంతవరకు పథ్యమేమి పెట్టక నానాతిట్లు, మాటలు అని మనల్ని దుమ్మెత్తి పోస్తున్నారట. చివరకు మూడోనాటి సాయంత్రము శోష వొచ్చి పడి పోతే సుబ్బారామయ్యగారే డాక్టర్ని పిలుచుకొచ్చి, రొట్టె పెట్టించాడట. ఇదంతా ఆయన నాతో చెప్తుంటే నా తల తిరిగిపోయింది. పిచ్చెక్కినవాడిలా, 'ఆ పిల్లను గురించి యేవిషయము మీరు నాతో చెప్పొద్దండి సుబ్బారామయ్యగారూ' అని యింటికొచ్చాను. ఎందుకొచ్చినమాటలు యివన్నీ. అమ్మాయిని బెజవాడ కృష్ణా నదికి 13 సంవత్సరాలనాడే బలి యిచ్చాం. ఈరోజు విచారిస్తే యేమి లాభముంటుంది ?

శార :—అయితే యిటువంటి విషయాల్లోకూడ అల్లుడేమీ అంటించుకోడా ? బెల్లం కొట్టిన రాయిలా కూర్చొని, అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య కష్టసుఖాల్ని గురించి యేమాత్రం ఆలోచించకపోవడంలో అతని ఉద్దేశ్యమేమిటో. అసమర్థుడయిన అల్లుడు లభించినందుకు మన అదృష్టాన్ని నిందించాలిగాని ఎవరిని అని యేమి లాభం ?

విశ్వ :—భార్య కష్టసుఖాల్ని ఆలోచించేమాత్రపు అల్లుడయితే మనకీ బెంగ యెందుకు ? 13 సంవత్సరాలు గాదు యింకే పన్నెండు, పదమూడు సంవత్సరాలు మనింటికి పంపకపోయినా బెంగలేదు. దానింట్లో అది సుఖంగా ఉండటమే మనకు కావలసినది. (అని వేడి నిట్టూర్పు విడుస్తాడు).

శార :—ఇదంతా నా కన్నకడుపు దోషం. ఇంతమాత్రపు అదృష్టవంతురాలైన బిడ్డ నా కడుపున పుట్టకపోతుందని, అనేక దేవుళ్ళకు మొక్కాను. 'కొరివి'లో 25 రోజులు హనుమంతుని చుట్టు ప్రదక్షిణాలు చేసి 3 రోజులుగ ప్రాణాచారం పడ్డాను. ఈ బిడ్డ నా కడుపున పడగానే నా అంత అదృష్టవంతురాలు యీ ప్రపంచములోనే లేదనుకున్నాను. ఎంతో ముద్దుగా సంగీతం, చదువు చెప్పించి, ఆడపిల్లలకు తీర్చవలసిన ముచ్చట్లన్నీ తీర్చాను. పిల్లను బాగా చదివించిన తర్వాత, దానికిష్టమయినవారికిచ్చి పెళ్ళిచేద్దామని మీరు ఎన్ని విధాల నచ్చచెప్పినా వినలేదు. ఏదో బంధువులు, సంఘుంకలసి నా తల గిల్లి మొలవేస్తారనే భయంతో 16 సంవత్సరాలకు పెళ్ళిచేసి తీరాలని పట్టుపట్టాను. ఇదంతా నా జాతక ప్రభావం. ఆరోజు మీమాటకు బదులు చెప్పాను. కాబట్టి నా ఖర్మ యిలా కాలిపోయింది. (అని వెక్కి వెక్కి యేడ్వ నారంభించింది.)

విశ్వ :—పిచ్చిదానా ! ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు? హరిశ్చంద్రులాంటి రాజాధిరాజులు, శ్రీ రామచంద్రుని వంటి అవతారమూర్తులే విధి బలాన్ని వ్యతిరేకించలేక పోయారు. అటువంటప్పుడు, నువ్వు నేను ఒక లెక్కా ? కుర్రవాడు మంచి తెలివితేటలు గలవాడు, చదువుకున్నవాడనుకున్నాము గాని అమ్మాయి అదృష్టం యిలా పండిపోతుందని కలగన్నామా ? పెద్ద ఆస్తులు లేకపోయినా, పెళ్ళానికి అన్నంపెట్టలేక పోతాడా, ఆస్తులు కట్టుకు పోతామా అనుకున్నాము. మంచి బుద్ధిమంతుడు, చూడడానికి బాగున్నాడని సంతోషపడ్డాము. కాని అమ్మాయిని రంపకోతకు గురిచేస్తామని అనుకోలేదు.

శార :—పిల్లవాడికి యిప్పుడుమటుకు లోటేముంది, ఇంట్లో శత్రుల్ని ఎదిరించలేని అసమర్థతతప్ప! అతనికేమీ మందుపెట్టలేదుకదా ?...తల్లి ఆడబడుచులు కలిసి !

విశ్వ :—(నిట్టూర్పుతో) ఏమిటో, ఎందుకొచ్చిన పిచ్చి మాటలివి. పిచ్చితల్లికి గడ్డ పెరుగన్నా, పూర్ణంలో వండిన వంకాయకూర అన్నా మహాయిష్టం. అందుచేతే ఆ కూర యింట్లో వండవద్దని నీతో చెప్పేది. దానికిష్టమయిన యే పదార్థమయినా నాకు విషంలాగా వుంటుంది. ఏమి బుద్ధి, ఏమి నిదానం, ఏమి సహనం! ఆ నమ్రత, తెలివితేటలు దాని మొహంలో ఉట్టిపడుతూ వుంటాయి. అత్తగారింటికి వెళ్ళేటప్పుడు 'నాన్నా' అని బావురుమంది. ఆ ఏడుపు ఈ రోజువకూడా నన్ను వెయ్యి కత్తుల్లో పొడిచినట్లు బాధిస్తుంది.

శార :—వరప్రసాదంవల్ల పుట్టిన బిడ్డగాబట్టి, దానిలో సద్గుణాలన్నీ మూర్తీభవించాయి. హైకోర్టు జడ్జిగారమ్మాయి శాంత లేదూ, ఎం. ఏ., చదువుతోంది, అది మన అమ్మాయి లీల, 2 సంవత్సరముల వారతో ఒకే యీడువారు. చిన్నప్పుడు జంట విడువకుండా ఆడుకొనేవారు.

విశ్వ :—ఆయన నీకేదో బంధువు కాదూ ?

శార :—ఏదో దూరపు చుట్టరికంలెండి. అన్న వరస అవుతాడు. కాని అతని భార్య నేను ప్రాణ స్నేహితులం.

(ఇంతలో "ఈప్రశాంత, విశాల, ఏకాంత సౌధంలో నిదురించు జహాఁపనా" అంటూ కూనిరాగాన్ని తీస్తూ మనోహర్ ప్రవేశిస్తాడు. తలిదండ్రుల విచార వదనాల్ని, కంటి నీటిని చూచి, చకితుడౌతాడు. బాగ్ క్రిందపెట్టి తల్లిప్రక్క కూర్చుంటాడు.)

మనో:—ఎందుకమ్మా ఏడుస్తున్నావు ? ఏవైనా వుత్తరాలు వచ్చాయా ? నాన్నకూడా అలా విచారంగా వున్నారెందుకు ?

శార :—ఏముంది నాయినా, మా దుఃఖానికి కారణం మీ అక్కయ్యయేగా ? అక్కయ్య మా యిద్దరి జీవితాల్ని కృశింప చేస్తోంది. ఏదో యీ రెండు ప్రాణాలున్నంత కాలం యిలాగే ఏడ్చి, ఏడ్చి, అలమటించి, కన్న కూతుర్ని కనులార ఒక్కసారైనా చూచుకోకుండానే గుక్కెడు ప్రాణాలు వదుల్తాము.

విశ్వ :—ఎందుకే గతాన్ని యిసుకపాతరలాగ త్రవ్వి వాడిని కూడ బాధ పెడతావు. మనిద్దరం అలమటిస్తున్నాం చాలదూ ? వాడినైనా సుఖంగా వుండనీ.

మనో:— మీకులేని సుఖం నాకెక్కడిది నాన్నా. అక్కయ్య నేనూ చిన్నప్పుడు కలిసి ఆడిన ఆటలు, దానిప్రేమ, మా చిలిపి పోట్లాటలు తల్చుకుంటే యీ రోజుకూడా నా హృదయాన్ని దహించివేస్తున్నాయి. (అప్రయత్నంగా రెండు వేడి కన్నీటి బిందువులు రాలుస్తాడు.)

(ఇంతలో 'ముఝే హమ్ అకేలా ఛోడ్ గయా' అంటూ ప్రవేశిస్తుంది లీల.)

శార:—ఎందుకు తల్లీ...యీరోజు ఏడుగంటలదాకా రాలేదు. బస్సు దొరకటము ఆలస్యమయిందా లేక ఎక్కడికయినా వెళ్ళావా ?

లీల :—లేదమ్మా, అన్నయ్యా నేను కలిసి రావచ్చుని వాడి కాలేజికి వెళ్లాను. కాని వాడు నాలుగు గంటలకే కాలేజినుండి యింటికి వెళ్లాడని చెప్పారు. అందుచేత ఆలస్యమయింది.

మనో :—అవునే, లీలా. నేను మా Friends కలిసి యీ రోజు బీచికెళ్ళాము. అందుచే 4 గంటలకే కాలేజీనుండి వెళ్లాను.

విశ్వ :—నాయనా, అమ్మాయి నువ్వు బట్టలు మార్చి స్నానాలు చేయండి. భోజనాలు చేద్దురుగాని. ప్రొద్దున ఎప్పుడు భోంచేశారో?

మనో :— ఇప్పుడు స్నానానికి తొందరేమిటిలెండి. నాన్నా మిమ్మల్ని ఒక్క సంగతి అడుగుతాను. అక్కయ్య విషయంలో యీ విధంగా ఎంతకాలం మూకీభావం వహించి, దాన్ని కుళ్లబెట్టి మీరు కుళ్లుతారు. దాని యావజ్జీవితం అత్త ఆడబడుచుల కోరింటకానికి అర్పితం కావలసిందేనా? ఎంతకాలం దానికీ పాట్లు. ఇంతమంది వుండికూడా ఎంతకాలం చూస్తూ వూరుకోటం. 13 సం॥ రాల్లో ఏమాత్రం మార్పురాని బావ రాతిగుండె యిక ముందుమాత్రం మార్పు పొందుతుందని నమ్మకం ఏమిటి?

విశ్వ :—ఏంచేద్దాం నాయనా, నువ్వేచెప్పు.

లీల :—అన్నయ్యా - నేను, వెళ్లి పంపమని అడుగుతాం. మర్యాదగా పంపుతారా సరే. లేకపోతే బావకు వ్యతిరేకంగా తీసికొని వస్తాము. సాధ్యమయినంతవరకు నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తాం. అక్కయ్యను ఒక్కసారి పంపమని, దాన్ని చూడందే మా అమ్మ బ్రతకదని ప్రాధేయపడతాం. అప్పటికీ ఆయనమనస్సుకు చలనం లేకపోతుందా వ్యతిరేకంగా తీసికొస్తాం. నువ్వు అడ్డు పెట్టబట్టిగాని లేకపోతే అన్నయ్య నేను యీపని ఏనాడో చేసేవారం.

# పెద్ద వదిన

శార :- నాయనా, అల్లుడికి వ్యతిరేకంగా తీసికొస్తే అక్కయ్యను మళ్లీ అత్తవారింటికి పంపే యోగ్యత ఉంటుందా? లోకులు కాకుల్లాంటివారు నాయనా. ఈనాడు అక్కయ్యను, మనల్ని పొగిడినవారే, ఆనాడు కూతురు కాపరాన్ని తీసివేసారని దూషిస్తారు.

విశ్వ :- అమ్మా, మీరు ముక్కుపచ్చలారని పసిగందులు. అనుభవంలేని ఉద్రేకులు. అక్కయ్య బాధ చూడలేక మాట్లాడుచున్నారుగాని గౌరవ సాంప్రదాయంగలవారికి ఆడపిల్లను యింట్లో వుంచుకోటం మంచిదిగాదు తల్లీ.

మనో :- లోకుల అపవాదాల్తో పనేమిటి నాన్నా మనకు. అక్కయ్య సుఖంగాని మనకు కావలసింది. నోటికివచ్చిన మాటలు మాట్లాడే యీ లోకులు అక్కయ్య కష్టసుఖాల్నిగూర్చి ఆలోచిసున్నారా ఏమిటి నాన్నా? మీరుకూడా అలానే మాట్లాడుతారు. అక్కయ్య శ్రీలక్ష్మమ్మలాగ వారికుటుంబానికి బలికావలసిందేనా? దాని గుప్పెడు మెతుకులు మాకేమి భారంగాదు. నేను తినేదాంట్లో దానికి అర్ధభాగం పెడతాను. నేను బిచ్చమెత్తితే బిచ్చంలో అర్ధభాగం దానిది. లక్షాధికారయితే అర్ధభాగం అందులో దానిది.

విశ్వ :- అబ్బాయి, నువ్వు దానికి లోటు చేస్తావనిగాదు. కాని యిది హిందూ స్త్రీ లక్షణంగాదు. భర్తను విడిచి పుట్టింట వుండే స్త్రీని ప్రజలు చాల అమర్యాదగా చూస్తారు. ఎంత విద్యావంతురాలైనా ఆమెకు భర్తగృహమే శరణ్యం.

మనో :- భర్తను వదిలి పుట్టింట వుండటం హిందూ స్త్రీ లక్షణం కాదన్నారు. ఈ విషయంలో నేను మీతో ఏకీభవిస్తాన్నాను. కాని అగ్నిసాక్షిగా పెండ్లాడి, తన కష్టసుఖాల్లో సమాన భాగస్థురాలై, భర్తను దైవంతో సమానంగా చూచు భార్యను, తల్లి చెల్లెళ్లు చెప్పు తంపుల మాటల్లోపడి, ఆమెను కష్టముల పాలుచెయ్యటం ధర్మమేనా, భర్తకు? నాన్నా యే భార్యయితే 15 సం॥ల వయస్సులో, తనను కని, ఎంతో గారాబంగా పెంచిన తలిదండ్రులను, రక్తంలో రక్తమయిన అప్పచెల్లెళ్లను, అన్నదమ్ముల్ని, ఇతర బంధువర్గాన్ని వొదులుకొని, భర్తయొక్క అడుగుజాడల్లో నడుస్తుందో ఆమెనేనా యీ బాధించడం? ఇష్టమొచ్చినట్లు పశువును బాదినట్లు బాదుతుంటే, ఆమె ఎంత బాధపడుతోందో ఏమైనా ఆలోచిస్తున్నాడా? తను ఆమెను చిన్నచూపు చూడటంవల్ల అందరిదృష్టిలో ఆమె చులకనగా చూడబడుతున్నదన్న ఇంగితజ్ఞానములేని భర్తతో కాపరమేమిటి నాన్నా. భర్త తనకర్తవ్యాన్ని నెరవేర్చకోనప్పుడు భార్య మటుకు ఆమె తన విధిని ఎందుకు మర్చిపోదు? కాబట్టి నేను - చెల్లి నాలుగయిదు రోజుల్లో వెళ్ళి అక్కయ్య విషయం ఎలావుందో కొంచం చూసి వస్తాం. ఏమంటారు? వెళ్లమంటారా.

విశ్వ:- నాయనా నువ్విలా మాట్లాడుతే నేనేం చెప్పను. నేను, మీ అమ్మ దానివిషయంలో ఎంత క్రుళ్లిపోతున్నామో భగవంతుడికి తెలియాలి. సరే. నీయిష్టం. నువ్వు తెలియనివాడివిగాదు. కాని తగాదా ఏమాత్రం వొద్దు.

శార:- నాయనా, ఇంట్లో ఆడవాళ్ళు ఎన్నితిట్టినా మీరేమి అనొద్దు. పంపకపోతే కనులార చూసిరండి. అంతేగాని బలవంతంగా తీసికొచ్చి దాని బ్రతుకు బండలు చెయ్యొద్దు. లే. స్నానాలు చెయ్యండి. ప్రొద్దుపోయింది. భోజనాలు చేద్దాం.

## రెండవ దృశ్యం

(సమయం మధ్యాహ్నం 12 గంటలు. గంగాయమ్మగారు, కూతురు విమలకు జడవేస్తోంది. అన్నపూర్ణ మధ్యాహ్నం ఫలహారం తయారుజేస్తోంది. సుబ్రహ్మణ్యశాస్త్రి సావిట్లో క్లయింట్సుతో మాట్లాడుతూ వుంటాడు.)

గంగా:- అయితే అన్నపూర్ణ, గుప్పెడుపిండి బజ్జీముక్కలు చెయ్యటానికి ఎన్నిరోజులు కావాలేమిటే.

అన్న:- (తత్తరపాటుతో) అయిపోవచ్చిందండి అత్తగారు. కాఫీకి నీళ్ళుపెట్టాను. ఫలహారం తీసుకొస్తున్నాను.

గంగా:- నా నెత్తి అయింది. అంబోతులాగ ఎద్దులాగా తినమరిగి, పనిబద్ధకం ఏర్పడ్డది. కాఫీలేకుండానే వాళ్ల ముఖాన ఫలహారం పెడతావన్నమాట. ఎంతదానివే.

అన్న:- లేదండి అత్తయ్యా. వారు ఫలహారం చేసేసరికి అవుతుంది.

విమల:- అదికాదమ్మా కాఫీలు, ఫలహారాలు వీరందరికీ ఎందుకు చేయాలా అనే ధీమా. ఎంతపొగరున్నదను కున్నావేమిటి. ఇంక అన్నయ్య మంచివాడవబట్టి సరిపో యిందిగాని, వాడేగనుక యీవిడ చెప్పినట్లువింటే, ఏనాడో మనల్ని వెళ్లగొట్టేది. ఎంతపొగరు లేకపోతే మొన్న నాకు ముఖం కడుక్కోటానికి నీళ్ళివ్వమని అడు గుతే, చెంబునీళ్ళు ఎత్తిపడేస్తుంది?

అన్న:- నేను పడేయ్యాలని పడెయ్యలేదు వదినా. మీ మీద ఒట్టు. చేతిలో చెంబు జారింది. (అని గ్రుడ్లనీళ్ళు కుక్కుకుంటుంది.)

కమల:- చెయ్యిజారిందట చెయ్యి. ఏదో వంక పెట్టమంటే పెడతావు.

గంగా:- నీ అమ్మకడుపు మాడిపోను. నాకూతురుమీద ఒట్టువేస్తావేమే. నాకూతురు బ్రతికుండటము నీకిష్టము లేదుటే. ఓసి నీ బుద్ధి బొగ్గయిపోను. నా బిడ్డ ఎందుకు చస్తుంది. నీవాళ్ళే చస్తారు. నీతమ్ముడు, చెల్లెళ్లు నాశన మయిపోతారు. నీతమ్ముడిచావు యీరోజున నీ చెవు లతో వింటావు.

అన్న:- (చెవులు మూసుకొని) అబ్బ. దూరాన వున్న వాళ్లేమి చేసారు అత్తయ్యా. నన్నుతిట్టండి నావల్ల లోటుంటే.

కమ:- అదిగాదేమ్మా పెద్దవదిన ఉద్దేశ్యం. తనను తిడ్తే మన కుటుంబమేగా నాశనమయేది. ఈ దరిద్రపు పెద్దమ్మ మన కుటుంబధ్వంసం కావాలని కోరుతోందే అమ్మా.

విమల:- వదినా, మంచినీళ్ళు కావాలి.

గంగా:- నీకడుపుడక. నాబిడ్డకు మంచినీళ్ళు యివ్వవుం డానే ఫలహారం పెట్టావుటే. ఈవిధంగానయినా దాన్ని చంపుదామనుకున్నావాయేమిటే? నా గర్భశో కంచూసి ఆనందిద్దామనుకున్నావా?

కమల:- మొన్న నన్ను చావమని అన్నదే అమ్మా.

గంగా:- నిన్ను చావమంటుంది. నన్నూ చావమంటుంది, ఇంకా కొన్నిరోజులు పోయినతర్వాత మొగుడికి విషము పెట్టి చంపుతుంది. ఒక్కతే పట్టాభిషేకం కట్టుకొని రాజ్యమేలుతుంది అందరూ చచ్చాక.

విమల:- ఆమె కోరేదదేగా మహాతల్లీ.

అన్న:- (ఈమాటలు వేటికీ జవాబు చెప్పదు. నిర్విణ్ణు రాలై, జాలిగా) అయితే చిన్నవదినా! నేను మిమ్మల్ని అంత కఠినమయిన తిట్టు తిట్టానని నిజం చెప్పండి. నాకు మట్టుకు బిడ్డలులేరు.

గంగా:- అయ్యయ్యో; నా బిడ్డల్ని చావమంటోందిరా నాయనా. ఈ గయ్యాళిది నాబిడ్డలకు, నాకు విషం పెడుతుంది బాబోయి. నేనీయింట్లో ఒక్కక్షణమయినా ఉండలేను. ఓరి దేవుడో. ఇంతకూ ఎవరిని అని యేమి లాభం, నా దురదృష్టానికి నేనే అనుకోవాలి. ఏనా డయితే ఆ మహరాజు చచ్చిపోయారో ఆనాడే నా బిడ్డదశ, నా దశ బైటపడింది. అయ్యో, కమలతల్లీ నీపెళ్ళి యెలాగే. నాఘటం దాటేలోపుగా నిన్ను ఒక అయ్య చేతిలో పెడితేనేగాని నాకీ భారం తీరదు. (కళ్ళకు గుడ్డపెట్టుకొని వలవల ఏడ్చును.)

(ఇంతలో నరశింహం ప్రవేశిస్తాడు.)

నర:- ఏమిటమ్మా, ఎప్పుడూ యీ వెధవగోల? అన్నయ్యా మనస్సుకు శాంతిలేకుండా ఏదో రగడ చేస్తూనే యుంటారు. అమ్మా, మనకు కమల, అక్కయ్య ఎట్లాగో వొదిన వాళ్ళ తలిదండ్రులకైనా అలాగేకదూ. అలాం టప్పుడు ఏవో అనరాని మాటలన్నీ వాళ్ళ వాళ్ళను అని సహించమంటే ఎలా సహిస్తుంది వదిన.

గంగా:- (మూతి విరిచి) వచ్చావూ ఆమెను వెనకేసుకొని రావడానికి. నీ మాత్రం సలహా చెప్పేవారు లేరనే మేమంతా ఏడుస్తున్నామురా తండ్రీ.

విమల:- వొదినను పొగడటానికి తయారు చవటముండ. అంతకంటే యింకేం చేస్తాడు వెధవబ్రతుకు.

కమల:- అనవసరంగా ఆడవాళ్ళసంగతి నీకెందుకు అన్నయ్యా.

(విమలమాట వినగానే నరసింహం 'నాకెందుకు అక్కయ్యా మీగొడవ' అని వెళ్ళిపోతాడు. ఇంతలో శాస్త్రి ప్రవే శించి కళ్ళనీళ్ళు కారుస్తున్న భార్యను చూస్తాడు.)

శాస్త్రి:- ఏమిటమ్మా, ఏంజరిగిందేమిటి? మనకు పోట్లాటే గా ఆహారం. అది లేకపోతే ఎలా గడుస్తుంది.

గంగా:- ఆయన మందలించిపోయారు. ఇక నువ్వువచ్చావు. మీరిద్దరెలాగో నావల బుద్దులు కొడతారు. ఇంతకూ ఇదంతా నా ఖర్మ. కని, పెంచి, పెద్దవాళ్ళను జేసినందుకు మీరే నా నెత్తికెక్కి కూర్చున్నారు.

శాస్త్రి:- యేమన్నానమ్మా నిన్ను. అలా మాట్లాడుతావు. నిన్నెవరైనా యేదైనా అంటే సహిస్తానా నేనుమాత్రం.

విమల:- అదికాదన్నయ్యా, మేమంతా చచ్చిపోవాలిట. తనొక్కతే వర్ధిల్లాలిట. పెద్దవదిన మాటలు మేము సహించలేము. ఏదో నీవున్నావు అని యింతవరకు వుండగలిగాముగాని లేకపోతే యేనాడో నూతిపాలయ్యేవాళ్ళం. (వల వల ఏడుస్తుంది.)

కమల:- వాళ్ళ అమ్మనుగాని, వాళ్ళ వాళ్ళ నెవరిని మేము పల్లెత్తుమాట అనకూడదట. అలా అంటే యింట్లోంచి గెంటివేస్తుందట.

గంగా:- 60 సంవత్సరముల ముండనయి, కోడలిచేతుల్లో అనకూడనిమాటలు అనిపించుకోవాల్సివచ్చింది. ఛీ! యీ బ్రతుకు బ్రతికేకంటే యే నుయ్యో గొయ్యో చూసుకుంటే అందరికి మేలే నాయనా.

శాస్త్రి:- (భార్యవైపు తీక్షణంగాచూస్తూ) ఏమిటే యీ సంగతంతాను. మహాతల్లివి ఏరోజున కాలు పెట్టావోగాని పోట్లాటలేని రోజులేదు. ఒట్టి దరిద్రపు గొడ్డుమొండలాగ తయారయ్యావేమే. మాట్లాడవే.

అన్న:- నేనలాంటి మాటలేమీ అనలేదు. నాతమ్ముడు చస్తాడంటే, దూరాన ఉన్నవాడిని తిట్టడమెందుకు, నావల్ల తప్పంటే నన్నే అనమన్నాను.

శాస్త్రి:- మావాళ్ళను అనేమాటలను అడ్డుపెట్టడానికి నువ్వెవతవు. సిగ్గు బిడియం లేకుండా రచ్చకెక్కుతున్నావా. (అని కోపోద్రిక్తుడై దగ్గరనున్న వెదురు కర్రతో బాదుతాడు. అన్నపూర్ణ శరీరం అంతా రక్తం చిందుతుంది. ఆమెను జుట్టుపట్టుకొని యీడుస్తాడు.)

అన్న:- నన్ను చంపండి మీకు పుణ్యముంటుంది. మీకు నా శని వదిలి హాయిగా వుంటుంది. ఇటువంటి కూతుర్ని కన్నందుకు నా తలిదండ్రులు యేడ్చి ప్రాణాలు విడుస్తారు. నేనీ అపవాదులు పడలేను. భర్తచేతుల్లో చావు హిందూ స్త్రీకి ఏమాత్రం అవమానంకాదు.

శాస్త్రి:- ఏమిటే, ఎంతపొగరు. పైగా ఎదురు తిరుగుతున్నావా. (అని మళ్ళీ కొడతాడు. ఈసారి దెబ్బతో ఆమె చేతిగాజులు పగిలిపోతాయి.)

(అన్నపూర్ణలేచి గదిలోకెళ్ళబోతుంది.)

శాస్త్రి:- ఎక్కడికెళ్ళుతావు? పుట్టింటికి ప్రయాణం కడుతున్నావా? కాని మాయింట్లో ఒక్కవస్తువుగాని, గుడ్డముక్కగాని తీసికొని వెళ్ళడానికి వీలులేదు. ఇదుగో చార్జి యిస్తా వెళ్ళు. తిరిగి వొస్తే చంపుతా.

గంగా:- చార్జీలుకూడా ఎందుకురా దండగా.

విమల:- ఈమె పోతే యింకో వదిన వస్తుంది. అన్నయ్యకు పిల్లనే యివ్వరా యేమిటి?

కమల:- వేల కట్నాలతో యిస్తారు. మనకు ఆడబడుచు వేడుకలన్నీ జరుగుతాయి. ఈ దరిద్రపు పెద్దమ్మని చేసుకొనుటవల్ల ఆ వేడుకలే జరగలేదు. పీడ వదుల్తుంది.

అన్న:- వదినా మీ అందరికి నమస్కారం. అలాంటి మాటలనకండి. కొట్టినా, తిట్టినా ఆయన నా భర్త. మర్యాద గల కుటుంబానికి కళంకాన్ని తెచ్చిపెట్టలేను. ఎటువంటివారైనా నాదగ్గరవుంటే, వుండే మర్యాద, నా తండ్రి దగ్గరవుంటే వుండదు. వారిని పిల్లల్ని వదిలి వెళ్ళలేను. నా కుటుంబాన్ని నాశనం చేసుకోలేను. ఫలానావారి పిల్ల యిలాంటిదని అన్నమాట నా కొద్దు. నా దగ్గర తప్పులుంటే క్షమించండి. దండించండి. నేను భరిస్తా. అంతేకాని మీ అన్నయ్యకూ నాకూ వేరయే మాటలు మాట్లాడకండి. నేను గుడ్డలు తీసుకోవడానికిగాదు గదిలోకి వెళ్ళుతూంది. మీ అన్నయ్య కోపంలో దెబ్బ వేశారు. చేతుల గాజులు బద్దలయాయి. ఇది చాల అమంగళంగా తోచి పసుపుదారం కట్టుకుందామని వెళ్ళుతున్నాను.

(ఈమాట విని శాస్త్రి నిర్విణ్ణుడయ్యాడు. విచారంతో ఆగది విడిచి బైటకు వెళ్ళాడు).

గంగా:-ఏమి వగలు నేర్చావే తల్లీ! (నిష్క్రమిస్తుంది.)



(ఇంకా వుంది)

వ్యంగ్యం

# చిదంబర రహస్యం!

* శ్రీ వణుకూరు బుచ్చిబాబు, (IV-B) *

వీధితలుపు నెవరో తట్టినట్టయింది;

—'సంపంగీ! సంపంగీ!'

వంటింట్లో పాకకర్మ చేస్తున్న సంపంగి చెవికి పిలుపు రెండోసారి అందింది. చేతిలోని ఉల్లిపాయల్ని తటాల్న కిందరాల్చి పరుగెత్తుకుంటూవచ్చి, తలుపుతీసి ఎదురుగా నిల్చున్న నీలాలకని చూచి విస్తుపోయింది.

'నువ్వా! నీలాలకా: — ఎవరో అనుకున్నాను. ఎప్పుడు వచ్చావు? రా: లోపలికిరా:' అని అంటూ లోనికి ఆహ్వానించింది.

నీలాలక లోపలికిపోతూ ఇంటినాలుగుమూలలా దృష్టి సారించి, పరిశీలించి 'సొంత ఇల్లేనా— సంపంగీ:' అని అడిగింది.

'ఆఁ నీదయవల్ల ఇదొక్కటే' అన్నది సంపంగి మృదువుగా.

గదిలో టేబిల్‌పై చిందరవందరగా పడివున్న పుస్తకాలు కనపడ్డాయి.

'మీవారేం చదువుకున్నారు?' అంది నీలాలక.

'మెట్రిక్యులేషన్' అంది సంపంగి.

'అయితే గుమాస్తా పుద్యోగం చేస్తూండొచ్చు బహుశా' నీలాలక తనవూహ వెలువరించింది.

'ఛా ఛా. వుద్యోగాలంటేనే అసలు మావారికి తలనొప్పి. కలలోనైనా మరిచి వుద్యోగం చెయ్యకూడదని ఆయన వుద్దేశం. అందుకే ఎవరెంత చెప్పినా ఆయన ఉద్యోగం చెయ్యరు. మనిషికది తీరనిలోటు సుమా అంటూ వుంటారు' అంది సంపంగి.

'మోటారు చక్రంలా తిరగడమేనా పని?'

'కాదు సైకిలు చక్రంలా' నవ్వుతూ బదులు చెప్పింది సంపంగి.

'మరి ఇంటికవసరమైన వస్తువులో?...ఎలావస్తయి?' అడిగింది నీలాలక.

'మనం తెప్పించుకోవలసిందేనమ్మా:' అంది సంపంగి.

'మామగా రార్జిస్తా రనుకుంటా'

'ఆయన పరలోకానికి ప్రయాణంచేసి చాలా నాళ్ళయింది. అత్తగారు మాత్రం అసువుల్తో వున్నారు'

'ఒకరిద్దరు బావమరుదులు కూడానా?'

'ఒకరిద్దరు మరదళ్ళతో కలిపి'

'పెద్ద కుటుంబమన్నమాటే'

'ప్రస్తుతం మా ఆయన మేనమామగారింటికి ఇంటిల్లిపాదీ వలస వెళ్ళారు. రెండు మూడు రోజుల్లో తిరిగి వస్తారు.'

'ఇంతమంది పోషణభారమూ పాపం మాతమ్ముడి నెత్తిమీదే పడ్డట్టుంది. ఎట్లా నిర్వహించుకు వస్తున్నాడో అబ్బాయి!'

'లోకంలో పెక్కురికన్నా అవలీలగా నిర్వహించుకు వస్తున్నారు. ఇప్పటివరకూ ఏలోటూ లేకుండానే హాయిగా నడుస్తోంది సంసార చక్రం. ఇకముందెట్లా వుంటుందో నేను జోస్యురాలినా చెప్పడానికి:'

'చేతిలో ఆస్తివుంటే కమ్మగానే నడుస్తుంది' అన్నది నీలాలక. ఎక్కడెక్కడ ఎంతెంత ఆస్తివుందో మరదలు పిల్ల వక్కాణిస్తుందనుకొంది.

పెదవి విరచి 'అరసెంటు పొలంకూడాలే' దని తెలియపరిచింది సంపంగి.

'ఉద్యోగం లేకపోతే పోయె. ఆస్తన్నా వుండివుంటుందని అపోహపడ్డాను సంపంగీ: ఆఖరికి అనుభవజ్ఞులైన మీ నాన్నగారు ఆకాశపక్షి కొకనికి అంటగట్టి నీ జీవితం ఇట్లా దుఃఖభాజనం చేశారా?—ఇది నాకు ముందే తెలుస్తే, మీ అన్నయ్యతో చెప్పి ఈ సంబంధం పనికిరాదని అనిపించి, అడ్డుపెట్టించి వుండేదాన్ని. తీరా చేతులు కాలాక ఏం చేస్తాం? అనుభవించక తీరదు:' అని దుఃఖించింది నీలాలక.

## చిదంబర రహస్యం!

"ఊరికే నువ్వు దుఃఖిస్తావెందుకొదినా? నా బ్రతుకేం నువ్వనుకున్నట్లు అభాజనం కాలేదు. మంచి సమ్మంధమే చూసి చేశారు నాన్నారు. ఆనందంగానేవుంది నామట్టుకు, ఎవరేం అనుకొంటే నాకేం కొదవ?" అంది సంపంగి.

"ఓసి గడుసరిపిల్లా! శోకించడం లేనేలేదా?" అంది బుగ్గపై వేలుంచుకుని ఒదిన.

"శోకించడందేనికి?" అన్నది సంపంగి.

"నీ లేమికి!"

"ఆ లేమి లేమికే సంతోషిస్తున్నాను" అంది గేస్తురాలు.

"ధనవర్షం కురుస్తోవుందా?"

"మా ఆయన జేబులునిండా" అంది సంపంగి.

"పనిలేనిమంగలి మీ ఆయనకి ధనమెక్కడినుంచి వస్తోందే- సంపంగీ!"

"ఎలాగ? అదే నీలాలకా, చిదంబర రహస్యం!"

"చెబుదూ, బాధపెట్టక"

"ఎవరితోనూ చెప్పకుమీ ఒదినా! మావారు దొరకారు దొంగ!"



# నేస్తము

* తంగిరాల శకుంతలాదేవి *

మిణుకు మిణుకంచు నింగిని మెరసినావు
నిల్చి వెల్గుదువు చీకటి నీడలందు
తెల్లవారిన నీతళ్కు తేజమంత
మాయమైపోవు నంతలో మాయకాదే.

అమ్మ నీకెవరమ్మ నీ కాకసమున?
కలదు నాకొక్క బంగారు కన్నతల్లి
నిన్ను కూడుక ఆడుకొమ్మనియె నన్ను
వేగ ఆటకు రావేమె వెండిపూవా.

చందమామకు నీకును స్నేహమేమో
చిన్నతారవు వెల్గిన చందమామ
కునును నాకును స్నేహంబు కుదురదేమో
కూడనాతోడ ఆటల కూర్మి యాడూ.

నావి అకసమందున నాదువెల్గు
లింత గొల్పును మనసున వినుమొ తార
నాదు నేస్తముగై కుని నన్ను కూడి
ఆటలాడగ రావమ్మ ఆలకించి.



*పెద్ద కథ :

# ప్రతిజ్ఞాభంగము

* శ్రీమతి తాడికొండ రాధావసంత *

[వెనుకటిగాధ :

వనకుమారి ఆంధ్రామెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గి, ఇంక తనకు పాశ్చాత్య విద్య అవసరంలేదని ధాన్యకటక మహాశిల్ప విద్యాశ్రమానికివచ్చి విద్యార్థినిగా చేరింది. బాలమూర్తిరావు ధాన్యకటక శిల్పాశ్రమానికి భారతీయ సంప్రదాయ శిల్పం నేర్చుకొనడానికి వచ్చాడు. అతడు ఆ ఆశ్రమంలో ప్రవేశించిన మరుక్షణమే వనకుమారి సందర్శించింది, అతన్ని.

ఒక నిరంజనరావును ఆదిలో తిలకించినప్పుడు అతనే-శకుంతలలావున్న తన జీవిత కుసుమానికి—దుష్యంత మహారాజు—అని భావించుకున్నది, వనకుమారి. కాని, అతను నిర్దాక్షిణ్యంగా అశనిపాతంలాంటి వార్తను మోసుకురావడంతో, వనకుమారి బ్రతుకు నిట్టూర్పుతో సుడి చుట్టుకుపోయింది.

నేడు కృష్ణానదీ తరంగాల్లో వెనుకటి గాధంతా—తీరనిబాధగా—ప్రతిఫలిస్తోంది. నదీతీరాన ఆమె ఏకాంతాన్ని భగ్నపరుస్తో బాలమూర్తిరావు వచ్చి కూచున్నాడు. అనేక విషయాలమీద తీవ్రంగా చర్చలు సాగాయి.... బాలమూర్తిరావులోని కళావైశిష్ట్యానికి దాసోహమ్మైన వనకుమారి—ఒక్కసారిగా తాచుపాములా తయారయ్యింది. ఈ ఉగ్రరూపధారణకు నిరంజనరావు ఆవిల్లో రంగరింపజేసిన నిట్టూర్పే కారణం కాకపోతే మరేముంది ?

వనకుమారి మాయారణ్యకుమారి అయి—పురుషజాతిపై భయంకరంగా లోకానికంతకూ పాఠమయ్యేటట్లు కసితీర్చుకునేలా ప్రతిజ్ఞ ధరిస్తుంది. ఇహ చదవండి.]

కులపతి సుధాకరపండితులు విషాదమునిండిన హృదయంతో ఈ జీవితనాటిక అవలోకిస్తున్నాడు. తానూ తన ప్రియపత్ని కాంతిమయీ ఈ విషయం ఎన్నిసారులో చర్చించుకొన్నారు. ఈ నాటకం విషాదాంతంకాక తప్పదనుకొన్నారు. ఏలాగు ఆ రాబోవు భయంకర సంఘటన తప్పించేది ? తాము పరోక్షంగా వనకుమారితో ఎన్నో రీతులుగా బోధించారు.

"అమ్మాయీ ! సమదర్శనలే జీవితానికి మూలాధారము. సమదర్శనమే కళాయోగానికి సరియైన హృదయస్థితి. కష్టాలు వస్తాయి, విషాద సంఘటనలు ఉద్భవిస్తాయి, కాని మానవుడు పశుస్థితికిపోయి ప్రతీకారదీక్ష పూనితే, దివ్యలోక సంచారితమైన శిల్పతపస్సు ఏలా పూనగలడు ?"

ఈలా మాటలమధ్యాన, ఏదేనివ్యాజాన, ఎన్నిసారులో అందరికీ బోధించినట్లు వనకుమారికే సరిఅయిన అర్థము గోచరించునట్లు జీవిత వ్యాఖ్యానము చేసినారు.

కాంతిమయీదేవి వనకుమారి గదిలోనికి ఏదేని పని ఉన్నట్లు పోయిగాని, ఏదేని పని ఉన్నట్లు ఆమెను తన ఇంటికి రప్పించుకొనిగాని ఆ బాలికతో వాహ్యాళికి వెళ్లిగాని, ఆశ్రమంలో జరుగు సభలలో ఆ దగ్గర కూర్చుండిగాని ఆమె బ్రతుకు సమస్యలెన్నో చర్చించేది. వాచ్యంగా

చెప్పకపోయినా, మూర్తిరావుతో ఆమె సంచరించేవిధానం ఏమీ బాగాలేదని అర్థం వచ్చేటట్లు బోధించింది. మనస్సుకు కలిగే ఆవేదనలకు కృంగిపోక జీవితయానంలో కలిగే ఆనందాలకు ఉప్పొంగిపోక అన్నీ నిశ్చలంగా నిదానంగా అంది పుచ్చుకోడమే ఉత్తమ స్త్రీ లక్షణమని చెపుతూఉండేది.

ఈ ఉత్తమ దంపతుల ఉద్దేశము వనకుమారి పూర్తిగా గ్రహించింది. వారి పవిత్ర హృదయాలను కలత పెట్టున్నందుకు ఆమె లోలోన బాధపడిపోయింది. అయినా తాను తనకు నియమించుకొన్న అసిధారావ్రతము ఈషణ్మాత్రము తప్ప దలచుకోలేదు. తుంటరులు, దుష్టులు, దొంగలు, దోపిడిగాండ్రయిన పురుషులందరికీ పాఠం నేర్పవలసిన విధి స్త్రీ జాతిది. పవిత్రమైన చరిత్రకల భారతీయాంగనలు విదేశీయ వ్యామోహంలోపడి, భారతీయాశయాలు మరచి, పొంచి వేటాడుటకు, కబళించుటకు సిద్ధంగా ఉన్న లేళ్లను కొని వారిని నికృష్టమైన నరక కూపాలలోనికి త్రోసివేసే ఈనాటి భారతీయ పురుషులకు జన్మ జన్మాలకు మరచిపోనట్లు పాఠం నేర్పవలసి ఉన్నది. అది భగవంతుని ఉద్దేశం. స్వరాజ్యం వచ్చిన ఈ ప్రథమ దినాల్లో అవతార పురుషుడైన గాంధీ మహాత్ముని అనుగుబిడ్డలమనీ, అఖండానుచరులమనీ రొమ్మువిరిచి బాకాలూది చెప్పుకుంటూ భారతీయ సంఘాన్నీ, భారతీయాంగన జీవితాన్ని పంకిలం చేసి నాశనం చేసే, ఈ ముష్కరప్రజాతికి ప్రతి స్త్రీ పాఠం నేర్పడం పరమ ధర్మం.

సహజమైన ప్రేమ ఉద్భవించిన స్త్రీ లజ్జాంకిత చరిత్ర అవుతుంది. ఆమె ప్రణయం గాఢమైనకొలదీ ఆమె మరీ రహస్యావకుంఠిత హృదయ అయిపోతుంది. కాని మాయా పాత్ర పోషణ కర్మఠ అయిన స్త్రీ మెరుమువలె మెరుస్తుంది. అరుణరాగరంజిత నవోదయ మౌతుంది. మేఘ రహిత నిర్మల నీలాకాశ మధ్యస్థ చంద్రమాబింబంవలె ప్రసన్నత తొలుస్తుంది.

బాలమూర్తిరావు ఆమె పన్నిన వలలు పూలునింపిన సునుతీవెల అల్లిక లనుకొన్నాడు. ఆమె వదనాన ప్రసరించు మాయా మోహనమైన చిరునవ్వులు ఆమని పున్నమనంద బోవు పంచమినాటి వెన్నెల అనుకొని వానిలో త్రోగిపోయి నాడు. ఆమె మాటలలో కావ్యాలు చదువుకొన్నాడు. ఆమె దైనందినమైన చరిత్రలో దివ్య చిత్రలోకం కలయ చూచుకొన్నాడు.

ఆమె సిగ్గు నభినయించేది, అమాయికత్వం వెల్లువలు ప్రవహింపించేది, హేలాలీల అయ్యేది. "ఆలస్యము చేసినారేమి?" అని బిబ్బోకము ప్రదర్శించేది. మూర్తి రావు శక్తిసామర్థ్యాలు దర్శిస్తూ విభ్రమ మానసయైనట్లు వ్యంజనం చేసేది. నర్మవాక్యాలు కాకలీ కంఠాన కూజితములు స్వనించేది. ఆమె ఆనాడు యక్షిణీబాల. గంధర్వ మాయార్ద్రిత హావభావ శృంగార క్రీడాయుక్త.

౭

మూర్తిరావు పాపము పండినది. శుభ ముహూర్త మనుకొన్న ఒకరోజు ఉదయాన మన్మథునిలా కై సేసుకుని, అనుకూల నాయకునివలె వనకుమారి పర్ణశాలకు వచ్చినాడు.

వనకుమారి ఆతన్ని లోనికాహ్వానించి చిత్రాసనముపై కూర్చుండ కోరి తన భోజనపు గదిలోనికిబోయి ఇడ్లెన్ను కాఫీ పట్టుకువచ్చి ఎదుట బెట్టినది. ఆతడు ఫలహారం ఆరగించి చేయి కడుక్కొనివచ్చి సిగరెట్టు ముట్టించ ఆమె ఇచ్చిన సువాసన వక్కపొడిని సేవిస్తూ ఆ బాలికనుచూచి "వనకుమారీ! కొంచెం ఇలావచ్చి కూర్చోండి!" అని కోరినాడు.

"ఏవో కొన్ని భావాలు వచ్చాయి. వాటికి రేఖారూపం కల్పించాలనుకుంటున్నాను. ఆమె తన పడకగదిలో రంగుల పెట్టెను తెరుస్తూ, మూస్తూ ఏదో వెదుకుతున్నట్లు నటిస్తూ జవాబు చెప్పింది.

"నా మనవి ఒక్కటి ఉంది అది విని మీమనని మీరు చూసుకోవచ్చును!" ఆతడు గుండె గుబగుబమంటూ ఉండగా, మోము వేడి ఎక్కుతూ, చల్లబడిపోతూ ఉండగా ప్రార్థించాడు.

"వస్తున్నాను రావుగారూ!" ఆమె ఏవేవో పనులలో మునిగిపోయింది.

"ఇదిగో అయిపోయింది!" ఆమె సర్దటం ఎక్కువైయింది.

# ప్రతిజ్ఞాభంగము

"అమ్మయ్యా! అయిందమ్మా! ఎంత త్వరగా పనులు కావాలని కోరుతామో, అంత తొందరగా తెమలవే పనులు!"

ఆమె లోపల పది నిముషాలు ఏపని చేసుకుంటున్నదో ఆతడు గ్రహింపలేక పోయినాడు.

ఇంతట్లో ఆమె అతి యాదాలాపంగా వచ్చి కూర్చున్నట్లు వచ్చి ఆతనికి చాలా దగ్గరగా ఇంకో చిత్రాసనంమీద కూర్చున్నది.

"చూసారా! నేను వేస్తూ ఉన్న 'ఈ ఉషానిరుద్ధ ప్రణయ మూర్ఛన' అన్న చిత్రం?"

"ఏదీ! చాలా బాగా వస్తూన్నది. రేఖలు ఎంత లలితంగా ఉన్నాయి. మొదటు వర్ణవిలేపనమే కాబోలు. అయినా వర్ని కాభంగము చాలా ఉత్తమంగా వస్తూంది."

"మా శిల్పపర్యాయ పదాలన్నీ మీకు వచ్చాయే?"

"కాని ఉషాదేవి పరిపూర్ణ ప్రణయం ఎంత బాగా విన్యశిస్తున్నారండీ!"

"కాని మీరు నన్ను 'మీరూ—గీరూ' అనడం చాలా కష్టంగా ఉంది మూర్తిరావుగారూ!"

"వనకుమారీ! నిన్ను 'నీవు' అని పిలచే వాక్కుకోసం తపస్సు చేస్తున్నాను. ప్రథమ దర్శనంలోనే నువ్వు కణ్వాశ్రమంలో శకుంతలలా నాకు ప్రత్యక్షమయ్యావు. నా జీవితం అంతా ఆ క్షణంలో నీ పాదాలకడ సమాలింగిత భూతలమైంది. నీకోసం ఎన్నో యుగాలనుండి నడిచి వస్తున్నాను కాబోలు. వనకుమారీ! నాకు మంచి ఆస్తి ఉంది. నేను ఏదో రకమైన చిత్రకారుణ్ణి. కాని నువ్వు పరమప్రజ్ఞాపూర్ణ అయిన చిత్రకారిణివి అయ్యేటట్లు చూస్తాను. నిన్ను అజంతా, బాగ్, సీతన్నవాసార్, సింహాళము, కాశ్మీరు, జావా, తాయిలాండు, అంగకర్ వాట్ మొదలయిన దేశాలన్నీ తీసుకువెడ్తాను. నీ కళాపూర్ణకౌముదిలో నేను గృంకులిడతాను. వనా! నన్ను వివాహం చేసుకో! నీకు దాసాను దాసుణ్ణి చేసుకో!"

ఆతని ప్రాణాలన్నీ కళ్లల్లో ప్రతిఫలించాయి. ఆతని ఫాలంలో చిరు చెమటలు పట్టినది. ఆతడు గడగడ వణకి పోతూ ఆమె మోమును పారకిస్తూ అలాకూర్చుండి పోయినాడు.

వనకుమారి కఠిన హృదయంలో జయించాను అన్న ఒక వికటానందం కలిగింది. పైకి ఇంకా సిగ్గుపడుతున్నట్లు నటించింది. మోము వాల్చింది. మూడు నిట్టూర్పులు విడిచింది. పది నిమేషాలు మౌనం దాల్చి కూర్చుంది. చటుక్కునలేచి తన పడకగదిలోనికి వెళ్లింది. అయిదు నిముషాలకు వనకుమారి సేవకురాలు ఒక చిన్న చీటీ పట్టుకువచ్చి మూర్తిరావుగారికి ఇచ్చింది.

"మూర్తిరావుగారూ!

మీ హృదయం నాకు పూర్తిగా అర్థమైంది. నేను ధన్యురాలను. అయినా రెండు రోజులు నన్ను పూర్తిగా ఆలోచించుకోనివ్వండి. వివాహం ఒక పరమ పవిత్ర సంస్థ. ఆ విషయంలో నాకు నా పూర్ణస్వరూపం గోచరించాలి కదా! ఈలోగా ఎవ్వరికీ మీరు ఏసంగతీ తెలియనీయకండి. ఎల్లుండి ఉదయానికి మీరు నా పర్ణశాలకు రండి. ఇప్పటికి సెలవు.

మీ స్నేహితురాలు
"వన"

అతడా ఉత్తరం చదువుకొని, మరల చదువుకొని, ఆ ఉత్తరాన్ని కళ్లకద్దుకొని, ఇటు నటు చూచి పెదవులకు చేర్చి గాఢంగా చుంబించినాడు. నెమ్మదిగా లేచి ఆమె పర్ణశాల వెడలి వెళ్లినాడు. అతని మోము వేయి వెన్నెలలు కాస్తున్నవి.

౯

వనకుమారి కోరిన రెండు దినాలూ మూర్తిరావు ఈ లోకంలో లేడు. ఏ గంధర్వ లోకంలోనో, ఏ నందన వనంలోనో మైమరచి విహరించినాడు. వేయి సువాసనగాలి వానలు ఆతన్ని ముంచెత్తినవి. కోటి ఆనందమందాకినీ నదులు ఆతని తలను శివజటామకుటంచేసి విరిగపడినాయి.

ఈలోగా వారిద్దరూ చిత్రలేఖనా మందిరంలో ప్రార్థనా మందిరంలో కలుసుకొంటూనే ఉన్నారు. తీయగా మాట్లాడుకొన్నారు. ఏవేవో విషయాలు చర్చించుకుంటూనే ఉన్నారు.

# ప్రతిజ్ఞాభంగము

ఆ మరునాడు సాయంకాలం ఇరువురికీ తెలియనట్లు కొందరు స్నేహితులతో స్నేహితురాండ్రతో కృష్ణ ఒడ్డున కలుసుకొన్నారు. ఆటలాడుకొన్నారు. కృష్ణలో దిగి స్నానాలు చేసినారు. ఈతలాడుకొన్నారు.

ఆమె మూడుసారులు ఏమీ ఎరగనట్లు ఆతని చేయి పట్టుకొని అతని దరిచేరి మళ్లీ దూరంగా పోయింది.

ఒక రోజు గడిచింది. రెండవరోజు గడిచింది.

మూడవరోజు తెల్లవారగట్లే స్నానంచేసి మెలమెల లాడు పొందూరు ఖద్దరు పంచెగట్టి, కాశ్మీరపు పట్టులాల్చీ ధరించి, అంబరు అత్తరు వ్రాసికొని, మదరాసునుండి ఇది వరకే తెప్పించి ఉంచిన, పద్మరాగాలు కూర్చిన నెక్లెసు పెట్టెనూ, నవరత్నఖచితమైన ఉంగరాన్నీ కలిగిన రెండు పెట్టెలూ జేబులో వేసుకొని జరీపూవులు సంతరించిన ఢిల్లీ ఛడావులు ధరించి మూర్తిరావు వనకుమారి పర్ణశాలకు వెళ్ళినాడు.

ఆతడు పర్ణశాల గుమ్మం తట్టగానే సేవకురాలు తలుపు తెరిచింది. ఆతన్ని "అట్టా కూర్చోండి దొరా!" అన్నది. ఒక ఉత్తరం తెచ్చి అతనికి ఇచ్చింది. ఆశ్రమ భోజనశాల నుండి వచ్చు ఇడ్డెన్లు కాఫీ తీసుకువచ్చి అతని ఎదుట పెట్టింది.

మూర్తిరావు ఉపహారాల వయిపు చూడలేదు. వణికి పోతూ ఉత్తరం ఏలాగో విప్పి చదవడం ప్రారంభించాడు.

"శ్రీ మూర్తిరావుగారికి !

అయ్యా! నేను ఎంతో ప్రయత్నించాను. మిమ్మల్ని ప్రేమించలేక పోయాను. మీ చరిత్రకూడా నాకు నచ్చ లేదు. మీదంతా వట్టి నటనలు అనుకుంటున్నాను. ఇంతటి నుంచైనా 'ప్రేమ' 'ప్రణయం' అనే మాటలు కట్టిపెట్టి, మీ కళ సంగతేమిటో, మీ జీవితం సంగతేమిటో చూచు కోవడం మంచిది. ఏ కులపతులవంటివారో తప్ప మీ పురుషులంతా వట్టి బూటకపు బ్రతుకులవాళ్లు. అందులో ఈ రోజుల్లో మీరాడిన నాటకంవంటి నాటకాలు మీరు తిరిగిన దేశాలలో ఎన్ని ఆడారో! నేనూ మీరు ఎప్పుడూ స్నేహంగా ఉండటానికి వీలులేదు. ఇంక మనం కొత్త వాళ్ళమే!

సెలవు,

"వనకుమారి"

ఆ అక్షరాలు ఆడిపోయినాయి. మంచు గడ్డలై కరిగి నాయి. కాలజీమూతలై వదిలిపోయినాయి. దావాగ్ని శిఖలై పొగ వెగసినాయి.

అలా కూర్చుండి కూర్చుండి కూలబడినాడు మూర్తిరావు. అతని కళ్లవెంట నీళ్లు వానాకాలం వరదలైన కృష్ణా నదు లైనాయి.

అలా అతడెంతసేపు ఉన్నాడో!

ఆ పని మనిషి రెండు మూడుసార్లు ఆతన్ని భోజనాల గది గుమ్మంలోనుండి తొంగిచూచి వెనక్కు వెళ్లింది. అతడావిధంగా అరగంటకాలం అలాపడి ఉండిపోయి తూలుతుంటూ నడిచి, ఏలాగో తన పర్ణశాల చేరుకున్నాడు. లోనకు తన క్యాంపు మంచంమీద పడిపోయినాడు.

ఆతడు భోజనానికి పోలేదు.

మధ్యాహ్నం పన్నెండింటికి సుధాకర పండితులు మూర్తిరావు పర్ణశాలకు వచ్చినారు.

మూర్తిరావు మంచంచుట్టూ కొందరు యువకులు పరిచర్య చేస్తున్నారు.

"ఏమిటి మూర్తిరావు మేస్టారికి" సుధాకరులు ప్రశ్నించారు.

"బాగా జ్వరంవచ్చింది. దిట్టమైన చలిజ్వరం. ఎన్నో పరుపులు కూడా కప్పినానండి. ఆగటంలేదు. పిలిచినా పలుకటంలేదు. ఊ మని మూల్గుతారు." అని ఒక యువకుడు జవాబు చెప్పినాడు.

"డాక్టరుగారు వచ్చారా."

"వచ్చిచూచి ఉడుకు లాంగుడ్డలు వేస్తూ ఉండ మన్నారు. రెండు ఇంజెక్షన్లు ఇచ్చారండి. లోపలకు మందు పోయడానికి ఎంతో ప్రయత్నించి ఒకడోసు మింగించారండి."

"ఎంత సేపయింది డాక్టరుగారు వెళ్లి ?"

"ఇప్పుడిప్పుడే నండి."

సుధాకర పండితులు వెంటనే ఆశ్రమ వైద్యాలయానికి వెళ్ళినారు.

సుధాకర పండితులు:—"డాక్టరుగారూ! ఏమిటండి మూర్తిరావుగారి జబ్బు?"

డాక్టరు :—" అంత తీవ్రమైన జ్వరం ఎందుకువచ్చిందా అని రక్తం పరీక్షచేశాను. మలేరియా కాదు. కొంతరక్తం అర్జంటుగా పరీక్షచేసి పంపించండని కోరుతూ, డబ్బిచ్చి ఒక అబ్బాయిని గుంటూరు గవర్నమెంటు వైద్యకళాశాలకు పంపాను. గుంటూరు వైద్య కళాశాలలో నా స్నేహితుడే రక్తపరిశోధకుడు లెండి."

కులపతులకు ఏవేవో అనుమానాలు కలిగినాయి. వనకుమారి నిరాకరించి ఉంటుందనీ, దానితో పాపం ఈ వెఱ్ఱిబాగులవాడు కూలి పోయాడనీ, ఆయన ఊహించాడు.

" డాక్టరుగారూ! మీరు మూర్తిరావుగారి విషయంలో ఎంత శ్రద్ధవహిస్తారో! ఉత్తమ యువకుడు. నాకు కుడి చేయిగా ఉండవలసినవాడు."

సుధాకర పండితులు మూర్తిరావుకు పరిచర్య చేయడానికి ఇంటికి పోయినాడు. అక్కడామెలేదు. వనకుమారి పర్ణశాలకు వెళ్లినదని తెలిసి అక్కడకాయన పరుగున వెళ్లినాడు. ఆ పర్ణశాలంతా గడబిడగా ఉన్నది. ఆశ్రమ వాసులయిన అనేకులు బాలికలు గుంపులు గుంపులుగాచేరి ఆ పర్ణశాల నిండి ఉన్నారు. అంతమందిఉన్నా గుసగుసల తోనే మాట్లాడు కుంటున్నారు.

కాంతిమయి వనకుమారి మంచంమీద కూర్చుని ఉంది. వనకుమారికి తెరలు తెరలుగా మూర్ఛలు వస్తున్నాయి. అప్పుడే డాక్టరుగారి కోసం ముగ్గురు బాలికలు పరుగెత్తారు. సుధాకర పండితులు వనకుమారి పడకటింటిలోనికిపోయి భార్యవంక ప్రశ్నార్థములైన వ్యంజనపు చూపులు పరపినారు.

కాంతి:—ఒక అరగంటక్రింద సీత నాకడకు పరుగెత్తు కొనివచ్చి, వనకుమారి మూర్ఛపోయింది అని చెప్పింది. వెంటనే పరుగిడివచ్చి, వన, " అమ్మా! నాదే అంత తప్పు. నా హృదయం తెలుసుకోలేక రాక్షసిలా ప్రవర్తించాను. ఈ పవిత్రాశ్రమంలో నే చేసిన పాపానికి నిష్కృతి లేదమ్మా!" అని నా ఒళ్లో తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. నేను "ఏమిటమ్మా! అదిఅంతా!" అని అడిగాను. " నేనే మూర్తిరావుగారికి గుండెల్లో బాకుపెట్టి పొడిచాను." అని అంటూ మళ్లీ మూర్ఛపోయింది.

ఇంతట్లో డాక్టరుగారు మందుల సంచీతో చక్కా వచ్చారు. వస్తూనే " మూర్తిరావుగారికి చమటలుపట్టి జ్వరం నూరుకు దిగింది గురువుగారూ!" అని కులపతి గారితో చెబుతూ వనకుమారిని పరీక్షచేయ నారంభించారు. " ఇదో నెర్వస్‌షాక్! " అంటూ బి కాంప్లెక్స్, గ్లూకోజు కలిపిన ఇంజెక్షన్ వనకుమారికి ఇచ్చారు. ఇంజెక్షన్ ఇస్తూంటే చురుక్కుమని వనకుమారికి మెలకువ వచ్చింది. వెంటనే సక్కావామికా ఆమోనియమ్ ఆరొమేటికా లోనకు ఇచ్చారు. మూలుగుతూ వనకుమారిలేచి కూర్చో బోయింది. "వద్దమ్మా," అంటూ డాక్టరుగారు " అమ్మాయి భోజనం చేయలేదు. కాస్త మజ్జిగలో అన్నం పిసికి ఆ రసం పట్టించండి, అమ్మగారూ!" అని కాంతిమ యికి చెప్పారు......

౧౦

ఎవరో ఒక బాలిక గబగబ మజ్జిగరసం పట్టుకువచ్చింది. డాక్టరుగారే దగ్గరవుండి ఆ రసం తాగించారు.

కాంతిమయినీ ఇద్దరు బాలికలనూ మాత్రం ఉండమని తక్కిన వారినందరినీ కులపతులు వారివారి గదులకు వెళ్ళి పొమ్మన్నారు. వనకుమారి దృఢం పొందిందన్న మాటేగాని కన్నుల అశ్రుధారలు మానలేదు.

తలక్రిందనుండి ఓ ఉత్తరంతీసి, ఆమె కాంతిమయి చేతులో పెట్టింది. కాంతిమయి సుధాకరుని వివాహమై నప్పటి నుండి తెలుగు బాగా నేర్చుకుంది. ఆ ఉత్తరం,

" ఆత్మేశ్వరీ వనకుమారీ!

నా జీవితమూ, నా ప్రాణాలూ నీ పాదాల క్రోల. దేవీ! నా చదువులూ, నా కళలూ నీ పూజకై ఒక శతాంశమైనా పనికిరావు!

ఇన్ని దేశాలు తిరిగి, ఇన్ని భావాలు స్పర్శించి, ఇన్ని సౌందర్యాలు సందర్శించిన నా సంస్కృతి నీ అర్చనకై ఒక్కపూవు మాత్రమైనా కాజాలదు.

సకల తేజోవిరాజిత అయిన ఒక దేవి నా నికృష్ట జీవితంలో ప్రత్యక్షము కావడం నేను కోటికోటి అదృష్టాలు పండించుకొన్నట్లు!

నీ పూజకు ఈ లోకంలో పూలన్నీ చాలక తారా కుసుమాలను కొనిరాలేను.

నీ కైసేతకు భూమిలోని నిధులన్నీ చాలక, సూర్య చంద్రకాంతులు మహా కోట్లు పెంచినా నీ హృదయంపై తారాడ ఒక్క ప్రాలంబికమైనా కాజాలదు నా సర్వస్వేశ్వరీ!

ఈ కంఠహారమూ, ఈ ఉంగరమూ నాభక్తి చిహ్న మాత్రాలు.

నువ్వు నన్ననుగ్రహించి
నువ్వు నా బ్రతుకులన్నీ పులకించి
దేవీ! నా కళార్చన ప్రేమతో స్వీకరించు,
నువ్వు సౌందర్యాకృతియమూర్తీ! మదీయాత్మానందమయీ!
ఈ నాటికి నా జన్మపరంపరాలన్నీ పవిత్రాలైనవి.

దాసుడైన నీ భర్తుడు
మూర్తి"

వనకుమారి వెక్కి వెక్కి రోదించింది.

"అమ్మా! నాఅంత నీచురాలు ప్రపంచంలో ఇంకొకర్తె లేదు. నిరంజనరావును తలుచుకొని—నేను—పురుషలోకం పైనే—కత్తి కట్టాను. మూర్తిగారు—మూర్తిగారు—మహోత్తమ పురుషులు. వారిజీవితాన్ని పిశాచిలా నాశనం చేశాను."

ఆమె కన్నులు సప్తసింధులైనవి.

"ఊరుకో వనకుమారీ! మూర్తిరావుగారికి బాగా తగ్గిందట. సాయంకాలానికి ఆయన కులాసాగా ఉంటారు. నీకంట్లో ఏలా ఉంది?" అని కాంతిమయి వనాన్ని తన హృదయాని కదుముకొన్నది.

"అమ్మా! (ఆ ఆశ్రమంలో అందరూ సుధాకరుని 'నాన్నగారూ!' అనీ, కాంతిమయిని 'అమ్మా' అనీ పిలుస్తారు.) మనం అక్కడకు వెడదాం రండి. నాకు వంట్లో చాలా బాగుంది. అక్కడకు వెడితే నాకు పూర్తిగా బలం వస్తుంది. వారి పాదాలమీద వాలి నన్ను క్షమింపమని ప్రార్థించాలి అమ్మా! తీరా—తీరా—వారిని పంపించి వేశాక, వారు కృంగిపోయి, వెళ్లిపోతూ ఉన్నప్పుడు ఇన్నాళ్లనుండీ వారిని గాఢంగా ప్రేమిస్తున్నానని ఒక్కసారి గుండె గుబుక్కుమనగా నా సర్వస్వంలో ప్రత్యక్షమయింది."

ఆమె వేదన వర్ణింప జాలనిదై, సముద్రమై, చెలియలు కట్టలుదాటి, ముంచెత్తుకు వచ్చింది.

"నేనే ఆశ్చర్యం పొందాను. వెంటనే పరుగుపోయి ఆయన పాదాలపైన పడిపోదామనిపించింది."

ఆ బాలికలేచి కాంతిమయి పాదాలకడ కూర్చుంది.

"వారి—వారి—వెనకాలే వారి పర్ణశాలకు వెడదామనుకున్నాను. నా తల—తిరిగింది."

కాంతిమయి ఎంత ఓదార్చినా వనకుమారి అతికరుణంగా దుఃఖిస్తూనే ఉన్నది.

కాంతిమయి వనకుమారి తల తడుముతూ "వనా! ఇప్పుడైనా మించి పోయిందేముంది. ధైర్యం తెచ్చుకో! నాన్నగారూ ముందు కర్తవ్యం ఏదో నీకు ఉపదేశిస్తారు. ఆ ప్రకారం మనం చేయవచ్చును! కాదుతల్లీ!"

"వారు—వారు—కూర్చున్నచోట—ఈ రెండు చిన్న పేటికలూ ఉంచి—వెళ్ళిపోయినారు—."

"వనా! నా కంతా అర్థమైంది తల్లీ! మూర్తిరావు అంటే నీ హృదయ రహస్యప్రదేశాలల్లో ప్రేమ ఉద్భవించింది. నువ్వు నిరంజనుడంటే ప్రేమించినా ననుకున్నావు. అతని మాయజాలంలో చిక్కుకున్నావు. అది నిజమైన ప్రణయం అనుకున్నావు. అదే నిజమైన ప్రేమ అయితే నీ గుండె ముక్కలై ఉండును తల్లీ! కాని నీ జీవితం ప్రతీకారవాంఛతో నిండిపోయింది. ఆ ప్రతీకార దీక్షలోకి తెలియక అడుగు పెట్టినాడు మూర్తి. మూర్తి స్వచ్ఛమైన జీవితం కలవాడు. ఉత్తమ పురుషుడు. ఆతడు నిన్ను చూడగానే ప్రేమించాడు. కాని నీ 'హీన ప్రతిజ్ఞాంధకారం' లో పడిన నీకు చూపులు మాసిపోయినాయి. నీ హృదయంలో రహస్యపథాల బీజరూపమై చిగురించి, ఏలాగో 'కక్ష' అనే విషవాయువులను కూడా భరిస్తూ నీ ప్రేమ పెరుగుతూనే వుంది."

"మనం వెంటనే అక్కడికి వెళ్లాలమ్మా!"

ఇంతకు ముందే సుధాకరులూ, డాక్టరుగారూ మూర్తి పర్ణశాలకు పోయినారు. మూర్తి మెలకువవచ్చి బలంగానే వున్నాడు. ఆశ్రమగంట రెండు కొట్టినారు. అందరినీ అవలకు పొమ్మని సుధాకరులు, మూర్తిమంచం దగ్గిర వున్న కుర్చీలో కూర్చుని, "మూర్తిగారూ! మీ ఇద్దరి

హృదయాలూ, మీ ప్రణయ చరిత్ర ప్రారంభ ప్రకరణంలోనే నాకు పూర్తిగా తెలిసిపోయినాయి. కాని, నిరంజనరావు ఆడిన దుష్టనాటకంవల్ల అమ్మాయి వన ఎంతో బాధపడి పోయింది. అయినా అతన్ని నిజంగా ప్రేమించలేదు. అందుకని మగవాళ్లంతా దుర్మార్గులనే భావానికి వచ్చింది. ఆమెకు మొట్టమొదట నిజమైన ప్రేమకలిగింది నీ మీదే! ఇంత రసాభాస చేసుకున్న తర్వాతనే ఆమెకు నిజం కనబడింది." అని అతి పవిత్ర స్వరయుక్తమైన మాటలతో చెప్పినారు.

మూర్తి ఏమీకదలలేదు. అతని కళ్లు మూసే వున్నాయి.

ఇంతట్లో వనకుమారీ, కాంతిమయీ లోనికి వచ్చారు. సుధాకరులటుచూచి, లేచి, భార్యను తనతో రమ్మని సైగచేసినారు. వారిద్దరూ వెనక్కుపోయి, కలిసి ఆ గది వీధి తలుపు నెమ్మదిగా వేసినారు.

వనకుమారి మూర్తి బాధను గమనిస్తూ గజగజలాడి పోతూ అలా నిలుచుండి పోయినది.

ఆమెకు సుధాకరులూ, కాంతిమయీ వెళ్లిపోయినదే తెలియదు.

ఆమె తూలుతూ నడిచి మూర్తి మంచందాపునకు వెళ్ళింది.

అంతవరకూ మూర్తి కన్నులు తెరవలేనేలేదు. సుధాకరులు వెళ్లినట్లుగాని, కాంతిమయీ వనకుమారీ వచ్చినట్లుగాని, కాంతిమయి భర్తతోకలిసి అవలికిపోయి తలుపు వేసినట్లుగాని తెలియదు.

"మూర్తిగారూ!" వనకుమారి తుడుచుకోకుండానే నెమ్మదిగా పిలిచింది.

"నేను—విశ్వంలో—ఎవ్వరూ—చేయకూడని—తప్పుపని చేశాను—నిజంగా—నిజంగా మిమ్మల్ని—నేను నాకు—"

మూర్తికి ఆ బాలిక మాటలు వినిపించేసరికి ఆశ్చర్యం వేసింది. ఈ బాలిక ఎప్పుడు వచ్చింది? అతడు కళ్లువిప్పి చూచాడు. ఎదుట దీనస్వరూపిణి వనకుమారి, అతికరుణంగా వాపోవుతూ, కృంగిపోతూ తన మంచం దగ్గిరే నిలుచుని వుంది.

మూర్తికూడా వణకిపోయినాడు. అతడు నెమ్మదిగాలేచి కూర్చుండి. "వన...కు...మా...రి...గా...రూ! ఆ... కుర్చీమీద కూర్చోండి!" అని సుధాకరులు ఇంతవరకూ కూర్చుండి వెళ్ళిన కుర్చీ చూపించారు.

కాని వనకుమారి, అతని మంచందగ్గిరే కూర్చుండి పోయినది.

"అయ్యో అలా క్రిందకూర్చున్నారు?"

"నన్ను...ఇక్కడే...కూర్చోనియ్యండి—"

మూర్తిరావు మంచంనుండి దిగజారి ఆమె ఎదుట మంచాన్ని ఆనుకుని కూర్చుని ఆమెవయిపు ఒక్కసారి తేరిపార చూచినాడు. ఆమె మెళ్లో పద్మరాగాల కంఠ మాల. వెంటనే ఆమె కుడిచేయి చూచినాడు. ఆమె ఆ కళ్ల నీళ్లలో, భయంకర జీమూతాలు విడిపోతూ, పూర్ణిమ జ్యోత్స్నలైన చిరునవ్వుతో— అతని చూపులు గ్రహించి, కుడిచేతితో పట్టుకున్న చిన్న మొఖమల్ పెట్టె మూటనొక్కి తెరిచింది.

నవరత్నాల వుంగరం తళతళలాడి పకపకనవ్వుకొంది.

"వనకుమారిగారూ!"

"నన్ను వనా అనే పిలవండి—!"

"నా యందు—దయ—తలచి—వచ్చారా?"

"అలా అనకండి—అదే భయపడ్డాను—! సర్వ దేవతలు సాక్షి—గురు—గురువుగారి పాదాలు సాక్షి—మొదటి క్షణంనుంచీ—మిమ్మ—మిమ్మ—నా జన్మకు మొదటిసారి ప్రేమించాను —అదివరకు —అంతకుముందు —అది — నా—నా—మొదటి యవ్వనపు—పొంగు—మాత్రం!"

ఆమె అతని పాదాలకడ తలవాల్చివేసింది.

మూర్తిరావు తనలో కలిగే అననుభూత ఆనందం పట్టలేక పోయినాడు. సర్వజగత్తూ అతని ఎదుట ప్రత్యక్షమయి నట్లయినది. ఆలోకంమధ్య బంగారు పద్మంపై త్రిభంగిగా కూర్చుండి బొమ్మలు వేస్తూ వనకుమారి తన వయిపుగాఢ ప్రణయపు దృష్టులు పరుస్తూ దర్శనమిచ్చింది.

అతడు నెమ్మదిగా వనకుమారి తలఎత్తి జరిగి తన ఒళ్లో పెట్టుకున్నాడు. ఆమె కుడిచేయి తీసి ఆ పెట్టెలోని

## ప్రతిజ్ఞా భంగము

ఉంగరముతీసి ఆమె అనామికకు తొడిగినాడు. ఆమె ఇంకా అతని ఒళ్లోకిజరిగి తల ఎత్తి తన కుడిచేయి కళాంగుళిని మెరిసే ఆ ఉంగరం చూసుకొని అతని తలవంచి, అతని చెవిలో "త్వరలో ముహూర్తం పెట్టించండి. ఈలా నా దుష్ట ప్రతిజ్ఞ భంగంకావడం ఎంత—ఎంత—దివ్యానందంగా వుంది. నాన్నగారికీ అమ్మగారికీ మా ఊరు వుత్తరం రాస్తాను. రండి గురువుగారికీ, అమ్మగారికీ పాదాభివందనం చేద్దాము!" అని అంటూ అతనిచేయి అతి సిగ్గుతో తన చేతిలోనికి తీసుకొన్నది.

"ఓం అసతోమాసద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

(ఈ కథా, ఈ కథలోని సంఘటనలూ, పాత్రలూ కేవలం కల్పితాలు)

## చాటుమరందము

✻ శ్రీ కవికొండల వేంకటరావు ✻

పగటిపూట యెండ వడిఁగాచునప్పుడు
నెందునుంటివయ్య! చందమామ!
నీదుకాంతి యెంత నెగడుచు నున్నచో
మంచి చల్లఁదనము గాంచియుందు—
ఈవు రాత్రులందె యేగుదెంచెద వేల?
తెలిసె నాకు నిపుడు! కలదుగాదె
మచ్చయొకటి! దాని మఱుఁగొనరింపనా?
అక్కళంక మెపుడు లెక్కఁగొనకు!
చల్లదనముతోడ తెల్లవెన్నెలతోడ
నందముగను నాదు చందమామ!
అస్తమింపకుండ నాకాశమందున
వెలయుచుండ మిగుల వేడుకొందు.



# పశ్చిమతీర ప్రాంతాలలో —
# —ప్రసిద్ధ దేవాలయాలు

* శ్రీ వారణాశి వెంకటాచలం *

హిందూదేశములో దేవాలయాలు, ఉన్నతమైనవి చాలా కలవు. దేవాలయాలు కేవలం దేవునియొక్క నివాసస్థలములు మాత్రమే కావు. రాజులకు, మంత్రులకు, సామంతులకు, మీను మిక్కిలి ప్రజాసామాన్యమునకూకూడ, ఈ దేవాలయములు అనేక రీతుల ఉపయోగకరముగా నుండును.

పశ్చిమతీరప్రాంతములలో, అనగా గుజరాతు, కతియవారు, మొదలగు ప్రాంతములందు అనేక దేవాలయములు కట్టబడినవి. వాటిలో ముఖ్యమైనవి అన్నియూ, ప్రస్తుతం శిథిలావస్థయందుయున్నను- గుజరాతు కథియవారు, ప్రదేశములందు, 9 శ॥ నుండి 13 శ॥ లోగా కట్టబడినవి.

మహమ్మదు గజ్నీ దండయాత్రానంతరం, 13 వ శతాబ్దాన ఢిల్లీసుల్తానులు దండెత్తువరకుగల మధ్య 2½ శతాబ్దములయందు, ఈప్రాంతములందు ఉన్నతదేవాలయముల కట్టడము, ప్రాచీన శిథిలమైన ఆలయములను పునర్జీవింప చేయుటయు, చెరువులు, బావులు, కోనేరులు, స్థూపములు, పట్టణ ప్రాకారములు, అట్టి ప్రాకారసింహద్వారములు మొదలైన మహత్తరమైన కట్టడములను నెలకొల్పిరి షోలంకీరాజులు. వీరి ముఖ్యస్థానము గుజరాతునందు పట్టల్ పట్టణమై యుండెను.

వీరు దేశమందు శాంతి భద్రతలు నెలకొల్పిరి. అందుచే వ్యాపార మధికమై ప్రజలు ధనవంతులైరి. ప్రతి వ్యక్తి తను సంపాదనయందుగాని, పంటలవల్లగాని—వచ్చే ఆదాయములో కొంతభాగము తప్పక యీ ఆలయ నిర్మాణమునకై వినియోగపరచవలసినదిగా రాజాజ్ఞ యుండెడిది.

ఈ షోలంకీరాజులవద్ద నుండెడి మంత్రులు, సామంతులులలో కొందరు జైనమతస్థులుగలరు. అందువల్ల వారందరుకూడ వారి ప్రత్యేక ఆర్జనంతయూ యీ ఆలయముల కట్టడమునకై వినియోగపరచుచుండిరి.

ఈ ఆలయములన్నీకూడ ఇండో ఆర్యన్ పద్ధతిని అనుసరించియుండును. కాని, ఈ షోలంకీరాజుల శకమునందు వీరికట్టడములందు ప్రత్యేకత కనుపించబడి, ఈ దేవాలయకట్టడము, షోలంకీపద్ధతి అనికూడ పిలువబడుచున్నది. ఈ ఆలయములన్నియూ హిందు, జైన మత సిద్ధాంతముల ననుసరించి, రెండిటియందు సమానదృష్టిని చూపుచున్నవి.

ముఖ్యంగా వ్యాపారంలో అమితమైన లాభములు పొంది విస్తార ధనం ఆర్జించి, ఆ ధనం అంతా ఆలయ కట్టడములకై వినియోగపరిచినవారు, విష్ణుపాల, తేజోపాలురు. వీరు జైనులు.

హిందూదేవాలయ నిర్మాణం, అనగా కట్టడం, శిల్ప శాస్త్రమున తూ.చా. గా అనుసరించియేయుండును. ఈ శిల్పశాస్త్రము, వేదములలో చెప్పబడిన ఆగమసూత్రాలను అనుకరించి యుండునుగనుక, మొత్తముమీద హిందూదేశమంతయు పద్ధతి ఒకటే. కాని, దేశకాల పరిస్థితులను బట్టి, ప్రాంతీయ సాంప్రదాయనుగుణ్యంగా, ఆలయ నిర్మాణం రెండుమూడు పద్ధతుల ననుసరించియుండును.

ఈ పశ్చిమ సాంప్రదాయానుగుణ్యంగా దేవాలయ ఆవరణ రెండుగా విభజింపబడి, ఆవరణ అంతయూ ఒక విశాలమైన ఎత్తైన రెక్టాంగల్‌గాని, లేక పార్లెలుగ్రముగాని యుండును. తిరిగి రెండు ఆవరణలు ఐమూలగాగాని, విడివిడిగా విభజింపబడిన రెండు భాగాలుగా గాని యుండును.

గర్భగుడి, గూఢమంటపము లోపలి ఆవరణలో యుండును. వెలుపల ఆవరణలో శుభమంటపము, కోనేరు, ప్రాకారములు మొదలైనవియుండును.

# పశ్చిమతీర ప్రాంతాలలో ప్రసిద్ధ దేవాలయాలు

ఆలయములు ఎత్తైనవి కావు. అనగా దక్షిణదేవాలయముల మాదిరి, ఉన్నత శిఖరములులేవు. బేసుమెంటుపైన కొన్ని అడుగుల ఎత్తువరకు, గజములతోను. అశ్వముల తోను, ఇంకా తదితరమైన బొమ్మలచే చెక్కబడిన రాళ్లతో నాలుగు అయిదు వరుసలు కట్టబడును. దానిపైన ఆలయ గోడ ప్రారంభించి కొన్ని అడుగుల యెత్తువరకుండును. ఆపైన శిఖరము ప్రారంభమగును. ఈ శిఖరము నిండుగా రమ్యమైన, చిత్ర విచిత్రమైన రాతి చెక్కడములు, బొమ్మలు కనబడును.

శుభమంటపమంతయూ, పౌరాణిక, చారిత్రాత్మక, గాధలు, కధలు, అన్నీ రాతితో బొమ్మలుగా చెక్కబడియుండును. ఇవన్నీ చూచువారు, పురాణాలు, చరిత్రలు కూడ కండ్లకు కట్టినట్లు చూచి ఆనందించెదరు.

శిల్పి తన సామర్థ్యము నంతయూ యీ శుభమంటపములోకల కంబములందు చెక్కిన బొమ్మలద్వారా విశదీకరించును. యాత్రికులు, పురాణగాధల నన్నిటినీ బొమ్మల రూపేణా చూచి తమ జ్ఞానమును కొంత పెంపొందించుకొనగలరు,

ఇక గర్భగుడి ప్రవేశాంతరం మానవునిదృష్టి తదేక దీక్షతో మూలవిగ్రహ రూపమునన్న దైవమందే కేంద్రీకృతమైయుండు నిమిత్తమై ఈ బొమ్మలు చెక్కడములు కొంతవరకు నిషేధింపబడినవి.

కాని కొంత జైనమత సిద్ధాంతానుసారంగా, విగ్రహాలంకారమేగాక, గర్భగుడి కప్పుమీదకూడ, కొన్ని చెక్కడములు చెక్కబడియున్నవి. అట్టి చెక్కడములోన, అమూల్యమైన రాళ్ళు కూడ కనబడును. ఈ జైన సాంప్రదాయం వెలిబుచ్చెడు ఆలయములు రెండు కలవు. అవి విష్ణుపాలుడు, జైపాలుడు నిర్మించినవి.

10 వ శతాబ్దములో— సూనక, కనోడ, ధేల్ మలో, కసార్ దేవాలయాలు.

11 వ శ॥ సేజాపూరులోని నవలక- మొధేరాలోని సూర్యదేవాలయం మౌంట్ యాబూలోని విమల దేవాలయం.

12 వ. శ॥ లో రుద్రమాల- సిద్దీర్ పూరు. కథియవారులో సోమనాధ.

14 వ శ॥ తేజోపాలుని కట్టడం (యాబూలో)

సూనక్, కనోడా ధేల్ మల్ మొదలైన ఆలయములన్నీ షోలంకీరాజుల ముఖ్య స్థానమైన పట్టుల్ కు 15 మైళ్ళ దూరములో యున్నవి. ఈ ఆలయములందు చూపబడిన శిల్పనాశక్తి, ప్రజ్ఞ, అతీతము. గుజరాతులో ఆలయ నిర్మాణమందు శిల్పికిగల జ్ఞానమును చూపుటకు యిది ప్రథమ తరుణమై యుండెను.

ఇక 11వ శతాబ్దమునందు కట్టిన సూర్యదేవాలయమును కాంచిన, శిల్పి తన శిల్పనాశక్తిని ఏవిధముగా ఉద్దీపింప చేసినది విదితమగుచున్నది. శుభమంటపమునందు గల కంబములనుచూచిన యీ శిల్పి అలంకార శాస్త్రమంతయూ కూడ తెలిసినవాడని విదితమగును. ఈ ఆలయము తూర్పుదిక్కును చూచుచుండును. సూర్యోదయం కాగానే సూర్యభగవానుని కిరణములు నేరుగా గర్భగుడిలో ప్రవేశించి విగ్రహముమీద పడినప్పుడు, ప్రత్యేకమైన జ్యోతినిచ్చును. ఆలయావరణలో ఒక కోనేరు కలదు. గర్భగుడిలో కప్పుమీద రమ్యమైన చెక్కడములు చెక్కియున్నవి. అవి చూచుటకు ఏ కాగడా వెలుగులోనోగాని ప్రాప్తించదు.

ఈ ఆలయములన్నీ ఒకే కాలంలో కట్టబడినవి గనుక అన్నియూ ఒక విధమైన రూపమును పొందియున్నవి. కాని కాలము మారినకొద్దీ, శిల్పి తన చాకచక్యమును అమితముగా చూపి, తన కల్పనాశక్తినికూడ వినియోగించుకొని, శుభమంటపములలోను, గూఢమంటపముల లోను, గోపుర శిఖరములందును, అలంకారం వెదజల్లు బొమ్మలను చెక్కి, తన ప్రజ్ఞను శాశ్వతంగా చరిత్రయందు నిలచునట్లు చేసెను.

జైన దేవాలయములందు మార్బలు రాతినికూడ ఉపయోగించిరి. జైన దేవాలయాలయందు అలంకారము మెండుగా యుండును, కెంపులు, పచ్చలు, రవ్వలు మొదలగు అమూల్యమైన రాళ్ళను కూడ అమర్చి యుంచిరి, గనుక ఆలయోపరిభాగంలో ప్రత్యేక శోభ కనబడుచుండును.

# పశ్చిమతీరప్రాంతాలలో ప్రసిద్ధ దేవాలయాలు

ఆ కాలంలో యీ ఆలయాలు కట్టడం యింత ఉన్నత స్థితిలో ఎట్లున్నదీ, అని ప్రశ్నించుకుంటే, అప్పటి ప్రజా సామాన్యము, రాజులు, మంత్రులు,సామంతులు,కలిసి చూపిన శ్రద్ధాభక్తులేకారణం అని చెప్పకనే చెప్పుచున్నది. ప్రతి ఆలయం చుట్టునూ ఒక పట్టణము వెలిసినది. ముఖ్యముగా ప్రజాసామాన్యమునకు దేవాలయమే గమ్యస్థానము. అవి కేవలం దైవభక్తికొరకేగాక, జ్ఞానమును పెంపొందించు దివ్యస్థానములుగా నుండెను. వ్యాపారముచేయు బజారులు, విద్య గరపు వీధిబడులు, దైవకాలక్షేపమిచ్చు హరికథలు, పట్టణములో జరుగవలసిన సభలు, మొదలగునవి అన్నియూ కూడ యీ దేవాలయ ఆవరణలోనే జరుగుచుండెడివి. దైవభక్తి ప్రజలకు అపారమని యీనాటి వరకు నిరూపించుచున్నవి యీ నిలచియున్నటువంటి దేవాలయములు.



# చీడపురుగులు

* శ్రీమతి ఆవంత్స మంగ *

[ఎలెక్షన్సప్పటి తర తరాల నాయకశిఖామణులను దృష్టిలో వుంచుకుని వ్రాసిన ఊహాచిత్రం ఇది. కాని ఎలెక్షన్స్ సమయం సిద్ధించి పోతేనేం, మరే క్షామనివారణనిధి నిమిత్తం విరాళాలు పోగుజేసే కార్యావసరం సమీపిస్తేనేం, నాయకులనే వారికి నాలికలెక్కువనీ, బహుముఖాలనీ సూచిస్తుంది, ఈ రచన.—సం॥]

సుబ్బిగాడి ఏడుపుతో మెలకువ వచ్చేసింది. గడియారం టంగ్ టంగ్ అంటూ రెండు కొట్టింది. సుబ్బిగాడు గుక్కపట్టేస్తున్నాడు. అమ్మ అన్ని రకాలుగాను వాడిని ఊరుకోపెట్టేస్తుంది. వెధవ వాడూరుకుంటాడా? ఆరున్నొక రాగం రక రకాలుగా ఆలాపించడం వాడికి తెల్సినంతగా ఎవరికీ తెలిసుండదు. తలపోటు—ధన్ ధన్ మని చంపేస్తూంది. వెధవ బద్ధకం. లేచి కాస్త అమృతాంజనం రాసుకోనిస్తే దీని పుట్టేం మునిగిపోతుందో. తల్లో తేళ్ళూ జెర్రెలూ అటూయిటూ తెగపాకేస్తున్నాయ్. క్షామనివారణ కలాపం కాబోలుమరి, తల వూడి చేతిలోకొచ్చినంత పనైపోతూంది. ఇంకలాభంలేదు. బద్ధకానికి బుద్ధి చెప్పాలి. లేచి అలమారులోంచి అమృతాంజనం సీసా తీసి యించు మించు అంతా రెండు కణతలకే బాగ పట్టించేసాను. చిటికెలో తలపోటు పోవాలని. ఇంకాస్త ఎక్కువైపోయింది. నిద్రపోతే పోతుందేమో; ముసుగు తన్ని కళ్ళు మూసుకున్నా, అదే వస్తుంది నిద్రని.

పచ్చపురుగులు బ్రహ్మాండమైన బహిరంగసభ జరుపుకుంటున్నాయి. అందులో ముదరాకు పచ్చపురుగు లేచి గంభీరోపన్యాసం యిస్తోంది.

"పచ్చపురుగులూ! యిటువంటి బ్రహ్మాండమైన సభలో ఉపన్యసింప అవకాశమిచ్చినందుకు నా అభివందనములు. నేడు పురుగుజాతి, ప్రపంచకంలోని పాత పద్ధతులు పాతి పెట్టి కొత్త పద్ధతులతో పరుగు లెడుతోంది. మనం కూడ ఆ పరుగు నందుకోవాలి. మనకు పచ్చపురుగులని పేరెందుకొచ్చిందీ తెలుసా? ఆదినుంచీ మనం సిరిసంపదలతో, సౌభాగ్య భోగాలతో తులతూగుతూ పచ్చగా వుంటాం కాబట్టి ప్రపంచకంలో మనకి పచ్చజాతి అని పేరు వచ్చింది. ఆ పేరు నిలబెట్టాలంటే మనం ఏం చెయ్యాలి అనేదే తెల్సుకోవాలి.

మనమందరం ఒకటే జాతి. మనకందరకూ ఒకటే నీతి. మన మందరం ఏం చేసినా అందరికోసం చెయ్యాలి. ఆ ఫలితం అందరూ అనుభవించాలి. నేడు మనం ఎదుర్కునే సమస్య పురుగుకోటి కంతకూ తినడాన్కి తిండీ, దుష్టశక్తుల కాలిక్రిందపడి. నలిగి, కృంగి, కృశించి నశించి పోకుండా నివసించడాన్కి కన్నాలూ కల్పించాలి. దీని కోసం మనం కష్టపడి పని చేయాలి. ఎక్కడయితే, రసగుల్లాలు, గులాబ్ జామ్‌లూ, బాదుషాలూ, పాలుకోవాలూ, పంచదార, ద్రాక్షపళ్ళరసాలు, మంచి పసందైన విటమిన్సుకల ఆకుపచ్చని ఆకులూ, కన్పిస్తాయో అక్కడే మనమందరం బారులుతీర్చి, వరసలు వరసలుగా క్రమ శిక్షణలో సురక్షితంగా ప్రాకి ఆ పదార్థాలన్నీ అందరం సమానంగా తినాలి. అంతేకాని ఎవరిష్టుకు వారు వెళ్ళి చాటుగుండా తినేసి యింకొకళ్ళకి లేకుండా చెయ్యకూడదు. ఇటువంటి మహా ఘనకార్యాన్ని నడిపించడాన్కి మీరందరూ ఏకగ్రీవంగా నా నాయకత్వాన్ని అంగీకరించాలి. దీనికి మీరు వప్పుకుంటామంటారా?

పచ్చపురుగులు :— "వప్పుకుంటాం. వప్పుకుంటాం. ముదరాకు పచ్చ పురుగూ జిందాబాద్! పచ్చజాతి జిందాబాద్!!"

ఇంతట్లోకే ఒక పొడుగు పురుగు గబ గబా ప్రాకి అందరికీ కన్పించేట్లుగా ఒక పుల్ల ముక్క మీదకెక్కింది.

"పచ్చ పురుగులూ నిజం తెలుసుకోండి. ఆ మాటలు వట్టి మాటలు. నీటి మూటలు. నమ్మకండి. మనం యిటువంటి నాయకుత్వంలోవుండి ఎన్నాళ్ళనుంచి కన్నీళ్ళు కారుస్తున్నాం? మంచిదేది మనకేమన్నా నిజంగా జరుగుతుందా? మనలో చాల పురుగులు అందరి కాళ్ళక్రిందా పడి చచ్చిపోయాయ్. మనలో అందరికీ నిజంగా కావల్సినంత తిండీ ఉండడాన్కి కన్నాలూ వున్నాయా?"

ఆంధ్ర మహిళ

పచ్చపురుగులు :— లేవ్, లేవ్.

పొడుగుపురుగు :—ఉండడాన్కి పెద్దకన్నాలూ, తిన డాన్కి జహంగీరులూ, హల్వాలూ. జిలేబీలూ, లడ్డులూ కొద్దిమందికే వున్నాయ్.

పచ్చపురుగులు :— అవును. అవును.

పొడుగుపురుగు:– "అన్నీ అందరికీ కావాలంటే ఏం చెయ్యాలో తెలుసా? మీరు తినేది అందరికీ పెట్టమంటే అన్ని పురుగులు వింటాయా? వినవ్. కాబట్టి మనం శాసనాలు చేసి "ఈ పని మీరు చేసి తీరాలి" అంటే చచ్చినట్టు కుక్కిన పేనుల్లా అన్నీ వింటయి! అంతేకాని మీ అంతట మీరు అందరికీ సమానంగా పంచి పెట్టమంటే యే పురుగులూ వినవ్. కాబట్టి నాయకత్వాన్ని మీ అందరి సహాయంతో సాధిస్తా. ఏమంటారు? నా మాట వింటారా?"

పచ్చపురుగులు:– "వింటాం వింటాం. మాకు నువ్వే కావాలి. పొడుగుపురుగూ, జిందాబాద్. పచ్చజాతి జిందాబాద్." పొడుగు పురుగు కొన్ని పురుగుల్ని లేవదీసుకు పోయింది.

ఎక్కడినుంచో ఒక పొట్టిపురుగు లేచి "చిక్కిన పురుగులూ, బక్కపురుగులూ మీరెవ్వరి మాటా నమ్మకండి. ఈ పొడుగు పురుగు ఎలాంటిదో తెలుసా? ఈ పోతుపురుగూ పొడుగుపురుగు ఎలాంటివో తెలుసా? ఈ పోతుపురుగు స్నేహితులూ కలసి మొన్న సీలువేసిన పంచదార డబ్బాకు అడుగున చిల్లుపెట్టి, ఎవరికీ తెలియకుండా చల్లగా మెల్లగా అంతా తినేశాయి. చూశారా? వీటి స్వార్థపరత్వం. ఆ పురుగు నెప్పుడూ నమ్మకండి. ముదరాకు పచ్చపురుగు నసలు నమ్మకండి. అది బలే పచ్చిదొంగ.

నేడు మనం బక్క చిక్కి చచ్చి పోతున్నాం. పొడుగు కూడ ఎదగటంలేదు తిండిలేక. ఎందుచేత? మన పచ్చ జాతిలో కొంతమంది స్వార్థపరులై పోయారు కాబట్టి ఎండలో ఎండి పోతున్నాం. వానలో తడిసి పోతున్నాం. చలిలో చల్లపడిపోతున్నాం. మన లాంటి పేదపురుగుల ఆనూ పానూ కనుక్కునే వారెవరూ లేరు. మనం ఈ నాడు యిలాంటి కష్టాల పాలవుతున్నాం అంటే కారణం ఎవరో ఊహించుకోండి. అన్న మాటలు ఆ చరణలో పెట్టేవారెవరో గ్రహించండి. నీతినియమాలు దాటకుండా నిజాయితీగా పని జేసి పచ్చజాతిని నిజాయితిగా మార్చేస్తాను. నన్ను నాయకుడిగా వుండమంటారా మరి?"

పచ్చపురుగులు :– "వుండమంటాం. వుండమంటాం. ఇదిగో నీతో వచ్చేస్తున్నాం. పొట్టిపురుగుకూ జయ్. పచ్చ జాతికీ జయ్." పొట్టిపురుగుకూడ కొన్ని పురుగుల్ని కూడకట్టుకుని చక్కాపోయింది.

మూలనుంచొక మరగుజ్జుపురుగు లేచి ఎగిరాయిమీద కెక్కి "బక్కపురుగులూ, ఓ బక్క పురుగులూ ఆగండి. ఆగండి. నా మాట వినండి. అందరూ శ్రీవైష్ణులమంటారు. బుట్టెడు రొయ్యిలూ తినేస్తారు జాగ్రత్త. ఎవరిమాటా విని మోసపోకండి. మీకు మంచి మాటలు చెపుతున్నవన్నీ పచ్చి కేళీలు. దొంగపురుగులు. వాస్తవికంగా ఏం జరుగుతుందో ఆలోచించండి. అధికారాన్కి వస్తే అన్నీ ఆ పాతపాటే పాడతాయ్.

బలసిన పురుగులన్నీ ఆయాసంతో ప్రాకలేక ఒక చోట పడివుంటే వాటి కోసం దూర దూరాలు ప్రాకి జిలేబీలూ లడ్డులూ, పకోడీలూ, కారప్పూసా, జంతికలూ, చేగోడీలూ, మనం తినకుండా మోసుకుని వచ్చి వాటి యథాన్ని కొడుతూ వాటి బొజ్జలు యింకా పెంచేస్తున్నామ్.

మనకి మాత్రం అందులో భాగంలేదు. ఇలా చిక్కి చావాల్సిందే. ఇలా కష్టపడే వాళ్ళొకళ్ళయితే తినే వాళ్ళొకళ్ళవుతున్నారు. ఇలాంటి అన్యాయాన్ని అరికట్టి కష్టపడేవాళ్ళే తినాలంటే ఏం చెయ్యాలో తెలుసా? దొంగపురుగుల్ని నాశనం చేసి మనం చచ్చి అయినా సరే మన కార్యాన్ని మనం నెరవేర్చాలి. కాబట్టి మీరందరూ పైకి ఎక్కిస్తే అలాంటి ఘన కార్యాన్ని నే నెరవేరుస్తాను. మరి మీరందరూ వింటారా?"

పచ్చపురుగులు:— "వింటాం. వింటాం. మరగుజ్జు పురుగుకూ జయ్. బక్కపురుగులకూ జయ్." కొన్ని పురుగులు మరగుజ్జుపురుగుతో కూడ వెళ్ళి పోయామ్.

తెల్లపురుగుల నృత్యం :

భాగ్యజీవిని నేనే ధన్యా జీవిని నేనే,

## చీ డ పు రు గు లు

నా సీమా నాకుదక్కునే, నాసీమా నాకు దక్కునే మళ్ళీ,
వలపులసీమా, నా వలసా సీమా దక్కునే ॥భా॥

ఎఱ్ఱపురుగు నృత్యం :

కల నిజమాయెగా కోరిక తీరుగా,
సాటిలేని రీతిగా మదినెంతో హాయిగా,
నేడో రేపో ఫలించుగాదా పచ్చా రాజ్యము నాకూ.
పచ్చారాజ్యమునాకూ ॥కల॥
ఫలియించుగా-ఫలియించూనూ, అహాహా
తోకలూ. నా తోకలూ, ఎఱ్ఱతోకలూ ॥ఫ॥

* * *

గరగరా అంటూ చీపురు చప్పుడు చెవిలోకి దూకి నోట్లోంచి వచ్చేస్తుంది. మంచం కింద దూరి బరబరావూడ్చేస్తున్నా రెవరో. హడలిపోయి "ఆ ఆ రామీ. రామీ వూడ్చెయ్యకేవ్." అన్నా కళ్ళు విప్పి.

"ఏం టబ్బాయి గోరూ. పలవరిస్తున్నారు. లేవండి. పొద్దెక్కిపోనాది." అంది రామి చీపురు చప్పుడుయింకా స్త పెద్దది చేస్తూ.

'"అయ్యో ఆపురుగు లేవీ? అంతా కలే?...కాదు కలియుగం! ఎండ చక్కగా కాస్త వెచ్చగా నామీద కిటికీలోంచి పడుతూంది. ఆచార్యులగారి రేడియో "కల నిజమాయెగా" పాడుతోంది. వెధవ చలి లేవనివ్వదు.



# సాగర సంసరణం

* శ్రీమతి పక్కి శారదాబాయ్ *

అంతుతెలియని సాగరానా
అలలతాకిడి నూగులాడుచు
ఆగనీ యీ పయన మెటకోయ్....?
ఆగి కొంచెము పలుకవోయ్——!

అలలలో పడి మిలమిలాడెడు
తరుణ భాస్కరు కిరణకాంతుల
మరగి-యొడలేమరచి-ఓడను
నడుపుచుండిన యువక నావిక....!

తళుకు బెళుకుల తారులాడుచు
తరగలను పరియాసమాడుచు
మురిపెముల చూపించు మీనుల
ముచ్చటల మరులొందు రసికుడ....!

తోడు లేక గంభీర జలనిధి
నోడ నడుపగ పూనుకొంటివి
అలల నలగుడు నాదుకొనగా
వలదటోయ్ చేదోడు ?.... వినవోయ్....!

కడలి దాటగతోడు లేకను
కదల లేకున్నాను కదవోయ్
కరుణ నను నీ జోడు గూర్చిన
కలసి నడుపుద మోడ హాయిగ——॥

ఒకరి కొకరము తోడు నీడగ
సకల మునుమన మిరువురమ్మయై
విడక యవ్వలి దరిని జేరెడు
విధము గూర్పగ నీకు కొలతుము.





ఒకరు చెప్పినట్టు చేస్తే....

# కాపురం చేసినట్టే

* శ్రీమతి జి. వి. కమలామణి *

ఒక యిల్లు వేయిళ్ళు మొదలుగా వర్ధిల్లవలసిన కాపురం సంతోషంతో సౌఖ్యంగా సాగాలంటే, ఎంతో విచక్షణా జ్ఞానంతో మసలుకోవాలి. మొదట మంచిమగడు దొరకడమన్నది కేవలం అదృష్టంమీదే ఆధారపడి ఉందని అన్నా, ఆ తరువాత, కాపురంలో కష్టసుఖాలు పెరిగించుకోవడం మాత్రం మూడువంతులు మనమీదే ఆధారపడి ఉంటుందని ఒప్పుకునితీరాలి. ఓరిమి, సానుభూతి, పరస్పర సహకారం చూపిస్తూ, అన్నిటికన్నా ముఖ్యమైనది, ప్రతి విషయం పైవారంతా చెప్పినట్టుకాకుండా, తమ పరిస్థితిని తాము అర్థంచేసుకుని, దాని కనువైనరీతిగా చేస్తేనే, కాపురం సౌఖ్యంగా సాగుతుంది.

ఉమ్మడి సంసారాలు అరుదైపోయి వేరింటి కాపురాలు విరివిగా వెలిసిన ఈ రోజుల్లోనైనా, ఏ మేనత్త, ఏ మేనమామ కూతుళ్ళో, ఏ పెదమామగారిభార్యో, ఏవేలువిడిచిన వాడి బిడ్డో, చుట్టుపక్కల కాపురముండకపోరు. ఒకవేళ, అదృష్టవశాన్ని వీరందరికీ దూరంగా ఉన్నా, ఇరుగు పొరుగువారు తప్పరు. ఎవరో ఒకరు అప్పుడప్పుడు చూడ రాకనూ మానరు. వచ్చి వెళ్ళేలోపున, ఉన్న పరిస్థితుల మీదొక పదివిమర్శలు నిరాఘాటంగా చేసి, ఒద్దికగా కాపురం దిద్దుకోవాలంటే, "ఇదికాదు ఇల్లాగ" అంటూ గంపెడు సలహాలు గుమ్మరించి పోతూ ఉంటారు. తొలిసారి కాపురానికి వచ్చిన క్రొత్తకోడలుదగ్గరనుంచి, అల్లుళ్ళనూ కోడళ్ళనూ తెచ్చుకోదగిన ఆరితేరిన ఇల్లాలి వరకూ ఈ అయాచితపు సలహాలబారినుంచి తప్పించుకుందుకు సాధ్యం కాదు. ఏమంటే, ప్రపంచంలో ప్రతివారూ, అడగకుండానే సంతోషంగా యిచ్చిపోయేది– సలహాయే!

మాటవరుసకి,– ఒక అమ్మాయి, అత్తవారింటికి కొత్తగా కాపురానికివస్తుంది. పూర్వకాలంలోలాగ పెద్దత్త చిన్నత్తలూ, వారిబిడ్డలూ, మొదలైన వారందరితో నిండిన అఖండ గౌతమిలాంటి ఉమ్మడి కాపురం కాకపోయినా ఒక అమ్మకన్న బిడ్డలంతా ఇంకా పూర్తిగా చెదిరిపోకుండా ఉన్న సామాన్యసంసారం. ఈ అమ్మాయి భర్త ఆ యేడే బి. ఏ. పరీక్షరాసి, ఎన్నెన్నో కోరికలతో భార్యని తీసుకుని, తమ ఇంటికి వచ్చాడు. ఉద్యోగం దొరికి వేరే వెళ్ళేవరకూ కొన్నాళ్ళక్కడే ఉండాలి. (ఏపేటి కాయేదు పరీక్షలంటే ప్యాసవచ్చునుగాని, వెంటవెంటనే ఉద్యోగాలు ఎదురువస్తాయా?) ఇంతలో ఒకమాటు, ఏ మేనమామ కూతురో ఈ ఊరు ఏదో పనిమీద వస్తుంది. ఆవిడగారు ఈ అమ్మాయినో రెండు మూడు మాట్లు చూడడానికివచ్చి, ఏవో చిల్లర మల్లర పనులు చేస్తూన్న అమ్మాయికి మెల్లిగా మంత్రాంగం బోధిస్తుంది. "ఏం కాపురమే, నా తల్లీ ఇది! గిరగిరతిరిగే కదురుకైనా విధీ–విరామం ఉందేమోకాని, నీకున్నట్టుగాలేదు. ఎప్పుడుచూసినా, ఏవో అంతూ పొంతూ లేని పనే. ఎంతచేసినా టొంపేగాని, ఓ మెప్పూ, మెహర్బానీ ఉన్నట్టులేదు. ఎలా చేస్తున్నావు, మా అమ్మా ఈ కాపురం! ఎంత అపురూపంగా పెంచుకున్నారు, మీ వాళ్ళు నిన్ను! ఏదో శుభ్రంగా బి. ఏ., చదువుతున్నాడు ఏపట్నంలోనో ఈ ఉద్యోగం చేస్తూంటే, నీవు హాయిగా బ్రతుకుతావని మీవాళ్ళిచ్చారుగాని, ఇలాగ మహాసముద్రంలాంటి సంసారంలోనలిగిపోవాలనికాదు. ఐనా నీకు బొత్తిగా నోట్లో నాలిక లేదు. "మీవాళ్ళందరికీ చాకిరీచేస్తూ నేనిక్కడుండలేను. మీకుద్యోగమయ్యేవరకూ మావాళ్ళింట్లో ఉందాం, నెత్తిమీదపెట్టుకుపూజిస్తారు. మీకుద్యోగం రాగానే ఇద్దరం కలిసి వేరుగా వెళ్ళిపోదాం." అని, నీవు పట్టుబడితే లొంగక ఏంచేస్తాడు నీ మగడు? నువ్వు రాయమన్నావంటే నేనైనా రాస్తాను, మీ అమ్మకి; వెంటనేవచ్చి, దెబ్బలాడైనా నిన్ను తీసుకువెళ్ళమని. ఆనక, మీ ఆయన కుద్యోగం వచ్చాక, నువ్వువెళ్ళి హాయిగా కాపురంచెయ్యవచ్చును. నే చెప్పినట్టు చెయ్యి. సుఖంగా కాపురం చేస్తావు" అంటుంది– అయితే, ఆవిడ చెప్పినట్టూ చేస్తే, అష్టకష్టాలుపడి, సర్వబాధ్యతలూవహించి, ఇంతవాడినిచేసిన తనవాళ్ళందరినీ వదలి, కొత్తగావచ్చిన భార్య తనతో పుట్టింటికివచ్చి ఉండ

# .... .... కాపురం చేసినట్టే

మంటే, ఎంత మమకారమున్న మగనికైనా, మనసు నొచ్చకుండా హితవుగా ఉంటుందా? 'వేరింటికాపురంలోనైనా ఎన్నో సవరించి సర్దుబాటు చేసుకోవద్దా?' అనుకుని, అత్తవారితో కలిసి మెలిసి, మసులుతూ, భర్తకారాటంలేకుండా తనకుతానే సరిపెట్టుకుంటేనే మగని మన్నన, సంసారంలో సంతోషం పెరుగుతుందిగాని—ఎవరో చెప్పినట్టుచేస్తే, ఒక్కొక్కప్పుడు, కాపురంలో సుఖంమాట దేవుడికి తెలుసు, అసలు మొదలుకే మోసం వస్తుందేమో!

మరొక్కచోట, ఐదారేళ్ళనుంచి కాపురంచేస్తూ, ఇద్దరుబిడ్డల తల్లిగూడా అయి ఉంటుండి ఇల్లాలు, భార్యాభర్తలిద్దరూ ఏకమాటమీద నడుస్తూ, కలిగినంతలో సరదాతీర్చుకుంటూ, సుఖపడదామనే స్వభావంగలవాళ్ళే-అయితేనేం? వాళ్ళ సంసారనిర్వహణలో తెలిసో తెలియకో చేసే తప్పులెన్నో వెదకి సరిచెయ్యాలని ఎంతో ఉబలాటం, కొందరికి. "పిల్లల్ని ఎప్పుడూ గదిమి ఆజ్ఞలో పెట్టగూడదు. మంచిమాటలతో మెల్లిగా బోధించి ఒప్పించాలి" అని ఒకరు,- "మీవారు పిల్లలన్నదంతా జరుపుతూ, అలాగ గారంజేస్తే, వాళ్ళెందుకైనా పనికివస్తారా? కోరికలణచుకోవడం చిన్నప్పుడే నాటచెయ్యాలి. ఒద్దని బుజ్జగించి చెపుతే వాళ్ళు వింటారా? 'భయమేచూపంగవలయు బాలలకెప్పుడుఁ' అని భయంమీదే ఎప్పుడూ పెంచాలి" అని మరొకరూ పిల్లల పెంపకాన్ని గురించి, ఇరుగు పొరుగులవారు, తరుచు ఎన్నెన్నో ఉపన్యాసాలిస్తూంటారు. ఏది ఆచరణలో పెట్టడం? ఎవరిని మెప్పించడం?

(ముసుగుతోపాటు చెల్లెలి సంసారబాధ్యతంతా నెత్తిమీద వేసుకుని నిర్వహిస్తున్న) ఒక వేలువిడిచిన ఆడబడుచు, మరొక పేటనించి చూడవస్తుంది, ఒకరోజు మధ్యాహ్నం. సాయంత్రందాకా ఆమాటా ఈమాటా ఆడి, లేచి వెళ్ళబోతూ, "అన్నట్టు, అమ్మాయీ, ఈ మాటు సంవత్సరాదికి మాతమ్ముడు ఏం చీర కొన్నాడు, నీకు? ఏదీ చూపించు" అని అడుగుతుంది, ఆగృహిణి. "లేదువదినా, ఈ పండుక్కి చీర కొనడానికి సొమ్ము సర్దుబాటు కాలేదన్నారు. మూడు నెలలనుంచి ముచ్చటపడుతున్నాడని ఈ నెల మొదట్లో జీతం రాగానే, కుర్రాడికో బైసైకిలు కొన్నారు. ఇన్సూరెన్సు ఈ నెల్లోనే కట్టవలసివచ్చింది. గుట్టుగా నెలాఖరువరకూ గడుపుకోవడమే కష్టమైపోయింది. అక్కడికీ పాపకో వాయిలుగౌను, నాకో సిల్కుజాకెట్టుగుడ్డా తెచ్చారు" అని, ఏదో—పాపం, సమర్థిస్తూ, కొంతసంతృప్తితోనే జవాబుచెపుతుంది. కాని, ఆ ఆడబడుచు దృష్టిలో అది చాలా అఘాయిత్యంగా కనబడుతుంది. "చాల్లే, మంచిపనే చేశాడు, వాడెప్పుడూ యింతే! శుభమల్లే పండుగనస్తే, అందులోనూ సంవత్సరాదిపండుగ! నిక్షేపంలాగ పట్టుచీర కొనకుండా, ఏదో ఇనపముక్క కొన్నాడనీ, ఇన్సూరెన్సు కట్టాడనీ డబ్బు లేదనటమేమిటి? అయినా, నీకు బొత్తిగా అభం శుభం తెలియదు. ఈ మాటుకేదో అయిపోతే అయిపోయిందిగాని, ఇంకో పండుక్కి ఎప్పుడూ అలాగ ఒప్పుకోబోకు. సొమ్ము చాలకపోతే, యే అప్పో, వప్పో మగవాడే పుట్టించాలి. మెల్లిగా తీర్చుకుంటాడు. అంతేగాని, మళ్ళీ నెల్లో పండుగ రమ్మంటే వస్తుందా? నలుగురూ సుఖంగా ఉండి, అనగూడదుగాని, పండుగనాడు, అపశకునంగా కొత్తకోక కట్టుకోక పోవడమేమిటి?" అని ధర్మశాస్త్రం చెప్పేసి, ఆవిడ వెళ్ళిపోయింది. ఆవిడ చెప్పిన శాస్త్రప్రకారం, తు. చ. తప్పకుండా ఆచరిస్తే?... ఆలుమగల మధ్య రుసరుసలూ, ఆ తరువాత అప్పులవారివల్ల విసవిసలూ, ఇవేనా?

ఇక పదిహేనేళ్లనుంచి, సంసారమీదుతూన్న కుటుంబానికికూడా రకరకాల సలహాలు—చుట్టాలు, చూడవచ్చినవారూ, ఇస్తూనే ఉంటారు. చిన్నమనుమరాలి కాపురమేర్పరచడానికాఊరు వచ్చిన పెద్దత్తగారు ఓ రెండురోజులు వీరింట్లోనూ ఉండి పెద్దరికం నిలుపుకుంటుంది. పన్నెండేళ్లటివారి బిడ్డ బడికివెళుతూ వస్తూండడం చూసి, "యేమే, మొగాడిలాగ, సుందిని ఇలాగ బడికిపంపడమేనా, లేక, దాని పెళ్ళీ గిళ్ళీ ఆలోచన ఏమైనాఉందా? మొన్న రాత్రి మా వాడిదగ్గర ఎత్తబోతే "తొందరేం, పెద్దమ్మా, చక్కగా చదువుకుంటోంది. కొన్నాళ్లయ్యాక, తగినవాడువస్తే, ఎలాగూ పెళ్లిచేస్తాం. ఇంతకూ ఇప్పుడు పెళ్లిచేస్తే, ఉన్న ఉద్యోగం ఊడిపోవడమే కాకుండా, గవర్నమెంటువారు జైల్లోకూడా పెడతారు" అని నవ్వుకుంటూ వెళ్లిపోయాడు. ఇల్లాంటివి మగవాళ్ళకేం తెలుసాయి? ఆడదానివి-తల్లివి,- నీకేనా గుండెల్లో కాస్త అదురులేకపోతే ఎల్లాగ?

సుంది ఏం కూచమ్మ అనుకుంటున్నావా? ఈ మాఘమాసానికి పన్నెండూ నిండిపోతాయి! (పదమూడు నిండలేదు. దాని మేనత్తలెవ్వరికీ ఈడేరటప్పటికి, వాళ్ళ వంగడం అంతా అంతే.) ఊ. చక్కగా చదువుకుంటోందిట. ఎప్పుడో తగినవాడువస్తే పెళ్ళి చేస్తాడట. దేవలోకంలోంచి ఎవడో దిగివస్తాడుకాబోలు. ఏం? సిద్ధంగా పెద్దమ్మాయి కొడుకులేడూ? చదువులో దానికన్నా ఏడాది వెనకఉన్నా, వయస్సులో రెండేళ్ళు పెద్దే. ఇప్పుడుకాస్త పొట్టిగా, నాజూకుగా ఉన్నా, వయసు ముదిరినకొద్దీ, వాడెంత బారవుతాడో? తలలు కొలిచి ముచ్చటగా, బొమ్మలపెళ్ళిలాగ చేసి, తెరిపినిబడక, ఇలాగ పెంచేస్తే, ఆనకది పెద్దదయి కూర్చుంటే, అప్రతిష్ట రాచకార్యం! ఇంకేమైనా ఉందా? మన ఇంటా వంటా లేవు. ఆలాటి అనాచారాలు... జైల్లో పెడతారుట! చేసినవాళ్ళందరనీ ఏ జైల్లో పెడుతున్నారో. మొన్న మావూళ్ళో తాసీల్దార్ గారమ్మాయికి నిండా పదేళ్ళు లేవు. సీతాకల్యాణంలా పెళ్ళిచేశారు. ఎవరేం చేశారూ? ఇలాటివన్నీ మాలాటి పైవాళ్ళం, ఓమాటు చెప్పిపోతే ఏమవుతుంది? నువ్వే వాడి చెవి నిల్లుగట్టుకుపోరి చేయించాలి" అని వంశాచారాలుపన్యసించి, మాతృత్వ బాధ్యతలు బోధించి, కర్తవ్యం సూచిస్తుంది. ఆవెంటనే పొరుగింటి పుల్లమ్మగారుకూడా అందుకుని, "అవునమ్మా మీ అత్తగారు చెప్పినదంతా వేదవాక్యమనుకో. ఎందుకువచ్చిన చదువులమ్మాయికి? ఎన్నేళ్ళు పెంచినా, ఎంతచదివించినా, ఎప్పుడో అప్పుడు పిల్ల పెళ్ళి మనం చేయవలసిందేగదా. ఆడపిల్ల ఎదుగుతోందంటే, కడుపెదుగుతోన్నట్టే బాధపడాలి. ఏదో ఆ మూడుముళ్ళూ పిల్లదాని మెళ్ళో పడేట్టుచూసి, దాన్ని ఓ అయ్య చేతిలో పెట్టేస్తే, అక్కడికి మన ప్రాణానికి నెమ్మది. నోటికీ, చేతికీ ఎంగిలి లేని సంబంధం సిద్ధంగా ఉందిట. ఇంకెందుకాలస్యం? చప్పున చేసేసే ప్రయత్నం చెయ్యమ్మా! అని, పెద్దత్తగారి వాక్యాన్ని బలపరుస్తుంది. మర్నాడు అవతల ఇంట్లో నున్న అలిమేలు వచ్చి "సావిత్రమ్మగారూ! విన్నారా? మీ సుందరితో చదువుకునే సుబ్బులుకి నిరుడే పెళ్ళి చేసారా! ఈ ఏడాది లోపున అప్పుడే అత్తవారింటికి పంపడం, పెళ్ళిలో కట్నకానుకలకని వచ్చిన పేచీలు రగిలి రగిలి ఆ పిల్లని వాళ్ళు వేపుకుతినడం, చివరికి మీ వాళ్ళు పెళ్ళికిస్తామన్నవన్నీ తీసుకుని వస్తేనే రా, లేకపోతే రానక్కరలేదంటూ, ప్రాణావశిష్టంగా ఉన్న ఆ పిల్లని, వాళ్ళు పుట్టింటికి పంపివేయడం కూడా జరిగింది. మొన్ననే వచ్చిందిట. ఆపిల్ల ఒకటే ఏడుపు. మొగుడికి ప్రేమేనట. కాని తలిదండ్రుల పోషణలో ఉన్న కుర్ర నాగమ్మ. ఏం చేస్తాడు? ఏం చెయ్యడానికీతోచక ఇక్కడ వీళ్ళు కుమిలిపోతున్నారు. ఇప్పటికింకా పెళ్ళికిచేసిన అప్పే తీరలేదు. ఏమీ బెదరకుండా, మళ్ళీ ఒళ్ళో చేర్పించి, హాయిగా చదివించండని, ఇప్పుడే చెప్పి వచ్చాను. మీ సుందరికి మాత్రం ఇంతలో పెళ్ళిజేసి సుఖానున్న ప్రాణం కష్టాన్ని పెట్టుకోకండి!" అని హితోపదేశం చేస్తుంది. జీవితంలో అతి ముఖ్యమైన పిల్లపెళ్ళిని గురించి, కుటుంబ పెద్ద మాటఅలాగుండగా, ఇరుగు పొరుగు వారిద్దరూ, చెరోక విధంగానూ చెయ్యమన్నారు. ఏది విద్యుక్తధర్మం? ఏది అనుసరణీయం? ఏమో! అది వారివారి పరిస్థితులమీద, ఆదర్శాలమీద ఆధారపడి ఉంటుందనుకుంటాను.

ఈ సలహాలన్నీ ఒక్క స్త్రీల దగ్గిరే ఆగుతాయనుకుందుకూ వీలులేదు. పురుషులకీ వస్తూనే ఉంటాయి. ఎంతో మనసుపడి. బి.ఏ. వరకూ చదువుకున్న అమ్మాయిని పెళ్ళాడి, భార్యనికూడా మానవవ్యక్తిగా పరిగణిస్తూ గౌరవించే యువకుడితో, ఏ అక్కమగడో, ఏ తోటిస్నేహితుడో వచ్చి, "ఏమోయ్, అంత యిదిగా స్త్రీలకి స్వాతంత్ర్యం యివ్వగూడదోయ్. ఆడదన్నాక, కాస్త అదుపాజ్ఞల్లోనే ఉంచాలిగాని, బొత్తిగా Freedom ఇచ్చామంటే, ఆనక యేకు మేకై కూర్చుంటుంది. యేదైనా మప్పడం సులువుగాని, తిప్పడం కష్టం సుమా. ఎవరేనావస్తే, అలాగ ఎదురుగావచ్చి పలకరించి మాట్లాడనియ్యకు. పార్టీలంటూ త్రిప్పకు." అని నీతిసూత్రాలు వల్లిస్తారు. అయితే, చిన్నప్పటినుంచీ పురుషులతో సమానంగా చదువుకుంటూ, వారితో కలిసి మెలిసి మాట్లాడే కాలేజీ అమ్మాయిని కావాలని కోరి చేసుకున్నవారు, ఆ యువతి యేనాడో వాళ్ళ బామ్మలాగ వంటిల్లూ, శయ్యాగారం దాటి రాకుండా, నలుగురితో మాటాడకుండా, ఈనాడు ఉండాలని నిర్బంధిస్తే ఆ కాపురం సౌఖ్యంగా సాగుతుందా?... ఇలాగే ఎన్నెన్నో!

ఈ చెప్పేవారంతా నిజంగా సహాయం చేస్తున్నామనీ, ప్రక్కింటివారి బాగుకోరియే యేదోఒకటి చెపుతూ ఉండ వచ్చును. ఎటొచ్చీ ఒకరిబాగు మరొకరికి బాగు కాకపో వచ్చును, రూపురేఖల్లోలాగునే. వ్యక్తుల ఆలోచనలోనూ, వ్యత్యాసముంటుంది. ఆశయాలనుబట్టి అవసరాలు మారుతూ ఉంటాయి. ఎన్నడూ యేదీ వినమని అనడమూ మంచిది గాదు. అలాగని విన్నదల్లా ఆచరణలో పెట్టడమూ అవివే కమే. 'వినదగు నెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్' అని విన్నవాటన్నిటినీ, ఎవరిమట్టుకువారు ఆలోచించుకుని, వివేచనతో చెయ్యాలిగాని, చటుక్కున ఒకరు చెప్పినట్టూచేస్తే—కాపురం చేసినట్టే!

.........

★

అవమానం

# సినిమాలలో స్త్రీలు

.... "శ్రీమతి—శ్రీ" ....

పూర్వంకంటా సినిమాలు బాగా వ్యాప్తి పొందాయి. చూసే ప్రజలు ఎక్కువయినారు. ఈ సినిమాలు స్త్రీలకు వారి విజ్ఞాన వికాసాలకు, ఏవిధంగా తోడ్పడుచున్నవో పరిశీలించడం అవసరం.

నేటి సినిమాలలో స్త్రీలకు రెండు పెద్ద అన్యాయాలు జరుగుతున్నవి. (1) డబ్బు చేసుకోవడంకోసం ఆడవాళ్ళ అంగసౌష్టవం ప్రదర్శించడం. ఒక తరంక్రింద తయార యిన సినిమాలుచూస్తే, ఆనాడు ప్రేక్షకులను ఆకర్షించ డానికి, కథా, పాటలు, నటనటీవర్గం ప్రధానంగా ఎంచ బడేవి. ఉ: వందేమాతరం, మాలపిల్ల, రైతుబిడ్డ, సుమంగళి ఇత్యాది చిత్రాలలో ప్రబోధం ప్రధానం. ఏ ఒక్కదాంట్లోను పశుప్రవృత్తిని ప్రకోపింపచేసేటట్టుగా స్త్రీని ప్రదర్శించలేదు.

అయితే వీటికి డబ్బురాలేదా అంటే వచ్చింది, ఈ సినిమాలతో, నేటి సినిమాలను పోల్చిచూస్తే తేడా స్పష్టంగా కన్పిస్తుంది. ఉ॥ షావుకారు చిత్రంలో చాకలి రామి పాత్ర తీసుకుందాం. అభివృద్ధికర భావాలు ఉన్నట్టు కనిపించే ఈ చిత్రదర్శకులు, ఒక సన్నివేశంలో కత్తిరించ కూడనంతగా జాకెట్టు కత్తిరింపించి వక్షస్థలాన్ని ప్రద ర్శించేరు. ఒక అన్నా చెల్లెలు, లేదా ఒక తల్లీ- తండ్రీ కుటుంబం ఈ దృశ్యాన్ని చూడవలసివస్తే జుగుప్స కలిగిం చేటట్టుగా వుంటుంది.

ఇంత చవకబారు ఆకర్షణలకు ఉపకరణగా స్త్రీని, స్త్రీ అవయవాలను ప్రదర్శనం చేయించడంకంటే, స్త్రీ లోకానికి అవమానకర మైనటువంటిది మరొకటిలేదు. జానపదచిత్రాలపేరుతో ఈ మధ్యవచ్చిన అనేక చిత్రాలలో ఇటువంటి ప్రదర్శనాలు కొల్లలు. "లవ్" అనే చిత్రం శ్రీమతి భానుమతి నిర్మించింది. శ్రీమతి భానుమతి తన చిత్రంలో స్త్రీ లోకానికి గౌరవంయిచ్చే విధంగా నటించ లేదు. ఇది చాలా విచారించతగ్గ విషయం.

దీనికంతటికీ ప్రధానకారణం అమెరికన్ సినిమాలలోని "ఎంతఎక్కువ నగ్నంగావుంటే అంత అందం చందం" అనే ధోరణి: ఇది వెర్రితలలు వేసిన నాగరికతకు లక్షణం. దీని ప్రభావమే మన చిత్రాలలోగూడ ప్రాకుతోంది. సినిమాలలో స్త్రీలను, అసభ్యంగా ఉపయోగించడం, ఎంత నీచస్థితికి వెళ్ళిందంటే, చివరకు చాలాచోట్లనుండి మహిళాసంఘాలు, అసమ్మతి తెలుపుతూ ఆందోళనచెయ్య డంజరిగింది. (ఉ॥ ఏలూరు) ఇది ఒకరకమైన అన్యాయం.

రెండవ రకమైన అన్యాయం ఏమంటే, అభివృద్ధి నిరోధక స్వభావం కలవారిలాగ స్త్రీలను చిత్రించడం. ఉ॥ "పెళ్ళిచేసిచూడు" అనే చిత్రంలో మొదటి అంతర్నా టకం చూదాం. అందులో ఒక మగవాడు బ్రహ్మదేవుణ్ణి ప్రత్యక్షంచేసుకొని, మంచిపెండ్లాం కావాలంటాడు. బ్రహ్మ దేవుడు తీసుకవచ్చి యిచ్చిన ఆ పెండ్లాం అసలు మాట్లా డదు, మళ్ళీ తిరిగి ప్రత్యక్షం చేసుకొని పెండ్లానికి నోట మాట సంపాయిస్తాడు. ఈ "మాటలు నేర్చిన పెండ్లాం" మొగుడ్ని వేధించుకు తింటుంది. మళ్ళీ తిరిగి బ్రహ్మదేముడ్ని

(55 వ పేజీ చూడండి)

# మా రోజుల్లో పండుగలు: పబ్బములు

* శ్రీ గిడుగు సీతాపతి *

మా కాలంలో-అంటే మేము చిన్నవాండ్లముగా ఉన్నప్పుడు జరుగుతూ ఉండే పండుగలూ పబ్బాలూ ఇప్పుడు చాలా తగ్గిపోయినవి; 'కొన్ని ఇప్పుడు ఎవరూ చేయడమే లేదురా బాబూ' అనేది మా అమ్మమ్మ, నా చిన్నప్పుడు అనగా 50 ఏళ్ళ క్రిందట. ఆవిడ ఆనాడన్నట్లే నేనూ ఈ నాడనవలసి ఉంది. నేను నా చిన్నతనంలో చూచిన పండుగలలో కొన్ని ఈ నాడు కనబడవు. నానాటికీ మన పండుగలూ పబ్బాలూ నోములూ వ్రతాలూ చేయడం మాని వేస్తున్నారు చాలా మంది.

మా పల్లెకూటాలలో పండుగల పేళ్ళయినా పిల్లలకి తెలియాలని తిథుల వరువడిని రోకటి పాటగా వల్లెవేయించేవారు :- "పాడ్యమి సంవత్సరాది పాడ్యమి, విదియ, భాను విదియ; తదియ, అక్ష తదియ; చవితి, నాగుల చవితి; పంచమి, ఋషి పంచమి; షష్ఠి సుబ్బరాయడిషష్ఠి; సప్తమి, రథ సప్తమి; అష్టమి, కృష్ణాష్టమి; నవమి, శ్రీరామ నవమి; దశమి, విజయ దశమి: ఏకాదశి, భీష్మ ఏకాదశి; ద్వాదశి, క్షీరాబ్దిద్వాదశి; త్రయోదశి శని త్రయోదశి, చతుర్దశి, అనంత పద్మనాభ చతుర్దశి; పౌర్ణమి, శ్రావణ పౌర్ణమి ; అమావాస్య దీపావళి అమావాస్య." ఏదో ఒక్కొక్క తిథికి ఒక్కొక పండుగపేరు చెప్పేరేకాని అన్ని పండుగలపేళ్ళూ పూర్తిగా చెప్పలేదు. అంతే కాక ఒక్కొక్క తిథికి రెండు, మూడు పండుగలపేళ్ళు చెప్పవచ్చు. ఉదాహరణగా చెప్పాలంటే చవితికి నాగుల చవితే కాక వినాయకుని చవితి కూడా పేర్కొవచ్చును. చతుర్దశికి అనంత పద్మనాభ చతుర్దశే కాక నరక చతుర్దశి పేరు కూడా చెప్పవచ్చును. ఒక్క శ్రావణ పౌర్ణమే కాక ఇంకా అనేక మాసముల పౌర్ణమి పర్వ దినమే : చైత్ర పౌర్ణమి నాడు మాధ్వులకు ముఖ్యమైన హనుమజ్జయంతి వైశాఖ పౌర్ణమినాడు కూర్మబుద్ధజయంతులు; జ్యేష్ఠపౌర్ణమి నాడు వ్యవసాయదారులకు ముఖ్యమైన ఏరువాకపండుగ, కార్తికపౌర్ణమినాడు భక్తేశ్వర వ్రతము; ఫాల్గుణపౌర్ణమి నాడు హోళీపండుగ జరుగుతవి. శ్రావణపౌర్ణమినాడు ద్విజులు నూతన యజ్ఞోపవీతము ధరిస్తారు. ఈ పౌర్ణమికే దేవాంగులు మొదలయినవారు తెలుగున నూలు పున్నమంటారు.

పండుగలు : పబ్బములు అని అనడమే కాని పబ్బమంటే ఏమిటో ఇప్పుడు చాలామందికి తెలియదు. సంస్కృతభాషలో ఉన్న పర్వశబ్దమే ప్రాకృతంలో పబ్బమయి తెలుగులోనికి వచ్చింది. సూర్యచంద్రుల గతులకూ గ్రహణాలకు సంబంధించిన దినాలకు పర్వదినాలంటారు. పండుగ అనే మాట సాధారణంగా అన్ని నోములకు, వ్రతాలకు, ఉత్సవాలకు వాడుకొనే మాట. వ్రతమనగా ఉపవాసం మొదలయిన నియమాలతో చేసే కార్యము. స్త్రీలు చేసే వ్రతాలకు నోము లంటారు.

ఇప్పుడు సాధారణంగా పండుగకు అల్లుణ్ని తీసుకు వచ్చామని ఏ తెలుగువాండ్ల ఇంట్లో అన్నా భోగీ సంక్రాంతి పండుగలే స్ఫురిస్తవి. అదే ఏ అరవవాండ్ల ఇంట్లోఅన్నా నరక చతుర్దశి దీపావళి అమావాస్య స్ఫురిస్తవి. భోగీ సంక్రాంతి పండుగలు అరవలకీ ఉన్నవి; నరకచతుర్దశి దీపావళి అమావాస్య పండుగలు వారికున్నవి. వీరికీ ఉన్నవి; వీరికున్నవి వారికీఉన్నవి. అయినా అల్లుణ్ని ఇంటికి తీసుకొని వచ్చే విషయంలో తెలుగువారికి భోగీ సంక్రాంతి పండుగలు, అరవలకు నరకచతుర్దశి దీపావళి అమావాస్య పండుగలు ముఖ్యమయినవి.

సంక్రాంతి పండుగ సూర్యుడు మకరరాశిలో ప్రవేశించే దినమునకు సంబంధించిన పండుగ. ఆ నాటనుండిన్ని సూర్యుడు ఉత్తరాభిముఖుడై నానాటికి ఎక్కువగా ఉత్తరమువైపు తిరుగుతూ ఉంటాడు. ఈ విధంగా ఆరు మాసాలు గడచిన తర్వాత సూర్యుడు కర్కటరాశిలో ప్రవేశిస్తాడు. నాటనుండిన్ని సూర్యుడు దక్షిణాభిముఖుడై నానాటికి ఎక్కువగా దక్షిణపు వైపు తిరుగుతూ ఆరు నెలలు గడచిన తర్వాత మరల మకరరాశిలో ప్రవే

శిస్తాడు. మొదటి ఆరునెలల కాలం ఉత్తరాయణం; రెండవ ఆరు నెలల కాలం దక్షిణాయనం. ఉత్తరాయణకాలం దేవతలకు మంచిది. అందుచేతనే భాద్రపదమాస బహుళ పక్షమందు పితృతర్పణం జరుగుతుంది. చనిపోయినవారి తిథిని అనుసరించి తద్దినం పెట్టినట్లు పెడతారు. ఆ అమావాస్యకు మహాలయ అమావాస్య- అని పేరు. ఆ నాడు అందరూ బ్రాహ్మణులూ బ్రాహ్మణేతరులూ కూడా పెద్దలకు పెట్టాలని పితృతర్పణం చేసి బ్రాహ్మలకు సంతర్పణ చేస్తారు. దక్షిణాయనంలో దక్షిణద్వారాలు అనగా యమలోకద్వారాలు తెరచుకొని ఉంటవి గనుక ఆకాలంలో చనిపోయినవారు స్వర్గలోకానికి పోవక యముని లోకానికి వెళ్ళవలసి ఉంటుందని హిందువులు భయపడతారు. గనుకనే భీష్ముడు దక్షిణాయన కాలంతో కార్తికమాసారంభమున భారత యుద్ధం పది దినాలుచేసి కార్తిక శుద్ధ ఏకాదశినాడు పడిపోయినా స్వచ్ఛంద మరణశక్తిని తండ్రి వద్దనుండి వరంగా కోరి పొందినవాడు గనుక ఉత్తరాయణ కాలం వచ్చిన దాకా చావకుండా అంపశయ్యపై ఉండి మాఘశుద్ధాష్టమినాడు ప్రాణములు విడిచాడు.

మకరసంక్రాంతి ఉత్తరాయణానికి మొదటి దినం గనుక పండుగ చేస్తారు. దీనికి ముందు పోయిన దినం దక్షిణాయనానికి కడపటి దినం గనుక ఆ నాడు బోగీ పండుగ చేస్తారు. ఆ నాడు తెల్లవారకముందు చీకటి ఇంకా ఉండగానే పిల్లలు సందడి చేస్తూ లేచి చలికాలం గనుక చలిమంటలువేసుకొంటారు. స్త్రీలు వాకటిముందర ముచ్చటగా ముగ్గులు చిత్రించి వాటిపై గుమ్మడి పువ్వులు పేడ ముద్దల బంతులకు గ్రుచ్చి పెడతారు. పిల్లలకు అల్లుడికి తలంటుస్నానాలు చేయించి పెద్దలు కూడా తలంటుస్నానాలు చేస్తారు. అందరూ కొత్తబట్టలు ధరిస్తారు. ఆడ పిల్లలు ఊళ్ళో బంధువుల ఇండ్లకు మిత్రుల ఇండ్లకు పసుపు కుంకుమ బొట్టు భరిణలు, దువ్వెనలు, పంచదార పిడతలు, రేగుబండ్లు పట్టుకుపోయి పంచుతారు. గొబ్బిపాటలు పాడుతారు. మధ్యాహ్నం పిండివంటలతో భోజనాలు చేస్తారు. చంటిపిల్లలకు సాయంకాలం బోగీ పండ్లు-అనగా రేగుపండ్లు; చెరుకు ముక్కలూ కొత్తదమ్మిడీలు అన్నీ కలిపి బిడ్డల తలపై నెమ్మదిగా పోసి పాటలు పాడుతారు.

సంక్రాంతినాడు అబ్దికందినమున పెట్టినట్లే బ్రాహ్మణులకు భోజనం పెట్టే ఆచారం ఆంధ్రులకున్నదిగాని అరవలకులేదు. అరవలానాడు పొంగలి-అనగా పులగంలాంటిది తప్పకుండా తినాలి గనుక ఈ పండుగకు పొంగలి అనే పేరు వచ్చినదని చాలామంది అనుకొంటారు. ఐతే, వరి పనలు కొత్తగా తెచ్చి వండుకొని తినవలసినరోజుగనుక పండుగ దినం పొంగల్ దినంగా మారిందట. సంక్రాంతి అయిన మరునాడు కనుము. ఈ నాడు పశువులపండుగ; పశువులుగల గొల్లలు, మొదలయిన శూద్రులు ఎక్కువగా చేస్తారు. ఈ పండుగలలో పాలిచ్చే ఆవులకున్నూ ఏరువాకపండుగలో వ్యవసాయపు పనులకు పనికివచ్చే దుక్కిఎడ్లకును ఎక్కువగా పసుపురాచి కుంకుమబొట్లు పెట్టి అలంకరించి ఆదరిస్తారు. సంక్రాంతిపండుగ సూర్యగతినిబట్టి ఉంటుందిగాని చాంద్రమానపు తిథులబట్టి ఉండదు గనుక ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క తిథిని జరుగుతుంది,

అల్లుణ్ని తీసుకరావడంలో అరవలకు ముఖ్యమని చెప్పిన నరకచతుర్దశి దీపావళిఅమావాస్య పండుగలు ఆంధ్రులు సైతము- ఆంధ్రులేకాదు హిందువులందరును చేస్తారు. నరకచతుర్దశి ఆశ్వియుజమాస చతుర్దశినాడు వస్తుంది. ఇక్కడ నరక శబ్దానికి కొందరు నరకాసురుడని అర్థం చెప్తారు. లోకకంటకుడైన నరకాసురుణ్ని సత్యభామ సాయంతో శ్రీ కృష్ణుడు చతుర్దశినాడు వధించాడు గనుక నరకబాధ తప్పిందని సంతోషిస్తూ చతుర్దశినాటిరాత్రి తెల్లవారకమునుపే తలంటు స్నానాలు చేసి దీపాలు పెట్టి టపాకీలు కొద్దిగా కాల్చి ఆ అమావాస్యనాటి రాత్రి దీపావళి చేస్తారు. నరక శబ్దం మరి కొందరు నరకలోకం అనగా యమలోకం అనే అర్థంలో గ్రహించి, నరకంనుండి విముక్తి చెందడానికి పండుగ చేస్తున్నామంటారు. విష్ణువు వామనావతారం దాల్చి బలిచక్రవర్తిని పాతాళానికి పంపించిన విషయానికి జ్ఞాపకంగా ఈ పండుగ చేస్తున్నామంటారు మరికొందరు. దీపావళి అనే పేరులో ఉన్నట్టు ఆదిని

దీపాలుపెట్టడమే ఆచారంగాఉండేది. రానురాను దీపాలేగాక పటాకీలు చిత్ర చిత్రమైన మందుగుండు సామాను తయారు చేసి తగలబెట్టే ఆచారం ఎక్కువయినది. ప్రతి సంవత్సరం ఎక్కడో ఒకదగ్గర ఈ మందుగుండు సామాను తయారుచేయడంలో ప్రమాదవశాత్తు మనుష్యులు కాలిపోయి చనిపోవడం కూడా జరుగుతూనే ఉంటుంది. పండుగెందుకో సాధారణంగా ఎవరికీ సరిగా తెలియదుగాని దీపావళివేడుక, ధనవ్యయం, ప్రాణహాని మాత్రం ఎక్కువైనవి,

పైని చెప్పినవి కాక దసరాపండుగలు ఆబాలగోపాలం అందరూ ఎరిగినవే. ఆశ్వయుజ శుక్లపక్షంలో జరిగే పండుగలకు దసరాపండుగలంటారు. దేవీపూజలు నవరాత్రులు చేస్తారు. మూలనక్షత్రం వచ్చిన దినం సరస్వతిపూజ నవమినాడు ఆయుధపూజ చేస్తారు. ఈ ఆయుధపూజ క్షత్రియులకు ముఖ్యమైనది. యుద్ధములు చేసేవారికి కత్తులు కటార్లు మొదలయిన ఆయుధములు ముఖ్యములయినట్లే తక్కిన వృత్తులవారికి ఎవరి పనిముట్లు వారికి ముఖ్యమైనవి గనుక అందరూ తమ పనిముట్లు కడిగి శుభ్రం చేసుకొని పూజిస్తారు. ఈ పక్షంలో వచ్చే దశమికి విజయదశమి అనే పేరు పెట్టారు. నరకచతుర్దశిలో నరకశబ్దానికి అర్థం చేసుకోవడంలో అభిప్రాయభేదమున్నట్టే విజయదశమిలో విజయశబ్దార్ధ విషయంలో కూడా అభిప్రాయభేదం ఉంది. విజయదశిమినాడు శమీవృక్షంఅనగా జమ్మిచెట్టు పూజ ముఖ్యము. అప్పుడు చెప్పే మంత్రశ్లోకాలలో :—

''శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ

అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియవాదినీ''.

అని ఈ మొదలుగా ఉన్న శ్లోకాలకర్థమేమంటే :— ''శమీవృక్షం పాపాన్ని శమింపజేస్తుంది; శత్రువులను నశింపజేస్తుంది; అర్జునుని ధనుస్సు ధరించింది; శ్రీరామునికి ప్రియవాదినిగా ఉండినది; యాత్రలు చేసే వారికి సౌఖ్యాన్ని కలిగిస్తుంది; కార్యాలు నిర్విఘ్నంగా సాగిస్తుంది;'' ఈ శ్లోకాలలో అర్జునుని ప్రసక్తి ఉంది గనుకను విజయుడనగా అర్జునుడు గనుకను విజయదశిమి అంటే అర్జున దశిమి అని అర్థం చేస్తారు కొందరు. ఇక్కడ శ్రీరాముని ప్రసక్తికూడా ఉంది గనుక శ్రీరాముని విజయాన్ని సూచించే పండుగంటారు కొందరు. క్షత్రియులు విజయార్థము చేసే పండుగ గనుక విజయదశిమి అనే పేరు వచ్చిందంటారు కొందరు. ఏది వాస్తవమైనా ఒకటే. పూర్వకాలంలో యుద్ధయాత్రలకు బయలు దేరేవారు వర్ష కాలంలో ఆగి ఆశ్వయుజమాసం రాగానే వర్షాలు వుండవు గనుక నవమినాడు ఆయుధపూజా, దశమినాడు శమీవృక్ష పూజ చేసి యుద్ధయాత్ర సాగించడానికి బయలుదేరేవారు. శివాజి మొదలయిన నూతనయుగమందలి వీరులు కూడా ఇటులనే చేసినట్లు చరిత్రలో కనబడుతుంది. ఇప్పుడు కూడా యుద్ధయాత్రలకు అవసరం లేకపోయినా జమీందారులు మొదలయినవారు తమ వంశములో ఉన్న సంప్రదాయాన్నిబట్టి నవమినాడు ఆయుధపూజచేసి దశమినాడు శమీపూజ చేసి యుద్ధయాత్రకు మారుగా ఆయుధములు ధరించిన పరివారముతోను చతురంగ బలముతోను తామున్నపట్టణాలలో ఊరేగింపు ఉత్సవం చేస్తారు; దర్బారు చేస్తారు. కొలువులో ఉన్నవారికి కట్నాలు కానుకలు ఇస్తారు. నజరానాలు పుచ్చుకొంటారు.

అరవలలో ఈ దసరాదినాలలో పాడ్యమి మొదలు దశమి వరకు ఇండ్లలో బొమ్మల కొలువు పెట్టే వేడుక ఆచారం బయలుదేరి ఆంధ్రదేశమందు కూడా ఎక్కువ వ్యాపించి ఉంది. ఇది స్త్రీలకు అందులో ఎక్కువగా దసరా పాటలు పాడుకుంటూ తిరిగే బడిపిల్లలకు ఆనందం కలిగించే పండుగ.

చైత్ర శుద్ధపాడ్యమినాడు — ఆంధ్రులకు ఉగాది పండుగ. ఆ నాడు ఆ కాలంలో కొత్తగా పూచి, కాచి, పండే వేప పువ్వు, మామిడిపిండెలు. చింతపండు మొదలయినవన్నీ కలపి పచ్చడిగా చేసి భోజనానికి ముందుగా తినాలి. దీనికే కొత్త కలియడమంటారు. ఉత్తర దేశస్థులకు పున్నమనుండి పున్నమకు నెల గనుక ఫాల్గుణ పున్నమనాడు సంవత్సరాంతము; ఆమరునాడు నూతన సంవత్సరారంభం గనుక ఆ పున్నమనాటి రాత్రి కామ

దహనం అంటూ కట్టెలు కాల్చి అక్కడినుండి తెచ్చు కొన్న నిప్పు పొయ్యిలో వేసుకొని ఆ కొత్తనిప్పుపై ఆ కాలమందలి కొత్తగా కాచిన చెట్ల పదార్థాలు వండుకొని తింటారు. ఏ పాడ్యమి అయినా చాంద్రమాసం బట్టి ఏర్ప డినది. అరవలకు సూర్యునిగతులను బట్టి ఏర్పడ్డ మాసాలు ముఖ్యమైనవి గనుక సూర్యుడు మేషరాశిలో ప్రవేశించిన దినం సంవత్సరాది. ఈ పండుగకు కూడా అల్లుణ్ని ఇంటికి తీసుకువచ్చి తలంటుస్నానం చేయించి కొత్తబట్టలుకట్టించే ఆచారం అరవలలో తప్పని సరిగా జరుగుతుంది.

ఈ పండుగలలో శైవులకు ముఖ్యమైనవి కొన్ని వైష్ణవులకు ముఖ్యమయినవి కొన్ని ఉన్నవి. స్మార్తులకు అన్నీ కావలసినవే. మహాశివరాత్రి వ్రతము శైవులకు ముఖ్యమైనది. ఇది బహుళ చతుర్దశీ దినమున జరుగు తుంది. ఆనాడు శివభక్తులందరూ పగలంతా ఉపవాస ముండి రాత్రంతా జాగరణం చేసి శివునికి అర్చనలు, భజ నలు చేస్తారు. అనంతపద్మనాభ వ్రతము వైష్ణవులకు ముఖ్యమైనది. ఇది భాద్రపదశుక్ల చతుర్దశీదినమున జరుగు తుంది.

విష్ణుని అవతారాలలో మత్స్య వరాహ కల్కి అవతా రాలకు కాక తక్కిన వాటికి సంబంధించిన పండుగలున్నవి. వాటికి జయంతులనిపేరు. వైశాఖ పౌర్ణమినాడు కూర్మ జయంతి, వైశాఖశుక్ల చతుర్దశినాడు నరశింహజయంతి, భాద్రపద శుక్లద్వాదశినాడు వామన జయంతి, చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామనవమి, వైశాఖశుద్ధ తదియనాడు పరశురామజయంతి, శ్రావణ బహుళ అష్టమినాడు కృష్ణా ష్టమి, వైశాఖ పౌర్ణమినాడు బుద్ధజయంతి విష్ణుభక్తులకు పండుగదినాలు, ఇవే కాక దత్తాత్రేయుని త్రిమూర్తుల అవ తారంగా ఎంచి మార్గశిర శుద్ధదశిమినాడు దత్తాత్రేయ జయంతి కూడా చేస్తారు.

పూజలన్నిటను విఘ్నేశ్వరపూజ ముఖ్యమయినది. ఏ వ్రతంచేసినా ఏ శుభకార్యము చేసినా ఏ పూజ చేసినా అది విఘ్నేశ్వర పూజతో ప్రారంభం కావాలి. అయినా ఒక దినం విఘ్నేశ్వర పూజకోసం నియమితమైనది. భాద్రపద మాస శుక్ల చతుర్థికి వినాయక చతుర్థి అని పేరు. వినా యకుడన్నా గణపతి అన్నా గణేశుడన్నా విఘ్నేశ్వరుడనే అర్థము. హిందూదేశమంతటా ఈ గణపతిపూజ ఈ దిన మున చేస్తారు. విఘ్నేశ్వరుణ్ని మూషికవాహనుడిగాను, లంబోదరుడుగాను, ఏకదంతుడైన గజముఖుడుగాను చేసిన మట్టివిగ్రహం పెట్టి పూజిస్తారు. ఇతడికి ఇష్టమని ఉండ్రాళ్ళు, జిల్లేడుకాయలు పిండివంటలుగా వండి నైవేద్యంగాఅర్పించి భుజిస్తారు. సనాతనధర్మాలను పాలించే వారు ఆనాడు మొదలుకొని తొమ్మిది దినాలు గణపతి నవరాత్రుళ్ళంటూ పండుగలు చేస్తారు. ఇవి విద్యార్థులు ఎక్కువగా పాటించే పండుగలు.

వారాలపేళ్లనుబట్టి కూడా కొన్ని నోములూ వ్రతాలూ ఉన్నవి. ఆదివారము అనగా ఆదిత్యవారము గనుక ఆ నాడు సూర్యుని ఆరాధించే వారున్నారు. కుష్ఠు మొదలైన చర్మరోగాలు సూర్యారాధన ప్రతీ ఆదివారం చేస్తే నివారించ గలవని, ఆ రోగాలు లేకపోయినా అవి కలుగకుండా ఉండడానికి చేయడం మంచిదని అంటారు. ఆదివారాలలో మాఘమాసమందలి ఆదివారాలపూజ ఎక్కువశ్రేష్ఠమైనదని అంటారు. సోమవారం చంద్రునివారం. చంద్రుడుఓషధులకు ఈశుడు. ఓషధులకు ప్రతినిధిగాను, వృక్షములలో గొప్పది గాను ఎంచి సోమవారాన రావిచెట్టుకుపూజచేస్తారు. దీనివలన బాలారిష్టాలు పోతవని నమ్మకము. ధర్మరాజు ఉత్తరచేత ఈ పూజ చేయించే సరికి ఆమె గర్భంలో అదివరకు చని పోయి ఉండిన శిశువు బ్రతికెనట. కార్తికమాసమందలి సోమవారాలు ముఖ్యమయినవి. మంగళవారమునాడు జరిపే వ్రతానికి మంగళగౌరీ వ్రతమనిపేరు. శ్రావణ మాసములో ప్రతీ మంగళవారంనాడు నూతన వివాహితలు మొదటి అయిదుసంవత్సరాలు విధిగా చేయవలసిన వ్రతం. పూర్వకాలంలో ఈ వ్రతము నూతనదంపతులు ఇద్దరూ చేసేవారు. ఈ కాలంలో స్త్రీలు మాత్రమే చేస్తున్నారు. దీని వలన స్త్రీలు వైధవ్యము పొందకుండా పుణ్యస్త్రీలుగా ఉంటారని నమ్మకము. బుధవారవ్రతము ఆపదలు కలిగి నప్పుడు చేయవలసిన వ్రతము. గురువంటే బృహస్పతి గనుక గురువార వ్రతము చేసేవారికి వాక్సిద్ధివిద్య లభించ గలవని నమ్మకము. శుక్రవారవ్రతానికీ వరలక్ష్మీవ్రతమని

పేరు. శ్రావణపూర్ణిమకు ముందరి శుక్రవారంనాడు ముఖ్యంగా స్త్రీలు మాత్రమే చేసే వ్రతము. శనివార వ్రత మన్నది శ్రావణమాసంలో ప్రతీ శనివారం శనికి చేసే పూజకు సంబంధించినది; ఈ వ్రతం ఇటీవల అంతగా ఎవరూ చేయడములేదు. ఈ కలియుగంలో తిరుపతి వెంకటేశ్వర్లను ముఖ్యదేవతగా ఎంచి శనివారం అతనికి శుభదినంగా భావించి శనివారంనాడు ఎక్కువగా వేంకటే శ్వర పూజాదీపారాధన చేస్తూ ఉంటారు.

ఇంకా, స్త్రీల నోములూ, వ్రతములూ చాలా ఉన్నవి. పెండ్లి అయిన పిల్లలు చిట్టిబొట్టు, ఉదయకుంకుమ, నిత్య శృంగారం, అట్లతదియ, మూగనోము మొదలయినవెన్నో చేస్తూ ఉండేవారు. ఇప్పుడవి ఎక్కడనో జరుగుతూ ఉన్నవిగాని సాధారణముగా కనబడడంలేదు.

మొత్తంమీద ఈ కాలంలో నమ్మకం కొద్దీ శ్రద్ధతో చేసే వ్రతాలు నోములు తగ్గిపోయినవి. వేడుకల కోసం, పిండివంటలకోసం, సరదాగా నలుగురూ చేరడంకోసం పాటించే పండుగలూ పబ్బాలూ మాత్రం కొన్ని నిలిచి ఉన్నవి.



# కేసరి విద్యాలయాలు

శ్రీ వి. వి. గిరి గారి అధ్యక్షతని, ఏప్రిల్ 16 వ తే॥న కేసరి విద్యాలయాల వార్షికోత్సవం జరిగింది. శ్రీ గిరిగారు దివాన్ బహద్దూర్ బండి శ్రీహరిరావు నాయుడుగారి చిత్ర పటాన్ని ఆవిష్కరిస్తూ ఆయన కర్తవ్య దీక్షను ప్రశం సించారు.

కేసరి విద్యాలయ సంఘాధ్యక్షులు, శ్రీ అల్లాడి కృష్ణ స్వామిగారు ప్రసంగిస్తూ, విద్యావ్యాప్తిపట్ల కేసరిగారి ఉదారత్వాన్ని, విశాలహృదయాన్ని వెల్లడించారు.

చెన్నపట్టణంలో అనేక తెలుగు కుటుంబాలు నివాస మేర్పరచుకున్నాయి. మద్రాసు ఆంధ్రుల సంతానానికి తగిన విద్యావసతి లేదనే చెప్పాలి. ఆలోటును తీరుస్తూ కేసరి విద్యాలయాలు ముందంజ వేస్తూండడం హర్షింపదగిన విషయం.

కేసరిగారు ఆశిస్తూన్న ప్రకారం మద్రాసు ఆంధ్రులకు ఒక ప్రత్యేక కళాశాల వెంటనే నిర్మించబడటం అత్యవసరం.

# బాలానందం

## ఉత్తమ పౌరులు

-: శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య :-

అల్లరి చిల్లరి మాటలు పలికి
కొంటెకాయ వనిపించుక వలదోయ్ !
అడిగేవారికి అడకువతోను
జవాబిచ్చుట- బుద్ధిమంతుని లక్షణమోయ్ !

కమ్మ కమ్మని గానము జేసెడి
కోయిల నెల్లరు మెత్తురుగాని;
చెప్పిన పలుకులు చెప్పుచుండెడి
చిలుకను మెచ్చేదెవరోయ్ !

బీదసాదలను
బేధముజూపక;
బీదల బాధల
దీర్పబూనెడి
కరుణాహృదయులు
కావాలోయ్ !

భావికాలమున
భారతమాయీ!
పేరు నిలిపెడి
ఉత్తమపౌరులె, కావాలోయ్ !

[హిందీ రచనకు స్వేచ్ఛానుసరణము]

## భిక్షగాడు

-: ఎ. కొండలరావు :-

చల్లనీ నాతల్లి మెల్లగా రావమ్మ
భిక్షమేయొతల్లి భిక్షగాడను.
రేషన్‌బియ్యమంటు రోషంపడకోతల్లి
కలిగినదానితో కలిగివేయుమమ్మ ॥ చల్లనీ ॥

పుష్టిగాలేను ముసలివాడనొతల్లి
కష్టించిపనిచేసి కష్టపడలేనమ్మ
దానధర్మాలు హెచ్చుగ జరుపుమమ్మ
దైవమే నీకు తోడ్పడునమ్మ ॥చల్లనీ ॥
బీదవారిని నీవు బ్రోవరావొతల్లి
ఉపకారముచేస్తేను ఊరికేపోదమ్మ
వీధి వీధి నేను వెళ్ళలేనమ్మ
విధివిలాసమిట్లుండె వ్యర్థు డనైతి ॥చల్లనీ॥

అభిమానముతో ధర్మంచేయుమమ్మ
సిరిసంపదలతో నీవు సుఖం పొందుతావమ్మ
చల్లనీ నాతల్లి మెల్లగా రావమ్మ
భిక్షమేయొతల్లి భిక్షగాడను॥



# కొల్లేరు సరస్సు

* "రాజేశ్వర్" *

బాలలూ ! మన హిందూదేశంలో దక్షిణమున కొల్లేరు సరస్సులని దేశపటంలో గుర్తించియుంటుంది. చూచారా? ఆ సరస్సునుగురించి పూర్వం ఓ చిన్న కథ యుంది: చెప్తాను వినండి. అక్కడ పూర్వం కొల్లేరు అనే గ్రామం యుండేది. ఆ గ్రామంలో వెయ్యి యిళ్ళకు తక్కువ లేకుండా యున్నాయి. ఆ గ్రామంలో అవధాన్లుగారంటే యెరుగనివారులేరు. ఒకమాటు అవధాన్లుగారు గొప్ప యజ్ఞం చేశారు. యక్షతలు కలపడానికి సమయానికి నీళ్ళు దగ్గరగా యుంచుకోలేదు. అక్షతలు కలిపితెమ్మని భార్య చేతికిచ్చేరు.

ఆమెను తొందరచేయగా ఆమె పెరట్లోకిపోయి ఏవో మురికి నీళ్ళతో అక్షతలు కలిపి తెచ్చియిచ్చింది. అవధాన్లుగారు అవి అగ్నిగుండంలో వేశేశారు. దేవతలకు ఈ అపచారం జరిగినందుకు పాపం పండిందని, ఇంకా పండాలని సకల ఐశ్వర్యాలను యిచ్చేశారు.

అవధాన్లుగారు యజ్ఞం చేసినదగ్గరనుండి మంచి ఐశ్వర్య వంతుడయ్యాడు. బంగారు తూగుటుయ్యాలలో ఊగుతున్నారు, ఆదంపతులు. 'అవధాన్లుగారి భార్య యెంత పతివ్రతురాలో యజ్ఞంచేసింది- బంగారు ఉయ్యాలలో ఊగుతున్నారు' అనుకున్నారందరూ. అవధాన్లుగారి భార్యదగ్గరకు వచ్చి ఆ యజ్ఞరహస్యం చెప్పమన్నారు. ఆమె ఇదివరకు తనుచేసిన సంగతి అందరికీచెప్పింది. అందరుస్త్రీలూ తమ భర్తలచే ఆ యజ్ఞం చేయించారు. అందరూ ఐశ్వర్య వంతులయ్యారు, బంగారు ఉయ్యాలల్లో ఊగుతున్నారు. పాపం బాగాపండింది. అగ్నిహోత్రుడు బ్రాహ్మణుడి వేషంలో పరీక్షించడానికి కొల్లేరుకొచ్చాడు. ప్రతి యింటింటికివెళ్ళి "అమ్మా- బ్రాహ్మణుడ్ని, కాస్త దాహం తీర్చుకోనివ్వండి" అన్నాడు. ప్రతివారూ 'మాకు తీరుబడిలేదు- ఇవ్వలేమ'ని బంగారు ఉయ్యాలల్లో ఊగుతూ కూర్చున్నారు. ఆ బ్రాహ్మణుడు తిరిగి తిరిగి ఊరి అవతల బ్రాహ్మణుడి యింటికి వెళ్ళాడు. "అందరూ యజ్ఞంచేసి బంగారు ఉయ్యాలల్లో ఊగుతూ ఉంటే నువ్వేం ఇంకా ఆ యజ్ఞం చెయ్య"వని అడిగేడు, అందుకా బీదబ్రాహ్మణుడు "మురికినీళ్ళతో అక్షతలు కలిపి అగ్నిహోత్రుడికి అర్పించి పాపం ఒడిగట్టుకోమన్నారా. అటువంటి ఐశ్వర్యం అక్కర్లేదు. ఉన్నదాంతోటే తృప్తిచెందుతా"నని ఆక్రొత్త బ్రాహ్మణ్ని ఆహ్వానించి భోజనానికి మడికట్టుకోమన్నాడు. వెంటనే ఆలస్యం చెయ్యకుండా ఆ ఆహారంతో బయలుదేరమన్నాడు క్రొత్తబ్రాహ్మణుడు.

ఆ బీద బ్రాహ్మణుడికి యేమీ అర్థం కాలేదు. అతని మాట కాదనలేక వెంటనే బయలుదేరాడు. తమ కాళ్ళలో శక్తియున్నంతవరకు పరుగులుతీశారు, ఆరు క్రోసులదూరం ఒచ్చి ఆగారు. ఎందుకిలా ఒచ్చేమని అంటే ఆ క్రొత్త బ్రాహ్మణుడు 'అటు చూడండి' అని మాయమయ్యాడు. పెద్దగాలులు వీచాయి. కొల్లేరు అంటుకొని అగ్నిజ్వాలలు బయలుదేరి మంటలు కనబడుతున్నాయి. తుపాను చెలరేగింది. ఉరుములు మెరుములు మెరుస్తున్నాయి. ఒక్కొక్కసారి ఆ కొల్లేరు గ్రామం భూమి కంపించి లోనికి పోయింది. ఆజాగాలో వర్షపునీరు చేరుకొని సరస్సుగా మారింది, దాన్నే కొల్లేరు సరస్సు అంటారు. ఇప్పటికీ చీకటిపడితే ఆ ప్రాంతానికి యెవ్వరూ వెళ్ళరు. వారు పిశాచాలై అక్కడ తిరుగుతూ మరికొంతమంది ఆ సరస్సులో జలగలయి ఉన్నారు. అవి కరచేయంటే బ్రతకడం చాలా కష్టం. మనకు కనిపించే లక్షాధికార్లు, కోటీశ్వర్ల ఐశ్వర్యం శాశ్వతంకాదు. పాపం పండి రోజులు పడ్తాయి. కొల్లేరు ఒచ్చి కొట్టుకుపోతుంది.



విద్యార్థి:— నాకు సున్నా మార్కులు ఇచ్చారేమండీ ?

మేష్టారు:— నీకు సున్నా కంటే తక్కువమార్కులు ఇవ్వలేక సున్నా ఇచ్చాను !




# మట్టినుంచి మాణిక్యాలు

శ్రీ "భాస్కరాచార్య"

మామూలు మనుష్యుల కంటికి వట్టి చెత్తగా కనిపించేవి వైజ్ఞానికుల దృష్టిలో అమూల్యమైనవిగా ఉంటాయి. చెత్త-చెదారం నుంచి వైజ్ఞానికులు మానవకోటికి అనేక విధాల ఉపయోగ కరములైన ఎన్నో వస్తువిశేషాలను సృష్టించారు. సృష్టించుతున్నారు. సృష్టిస్తారు కూడా!

పెట్రోల్‌ను నూతులనుంచి త్రవ్వి తీసేటప్పుడూ పైకి కనబడేటంతవరకు ఈ పెట్రోల్‌ను యంత్రాలతో తోడి వేస్తారు. పూర్వం రోజులలో అయితే పైకి నూనె కనబడక పోతే ఆ నూతిలో ధార ఇంకి పోయిందనుకుని ఇంకో చోట త్రవ్వడం మొదలు పెట్టేవారు. నిజానికి సగానికి పైగా పెట్రోల్ భూగర్భంలోనే దాగి ఉండేది. ఇప్పుడు అలాంటి నూతులనిండా నీరు నింపుతారు. ఈ నీటిలో సింథెటిక్ సబ్బును బాగా కలుపుతారు. వెంటనే బోలెడంత నూనె ఊరడం ప్రారంభిస్తుంది. ఇంకొక రకం రసాయినిక ద్రవ్యాన్ని ఉపయోగించడంవల్ల మంచినీటి గొట్టాలు, ఇంజన్లు తుప్పుపట్టకుండా చేయగలుగుతున్నారు.

పెట్రోల్ పరిశ్రమ ప్రారంభమైన రోజులలో భూగర్భంలో సహజంగా దొరికే బొగ్గు వాయువు వ్యాపారులకు ఒక పెద్ద పీడగా తయారైంది. అందుచేత ఈ వాయువు దొరికే పెక్కు నూతులను పాడు పెట్టేశారు. ఇంక ఈనాడు ఈ 'గాలే' గొట్టాలద్వారా అనేక కోట్లమందికి అందచేయబడుతోంది.

పూర్వం వంటుచెరుకుగా నేలబొగ్గును ఉపయోగిస్తుండే వారు. ఈ నేలబొగ్గును త్రవ్వి తీసేటప్పుడు దొరికిన వాటిల్లో బొగ్గు మినహా మిగతావన్నీ ఎందుకూ పనికి రావనుకుని పారవేసేవారు. ఇంక ఇప్పుడో వైజ్ఞానికుల పుణ్యమా అంటూ బొగ్గు పొగలోనుంచి సైతం అనేక రకాల మందులు, ముద్దినుసు రంగులు, సెంట్లు ఎన్నో తయారు చేస్తున్నారు.

మనవాళ్ళకి రంపంపొట్టుని పొయ్యిలో వేసుకోవడం తప్ప ఇంకే ఉపయోగమూ తెలియదు. కాని ఇందులో నుంచి ఇప్పుడు పరిశ్రమలకు ఉపయోగపడే సారాయిని తయారుచేస్తున్నారు. దీనిని ఉపయోగించి అమెరికాలో ఒక వైజ్ఞానిక సంస్థ—వర్జీనియావారి టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్—అనుకుంటాను—దాదాపు 200 రకాల అట్టలను తయారుచేస్తున్నది. ఈ అట్టలు గోడల నిర్మాణానికి దివ్యంగా ఉపయోగపడుతుంది.

చెరుకు తియ్యగా వుంటుంది కనుక నమిలి రసాన్ని పీల్చి పిప్పిని పారవేస్తాము. రైతులు చెరుకు గానుగలలో వంటుచెరుకుగా ఉపయోగిస్తారు. కాని వైజ్ఞానికుల దృష్టిలో దీని విలువ అమూల్యం. దీనితో కొన్ని రకాల ప్లాస్టిక్‌నే కాకుండా గృహనిర్మాణానికి ఉపయోగపడే మరికొన్ని వస్తువులను తయారు చేస్తున్నారు.

ఫల పరిశ్రమలో పూర్వం నారింజ తొక్కలను, ద్రాక్ష తొక్కలను అవతల పారవేసేవారు. ఇప్పుడు వీటిని రసాయినిక వేత్తలు మేలిరకం పశుగ్రాసంక్రింద, పంటచేల ఎరువులక్రింద, రూపాంతరం చేయడంతో బాటు, ఎంతో ఖరీదైన ఎస్సెన్సులను కూడా వీనినుంచి తయారుచేస్తున్నారు

# విజ్ఞానపు వేయి పడగలు

చుట్టలు చుట్టుకోగా మిగిలిన పొగాకు కాడలను మనం అవతల పారవేస్తాము. కాని దానినుంచి వైజ్ఞానికులు క్రిమిహారములైన ఔషధాలను తయారు చేస్తున్నారు. వడ్ల ఊకనుంచి అట్టలు, సిమెంటు బ్లాకులు తయారు చేస్తున్నారు. ఇంటర్నల్ కంబశ్చన్ ఇంజన్ లోపలి భాగాలలో బొగ్గు పేరుకొని పోకుండా చేయడానికి, పేరుకొని పోయిన బొగ్గును తుడవడానికి దీనిని ఉపయోగిస్తున్నారు.

పరమాణుశక్తి పరిశోధనల ఫలితంగా వెలువడి, నిరుపయోగకరమైనవని వదలిపెట్టబడిన రేడియో ధార్మిక శక్తిగల పదార్థాలకు వైజ్ఞానికులు ఇప్పుడు కొత్త ఉపయోగాలు కనిపెట్టారు. మాంసానికి ఇట్టిపదార్థాలనుంచి వెలువడే రేడియో ధార్మిక శక్తిని కొంతవరకు పట్టిస్తే అది అనేక వారాల తరువాత కూడా కుళ్లిపోకుండా తాజాగా ఉంటుందని నిర్ధారణ చేశారు.

ఫాస్ఫేట్‌లను తయారు చేసే యంత్రాగారాలలో మిగిలిపోయిన తొక్కును యురేనియం ముడి ఖనిజంగా ఉపయోగించడానికి ఇప్పుడు దాస్తున్నారు. ఈ యురేనియం నుంచే పరమాణుశక్తిని ఉత్పత్తి చేస్తారని అందరికీ తెలుస్తుంది.

కొండలను పిండి చెయ్యడంవల్ల మిగిలిపోయే చలవరాయి దుమ్ము చుట్టుప్రక్కల వాళ్లందరికీ ఒక పీడగా ఉండేది. ఇప్పుడు దీనినుంచి ఇంటికప్పులు, టాయిలెట్ సామానులు, జిగురు, వినోలియం, గోడకాగితాలు అన్నీ తయారు చేస్తున్నారు.

సిమ్మెంటు ఫాక్టరీలనుంచి చుట్టుప్రక్కలకు ఎగిరిపోయే దుమ్ములో పొటాష్ హెచ్చుగా ఉందని ఇప్పుడు కనుగొనబడింది. అందుచేత పంట పొలాలకు ఎరువుగా దీని ఉపయోగం అనుపమం.

ఇంక గుడ్డపేలికలనుంచి, గడ్డి తుక్కునుంచి రకరకాల కాగితాలు తయారు చేస్తున్నారన్న సంగతి అందరికీ తెలిసిందే. పాత టెలిగ్రాఫ్, టెలిఫోన్ స్తంభాలనుంచి, చివికిపోయిన చెట్లనుంచి కొత్తరకం నూనెలను తయారు చేస్తున్నారు. ఈ నూనెలతో ఖరీదైన సబ్బులు, క్రిమిహారౌషధములు, వాసనలను హరించే మందులు తయారు చేస్తున్నారు.

కలపలో కానవచ్చే అగ్నినుంచి యాసిటిక్ యాసిడ్, పంచదారలు, సారాయిలు, పశుగ్రాసం తయారు చేయడానికి పరిశోధనలు జరుగుతున్నాయి. మట్టినుంచి మాణిక్యాలను, తుక్కునుంచి అమూల్యమైన సంపదలను సృష్టించడానికి వైజ్ఞానికులు సర్వతోముఖంగా సాగిస్తున్న కృషిని రేఖా మాత్రంగా సూచించడం ఈ వ్యాస లక్ష్యం.



# క్షామనివారణకై స్త్రీల కృషి

రాయలసీమ క్షామప్రాంతాలలో పర్యటించి, క్షామనివారణకు కేవలం తాత్కాలికం కానట్టి, గౌరవనీయంగా ఏదో ఒక గృహపరిశ్రమను నేర్చుకుని, తన్మూలంగా తమ గంజికి కావలసిన నాల్గు డబ్బులు సంపాదించుకునేటందుకు సాయపడేటట్టి, నిర్మాణాత్మకమైన క్షామనివారణ కేంద్రాలను స్థాపించు నిమిత్తం—శ్రీమతి దుర్గాబాయమ్మ గారిని ప్రధాని నెహ్రూ నియమించడం, అందుకుగాను తన క్షామనివారణ నిధినుండి రూ. 50,000/- ఆమె స్వాధీనము చేయడం, మా పాఠకు లెరుగుదురు. ఈ మొత్తంతో, చిత్తూరు, కర్నూలు జిల్లాలలో ప్రారంభింపబడ్డ కేంద్రాలు, రాష్ట్రమహిళా సంక్షేమ శాఖవారి సహాయంతో, ఉపయుక్తంగా పనిచేయుచున్నవి.

ప్రస్తుతం చిత్తూరుజిల్లా వేపంజేరి, కార్వేటినగర్, రేణిగుంటలలో మొత్తం ఆరు కేంద్రాలు బాగా పని చేస్తున్నవి. త్వరలో కర్నూలుజిల్లా కంభం, మార్కాపురం పట్టణాల్లో మరిరెండు కేంద్రాలు పని ప్రారంభిస్తవి. నగరి, నింద్ర కేంద్రాలలో పని సుమారుగా జరుగుతున్నది.

అన్నార్తులు పొట్టపోసుకోడానికి వీలుగా ప్రతికేంద్రం వీరికి ఏదో ఒక విధమైన పని చూపిస్తున్నది. ముసలివారికి, గర్భవతులకు విస్తళ్లు కుట్టడం, లేపుచేయడం వగైరా తేలికపనులు వైద్యసహాయం ఇంకా ఇతరులకు గ్రామ, గృహపరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుతున్నది. ప్రతి కేంద్రంలో రమారమి 100 మంది ప్రజలు ధనసహాయం పొందుతున్నారు.



# చిత్రంలో విచిత్రం

* శ్రీమతి దేవరకొండ రాధాబాయ్ *

శ్రీ కృష్ణాలో కాలుబెట్టాను. అది 'బాబుల్' సినిమా అనుకుంటాను బహుశః. బహుశా ఏమిటి నా నెత్తి? బాబుల్ మాత్రం నిజం! ఆ ఫిలింపేరు మరి నేనీ జన్మలో మరిచిపోలేను. అసలు మరిచిపోకూడదు! అదంతా నా హృదయంలో నాటుకుపోయింది. నాటి సంఘటన, మరి పైకి సరదాకైనా రాకుండా చేసింది.

అంటే దీన్ని బట్టి 'బాబుల్' ఆకర్షణీయమైన సినిమా అని అర్థం కాదుసుమండీ! అది అట్టే మంచిసినిమా కానట్టేవుంది నా మట్టుకి. కానట్లే వుండడమేమిటి నా నెత్తి? అసలు నాకా సినిమా కథ బోధపడితేనా?....పోనీ బాగో ఓగో చెప్పడానికి! దానికి సంగీతం నౌషద్ అని మాత్రం తెలుసు. అంతే! అందరికీ సహజమేగా తెలియడం? అల్లాగే నాకూ తెలుసు.

అసలారోజు నాకా బాబుల్ కథ ఎంచేత బోధపడలేదూ అంటే, ఆ వేళ నాకైనటువంటి ఒక వింత అనుభవమే కారణం. 'వింత అనుభవం' అనగానే ఏ ఆడదో కనబడి నన్ను ప్రేమించేసిందని తరువాతేదో రొమాన్సు జరిగిందని మాత్రం అనుకోకండి! అల్లాంటిదేమీ జరగలేదు. మొత్తాని కావేళ నాకు దవడపళ్లు రాలినట్లయింది, ఎవ్వరూ నామీద చెయ్యి జేసుకోకుండానే! అంటే ఆ అరవసోదరుడు హృదయంలో బాణాల్లా దూసుకు పోయినట్లు ఒక్కమాట విసిరేశాడు! అదే అంతపని చేసింది!

నేను కుర్చీలో కూర్చున్నాను. సినిమా మొదలెట్టలేదు. ఫస్టు బెల్లుమాత్రం అయినట్లుంది. అయిందనుకుంటాను. నా ప్రక్కనే ఒక అరవ్వాడు కూర్చున్నాడు. క్షమించాలి. అరవ్వాడూ అని అనడం న్యాయం కాదు. 'అరవసోదరుడు' అని అనితీరాలతన్ని. కారణం ఏమిటంటే అతనంత పని చేశాడావేళ.

అతను తన ప్రక్కనున్న మిత్రులతో ఏదో మాట్లాడేస్తున్నాడు. కొద్దిగా తెలుగు మాట్లాడ్డం కూడా వచ్చునేలెండి. అవతల్నుంచీ తన ప్రక్కనున్న వారితో అరవం, ఇవతల నాతో తెలుగూ ధారాళంగా మాట్లాడుతున్నాడు. నాకూ హాస్కుకొట్టడానికెవరూ లేకపోయారు. అంచేత నేనే అతనితో హాస్కుకి లంకించుకున్నాను.

'మీరింతకుముందు బాబుల్ చూశారా?' అన్నాను.

'చూశాను'

'ఎక్కడ?'

'తిరువాన్‌కూర్‌లో'

'ఎన్నిసార్లు చూశారు?' అన్నాను.

'ఇది పన్నెండోసారి!' అన్నాడు నొక్కి నొక్కి—

ఇప్పుడు నేనతనికి వేసిన ప్రశ్నలన్నిటికీ అతను తెలుగులోనే జవాబు చెప్పాడు లెండి. అంటే అంత స్వచ్ఛమైన తెలుగుకాదు. కాఫీ హోటల్సు అయ్యర్లలాగే మాట్లాడాడు. అలా సొట్టభాషతోనే తడాఖా తీసేశాడు. తడిగుడ్డ

## చిత్రంలో విచిత్రం

తోనే పీకనొక్కాలన్నారు పెద్దలు. సినిమా మొదలెట్టడానికింకా కొన్ని నిమిషాలే టైముంది. అంటే రెండో బెల్లు ప్రయోగించ బడ్డదన్నమాట.

'మీ స్వగ్రామమేదండీ ?' అన్నాను. ఉండీ ఉండీ ఇంక తన స్వంత విషయాల్లోకి దిగాను.

'తిరువాన్కూరే !' అతనన్నాడు.

'బిజినెస్‌మీద వచ్చారా ?'

'ఔను'

ఇంక 'ఆఖరుప్రశ్న' చూడండి. ఎందుకురా నాయనా అడిగానూ అనిపించింది. తడాఖా తీసింది. తాతల్ని జ్ఞాపకానికి తెచ్చింది. ఇంక మరల్లాంటి ప్రశ్నలు అడక్కూడదనిపించింది.

అయినా నా బుద్ధితక్కువ. వాడసలు అరవ భాయీ అని తెలిసీకూడా అడగడమేమిటి ? అంచేతనే ఠొంకి వాయగొట్టాడు.

'మీరు అరవాళ్లా ? మేము మాత్రం తెలుగువాళ్లం' అన్నాను. నేను తెలుగువాడినే నని ముందే ఎందుకు చెప్పాల్సొచ్చిందంటే, అతను తిరిగీ 'మీరో ?' అని ఎదురుప్రశ్న వేయడని.

'మనం భారతీయులు. అదేచాలు. అంతే !' అన్నాడు కొంచెం నొక్కినొక్కి కఠినంగా— నేను అతనికేదో సమాధానం చెప్పేలోగా అతను మళ్ళీ అందుకున్నాడు—

'మనం భారతీయ సోదరులమని తెలుసా మిత్రమా ! అరవ్వాడూ, తెలుగువాడూ అన్న భేదం పెట్టుకున్న వాడివి నువ్వేమొహంతో రాష్ట్రం సాధిస్తావ్ ?'

ఇంకా అతనికి నేనేదైనా సమాధానం చెప్దామనుకునేలోగా అతనే లంకించుకున్నాడు-

'నీలాగే భేదాభిప్రాయంతోనే మీ స్వామి సీతారాం ప్రాయోపవేశాలు చేస్తున్నారా ?' అన్నాడు. ఈ మాటతో నిజంగా ప్రాణాలు పోయినాయ్.

అతని కప్పటికీ ఏదేనా చెప్దామనుకునేలోగా సినిమా ప్రారంభం !

ఇది బాబుల్ చిత్రంలోని 'ఆంధ్రమహిళ' కు పంపుతున్న విచిత్రం—

(మా మేనమామ డైరీలోంచి సంగ్రహణ)



## యుగవాణి

పురుషు లధికులు ధరణి పూబోండ్లకన్న
శాస్త్రములు గాంచుడీను వారి చాందసంబు
మబ్బువిడునట్లు విడగొట్టు మంచిగానె
మహిళలందరు చైతన్యమాత్ర మింగ !
పొత్తమెట్టిదో తెలియని పూవుబోండ్లు
దేశ దేశాల విషయాలు తెల్సుకొనగ
పూర్వ ధర్మాలయందున్న బూజు దులిపి
నరులు నారులు సమమని నమ్మ నిజము !

పతికి....సుతునకు....తండ్రికి....బానిసవలె
ఉచ్చ నీచాలువిడనాడి యూడిగంబు
బ్రతికినన్నాళ్లు చేయుటే పడతిధర్మ
మనెడి శాస్త్రాల ఖండించి మహతిగాంచు !
దాసిగాదని మదిలోన దార నెరిగి
మగడు మగువతో సఖ్యతన్ మసలుకొనుట
విశ్వమానవ కళ్యాణ విధ మటంచు
పల్లెప్రజలకు నిత్యంబు పనసజెప్పు !



—వి. యస్. ఆర్. నాయకమ్మ.

## సినీమాలలో స్త్రీలు.... (42 వ పేజీ నుండి)

ప్రార్థిస్తాడు : ప్రార్థించి నోరు కట్టెయ్యమని అడుగుతాడు. "ఆడదానినోరు కట్టెయ్యడమే నాచేతగాని పని'' అంటాడు. బ్రహ్మదేవుడు. పెళ్ళిచేసిచూడు నిర్మించిన నిర్మాతలకు, స్త్రీల ఎడ చాలా తేలిక అభిప్రాయం వున్న దని చెప్పటాన్కి యింతకంటే వేరే ఉదాహరణ అవసరం లేదు. స్త్రీల సమస్యను ఎందుకీవిధంగా చిత్రించాలి? అందరము ఆలోచించతగ్గ విషయం, ఇది.

అసలు సంగతి ఏమిటి? నేడు సమాజంలో స్త్రీ పరాధీన స్థితిలో వుంది. ఆర్థికంగా, మానసికంగా, నైతికంగా కూడా అణచబడివుంది. జాతిలో సగభాగం అంధకారంలో వుంది. ఈ నాటికి స్త్రీలకు వారసత్వపుహక్కులు, స్త్రీ పురుషులకు సమానన్యాయం, వివాహ స్వాతంత్ర్యాలు లేవు. రావు కమిటీబిల్లు సనాతన "సైంధవుల'' చేత, ఈ నాటికీ ఢిల్లీపార్లమెంటులో అడ్డగించబడుతూనేవుంది. వీరేశలింగంగారి వుద్యమం ఇంకా కొనసాగించాల్సివుంది. స్త్రీలయొక్క స్థితి ఈ విధంగా వుండగా "తాము ఆర్థికంగా. స్వాతంత్ర్యంగా, వుండకుండా, తమ విలాసాలకు, వినోదాలకు బాధ్యతారహితంగా, తమ భర్తలను, వేపించుకొనితినే, ఏ కొద్దిమందినో తీసుకువచ్చి, స్త్రీ జాతి నంతటినీ అవహేళనచెయ్యడం, స్త్రీలకు నోరు యిస్తే ప్రళయాంతకం అని చిత్రించడం చాలా దారుణమైన విషయం.

"అంగనల నమ్మరాదు"—స్త్రీబుద్ధిః ప్రళయాంతకః— అన్న సామెతలకీ, "ఓ బ్రహ్మయ్యా" అన్నఅంతర్నాటికకు ఇతివృత్తం ఒకటే. ఆడదాన్ని నమ్మగూడదు. ఆడదాన్కి స్వాతంత్ర్యం యిస్తే లోకం తలక్రిందులౌతుంది. అనిచెప్పే ఈ అభివృద్ధి నిరోధక భాష్యాలు ఈ కాలంలోకూడా రావడం చాలా ఆశ్చర్యకర విషయం,

అందుచేత కామప్రవృత్తిని రెచ్చగొట్టే ఉపకరణంగా కాని, అభివృద్ధినిరోధక భావాల పుట్టగాగాని స్త్రీని ప్రదర్శించడం, స్త్రీల ఉద్యమాన్ని పరిహసించడం, న్యూనత పరచడం మాత్రమే అవుతోంది.

ఫేసుపౌడర్లు, లిప్‌స్టిక్, హ్యాండుబ్యాగ్ ఉపయోగించడం నేర్చుకొన్నంత మాత్రంచేత స్త్రీలు సాంఘికంగా, ఆర్థికంగా విముక్తి పొందనూలేదు.

వారిలో రావలసినంత విజ్ఞానం, సంస్కృతి రానూలేదు. సహజనిర్మాణములో సగభాగం పంచుకునే చైతన్యము రానూలేదు. అట్టి చైతన్యాన్ని, ఆత్మగౌరవాన్ని స్త్రీలలో యింకా పెంపొందించాల్సివుంది. అందుకు నేటి సినిమాలలో ఈ చవుకబారు ఆకర్షణ పద్ధతులు మానెయ్యాలి. మానేసేటట్టుగా అందరు చూడాలి. ఈవిషయంలో సినిమాలలో నటిస్తున్న విద్యావతులైన వారిమీద ఎక్కువ బాధ్యత వుంది. తరువాయి బాధ్యత సినిమాలు చూసే మీరు—మేము అందరి స్త్రీ పురుషులమీదా వుంది.



## తణుకు శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజం

పై సమాజం 19 వ వార్షికోత్సవము ది 8-5-52 గురువారం మద్రాస్ హైకోర్టు జడ్జి కీ॥ శే॥ వింజమూరి గోవిందాచారిగారి సోదరీమణి శ్రీమతుల భాగ్యలక్ష్మమ్మగారి అధ్యక్షతను అతివైభవముగా జరిగెను. నర్సాపురం సబ్ కలెక్టర్ శ్రీ ఆర్. కృష్ణస్వామి రావుసాహెబ్ ఐ.సి.యస్.గారు సభా ప్రారంభము చేస్తూ బేసిక్ విద్యా విధానావశ్యకతనుగూర్చి ముచ్చటించి సమాజములో జరుగుచున్న వివిధ కార్యక్రమమును ప్రశంసించిరి. "గాంధీ వాదమా – సామ్యవాదమా" హిందూదేశమునకు సరి అయినది అన్న విషయముపై హిందీ వాక్ స్పర్థలలో గెలిచిన విద్యార్థినులకు "రాయలసీమ కరువు" అన్న తెలుగు వ్యాసపోటీ, రాట్నం పోటీలలో నెగ్గిన వారికి బహుమతులు పంచిపెట్టిరి. కార్యదర్శి శ్రీమతి మంత్రిప్రగడ వరలక్ష్మమ్మగారు కార్యదర్శి నివేదిక చదివిరి. సభను దిగ్విజయముగా జరిపించవలెనని పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టర్ శ్రీ జె. పి. యల్. ద్వీన్ మొదలైనవారు శుభ సందేశములు పంపిరి. కార్యదర్శి శ్రీమతి వరలక్ష్మమ్మగారి అభివందనములతో సభ జయప్రదముగా ముగించబడినది.

– దే. సత్యవతమ్మ.




## ఆచార్య శ్రీ శంకరులు

(జీవిత చరిత్ర)

రచన: శ్రీ పురాణపండ రామమూర్తి,

ఆధ్యాత్మ ప్రచురక సంఘం, (ఆలమూరు—తూ.గో.జిల్లా)

వారి ప్రచురణ

వెల. రు. 0—4—0.

* * *

## ....శ్రీ....

చిన్న కావ్య సంపుటి.

శ్రీ సాహితీ వాహిని, (పసలపూడి, రామచంద్రపురం, తూ. గో. జిల్లా) వారి ప్రచురణ.

ప్రతులు కావలసినవారు పై చిరునామాకు వ్రాసి ఉచితంగా తెప్పించుకోవచ్చును.

* * *

## ఎచ్చటికో యీ?

"కావ్యం కాదన్న స్మృతి శబ్దరూప చిత్రం"

శ్రీ చదలవాడ పిచ్చయ్య,

సంస్కృతీ ప్రచురణలు, విజయవాడ, వారి ప్రచురణ.

పలయువారు:— సెంట్రల్ బుక్ షాపు, మెయిన్ రోడ్, విజయవాడ-1 అని వ్రాయాలి. వెల రు 0—4—0

* * *

## మన ప్రధాని నెహ్రూ (జీవిత చరిత్ర)

రచన:- "సింహగురు"

జాతీయ జ్ఞానమందిరం, 5-ఏ, మాబ్రేస్ రోడ్, మద్రాసు-14

వారి ప్రచురణ.

వెల పన్నెండణాలు.

* * *

## కన్నీటిజాలు

"స్ఫూర్తిశ్రీ"

విపంచికా ప్రచురణ, కాకినాడ.

మూల్యం: రు. 1—0—0

ఛందోబద్ధమైన పద్యరచనకంటే, ధారావాహినిగా-అనర్గళంగా-ప్రవహించే మరో గద్యంకంటే, (గొప్పతోకల్లా) చిన్న చిన్న పరిమాణాల్లోని భావకవిత్వాలకి ఈరోజుల్లో ఎక్కువ ప్రాముఖ్యంవుంది. ఇది అభ్యుదయమే కావచ్చు-కాని ఒకరి రచనకీ మరొకరి రచనకీ ఎక్కడా వ్యత్యాసం లేకపోతే మాత్రం బావుండదు. ఉదాహరణకి ఈ "కన్నీటిజాలు" లోని:

"ఏమంత యవసరం వేళ్ళతనే, మ్రోగె
ఎనుబోతు మెడలోని యినుపగంట"

ఈ వరుసల్లో శ్రీ శ్రీ స్పష్టంగా కన్పిస్తాడు.

"ఏడ్చేదను నాలు దిక్కులు నేడ్చునట్లు
ప్రకృతి యెల్ల నాతో గూడిపట్టరాక"

...ఇందులో కృష్ణశాస్త్రి ఆక్రందన ప్రతిబింబించివుంది. వీలైనంత వరకు నూతన భావాలతో తొణికిసలాడే నవ కవిత్వాలను అందరూ ఆదరిస్తారు.

* * *

## సిరుమారా సాహసము.

పిల్లల పుస్తకం.

రచన:- "శ్రీ హరి"

ప్రకాశకులు:- బుక్ మన్స్— మద్రాసు-7

వెల: పన్నెండణాలు.

ఇందులోని కథావస్తువుకోసం పిల్లలందరూ చాలా ముచ్చట పడతారు. కాని శైలిలో మాత్రం ఇంకా, వారికి తేలిగ్గా, అర్థమయ్యేట్టుగా సులువైన మాటలు వాడివుంటే బాగుండేది... పుస్తకం పేరు పెట్టేటప్పుడుకూడా జాగ్రత్తగా ఆలోచించవల్సి వుంటుంది. 'సిరుమారా సాహసము' అని పిల్లలు ఒక గుక్కలో తేలిగ్గా పలకలేరు. పిల్లలు పన్నెండణాలు పెట్టి కథ పుస్తకాలు కొనడం కష్టం. ఈ పుస్తకం అట్ట ముద్రణ, లోపల రంగు బొమ్మల ముద్రణ బాగుంది. పిల్లలకు అందమైన పుస్తకాలను అందజేయడానికి పూనుకున్న బుక్ మన్స్ వారు అభినందనీయులు. ముందు ముందు కూడా పిల్లల సాహిత్యంపట్ల వీరు సక్రమమైన సేవ సాగిస్తూ వుండాలని కోరుతున్నాం. —కె.యస్.గిరి.

Edited & Published by, G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by Mrs. A. C. Krishna Rao, M.A.,L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Madras-4

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో

భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6—0—0 .... సీనియర్ తరగతికి రూ. 9—0—0

నృత్యోపాధ్యాయిని:

శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీత శాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8—0—0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13—0—0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7—0—0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11—0—0

సంగీతోపాధ్యాయిని:

శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

Regd. No. 4759

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్, మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

వస్త్రములపై అద్దకపుపని : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ : స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మించబడుచున్నది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.



# ఆంధ్ర మహిళా ప్రెస్

అంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది

## ఆంధ్ర మహిళా ప్రెస్

ఇక్కడ

గ్రంథములు. కరపత్రములు, రసీదులు, ఆహ్వాన పత్రికలు మొదలయినవన్నీ

తెలుగు, ఇంగ్లీషు భాషలలో ముద్రించబడును.

విద్యార్థినులకు ప్రెస్ పనులు నేర్పటానికి క్లాసులుకూడ ఏర్పాటు చేయబడినది

*

మీ అచ్చుపనులు ఆంధ్ర మహిళా ప్రెస్‌లో చేయించితే

సంస్థకు సహకరించిన వారవుతారు.

○

ఇతర వివరములకు : ప్రెస్ మేనేజరు, ఫోన్ నెం. 86322

14, ద్వారక, మైలాపూరు, మద్రాసు-4

---

## ఆంధ్ర మహిళా సభ

స్త్రీల విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థికోన్నతికై 10 సం॥ పైగా

కృషి చేయుచున్న జాతీయ సంస్థ

ఇందు

| | |
|---|---|
| విద్యాశాఖ | ఆంధ్రమహిళ పత్రిక |
| పారిశ్రామికశాఖ | నర్సింగ్ హోమ్ |
| కళాశాఖ | ముద్రణశాఖ |

సారస్వత, క్రీడా, గ్రంథాలయ, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా జేరి యీ సేవాసంస్థను పోషించండి

—ఆంధ్ర మహిళా సభ.

త్వరలో వస్తోంది



ఈస్టిండియా ఫిలిం కంపెనీ వారి

# సంక్రాంతి

డైరెక్టర్ :
సి. పుల్లయ్య




సంపుటి 9 :: జూలై '52 :: సంచిక 3

# ఎట్టకేలకు !!

రమారమి 10 సంవత్సరాలుగా సర్వత్ర వ్యాపించియున్న ఆహారపదార్థాల కరువుతో, న్యాయ బద్ధంగా, తృప్తికరంగా, అమలు జరుగని ప్రభుత్వ ఆహార రేషనింగ్ విధానంతో, విసిగివేసారి యున్న ప్రజా హృదయంలో, యీ రేషనింగ్ రద్దుకావడం, శనిగ్రహ విముక్తి కలిగినంత హర్షాన్ని కలిగించింది. ఇందుకు ఎక్కువ సంతోషించేది స్త్రీలే కూడా.

ఈ రేషనింగ్ విధానంవల్ల ముఖ్యంగా మధ్యతరగతి స్త్రీలు పడ్డ పాట్లు వర్ణనాతీతములని చెప్పాలి—అటు పెద్దయింటివారివలె యితర పదార్థాలు కొనే సమర్థతాలేక, ఇటు పనిపాట్ల వారివలె ఏ గంజో, అంబలో త్రాగి కాలము గడుపుకునే సమర్థతాలేక, రేషను షాపులలో ప్రసాదించే చాలీ చాలని వస్తు సామగ్రితో, సంసారం నిజమైన సాగరమేనని కటకటలాడే యిల్లాయి యీ మధ్యతరగతి స్త్రీ. పొట్టైనా సరిగా ఊడని పడి బియ్యంలో, అశాకు తవుడు, కాలుపడి నూకలు, మరొక అశాకు వడ్లు, రాళ్లు, మట్టి మొదలైన వివిధ పదార్థాలను మూడు గంటలసేపు వంచిన నడుము ఎత్తకుండా పరిశుభ్రపరచుకోగా మిగిలిన సగం బియ్యం, వారానికి రెండు రోజులైనా పూర్తిగా భుజించడానికి సరిపోవు సరిగదా, అనేక రంగులతో, అనేక రకాలుగా, పచ్చి పచ్చిగా, గంజి గంజిగా, పిసపిస లాడుతూ ఉండే అన్నాన్ని అలసి సొలసి ఆకుముందు గూర్చున్న మగవారికి, ఆరోగ్యంగా ఎదిగి పెరుగవలసిన పిల్లలకు, పథ్యము తినే రోగులకు, పచ్చి బాలింతలకు, పసిపాపలకు, అపురూపంగా వచ్చిన అతిథులకు పెట్టుకోవాలంటే, ఏ తల్లి హృదయం వ్యథను బొందదు ? అనాగరీకమని అన్యులు బోధించినా, గడ్డి గాద తినమని పెద్దలు సలహా చెప్పినా, ఒక్కమారుగా సంప్రదాయాలు మారవు సరిగదా, ఒక పద్ధతికి అలవాటుపడ్డ శరీరతత్వం, పెద్ద మార్పులను సహించదు. మార్పులవల్ల కలిగే అనారోగ్యం సర్దుకునేటందుకు మధ్యతరగతి ప్రజలు అసమర్థులు. అన్యపదార్థాలనుండి అమృత సన్నిభమైన అనేక ఫలహారాలు వగైరాలు తయారుచేయడం ప్రయోగశాలలోని విద్యార్థినులకు, ఇతర బాధ్యతలు, వ్యాపకాలులేక సంఘసేవయనే పేరుతో కాలక్షేపము చేయదలచిన యువతులకు, అతి ఉత్సాహకరంగా ఉండవచ్చునుగాని, సంసారతాపత్రయాలతో దివారాత్రాలు ఇంట్లో కష్టించి, వేళపట్టుకు పిల్లాజల్లాను సాకుకుంటూ జీవించవలసినవారికి, ప్రయోగాలకు ఓపికాలేదు, తర్ఫీదుకు టైమూలేదు. అందువల్ల వచ్చే హెచ్చు తగ్గులను సరిదిద్దుకోవడానికి సమర్థతాలేదు.

## ఎట్టకేలకు!!

ఇదంతా పోనీ యదార్థమైన కరువేనని నమ్మకము తోస్తే, ఎవరు మాత్రమేమి చేయగలరనే తత్వంలో మనసు సమాధానమైనా పెట్టుకోగలరు. చక్కటి పువ్వులలాంటి బియ్యపు గింజలు, బ్లాక్ మార్కెటు బుట్టలలో, ఒకొక్కసారి బహిరంగంగాకూడా బజారుల్లో, వీధుల్లో రాసులురాసులుగా కన పడ్తూవుంటే, రైలు ప్రయాణంలో దారి పొడుగునా, బియ్యపు మూటలతో ఎక్కే దిగే చిల్లర వ్యాపారస్తులు ప్రత్యక్షమౌతూ వుంటే—కరువు ఎక్కడిది అనే సందేహం అందరికూ కలుగుతుంది. ఇతరత్ర ఇంత మంచి బియ్యం దొరుకుతూవుంటే రేషనుషాపులో కొనుక్కునే దుమ్ము దూగరా—ఎంత వెల తక్కువైనా—తినడమేమి ఖర్మరా దేవుడా అనికూడా అనిపిస్తుంది. పోనీ బయట కొందామా అంటే 10 అణాలు బియ్యం, ఒక రూపాయి 10 అణాలు వంతున కొనవలసివుండె. ఒక వేళ కొన్నా, నల్లమార్కెట్టును ప్రోత్సహిస్తున్నామనీ, ప్రభుత్వాన్ని మోసం చేస్తున్నామనీ యింకా ఒక రకంగా శాసనాన్ని ఉల్లంఘిస్తున్నామనీ, వివిధ రకములైన సంకోచాలు ధర్మబద్ధంగా సంచరించాలను కున్న పౌరుల మనస్సులను బాధించి, వేధించి నిస్పృహ జెందించేవి. ఇన్ని కారణాలవల్ల రేషనిం గనేది లేకుండా ఎప్పుడు జరుగుతుందో అని ప్రజలందరూ ఎదురు చూడడం అతి సహజం.

ఎట్టకేలకు, వ్యవహారజ్ఞుడు, అనుభవశాలి అయిన రాజాజీ, ఒక్కతృటి కాలంలో రాష్ట్రమంతా రేషనింగ్ రద్దుజేస్తూ, ఈ రద్దువల్ల అసందర్భాలూ, అక్రమాలూ జరుగకుండా ఉండే బాధ్యత వర్తకులదీ, ప్రజలదీనని వక్కాణించారు. భగవంతుని దలచుకుని, అక్రమ ప్రవర్తన విడువమని నల్లమార్కెటుదారులను హెచ్చరించారు. ఆందోళనలో, అనవసరమైన నిలువను ఏర్పరచుకోకుండా, తమకు వలసినంతవరకు మాత్రమే ఆహార పదార్థాలను కొనుక్కోవలసినదిగా ప్రజలకు సలహా ఇచ్చారు.

ఈ బాధ్యతలను గుర్తుంచుకుని, రేషనింగ్ రద్దువల్ల తమతోటి వారు ఆహార పదార్థాల లేమి ననుభవించకుండా తోడ్పడడం ప్రజల విధాయకం, వర్తకుల విధాయకంకూడా. కొనుబడి, వినియోగం విషయంలో పురుషులకన్న, స్త్రీలదే ప్రధాన బాధ్యత గనుక, స్త్రీలంతా, క్రమంగా, పొదుపుగా, వృధా గాకుండా వస్తువులనుకొని వాడుకొని, ఆహార కరువునుండి తాముగాని, ఇతరులుగాని బాధపడకుండా కృషి చేయడం అవసరం.

———:o:———

## కృతజ్ఞత

మదరాసు కార్పొరేషన్‌వారు పారిశ్రామిక విద్యాలయపు బీద విద్యార్థినుల భోజననిధికై రూ. 350/- విరాళాన్నిచ్చారు. వీరికి మా కృతజ్ఞత.

—ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్రమహిళ

స్థాపితము : 1944

ఆంధ్ర మహిళా సభవారి యాజమాన్యమున
ప్రచురింపబడుచున్న
స్త్రీల సచిత్ర మాస పత్రిక

సంవత్సరచందా రూ. 6-0-0 లు—విడిపత్రిక రూ. 0-8-0

మీరు చందాదారులు కండి.

స్త్రీ సమస్యలపై మీ చక్కని రచనలను పంపండి.

కథలూ, కబుర్లూ, నాటికలూ కూడా కావాలి.

వర్ణచిత్రములూ, రేఖా చిత్రములూ,
ఛాయా చిత్రములూ పంపండి.

అన్ని విధములా మీ అమూల్య సహకారము కాంక్షిస్తున్నాము

—సంపాదకురాలు.

# ఇంటా - బయిటా

ప్లానింగ్ కమీషన్ సభ్యురాలుగా నియమించబడిన శ్రీమతి గుమ్మిడివల దుర్గాబాయమ్మగారు, జూన్ 23_వ తేదీన పదవీస్వీకారం చేశారు. ఆరోగ్యం, విద్య, సంఘ క్షేమం, స్త్రీశిశు సంరక్షణ_ మున్నగు శాఖలను వీరు ఆధిపత్యం వహిస్తారు.

*　　　　*　　　　*

అఖిలభారత మహిళాసమావేశ స్థాయిసంఘం_ జూలై 13_ 14 తేదీలలో శ్రీమతి హన్నా సేన్ గారి అధ్యక్షతక్రింద సమావేశమై, హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ చట్టములోని వివాహ విడాకుల బిల్లులను, ఇతర సాంఘిక సవరణలను గూర్చి చర్చించెదరు.

యీ సవరణలయొక్క_ ప్రయోజనాలను నచ్చజెబుతూ, ప్రచారం సాగించాలని శ్రీమతి మానికొండ సూర్యావతి గారు, విజయవాడలో జూన్ 20 వ తేదీని, ఆంధ్ర మహిళా జనుల నుద్దేశించి విజ్ఞప్తి చేసి యున్నారు.

*　　　　*　　　　*

అఖిలభారత స్త్రీల ఆహారసంఘంవారి ఆధ్వర్యాన, బొంబాయిలో, పచనవిధానం, వడ్డన మున్నగు 'కళ' లలో తర్ఫీదు బడసిన 18 యువతులు ఇటీవల డిప్లొమాలు పుచ్చుకున్నారు_ సిరియల్సుతక్క_ మిగతా ఆహార వస్తువుల వినియోగాన్ని, ఉపయోగాన్ని ప్రచారం చేయడం వీరి మొదటి కర్తవ్యంగా భావింపబడుతూ ఉంది.

*　　　　*　　　　*

పశ్చిమ ఉత్తరప్రదేశలో దూహై పట్టణంలోని సర్ చోతురామ్ కిసాన్ గరల్స్ హైస్కూలును ప్రధాని నెహ్రూ సందర్శించినపుడు, అక్కడ 12 ఏండ్ల బాలిక, భారత ప్రధాని కావడం తన జీవితాశయమని చెప్పింది.

*　　　　*　　　　*

ఢిల్లీ మహిళా రక్షణ సంఘ సమావేశంలో శ్రీమతి విజయలక్ష్మి ప్రసంగిస్తూ, భారతదేశంలో స్త్రీల వ్యభిచారం మితిమీరుతున్నదనీ, అభ్యుదయ నిరోధకారియైన వ్యభిచారాన్ని నిర్మూలించడానికి భారతీయ మహిళలు పూనుకోవాలనీ, ప్రభుత్వం తగు చర్యలు తీసికోవాలనీ హెచ్చరించారు.

*　　　　*　　　　*

బ్రసెల్స్ నగరంలో జరిగిన నూతన వస్తుప్రదర్శనములో క్షణానికొక బొత్తాము కుట్టే యంత్రానికి ఉన్నత బహుమానాన్నిచ్చారు. మెషీన్ తనంతటతానే ఒక్కొక్క_ బొత్తామును అందుకొని, విరిగిపోయిన వానిని తొలగించి, అత్యల్పకాలంలో చకచకా గుండీలను కట్టుందట. ఏ సైజు గుండీ అయినా ఈ మిషను కుట్టగలదట.

*　　　　*　　　　*

ఇటీవల లాంగ్ బీచ్, కేలిఫోర్నియాలో జరిగిన సౌందర్య పోటీలో, ఆర్మికూసేలా అనే 18 సం॥ల ఫిన్‌లెండ్ యువతి విశ్వసుందరిగా ఎన్నుకోబడినది. మిస్ హవాయ్, మిస్ గ్రీస్, మిస్ హాంగ్‌కాంగ్, మిస్ జర్మనీలు ద్వితీయ స్థానాన్ని పొందారు.

*　　　　*　　　　*

మరొక ప్రపంచయుద్ధం సంభవించే పరిస్థితిలో సైన్యపు ట్రక్కులు, ఆంబ్యులెన్సుల డ్రైవర్లుగాను, లయజాన్, వైర్‌లెస్ ఉద్యోగులుగాను, పనిచేయడానికి 21 సం॥ దాటిన యువతులను సమీకరించడానికి (Conscription of Women) ఫ్రెంచ్ ప్రభుత్వం ఒక బిల్లును తయారు చేసిరట.







# ఆంధ్ర మహిళా సభకు

## మీ సహకార సానుభూతులు కావాలి.

విద్యా విజ్ఞాన ప్రచారముద్వారా, స్త్రీ జనాభ్యుదయమునకూ, కుల మత పక్షరహితమైన సంఘ నిర్మాణమునకూ తోడ్పడుచున్న జాతీయసంస్థ. రాజపోషకులుగా, పోషకులుగా, యావజ్జీవ సభ్యురాండ్రుగా, సంవత్సర సభ్యురాండ్రుగా, ఆంధ్ర మహిళ చందాదారులుగా యీ ఉద్యమానికి తోడ్పడండి. నర్సింగ్ హోమ్ నిర్మాణానికి, పారిశ్రామిక విద్యాలయపు బీద విద్యార్థినుల భోజన నిధికి, విరాళములిచ్చి యీ సేవా సంస్థను పోషించండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజ పోషకులు | .... | రూ. 1,000/- | యావజ్జీవ సభ్యత్వం | .... | రూ. 100/- |
| పోషకులు | .... | " 500/- | సంవత్సర సభ్యత్వం | .... | " 10/- |

ఆంధ్ర మహిళ సం॥ చందా .... రూ. 6/-

మీ బిడ్డలకు, మీ పరిచితులకు, ఇందలి వివిధశాఖలలో కల్పింపబడ్డ అవకాశములను ఉపయోగించుకొండి.

—కార్యదర్శినులు.

*

ఆంధ్రదేశమంతటా ఇప్పుడు
జయప్రదముగా ప్రదర్శింపబడుచున్నది...



పక్షిరాజావారి

# కాంచన

(తెలుగు)

# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: జూలై '52 :: సంచిక 3

ముఖచిత్రం : నర్తకి.

చిత్రకారుడు : శ్రీ మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే.


పెద్దవదిన—(నాటిక) ... శ్రీమతి ఎ. రత్నమ్మ.

శాంతమ్మాం (చారిత్రిక గాథ) ... శ్రీమతి సి. హెచ్. శతకీర్తి.

పెరల్ బక్ (జీవిత చిత్రం) ... శ్రీ చామర్తి కనకయ్య.

స్త్రీలూ—ఉద్యోగనిర్వహణ ... శ్రీమతి ఊ. లక్ష్మీకాంతమ్మ.

మాటా—మర్యాదా ... శ్రీ వేమరాజు భానుమూర్తి.

భూమ్యాకాశాలు (కథ) ... శ్రీమతి జయంతి కామేశ్వరి.

అభాగ్యశాలు (,,) ... శ్రీపి. వి. రత్నం.

సృష్టివికాసం (విజ్ఞానపు వేయిపడగలు) ... శ్రీమతి కె. సుగుణమణి.

ఇంకా, రాజకీయాలు, వెలుగూ - నీడా, ఆపామాషీ, బాలానందం, చిన్నకథలూ, కావ్యాలూ.



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.,

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.

ప్రతిభా వారి

# చిన్నకోడలు

నిర్మాత దర్శకుడు

జి. బలరామయ్య

ఆంధ్ర, సీడెడ్ :

నవయుగ రిలీజ్



మైసూరు :

రాజశ్రీ రిలీజ్

## ఆంధ్ర మహిళా సభ

# వస్త్రములపై రంగు వేయుట, అద్దకపుపని తరగతులు

భారత ప్రభుత్వ పునరావాసశాఖ యాజమాన్యాన ఆంధ్ర మహిళా సభలో వస్త్రములపై అద్దకంపని నేర్పు తరగతులు జరుపబడుతున్నాయి.

ఈ జూలై నెలలో శిక్షణ పొందిన మొట్టమొదటివర్గం విద్యార్థినులు, 11 మంది, పరీక్షలకు హాజరవుతున్నారు. ఇందు ఉత్తీర్ణులగువారికి భారత ప్రభుత్వంవారిచ్చు డిప్లొమావల్ల భారత దేశమంతటిలో ఎక్కడైనా ఉద్యోగానికి అర్హత లభిస్తుంది.

తిరిగి కొత్త తరగతులు ఆగస్టునుండి ప్రారంభమగును. స్కూల్ ఫైనల్ అర్హతగల 16 మంది విద్యార్థినులు ఇందు చేర్చుకోబడతారు. అర్హులని తోచిన బీద విద్యార్థినులు 10 మందికి మాసానికి రు. 25/- చొ॥ ప్రభుత్వంవారు విద్యార్థి వేతనం ఇస్తారు. ఈ తరగతిలో ప్రవేశం పొందడానికి దరఖాస్తు పెట్టుకోవలసిన విషయాన్నిగూర్చి ప్రభుత్వంవారే పత్రికల్లో త్వరలో ప్రకటిస్తారు. ఇందు చేరగోరిన యువతులు ఆ ప్రకటనను గమనించి వెంటనే దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

ఇతర వివరాలు కోరేవారు ఈ క్రింది విలాసానికి వ్రాసిగాని, ఇచట ఆఫీసుకు వచ్చిగాని తెలుసుకోవచ్చును.

కార్యదర్శిని,
ఆంధ్ర మహిళా సభ,
14, ద్వారక, మైలాపూర్, మద్రాస్-4.



## విజయము

ఇంటర్మీడియట్ పరీక్షలకు వెళ్ళిన 7 గురు విద్యార్థినులలో 5 గురు పూర్తిగా విజయమును పొందిరి. ఒకరు ఒక పార్టులో కృతార్థులైరి :

ద్వితీయశ్రేణి :—సి. హెచ్. రాజేశ్వరి, పి. గిరికుమారి, నళినీ కాత్రే, కె. రుక్మిణి.

తృతీయశ్రేణి :—వి. శశికళ, ఒక పార్టులో : చంద్రా దేవీస్.

# వెలుగూ — నీడా

గిరి *

ప్రజలకు కాని ప్రతినిధులు !

అటు న్యూఢిల్లీలోనూ, మన రాష్ట్రీయ శాసనసభల్లోనూ ప్రజాప్రతినిధుల ప్రవర్తన, వింతగా కనిపిస్తోంది. ఈ విషయంపై ఆసభల్లో అప్పుడప్పుడు అలజడి బయల్దేరుతూండడం అలవాటు. "మంచి నడవడిక"కి నిర్బంధంలాంటిది గనుక ఒకటి ప్రవేశపెట్టకపోతే, జరుగవలసిన వ్యవహారాలు సాఫీగా— సుగమంగా జరగవనికూడా కొందరు పెద్దలు అభిప్రాయపడుతూన్నారు. కేంద్ర శాసనసభ డిప్యూటీ స్పీకర్ గారు, ప్రతినిధులు—సభలో సరిగ్గా గడిపిన గంటల్ని లెక్కపెట్టి చెప్పవలసిందిగా సూచనప్రాయంగానే అన్నాడు. ఇది జరగాలి! ......తమల్ని చీకట్లోంచి వెలుగులోకి తీసుకురాగలరనీ, తమ నిత్యజీవితమనే హేమంత ఋతువుకు ప్రతిగా కలకలలాడే వసంతాన్ని సృష్టిస్తారనీ, ఆశగా అఱ్ఱులు జాచుకునివున్న వెఱ్ఱి ఎలక్టర్లందరూ, నివ్వెరబోతారు. లేదా, మళ్ళీ వాళ్ళ మధ్యలోకి వెళ్ళిన మన ఘరానా ప్రతినిధికైనా, ఘనస్వాగతం లభించడంలో సందేహమక్కరలేదు— మరి డిప్యూటీస్పీకర్ పై సూచనను ప్రతిపాదించటానిక్కూడా ఆస్కారం లేకపోలేదు ... శాసనసభ ప్రారంభానంతరం ఒక గంటలోనే సభికులు విశ్రాంతి గదుల్లోకి వెళ్ళిపోతున్నారుట! సభ వాతావరణంలో ఏదో విషవాయువు మిళితమై వుండాలి!! ... అసలు కేంద్రంలో సభ్యులసంఖ్యకూడా అత్యధికంగా వుండడం— కర్మవశాత్తు ఆవిధమైన గైరుహాజరు గురించి ప్రశ్నించే వారెవరి బారినుండైనా—రక్షించడానికి పెట్టని కోటలా వుపకరిస్తుంది.

హైద్రాబాదు శాసనసభ సంవిధానం మరీ హాస్యాస్పదంగా వుంది! సభికులు హాయిగా సుఖస్వప్నాలుకంటూ నిద్రపోవచ్చునట సభ జరుగుతూండగనే. కాని గుర్రులు పెట్టి మరీ ఘోరంగా ఇతర్ల కభ్యంతరం కలగజేయనంత వరకు నయం!... అంచేత ఈ సభ్యులంతా ఆ నాల్గు గోడలమధ్య ఎంతకాలం ఏవిధంగా గడిపారనే నివేదిక తయారుజేయడానికి అసలు ఈ నిద్రబోవడమనేది మంచి "మేటర్"ని "కేటర్" చేస్తుంది!... ఎంతకాలం నిద్రపోయిందీ, కలతనిద్రా— సుఖసుషుప్తా— ఏ ఏ విధమైన కలలు గన్నారు, కల్లో తనే మహారాజుగా మారాడు— తన మెల్లిగన్ను ప్రియురాలు ఎలాంటి (కఠోర) గీతాల్ని ఆలాపించింది...... ఇదేవరుసకదూ!

మద్రాసు అసెంబ్లీలోనైతే సభ్యశ్రేష్ఠులకు సిగరెట్ దమ్ములు లాగడానికిని ప్రత్యేకమైన గదులు ఏర్పరచారు. అంచేత వీరి నివేదికలోనైతే నిద్రతోబాటు, ఒంటిమీద సిగరెట్ పఫ్‌ను కప్పుకుని ఎంతసేపు కాళ్ళుజాపుకూర్చుందో మరోకాలంలో రాయడానికి వీలుంది!

స్కూల్ స్టూడెంట్లకు రెండుపూట్లా అటెండెన్స్ తీసుకుంటారు. కాలేజీ విద్యార్థులకు గంటగంటకీ అవసరం. ఈ శాసనసభ్యులనైతే క్షణక్షణానికి చెక్ చెయ్యాలని— ఆకాస్త— డిప్యూటీ స్పీకర్ తన సూచన్ని మార్చుకుంటే, సరిపోతుంది.

ఏమిటీ వ్యవహారమంతాను?

ఒక పనికోసం ప్రత్యేకింపబడిన ఒక వ్యక్తి తన బాధ్యతను విస్మరించటంలో అర్థంలేదు. అందులోనూ అతి బాధ్యతాయుతుడైన ప్రజాప్రతినిధి. అతనిని ప్రజ సిగరెట్ పఫ్‌తో విభూతిరేఖలు దిద్దుకోడానికిగాని, సులక్షణంగా సుఖసుషుప్తి నందటానిక్కానీ, పంపలేదు.

ప్రజల్లో కండరాలు విరిచే కార్మికులున్నారు. కష్టపడే కర్షకులున్నారు. ఊపిరాడని వుద్యోగస్థులున్నారు. వీరు తమ తమ బ్రతుకు బాటను బాగుజేయమనీ— ఏతత్కార్యనిర్వహణకే తమకు ప్రాతినిధ్యం వహించమనీ వీపుతట్టి పంపించారు ఒక వ్యక్తిని, ఇంతదూరం! ఈవ్యక్తే ప్రజలమధ్య ఓట్లకోసం చేతులు జాచుకుని అర్థిస్తూ వెళ్ళిన విషయాన్నైనా మఱచిపోతే లాభంలేదు. శ్రమించి సంపాదించినదాన్ని కష్టించి సాధించాలి.

ఎప్పటికైనా ప్రజాప్రతినిధులనిపించుకున్నవారు, ప్రజల బాగోగులనే కంటక శయ్యమీద శయనించకుండా, బాధ్యతాయుతంగా ప్రవర్తించినట్టయితే, మరికొన్నాళ్ళు ప్రజల విశ్వాసాన్ని చూరగొనగల్గిన వారవుతారు.

## ప్లానింగ్ కమీషన్—భారత సేవక సమాజం :

భారత ప్రభుత్వం- దేశపునర్నిర్మాణంకోసం- ఒక పథకాన్ని- పంచవర్ష ప్రణాళికను, తయారు చేసేందుకు నియమిత సభ్యులతో ప్లానింగ్ కమిషన్ నొకదాన్ని ఏర్పర్చింది.

ఈ ప్లానింగ్ కమీషన్ ప్రాముఖ్యత భారతదేశంలాంటి రిపబ్లిక్ రాజ్యాల్లో, ఎంతైనా వుంటుంది. నియంతృత్వ దేశాల్లో అయితే ప్రతిసందర్భంలోనూ ప్రభుత్వం మాటే నెగ్గుతుంది. దేశాభ్యుదయాన్ని పరిపక్వరూపంలో సాధించాలంటే ప్రజల అభిమతాన్నికూడా పాటించడం అవసరం. అంచేత ప్రజలతో సన్నిహిత సంబంధం గల్గిన సంస్థలు ప్రభుత్వానికి సలహాలిచ్చే సిబ్బందిగా వుండడం సమంజసంగా వుంటుంది... ఈ ప్లానింగ్ కమిషన్ గ్రామ గ్రామంలోనూ స్థాపించనున్న సేవక సమాజాలగురించి మరో చోట వ్రాస్తున్నాను.

ఎక్కువ బాధ్యతాయుతమైన కార్యాన్ని నిర్వర్తించవలసిన ప్లానింగ్ కమిషన్ లో ఒకే ఒక ఆంధ్ర వ్యక్తికి అందులోనూ ఒక మహిళకు సభ్యత్వస్థానమివ్వటం, ముదావహం. అందులోనూ శ్రీమతి దుర్గాబాయమ్మ గారిలాంటి సేవా ధురీణులు ఆ పదవి నలంకరించటం, హర్షించతగింది.

ఒక నిర్గతికురాలైన ఆంధ్ర మహిళ, మరో నిరధనురాలైన విద్యార్థిని, "ఏమమ్మా- ఏంచేస్తావ్" అని గనుక ఆమె భవిష్యత్తునుగురించి నిలదీస్తే "ఆంధ్ర మహిళాసభలో చేర్తాను" అని తడుముకోకుండా చెప్తుతుంది. నలుగురి నోట్లోనూ "సభ" పేరు మెదులుతూన్నదంటే, మద్రాసు ఆంధ్ర మహిళలకే గాకుండా పొరుగూర్లనుంచి వచ్చేవారికొక్కూడా సహాయకారిగా వుంటూ మైలాపూర్ లజ్ కార్నర్ లో భవ్యంగా వెలుగొందుతూన్నదంటే, దానికి కారణాలు, ఆ భవనానికి పునాది తాయి, దుర్గాబాయమ్మగారే.

మీటింగులు నడపటం, నలుగురకోసమూ పాటుబడి, నలుగురికీ అయే కార్యంలో ఉత్సాహంతో పాల్గొనడం, మున్నగు సేవాప్రవృత్తులు దుర్గాబాయమ్మగారి చిన్నప్పుడే స్పష్టంగా పొడగట్టసాగాయి. నాటినుండి నేటివరకూ స్వచ్ఛంద దేశసేవా సక్తగా పాటుబడుతూ నేవున్నారు.

ఆవిడ ఆంధ్ర యూనివర్శిటీలో రాజకీయ శాస్త్రంలో ఎం. ఏ. పట్టా, మద్రాసు యూనివర్శిటీ లా డిగ్రీ, పొందారు. ప్రథమ శ్రేణిలో మద్రాసు హైకోర్టు అడ్వొకేట్ గా పనిజేశారు. గాంధీజీ అధ్వర్యాన జరిగిన సహాయనిరాకరణోద్యమంలో ఆదినుండి పాల్గొన్నారు. 1947లో రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నుకోబడ్డారు. 51_52 లో పార్లమెంటు మెంబరు. ఇండియా సుప్రీంకోర్టు అడ్వొకేట్ గాకూడా వుంటున్నారు. ఈ మధ్య చైనా వెళ్ళిన భారత సాంస్కృతిక రాయబారవర్గంలో వీరుకూడా ఒక ప్రతినిధి. ప్లానింగ్ కమీషన్ మెంబరుగా మొన్న జూన్ 23 న పదవీస్వీకారం చేశారు.

ఈవిడ సేవాతత్పరతా, కార్యోత్సాహం, ప్రతి మహిళకూ ఆదర్శప్రాయంగా వుండటంలో ఆశ్చర్యంలేదు. ప్రస్తుతం ప్లానింగ్ కమీషన్ లో ఈవిడకు కేటాయించబడిన విషయాలు, ఆరోగ్యం, విద్య, సంఘసంక్షేమం, స్త్రీశిశు సంరక్షణ, ఇవికూడా అత్యుచితమైనవిగా వున్నాయి. వీటిల్లో దుర్గాబాయమ్మగారి ప్రత్యేక శ్రద్ధ తప్పకుండా లభించగలదనడం నిర్వివాదాంశం.

ఇక ప్లానింగ్ కమీషణ్ గ్రామ గ్రామంలోనూ నెలకొల్పనున్న "సేవకసమాజం" విషయం.

పధ్ధెనిమిదేళ్ళు పైబడ్డ ప్రతివారూ ఈ సమాజాల్లో చేరి స్వచ్ఛంద సేవాప్రవృత్తి నవలంబించడానికి వీలుంది. ఐదేళ్ళపాటు- లేక కనీసం ఒక సంవత్సరం పాటైనా- రోజులో ఏ కొంతసేపైనా సమాజ కార్యక్రమంలో పాల్గొంటూ వుండాలి. విపరీతవాదులకూ- హింసావాదులకూ ఈ సమాజాల్లో చోటు దొరకదు.

ప్రతిచోటా వెలసే ఈ సమాజాల కార్య-కర్తవ్యాల్నంతంటినీ సమన్వయపరుస్తూ తగువిధంగా సలహా- సహాయాలనందజేస్తుంటుంది, కేంద్రంలోని "భారత సేవక సమాజం"

ప్రజల్లో దేశసేవాసక్తిని సువ్యాప్తం గావించి, దేశాభ్యుదయం ముందడుగు వేసేందుకు ఉపకరించే ఈ "భారత సేవక సమాజ" నిర్మాణం చక్కగా వుంది. దీని ద్వారా —ఆశయాలకు తగిన- సమగ్రకృషి లభించాలని ఆశిద్దాం.

★



# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

రెండు సం॥ల క్రిందట ప్రారంభమయిన కొరియా యుద్ధం మళ్ళీ చెలరేగే సూచనలు కనిపించటం, కాశ్మీర్ వ్యవహారం, అంతర్జాతీయ సమస్యగా ఉన్నదికాస్తా, ఇప్పుడు తీవ్ర జాతీయ సమస్యగామారడం, ఆసియా, ఆఫ్రికా ఖండాలలో సామ్రాజ్యవాదాన్ని సుస్థిరంగా కాపాడటానికి అట్లాంటిక్ ఒప్పందం ప్రయత్నిస్తున్నదని ప్రధాని నెహ్రూ ఖండితంగా విమర్శించడం, ఆంధ్ర రాష్ట్రం కోసం స్వామి సీతారాం నాయకత్వాన వ్యక్తిసత్యాగ్రహం ప్రారంభం కావడం, మద్రాసులో ఆహార కంట్రోళ్లు రద్దు అయి కొత్త పన్నులు వేయబడటం—ఇవి 1952 జూన్ నెలలో మన దేశంలోనూ, అంతర్జాతీయ రంగంలోనూ జరిగిన ప్రధాన సంఘటనలలో కొన్ని.

* * *

1950 జూలైలో కొరియా యుద్ధం ప్రారంభమయింది. కాని దాదాపు ఒక ఏడాది కిందట యుద్ధ చర్యలు భారీ ఎత్తులో జరక్కుండా నిలిచిపోయి, యుద్ధవిరమణ ఒప్పందం కుదుర్చుకునేందుకు సంప్రదింపులు జరుగుతున్నవి. యుద్ధ ఖైదీల పరటావిషయంలో తప్ప మిగిలిన అంశాలన్నింటిమీదనూ సమాధానం కుదిరింది. అది ఒక్కటీ పూర్తి అయితే, కొరియా భవిష్యత్తునేకాక యావత్తు దూరప్రాచ్య సమస్యలనూకూడా పరిష్కరించే నిమిత్తం అగ్రరాజ్యాలు సమావేశమయ్యే అవకాశం వస్తుంది. ఈ సమస్యమీద రాజీ కుదర్చటానికి ప్రధాని నెహ్రూవంటి అంతర్జాతీయ గౌరవ విశ్వాసాలను పొందిన వ్యక్తే సహాయ పడతానని మాట ఇచ్చారు.

కాని అమెరికా మొండితనం, వ్యవహారాన్ని పూర్తిగా నాశనంచేసి పారవేసింది.

* * *

యుద్ధఖైదీలలో అంతా స్వదేశానికి వెళ్లగోరటం లేదనీ, కమ్యూనిస్టు వ్యతిరేకులుగా ఉన్న వాళ్లని అక్కడికి పంపటం బానిసత్వంలోకి పంపటమే కనుక, స్వయంగా వెళ్లదలచుకున్నవాళ్లను మాత్రమే పంపుతాననీ, అమెరికా వాదిస్తున్నది. దీనికి కమ్యూనిస్టులు ఒప్పుకోటంలేదు. చైనామీదికీ తాము ఉసికొల్పబోతున్న చాంగ్ కైషెక్, సింగ్మన్‌రీల సేనల్లో చేర్చటానికే, యుద్ధంలో ఫిరంగి మేతగా పనిచేయటానికే అమెరికా ఈ ఎత్తు వేస్తున్నదని వాళ్ళ ఆరోపణ. రెండో ప్రపంచ యుద్ధంలో మరణించిన అమెరికన్‌ల కన్నా ఎక్కువమంది అమెరికన్లు ఇప్పటివరకూ కొరియా యుద్ధంలో మరణించారంటే, అమెరికాకు చైనాతో పోరాడేందుకు గూర్ఖాలవంటి జనం అవసరమనీ, వారికోసం ఆదేశం ప్రయత్నించుచున్నదంటే ఆశ్చర్యపడ నవసరంలేదనీ తోచకమానదు.

కమ్యూనిస్టు బానిసత్వంనుంచి రక్షించిన యుద్ధఖైదీలకు అమెరికా ఎటువంటి స్వర్గాన్ని చూపుతున్నదో కొంచం పరిశీలించాలి. తనమాటకు ఎదురుచెప్పే వాళ్లందరినీ అరెస్టులు చేయించి, కేవలం అమెరికన్ తుపాకుల బలంతో అధికారంలో ఉంటూ, మితవాద పార్లమెంటులో కూడా తగిన బలం లేనందువల్ల దౌర్జన్యంగా పరిపాలనను సాగించే సింగ్మన్‌రీకి అప్పగించాలని చూస్తున్నది. 'సమితి సూత్రాల్లో విశ్వాసం ఉన్న వాళ్ళెవరూ సింగ్మన్‌రీతో ఎటువంటి సంబంధం పెట్టుకోలేరు. దీనిని బలపరచటమంటే, సమితి లక్ష్యాలను భగ్నపరచటమే' అని పండిత నెహ్రూ ఆరోపించారు. రీ పరిపాలన సమితి నియమాలకే విరుద్ధమని సమితి ఏర్పాటుచేసిన కొరియా సంఘమే తీర్మానించింది. ఈ స్థితిలో యుద్ధఖైదీల పరిస్థితి పెనం

మీదనుంచి మంగలం మీద పడినట్లు ఉంటుందని చెప్పక తప్పదు.

తమ వాదంలో బలంలేదని గ్రహించిన అమెరికా యుద్ధఖైదీలలో ఏదోవిధంగా చీలికలు తీసుకుని రావాలని ప్రయత్నాలు చేసింది. కాని అవి సాగక పోయేటప్పటికి, వారిమీద సైనికదళాలను ప్రయోగించింది. యుద్ధఖైదీలపట్ల అమెరికన్ సైన్యాధికారులు చేసిన హత్యాచారాలకు బ్రిటన్ వంటి అమెరికన్ ఆశ్రిత దేశాలే నిరసించినవి. ఆఖరికి అమెరికాలోకూడా ఈవిషయమై అసంతృప్తి బయలుదేరింది. అమెరికన్ సేనాధికారుల వైఖరి అమానుషంగానూ అగౌరవంగానూ ఉన్నదని అమెరికన్ సార్జంట్ చాస్ తన సేనానికి వ్రాయ సాహసించి శిక్షకు గురి అయినాడు.

ఇది ఇట్లా ఉండగా అమెరికన్లు కొరియాలో విషవ్యాధులను కలిగించే క్రిమి బాంబులను ఉపయోగిస్తున్నారని కమ్యూనిస్టులు ఆరోపించారు. దీనిని నిష్పాక్షికంగా విచారించటం అవసరమని అంతా అంగీకరించారు. అయితే దీనికి తగిన చర్యమాత్రం కనిపించటంలేదు. ఈ విషయమై భద్రతామండలి జరిపే చర్చకు చైనా, ఉత్తర కొరియా ప్రతినిధులను రష్యా ప్రతిపాదించగా మండలి నిరాకరించింది. క్రిమియుద్ధాన్ని నిషేధించే అంతర్జాతీయ నియమావళిని ప్రపంచదేశాలన్నీ ఆమోదించాలని రష్యా చేసిన ప్రతిపాదనను కూడా మండలి నిరాకరించింది. ఆరోపణలకు గురి అయిన అమెరికా ఈ నియమావళిని ఆమోదించలేదని గమనించడం అవసరం.

*　　　*　　　*

వ్యవహారం కొంచం గడ్డుగా ఉన్నప్పటికీ, రాజీకి అవకాశం కనిపిస్తూ ఉండగానే అమెరికా మళ్ళీ యుద్ధాన్ని వ్యాపింపచేసే చర్యలు తీసుకుంటున్నది. 1951 లో అమెరికా సేనలు మంచూరియా సరిహద్దులకు వెళ్ళినందువల్లనే చైనా రంగంలో ప్రవేశించటం, ప్రపంచ యుద్ధం వచ్చినంతపని కావటం, జనరల్ మెకార్థర్ బర్తరఫ్ కావటం, జరిగింది. ఇప్పుడు మళ్ళీ మంచూరియా సరిహద్దులో యాలూ నది ప్రాజక్టులమీద అమెరికన్ విమానాలు బాంబులు వేసినవి. ఈ చర్య భారతదేశాన్ని దిగ్భ్రాంత పరిచిందని పండిత నెహ్రూ చేసిన ప్రకటనా, యుద్ధాన్ని విస్తరింపచేసే ప్రమాదం వచ్చిందని బ్రిటిష్ లేబర్ నాయకుడు అట్లీ చేసిన విమర్శా, ఫ్రాన్స్, కెనడా మొదలైన దేశాల విమర్శలూ, అమెరికన్ మూర్ఖత్వాన్ని నిరూపిస్తున్నవి.

కొరియా సమస్యా పరిష్కారం కావాలంటే, సర్వపక్షాలకూ మాన్యుడుగా ఉన్న పండిత నెహ్రూ ఇతర చిన్న దేశాల సహాయంతో మధ్యవర్తిత్వానికి పూనుకోటమో, లేః ప్రపంచయుద్ధమో తప్ప వేరే మార్గం ఉన్నట్లు తోచదు.

*　　　*　　　*

కాశ్మీర్ సమస్య ఇంతవరకూ అంతర్జాతీయ సమస్యగానే ఉంటూ వచ్చింది గాని ఇప్పుడు జాతీయసమస్యే అయింది. లోగడ చెప్పినట్లుగా, షేక్ అబ్దుల్లా అభ్యుదయమార్గం భారతదేశంలోని మితవాదులకు కంటగింపుగా ఉండి, గగ్గోలు పెడుతున్నారు. పరిహారం ఇవ్వకుండా భూస్వామ్యాన్ని రద్దుచేయటం, మహారాజ వంశానికి ఉన్న వంశానుగత రాజప్రముఖ్ గిరీని తొలగించి ప్రభుత్వాధ్యక్షుని ఎన్నికకు ఏర్పాటు చేయటం, సంస్థానానికి వేరేజండా ఏర్పాటు చేసుకోవటం అనే అంశాలు వీరికి ఆయుధాలుగా కనిపించినవి. అయితే ఈ చర్యలన్నీ భారత రాజ్యాంగ బద్ధంగానే ఉన్నవని పండిత నెహ్రూ 22, 23, తేదీన పార్లమెంటులో స్పష్టం చేసి ఉన్నారు. ప్రభుత్వాధ్యక్షుని ఎన్నిక సంస్థానపు జండా విషయాల్లో భారతదేశ ఆధిపత్యానికి ఎటువంటి లోపమూ రాదని అబ్దుల్లా హామీ ఇచ్చి ఉన్నారు.

అబ్దుల్లా విమర్శకుల వాదంలో ముఖ్యాంశాలివి: (1) పరాధీనమవుతున్న ఆస్తులకు పరిహారం ఇవ్వాలని రాజ్యాంగంలో ప్రాథమికహక్కు, అబ్దుల్లా పరిహారం ఇవ్వలేదు కనుక భారత రాజ్యాంగాన్ని తిరస్కరించారు. (2) వంశానుగత రాజరికాన్ని రద్దుజేయటం కాశ్మీరులో జరిగితే, మిగిలిన రాష్ట్రాల మాట ఏమిటి? (3) భారత జండా ఉండగా మరొక జండా ఏమిటి? (4) భారత రిపబ్లిక్ అధ్యక్షుడు ఉండగా మరొక రాష్ట్రానికి అధ్యక్షుని ఎన్నిక ఏమిటి?

వీటికి నెహ్రూ, అబ్దుల్లా ఇచ్చిన జవాబులివి: (1) ప్రాథమిక హక్కులు సాంఘికాభ్యుదయ కార్యక్రమాలను అడ్డ

గించకూడదు_ ఇందువల్లనే జమీందారీల రద్దు విషయంలో రాజ్యాంగాన్ని సవరించటం జరిగింది. ఆ సవరణకు ఒప్పుకున్న భారతీయులు, అబ్దుల్లా ప్రభుత్వం పరిహారం ఇవ్వనందుకు నిందించలేరు. (2). కాశ్మీర్ రక్షణ, విదేశ వ్యవహారాలు, రహదారి సౌకర్యాలను మాత్రమే యూనియన్‌కి ఇచ్చింది. హైదరాబాద్, మైసూరులు అన్ని అధికారాలనూ ఇచ్చినవి. కాబట్టి అవి వేరు వేరు సమస్యలు. (3) భారత రిపబ్లిక్ అధ్యక్షుని అధికారానికీ, యూనియన్ జండాకీ కాశ్మీరులో తిరుగు లేదు.

కాని మిగతా వాదులు దీనికి తృప్తిపడక, వీటిని అనుమతించటమంటే ఇండియానుంచి కాశ్మీర్‌ను చీల్చివేయడమేననీ, అందువల్ల కనీసం జమ్మూ, లద్దఖ్‌లనయినా ఇండియాలో పూర్తిగా కలుపుకుని, కాశ్మీర్‌ని ఇట్లాగే ఉండనివ్వమని సూచిస్తున్నారు. అంటే కాశ్మీర్ విభజనకు మరొక చెయ్యి వేస్తున్నారు.

* * *

కాశ్మీర్ రాజరికం రద్దు విషయం మితవాదులు చేసిన విమర్శలవల్ల హైదరాబాద్, మైసూర్ల భవిష్యత్తు ఒక సమస్య అవుతున్నది. వీటి రాజప్రముఖులను ఉంచాలి కనుక, కాశ్మీర్ మహారాజునుకూడా ఉంచాలని వాదించక, రాజప్రముఖులంతా పోవలసిందేనని నెహ్రూ చెప్పారు. కేవలం సూత్రప్రాయంగా చెప్పటంతోనే తృప్తిపడక, ఈ రెండు సంస్థానాల రాజరికాలకు స్వస్తి చెప్పి, వాటిని భాషా ప్రాంతాలుగా విభజించే సావకాశాన్ని నెహ్రూ కలిగించటం అవసరం_ కాశ్మీర్ ప్రజల అభిప్రాయాలపట్ల సానుభూతి చూపకలుగుతున్న నెహ్రూ, హైదరాబాద్ ప్రజా వాంఛను గమనించటం అవసరం. రాజ్యాంగపు సాకులని చూపించకుండా, కాంగ్రెసుపార్టీ అధికారాన్ని కాపాడాలని చూడకుండా, హైదరాబాద్ ప్రజలవాంఛ అయిన భాషారాష్ట్రాల స్థాపనకు నెహ్రూ చర్య తీసుకోవాలి.

* * *

భాషారాష్ట్రాల స్థాపనకై దేశమంతటా ఆందోళనగానే ఉన్నది. ఈ విషయంలో కాంగ్రెసు నాయకుల వైఖరి సహించరానిదిగా ఉన్నది. అందువల్ల స్వామీ సీతారాం భీమవరంలో 21 రోజుల నిరశన వ్రతం సాగించి ముగించారు. ఆయన అనంతరం రామలింగారెడ్డిగారి దీక్ష సాగుతూవుండి నాలుగో తేదినుంచి వ్యక్తిగత సత్యాగ్రహం ప్రారంభమయింది. వీటివల్ల వీసమంత ఉపయోగమయినా ఉండదని చెప్పవలసి వుంటుంది. నిరశన వ్రతాలు, సత్యాగ్రహాలు ఇటువంటి లక్ష్యాలకోసం జరపకూడదని నెహ్రూ అనేకసార్లు విమర్శించి ఉన్నారు. ఆయనకూ, ఇతర అగ్రనాయకులకూ విషయాలన్నీ తెలిసే ఉన్నవి. కాబట్టి స్వామీజీ ఉద్యమంవల్ల ఆయనకు కలిగే ప్రబోధమేమీ లేదు.

ఇంక ప్రజలా, వారి ప్రబోధాల ఘట్టాల్ని ఎప్పుడో దాటివేశారు. వారు ఎదురు చూచేదల్లా తమను సంఘటితపరచి రాష్ట్రాన్ని సాధించే ప్రజోద్యమం కోసమే. స్వామీజీ దీనికోసం కృషి చేయటం అవసరం. లేదూ, వివాదగ్రస్తప్రాంతాల్లో చైతన్యం పోగొట్టుకుంటున్న ఆంధ్రప్రజలలో ప్రచారం చేస్తే, ఆంధ్రులకు నిజమైన సేవ చేసినవారవుతారు.

* * *

రాష్ట్రం లేకుండా బాధపడుతున్న ఆంధ్రుల సంపదలను వీలయినంతవరకూ దోచుకొనటానికి ఇతరులు ప్రయత్నిస్తున్నారు. కృష్ణాతీర వాస్తవ్యుల నోట్లో మట్టి కొట్టి, కడప జిల్లా పండ్లతోటలను నీటకలిపి, కృష్ణనీటిని దక్షిణాదికి తీసుకుని వెళ్ళటానికి మద్రాసు ప్రభుత్వం పనిచేస్తున్నది. ప్రభుత్వపు కృష్ణా పెన్నార్ ప్రాజక్టును ప్రజలు ప్రతిఘటించి, నందికొండ, పులిచింతల మొదలైన ప్రాజక్టులను ప్రతిపాదించి ఉన్నారు. దానిమీద కేంద్ర ప్రభుత్వం విచారణకు పంపినచో కమిటీ నివేదికను సమర్పించకముందే, కృష్ణా పెన్నార్ ప్రారంభమవుతుందని మద్రాసు మంత్రి రంగారెడ్డిగారు ప్రకటించారు. ఈ విషయమై పార్లమెంటు ఆంధ్ర వర్గాలు ఆందోళనతో ప్లానింగ్ మంత్రి దగ్గరకు రాయబారం వెళ్ళబోతున్నవి.

కేంద్రం ధనసహాయాన్ని తగ్గించినదన్న నెపంతో ఉత్తరాంధ్రకు అవసరమైన మాచ్‌ఖండ్ ప్రాజక్టుపని నిలిపివేయటం, రాయలసీమ మైనర్ ప్రాజక్టులను నిలపటం జరుగుతున్నవి_ తమిళ్నాడు మణిముత్తార్ ప్రాజక్టు మాత్రం నిరాఘాటంగా సాగిపోతున్నది.

* * *

దేశంలోని కొరతరాష్ట్రాల్లో ప్రధానమయిన మద్రాసులో జూన్ 6 న ఆహార కంట్రోళ్ళు రద్దుచేయబడ్డవి. ఇప్పటికేకూ ఒక్క విషయం స్పష్టంగా కనిపిస్తున్నది. చౌక ధరల డిపోలు లేకపోతే ఆహారధాన్యాలధరలు తగ్గవన్నదే ఆ అంశం. అంతేకాదు, ఈ సరుకు సప్లయి ఎంతకాలం సవ్యంగా నడపగలము అన్నది కూడా పెద్దసమస్యే. కంట్రోళ్ల బాధ వదిలినందుకు ప్రజలు సంతోషించినట్లు కనిపిస్తుందే కాని, కంట్రోళ్ళు ఖచ్చితంగా అమలు జరక్కపోవడం వల్లనే ఆ ఇబ్బందులకు వాళ్ళు గ్రహించటం అవసరం.

* * *

దేశంలో నానాటికీ నిరుద్యోగం పెరిగిపోతున్నది. కంట్రోలు తీసినప్పటికీ ధరలు పెరక్కపోవటానికి ప్రజల దగ్గర డబ్బు లేకపోవడమని విషయజ్ఞులు చెప్పు తున్నారు. ఈ పరిస్థితిలో మద్రాసు ప్రభుత్వం 3 కోట్ల రూపాయల కొత్తపన్నులను వేయబోతున్నది. దీనివల్ల బస్సురేట్లు పెరగటం, వ్యవసాయోత్పత్తుల ధరలు పెరగటం జరుగుతుంది.

* * *

అట్లాంటిక్ ఒప్పందం ఆసియా, ఆఫ్రికాలలో సామ్రాజ్యాలను సుస్థిరంగా చేసే ప్రయత్నమని ప్రధాని నెహ్రూ పార్లమెంటులో ఆరోపించారు. ఈ ప్రమాదాన్ని ప్రతిఘటించాలంటే, ఇండో చైనా, మలయాలను నెహ్రూ వదిలిపెట్టి ఊరుకోకూడదు. ఇండోనీషియా విషయంలో హాలెండుపై చర్యతీసుకున్నట్లే తీసుకోవాలి. ఇట్లాగే ట్యునీషియా, సూయజ్ మొదలైన వ్యవహారాల్లో కూడా సమిష్టి చర్యలు జరిపించటానికి పూనుకోవాలి. ఢిల్లీలో ఇండోనీషియా సభ జరిపినట్లుగా, వలస దేశాలన్నిటినీ కలిపి సామ్రాజ్యవాద ప్రతికూలసభను జరపాలి. అట్లాకాకుండా అసమగ్రంగా వ్యవహరిస్తే అరబ్ రాజ్యాల ప్రయత్నాలు విఫలమవుతున్నట్లే విఫలం కాక తప్పదు.



# 'కవి' శ్రీ కవికొండల వేంకటరావుగారి

## షష్టిపూర్తి మహోత్సవాన్ని గురించి సన్మాన సంఘంవారి విజ్ఞప్తి.

———:o:———

శ్రీ కవికొండల వేంకటరావుగారు, ఇప్పటికి సుమారు నలుబది సంవత్సరముల పైనుండి ఆంధ్ర సారస్వత రంగమునందు కృషి సల్పుచు, అందు వైవిధ్యముగల వికాసమును పెంపొందించు అనేక గేయములు, కథలు, ఖండ కావ్యములు, నాటకములు, ఏకాంకికలు మున్నగు నవెన్నియో రచించి అఖండమైన సేవ చేయుచుంట మన కందరకు తెలిసిన విషయమే!

తఱుచు పత్రికాముఖంబులనుండి, రేడియో ప్రసారములగుండా వారి కవితా మాధుర్యమును గ్రోలి ఆనందింపని ఆంధ్రులు లేరనుట అతిశయోక్తికాదు.

వారి రచనలు మొత్తము పదివేలపుటలవరకు కాగలవు. అందుకొలదిమాత్రమే "కొండకోలకు వికసితోత్పల" శీర్షికగ నింతవరకు గ్రంథరూపముల నచ్చుపడినవి. ఇంకను అవి అన్నియు నచ్చుపడుటకు, ఆంధ్రప్రజానీకము యొక్క చేయూత యెంతయు నవసరము.

అందుకు తగినట్లుగా కవిగారి షష్టిపూర్తి మహోత్సవము వారు పుట్టిన శుభవాసరమైన నందననామ సంవత్సర ఆషాఢ బ॥ ౧౧ నుండి (17-7-52) జరుప నిశ్చయించి నారము.

కావున, ఉత్తమోత్తములైన తెనుగుకవులలో ఒక్కరైన శ్రీ కవికొండల వేంకటరావుగారి షష్టిపూర్తి సందర్భమున వారి కవ్వారి సత్కారము కావింప నొక సంఘముగా నేర్పడినారము. మీరును మాతో జేరి, విరివిగ విరాళములొసగి మా పూనికను జయప్రద మొనరింపఁ గోరువారము.

---

సూ :—విరాళములు కార్యదర్శి, సన్మాన సంఘం, కవికొండల వేంకట్రావు షష్టిపూర్తి సన్మాన సంఘ కార్యాలయము, ఆంధ్ర హోమియో హాల్, మెయిన్‌రోడ్, రాజమండ్రి అని పంపవలెను.

# ఆషామాషీ

* "అవివేకి" *

## ఉపన్యాసాలూ — జోలపాటలూ

ఏ వచ్చీరాని జోలపాటో, కనీసం, కూనిరాగమైనా తీస్తూ, అర్ధగంటసేపు ఉయ్యాల ఊపుతూ, వీపుమీద జోకొట్తూ, నోట్లో పాలపీక పెట్టినాగాని, నిద్రపోవడానికి అతిమారాం పెట్తుంది పాపాయి—కన్నుమూస్తే తను చేయాల్సిన పరిపాలనంతా ఎక్కడ కుంటుపడిపోతుందోననే గాభరాతో అన్నట్టు! ఆఫీసులో అలసివస్తాడు పాపం నాన్న- లోపలయితే గాలిరాదు, బయటైతే దోమలు, నేల మీదయితే ఆవిరొస్తుంది, క్రొత్తచోటు అసలే కూడదు— పాపం ఏకారణం అయితేనే- రాత్రంతా దిండు చేత్తో పట్టుకొని అటూ ఇటూ పచార్లు చేస్తూనే ఉంటాడు నిద్రకు కరువాసిపోతూ. అమ్మ కోప్పడితే పక్కమీద వాలుతాడన్నమాటేగాని క్రికెట్టు కలవరింత, పరీక్ష పలవరింతలతో పట్టుమని పదినిమిషాలు సుఖంగా నిద్రపోడు మా తమ్ముడు.

యింటి వాతావరణంలో యింత కరువైపోయిన సుఖనిద్ర :సమావేశాల సంరంభంలో ఎంత అవలీలగా లభ్యమౌతుందో చూస్తుంటే నాకే ఆశ్చర్యమౌతుంది. ఊగిసలాడే కుర్చీమీదో, లేక కనీసం ఏ ప్రక్కనున్నవారిని ఆసరా చేసుకునో, పరుపు లేకపోయినా, చమట ముంచెత్తిపోస్తున్నా, పైన తల మాడిపోతున్నా, నల్లులు, ఈగలు, సిగరెట్టుపొగ, తంబాకు ఉమ్మి యిటువంటి యీతిబాధలొక లక్ష ఉన్నాగాని, నిశ్చింతగా, కండ్లు మూసుకొని సుఖనిద్ర ననుభవించడం సమావేశాలలోనే సంభవం. ఉపన్యాసకుల ముఖవర్చస్సో, వేదిక నెక్కినది మొదలు, స్థలానికి, కాలానికి, సమూహానికి, సందర్భానికి అతీతుడై, కేవలం తన్మయత్వంలో, కనీసం రెండుగంటలసేపైనా తా తలచిన ఉపదేశాలను సభాస్థలిలో ధ్వనింపజేసే అతని ఉపన్యాసంలోని మాధుర్యమోగాని— సభ్యులను పరిసరాలకు అతీతులనుజేసి, సుఖసుషుప్తిలో ముంచి తేలుస్తుంది. ఎక్కడో ఏ మన ముఖ్యమంత్రివంటి సమర్థుడో, గడ్డితినమనో, చాకలివాని గాడిదలవలె ఆదర్శయుతంగా, ప్రభుత్వంవేసిన బరువునంతా— ఒకవేళ కొంచం ఎక్కువైనా, కాళ్ళతో తన్నకుండా కొంచం పదిలంగా పట్టుకొని— మోయమనో, అపురూపమైన సలహాల నిచ్చినప్పుడు ఒక్కొక్కమారు నల్లికుట్టినంతమాత్రం ఉలిక్కిపడ్డా, సభ్యుల సుషుప్తి దీర్ఘకాలం భంగం పొందదు.

ఇంత సుళువైన సుఖనిద్ర మార్గాలను ఒదులుకొని, అమ్మా, నాన్నా ఎందుకలా అవస్త పడతారు? వంటపైమూ ఆఫీసుపైమూ అడ్డం వస్తే, ఇలాంటి ఉపన్యాసాలను రాత్రంతా ఏర్పరచమంటే సరి. నాన్నకు సలహా చెప్పాలి- యిలా నిద్రపట్టని వారంతా వెంటనే ఒక సంఘంగా, ఏర్పడి, ఇకమీద సమావేశాలూ ఉపన్యాసాలూ రాత్రులందే జరిపించాలని ప్రభుత్వానికి ఒక అర్జీ పెట్టుకోమని- ఏలాగూరోజురోజుకూ, వీధివీధినా, వాడవాడా, చాకలివారికి సమావేశమో, మంగలివారికి మంత్రోపదేశమో, ఒక సమాజమో, సంఘమో, సంస్థో క్రొత్తగా స్థాపించడమో జరుగుతూనే ఉన్నాయి. ఇంకా కొరవా సరవా ఉంటే, స్థాపించినవి మూతవేయడానికి కూడా ఏ మంత్రి పుంగవునో పిలిచి, ఒక సమావేశం ఏర్పాటుచేసుకుంటేసరి— ప్లానింగ్ కమిషన్‌వారి పంచవర్ష ప్రణాళికలో, నిద్రపోలేనివారిని నిద్రపుచ్చడం అనే ఒక కార్యక్రమాన్నికూడా జేర్చమని యిప్పుడే అర్థించాలి.

## "వెర్రి కుదిరితే రోకలి తలకి చుట్టుకో...."

...అన్నట్టుగానే వుంది కడప జిల్లాబోర్డు వ్యవహారం!

మొన్న 14ని 'రాయలసీమ అయిదు జిల్లాలతో' ప్రత్యేక రాష్ట్రం ఏర్పర్చివ్వాలని కోరుతూ రాజాజీకి రాయబారం పంపిందట!

ఇన్నాళ్లూ క్షామదేవత విలయతాండవంలో నలిగి, ఒళ్ళంతా పగిలి, రాజాజీ పర్యటన ప్రభావంవల్లనైతేనేం, కొద్దిగా వర్షాలు కురిసి తిరిగి కాస్త పచ్చదనం ప్రాప్తించడమూ, ఆవర్షం జల్లుతోబాటే ఇటువంటి వింత ఆలోచనలన్నీ అంకురించడం- జరిగినట్లున్నాయ్... లేకపోతే క్షామాలతో సతమతమయ్యే సౌభాగ్యవంతమైన జిల్లాలతో- అన్ని రీతులుగా సహకరించిన సర్కారాంధ్రులను తలదంటూ- విశాలాంధ్ర గురించి పూర్తిగా విస్మరిస్తూ ఈ "రాయలసీమ రాష్ట్రం" అనే కబురుని ఒక డిస్ట్రిక్ట్ బోర్డులాంటి బాధ్యతాయుత సంస్థ, లేవదీయడమేమిటి?

అసలే హాస్యాస్పదంగా వున్న ఆంధ్రరాష్ట్ర సమస్యను మరింత దిగజారిస్తూ అపఖ్యాతి నార్జించుకుంటున్నారు రాయలసీమాంధ్రులు.

# కీ. శే. శ్రీమతి కలగర పిచ్చమ్మగారు



శ్రీ కలగర రామస్వామిగారి ధర్మపత్ని, శ్రీమాగంటి బాపినీడుగారి సహోదరి, వీరాంగన కీ. శే. శ్రీ మాగంటి అన్నపూర్ణదేవిగారి మాతృదేవియునగు శ్రీమతి కలగర పిచ్చమ్మగారు 21-6-1952 న పరమపదించారు.

గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం, ఖాదీ ఉద్యమాలలోనే గాక. మహిళా జనోద్యమం, అస్పృశ్యతా నివారణోద్యమం మున్నగు సాంఘిక రంగాలలో, విశిష్టమైన దేశభక్తితో, అసమానమైన కార్యదక్షతతో, బహుకాలము సేవజేసి, స్త్రీ జనానికి ఆదర్శప్రాయమైన శ్రీమతి పిచ్చమ్మగారు ధన్యజీవి-నారీ రత్నమనదగు కుమార్తెయొక్క అకాల మృత్యువుచే కలిగిన సంతాపాన్ని మ్రింగి, ద్విగుణీకృతమైన దీక్షతో, దేశసేవకై నిన్నమొన్నటివరకు పాటుబడిన ఆమె మృతివల్ల నారీ లోకములో ఒక కాంతికిరణం లోపించగలదనుట అతిశయోక్తికాదు.

ఆమె ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించుచూ, ఆమె బంధువర్గమునకు మా హృదయపూర్వక సంతాపమును తెలియజేయుచున్నాము.

---

# ఆంధ్ర మహిళా సభలో

## వివిధశాఖల కార్యక్రమ ప్రారంభం.

| | |
|---|---|
| జూన్ 2-వ తేదీనుండి | పారిశ్రామిక విద్యాలయము. |
| ,, 9 ,, | ఎడ్మిషన్, సీనియర్. |
| ,, 17 ,, | జూనియర్, సబ్ జూనియర్, సబ్‌సబ్ జూనియర్. |
| జూలై 1 ,, | ఎనిమిదవ తరగతి. |
| ఆగష్టు 1 ,, | అద్దకపు పనులు. |

వివరముల పట్టీ కావలసిన 0-8-0 పోస్టేజీ బిళ్ళలు పంపవలెను.

వివరములకు :

కార్యదర్శిని,
ఆంధ్ర మహిళా సభ,
మైలాపూర్, మద్రాస్-4.





# పెద్ద వదిన

*  *  *

పెద్ద నాటిక

*  *  *

.... శ్రీమతి ఎ. రత్నమ్మ ....

(గత. సంచిక తరువాయి.)

[జరిగిన కథ :—వృద్ధ దంపతులైన విశ్వపతి—శారదాంబలకు, పెద్దకూతురు, అన్నపూర్ణ గురించి తీరని మనోవేదన. పెద్ద ఆస్తులు లేకపోయినా, బుద్ధిమంతుడు కదాయని సుబ్రహ్మణ్య శాస్త్రి కిచ్చి వివాహం చేశారేమో, అమ్మాయి మాత్రం ఇంట్లోని అత్తా-ఆడబడుచులనే దుశ్శక్తులమూలంగా రంపకోతకు గురి అయింది. ఆ శక్తుల్ని ప్రతిఘటించనూ, శాస్త్రి—అసమర్థుడు. అతని తమ్ముడు, ఎం.ఏ., స్టూడెంట్. నరసింహానికి మాత్రం ఎన్ని ఆధునిక భావాలున్నా, గయ్యాళి తల్లి గంగాయమ్మ—అక్క- చెల్లెళ్ళు, కమలా-విమలా వీరి ముందు, అతందేమాపైనా సాగుతుంది గనుకా ?

అన్నపూర్ణ, ఆదర్శ గృహిణి. ఒక పుష్కరం గడిచినా కన్నవారిని కళ్ళారా చూసే భాగ్యం లేకుండా, పిడుగుల్లాంటి అత్తా-ఆడుబడుచుల్ని—ఉరుములాంటి భర్తనీ—భరిస్తూ. ఆ భయానక వాతావరణంలో—ఎల్లా ప్రాణాలు బిగపట్టుకునుందో !

విశ్వపతిగారి రెండో అమ్మాయి, లీల. లీలా—అన్నయ్య మనోహర్ రావూ—యూనివర్సిటీ విద్య నభ్యసిస్తున్నారు. అక్కయ్య అన్నపూర్ణ హీన చరిత్ర వింటూ వారి గుండెల్లో విప్లవ జ్వాలలు మండుతున్నాయి. అక్కయ్య ముగ్గురి పిల్లల్ని కనిపున్నా, మురిపేనికి ఒకసారైనా వెళ్ళి చూసిరానూ నోచుకోకపోవడమేమిటని అప్పటికప్పుడు ఆమె ఊరికి బయల్దేరారు. ఇహ చదవండి.]

మూ డ వ దృ శ్యం.

(సమయం-ఉదయం 8 గంటలు. శాస్త్రి తన ఆఫీస్ రూమ్‌లో కూర్చుని టైపిస్టుకు యేదో ఉత్తరం dictate చేస్తున్నాడు. 10 గంటలకల్లా తయారవవలె నన్న తొందరతో టైపిస్టు గబగబ టైప్ చేస్తున్నాడు. ఇంతలో వాకిట్లో బండి ఆగుతుంది.)

బండివాడు:_అయ్యా, ప్లీడరుగారట. సుబ్రహ్మణ్య శాస్త్రిగారంట, గంటనుంచి వారియిల్లు వెతికినా కనిపించలేదు. ఎవరో కొంచెం సెలవిస్తారా.

శాస్త్రి:- (బైటికొచ్చి) ఎవరుకావాలోయ్ నీకు.

బండి:_ సుబ్రహ్మణ్యశాస్త్రిగారిల్లు యేదండి.

శాస్త్రి:- పొలుపర్తేనా? అయితే యిదే.

(వెంటనే జట్కాలోంచి మనోహర్ లీల దిగుతారు)

శాస్త్రి :-(తనలో) వీడు నా బావమరది కాడుగదా! ఏం గొడవో యివ్వాళ. ఇవ్వాళా - నిన్నా 13 సంవత్సరాలనాడు చూచాను. అప్పుడు చాల చిన్నవాడు. ఇది నా మరదలు కాదుకదా! అప్పుడు అదీ చాల చిన్నది. వాళ్ళక్కయ్యను కొట్టానన్న విషయం

తెలిసి తగాదాకు రాలేదు కదా !...ఆ వెధవలు యేం చేస్తారు!

మనో :_ఏం బావా! అలా చూస్తావు? గుర్తించలేదా? నేను మనోహర్‌ని. అంతా క్షేమమేనా? పాపాయి పుట్టాడటనే! చెల్లాయి, నేను చూచిపోదామని వచ్చాము. అమ్మకూడా వస్తానందికాని మళ్ళీ రాలేక మమ్మల్ని వెళ్ళిరమ్మంది.

లీల :_ఏదో 13 సం॥రాలనాటి మరపలు, బావమరది ఆయనకు గుర్తున్నారూ ? ఏంబావా?

గంగా :_(లోపల్నుంచి) ఎవర్రా అబ్బాయి వొచ్చింది ?

శాస్త్రి :_(వినబడనట్లు) ఏమిటమ్మా నువ్వంటున్నది.

మనో :_మేమే అత్తయ్యా. నేనూ_లీల. అందరిని ఒకసారి చూచిపోదామని వచ్చాము. (అంటూ లోపలికి వెడతాడు. అతని యీ కలుపుగోలు ప్రవర్తన శాస్త్రికి అయిష్టంగాను, ఆశ్చర్యంగాను వుంటుంది. అతనుకూడా వారి వెంట వెడతాడు.)

గంగా :_సరే మీరా? ఇంకెవరో అనుకున్నాను. మీ అక్కయ్య వున్నదిగా. ఆమెదగ్గరకే వెళ్ళండి. మధ్య యీ బోడిముండ పెత్తన మెందుకూ ?

మనో :_అదేమిటత్తయ్యా అలా అంటావు. పెద్దదానివి నీ తరువాతనే ఎవరయినాను. (ఇంతలో కమల, విమల ప్రవేశం. అన్నపూర్ణకూడా వస్తుంది. వీరిని చూచి నిర్విణ్ణురాలవుతుంది).

కమల :_ఎవరమ్మా వీరు, మన చుట్టాలా ?

గంగా :_ఏదో వుంది తోటకూర, గోంగూర చుట్టరికం. మీ పెద్దవదినగారి తమ్ముడు_చెల్లెలు.

విమల :_ఏవమ్మోయి వదినా (వెనక్కు_తిరిగి) అహావచ్చావు. మీ తమ్ముయ్య, చెల్లమ్మ వచ్చారు. సీటలువేసి కూర్చోమను.

లీల :_అయితే వదినా మా రాక మీకంత కష్టంగా వుందా. అయితే చెప్పు. ఇప్పుడే వెడతాం.

గంగా :_ఏమి గడసరి మాటలు మాట్లాడ నేర్చావే పిల్లా. ఎంత చదువుకున్నదానివయిన మాకూ ఆమాత్రం తెలివితేటలున్నాయి. మీ కష్టనిష్ఠూరాలతో నాకేమి పని? మీ అక్కయ్యకోసం వచ్చావు. మీ అక్కయ్యను చూస్తావు. మొత్తానికి మీ అమ్మ తెలివి తేటలే వచ్చాయి. ఇంకేముంది నాకొడుకు కాపరానికి నీళ్ళే. అ మహాశక్తి నీకు రమ్మని దొంగ ఉత్తరం రాసింది గాబోలు. కాపరం చెయ్యనియ్యకుండా అక్కయ్యను తీసుకొని పోవటాని కొచ్చావు. సిగ్గులేదు నీకు.

విమల :_ఆ పిల్లకేం పెళ్ళా పెటాకులా, చేసేదేముంది.

కమల :_ఇలా ఎందరి కాపరాలు తీస్తుందో ?

మనో :_కమలా ! పెళ్ళి కాని దానివి నువ్వూ వున్నావు గదమ్మా. నీ పని అన్నయ్య కాపరాలు తీయటమేనా.

కమల :_అమ్మా చూసావుటే. నేను అన్నయ్య కాపురం తీసేదానినట. ఈ వెధవ అంటున్నాడు.

గంగా :_చూడు ఎలా చూస్తోందో గ్రుడ్లు పెట్టుకొని. అయితే అన్నపూర్ణ...మీ తమ్ముడు యిలా అనటం నీకూ యిష్టమేనన్నమాట.

అన్న :_అనమని చెప్పానా ? మీరే చెప్పండి.

విమల :_మౌనం అర్ధ అంగీకారమన్నట్లు అంతేగా అర్థం.

శాస్త్రి :_అసలు మీరెందుకొచ్చారు ? మనోహరరావు_మా కుటుంబములో కలతలు పెట్టడానికేనా ?

మనో :_ఎందుకు బావా_ఇలా కోప్పడతావు? మేము మీ ఇంటికి రాక, మీరు మాయింటికి రాక, కలకాలం యీ పోట్లాటలు ఉంటాయా ? ఏదో పెద్దవాళ్ళు, పెద్దవాళ్ళు అనేకం అనుకుంటారు. అవి మనం లెఖ చేస్తే ఎలా చెప్పు. తప్పు మావాళ్ళదే అనుకో. నీవు సర్దుకోక పోతే ఎవరు సర్దుకుంటారు. శాంతంగా ఆఫీసు రూంలో కూర్చుని మాట్లాడుకొందాముర్రా. (అని చెయ్యి పుచ్చుకొని లాక్కెడతాడు.)

శాస్త్రి :_ఏమిటోయి నువ్వు చెప్పేది నేతిబీరకాయి. మీ అక్కయ్యను పంపమనేగా. పంపటానికి వీల్లేదు.

మనో :_శాంతించు బావా! వచ్చిన విషయాల్ని గూర్చి శాంతంగా మాట్లాడుదాము. నీ వంట్లో ఆరోగ్యంగా వుంటోందా. పిల్లలేరి ? పసిపిల వాడికి చేశా

పెట్టారు. అక్కయ్యా పాపాయిని తీసికొనిరా ఎత్తుకుంటాను. పెద్దచిట్టి ఏది. ఏమయినా చదువుకొంటున్నదా?

శాస్త్రి:-పిల్లల గొడవ నీకెందుకోయి. విషయమేమిటో చెప్పు.

మనో:-లాయరువైయుండి, ఇతరుల మాటను జాగ్రత్తగా వినాలి గాని, అంత తొందరపడితే ఎలా బావా.

లీల:-అన్నయ్యా పాపాయి యిదుగో. శ్యాము, ప్రభ దొడ్లో మట్టితో ఆడుతున్నారు. పెద్దవాడు బడికి వెళ్ళారట. ఇప్పుడే వస్తాడు.

గంగా:-భట్టాకముండ చేష్టలు చెయ్యకు. పిల్లమీద చెయ్యి వేస్తే మర్యాద దక్కదు. కమలు ముందు.

కమల:-అదంతా ప్రేమకాబట్టే 13 సం॥ల దాక ముఖము చూపలేదు.

విమల:-ఈ టెక్కులరాణికి నటనలుకూడా తెలుసు.

మనో:-ఏమండి వదినగారు. మాటలు జాగ్రత్తగా రానీయండి. మీ వ్యవహారం శ్రుతిమించి రాగాన పడుతోంది. ఎవరైనా సరే హద్దులు మీరకూడదు.

విమ:-కొడతావా. చెప్పవేంరా గాడిదా.

లీల:-వాడు మిమ్మల్ని ఎందుకు కొడతాడు. అన్నింటికి తెగించిన మీరే వాడిని కొట్టాలి.

గంగా:-ఏమిటే నువ్వు పతితువి. అదీ తెగించిందా. చూస్తావేంరా అబ్బాయి అలా అంటుంటే.

శాస్త్రి:-లీలా!...మీరు చాల అమర్యాదగా ప్రవర్తిస్తున్నారు. మీ అక్కయ్యను పంపటానికి వీల్లేదు. మర్యాద కాపాడుకో దల్చుకుంటే మీ దోవన మీరు వెళ్ళండి. ఇంతవరకు మీవల్ల మాకు కలిగిన ఉపకారం చాలు. నువ్వు, నీ అన్న ఎంత త్వరగా వెడితే అంత మంచిది.

మనో:-బావా! గౌరవించదగినంతవరకు గౌరవించాను. మర్యాద యివ్వదగినంతవరకూ ఇచ్చాను. కాని మీబోటి కసాయిమూక దగ్గరకాదు మా మర్యాద మంచితనాలు. ఎంతో మర్యాదగా, ఆప్యాయతతోను గతాన్ని మరచి, నేను నా చెల్లెలు మాట్లాడుతుంటే చదువుకొన్న నీబోటి వానిదగ్గరనుంచి చాలా అసభ్యంగా ప్రవర్తించారు. నీచెల్లెలులాంటి గయ్యాళిమూక నా యింట్లోనే వుంటే యేనాడో వెళ్ళగొట్టే వాణ్ణి. నీ తల్లిలాంటి కర్కశ హృదయురాలు నా తల్లే అయితే ఏనాడో ఆమెను చంపి నేనూ చచ్చేవాడిని. అసమర్థుడులాగ తల్లి, చెల్లెళ్ళ మాటలు విని న్యాయాన్ని మరచిపోయి జీవయాత్ర గడుపుతున్నావు. మహా యిల్లాలయిన నీ భార్యను అష్టకష్టాలపాలు చేస్తున్నావు. నీ పూర్వ పుణ్యఫలంచేత మా అక్కయ్యలాంటి భార్య నీకు దొరికిందిగాని వెయ్యి జన్మాలు తపస్సు చేసినా యిలాంటిది దొరకదు.

గంగా:-అబ్బో. ఆమె యోగ్యత, నీ యోగ్యత.

శాస్త్రి:-అనవసరమయిన ప్రలాపాలు కట్టిపెట్టి సున్నాం దిగుతావా? లేక చెప్పులో శాస్తి జరపనా.

మనో:-బావా! నన్ను నీవు మీ అమ్మగాని లేక మీ అక్కయ్యగాని అనుకొన్నావా. నీ పౌరుషం ఆడదాని దగ్గరగాదు. నిజంగా ధైర్యం ఉంటే చెప్పుతో నాకు బుద్ధిచెప్పు. నీ పరాక్రమం చూస్తాను. ఎంతో గారాబంగా పెంచిన కన్నకూతుర్ని 13 సం॥ల దాకా చూడని తల్లిదండ్రులు ఎంత బాధపడతారో నువ్వే ఆలోచించు. నీ చెల్లెల్ని రేపు నీ బావమరిది యిదేవిధంగా చేస్తే ఆనాడు నీకర్థమవుతుంది, యితరుల బాధ. అమ్మ, నాన్న మంచం పట్టారు. నిద్రాహారాలు లేకుండా ఏడుస్తూ ఉన్నారు. నీకు నిజంగా హృదయం లేదు.

లీల:-రేపు నీ కూతుర్ని నీ అల్లుడు యీవిధంగా చేస్తే ఆనాడు నీకు నిజమయిన పశ్చాత్తాపం కలుగుతుంది. ఈరోజు మీరు మాకు జరిపిన అవమానాన్ని మా అక్కయ్యమీద ప్రేమచేత సహించాము గాని, యింకొకరు అయితే తలనిచ్చేవాళ్ళముగాదు. మీ అందరిది రాతి హృదయాలు.

మనో:-రా అమ్మాయి, పోదాం పశువులవలె వారు ప్రవర్తిస్తే, మనం ప్రవర్తిస్తామా? పోనీలే అక్కయ్యను ఆయనకు బలి యిచ్చాం. ఏనాటికైనా దాని గొప్పతనమే ఆయనలో మార్పును తీసుకొస్తుంది. మన అక్కయ్యను యిటువంటి కష్టాలు పాలుచేసిన వాళ్ళమ్మ ఏమి బావుకుంటుందో చూద్దాం. ఆమెకూ పెళ్ళి కావలసిన ఆడపిల్ల వుంది. వెడదాం రా.

(అని ఇద్దరు నిష్క్రమిస్తారు.)

# పెద్ద వదిన

## నాల్గవ దృశ్యం

(హైకోర్టు జడ్జి సుందరంగారి ప్రవేశం: వారు అటు వెళ్ళారో లేదో ఆ ఒక జట్కాబండిలోనుండి యీయన దిగుతాడు.)

సుందరం:-అయ్యా, సుబ్రహ్మణ్య శాస్త్రి గారిల్లిదేనాండి.

శాస్త్రి:-దయచేయండి. అలా కుర్చీలో కూర్చోండి. (ఆయన చేతిలోవున్న సంచి చూచి—తనలో—ఎవరో బంధువులాగే వున్నాడే, అనుకుంటాడు). ఇదుగో, ఏమేవ్. నిన్నే... బాబుగారికి కాసిని కాళ్ళు కడుగుకోటానికి నీళ్ళు తీసికొనిరా.

సుంద:-(కాళ్ళు కడుగుకొని) అమ్మాయి... భార్య...

శాస్త్రి:-ఆ ఆ. అవునండి. నా భార్య; కూర్చోండి; ఇప్పుడే వస్తాను.

(లోపలికి వెడతాడు.)

గంగా:-ఎవరు నాయనా, ఆయన? క్లయింటు ఎవరైనానా?

శాస్త్రి:-కాదమ్మా. ఎవరో నాకు తెలియదు. కాని భోజనం మట్టుకు యిక్కడే చేస్తాడు. వంట చాలా జాగ్రత్తగా 2 కూరలు, పప్పు, పులుసు, పచ్చళ్ళు పిండి వంటతోసహా చెయ్యండి.

(బైటకువచ్చి సుందరంతో)

క్షమించండి. మిమ్మల్ని ఒంటరిగాకూర్చోబెట్టాను.

సుం:- ఫరవాలేదులే నాయనా. మీ అమ్మ ఉన్నారా?

శాస్త్రి:-తమ రొచ్చిన... పని సెలవిప్పించగలరా.

సుం:-నేను వచ్చింది గొప్పపనిమీదే. ఏమిటో యీ ఆడపిల్లలంటూ పుట్టారంటే వాళ్ళను ఒక అయ్య చేతుల్లో పెట్టిందాకా మనకు భారంగానే యుంటుంది. మొగవాళ్ళతోపాటు వీళ్ళనుకూడా ఎంత చదువులు చదివించినా చివరకు మూడు ముళ్ళు పడితేగాని భారంతీరదు.

గంగా:-కాదటండీ మరి. ఏదో ఊరికే ఇంట్లో కూర్చోపెట్టలేక, కాలం మార్పువల్ల చదివిస్తామే గాని పెళ్ళికాందే ఆ పిల్ల తలభారంగానే వుంటుంది. మా అమ్మాయికీ ఒకదానికి పెళ్ళి కావాలి.

సుం:-అలాగామ్మా. చల్లకొచ్చి ముంతదాచటం ఎందుకు? నాకు ఒక కూతురు, కొడుకు. కొడుకు 22 ఏళ్ళవాడు. బి.ఏ. మొదటి సంవత్సరము చదువుతున్నాడు. ఈ క్లాస్తు అవగానే డాక్టర్ కోర్సుకు పంపుదామనుకుంటున్నాను. అసలు ఎఫ్. ఏ. అవగానే చేరాల్సింది. కాని మన బ్రాహ్మలకు ఒక విద్యలో యేమిటి, ఉద్యోగాలలో యేమిటి అన్నింట్లో అన్యాయం చేస్తున్నారు గదండి. అందుచే సీటు రాలేదు. అమ్మాయికి 24 సంవత్సరాలు. బి.ఏ. రెండవ సంవత్సరం చదువుతున్నది. దాని తల్లిపేర చాల ఆస్తివుంది. మీ కుఱ్ఱవాడు మొన్న మద్రాసు వచ్చినప్పుడు, హఠాత్తుగా బీచివద్ద కలిసాడు. నాకో జబ్బుంది లెండి. కొంచెము తెలివితేటలుగా చదువుకున్న కుఱ్ఱవాడంటూ కనిపిస్తే కులంగోత్రం అడిగి వివాహమయిందీ లేనిదీ అడుగుతాను. మీ కుఱ్ఱవాడు నాకు నచ్చాడు. వెంటనే యింటికి తీసికొని వెళ్ళి పిల్లను చూపాను. నచ్చిందన్నాడు. నేనుకూడా వస్తాను, 4 రోజుల తర్వాత యిద్దరం కలిసి వెడదాం అని అతనెన్నోవిధాల చెప్పాడు. కాని నా ఆదుర్దాచేత అతని దగ్గర మీ అడ్రసు తీసుకొని మీ ఉద్దేశ్యం తెలిసికొని పోదామని వచ్చాను. మీరు ఊ అంటే యీ మాసంలోనే వారం రోజులలో లగ్నముంది. ఏదో భగవంతుని అనుగ్రహం, మీదయ కలిగిస్తే ఆ లగ్నానికి ముడిపెట్టొచ్చు.

గంగా:-మా అనుగ్రహమేమిటి బాబు. ముఖ్యంగా పిల్లకు-పిల్లాడు, పిల్లాడికి పిల్ల నచ్చాలి. మా వాడికి 20 వేలు 30 వేలు యిచ్చి అనేక మంది పిల్లల్ని యిస్తామన్నారు. కాని కొందఱు పిల్లలు మావాడికి నచ్చక, కొంతకాలం చేసుకో దల్చుకోక యింతకాలం వున్నాడు గాని, లేకపోతే ఎప్పుడో అయ్యేది. అయితే కట్నం కానుకల మాటేమిటంటారు.

శాస్త్రి:-(తనలో) ఈ అఘాయిత్యపు గుంపు మూలాన ప్రతివాళ్ళు కుఱ్రవాడు నచ్చినా వెనకకి తిరిగిపోతున్నారు. తెలిసినవాళ్ళు పిల్లనిస్తారనటం కల్లమాట.

అటువంటప్పుడు వాడి అదృష్టము కలిసి వచ్చి బి.ఏ. చదివిన పిల్లనిస్తుంటే, అమ్మ తెలిసీ తెలియని మాటలు మాట్లాడుతుందేమిటి? (ప్రకాశంగా) ఆ విషయాలు తర్వాత మాట్లాడ వచ్చమ్మా.

సుం:-అమ్మా! ఉన్న గుట్టు చెప్తున్నాను. హైకోర్టు జడ్జిగా పనిచేసి ప్రతివాళ్ళ కాళ్ళు పట్టుకోటం నా స్వభావానికి వ్యతిరేకం. దానికేదో కొంత స్త్రీ ధనం ఉంది. అదీగాక పిల్ల నచ్చి చేసుకొనేవారికే నేనిస్తాను గాని, కట్నాల కాశపడి చేసుకొనేవారికి నేనివ్వను. డబ్బు వ్యామోహంతో యిప్పుడు పిల్లను చేసుకొంటూరు. తర్వాత నానా చెరలు పెడతారు. ఇప్పుడు మాలోనే ఒక సంబంధము వుంది. కుర్రవాడు ఎం.బి. బి.ఎస్. చదువుతున్నాడు. పెద్ద ఆస్తులు లేక పోయినా మిరియం లాంటివాడు. కట్నాలు కానుకలు యేమాత్రం పుచ్చుకోడు. కాని పిల్ల, పిల్లవాడు సమ వయస్కులు కావటంచేత ఆ సంబంధం కాలేదు... లేకపోతే యేనాడో అయ్యేది. వాడు నాకు మేనల్లుడు వరసకూడా అవుతాడు. అదేకాక నాకు ఒక్కగా నొక్క కూతురు. సంవత్సరానికి 10 నెల్లు అల్లుడు నాదగ్గరే వుండాలి. మీరుకూడా బాగా ఆలోచించు కోండి. తర్వాత లగ్నాలు పెటుకోవచ్చు.

శాస్త్రి:-సరేలెండి. నేను మీకు రేపు వుత్తరం వ్రాస్తాను. మా తమ్ముడుకూడా 2, 3 రోజుల్లో వస్తాడు. పిల్లవాడికి నచ్చుతే మేము చూడవలసిన పనేలేదు. వాడు రాగానే వాడి అభిప్రాయం కనుక్కొని, యిష్టమయితే లగ్న నిశ్చయాలకు వుత్తరం వ్రాస్తాను. అన్నీ సిద్ధంగానే ఉన్నాయి. వెనకటికాలపు పెళ్ళిళ్ళయితే ఎన్నో ప్రయత్నాలు చెయ్యాలి.

సుం:-సరే నేవొస్తానమ్మా. నాయనా వెళ్ళి వొస్తాను.

శాస్త్రి:-అదేమిటండి, భోజనంచేసి వెళ్ళరూ? యీరాత్రి యిక్కడే వుండండి.

సుం:-అలాగాదు లెండి. చాల అర్జంటు పనులున్నవి. అదీగాక గతుకుతే అతకదంటూరు. హోటల్లో భోంచేసి రైలెక్కుతా.

(నిష్క్రమణ)

## ఐదవ దృశ్యం

(సమయం: సాయంత్రము 5 గంటలు)

శాస్త్రి:—అయితే తమ్ముడూ, నీకు పిల్ల నచ్చినట్లేనా. కట్నకానుక లేమీ యివ్వరట. బాగా ఆలోచించుకో. అయితే తల్లి ఆస్తి వున్నది. నీకు ఇష్టమయితే యీ రోజే ఉత్తరం వ్రాస్తాను.

నరసింహం:-కట్నకానుకలతో నాకు పనిలేదన్నయ్యా. నాకు మంచి చదువుకున్న పిల్ల కావాలి. నేను ఇష్టపడితే ఆయన ఆ పిల్లను ఎం.ఏ. చదివిస్తాడట. ఇంకేమాత్రం ఆలస్యం చెయ్యవద్దు నువ్వు. తక్షణం వెళ్ళి తాంబూలాలు పుచ్చుకొని లగ్న నిశ్చయాలు చేసికొనిరా. నీవు మళ్ళీ రావటమెందుకు. ఇంట్లో అందర్ని తీసికొని నేనే వస్తాను. రు. 4,000 లు తెమ్మంటావా. కావలసినవన్నీ అక్కడే కొందాము.

శాస్త్రి:-సరే నేనలాగే యీరోజు బయలుదేరుతాను.

నర:-కాని అన్నయ్యా చాల తొందరపడ్డావు. నేను గనుక వూళ్ళో వుంటే యిటువంటి ఘోరం ఎన్నడూ జరగదు. జరిగేదికాదు. ఈ చంటిబిడ్డల్ని చూచి పెళ్ళిలో నలుగురు మీ వదిన ఏదంటే యేమని సమాధానం చెప్తాము చెప్పు. అదీగాక అటువంటి మహా యిల్లాల్ని, అమ్మ, అక్కయ్య మాటవిని పుట్టింటికి వెళ్ళగొట్టడం నా మనస్సుకేమీ బాగాలేదు.

శాస్త్రి:-ఏంచేసేది తమ్ముడూ. ఈ యింట్లో పోట్లాటలు నాకు పిచ్చి యెక్కిస్తాయేమోనని భయంగా వుంది. అమ్మకుగాని, చెల్లెళ్ళకుగాని బదులు చెప్తే రేచుల్లాగ విరుచుకుపడతారు. తండ్రి చావబట్టిగదా వీరి ఖర్మమిలా కాలిందని లోకులంటారని నాకు భయం. అందుచే వారు చెప్పినట్లల్లా వినక తప్పదు. మీవదిన మహా యిల్లాలని నాకు తెలుసు. దాన్ని వెళ్ళగొట్టినపుడు నేనూ యింటో లేను. కోర్టు కెళ్ళినప్పుడు యీ పని చేశారు. నేను మాత్రం యేం మాట్లాడుతాను. సరలే. టైమ్ అయింది. నేను బండికి వెడుతున్నాను. రేపు సాయంత్రానికి వైర్ యిస్తాను. ఎల్లుండి బయలుదేరండి. తల్లికి దూరమైన మూడునెలల గుడ్డును చాల జాగ్రత్తగా తీసి

కోనిసండి. పాలు ఎక్కువ సార్లు పట్టొద్దు. అజీర్తి చేస్తుంది.

(రెండుగోజుల తర్వాత)

గంగా :–అబ్బాయి, యీరోజేగా మన ప్రయాణం.

నర :–అవునమ్మా. సరేగాని పగిన లేపుసదా. పీటలమీద ఎవరు కూర్చుంటారే. అందరు వొదిన ఏదంటే యేమి చెప్పుదాము.

కమ :–చచ్చిపోయిందని చెప్పుదాము. మరోమార్గం లేదు.

సర :–అక్కయ్యా, అంత కఠినంగా మాట్లాడటానికి నీ నోరెల్లా వచ్చిందే. బుద్ధి తక్కువ పనులు చేసి అఘాయిత్యాలు రిస్తారు. బతిమాలి కాళ్లు గడ్డాలు పట్టుకొని క్షమించమని వదినను నేను తీసికొని వస్తాను. మీకెందుకు మీరు వూరుకోండి.

కమల :–ఇలాంటి పిచ్చి వేషాలేస్తే మేమెవరము అసలే పెళ్ళికి రాము.

గంగా :–ఆమెగారు లేకపోతే లోటులేదులే. మావయ్యా, అత్తయ్య కూర్చుంటారు. టయిము అయింది. బయలు దేరండి.

(మరుసటిరోజు)

(పెళ్ళివారింట్లో జనం తొక్కిట్లాడుతూ వుంటారు. పెళ్ళికొడుకూ–పెళ్ళికూతురు పీటలమీద కూర్చుని పురోహితుడు చెప్పే మంత్రాలు వల్లిస్తూ వుంటారు.)

కమల :–(పిల్లవాణ్ణి సముదాయిస్తూ) నా తండ్రి ఏడవకే. నానాయన ఏడవకే... తాగు చిట్టి యీ కాసిని పాలు తాగు.

గంగా :– నీళ్ళు మూడు వొంతులు, పాలు ఒక వంతు పొయ్యి.

సుంద :–(ప్రవేశిస్తూ) ఏమిటండీ యీ అన్యాయం గంగాయమ్మగారు. మీ పెద్ద కోడలు చచ్చిపోలేదటగా.

గంగా :–ఎవరన్నారు. అయ్యో రామా. మా ఖర్మం అలా కాలకపోతే యీ పిల్లాణ్ణి యిలా పెంచేగతి ఎందుకు పడుతుంది. (ఏడుస్తుంది).

సుంద :–ఎందుకండి వగలమారి ఏడ్పు లేడుస్తూ అబద్ధాలాడతారు. మీ కోడలుతల్లి నా భార్యకు ప్రాణస్నేహితురాలు. తల్లీ కూతుళ్ళు సలక్షణంగా పెళ్ళికొచ్చారు. ఆమెకు పిల్లను మీ అబ్బాయి కిస్తూన్నామని తెలియదు. ఇంకెవరి కుర్రాడోనని అనుకుంది. అరుగో మీ కోడలు, వియ్యపురాలు, వియ్యంకుడు ఇక్కడికే వస్తున్నారు. రండమ్మా రండి. (గంగాయమ్మ తెల్లబోయి వారివైపు చూస్తుంది).

శారదాంబ :–అయితే వదినా, నా కూతురు చనిపోయిందని ప్రవాదం పుట్టించారటగా. అలా చెప్పి కొడుకు పెళ్ళి చేస్తున్నానన్నమాట.

గంగా :–యెవరన్నారు ? నవ్వాపు తీర్పుగత్తెవు. ఛీ కుక్కా.

సుంద :–యేమండీ గంగాయమ్మగారు! మీరు తగాదాలాడటానికి ఇది చేపలబజారు కాదు. మీ కుట్రంతా నేనగ్రం చేసుకొన్నాను.

శాస్త్రి :–(ఎదురుగా వున్న భార్యను చూచి చకితుడై తల వంచి) ఎందుకమ్మా అలా నోరు పారేసుకుంటావు.

సుంద :—అయితే శాస్త్రిగారు, మీకిది ధర్మమేనా. లక్ష్మిలాగ భార్యను పెట్టుకొని, తల్లి చెల్లెళ్ళు కలిసి చనిపోయిందని ప్రచారం చేస్తుంటే ఊరుకొన్న మగవాడికి నువ్వు తప్ప యెవరూ కనబడరయ్యా. ఆ పిల్ల ముఖము చూస్తేనే తల్లి, చెల్లెళ్లు చేసిన పంచమహాపాతకాలు తుడిచిపెట్టుకు పోతాయి. అటువంటి పిల్లను పుట్టింటికి వెళ్ళగొడతావా. పైగా చనిపోయిందని ప్రచారమా ? మాకేం తెలుసు. ఇదంతా నిజమేననుకున్నాము. తమ్ముడు పెళ్ళికి పన్నిన పన్నాగమన్నమాట.

ఏమండీ పురోహితుడుగారూ లగ్నం ఆపండి. శాస్త్రిగారు! నా పిల్లను మట్టుకు మీ అబ్బాయి కిచ్చి వివాహము చేయుటకు వీలులేదు. క్షమించండి. మీరు పెద్ద మనుష్యులనుకున్నాను గాని యిలాంటి వారనుకోలేదు. పెళ్ళివారందరికి చాదీలు యిస్తా. మీదోవ మీరు చూచుకోండి.

శార :—బాబు, సుందరంగారు! మీరు నాకు అన్న వరస అవుతారు. శాంతను నా చేతులమీద పెంచాను. పిల్లను వీరికి మట్టుకు బలి చెయ్యకండి. దానికి పెళ్ళి కాక పోయినా సరే. ఈ రాక్షసులకు మట్టుకు ఆహారంగా యివ్వద్దు. అన్నపూర్ణ తల్లిని ఎంత గారాబంగా పెంచానో మీకందరికి తెలుసు. నా బిడ్డను కన్నులారచూచి 13 సం॥లు అయింది. మొన్న నా కొడుకు, కూతురు పంపమని అడగటానికి వెళ్లారు. కాని పంపలేదు. వాళ్లు అడగటానికి వచ్చారన్న కోపంతో ఒకరోజు అత్త ఆడబిడ్డలు స్పృహ తప్పేటట్లు కొట్టి పంపారు. అలుడు చాతకాని దద్దమ్మ అయి ఊరుకొన్నాడు. ఇవిగో పిల్ల వంటిమీద దెబ్బలు, గాయాలు చూడండి. ఆమెకయినా ఆడపిల్లలున్నారు. ఎదటమ్మ గర్భానికి కొట్టబోయిన వుసురు తన గర్భానికే కొడుతుంది.

సుంద :—ఇలాంటి రాక్షసుల మూకకు నా పీక పోయినా పిల్ల నివ్వను. నా పిల్ల నాకు లెక్కసం గాదు.

పెద్దలు:—అయ్యా, సుందరంగారు! పీటలమీద పెండ్లి ఆపటం ఉభయులకు శ్రేయస్కరము గాదు. గాబట్టి పిల్లను వారింటికి పంపని కండిషనుమీద పెళ్ళి చేయండి. కుఱ్ఱవాడు మీకు నచ్చాడు గాబట్టి కుఱ్ఱవానిని మీవద్దే ఉంచుకుంటే అమ్మాయికి కోరింటకపు బాధ ఉండదు.

సుంద:—ఏమండి శాస్త్రిగారు...యేమంటారు. ఆ విధంగా బాండు రాయగలరా. ఆ షరతుమీద పిల్లనిస్తాను.

శాస్త్రి :— మీయిష్టం. కానీండి. (సుందరం చెప్పినట్లు బాండు రాస్తాడు. అవమానంతో క్రుంగిపోతున్నాడు.)

సుంద :—(ఈ విధంగా చదువుతాడు) నా పుత్రికయిన చి. సౌ. శాంతను శాస్త్రిగారి సోదరుడయిన నరసింహముకు యిచ్చి వివాహము చేయ నిశ్చయించినాము. గాని పిల్లవాని తల్లి, చెల్లెళ్ళు రాక్షస మూక అగుటచే నా గారాబు బిడ్డను వారింటికి పంప వీలులేదు. అల్లుడే మా యింటనుండే కండిషన్ మీద వివాహము జరుపుతున్నాము. ఈ షరతుకు పిల్లవానితరఫు వారంగీకరించుటమయినది."

(తిరిగి వివాహపుతంతు ప్రారంభం. ఎక్కడి వారక్కడకు వెళ్ళిపోతారు. శాస్త్రి మట్టుకు తల పట్టుకొని కూర్చుంటాడు. అన్నపూర్ణ ప్రవేశం.)

అన్న :—(భర్త పాదాలు పట్టుకొని) నన్ను క్షమించండి. నేనీవిషయంలో చాల అపచారం చేసాను. అమ్మ తనకు తెలియకుండానే కోపంలో యీ గుట్టు బైట పెట్టింది. మిమ్మల్ని విడిచి ఒక్క క్షణమయినా వుండలేను. మన్నించండి.

శాస్త్రి :—కాబట్టే నీ పుట్టింటి కొచ్చావు, భర్తనువిడిచి. ఛీ కులటా నీతో మాట్లాడుతే పంచమహాపాతకాలు వస్తాయి.

అన్న :-కులటా. మీరేనా యీ మాట అంటున్నది. నావైపు ఒకసారి చూడండి. సంసారం చెడగొట్టడానికి యింతకంటే వేరేమార్గమేది లేదని మీ అమ్మ, చెల్లెళ్ళే నా యీ బోధచేసింది. మిమ్మల్ని నమ్ముకొని మీరే సర్వస్వమని, పెట్టిన కష్టాలన్నీ పడిన ఫలితమా యిది?

శాస్త్రి :-తల్లి తండ్రులదగ్గర కెంపు కొచ్చావు.

అన్న :-(ఏడుస్తూ) నన్ను యింకా అర్థం చేసుకోలేదా. అనుమానిస్తున్నారా? 14 సం॥ల స్నేహ ఫలితంగా యిదేనా మీ విశ్వాసం. కళ్ళు మూసుకొని పాలుత్రాగుతున్నారు. నిజం చెప్పండి: మీరీమాట మనస్ఫూర్తిగా అంటున్నారా? మీరింట్లో లేని సమయంలో పశువుని బాదినట్లు బాది వీధిలోకి గెంటి తలుపేస్తే, వొళ్ళు తెలియని పరిస్థితుల్లో మానానికి మ్రగ్గి యిలా వొచ్చాను. పిచ్చి భ్రమలకి గురై పండువంటి కాపరాన్ని ధ్వంసం చెయ్యకండి. పిల్లల్ని చూచయినా కనికరించండి, మీకు పుణ్యముంటుంది. నన్ను తీసికెళ్ళండి.

శాస్త్రి :-ఛీ! నీకు నాకు యీ జన్మలో సంబంధం లేదు.

(మిగత భాగం వచ్చే సంచికలో)



# వర్గాలు — వివాహాలు

* శ్రీమతి పి. సుశీల *

ఏ యింట చూచినా అటు స్త్రీలనుంచి, ఇటు పురుషుల నుంచి, స్త్రీ వివాహాన్ని గురించి మార్పుకావాలని అంటూం టారు. వీరి భావాల్లో మాత్రం ఏదో ఒక రూపం కని పిస్తుంది. ఎటువంటి మార్పు కావాలి? అనే ప్రశ్నకి స్పష్ట మైన రూపం లేకపోయినప్పటికి ఆయావర్గాలకు ప్రాతినిధ్యం వహించే భావాలు, అభిరుచులు వెల్లడికావడం జరుగుతూంది.

ధనికుల్ని, బీదవాళ్ళని తీసివేస్తే, మార్పుకోసం తహ తహలాడుతూన్నది, ఇతర మార్గాలు వెతుకుతూన్నది, మధ్యతరగతి కుటుంబీకుల్లో స్పష్టంగా చూడవచ్చు.

కారణం, అప్పో, సప్పోచేసి కట్నాలిచ్చి పెళ్ళిచేసి చివరికి నిష్ఠూరాలు, పరస్పరం నిందలతో జరిగిన పెళ్ళిళ్ళు, అదీ కాకపోతే సమాజం జీర్ణించుకోలేని యువతీ యువ కుల అవకతవక చర్యలు నిత్యజీవితంలో సంఘర్షణకి దారితీస్తున్నాయి. ఏమయినప్పటికి మధ్యతరగతి కుటుం బాలు, సంకుచిత పరిస్థితుల్లోకి నెట్టబడుతున్నాయి. యదా ర్థాన్ని ఆలోచిస్తే దేశ ఆర్థిక ప్రతిపత్తిపై ఆదేశపు గౌరవ మర్యాదలు గీటురాయికదా! అట్టి ఆర్థిక పరిస్థితులు అభి వృద్ధికాని మధ్యతరగతి కుటుంబాల్లో కట్నాలనే అంటు వ్యాధి ప్రబలడం వివాహాల్లో ప్రతిష్ఠంభనకి దారి తీసిందని ఘంటాపథంగా చెప్పవచ్చు.

ఈ రోజు దామాషాగాచూస్తే ఇంటింటికీ ఒక అవివా హిత వుందీ అంటే ఆశ్చర్యమేముంది. వీరిలో ఏదో సామాన్యంగా అవసరాలకు సరిపోతుందని అనే వానాకా లపు చదువు చదివిన యువతులు మొదలు, యూనివర్సిటీ విద్యనభ్యసించిన యువతులవరకు, కొంచెం ఇంచుమిం చుగా ఒకటే పరిస్థితి వుందా అనిపిస్తుంది.

ధనవంతుల యింట వివాహాల్లో పరస్పరం సమాన హోదాల్లో, ఇచ్చిపుచ్చుకోడాల్లోను, సంతృప్తిచెందుతారు. కట్నాల విషయంలో ఆలోచించవలసిన సమస్యేలేదు. పోతే, అమ్మాయిగాని, అబ్బాయిగాని ఉన్నతవిద్య నభ్య సించినవారయితే, వుద్యోగాలు తమ విలాసాలకి, వినో దాలకోసం సంవినియోగించుకోడాన్కి వుపయోగపడు తుంది. పూర్తిగా శ్రామిక ప్రజలయితే, ఏ భూస్వామి వద్దనో, యే ఫ్యాక్టరీ యజమానివద్దనో, అప్పుచేసి పెళ్ళిళ్ళు చేసుకున్నా, ఆ పెళ్ళికొరకు చేసుకున్న అప్పు తీరేవరకూ భార్యాభర్త లిద్దరూ కష్టపడి పనిచేసి తీరుస్తారు. ఆ తరువాతకూడా కాడి భుజానవేసికొని సంసారం లాగుతారు.

పోతే ఇక మిగిలేది శ్లేష్మంలోపడ్డ ఈగలాగ మధ్య తరగతి కుటుంబీకులు కొట్టుకుంటున్నారు. మధ్యతరగతి అంటే ఎవరోకాదు; చిన్నవుద్యోగులు. ఉపాధ్యాయులు, గుమాస్తాలు మొదలయినవారు.

ఇటు పైతరగతయిన ధనికవర్గాన్ని అనుకరించడాన్కి ప్రయత్నంచేసి, ఆరకమైన వేషభాషలు అలవరచుకుంటూ ఆవర్గ సామీప్యంగా వుండాలని ప్రయత్నం చేస్తారు. అయితే ప్రస్తుత సంకుచిత ఆర్థిక పరిస్థితినిబట్టి ఎక్కడ వేశావు గొంగళీ అంటే వేసినచోటేలావుంది. ఇటు శ్రమ జీవులలాగ, భార్యాభర్తలిద్దరూ వుద్యోగంలో వుండడం సమాజంలో ఒక అవినీతి, అపచారం, అని బాధపడి సమాజదృష్టిలో ఒక నేరంగా ఎంచుకొని స్త్రీలను బయటికి వుద్యోగాలు అవకాశమున్నవారినైనా పంపకపోవడాన్కి గల పరిస్థితి ఏమిటి? కేవలం ఏ ఒక్కరిసంపాదనమీద ఆధారపడి ఎక్కువమంది వుండడంవల్ల, కుటుంబావసరాలే యజమాని చూడగల్గుతాడా! అటు వివాహాలకయ్యేఖర్చే కూడపెట్టగల్గుతాడా! సాధ్యా సాధ్యాలను ఆలోచిస్తే మధ్యతరగతి ఆర్థికపరిస్థితుల్లో మార్పు అవసరంకాదా! ఆర్థికంగా బాధపడుతూ, మార్పు అంగీకరించుతూ దానికి పరిష్కారాన్నిచ్చే మార్గాన్కి చాలా కొద్దిమంది మాత్రమే వస్తున్నారు. ఈ మార్పుకు వీలయిన ప్రతికుటుంబ మెం బరూకూడా కృషిచేసి స్వయం ఆర్థిక సహాయంకోసం కృషి చేస్తేనే మధ్యతరగతి సమస్య ముందు పరిష్కరించ బడుతుంది.

చదువుకొన్న—వుద్యోగ అవకాశాలున్న—యువతులు వెంటనే ఆర్థికంగా, సామాజికావసరాలలో పాల్గొంటూ, తమ ఆర్థిక ప్రతిపత్తిద్వారా కుటుంబాలకు బరువుచేటుగా కాకుండా వుండగల్గుతారు. తమంతట తాము వివాహాల్లో ఎన్నిక స్వాతంత్ర్యాన్నిపొంది మార్గదర్శకులవుతారు. అదే నేటి వివాహ, ఆర్థిక ప్రతిష్ఠంభనాపరిష్కారం చేయగలదు.



"నీకృతి నా ఆకృతిని ఆహుతి జేసింది !....
ముత్యముల కై సముద్రంలో మునుకవేస్తే మృత్యువు దొరికింది ! !"

# తారతమ్యం

* శ్రీమతి సి. హెచ్. శతకీర్తి *



[జాషువా కవిత్వం చదువరుని హృదయాన్ని స్పంధింప జేస్తుంది. అతను అభ్యుదయ కవితాచక్రవర్తి. జాషువా రచనల్లో "పిరదౌసి"కి గొప్ప ప్రాముఖ్యంవుంది. "పిరదౌసి" గ్రంథ సారాంశమే ఈ "తార తమ్యా"నికి కథావస్తువు. జాషువాను చదువని మహిళలకు ఉపయుక్తంగా వుంటుందనే వుద్దేశంతో ఈ హృదయంగమమైన రచనను ప్రచురిస్తున్నాం. —సం॥]

మనదేశముపై దండెత్తిన తురుష్కరాజులలో గజనీ మహమ్మదు ముఖ్యుడు. ఇతడు గొప్ప పరాక్రమశాలి. అంగ బలం, అర్థబలం విశేషం వున్నవాడు. అప్పటికి మనదేశం లక్ష్మీదేవి కాలవాలమై వుండేది. పెద్ద పెద్ద దేవాలయాలు, వాటినిండా నవరత్నరాసులు వుండేవి. అందులో సోమనాథ దేవాలయం ఎక్కువ ధనంవున్నది అని పేరు పొందింది. మన తురుష్క భూపతికి దానిపై కన్నుపడింది. ఆ దేవాలయాన్ని అతనికి చేజిక్కకుండా చేతామని హిందువులు చాతుర్యపాయాలు చూపారు. కాని లాభం లేకపోయింది. అప్పటిలో అతడిదే పైచేయి అయింది. సోమనాథదేవాలయం సంపూర్ణంగా శిథిలంచేసి నవరత్నాలు మొదలు నాపరాళ్ళ వరకు మోసికొనిపోయాడు తనదేశానికి. అంతటితో ఆగాడా? లేదు. మనదేశంలో సోమనాథదేవాలయం ఒకటేలేదు, అటువంటి లక్ష్మీనాథదేవాలయములు అనేకం వుండేవి. వాటినన్నింటిని ఒక్కొక్కటిని క్రమంగా కొల్లగొట్టి ధనం చేజిక్కించుకున్నాడు. ఇలా ఒకసారా? ఇతను పద్దెనిమిది మారులు దండెత్తి వచ్చాడు. అన్ని పర్యాయములు విజయలక్ష్మి అతడినే వరించింది. మన హిందువులలో ఐకమత్యలేమి దీనికి ప్రబలకారణం అని అంటారు. ఏమైతేనేం? హిందూదేవాలయాలన్నీ తురక మశీదులైపోయాయి. హిందూ స్త్రీ తురుష్కుల యింటికి కాపరానికి వెళ్ళిపోయింది.

సామంతరాజులను రెండు కళ్ళతో చూడనీయకుండా పక్కప్రభువులను రెండుకాళ్ళతో నడవనీయకుండా మృగేంద్రుడులాగ సింహాసనంమీద తీవిణీ వేశాడు. కోటగోడలన్నీ బంగారపు మలాము చేయించాడు. వీటిమీద పచ్చలు, ముత్యాలు చెక్కించాడు. స్తంభాలకు రవ్వలు పొదిగించాడు. పెద్ద పెద్ద మేడలు, మశీదులు కట్టించాడు. తన చరిత్ర అంటే దండయాత్రలు ముఖ్యమన్నమాటను ఏనుగ దంతాలపై చెక్కించాడు. మిగిలిపోయిన రత్నాలు, పచ్చలు మొదలగునవి ప్రతి సైనికుని సర్టిఫికెట్టుపై అక్షరాలుగా చెక్కించాడు. మనదేశ సంపదనంతా ఈ విధంగా వుపయోగించుకున్నాడు.

ఇలా వుండగా ఈయనగారికి తను చేసినదండయాత్రలు చిరస్థాయిగా నిలబెట్టాలని బుద్ధిపుట్టి కావ్య దీపంతో తన రూపం ప్రకాశింపచేయాలని ప్రయత్నం చేయడం మొదలు పెట్టాడు. ఆ కర్మకు మన కథానాయకుడైన పిరదౌశి నియోగింపబడ్డాడు. అతడు ఆనాటి పారశీక కవులలో అగ్రగణ్యుడు.

'అయ్యా, మీకవితావాఙ్మయమనెడి పుణ్యభూమిలో మ వంశవృక్షాన్ని నాటి దానిని చిరస్థాయి చేయుచూ చక్క గ్రంథం ఒకటి రచించి పెట్టవలసింది. దానికిగాను ఒక్కొక్క పద్యమునకు ఒక్కొక్క బంగారునాణెము బహుమాన

యిస్తాను.' అని సుల్తాను, పిరదౌసి కవికి సభామధ్యమంలో ప్రమాణం చేశాడు.

ఎవరికైనా పెడతానంటే ఆశ, కొడతానంటే భయమూను. అందులో కవులవద్ద సాధారణముగా లక్ష్మి కాపురముండదని పెద్ద లంటూంటారు. సుల్తాను వాగ్దానం వినే సరికి పిరదౌసి హృదయం ఆనందమయం అయిపోయింది. వెంటనే యింటికి వెళ్లిపోయి కావ్యరచనకు పూనుకున్నాడు. ఆనాటి పారశీక గ్రంథాలలో మేటిఅయినవి తెప్పించాడు. క్షుణ్ణంగా చదివి భాషను అభివృద్ధి చేసికున్నాడు. తీయని తేనెపైనపదములు, సరసమైన వుపమలు, మేలైనభావాలు కల్పించి, నవరసభరితమైన గ్రంథం ఒకటి, గజనీ సుల్తాను తండ్రి తాతలనాటి చరిత్ర, పరాక్రమములు. ఈతని దండయాత్రలను వర్ణిస్తు "షాహనామా" అను నామంలో రచించాడు.

ఈ గ్రంథం పూర్తి అయేసరికి సరిగా ముప్ఫై సంవత్సరాలు పట్టింది. ఈలోగా ఈతని పుత్రుడు ఒకడు మరణించాడు. పిరదౌసి కష్టాలపైకి కన్ను పోనీయక చక్కగా గ్రంథం పూర్తిచేశాడు. హేమసమ్మిశ్రితమైన కీర్తి గర్వాలతో హృదయం ఆనందం చెందింది. మంచిరోజుచూసి సుల్తాను సభలో ఆ అరవై వేల పద్యములుగల గ్రంథాన్ని చదవ నారంభించాడు. సుల్తానుకథ వ్రాయడం మాటలు కాదు. చాలా గౌరవమైన సంగతి. పెద్ద గ్రంథం. ఆనాటి కవులకులేని పాండిత్యం అంతా అందులో మిళితంచేశాడు. దీనికి సాయం ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క బంగరు రూక-నిండు సభలో బహుమానం, ఈకావ్యాలన్నీ తరగాలు లాగ హృదయంలో గంతులువేస్తూవుంటే పిరదౌసికవి ఆ గ్రంథాన్ని చదవడం మూడు నెలలకు పూర్తిచేశాడు. తురుష్క ప్రభువు, మంత్రులు, కవిపుంగవులు, పండిత శ్రేష్ఠులు నిండు కొలువులో ఇతడి రచనను మెచ్చుకున్నారు సుల్తాను, కవిని చాల పొగిడి యింటికి పంపాడు.

పిరదౌసి యింటికి చేరేసరికి సుల్తాను యిచ్చిన బహుమానం కూడా చేరింది. కాని ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క బంగారు నాణెం బదులు వెండినాణెం పంపాడు సుల్తాను! గొప్పప్రభువుకదా! .... ఆయనకు చేశినవాగ్దానం జ్ఞాపకముంటుందా? 60 వేలు వెండి నాణేలు మాత్రం చాలవే మనుకున్నాడో! ఇదివరకు అంటే మట్టుకు యిప్పుడు చేయాలని శాస్త్రమేమిటి అనుకున్నాడో! లేక కిట్టనివాళ్ళు ఎవరైనా చెప్పిపెట్టారో

ఏమైతేనేం పిరదౌసి యీ దెబ్బతో గుభిల్లున కూలిపోయాడు. కట్టుకున్న హేమసౌధం కంటి కగపడకుండా గభాలున మాయమైపోయింది. దానికి బదులు తెల్లమేడ సిద్ధమైంది. వెండికీ బంగారానికీ తేడాలేదూ! ప్రపంచం శూన్యంగా కనిపించింది. తలుచుకుంటే హృదయం బద్దలయ్యేట్టుంది. ఏంచేస్తాడు పాపం....

ఈ గ్రంథరచన తన వయఃపటుత్వం తగ్గిపోత్తోయింది. వృద్ధాప్యం వచ్చింది. ఒక ఏడాదా రెండేళ్ళా ముప్ఫై సంవత్సరాలు ఈ కావ్యసృష్టిలో జరిగిపోయాయి. పోనీ శేషజీవితంలో కవిత్వంమీదనే ఆధారపడదామంటే, ఈ అనాలోచిత విఘాతాన్ని కవితాకన్య కంపించిపోయింది. నిరాశ పూర్తిగా పునాది గట్టింది. ఈ కావ్యసృష్టికై తన రక్తాన్ని ధారపోశాడు. సుల్తాను యశస్సుకై తన వయస్సంపదను దుమ్ముచేసికున్నాడు. అనవసరంగా నిరపరాధులైన ప్రజలను, లోకరక్షకులైన దేవాలయాలను కొల్లగొట్టి ధనముసంపాదించిన ఈ మానవాధముడిని— మానవాతీతుడుగా చేసి తన కవితకు తీరని అవమానం చేశాడు. తత్ఫలం వెంటనే పొందానని బాధపడ్డాడు. సుల్తాను అన్నమాట తప్పుతాడా? మరొకరు, ఇంకొకరు అయితే ప్రభువుదగ్గరకు పోయి ధర్మమడిగి ధనం పుచ్చుకునేవారు. కాని, ఆ ధర్మాన్ని పాల్పడితే చేశేదేముంది? కంచే చేనుమేస్తోంది.

ఈవిధంగా బాధపడుతూ ఏటు చేయడాన్కి తోచక దెబ్బతిన్న బెబ్బులిలాగ అవమానం బాధాపూరితమగు భావాలతో కొన్ని వాక్యములుగ ఒక వుత్తరం వ్రాసి వెండి నాణెములతో సహా సుల్తానుకు పంపివేశాడు.

ఈ వుత్తరం చూచుకొని మహమ్మదగ్రణి వుగ్రుడై పోయాడు. శరీరం కంపించింది. తనెక్కడ? ఈతగ్గుకవి

ఎక్కడ? తనకా వుత్తరం! ఇచ్చినదేదో పుచ్చుకోక ధిక్కరిస్తూ వుత్తరం వ్రాశాడు. పైగా పంపిన డబ్బును తిరస్కరించాడు. ఎంత ధైర్యం? వెంటనే కవిని పట్టించమని ఆజ్ఞాపించాడు! నిష్కరుణుడైన తురుష్కుడు!

"కృతిని యిచ్చిన కవిమీద అనవసరంగా రాజు కినుక వహించాడు. రాజుగారికే కీడు మూడింది. ఆడినమాట తప్పడం కాకుండా ఆయువు లేకుండా చేయబూనాడు ప్రభువు" అని కొందరు పండితులన్నారు. "ఈపాటి కవిత్వం ఎవరికి చేతకాదుకనుక? రాజుగారు యిచ్చి గౌరవం చేశారంటేనే చాలునే. ఇచ్చినదేదో పుచ్చుకోక ఈ చచ్చువేషాలేమిటి. అవవలశిందే ఈపాటి శిక్ష" అని కొందరు బుద్ధిమంతులన్నారు.

ఈ చోద్యమంత పిరదౌసి చెవినిబడింది. అయిపోయిందేదో అయిపోయింది...గతన్నాస్తి. కృతిఖరీదు లేదుగదా కుత్తుక తీసివేస్తున్నాడు రాజు. డబ్బుపోతేపోయింది, ప్రాణమైనా దక్కించుకుందామని ఆ అమాయకుడు సకుటుంబంగా స్వగ్రామమగు తుస నగరానికిపోయి తలదాచుకుందామని బయలుదేరాడు. కవి పాట్లు ఈ విధంగా బయలుపడ్డాయి.

ముసలివాడు. కాలినడకను ప్రయాణం. వెనుక ముసలి పెళ్లాం, ముద్దులకూతురు సుకుమారి వెంటబడ్డారు. వీళ్ళు వెళ్ళకపోతే, వీళ్ళప్రాణం తీసివేస్తాడు రాజు. అంచేత వీరూ ప్రయాణమయ్యారు. రాజమార్గాన్ని వెడితే ప్రభుని భటులు పట్టి చంపివేస్తారని నేరస్థుడిలాగ చేశిన కృషికి ప్రాయశ్చిత్తం అనుకుంటూ అడవిదారినిబడి బయలుదేరేరు. క్రూరమృగాలు అడుగడుక్కీ బెదరిస్తున్నాయి. తన కవితకు సంతోషించి యివ్వవలసిన బహుమానం యిచ్చేసి ఎత్తు ఏనుగమీద వూరేగించవలసిన కవిని ఈ విధంగా సుల్తాను బహూకరించాడు. భగవంతునిలీలలు! అణుమాత్రం అలికిడి అయినా రాజభటులేమో అని బెదిరిపోతున్నారు భార్యా, కూతురూను. వెనక్కు తిరిగిచూస్తే ఆలస్యం అవుతుందేమో అని గడియలు లెక్కపెట్టుకుంటున్నారు. ఈ విధంగా తుసూ నగరాన్ని చేరుకుంటోందా

దౌర్భాగ్య కవి కుటుంబం. పెడతానని పిలిచి కొడతానని చేసినట్లుంది.

ఇక్కడ కత్తీ కటారు పుచ్చుకుని సుల్తాను భటులు వచ్చేసరికి ఈ బక్క కవి వారికి చేజిక్కకుండా చక్కాపోయాడు. ప్రభుని భటులు పట్టణమంతా గాలించారు. లాభం లేకపోయింది. వెతికి పట్టించలేనందుకు ఈ మహనీయులందరికి కారాగారప్రాప్తి కలిగింది. పట్టి తెచ్చిన వాళ్ళకు పసిడినాణేలు బహుమానం యిస్తానని రాజ్యంలో చాటించాడు, కవికాశ్రయమిచ్చిన వారిని వురితీయిస్తానని ఆజ్ఞలు యిచ్చాడు.

కాని పాపం! తానొకటి తలిస్తే దైవం ఒకటి తలిచాడు. షానామా గ్రంథం చదివిన ప్రజలు గజనీకీర్తిని ఎలా పొగుడుతున్నారో గ్రంథసృష్టిని విన్నవాళ్ళు అతని అపకీర్తిని అంతకంటె ఎక్కువగా వేనోళ్ళ చాటజొచ్చారు. "మీరు తలుచుకుంటే ఇది ఒక పెద్ద లెక్కకాదు. మీ యశస్సంపదను కృతిరూపంగాయిచ్చి పూజించిన మహనీయమూర్తి,కవికి. మీరెంత ధనమిచ్చినను అతని ఋణం తీరదు. వాగ్దానం చేసినంతయైన యివ్వకపోతే అతడు దీనత చెందుతాడు, బాస ప్రకారం బంగారంయిచ్చేయవలసింది. లేకపోతే మీకు అపయశస్సు తప్పదు" అని సామంతరాజులు కబురు పంపారు.

ఇలా మూడు సంవత్సరాలు గడిచాయి. పిరదౌసి తూసు నగరానికి వెడుతూ మశీదుపై వ్రాసిన "నీ కృతి నా ఆకృతిని ఆహుతి చేసింది. ముత్యముల్కై సముద్రంలో మునుకవేస్తే మృత్యువు దొరికింది"అనే మాటలు బల్లెంలా బాధింపజొచ్చాయి.

చివరకు కవి పుణ్యమా యని సుల్తాను మనసు మారింది. కవి ఋణం చెల్లింపదలచుకున్నాడు. పిరదౌసి ఎక్కడ ఉన్నాడో కనుక్కున్నాడు. బాస ప్రకారం బంగారు నాణెములను లెక్కించి బస్తాలలో కెక్కించి ఒంటెలపై తూసు నగరంలోని కవి యింటికి పంపాడు.

కాని, సుల్తానుడబ్బు ఆ నిర్భాగ్యకవికి ఋణంలేదు. అప్పటికే కవి ఏడాదినుంచి మంచం పట్టాడు. జీవితం

## తారతమ్యం

వృథాప్రయాస చేసుకున్నాననే బెంగతో క్షీణించాడు. పెండ్లి కెదిగిన కూతురు తండ్రికి సపర్యలు చేస్తూవుంది. ఈ బెంగతోనే ఆ పిరదౌసికవి పేదస్థితిలో వుండి ఒకనాడు మరణించాడు. ఆనాడే సుల్తాను ధనం కవి యింటికి చేరింది. కవి శవం శ్మశానభూమికి తీసికొని పోబడింది, అంతకు ముందుక్షణంలోనే.

సుల్తాను భటులు ఆ ధనాన్ని కవి కుమార్తెను స్వీకరించమని కోరారు. "తండ్రిని బలితీసికున్న ఈ తుచ్ఛధనాన్ని నేను ఆశిస్తే నా తండ్రిగారి ఆత్మదుఃఖిస్తుంది. ఈ ధనంతో పాటు నా జోహారులనికూడా మీ నవాబుకు చెప్పండి" అని ఆమె కంటితోనైనా చూడకుండా ఆ ధనాన్ని తిరస్కరించింది. కవిగౌరవం నిల్పిందా మానినీయ !

ఇది విని సుల్తాను చాలా నొచ్చుకున్నాడు. తన కృతఘ్నతకూ, అవివేకాన్కీ చాల నిందించుకున్నాడు. డబ్బు కక్కుర్తి యింత అపకీర్తి పాలు చేస్తుందని అనుకోలేదు పాపం. తర్వాత బ్రతికినన్నాళ్ళూ మనశ్శాంతిలేకుండా గడిపాడు. కవి ఆత్మశాంతికై ఆ తూసు నగరంలో ఒక పెద్ద సత్రశాల కట్టించి, దానికి కవిపేరు నామకరణం చేశాడు. కవి ఆత్మ శాంతి చెందిందో లేదో కాని సుల్తానుకు మనశ్శాంతి లేకుండాపోయింది.

ఆ సత్రశాల శిథిల చిహ్నాములు నేటికిని తూసు నగరంలో కనిపిస్తున్నాయని, అవిచూచి కవికథ చెప్పుకుని బాటసారులు విచారిస్తారని అనుకుంటుంటారు. ధనానికి విలువలేదు. కవికి ధనంలేదు, కీర్తిదక్కింది. సుల్తానుకు రెండూలేవు. అపకీర్తి దక్కింది. అదే తారతమ్యం.



జీవిత చిత్రం

# విఖ్యాత నవలా రచయిత్రి
# 'పెరల్ బక్'

* శ్రీ చామర్తి కనకయ్య *

కొత్తపుస్తకాలేమైనా వచ్చాయేమో కొందామని మొన్నను బుక్‌స్టాలుకు వెళ్ళి అప్పుడేవచ్చిన బంగీనుంచి విప్పుతుంటే పెరల్‌బక్ వ్రాసిన కొత్త పుస్తకం 'గాడ్స్‌మన్' (450) పేజీలు చూసి ఆశ్చర్యపోయాను— అరవై సంవత్సరాల వయస్సులోకూడ స్త్రీకి, ఉద్గ్రంథాలు వ్రాయగలిగే ఓపిక, తీరిక, శ్రద్ధ ఉండటం నాకు ఆశ్చర్యమైంది- వయస్సుమీరే కొద్దీ మనిషికి బాధ్యతలు హెచ్చడం, ఓరిమి తగ్గడం, దైనందిన జీవితంపై విసుగుజనించి, ఎక్కడికైనా ఇల్లు వదలిపెట్టి పోతేబాగుండుననుకోవడం- ఎక్కడికీ కదలటానికికూడ తీరికలేక సంసారంలో మునగానాం తేలానాంగా బ్రతుకుతుండడం మనం నిత్యం చూస్తూనే వున్నాం. ఈస్థితులలో ఆమె ఇంకా సాహిత్యరంగాన్ని అంటిపెట్టుకొని కృషిచేయటం అత్యంతాభినందనీయం—

పెరల్‌బక్ వ్రాసిన ఒక కథల సంపుటిలో ఆమె భర్త "రిచర్డు. జె. వాష్" పాఠకులకు ఆమెను పరిచయం చేశాడు. ప్రపంచవిఖ్యాతి నార్జించిన ఆమెకు ఇట్లాంటి పరిచయం అనవసరం అయినా, తన సహచారిణిలోని రచనా పాటవాన్ని రచనావ్యాసంగానికి కారణమయే ఆమె అభిరుచులను, గుణవిశిష్టతలను, అత్యంత సన్నిహితుడైన భర్త చెప్పడంలో ఒక విలక్షణ, విశిష్టత కలదని అందుకు అతనే తగినవాడని భావిస్తున్నాను.

ఆంగ్ల సాహితీ ప్రియులకు 'పెరల్‌బక్' పేరుతో రెండే రెండు పేర్లు జ్ఞాపకానికి వస్తాయి- (1) చైనాదేశం (2) 'గుడ్ అర్త్' నవల.

చైనాదేశాన్నిగూర్చి ఆంగ్లంలో 'పెరల్‌బక్' వ్రాసినంత విశదంగా, వివరంగా, అందంగా, అధికంగా మరెవ్వరూ వ్రాయలేరు. చైనాగురించే శ్రద్ధతీసుకొని వ్రాయటానికి కారణమేమిటి? అనే ప్రశ్నకు "ప్రజలే నేను వ్రాయ నుద్యమించడానికిగల కారణం- నేను ఎక్కువకాలం చైనాలోనే గడిపాను. నాకు వాళ్ళే అత్యంత సన్నిహితులైనారు.

అక్కడి మా కుటుంబజీవితం అంతా వాళ్ళతోటి సహచర్యమే" అని సమాధానమిచ్చింది.

పెరల్ బక్ 1892 లో, 'వెస్ట్‌వర్జీనియా'లో, 'హిల్స్ బరో' పట్నంలో జన్మించింది. అందువల్లనే అమెరికన్ సాంప్రదాయకమైన కొన్ని ప్రత్యేక స్వభావాలు ఆమె రచనలలో ప్రతిఫలించడం మనకు కనుపిస్తుంది. ఆమె పూర్వీకులు, హాలెండు, జర్మనీ దేశాలనుంచి, అమెరికా వలసపోయారు- అక్కడే వేరు వేరు ఉద్యోగాల్లో పనిచేస్తూండేవారు- పెరల్ బక్ తల్లిదండ్రులు మిషనరీలు కావడంవల్ల చైనాలో చాలాకాలం ఉన్నతరువాత 1892 వ సంవత్సరం మాత్రం యూరప్ అమెరికాల్లో గడిపారు. అప్పుడే ఆమె అమెరికాలో జన్మించింది. ఆమెను నాలుగునెల్ల వయస్సులో చైనా తీసుకొని వెళ్ళేరు- ఆమె తల్లిదండ్రులు ఎప్పుడూ ప్రయాణాల్లోనే వుండేవారు- అందుచేత ఆమె ఎక్కువ కాలం ఒంటరిగానే గడిపింది. ఆమె ఇంగ్లీషుకన్న ముందుగానే చైనాభాష మాట్లాడటం నేర్చుకున్నది. కొంత జ్ఞానం వచ్చాక, వ్రాయను, చదువను. వయస్సు వచ్చినతర్వాత ఇంగ్లీషే చదవ నారంభించింది- ఆమె తన చిన్నతనపు రోజుల్ని తనను కనిపెట్టిచూసే చైనా దాది (nurse) ని 'కంట్రీ జంటిల్‌మన్' అనే రచనలో వర్ణిస్తుంది- అందులో—

"నా తారుణ్యపు తొలి దినాలలో నాతో ఇంట్లోకూడా ఉండేవాళ్ళు బాగా గుర్తున్నది ఇద్దరే- ఒకతె మా అమ్మ, రెండవది మా చైనా నర్సు. నన్ను ఆ నర్సు చాలా వాత్సల్యంతో పెంచింది-నేను ఆమె దాన్నిగా అయిపోయాను-"

"ముసలిముండను- నాకేంవచ్చునమ్మా! నా జీవితంలో ఒక్క అక్షరముక్కయినా నేర్చుకోలేదు- నీకేం కథలు చెప్పగల్ను?" ఆ ముసలమ్మ అనేది.

ఆసంగతి మాకు మామూలే ఎప్పుడూ- "ప్రపంచంలో ఆడవాళ్ళందరికన్నాకూడ నీకు ఎక్కువ కథలు వచ్చును!" అనేదాన్ని- బౌద్ధ టౌయస్టు, మత ప్రచారకులదగ్గర ముఖ్యంగా విన్నవి చాలా వింతైనవి కథలు ఆమె చెబుతూండేది. బౌద్ధమత కథలన్నీ చాలా విచిత్రంగావుండేవి. అయితే ప్రజలకు ఆకథలేం చేస్తాయి....ఆమె నాకు స్వర్గాన్నిగురించీ, నరకాన్ని గురించీ, బౌద్ధుల నరకంలోని భయంకరత్వాన్నిగూర్చి, స్వర్గం అంటే ఏమిటో, జీవిత చక్రంతోబాటు మన ఇచ్ఛలేకుండా మనం ఎట్లా తీసుకుపోబడతామో చాలా విషయాల్ని గురించి చెప్పేది. తీరికగా ఉన్నప్పుడు పడుకొని ఎందుకో పుట్టితే బాగుంటుందా? అని ఆలోచిస్తూ ఎన్నో గంటలు గడిపేదాన్ని. నిజానికి నాకు ఎందుకో టౌయస్టు కథలు బాగానచ్చేవి. ఆకథలు చెయ్యాలా దేవతలనుగురించి- రాయిలోనూ, చెట్టులోనూ, మేఘంలోనూ వుండే శక్తిని గురించిన కథలు- నాకు ఆ వింత వింత కథలన్నీ చాలా విన్నతర్వాత విసుగెత్తితే "నువ్వు చిన్నతనంలో ఏంచేసేదానవో చెప్పు" అని కూర్చునేదాన్ని- అదేవిధంగా మా అమ్మనూ, నాన్ననూ, కూడ కథలు చెప్పమనేదాన్ని. నే నెప్పుడూ చూడని ఎక్కడిదో దూరదేశపు కథలు చెప్పనారంభించేవారు. అవన్నీ మత స్వాతంత్ర్యానికి సంబంధించిన వీరోచిత కృత్యాలే. మానాన్న అమ్మ వాళ్ళ స్వగ్రామాల్లో ఆదివారాలు చర్చికి వెళ్ళటం, అక్కడ, బోధనలు వినడంగురించి చెప్పినప్పుడు, మా చైనా నర్సు తన చిన్నతనాన్నిగూర్చి చెబుతూ, యాంగిట్సినది దగ్గర పురాతనమైన మహానగరంలో దేవాలయానికివెళ్ళటం, ఆమె వివాహాన్నిగూర్చి ... ........ఇంకా ఎన్నోవిషయాలు చెప్పినప్పుడూ ఒకే రకమైన శ్రద్ధను కనబరిచేదాన్ని-

"ఇక్కడతో ఈవేళకు చాలు!" అని 'నర్సు' అకస్మాత్తుగా ఆపివేయడం, "ఇక నీ పుస్తకం చదువుకో" అనడం జరిగేది.

ఆమెకు చదువు రాకపోయినా ఆమెతో నాకు కాలం గడిచిపోయేది- నేను మా తమ్ముడుకన్న బాగాచదవడంతో ఆమె నన్నుచూసి మరింత గర్వపడి మురుస్తూ వుండేది- నేను చైనీ స్కూలుకు వెళ్ళి చైనాభాష చదువుకొనేవరకూ నన్ను అతి ముఖ్యంగా గుర్తించలేదామె. ఇక అప్పటినుంచి నన్ను గురించి తనవాళ్ళందరితోనూ, గొప్పగాచెప్పి సంతోషిస్తూవుండేది— "ఈ పిల్లకి కడుపునిండా మన చైనా మంచి మంచి పద్ధతులే! అట్లా వుండాలి ఆడబిడ్డ!" అనేది.

"అమ్మాయీ! బాగా చదువుకో! చదవనేర్చుకోకపోవడంచేతనే, గుడ్డిదానిలాగ, ఏ ఉత్తరంముక్క కొడుక్కి వ్రాయలన్నా ఊళ్ళో ఉత్తరాలువ్రాసేవాడి దగ్గరకే పోవలసివస్తున్నది. ఆవ్రాసిన వాడదేమి వ్రాశాడోకూడ నాకు తెలియదాయె!" అనేది.

మా అమ్మ నాకు ఇంటిపని చేయటం అలవాటుచేసేది. నాచేత నేను పడుకునే గది తుడిపించటం, పక్కగుడ్డలు

దులిపివేయిస్తుండడం, వంట చిన్ని చిన్ని పనులు, చేయించేది. "మగపిల్లవాడికంటె ఆ అమ్మాయి బాగా చదువుతూన్నది ! ఆ అమ్మాయిచే ఎందుకు పని చేయించాలి ! చేయించొద్దు !" అనేది నర్సు- ముసిలిదానికి కొన్ని నమ్మకాలు, పద్ధతులు, ఉద్దేశాలు ఉన్నాయనే విషయం నాకు తెలిసినా నాకు ముసలమ్మ పద్ధతి నచ్చేది. అన్నం తిని మేడమీద నా గదిలోకి వెళ్ళేసరికి చాలా పరిశుభ్రంగా గది, పక్క ఉండేవి- చాలాసార్లు ఆముసలినర్సు నాగది తుడిచి శుభ్రం చేయటం, మా అమ్మకు తెలియకుండా, నేను ఎరుగుదును. రహస్యంగా అనేవి- "ఇంకాస్సేపు పుస్తకం చదువుకో !- ఆపనులు నేను చేస్తానులే"....

అట్లాంటి ఆత్మీయురాలు పోయినందుకు మా యింటిల్లిపాదీ, ముఖ్యంగా నేను ఏడ్చాం- ఇంతవయస్సు వచ్చినా నాకు బాగా జ్ఞాపకం ఆ నర్సు- అప్పటినుంచీ మాకు చైనా స్వదేశంలాగ అనిపిస్తూవచ్చింది. అక్కడి ప్రజలు మాతో కష్టసుఖాల్లో భాగాలు పంచుకుంటూ అతి సన్నిహితులై పోయారు. ఆమె ఏదేవుళ్ళనైతే నమ్మేదో ఇప్పటికీ ఆ మహిమలు మా హృదయాల్లో గోచరిస్తుంటాయి"....

పెరల్‌బక్ తండ్రి దూరప్రయాణాలుచేసి తిరిగివచ్చిన తరువాత ఎన్నో వీరోచిత విషయాలను కధలుగా చెబుతూండేవాడు. పెరల్‌బక్ తల్లి ఆమెకు అన్నివిషయాలను గురించి చెప్పేది. మాటలోని అందాన్నిగూర్చి, మాటలు అట్లాంటిభావాలను స్ఫురింపచేసేవి తల్లిచెప్పేది. మిగిలిన అమెరికన్ పిల్లలకు చర్చి, పదిమంది సమూహం, స్కూలు అన్నీ వుండేవి, అవి వాళ్ళకు ఒకరకమైన వాతావరణాన్ని కల్పిస్తాయి. పెరల్‌బక్ ప్రపంచాన్నిగురించి తల్లిద్వారానే తెలుసుకుంది చిన్నతనంలో- "నీవేం చూశావో చూసినవి నీకెట్లా అనిపించాయో అట్లా వ్రాయి" అని పెరల్‌బక్‌కు తల్లి సలహాయిచ్చి తోడ్పడింది. పెరల్‌బక్ వ్రాసినవి తల్లి చూసి, సరిచేసి "షాంగ్‌హై మెర్క్యురీ" అనే ఆంగ్ల వార్తా పత్రిక, పిల్లల వారపత్రికకు కొన్ని పంపించింది. ఆమె వ్రాసినవానిలో చాలాభాగం 'నో వైస్' అనే సంతకంలో ప్రచురింపబడి చలామణీ అవుతూవచ్చాయి. ఆ పత్రిక తరచుగా ఆరచనలకు డబ్బు పంపుతూవుండేది.

ఆమె పదిహేనవ ఏట 'షాంగ్‌హై' బోర్డింగ్‌స్కూలులో చేరింది. అదే ఆమె స్కూలుకువెళ్ళటం ప్రారంభం- 'రాండాల్ఫ్ మేకన్ కాలేజీ'లో చేరటానికి 17వ ఏట ఆమె అమెరికా వెళ్ళింది. వాళ్ళు ఉంటున్నది చైనా అయినా పెరల్‌బక్ తల్లి వాళ్ళ దేశం అమెరికా అని ఎప్పుడూ చెబుతూండేది- 'అమెరికా' మాదేశం అని చెప్పవలసిందిగా ఆదేశించేది- పెరల్‌బక్‌కు కాలేజీలో చదువు ఏమంత రుచించలేదు. ఆమెను కాలేజీలో తొలిదినాల్లో చాలా వింతగా చూసేవారు. ఏమైతేనేం కాలేజీ నాయకత్వం సంపాదించింది. క్లాసుకు అధ్యక్షురాలైనది. కాలేజీ పత్రికకు వ్రాసి రెండు సాహిత్య బహుమానాలు బడసింది- అందులో ఒకటి ఆమె ఉత్తమ కథానికకు—

తల్లికి జబ్బుగా వుండటంతో చైనా తిరిగి వచ్చింది. అమెరికన్‌ను వివాహం చేసుకున్నది. తల్లి రోగంనుండి కోలుకొన్నతరువాత, భర్తతో ఉత్తర చైనాలో అతని ఉద్యోగంచేసే చోటికి వెళ్ళింది. అక్కడున్న అయిదు సంవత్సరాలు బహువిలువైనవి- అక్కడి చైనా ప్రజలతో గడుపుతూ వాళ్ళజీవితాలను అర్థంచేసుకున్నది. చైనాప్రజల జీవితస్థితిగతులు ఎట్లాంటివో అర్థం చేసికోవటానికి ఆమెకు ఆ 5 సంవత్సరాలు బాగా లాభించినయి. అక్కడ ఆమెకు ఎందరో స్నేహితులైనారు. తరువాత వచ్చిన క్షామపరిస్థితులలోకూడ ఆమె అక్కడనే ఉన్నది- అక్కడ పదిసంవత్సరాలు ఉండి అక్కడవచ్చిన విప్లవంలో చైనాజాతి స్థితిగతులను అర్థంచేసికొన్నది.

ఆమె బాగా వ్రాయగలిగే రోజు తప్పక వస్తుందని నమ్మింది. కొన్ని సంవత్సరాలు, ఇంటివిషయాల్లోనూ, భర్త చేసే చైనావ్యవసాయిక పరిశోధనలలోనూ సహాయపడడంలో గడచిపోయింది, 'నాన్‌కింగ్ విశ్వవిద్యాలయం'లోనూ, ఛంగ్‌యాంగ్ విశ్వవిద్యాలయంలోనూ ఆంగ్ల సాహిత్యాధ్యాపకురాలుగా పనిచేసింది. అప్పుడు వ్రాయటానికి తీరిక లేకపోయినా ఆమె తనలో కథలు అల్లుతూనే వుంది. ఆమెకు 1922 తీరిక సమయం చిక్కగానే ఒక ఆర్టికల్ వ్రాసి 'బోస్టన్' పత్రికకు పంపింది. అదే ఆమె మొట్టమొదటిసారిగా ఒక దూరపు మాగజైన్‌కు రచనలు పంపటం-ఆరచన 1923 జనవరి సంచికలో 'ఇన్ చైనా టూ' అనే పేరుతో ప్రచురింపబడినది- ఆరచనలో ఫిక్షన్ వ్రాసే పద్ధతి కుతూహలమూ పొడసూపుతూనే వుంది. అట్లాంటిక్‌లో ప్రచురింపబడిన ఆమె రచనచూసి "ఫోరమ్" సంపాదకుడు తన పత్రికకు ఏదైనా వ్రాయవలసిందిగా కోరుతూ ఆమెకు లేఖ వ్రాశాడు. ఆమె పంపిన రచన 'చైనాలో సౌందర్యం' అనే పేరుతో 1924 మార్చి నెల

(45 వ పేజీ చూడండి.)

# స్త్రీలూ — ఉద్యోగ నిర్వహణ

* శ్రీమతి డి. లక్ష్మీకాంతమ్మ *

(స్త్రీలు ఉద్యోగాలు నిర్వహించడం, కుటుంబశాంతికి భంగకరమని సూచిస్తూ, ఆలిండియా రేడియో-విజయవాడ కేంద్రంనుంచి ప్రసారం చేయబడిన ప్రసంగం.)

ఆడవాళ్ళు ఉద్యోగాలుచేస్తే, ఇంట్లో శాంతి ఉండదన్న మాట అక్షరాలా సత్యం. ఇంక దీనికి వేరే వాదాంతరమే లేదు. ఎందుచేతనంటే ఉద్యోగమూ, కుటుంబశాంతి అనేవి స్త్రీలవిషయంలో ఉత్తరధ్రువమూ, దక్షిణధ్రువమూను. కుటుంబంలో ఆందోళన కలుగకుండా ఉద్యోగం నిర్వహించడం, స్త్రీకి దుస్సాధ్యం అవడంవలన.

ఈ విషయం చర్చించేముందు ముఖ్యంగా మనం ఒక విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. అది ఏమిటంటే మనం భారతీయులం, మనది భారతదేశమని. అతిథీ- అభ్యాగతీ, అత్తా- మామా, ఆడబిడ్డా, మొదలైన వారికి ఆదర సత్కారాలనీ, పసిబిడ్డల పెంపకం అనీ, గొడ్డూ గోదా సంరక్షణ అనీ, నౌకర్లూ— చాకర్లూ సవరింపులనీ బోలెడంత కమాటం ఉండే హిందూగృహాల్లో ఆడది ఉద్యోగం చెయ్యడానికి ఇల్లు వదలిపెట్టి, పనులు చేసుకోడానికి ముఖ్యమైన పగటిపూట ఎక్కడకో వెళ్ళాలంటే కుటుంబంలో శాంతి భగ్నం అయి ఊరుకొంటుందని వేరే చెప్పాలా?

ఇంటి పనులు అంటే వాటికి ఒక వేళ, ఒక నియమం అంటూ ఉండదు. ఎంత చేసినా వాటికి అంతులేదు. అందులోనూ ఈ రోజుల్లో ఎవరు పడితే వారు ఒంటరి కాపురాల వాళ్లు కదా, ఇక మగవాడూ ఉద్యోగానికి వెళ్ళి, ఆడదీ ఉద్యోగానికి వెళ్తే ఇంటి సంగతి ఎట్లా ఉంటుందో ఊహించుకోవలసిందే.

నా స్నేహితురాలొకామె స్కూల్లో టీచరు. భర్త డాక్టరు. ప్రొద్దున్నే లేచి ఆదరా బాదరా వంటచేసి తానింత తిని స్కూలుకి వెళ్ళిపోతుంది. మిగతా పనులు ఏదో కొంత నౌకరు సవరించగా భర్తకూడా తన వేళకు తాను భోజనం అయిందనిపించి ఇల్లు తాళం వేసుకొని తన పని మీద తాను వెళ్ళిపోతాడు. వాళ్ళున్న ఊరికి ఏదో పనుండి ఒక మాప నేను పిల్లలతో వెళ్ళి సరిగా మధ్యాహ్నం పన్నెండు గంటలకు రైలు దిగి సరాసరి వారింటికే వెళ్లాను. ఇల్లు తాళం! ఇరుగూ పొరుగూ "సాయంత్రం అయిదు దాటితేకాని ఇద్దరూ రారమ్మా" అని చెప్పారు. దేవుడా అంటూ ఆ ఎండలో ఏడుస్తూన్న పిల్లలతో వెదుక్కుంటూ హోటలుకి పోయి రెండుమెతుకులు కొరికి ప్రయాణ శ్రమ తీర్చుకోడానికి విశ్రాంతి తీసుకొనేందుకు స్థలమైనాలేక అట్లాగే ప్రాణాలుగ్గబట్టుకొని ఉండి మళ్ళీ ఐదు గంటలకు వాళ్ళింటికి తయారయ్యాను. నా పాట్లు తెలిసికొని చాలా కటకట బడింది. కాని ఏమిచెయ్యగలదు? అంతలోనే ఆ సాయంత్రం బండికి వాళ్ళ ఆడబడుచుకూడా దిగింది. వేళ పట్టున ఇంటిలో ఎవరూ ఉండలేకపోవడంవలన, పాలు, మజ్జిగ, కూరా నారా, అదనంగా దొరకక పోయినవి, నా స్నేహితురాలి భర్త, భార్య ఉద్యోగంవల్ల ఇన్ని చిక్కులు తటస్థించాయని మనస్తాపం పడి భార్యను రుసరుసలాడి పని మాన్పించాడు. పండంటి ఉద్యోగం పోయిందని ఆవిడ విసవిస లాడింది. మధ్య మాపని కసపస అయింది.

ఇంతేకాదు ఇలాంటివి చెప్పాలంటే చాలా చెప్పవచ్చు. పనిలోకి వెళ్లాలని సిద్ధపడి బయటికి వచ్చి ఇల్లు తాళం వేసే సమయంలో ఎవరైనావస్తే అపుడు అటు ఉద్యోగానికి తెగించి వెళ్ళిపోలేకా, అది విడిచి యింట్లో ఉండిపోలేక వాళ్ళు పొందే అశాంతీ, అవస్థా ఇంతా అంతా కాదు. అంతేకాదు, ఉద్యోగంలో నలిగి నలిగి, సాయంత్రం యింటికి వచ్చి, రాగానే పిల్లలాందోళన పెడ్తూంటే ఆ అలసటతో, అసలే సత్తువలులేని ఈకాలపు గృహిణులు పొందే చిరాకూ, పరాకూ చిత్తగించాలేకాని, వ్రాయడానికీ, చెప్పడానికీ వీలు కానిది. ఇంటిపట్టున ఉండడానికి వీలుకాక, బియ్యం, పప్పూ, ఉప్పూ అవీ బాగు చేయించుకోకుండానే

వంటలు చేసుకొని నిత్యమూ హోటలుకూడే సంప్రాప్తమైందని బాధపడే ఉద్యోగి దంపతులెందరో ఉన్నారు. ఒక లేడీ డాక్టరు పిల్లలు ఎప్పుడూ నౌకర్ల పోషణలో ఇరుగు పొరుగువారి పడి పంచల్లో పడి ఉండి లేనిపోని వ్యాధులకు గురికావడము నే నెఱుగుదును. ఉద్యోగం తొందరచే ఇల్లూ సమానంగా సవరించుకోలేక, ఇంటిపని తొందరచేత అటు ఉద్యోగం సరిగా నిర్వర్తించలేక డిస్మిసులు పొంది లేనిపోని మనః క్షోభాలతో మంచం ఎక్కిన స్త్రీలు చాలా మంది మనకీ రోజుల్లో కనబడుతూ ఉన్నారు. కేవలము నౌకర్లకే ఇళ్ళు అప్పగించి వెళ్ళిపోయిననాడు బియ్యం, చింతపండుల దగ్గరనుండి, వెండి బంగారు సామానులవరకూ పోగొట్టుకొని ఆర్థిక దుస్థితియొక్క దగ్గఱ ఆహ్వానాలు కోరితెచ్చుకున్న వారినికూడా మనం చూస్తూనే ఉన్నాం. ఒక్కొక్క ఇంట్లో భార్య ఉద్యోగానికి వెళ్తే, వచ్చేపోయే చుట్టపక్కాలను, నౌకర్లనూ, పిల్లలనూ సంబాళించలేక మగవాళ్లు పడే అవస్థలు వర్ణనాతీతమే కాక ఇంటికి వచ్చిన అతిథికికూడా తలవొంపులుగా ఉంటూన్నవి. అంతేకాదు ముఖ్యంగా ఆడదాని పెంపకం సరిగా లేని అట్లాంటి కుటుంబాల్లో పసిబిడ్డల స్థితి చూస్తే కడుపు తరుక్కుపోతుంది.

స్త్రీకూడా పురుషునితోబాటు సమానమైన తెలివి తేటలు కలదేకదా, అటువంటప్పుడు స్త్రీకి సమానమైన హక్కులూ, ఉద్యోగాలూ ఎందుకుండగూడదు? తప్పకుండా ఉండితీరవలసిందే అని—ఎందరో వేదికలెక్కి ఉపన్యాసాలూ, తీర్మానాలూ చేస్తూఉన్నా అదంతా ఊక దంపే. ఆచరణలోకి వచ్చేటప్పటికి ఇంటికైన ఆడది అచ్చగా ఉద్యోగాలమీదే ఉండి యిల్లువదలిపోవలసివస్తే అది యిల్లుకాదు సరిగదా వల్లకాడే మేలనిపిస్తుంది.

కేవలం ఉద్యోగమేకాదు ఏదో అపుడపుడు సభకనీ, సమావేశానికనీ, క్లబ్బుకనీ, టీపార్టీకనీ, పనంతా చేసుకొని వెళ్ళాలంటేనే ఒక్కొక్కమారు గృహిణులకు ఎన్నో ఆటంకాలుకలిగి తీరనేతీరదు. ఇవన్నీ ఎప్పుడూ ఉండేవేలెమ్మని వెళ్ళారో మళ్ళీ వచ్చేటప్పటికి యింట్లో ఒక పెద్ద గాలివానో, పెనుప్రళయమో వచ్చినంత ఖంగారైపోతూ ఉంటుంది.

ఈ వ్యాసానికి మొదట్లో వ్రాసినట్లు మన భారతదేశ సాంప్రదాయాలకూ స్త్రీల ఉద్యోగాలకూ ఏమీ పొంతనా కుదరదు.

ఇక కొన్ని సమాధానాల విషయం ఆలోచిద్దాం.

వచ్చే చుట్టాలకు హోటళ్ళు లేవా? అంటారేమో. మన దేశంలో హోటళ్ళ సౌభాగ్యం కుటుంబీకులకెంత సౌకర్యంగా ఉంటవో ఎవరెఱుగనిది?

అయితే పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు ఉద్యోగాలు చేయడంలేదా అక్కడ సంసారాలు సక్రమంగా నడవడంలేదా అనవచ్చు- అక్కడ భార్యాభర్తలు పనిలోకి వెళ్తె ఆ పిల్లల సమస్తబాధ్యతలూ స్టేట్ గవర్నమెంటు చూచుకుంటుంది. ఆధునిక గృహనిర్మాణాలూ, విద్యుచ్ఛోకర్యాలూ, కలిగిన ఆ సంసారాల్లో మనం ఒకరోజు తంటాలు పడి పూర్తిచేసే పని ఆదేశాల్లో ఒక్కక్షణంలో పూర్తి కావడానికి వీలున్నది. అక్కడి బంధుమర్యాదలు వేరు. ఆదేశాల్తో మనదేశాలకు పోలికే పనికిరాదు. అటువంటి నాగరికతా దేశాల్లోనే రష్యా, జర్మనీ నియంతలు లెనిన్, హిట్లర్లు సాంసారిక స్త్రీలకు ఉద్యోగాలు నిషేధించారంటే దీనిలోని కష్టం బోధపడకపోదు.

కాకపోతే ఇంట్లో కావలసినంత హంగువుండి ఇతర మనుష్యుల సహాయం ఇబ్బడిగా ఉండే కుటుంబాల్లో స్త్రీలు ఉద్యోగాలకువెళ్తే కుటుంబానికికేమి నష్టం? అని అనడానికి వీలులేదు. అట్లాంటి ఈ ప్రశ్నకు కారణమేలేదు.

అయితే అసలే ఆర్థికదుస్థితితో క్రుంగిపోతూ ఉన్న భారతీయసంసారాల్లో ఉద్యోగనిపుణురాలూ ప్రతిభావంతురాలూ ఐన స్త్రీ ఆర్థికదుస్థితిని సవరించడానికీ, మగవాడికి చేదోడు వాదోడుగా ఉండడానికీ ఉద్యోగం చేయకుండా చేతులు ముడుచుకొని కూర్చొని కావాలని దుష్భర దరిద్రస్థితిని అసమర్థురాలువలె స్వీకరించమని నేను చెప్తున్నాననుకోవద్దు.

తప్పకుండా స్త్రీలుకూడా ఉద్యోగాలుచేసి చేతనైనంతవఱకూ ఆర్థిక దుస్థితిని దూరానికి పారద్రోలవలసిందే. కాని అట్టివారి కుటుంబాల్లో శాంతి మాత్రం శూన్యం అనక తప్పదు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)



అద్దం ముందు కూర్చుని వెక్కిరిస్తే
ఆ ప్రతిబింబమూ వెక్కిరిస్తుంది !
ప్రతి మనిషీ గమనించవలసింది....

# మాటా—మర్యాదా

* శ్రీ వేమరాజు భానుమూర్తి *

మన ప్రపంచంలో ఏ పనీ చేయకుండా కేవలం సోమరులుగా ఉన్నా పొట్ట గడిచిపోయే అదృష్టవంతులు కొంత మంది మాత్రం ఉంటారు. ఇలాంటి వారు కోటికి పది మంది కూడా ఉండరంటే అతిశయోక్తికాదు. మిగతా అందరూ చాలా మందికి రెక్కాడితేగాని డొక్కాడదు. ఇందులో కొంతమందే సంపన్నులుగా ఉంటారు. మిగతా వాళ్లు రకరకాలుగా ఉంటారు. వారి వారి ఆర్థిక స్థితిగతులనుబట్టి వారి తరగతి నిర్ణయమవుతూ ఉంటుంది. ఇందులో కాస్త డబ్బున్నవాళ్ళు పరంపరగా గౌరవం, ఆస్థి అన్నీ కలవాళ్లు దానిని ఎలాగ వృద్ధి చేసుకోవడమా అని ఆలోచించి తమ తమ శక్త్యానుసారం వ్యాపారమో, పరిశ్రమో, ఇంకేవో పెట్టి లాభాలు గడించడానికి చూస్తూ ఉంటారు. మిగతా వాళ్ళలో అధిక సంఖ్యాకులు ఇట్టి వ్యాపార సంస్థలు లేదా పారిశ్రామిక సంస్థలలో చేరి పొట్ట పోసుకుంటూ ఉంటారు. ఇట్టి సంస్థలలో అగ్రగణ్యమైనది, మొత్తం యావద్దేశ శ్రేయస్సుకు పాటుబడేది ప్రభుత్వం. అందుచేత పరిశ్రమలు, వ్యాపారం, ప్రభుత్వం అన్నీ సక్రమంగా నడవాలంటే ఆయా ప్రాంతాలలో తమ అవసరాలకు తగినట్టుగా కార్యాలయాలను నెలకొల్పి, సిబ్బందిని చేర్చుకొని తమ తమ పనులు చూసుకుంటూ ఉంటారు.

ఈ కార్యాలయాలు ఎంత చక్కగా, ఎంత కట్టుదిట్టంగా పనిచేస్తే అంత గొప్ప గొప్ప ఫలితాలు సాధింపబడతాయి. అందువల్ల అటు యజమానులకు, ఇటు పనివారికి, అన్నింటిని మించి దేశానికీ మేలు కలుగుతుంది. ఈ కార్యాలయాలు ఆయా సంస్థలకు వృత్తులనుబట్టి రకరకాలుగా మారిపోతుంటాయి. ఇక ఆయా కార్యాలయాలలో పటిష్ఠంగా కృషి జరగడమనేది అక్కడ ఉండే యజమానులకు, పని చేసే సిబ్బందికి మధ్యగల సంబంధ బాంధవ్యాల మీద విశేషంగా ఆధారపడి ఉంటుంది.

అక్కడ పనిచేసే సిబ్బందికి విశ్వాసాన్ని, మర్యాదను యజమాని చూరగొన్ననాడు ఆ సంస్థ బాగా రాణిస్తుంది. దీనికి ప్రతిఫలంగా యజమానికూడా తన సిబ్బందిపట్ల విశేషమైన ఆదరానురాగాలు, కృతజ్ఞత కలిగి ఉండడం అవసరం. మర్యాదను ఇవ్వడంవల్ల మర్యాదను తెచ్చుకోవచ్చు. ఎదటి వాడిని మనం తూలనాడి, ఆవ్యక్తి మనలను గౌరవించలేదని మనస్సులో బాధ పడడం కూడ పొరపాటు, పట్టి అవివేకం. ఇందుకు ఒక బుల్లి కథ చెబుతాను.

ఒకసారి ఒక కుర్రాడు చెరువు గట్టుకు వెళ్ళి గట్టిగా 'బుద్ధిహీనుడా' అని అరిచాడుట. ఆ కేకకు దిక్కులన్నీ అదే విధంగా ప్రతిధ్వనించాయి. వాడు ఎన్నిసార్లు కేక వేస్తే అన్నిసార్లూ అదేమాట ప్రతిధ్వనించింది. ఉడుకుమోతుతనం వచ్చింది. ఇంటికి వెళ్ళి తన్ను ఎవరో తిడుతున్నారని తండ్రికి ఫిర్యాదు చేశాడు. ఈ సారి 'పెద్దమనిషీ' అని పిలవమన్నాడు, తండ్రి. ఈ కుర్రాడు అలాగే చేశాడు. దానికి అనుగుణంగానే 'పెద్దమనిషీ' అని ప్రతిధ్వని వచ్చింది. ఈ కథ చిన్నదే అయినప్పటికీ లోకం స్వభావాన్ని నిరూపించడానికి చక్కని ఉపమానం.

మనం ఎదుటి వారిని ద్వేషిస్తే ఎదుటి వారు మనలనీ ద్వేషిస్తారు. ప్రేమిస్తే ప్రేమిస్తారు. గౌరవిస్తే గౌరవిస్తారు. అందరికీ మనం ఉపకారం చేస్తే అందరూ మనకీ ఉపకారం చేస్తారు.

ఇది లోకం తీరు. అయితే లోకం అందరితో మనకు పని ఉండకపోవచ్చు. కొందరితోనే మనకు అవసరం ఉండ

వచ్చు. అలాంటప్పుడే ఇప్పుడు నేను చెప్పిన పద్ధతివల్ల ఎన్నో సత్ఫలితాలు కలిగేటప్పుడు అహరహం ఇతరులతో కలిసి మెలిసి ఉండే కార్యాలయంలో ఈ సిద్ధాంతాన్ని పాటించడం ఎంత అవసరం అంటారు?

ఎవ్వరిచేత నైనా ఏదైనా పని చేయించుకోవడానికి ఒక పద్ధతి ఉంది. అది మర్యాదగా చెప్పి ఎదటివాడిని నొప్పించకుండా సంతోషపూర్వకంగా మన పని చేయించుకోవడం లోనే గొప్ప అంత ఉంది. అందుకు మాట పొందిక అవసరం. మాటే కదా మనకు కయ్యాన్ని అయినా నెయ్యాన్ని అయినా తెచ్చిపెట్టేది. వెనకటికి ఒక బుద్ధిమంతుడు రోజూ అద్దం ముందు నిలబడి నాలుకకు నమస్కారం చేసేవాడుట. ఏమిటని ప్రక్కనున్న మిత్రుడు అడిగితే—"నాలుకా, నాలుకా! వీపుకు దెబ్బలు తేకే" అని ప్రార్థిస్తున్నాను— అన్నాడట. మాట పొందిక అవసరాన్ని ఈ కథ చక్కగా నిరూపిస్తోంది.

ధర్మరాజు అజాత శత్రువైనాడంటే అందుకు కారణం వీలెరిగి మాట్లాడగలనేర్పు ఆయన సొమ్ముకనుక నే. ఇంతకీ మనం ఏ వృత్తిలో వున్నా, ఏ కార్యాలయంలో వున్నా ఇతరులచేత, మన చేతిక్రింద పనిచేసే వారిచేత నైనా సరే కావలసినదానికంటే ఎక్కువ పనిని చేయించుకోవాలంటే అందుకు ఒకటే మార్గం ఉంది. అది వారి పట్ల మర్యాద చూపించి, మర్యాదగా మన పని చేయించుకోవడం.

పిస్తోలును చూపించి ఇవ్వకపోతే ప్రాణం తీస్తానని బెదిరించి ఎదటివాడి దగ్గర ఉన్న ఖరీదైన గడియారాన్ని కాజెయ్యడం తేలికే. చెప్పిన పని చెయ్యకపోతే ఈక్షణం ఉద్యోగంలోంచి తీసివేస్తానని మన అధికారం దర్పం అంతా చూపించి మన క్రిందివాడిచేత పనిచేయించుకోవడం గొప్ప అనిపించుకోదు. అలాంటప్పుడు మనం ఎదురుగా ఉన్న కాస్సేపూ ఏదో పనిచేస్తోన్నట్టు నటిస్తారు. మనం కాస్త అటుతిరగ్గానే ఇటు పని ఎగగొట్టడమే కాకుండా మనలను నాలుగు తిట్టుకొని, వీలైతే ఆ పనిని పాడుచెయ్యాలనికూడా చూస్తూంటారు.

కొట్టి, తన్ని, బెదిరించి, చిన్నకుర్రాడిచేత మనకు కావలసిన పని చేయించవచ్చు. కాని ఇవన్నీ పట్టి పనికిమాలిన పద్ధతులు. ఇందువల్ల తరువాత తరువాత దుష్ఫలితాలు అనేకం కలుగుతాయి.

ఇందుకోసం ఈ క్రింది తొమ్మిది నియమాలను అనుసరించడంవల్ల ఎంతో మేలు ఉంటుంది.

ఎదటివారి మనస్సు నొప్పించకుండా మన పని చేయించుకోవడానికి, మన చెప్పుచేతలలో వారిని ఉంచుకోవడానికి మంచి పద్ధతి ఇది.

మొదటిది : మన చేతిక్రిందివారే అయినప్పటికి, వారిలో ఏ కొంచమైనా ప్రతిభ కనిపిస్తే దానిని మెచ్చుకోవడం.

రెండవది : వారు ఏమైనా తప్పుచేస్తే మొహం మీద, లేదా నలుగురి ఎదుట నొచ్చుకునేటట్టు చెప్పకుండా పరోక్షంగా సూచించడం.

మూడోది : ఎదటివారి తప్పులను విమర్శించబోయేముందు ఆ ఈడులో, లేదా అదే పదవికి తను వచ్చిన కొత్తలో ఎలాంటి తప్పులు చేశామని నిర్మొహమాటంగా చెబుతూ ఆత్మ విమర్శతో అసలు కథను విమర్శించడం.

నాలుగోది : అధికార దర్పంతో ఆపనీ, ఈ పనీ పురమాయించకుండా, "చేస్తే బాగా ఉంటుంది, చేయడం అవసరం" అనే భావం వారిలో కలిగించడం.

అయిదోది : తప్పును సరిదిద్దుకోవడానికి ఎదటివాడికి అవకాశం ఇవ్వడం.

ఆరోది : పనిలో ఏ కొంచెం అభివృద్ధి కనబడినా దానిని మెచ్చుకోవడం. ఆవ్యక్తి సాధించిన ప్రతి అభివృద్ధిని గట్టిగా నలుగురి ఎదుట "నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరించినట్లు కాకుండా" మనస్ఫూర్తిగా ప్రశంసించడం.

ఏడోది : అవతల వ్యక్తికి చెప్పుకు బ్రతకడానికి వీలుగా మారు పేరు ప్రతిష్ఠలు కల్పించడం.

ఎనిమిదోది : ఎల్లప్పుడు ప్రోత్సహిస్తూ ఉండడం. ఏమైనా తప్పులు చేస్తే అవి సవరించుకోదగినవే గాని సవరించడానికి వీలుకానివి కావనే భావాన్ని కలిగించడం.

తొమ్మిదోది : మనం చెప్పినది చెయ్యడంలో ఎదుటి వాడికి సంతోషం కలిగేటట్టు చెయ్యడం. ఈ సందర్భంలో ఇవే కాకుండా మనం పెద్ద మర్యాదైనవి గాకపోయినా చూడ ముచ్చటగా ఉండే దుస్తులను ధరించడం, ఎప్పుడూ ఆరోగ్యంగా కల కల లాడుతూ నవ్వు మొహంతో ఉండడం, అందరితో మనసిచ్చి మాట్లాడడం, కష్టసమయంలో ఎదటివారిని ఆదుకోవడం వగైరా సంఘ మర్యాదలను పాటించడం అవసరమని నేను వేరుగా చెప్పనక్కరలేదు. ఒక్క చిన్న కథ చెప్పి ఈ ప్రసంగాన్ని ఇప్పటికి ముగిస్తాను.

ఈ ప్రపంచ చరిత్రలో ఏడాదికి దాదాపు 40 లక్షల రూపాయలు జీతం పుచ్చుకుంటున్న పెద్ద మనుష్యులు నాకు తెలిసినంతవరకు ఇద్దరే ఇద్దరు ఉన్నారు. ఒకడి పేరు వాల్టర్ క్రిస్లర్. రెండోవాడి పేరు ఛార్లెస్ స్క్వాబ్. రెండో ఆయన అమెరికాలోని ఉక్కును తయారుచేసే పెద్ద సంస్థలో పనిచేస్తున్నాడు. అయితే అలాంటి ఉద్యోగాలు అలాంటి సంస్థలలో ఇంకా అనేక మంది చేస్తున్నారు. కాని ఎవ్వరికీ ఈయనకు వచ్చినంతగా రోజుకు పదివేల రూపాయలు జీతం రావడంలేదు.

బహుశా ఇందుకు కారణం ఆయన చాలా తెలివైనవాడనో, లేక ఉక్కును తయారు చేయడంలో ఇతను అందరికంటే మొనగాడనో, మీరు అనుకుంటూ ఉంటారు. కాని ఇది పెద్ద పొరపాటైన ఆలోచన. ఈ ఛార్లెస్ స్క్వాబ్ చేతిక్రింద అనేక రకాల మంది ఉక్కు తయారీ నిపుణులు చాలా తక్కువ జీతాలకు పనిచేస్తున్నారు.

అయితే, ఈయన గొప్ప ఏమిటి? అనే సందేహం రావడం సహజం.

అదే నేను చెప్పవస్తున్నాను. ఆయన గొప్పతనం ఇంత గొప్ప సంస్థలో పనిజేసే అనేక వేలమంది చేత ఎవ్వరినీ నొప్పించకుండా అంత సంతోషంగా పనిచేయించుకోవడం. దాని కీలకాన్ని ఆయనే ఒక సందర్భంలో ఇలా చెప్పాడు:

“నావున్న ప్రజ్ఞ అల్లా నా కార్యాలయంలో నాతో కలిసి, నా చేతిక్రింద పనిజేసే వారిని ప్రోత్సహించడంలో ఉంది. అదేమిటంటే వారిలో ఏ కొంచెం ప్రతిభ ఉన్నా దాన్ని వెతికి పట్టి బాగా మెచ్చుకోవడం, దానిని పూర్తిగా వికసించేవరకు ఎప్పుడూ ప్రోత్సహిస్తూ ఉండడమూను.

ఏ మనిషిలో అయినా చేవ, ఉత్సాహం చచ్చిపోవడానికి ప్రధాన కారణం తన ప్రతిభను పైవాళ్ళు గుర్తించకపోవడం కాక, వాళ్ళను సదా నిరుత్సాహ పరుస్తూ ఉండడం, చీటికీ మాటికీ నిందిస్తూ, తనకంటె పనికిరానివాడు ఇంకెక్కడా లేడనే భావాన్ని కలిగించడమే. నేను ఎప్పుడూ ఎవ్వరినీ విమర్శించను. ప్రతివారిని కష్టపడి సంతోష పూర్వకంగా పనిజేసేటట్టు పూర్తిగా ప్రోత్సహిస్తాను. అందుకనే వారిలోని మంచిని మెచ్చుకోవడానికే ఎప్పుడూ చూస్తోంటాను. ఆ మెచ్చుకునే టప్పుడైనా గట్టిగా, మనస్ఫూర్తిగా ఉదారంగా మెచ్చుకుంటాను” అన్నాడు.

ఇంక మామూలువాళ్ళు సరిగా ఇందుకు వ్యతిరేకంగా వ్యవహరిస్తూంటారు. అందుకనే ఇలాంటి సంస్థలు అచిర కాలంలోనే పడుకుంటూ వుంటాయి.

ఇంతకీ చివరకు చెప్పవచ్చేదేమిటంటే: తోడివారిని గౌరవించడంవల్ల—క్రిందివారిని మర్యాదగా చూసి వారిని ప్రోత్సహించి, వారితో నాలుగు మంచి మాటలు చెప్పడంవల్ల—మనకు కలిగేది అంతా లాభమే కాని నష్టం ఏమీ లేదని.

★

# భూ మ్యా కా శా లు

* శ్రీమతి జయంతి కామేశ్వరి *

"రేపు నువ్వు మా యింటికి రాకూడదూ? శలవుపూట హాయిగా చాలాసేపు మాట్లాడుకోవచ్చు" అన్నాడు సుబ్బారావు.

"నాకు మీ యిల్లెక్కడుందో సరిగా తెలియదే" అంది రుక్మిణి.

"శంకరపురం నాలుగో క్రాసులో బస్సుదిగు. తూర్పుగా ఏభయి గజాలు నడిచి కుడిప్రక్కకి తిరుగు. అదే మా యిల్లు, దానికి ఎదురుగుండా పెద్ద మేడకూడా వుంది"....

రుక్మిణి ఈచేతిలో పుస్తకాలు ఆచేతిలోకి మార్చుకుంటూ ఇలాగంది: "ఏమో, మా నాన్నగారు వెళ్ళనిస్తారో లేదో"....

సుబ్బారావు పౌరుషంతో, "ఇందులో తప్పేముంది? క్లాసుమేటు యింటికే వెళ్ళనివ్వరా" అన్నాడు. "ఏమో, ఎప్పుడూ నేనడిగి చూడలేదు. పోనీ నువ్వొక పని చెయ్యి. శ్రమలేదంటే నువ్వే మాయింటికి రా, ముందు. తర్వాత యిద్దరం కలిసి మీ యింటికి వెడదాం" అంది రుక్మిణి. సుబ్బారావుకి ఆమాటలు బాగా నచ్చాయి.

"సరే, అయితే తప్పకుండా వస్తాను. ఎన్నిగంటలకి రమ్మన్నావ్"—

"పన్నెండు లోపుగా, భోజనానికే వచ్చెయ్"

"మరి మధ్యాహ్నం నువ్వు టిఫినుకి మాయింటికి వచ్చెయ్యాలిసుమా" అన్నాడు సుబ్బారావు. రుక్మిణి ఏదో ఆలోచిస్తూనే తల వూపింది. ఇంతలో "రండి అమ్మగారూ చీకటి పడుతుంది మళ్ళీ" అన్నాడు బండివాడు. రుక్మిణి ఒకసారి వెనుతిరిగి చూసి 'వెళ్ళిరానా' అంది. సుబ్బారావు 'సరే' అన్నట్లు తలవూపేడు. ఆమె మెల్లిగా బండి యెక్కింది. బండి కదిలింది. ఆసాయంసంధ్య కాంతులలో అది కనుచూపు మేర దాటిపోయే వరకూ సుబ్బారావు నిశ్చేష్టుడై నిలుచున్నాడు. ఆతర్వాత మెల్లగా తేరుకుని, చేతిలో పుస్తకాలు సర్దుకుంటూ నడక ప్రారంభించేడు. అతని కిరుప్రక్కలావున్న కాలేజీ భవనాలు దినమంతా పాఠాలు నేర్చుకొని యిప్పుడు నిద్రపోతున్నట్లున్నాయి. ప్రక్కనవున్న అశోక వృక్షం మీద పక్షులెన్నో చేరి ఆ నిద్రకు భంగం కలిగిస్తున్నాయి. సుబ్బారావు అదీ యిదీ యోచించుకుంటూ యిల్లు చేరుకున్నాడు. లోపల అడుగు పెట్టడమే తడవుగా తల్లితో ఇలాగన్నాడు.

"తాశిల్దారు గారి అమ్మాయి రేపు మన యింటికి వస్తుందమ్మా." ఆ ముసలి తల్లి నిర్ఘాంతపడి చూస్తూంది.

"అవునమ్మా, మా క్లాసులో చదువుకుంటోంది. నా కెంతో స్నేహితురాలు, రేపు మన యింటికి వస్తానంది" ....మళ్ళీ అన్నాడు సుబ్బారావు. ఆ వంటరి తల్లి కొంత సంతోషమూ, కొంత సంకోచమూ పొందింది. నిజంగా తాశిల్దారుగారి అమ్మాయి తన బీద కొంపలో అడుగు పెడితే తన కుమారుని గొప్పతనమే కారణ మనుకుని, పైకి "నిజంగా వస్తుందిరా? వస్తేమటుకు మన యింట్లో కుర్చీలా, బెంచీలా? మనమేంపెట్టి ఆదరించగలం?" అంది.

సుబ్బారావు "నువ్వేం బాధపడకమ్మా. ఆవిడికి ఎంత మాత్రం ఆడంబరం అనేది లేదు. బీదవాళ్ళని గురించి దయగా మాట్లాడుతుంది. మన యింటి పరిస్థితులామె కేనాడో చెప్పేసేను. కాలేజీలో మా యిద్దరి సీట్లూ ప్రక్క ప్రక్కనే నమ్మా?" అన్నాడు.

ముసలి తల్లికి కొంచెం ధైర్యం కలిగి, "అయితే ఏ దైనా ఫలహారం చెయ్యకపోతే బాగుండదు" అంది

సుబ్బారావు "అవును. మధ్యాహ్నం మూడు గంటలకి వస్తుంది. సేమియా పాయసమూ, నేతి వడలూ చెయ్యి. నేను మధ్యాహ్నం భోజనానికి వాళ్ళయింటికే వెడుతున్నాను." అన్నాడు. ముసలి తల్లి ముసి ముసి నవ్వులతో మురిసిపోయి యిక మాట్లాడలేదు. ఆ రాత్రి సుబ్బారావుకి నిద్రపట్టలేదు. రుక్మిణితో తనకున్న పరిచయమంత

మూసుకున్న కళ్ళముందు ఒక్కసారి కనబడింది. అతని మనస్సులో ఏవేవో భావాలు కమ్ముకొని కలవరబెట్ట సాగేయ్. ''అసలు రుక్మిణి ఎవరు? నే నెవరు? ఆమెతో నాకీ పరిచయం ఏర్పడడానికి కారణమేమిటి? మా క్లాసులో ఇందరు కుర్రవాళ్ళుండగా, ఆమె ఎవరినీ కాదని నాతోనే యింత చనువుగా వుండడానికి కారణం ఏమిటి? తన యింటి విషయాలన్నీ ముఖ్యంగా తనకు తల్లి లేదనీ, తమ్ముళ్ళ నిద్దరినీ తానే చూచుకోవాలనీ నాతో చెప్పడంలో అర్థమేమిటి? నాకు కూడా ఆవిడంటే ఇంత ఇదిగా వుండ డానికి కారణమేమిటి? ఇది ప్రేమా? స్నేహమా? లేక గౌరవమా? స్నేహమొక్కటే మాత్రం కాదు. ఆవిడ కళ్ళల్లో ఏదో కాంతి కనబడుతుంది నాకు. ఆ కాంతి నిజంగా నా జీవితరంగంలో వెలుగుగా మారుతుందా?'' ఇలాగ ఆలోచించుకుని, ఏ నిర్ధారణకూ రాక ఏ మూడు గంటలకో నిద్రపోయాడు సుబ్బారావు.

మర్నాడుదయం లేచినప్పటినుంచీ ''పన్నెండు ఎప్పుడు అవుతుందా'' అని కూర్చున్నాడు సుబ్బారావు, ఆఖరికి పన్నెండు గంటల బస్సు రాగానే పరధ్యాన్నంగా ఎక్కి కూర్చుని, పట్టుమని పావుగంటయినా లేకుండానే పది హేడో క్రాసులో దిగి వూరుకున్నాడు, అది నాలుగు రోడ్డుల మొగ. అక్కడికి కుడివైపున నాలుగో యిల్లు రుక్మిణిదని తెలుసునుగాని, ఎన్నడూ అతడావైపు పోలేదు. అందుచేత ఎవరినీ అడగకుండా, నెమ్మదిగా రోడ్డుమీదనే నడచిపోతున్నాడు. నిజంగా నాలుగో యిల్లు దాటుతోంటే అతనికాళ్ళు తడబడ్డాయి. ఆ యింటి వరండాలో యిద్దరు జవానులు కూర్చుని మాటా మంతీ ఆడుకొంటున్నారు. అందులో ఒకని మెడలో డవాలీ కూడా వుంది. సుబ్బారావు రుక్మిణి ఏమూలనైనా కనబడుతుందేమోనని ప్రక్కవాటుగా అప్పుడప్పుడు చూస్తూ తిన్నగా నడచి ఆరోడ్డు చివర చేరు కున్నాడు, మళ్ళీ వెనక్కి తిరిగి నడక ప్రారంభించి గడి యారం చూస్తే పన్నెండున్నర అయింది. "ఇంక బాగుం డదు- నాకోసం భోజనాలు మానుకుని కనిపెట్టు కుంటా రేమో" అనుకుని వీధి గుమ్మం సమీపిస్తే, జవాను ఎదురు వచ్చి 'ఏం కావాలి' అన్నాడు గేటు దగ్గరే. సుబ్బారావు కెందుకో కొంచెం భయం కలిగింది. అయినా ధైర్యం తెచ్చుకుని 'తాశిల్దారుగారున్నారా యింట్లో' అన్నాడు మన స్సులో ఆయన వుండకూడదని కోరుకుంటూ, 'ఉన్నారు. ఏం గావాలి మీకు' అన్నాడు జవాను.

"పని వుంది"

'ఏం పని? ఇంతకీ మీరెవరో చెబితే, లోపలికెళ్ళి తెలిపి వస్తాను'' అన్నాడు జవాను,

''నాకు పని ఆయనతోగాదు. ఆయన కూతురు వున్నారే, రుక్మిణమ్మ, ఆవిడ నా క్లాసుమేటు. ఆవిడ పుస్తకం ఒకటి కావాలి. కొంచెం పిలవగలవా?" అన్నాడు సుబ్బారావు. జవాను కొంచెం సంకోచిస్తూ ''ఇప్పుడామె బయటకు వస్తారో, రారో— ఎవరో బంధువులు కూడా వచ్చేరు'' అన్నాడు. సుబ్బారావు అదే సమయమని ''అయినా, కొం చెం చెప్పిచూద్దూ. పుణ్యం వుంటుంది, అయిదు మైళ్ళ నుండి ఎండలో ఇంతదూరం వచ్చేను" అన్నాడు. జవాను మూడు నిముషాలలో తిరిగి వచ్చి, ''తాశిల్దారుగా రెవరి తోనో మాట్లాడుతున్నారు, ఇలాగ ఈ బెంచీమీద కూ ర్చోండి, పది నిముషాలలో మీతో మాట్లాడుతామ"న్నారు అన్నాడు. సుబ్బారావుకి ఏమీతోచక బెంచీమీద కూర్చుని, వీధిలో ఈప్రక్కకీ, ఆ ప్రక్కకీ పోయేవాళ్ళని చూస్తున్నాడు. ఇంతలో లోపలనుంచి సంభాషణ యేదో బాగా వినిపిస్తోంది. సుబ్బారావు చెవులప్పగించి వింటూ "మరయితే ఆ అయిదువేలూ ఖాయం చేయించెయ్యండి. వచ్చే వేసవిలో శుభం జరిపించేద్దాం''

"అబ్బే! ఇంక బాధపెట్టకండి నాలుగువేలూ అన్నాను. నాది ఒక్కటే మాట- ఒకటే వ్యవహారం- ఇదేం కూరల బేరమా చెప్పండి—"

"మరి ఇంతవరకూ వచ్చేక ఒకటిని ఆ కట్నంలోకూడా కాస్త కలిపి వెయ్యండి! ఏదో వయసులో పెద్దవాణ్ణి సంతో షిస్తాను—''

సుబ్బారావుకి గుండెదడ ఎక్కువయింది. లోపల జరు గుతూన్న పెళ్ళి బేరం వింటుంటే ''అతనిపని నీటిలోంచి

గట్టుమీదకి మోయబడ్డ చేపలావుంది. ఇంతలో మూడో గొంతుక మాట్లాడుతోంది"—

"రామయ్య మావగారూ ! తాశిల్దారు బాబుగారూ ! వ్యవహారం ఇంతవరకూ వచ్చేక విడిచిపెట్టరాదు. ఇద్దరికీ తలో అయిదు వందలూ పెళ్ళిఖర్చులే జాస్తి అయినా యనుకోండి. నాలుగువేల అయిదువందలు"

"తథాస్తు"—

లోపల కుర్చీలు కదిలిన శబ్దమయితే సుబ్బారావుకూడా లేచి నిలబడ్డాడు. ఇద్దరు వ్యక్తులెవరో తాశిల్దారుగారితో సహా వీధిలోనికి వచ్చేరు. తాశిల్దారుగారిని చూడగానే సుబ్బారావుకి ఆశ్చర్యం కలిగింది. ఆయన వయస్సులో చాలా చిన్నవాడిలా వుండి రుక్మిణికి తండ్రి లాగే కనిపించడంలేదు. ఆ వ్యక్తులిద్దరూ ''ఒక గంటలో వస్తామ"ని చెప్పి వెళ్ళిపోయారు. తాశిల్దారుగారొకసారి సుబ్బారావుకేసి చూసి లోనికి వెళ్ళిపోయారు. మరుక్షణంలో రుక్మిణి నీలి తెరచాటునుంచి మబ్బుమరుగున మెరుపుతీగలా ముఖం చూపి ''లోనికి రమ్మ''ంది. సుబ్బారావు అడుగులు తడబడుతూనే లోనికివెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఏమీ తోచక గది అంతా పరిశీలిస్తున్నాడు. అంతా పరిశుభ్రంగా వుంది. గోడమీద అందమైన సీనరీలతో పటాలున్నాయి. ఓ వైపు దువ్వుకొమ్ములు అందంగా అమర్చబడివున్నాయి. రుక్మిణి అతని మౌనాన్ని గ్రహించలేక ''ఎంతసేపయింది వచ్చి'' అంది. "ఇప్పుడే" అన్నాడతడు. ఇంతలో తాశిల్దారుగారు వచ్చేరు. "నాన్నా, ఇతను మా క్లాసుమేటు సుబ్బారావు'' అంది రుక్మిణి. సుబ్బారావు ఆయనకు నమస్కారం చేశాడు. ఆయన చిరునవ్వుతో అందుకొని "అలాగా" అని ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఆయన వుండడంవల్ల సుబ్బారావుకీ రుక్మిణికీ ఏం మాట్లాడుకోవాలో తెలియడం లేదు. ఆఖరికి ఆయనే ఇలాగన్నాడు.

''బాగా చదువుతున్నావా అబ్బాయీ ! మా రుక్మిణికి ఎక్కువ మార్కులు వస్తాయా? నీకా—?''

''అతనికే నాన్నా" అంది రుక్మిణి. ఆమె తనను గురించి ఏకవచనంలో మాట్లాడడం సుబ్బారావుకి ఏమీ నచ్చలేదు. కాని, విధిలేక వూరుకున్నాడు. ఇంతలో లోపలనుండి ఎవరో "బాబూ" అని పిలిస్తే తాశిల్దారుగారు వెళ్ళిపోయారు. సుబ్బారావు ఇదే సందనుకుని ''అయితే మన ప్రోగ్రాం వున్నట్లేనా, తయారుగా వున్నావా?'' అన్నాడు.

''చెబుతాను. ఇంకా మా నాన్నగారిని అడగలే"దంది ఆమె.

''అయితే అడుగు వేగం. లోపలికి వెళ్ళు. నాయెదుట అడిగితే బాగుండదు'' అన్నాడు సుబ్బారావు. రుక్మిణి లేడిపిల్లలా గంతేసి రెండు నిముషాలలో తిరిగి వచ్చింది.

''ఏం వప్పుకున్నారా?" అన్నాడతడు.

''లేదు. వాళ్ళెవరో భోజనానికి కూడా వస్తున్నారు. ఈవేళ వెళ్ళడం బాగుండదన్నారు. అయినా అంతదూరం రావడం ఎందుకోసమని నేను కూడా అనుకుంటున్నాను.'' అంది రుక్మిణి.

''ఎందుకేమిటి? హాయిగా మాట్లాడుకోడానికి"

"ఏం ఇక్కడ మాట్లాడుకోకూడదేమిటి? నామాటవిని రాత్రిదాకా యిక్కడే వుండి, రాత్రి భోజనంకూడా చేసి వెళ్ళు'' సుబ్బారావు కాళ్ళు చల్లబడ్డాయి.

ఇంతలో లోనుండి తండ్రి పిలిస్తే రుక్మిణి వెళ్ళిపోయింది. సుబ్బారావుకేం తోచడంలేదు. ఆగదిలోవున్న కుర్చీలు, బెంచీలు తన్ను చూసి నవ్వుతున్నట్లు తోచేయి. ఆ వాతావరణం తనకేం నచ్చటంలేదు. తనకీ రుక్మిణికీ మధ్య చాలాదూరం వున్నట్లు కనబడుతోంది. ''అసలే తాశిల్దారుగారి అమ్మాయి. ఆపైన పెళ్ళికూతురు కాబోతోంది. ఇక నాతో మాట్లాడుతుందా? నా చిన్న యింటికి వస్తుందా. ఛా ! నాకుమాత్రం ఆత్మగౌరవం లేదేమిటి? అనుకుని లేచి చర చరా నడచిపోయాడు వీధి మొగలోకి. ఒక్క నిముషమైనా ఆలస్యం కాకుండా బస్సు వచ్చి నిలబడింది. అందులోంచి తాశిల్దారు గారితో ఇందాకా పెళ్ళి బేరాలాడిన యిద్దరూ దిగేరు. వాళ్ళని తానెరుగకపోయినా ఎందుకో వారిని చూస్తేనే కోపం ముంచుకొచ్చింది సుబ్బారావుకి.

పావుగంట కాకుండానే యింట్లో వచ్చి పడ్డాడు. మూడు గంటలకి వస్తానని ఒకటిన్నరకే రావడం తల్లిని కొంత తొందరపెట్టింది. అయినా ఆమె అన్నీ చేసి సిద్ధంగా వుంది. కొడుకు వంటరిగా రావడం చూసి,

"ఆ అమ్మాయి యేదిరా" అంది.

"అమ్మాయీ లేదు బొమ్మాయీ లేదు, వూరుకో" అన్నాడు కొడుకు.

"అదేమిట్రా, అలాగంటావు. ఇంత డబ్బుపోసి యివన్నీ చేస్తే"

"చేస్తే తిను" అన్నాడు కొడుకు.

"నన్ను తినమంటావేమిటిరా! తాశిల్దారుగారి అమ్మాయి వస్తుందని చెప్పి" అంది తల్లి.

"ఏం, వాళ్ళేకాని మనం తినకూడదేమిటి ఇలాంటివి?" అన్నాడు కోపంతో, గట్టిగా సుబ్బారావు. ఏదో సంగతులు సరిపడలేదని తెలుసుకుంది తల్లి. మరో పది నిముషాలకి, ఒక పళ్లెంలో యిన్ని వడలూ, ఒక గ్లాసుడు పాయసమూ తెచ్చి ప్రక్కన పెట్టింది భయపడుతూనే. సుబ్బారావు అవన్నీ ఒక ప్రక్కకి నెట్టి, పళ్లెంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ ఇలాగ అనుకున్నాడు. "రుక్మిణి ఎంత మోసకత్తెవోయ్! తనకు పెళ్ళి అవుతోందని ఎన్నడేనా చెప్పిందా? పైగా పెళ్ళివారు వచ్చిన రోజునే నన్నూ రమ్మంది. బహుశా తన గొప్పతనం నాకు తెలియాలనే కాబోలు. కానీ. ఎవరి గొప్ప వాళ్ళది. నేను మాత్రం అంత ఆత్మగౌరవంలేని చవటనుగాను"—ఆ కోపంతోనే అమ్మ తెచ్చినవన్నీ నిముషంలో ఖాళీజేసాడు.

ఇంతలో ఎవరో వస్తున్న శబ్దమైతే, గుమ్మంవైపు చూసేడు సుబ్బారావు. వెన్నెల తీగలా రుక్మిణి లోపల ప్రవేశించింది. "ఏం, చెప్పకుండా వచ్చేసేవు? భోజనానికి వచ్చి, అంత సేపూ వుండి, అదేనా, నువ్వు చెయ్యవలసిన పని?" అంది రుక్మిణి.

"ఏం చేసేను. నువ్వసలే తాశిల్దారుగారి అమ్మాయివి. ఆపైన కాబోయే పెళ్ళికూతురు ఇంక నాతో మాట్లాడుతావా అని వచ్చేసేను" అన్నాడు సుబ్బారావు.

రుక్మిణి పెదవులమీద చిరునవ్వు తాండవించింది.

"నాకు పెళ్ళి అవుతోందని యెవరు చెప్పేరు నీకు" అంది.

"ఒకరు చెప్పేదేమిటి? నాకు చెవులు లేవా? కట్నకానుకలగురించి కూడా అడుగు చెబుతాను" అన్నాడు సుబ్బారావు. రుక్మిణి యింకా గట్టిగా నవ్వుతూ, "చాల్లే. పొరబడ్డావు. వాళ్లు మాట్లాడుకున్నది మా నాన్నగారి పెళ్ళిని గురించి, అయినా అప్పుడే నాకు పెళ్ళేమిటి?" అంది. సుబ్బారావు శరీరం తేలిక అయిపోయింది. తనలో కట్టుకున్న అనుమానపు గూడు తటాలున బ్రద్దలయిపోయింది. రుక్మిణి ఒక దేవతామూర్తిలా కనుపించింది? లేకుంటే తనను వెతుక్కుంటూ ఎండవేళ....అబ్బా.... వస్తుందా పాపం! ఎంతశ్రమ పడింది తనకోసం?? కాని "నాన్నకు" పెళ్ళేమిటి??....వెంటనే తనకి తల్లిలేదని, తమ్ముళ్ళని తనే చూసుకుంటూందనీ రుక్మిణి చెప్పిన మాటలు సుబ్బారావుకి జ్ఞాపకం వచ్చేయి. అంటే తాసిల్దారుగారు రెండోపెళ్ళిచేసుకోటంకూడా రుక్మిణి భుజస్కంధాల మీంచి భారం తగ్గించడానికేనని తనలో తను అనుకున్నాడు సుబ్బారావు. "అయితే రుక్మిణీ, నన్ను క్షమించు. ఇవి తిను" అని పళ్లెం ముందుకు త్రోసేడు.

"ముందు నువ్వు మాయింటిలో భోజనం చెయ్యందే నేనిక్కడ తినను" అంది ఆమె.

ఇప్పటికి తల్లి లోనుండి ఇంకో పళ్లెం పట్టుకొచ్చింది.

"ఈవిడేనే అమ్మా, తాశిల్దారుగారి అమ్మాయి" అన్నాడు కొడుకు.

రుక్మిణి ఆమెకు నమస్కారం చేసింది. ఆ వృద్ధురాలి ముఖం ఒక్కసారి వికసించింది. తాశిల్దారుగారి అమ్మాయి అంత సామాన్యురాలిలా వుంటుందని, పాపం, ఆవిడ కెన్నడూ తెలియదు—ఎన్నడూ వూహించుకోలేదు కూడా.

సుబ్బారావూ రుక్మిణి టిఫిను ఆప్యాయంగా తిని, ఈ మాటా ఆమాటా ఆడుకున్నారు. నాలుగున్నరకి ఆమె

వెళ్ళిపోతానంటే సుబ్బారావు బస్సుష్టాండు దాకా వెళ్ళి, ఎక్కించి తిరిగి వచ్చేడు. పడక కుర్చీలో వ్రాలి గడచిన దిన చర్య పునశ్చరణ చేసుకున్నాడు. అతని కళ్ళముందు జరిగిన ఆనాటి నాటకానికి మూడే మూడు పాత్రలు. ముసలితల్లి సహనంతో తన పాత్ర చక్కగా నిర్వహించు కుంది. కన్న కొడుకు అనవసరంగా కోపం చూపి నప్పుడుకూడా ఆమె ఉద్రేకపడలేదు.

ఇక రుక్మిణి నిగర్విగా, సామాన్యురాలిగా, ఉత్తమ స్నేహధర్మాన్ని పాటించి తన కోపకారణం ఏమిటో తెలుసుకుందుకు అంతదూరం తండ్రిని వప్పించి వచ్చింది. తన చేతకు బదులు చెప్పక పెట్టినవి తిని, చక్కగా వెళ్ళి పోయింది. ఇక తానో; అంతదూరమూ వెళ్ళి అనుమా నపుసెగలతో రగిలి, ఆకలితోనే తిరిగివచ్చి తన మనస్సుకీ, శరీరానికీకూడా అపచారం చేసుకున్నాడు. 'దీనికంతకీ కారణం యేమిటి' అని ఆలోచించి ఆఖరికి ఇలాగను కున్నాడు.

"నాతల ఒక్కొక్కప్పుడు భూమిమీదా, ఒక్కొక్క ప్పుడు ఆకాశం మీదా ఎందుకుంటుంది? భూమీ ఆకా శమూ ఎన్నడూ ఏకం కావుగదా? దూరాన ఎక్కడో కలుసుకున్నట్లు కనిపిస్తే అదే తప్పు పదేపదే ఎందుకు చేస్తుంటానో? ఇక ముందైనా శ్రద్ధవహించి చూస్తాను" —అంతటితో అతని మనస్సు తేలికపడింది.



మౌనం.... ఇద్దరి స్నేహితుల మధ్య నిజమైన సంభాషణను జరిపేది. చెప్పడం రాదుకాని, చెప్పడానికెప్పుడూ అవసరం కలగక పోవడం, ప్రాముఖ్యమైంది.







# హాస్యానందం

## కలియుగ యక్ష ప్రశ్నలు

* "మల్లికార్జున" *

ఒక గ్రామమునందు, శివాలయంలో పూజారి : శివల. చిక్కయ్య. ఆ గ్రామంలోనే విష్ణు దేవాలయంలో పూజారి అయిన నంచి నారాయణప్పను కలిసికొని యిల్లా అన్నాడు :—

''చిరకాలంనుండి నాకు కొన్ని "శంకలు" కలవు. నా శంకలను మీరు తీర్చవలయును గాని నేను స్వయంగా తీర్చుకోలేకున్నాను.'' అనగానే నంచి నారాయణప్ప అవి యేవో చెప్పుమని అడుగగా వారిద్దఱికి ఈ క్రింది సంభాషణ జరిగింది:

శివల చిక్కయ్య : మనుష్యులలో పశువులు, పశువులలో మనుష్యులు ఉన్నారని విన్నాను, అది ఎంతవఱకు నిజం ?

నంచి నారాయణప్ప : "నిజమే. తమకు న్యాయంగా రావలసిన సొమ్ము పుచ్చుకొని సంతృప్తి పొందక, అడ్డమైన చోట్ల ప్రవేశించి, మోసంచేసి 'దొంగగడ్డి', తినునట్టి మనుష్యులు పశువులతో సమానము. వారు మనుష్యులలో పశువులు. తన దారిని. తాను పోయి, పోటు తన్నులేక యెవరి చేనులోనూ పడక తిన్నగా యింటికి వచ్చునట్టి పశువు మనుష్యునితో సమానము. అట్టివి పశువులలో మనుష్యులు.

చిక్కయ్య : మగవాండ్రలో ఆడువాండ్రు, ఆడువాండ్రలో మగవాండ్రు ఉన్నారని విన్నాను ఇదియెల్లా ?

నంచి : ఉన్నారు. ఆడువాండ్రు చెప్పిన కొండెములు విని, అవి నిజమనేనమ్మి, చీటికి మాటికి ఇతరులతో కయ్యాలాడుటకు వచ్చునట్టి మగవాండ్రు ఆడువాండ్రు. తక్కిన ఆడువాండ్రువలె వ్యర్థ ప్రసంగాలు చేయక, కలహాలాడక కొండెములు చెప్పక చదువుకొని సత్కాలక్షేపం చేయునట్టి ఆడువాండ్రు మగవాండ్రే అనుకోవాలి.

చిక్కయ్య : మగవానికి మగడెవ్వడు ?

నంచి : చెప్పినట్లు వినని భార్య.

చిక్కయ్య : ఆడుదానికి పెండ్లా మెవ్వడు ?

నంచి : అప్రయోజకుడైన మగడు.

చిక్కయ్య : మనుష్యులలో కుక్కలు, కుక్కలలో మనుష్యులు గలరట, నిజమేనా ?

నంచి : సత్యమున్నది.... ఒకనికి ఏదేని లాభం కలుగుతున్నప్పుడు పది మంది పోయి, ఆ పనినే మొదలుపెట్టి పోటీలకు దిగి ఒకరుతో నొకరు వివాదం పడి, అందరు చెడిపోవునట్లు ప్రవర్తించిన మనుష్యులు కుక్కలు. ఒక పులివిస్తరాకు వీధిలో ఎవరయిన వేయగానే పది కుక్కలు పడి ఒకదాని నోటికి దొరకనీయక మీదపడి కఱుచుకొని పోవును. ఎవరయిన కొంచెం ఉపకారం చేసినప్పుడు, ఆ యుపకారం మఱువక చచ్చిపోవువరకు విశ్వాసం కలిగియున్న మనుష్యులు, మనుష్యులలో విశ్వాసముగల కుక్కలు.



# కుర్రవాని నిజాయితీ

* శ్రీ బి. వి. నరసింహారావు, బి. ఏ., బి. ఇ. డి., *

ఇది చాలాకాలం క్రింద జరిగిన కథ. అందరూ ఇప్పటికీ చెప్పుకొని ఆనందిస్తూ వుంటారు. చిన్న పిల్లలకీ కథ అంటే చాల యిష్టం.

అనగనగా ఒక బంగారు పిచ్చుక ఉండేది. అది పట్టు నారతో ఒక చక్కని గూడు అల్లుకొంది. అందులో మెత్తని యీకలు పరుచుకొని మధ్యన రెండు ముత్యాల గ్రుడ్లు పెట్టుకొంది. ఒకరోజున పిచ్చుక మేతకై ఎక్కడికో వెళ్ళగా, ఇంతలో ప్రక్కనున్న పల్లెటూరి కుర్రవాడు ఒకడు మెల్లగా వచ్చి, ఆ గూటిని గ్రుడ్లతోసహా దొంగిలించుకుపోయాడు. సాయంకాలం పిచ్చుక తిరిగి వచ్చి చూచుకుంది. గూడులేదు. గ్రుడ్లులేవు. గోడు గోడు మని ఏడ్చింది. పాపం, కష్టపడి అల్లుకొన్న గూడూ, కన్న గ్రుడ్లూ పోతే ఏడవదూ మరి?

కనబడిన అందరినీ అడగడం మొదలు పెట్టింది, పిచ్చుక: "నా గూడు దొంగిలించారా? నా గూడు దొంగిలించారా?" అని. మొదట అలా యిలా తిరిగే కుక్కపిల్ల నడిగింది "నా గూడు దొంగిలించావా" అని. ''కుయ్యో మొర్రో నేనెరగనంది'' కుక్క పిల్ల. ఆడుకొనే ఆవుదూడ నడిగింది ''నా గూడు దొంగిలించావా?" అని. "అయ్యో! అంబా నేనలాంటి పని చేయనెప్పుడూ" అంది ఆవుదూడ. తరువాత పిచ్చుక, తుమ్మెద నడిగింది, తూరీగ నడిగింది, చెరువు నడిగింది, చెట్టు నడిగింది, పువ్వు నడిగింది, పిల్లకాల్వ నడిగింది, "నా గూడు దొంగిలించారా'' అని. "రామ రామ అలాంటి నీచపు పని మేమెన్నడూ చేయమన్నా"రు వాళ్ళు. ఇంక చేసేదేమీ లేక పిచ్చుక కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. విన్న కుక్కపిల్ల, ఆవుదూడ, తుమ్మెద, తూరీగ, చెరువు, చెట్టు, పువ్వు, పిల్లకాల్వ జాలి పడి, "పిచ్చుకమ్మా! ఏడవకు, నీ గూడు దొంగిలించిన వాణ్ణి పసికట్టి పట్టి తెస్తామ''న్నారు. ''దొంగ నెలా పసి కట్టగల''రంది పిచ్చుక.

''దొంగైతే నాముందుకురాడు'' అంది కుక్కపిల్ల.
నా వెనుకకు రాడు" అంది ఆవుదూడ.
నా రొదవిని చెదరగొట్టడు'' అంది తూరీగ.
నా గట్టునే నడవడు'' అంది చెరువు.
నా నీడనే నిలవడు" అంది చెట్టు.
నను త్రుంచి వాసనే చూడడు''అంది పువ్వు
నన్ను దాటిపోడు'' అంది పిల్లకాల్వ.

"ఎందుచేత" అంది పిచ్చుక. ''దొంగనన్న బెంగచేత దొరికితే శిక్షిస్తామన్న భయంచేత''నన్నారు వాళ్ళంతా. పిచ్చుక చాల కృతజ్ఞతతో అప్పుడందికదా, ''మీరంతా నాయందు దయయుంచి సాయం చేయబూను కున్నందుకు మీకిదే నా నమస్కారాలు''....'దొంగను పట్టాలి, పట్టి తీరాలి' అని వాళ్ళంతా దిక్కులు పిక్కటిల్లేలా మూడు సార్లు కేకలు వేశారు.

గూడు దొంగిలించిన కుర్రవాడు వాళ్ళ యింట్లో ఒక మూల దాగి వున్నాడు. ఈ కేకలు విన్నాడు. వినగానే కంగారు పడ్డాడు. తన గుట్టు దాగదని భయపడ్డాడు. తాను చేసినపని చాల చెడ్డదనికూడ గ్రహించాడు. ఇక అప్పుడు ఏమి చెయ్యాలా? అని ఒక నిముషం ఆలోచించాడు. చేసిన తప్పు దిద్దుకొని, నిజం అందరి ఎదుటా ఒప్పుకోవాలనుకున్నాడు. చప్పున పిచ్చుక గూడు చేత్తో పుచ్చుకొని దొడ్డిదారిని పిల్లిలాగా చడీచప్పుడూ లేకుండా వెళ్ళి, దాన్ని పదిలంగా తీసిన చోటునే చేర్చి, తిరిగి వస్తున్నాడు. దారిలో పిచ్చుక ఎదురయింది. పిచ్చుకను చూడగానే కుర్రవానికి ముందు కొంచం భయమేసింది. కాని ధైర్యం తెచ్చుకొని, గొంతుకు సర్దుకొని, ''పిచ్చుకమ్మా! పిచ్చుకమ్మా!! కోప్పడకు. నిజం చెపుతా. నీ గూడూ, గ్రుడ్లూ తెలియక నేనే దొంగిలించా. చేసింది తప్పు అని తెలుసుకొని వాటిని జాగ్రత్తగా తీసిన చోటునే చేర్చి వస్తున్నా నన్ను క్షమించు నామీద ఎవ్వరికీ కోపం లేకుండా చెయ్యి' అన్నాడు.

# కుర్రవాని నిజాయితీ

పిచ్చుక "అయ్యో నాబుజ్జి తండ్రీ! నీ తల్లి బంగారు కడుపు చల్లగుండా. నిజం చెప్పిన నీమీద ఎవరికైనా కోపం గలుగుతుందా? ఎవరికీ కలగదు. పైగా ప్రేమ కలుగుతుంది. గౌరవం కలుగుతుంది" అని చెప్పి. తుర్రున పోయి తన గూటిని, గ్రుడ్లను సురక్షితంగా ఉండడం చూచింది. పట్టలేని ఆనందం పొందింది. పరుగున పోయి "కుక్కపిల్లా! ఆవుదూడా! తుమ్మెదా! తూరీగా! చెరువూ! చెట్టూ! పువ్వూ! పిల్లకాల్వా వినండి, యీమాట నాగూడూ, గ్రుడ్లూ దొరికినయి. మీరు శ్రమపడి వెదక నక్కరలేదమ్మా. తీసిన ఒక బుజ్జినాన్న వాటిని తిరిగి తీసుకవచ్చి యిచ్చాడు. అతడు దొంగ కాదు. దొడ్డ నిజాయితీ కలవాడు. అతని మీద మీరెవరూ కోపం ఉంచుకోకండి. అతణ్ణి అందరూ ప్రేమించండి. గౌరవించండి. కొని యాడండి." అంది పరవశంతో. విన్న అందరూ "అలాంటి బుద్ధిమంతుణ్ణి, నిజాయితీగల కుర్రవాణ్ణి ఒకసారి ఆహ్వానించి మాకందరికీ చూపించు పిచ్చుకమ్మా. చూసి సంతోషిస్తాం సంతోషించి కీర్తిస్తాము," అన్నారు.

పిచ్చుకమ్మ బయలుదేరి- "రావయ్య నాబుజ్జి
రావయ్య తండ్రీ!—నిజము చెప్పిన నీకు
నిండు దీవెనలూ.—తప్పుచేసినవారు
ఒప్పుకుంటారా?—నిజము ఘనతెరిగినా
నీకె తగుగాక. —మావార లందరూ
మంచి గౌరవమూ
నీకీయదలచారు
నిక్కముగరమ్మా."

అని యీ పిలుపుపాట పాడుకుంటూ కుర్రవానిదగ్గరకువెళ్ళి అతణ్ణి తన మిత్రులందరికీ చూపడానికి ఆహ్వానించి తోడి తెచ్చిరి. అందరూ అతని చుట్టూ చేరేరు, కుక్కపిల్ల, ఆవు దూడ చెంగు చెంగున వాని చుట్టూ ఆనందంతో గంతులు వేశారు. తుమ్మెద జుమ్మని గానం చేసింది. తూరీగ పైపైకెగురుతూ ఒయ్యారంగా నాట్యం చేసింది. చెరువు నిండు ముత్తైదువులా మురిసి చూచింది. చెట్టు నిలబడి నీడనిచ్చి ఆదరంగా చూచింది. పువ్వు కలకల నవ్వి కమ్మతావి విరజిమ్మింది. పిల్లకాల్వ ఉల్లాసంగా ప్రక్కనే ప్రవహించింది. పిచ్చుకమ్మ ఆపలేని ఆవేగంతో ఆనందాశ్రులు రాల్చింది. అందరూ కలిసి అపుడు ఆ కుర్రవాణ్ణి—

"అందుకో ఓ బుజ్జి- అందాలబాలా
మాహృదయ సుమముల్ల, మంచి ఒకమాలా.
నిజము చెప్పిన నీకు, నిండు దీవెనలూ
కలకాల మీగాథ ఇలను వర్ధిల్లూ"అని కీర్తించారు.

అభినందన నందుకొన్న కుర్రవాడు అందరికీ వందనం చేసి, సెలవు తీసుకున్నాడు,

కొంతకాలానికి ఆ కుర్రవాడు చాల గొప్పవాడైనాడు. పెద్ద దేశనాయకుడై మంచి పేరు సంపాదించాడుకూడ.

★

# విజ్ఞాన చదురం

[బాలల భాషాభివృద్ధికీ, వినోదానికీ, ఉపయోగిస్తుంది, ఈ చదురం. చదురంలో —ప్రతిమూడో అక్షరం "త", నాల్గో అక్షరం "ము" వచ్చేలాగ— వరుసగా ఆరు మాటల్ని వ్రాయండి. ఏ ఏ మాటలు వ్రాయాలో- వాటి అర్థం, ప్రక్కన ఇవ్వబడింది. ఇవే కాకుండా ఇంకా కొన్ని కొన్ని కొత్తమాటలుకూడా ఆలోచించి చెప్పండి. ఈ చదురానికి జవాబు మరెక్కడో వుంది.]

| | | | | |
|---|---|---|---|---|
| 1 | | | త | |
| 2 | | | త | |
| 3 | | | త | |
| 4 | | | త | |
| 5 | | | త | |
| 6 | | | త | |

1. గాలి
2. పావురము.
3. బ్రతికి వుండడము.
4. వ్రాతకు పనికివచ్చు వస్తువు.
5. ఎవరికీ తెలియకుండా వుండడము.
6. ఆశ్చర్యకరమైనది.

# చిన్మయుడు

* చె. శ్రీ. వెంకటరాయమ్మ *

పూర్వ జన్మములోని
పుణ్యములు పండీ
మాయింట జనియించె
మగపాప డొకడు.
మాపెద్ద లెవరోను
మముజూడ గోరి
దివినుండి భువిలోకి
దిగి వచ్చినటులు.
మా కులస్వామినే
మన్ననలుపొంద
వేడ్కతో మావీట
వెలసిన రీతి
పుట్టెను మాయింట
పురుషోత్తముండె.
అతని తీరే వేఱు
ఆ భాష వేఱు
అతని "ఉఁ ఊఁలు" మా
కాజ్ఞలనిపించు.
వెలలేని చిరునవ్వు
వెన్నెలలు కురిసి
మాచేత కష్టాలు
మఱపించు నతడు.
పట్టెనా పంతంబు
పాపడైనాను
పనులన్ని దిగవిడిచి
పరుగు లెత్తించు.
తన సమపాయంబు
తప్పిన కొంత
తాళకోడది యేమి
తత్వమోగాని.
నిత్యకృత్యములందు
నియమంబులెల్ల
నుంతైన తప్పని
సుకుమారుడితడు.
నిద్రకైనను గాని
నీళ్ళకు గాని
పాలు తాగుటకు గాని
మరిదేనికైన
కాలంబు తప్పినా
గగ్గోలు పెట్టు.
తల్లి యొడిలోజేరి
తన్నుతా మఱచి
తారంగమాడుచు
తల యూచుచుండు.
దీపమున వెలిగేటి
దివ్యజ్యోతిని చూచి
తెలియనీ భాషలో
నదియేమొ చెప్పు.
తలయంటి వీనికి
తడియొత్తి, పిదప
సాంబ్రాణి ధూపంబు
శ్రద్ధతో వేసి,
బొట్టు, కాటుకపెట్టి
బట్టలు తొడిగి
స్తోత్రపాఠంబులు
సొగసుగా జెప్పి,
చిరుగంట వాయించి
చిత్తమలరించి
తల్లి వేడినగాని
త్రాగడు పాలు.
తాత భుజమైనాను
తండ్రి భుజమైన
వాహనం బెక్కనిది
వాహ్యాళి పోడు
అన్ని పనులను మాని
అమ్మ నే వచ్చి
పాడి, యూచినగాని
పవళింపడితడు.
బాలుడైనాగాని
బహుకార్యవాది
అతని వైఖరిచూడ
యాశ్చర్య మొదవు,
చిన్నవాడైనాను
చిన్మయుండేమొ!

★

# పెరల్ బక్

(30 వ పేజీ నుండి)

సంచికలో ప్రచురింపబడినది. తరువాత ఆమె మూడవ రచన 'నేషన్' పత్రిక (అక్టోబర్ 1924) సంచికలో "ది చైనీస్ స్టూడెంట్ మైండ్" అనే పేరుతో ప్రచురింపబడింది. నైనా కాలేజీలో అధ్యాపకురాలుగా నున్నప్పుడు తనకు క్లాస్‌లో జరిగిన సంఘటనను పెరల్‌బక్ అందులో చిత్రించింది.

1925 లో తన భర్తతో పెరల్‌బక్ అమెరికావెళ్ళి అక్కడ 'మాస్టర్ డిగ్రీ'కి చదివింది. "చైనా అండ్ ది వెస్టు" అనే చారిత్రక విషయంపై ఆమె వ్రాసిన వ్యాసానికి "లారా మెస్సెంజర్" బహుమానం పొందింది. తరువాత ఏడు సంవత్సరాలకు "అమెరికన్ రాజకీయ సాంఘిక శాస్త్రసమితి" ఫిలడల్ఫియా సమావేశంలో తన ఉపన్యాసానికి, పూర్వం తాను కృషిచేసిన చారిత్రకవిషయ సంచయం బాగా ఉపయోగపడ్డది.

"ఈస్టువిండ్ - వెస్టువిండ్" నవలను ప్రారంభంలో చిన్న కథగా వ్రాసి వుంచింది. తరువాత ఎవరో స్నేహితుడు వచ్చి సలహా యిస్తే ఆకథను బాగా పొడిగించి నవలా రూపం ఇచ్చింది పెరల్‌బక్. ఆ నవలను గురించి ముగ్గురు ప్రచురణకర్తలకు ప్రచురణను గురించి ఆమె వ్రాయగా, ఇద్దరు చైనానుగురించిన ఏ విషయాన్నీ వాళ్ళు ప్రచురణకు ఇష్టపడలేదని వ్రాశారు. మూడో ప్రచురణకర్త తాను చైనానుగురించి వ్రాసిన నవలను ప్రచురించటానికి అమితానందాన్ని వెలిబుచ్చాడు. నవల వెలువడడం తడవుగా, ప్రచురణకర్తలను ఆశ్చర్యపరచేటట్లు, అసూయకలిగేటట్లు అమ్మడైనది. ఆ గ్రంథంమీద చక్కని సమీక్షలు వెలువడినై. 'గుడ్ అర్త్' నవల ప్రచురించడానికిముందే, "ఈస్టువిండ్-వెస్టువిండ్" మూడుసార్లు ముద్రింపబడినది. దానితో ఆమెకు మంచి ప్రోత్సాహం లభించి, తీవ్రమైనకృషి చేయ నారంభించింది. 1926 లో చైనాకు తిరిగివచ్చి పెరల్‌బక్ "చైనోస్‌నావెక్" ను వ్రాయటంలో నిమగ్నమైనది. 1927 లో కమ్యూనిస్టు సోల్జర్లు నాన్‌కింగ్ పట్టణం ప్రవేశించి విదేశీయుల్ని హతమార్చడం, దోచడం సాగించారు. ఒక్కపది నిమిషాలలో పెరల్‌బక్ తన భర్తతోనూ పిల్లలతోనూ తప్పించుకు పారిపోయినది. దుండగులు తమ ఇంటితలుపు పగలగొట్టినట్లుకూడ వాళ్ళు విన్నారు. ఒక రోజు రోజల్లా భయభ్రాంతులై తమ పొరుగువాళ్ళైన చైనావాళ్ళ గుడిశెలో పెరల్‌బక్ కుటుంబం తలదాచుకొన్నారు. ఆ విషయం ప్రస్తావిస్తూ పెరల్‌బక్ ఇలా చెప్పింది:— "మా రంగునుబట్టే మాకు చచ్చే పరిస్థితి వచ్చింది. ఆ సమయంలో మేం చేసేదీ చేయగలిగినదీ ఏమీ లేదు. నాజాతిని నేను ఎక్కడ దాచుకోను. మేం బ్రతికి బయటపడటానికి కారణం: ఆ చైనా వాళ్ళలో నన్ను బాగా ఎరిగివున్నవాళ్లు ఉండడంచేతనే, వాళ్ళు మాకోసం జీవితాంతంకూడ తెగించి పనిచేశారు." ఆ దుండగులకు భయపడి ఇళ్ళు వాకిళ్ళు వదలి, కట్టుబట్టలతో బయట పడినప్పుడు, తెల్లవాళ్ళందరినీ అమెరికన్‌లు రక్షించి తీసికొనివెళ్ళారు. పెరల్‌బక్ మొదటి నవల వ్రాతప్రతి అంతటితోనే ముగిసింది. ఆమె ఒక ఏడాది జపాన్‌లోనూ షాంగ్‌హై లోనూ గడిపి తిరిగి చైనా వచ్చేసరికి కాలిపోయిన ఇల్లుమాత్రమే ఉన్నది. విప్లవ పరిస్థితులు, ఆమె ఆ సమయంలో అనుభవించిన కష్టాలు, దైన్య స్థితిగతులను 'ది యంగ్ రివల్యూషనిస్టు' అనే చిన్న పుస్తకంలో వ్రాసింది.

'గుడ్ అర్త్' నవల 1930 నాటికి పూర్తయింది. 1931లో ప్రచురింపబడి రెండు సంవత్సరాలైనా గడవకముందే అమెరికన్ "బెస్టు సెల్లర్సు" లిస్టులో చేర్చబడినది. గడిచిన 35 సంవత్సరాల మధ్యన 'క్వ్యావాడిస్' పుస్తకం తరువాత ప్రఖ్యాతివహించిన పుస్తకం 'గుడ్ అర్త్' ఒక్కటే ఒక అమెరికన్ రచయితచే ఆసంవత్సరం ఉత్తమనవలగా నిర్ణయింపబడి పులిట్జర్ బహుమానం పొందింది.

తరువాత ఆమె ఎన్నో చిన్నకథలు వ్రాసింది. 'సాటర్ డే యీవెనింగ్ పోస్టు' పత్రికలో తనకు గల వ్యక్తిగత పరిచయం ఆధారంతో చైనా యుద్ధసమయంలో ప్రభువులను వర్ణించింది. 'యేల్ రివ్యూ' పత్రికలో 'విదేశాల్లో చైనీయులు' అనే వ్యాసం వివిధ పరిశోధనలు సాగించి వ్రాసింది. "కాస్మాపాలిటన్" పత్రికలో చైనా, జపాన్‌ల విభేదాలనుగూర్చి "China the unconquerable" అనే వ్యాసం వ్రాసింది.

ఆమె 1932 లో అమెరికాకు తిరిగి వచ్చేసరికి పత్రికా సంపాదకులు తహతహ చెందారు. ఆమె అమెరికాలో పెక్కు సభలకు వక్తగా ఆహ్వానింపబడినది. 1932 డిశెంబరులో 'హార్లెం' లోని నీగ్రో ప్రజలమధ్య జాతిసంబం

ధాలు, జాత్యహంకారం అనే విషయంపై చైతన్యవంత మైన మహోపన్యాసం చేసింది. తరువాత 'న్యూయార్కు-ప్రెస్‌బిటీరియన్ విమెన్స్ సభ'లో ప్రసంగించింది. ఆమె ఆసభలో వ్యక్తపరచిన అభిప్రాయాలకారణంగా తనకు మిషనరీలోగల వృత్తికి రాజీనామా నీయవలసి వచ్చింది. తరువాత 'మదర్' నవలను, చైనా ప్రముఖనవల అను వాదాల్ని రచించింది. 'All Men are Brothers' అనేది చైనా నవలకు ఆమె ఇంగ్లీషు అనువాదం.

పెరల్‌బక్ తరువాత తన దృష్టినంతనీ పూర్తిగా రచనా వ్యాసంగంమీదనే కేంద్రీకరించి మరో పన్నెండు నవలలు, మూడు కథాసంపుటాల్ని రచించింది. చిన్నపిల్లల కోసం, వాళ్ళకు సులభగ్రాహ్య మయ్యేటట్లు మరో ఐదు పుస్తకాలు పెరల్ వ్రాసి ప్రకటించింది.

1938 లో పెరల్‌బక్ సాహిత్యంలో నోబెల్ బహుమానం పొందింది, అంతటి మహోదాత్త గౌరవం అమెరికన్ మహిళకు జరగడం అదే ప్రథమం, పెన్సిల్‌వేనియా లోని చిన్ని పల్లెలో తన భర్త నలుగురు పిల్లలతోఉంటూ పెరల్‌బక్ తన రచనా వ్యాసంగంలో కాలంగడుపుతున్నది.

"నవలలను చదవటం, వ్రాయటం, జీవితావసరాల్లో ముఖ్యమైన కొన్నింటిగా నేను అనుకోను. చైనాదేశంలో మిలియన్ల ప్రజలు, నవలలు చదవకుండాను, వ్రాయకుండాను, ఆనందంగా తెలివిగా బ్రతుకుతున్నారు. వాళ్ళను ఒక్కొక్కసారిచూస్తే నాకు గౌరవం అభిమానం, ఒక్కొక్కసారి అసూయ చెప్పలేనంత కలుగుతూంటుంది-.... ఏమైనా నీవు నీవుగా, సంబంధంలేకుండా, స్వేచ్ఛగా ఉండదలిస్తే నవలా రచయితవు మాత్రం కావద్దు'' అని అంటుంది పెరల్‌బక్. ఆమె రచనలన్నింటిలోనూ చైనాదేశపు నిత్యజీవిత స్థితిగతులు ప్రతిబింబిస్తుంటాయి. పెరల్‌బక్ జనానీకానికి అత్యంత సన్నిహితురాలై కథలు వ్రాసినది కాబట్టే అవి విశ్వజనాదరణను పొందుతున్నాయి- ఆమె ఇతోధిక గ్రంథాలు రచించి ఆంగ్లభాషాయోషకు అపూర్వాలంకారాలు సమకూర్చగలదని ఆశిస్తున్నాను.



జీవచ్ఛవాలు :

# ఈ సుబ్బారావులు

* వేంకటశ్రీ చౌప్పల్లి *

సుబ్బారావు గర్భంలో వుండగానే తండ్రి చనిపోయేడు. తండ్రి గతించిన కొద్దిరోజులలోనే సుబ్బారావు పుట్టేడు. సుబ్బారావు భూమిమీద పడిన వెంటనే తల్లి కూడా మరణించింది. సుబ్బారావుని పెంచడానికి తన తండ్రి అప్పచెల్లెలు (మేనత్త) సుభద్రమ్మ ఒక్కత్తే వుంది. ఆమెకి, పెంచినా సుబ్బారావు బ్రతుకుతాడనే ఆశమాత్రం లేదు. కాని బ్రతికి ఉండగానే విడిచి వెళ్ళడానికి ఇష్టంలేదు. ఎలాగైతేనేం సుబ్బారావుని తీసికొనివెళ్ళి పెంచింది. విధివశం చేత సుబ్బారావు బ్రతికి బాగున్నాడు. చిన్నప్పట్నుంచి మేనమామ చెప్పుచేతల్లోనే పెరిగేడు. చెప్పినట్లు విని శ్రద్ధగా చదువుకున్నాడు. ఎప్పుడూ ఎవ్వరికీ ఎదురుమాట చెప్పేవాడు కాడు. మేనమామ చెప్పినట్టు విని శ్రద్ధగా చదివి తుదకు బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. సుబ్బారావుకి మేనమామ తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. సుబ్బారావు కూడా మేనమామయందు మంచి వినయ విధేయతలు చూపి నమ్రతతో మెలగేవాడు. భార్యకు మాత్రం పుట్టింట వుండడం యిష్టంలేకపోయింది. అంచేత సుబ్బారావు తన మేనమామకు ఎదురు తిరుగవలసి వచ్చింది. మామగారు వున్న వూరుకూడా విడిచి పోవలసి వచ్చింది. ఇద్దరూ కొంత డబ్బు పట్టుకొని బెంగుళూరు వెళ్ళిపోయారు. పది రూపాయలు బాడుగ యిచ్చి ఒక యిల్లు తీసికొన్నారు. కొద్ది రోజుల్లోనే తెచ్చిన డబ్బంతా వెచ్చపెట్టేశారు. తెచ్చినదంతా ఖర్చు పెట్టేసిన తరువాత వుద్యోగంకోసం ప్రయత్నించడం మొదలుపెట్టేడు, సుబ్బారావు.

ఎంత చదువు చదివితేనేం లాభం. ముప్పై రూపాయలు యిచ్చే వుద్యోగమైనా దొరకలేదు. దొరకకపోవడం సరికదా దానికితోడు వెనకాల భార్యకూడాను. ఇద్దరూ బ్రతకాలంటే, నెల ముప్పైరోజులు గడవాలంటే, అధమ పక్షం నూరు రూపాయలేనా వుండాలి. "నూరు రూపాయలు కాదుకదా నూరు అణాలు దొరికే వుద్యోగమేనా దొరికితే చాలు" అన్నట్టూ వూరల్లా తిరుగుతున్నాడు సుబ్బారావు. రాత్రి పగలూ తిరిగి తిరిగి చివరికి ఒక రేషనింగ్ ఆఫీసరు యింటికి చేరుకున్నాడు. రేషనింగ్ ఆఫీసరు యింటి కొచ్చేసరికి రాత్రి ఎనిమిదిగంటలైంది. సుబ్బారావుకి అతని దర్శనం లభించేసరికి రాత్రి పదిగంటలైంది. సుబ్బారావు తన దుస్థితిని ఆఫీసరుకి విన్నవించుకున్నాడు. అతనిది పాషాణ హృదయం కాబోలు! ఎప్పటికీ కరుగలేదు. సుబ్బారావు ఆకలిబాధ భరించలేనని ఆఫీసరు పాదాలమీద వాలాడు. ఆఫీసరు ప్రక్కనున్న భార్యకు జాలికల్గి పళ్లెడన్నం పట్టుకొచ్చి పెట్టింది. ఆఫీసరు, భార్యను కోపించాడు. కాని భార్య ఇనుమంతయు వెరువలేదు.

సుబ్బారావు సేదతీర్చుకుని తనకు వుద్యోగ మిప్పించమని ఆఫీసరుని పరి పరి విధాల బ్రతిమలాడేడు. డబ్బు చూపిస్తేగాని అతని హృదయం కరగదు కాబోలని మనస్సులో అనుకున్నాడు. ఆపాటి డబ్బు తనవద్ద వుంటే తనేదో వ్యాపారం చెసుకునేవాడు. విశాల విశ్వంలో తన కెక్కడా తావులేదు కాబోలు అని చాలా విచారించాడు. జీవితాశ వదులుకున్నాడు. అప్పుడే గోడ గడియారం టంగ్ టంగ్‌మని 12 కొట్టింది. తను పన్నెండు గంటల రాత్రివరకూ భార్యను విడిచి పైన తిరుగుతూంటే భార్యకు తనపైన ఏదో అనుమానం కల్గుతుందని మనస్సులో అనుకున్నాడు. ఆఫీసరుకి నమస్కారం చేసి యింటిముఖం పట్టేడు.

భార్య ఏమైందో అన్న విచారంతో ఇంటికి గబగబా పోదామని అనుకున్నాడు సుబ్బారావు. కాని కాళ్ళు నడయాడలేదు. ఇల్లు చేరేసరికి రాత్రి రెండు గంటలైంది. భార్య భోజనం లేకుండా పడివుంది. ఆ దృశ్యం చూస్తే ఎటువంటివారికేనా భయం వేస్తుంది. అందులోకి సుబ్బారావు అసలే భయస్థుడు. భార్య ఆకలిబాధకు తాళలేక పడివుండడం చూసి సుబ్బారావు మూర్ఛపోయాడు. శక్తి లేకపోయినా భార్య లేవదేసి శీతలోపచారాలు చేసింది. సుబ్బారావు తెప్పరిల్లేసరికి తెల్లవారిపోయింది.

"నన్నే నేను పోషించుకోలేనప్పుడు ఆమె నెలా పోషించేది. పోషించలేనివాణ్ణి ఎందుకు వివాహమాడేను" అనిపించింది. 'చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే ఏం లాభం' అనుకున్నాడు మనస్సులో సుబ్బారావు.

ఎక్కడేనా వుద్యోగం సంపాదించాలని పట్టుపట్టి బయల్దేరేడు. ఎన్నో ఆఫీసుల్లో కెళ్ళి ఎంతో మంది ఆఫీసర్లని కలుసుకున్నాడు. కాళ్ళరిగి పోయేటట్లు తిరిగేడు. ఎక్కడా వుద్యోగం దొరకలేదు. వుద్యోగం సంపాదించకుండా భార్యకి ఈ మొహం ఎలా చూపించేది అని అనుకున్నాడు. ఇంటికెళ్ళడానికి మనస్సు ఇచ్చగింపలేదు. రాత్రి ఒక ఆఫీసు అరుగుమీదే పడుకున్నాడు సుబ్బారావు.

భర్త రాకపోవడం చూసి లక్ష్మి అనుమానం పడ్డాది. "భార్య క్షేమం కోరని భర్త ఏం భర్త? భార్యని పోషించలేని భర్త ఎందుకు పెళ్ళి చేసుకోవాలి? భార్యను విడిచి భర్త రాత్రికూడా వూరుమీద తిరుగుతూంటే భార్యగతి ఏమౌతుంది? భార్య భర్తలేని సమయంలో గుమ్మం దాటిందంటే, భర్త ఆమెను ఎన్నివిధాల దూషిస్తాడు? దీనిని సంఘం అరికట్టలేదా? భర్త ఎన్నితప్పులు చేసినా సంఘం అతన్ని శిక్షించదా? తిండి పెట్టలేని భర్తతో ఉండేకంటే చస్తేమేలు !" .... అనిపించింది. చావటానికి సిద్ధమైంది. ఇంట్లో ఎవ్వరూ లేరు. బావిలోకి ఉరకబోయింది. కాని సాధించాలంటే బ్రతికే వుండాలి. బ్రతికి వుంటే బలుసాకేనా తిని వుండొచ్చు'' అని నిశ్చయించుకుంది. కాని కోపం పట్టలేకపోయింది. భర్తలేని బ్రతుకు బ్రతికేకంటే చస్తే మేలు అనిపించింది. బావిలో కురికేసింది. బాధలేకుండా హాయిగా బావిలో పడుంది,

తెల్లవారింది. బారెడు పొద్దెక్కింది. సుబ్బారావుకి తెలివి వచ్చింది. భార్య సంగతి జ్ఞాపకం వచ్చింది. యింటికి పోదామని బయల్దేరేడు సుబ్బారావు. ఇంటిదగ్గరకివచ్చాడు. తలుపులు మూసి వున్నాయి. లోపల తలుపు వేయబడి వుంది, 'తలుపు' అని పిలిచాడు. సమాధానం రాలేదు,తలుపు తెరవలేదు. గట్టిగా బాదాడు. విసిగి గట్టిగా కాలితో తన్నేడు. తలుపులు విడిపోయాయి. లోపలికి ప్రవేశించాడు, కాని గుప్పిట్లో వున్నాయి ప్రాణాలు. భార్య కనపడలేదు, గట్టిగా పిలిచాడు. సమాధానం రాలేదు. ఇల్లంతా గాలించాడు. కనపడలేదు. ఆత్మహత్య అనుకున్నాడు. జేబులో కాగితం తీశాడు. కలంతో రాశాడు. బావిదగ్గరకెళ్ళి గట్టుపైని కాగితం కలం పెట్టి బావిలోకి ఉరకబోయాడు. బావిలో భార్య కన్పించింది. పెద్దకేక పెట్టేడు. ఆమెను కలుసుకుందామని బావిలో కురికాడు.

కేకలు విని ప్రక్కనున్న యింటి యజమాని వచ్చాడు. ఇంటి తలుపులు మూసి వున్నాయి! ఏదో విశేషముంటుందని పోలీసు అధికారులికి తెలిపేడు. పోలీసుదళం వచ్చింది. తలుపులు విడగొట్టారు. లోపలికి ప్రవేశించారు. ఇల్లంతా వెదికారు. ఎవ్వరూ లేరు. పెరడల్లా సోదా చేశారు. నూతి గట్టుమీద కాగితం, కాగితంపైని కలం మాత్రం కన్పించాయి. పోలీసు అధికారి ఆ కాగితం విప్పి చూశాడు, అందులో "మా చావుకి కారణం మేమే. మరెవ్వరూకాదు, నా భార్యను నేను పోషించలేకపోయాను, దానికి కారణం నేను బి. ఏ. ప్యాసైనా వుద్యోగం దొరకలేదు. ఆమె ఆకలి బాధకు తాళలేక చనిపోయినమాట వాస్తవమే. ఆమె చావుకి నేనే ముఖ్యకారణం. ఆమె రుణం ఎన్నటికీ తీర్చుకోలేను. భార్యను చంపిన నేను బ్రతికేకంటే చస్తే మేలని ఈ బావిలో పడి ఆమెను కలుసుకున్నాను.

ఇట్లు,
సుబ్బారావు."

ఈ కథంతా విని అక్కడ గుమిగూడిన ప్రజలు ముక్కుమీద వేలు వేసుకున్నారు.

బ్రతకలేకా, చావలేకా, జీవచ్ఛవాలుగా కాళ్లీడ్చుకు వస్తున్న "ఈ సుబ్బారావులు" మనమధ్య ఎంతోమంది వుంటారు. వీరందరూ జీవకళాకాంతుల్తో మెరిసే రోజులొస్తే ఎంత బావుంటుంది !



# కృతి : కర్త

—: శ్రీ యస్. భాస్కరరావు :—

వర్ణికా లలిత నృత్యమే ! వివిధ
వర్ణజాల పరిపుష్టరాగమే !
స్నిగ్ధ ముగ్ధ రేఖావిలాస రమ
ణీయమే ! ఒక విచిత్ర చిత్రమే !
—నీల నీల మరుణారుణమ్ము కెం
గేలు మలిన రుధిరావిలమ్ము, బా
ధాల వాలమయి బ్రతుకె భారమై
ఎవ్వరె ? ఇట క్షుధార్తు డెవ్వరె ?—
పశ్చిమాన క్రుంగుచు మహస్సొకటి
ప్రాచి మోవిపయి కుంకుమునిచెనె !
ప్రాణమెడల ప్రాణప్రతిష్ఠకయి
ప్రతిమలో బ్రతుకు ధారవోసెనే .



# అగ్నిపర్వతం

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

మహోద్వేల మహాప్రవాహం ఈకాలం !
కాలావకాశ సంకాశం ఈలోకం !
ఈ విభిన్నశక్తుల సంఘర్షణ
కొట్టిమిట్టాడే నీ జీవితపు
సౌధానికి అంతిమ సోపానం!
అదే నీ మరణానికి ఆవలి దరి!
మండుతోన్న గుండెల జ్వాలలతో
నిష్ఠారింతమైన నా గతజీవితంలో
వెలిగిన ఆశల కాంతులు
ఒక్కసారిగ పెల్లుబికి మళ్ళీ—
మటుమాయమై మరుగు పడినాయి

ప్రశాంతమైన ప్రభాతంలో
నిశాంధకారంలో నా నివేశంలో
నాకన్నులకు కనుపించే
కాంతిమనీయమైన ఆనందరేఖలు
నా జీవితపు సముద్రములో
చెలరేగిన బడబానల
దావానల జ్వాలల నార్పి
విషాద విషాగ్నుల చల్లార్చి
సౌమనస్యంతో సౌజన్యంగా
పెల్లుబికిన ఆశలకాంతులు మళ్ళీ—
మటుమాయమై మరుగుపడినాయి!

★

# మాతృపూజ

* శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు *

(పల్నాటి సోదరకవులు)

అమ్మ ! నీ కరుణారసమ్మున
నలరుచుండును వంశవృక్షము
కొమ్మ లాకులు పూలు పళ్లొక
కమ్మఁదన మీయ—

కదలుచుండును తల్లి ! నీ బం
గారు కడుపుననుండి ముద్దులఁ
జిదిమి జిలిబిలి వన్నెలొలికెడి
జీవ రత్నములు—

పొదలపారును జనని ! నీ మృదు
హృదయవీథులనుండి, మమ్ముల
పదిలముగ రక్షింప- తీయని
పాల సంద్రములు—

మలయుచుండు సవిత్రి ! నీ ముఖ
మండలంబుననుండి యమృతము
లొలికి చిలికెడి కూర్మినవ్వుల
చలువ వెన్నెలలు—

కూలఁ దన్నుఁ గదంబ ! నీ ము
త్యాల పలుకులనుండి వెడలిన
వేల శ్రీ శ్రీ రామ రక్షలు
బాలగండములు—

నీవు లేనిది జగము లేదని
నిగమములు వచియించుచున్నవి
పావనీ ! నీ ఋణము దీర్పఁగ
బ్రహ్మతరమౌన—

ఓర్మి కూర్మి వహించి మాయల
మర్మముల నెదిరించి నిలిచిన
ధర్మదేవత వీవ ! నీ పా
దములఁ గొలిచెదము—

ఎల్లలోకము లున్నయవి నీ
యుల్లమున భారమ్ము మోసెడి
తల్లి ! దీవనలిమ్మ ! పూజా
ద్రవ్యములఁగొమ్మా !

★

మెరిసే దంతాలు బంగారం కావు.
ప్రపంచం పోకడంతా ఇంతేననుకుని
ఆ అలల్లో లీనమైపోయింది, ఆ........

# అభాగ్యురాలు

* శ్రీ పి. వి. రత్నం *

రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో జయలక్ష్మి ఇంటర్ చదువు కుంటోంది. మేనమామల ప్రోత్సాహంవల్లనే దానవాయి పేటలోనున్న వారింట్లో వుంటోంది. అందానికి తోడు తెలివితేటలు, చలాకీతనం వున్నాయ్. సుగుణవంతురాలని లెక్చరర్స్ ఆమెను అభిమానంతో చూచేవారు. కొవ్వూరులో ఉన్న తల్లిదండ్రులుకూడా అమ్మాయి ఆనందంగా ఉంటూ, జాగ్రత్తగా చదువుకుంటున్నదని భావించినా, పెళ్ళి చేసివేయాలని తొందరబడేవారు. మేనమామ సుబ్బారావుగారు 'ఆఁ ఇప్పుడేమంత వయస్సు వచ్చిందని?' అని వాయిదాలు వేయించేవారు. జయ తనను మేనమామ 'సపోర్ట్' చేస్తున్నందుకు లోలోపల సంతోషించేది.

పద్ధెనిమిదేళ్ళు ఉన్నాయో లేవో తనకిప్పుడు పెళ్ళేమిటని ముఖం ముడుచుకొనేది. తను బి. ఏ. పూర్తిచేయాలి; జయ, బి. ఏ., అంటే తనకెంత గౌరవం? తను ఉద్యోగం చేయవలసిన అవసరం లేకపోయినా, తనెంతో విజ్ఞానార్జన చేసుకోవచ్చుగా. గొడ్డెల్లా, మడ్డిగా జీవించనవసరం లేదుగా.

అంతమాత్రంచేత ఆమె తన మనస్సును అదుపులో పెట్టలేకపోయేది. సరదాగా స్నేహితురాండ్రుతో సముద్ర ఒడ్డుకు షైరుకు వెళ్ళనపుడు ఆడుకుంటున్న అలలు చూచినా, నవ్వుకుంటున్న పిల్లవాయువులను చూచినా- ఆమె కేవేవో భావాలు కల్గేవి.

యౌవ్వనం గిలిగింతలుపెట్టే రోజులవి. పైగా మినర్వాకో, జయాటాకీస్‌కో, మరొక హాలుకో మంచి తెలుగు హిందీ సినీమాలకు వెళ్లినప్పుడు స్నేహితురాండ్ర ఉల్లాసం, దృశ్యాల బిగువైన, మరపురాని సన్నివేశాలు, ఆమెకు తెలియకుండానే హృదయం ఎందుకో ఆరాటపడేది. కాని, 38 డిగ్రీ అక్షాంశరేఖ ఆమె ఇంతవరకూ దాటలేక పోయింది, కారణం ఆమెలో పెనవేసుకొని వున్న నీతి నియమాలు మాత్రమే హద్దులో పెట్టేవి, మామయ్య విద్యావంతుడు కనుక, స్త్రీలను గుమ్మాలకు అడ్డంగా తెరలుకట్టి చీకటిలో ఉంచడం ఆయన అభిమతం కాదు. సుఖంగా, స్వేచ్ఛగా, జీవించాలంటాడాయన.

* * *

'జయ' ఆనాడు కాలేజీకి రిక్షాలో వస్తోంది. సైకిలు త్రొక్కుతూ తన క్లాస్‌మేట్ 'భానుమూర్తి' మందహాసంతో, బెల్ వాయిస్తూ, ఏమిటో కనుసైగలతో, చెప్పి వెళ్ళిపోయేడు. ముఖం ముడుచుకుంది. "ఛీ, వెధవపోకిరీ వేషాలు విద్యార్థులు ఎప్పుడూ ఇంతే" అని బాధపడింది.

సాయంత్రం కాలేజీ నుంచి తిరిగి వస్తూంటే, జాలిగా, ఓరగా, తనొంక మళ్ళీ పోజు ఇచ్చి చూశాడు. ఈమె ముఖం త్రిప్పుకుంది. స్నేహితురాండ్రు కమల, జ్యోతి, సరోజని, ఇందిర "ఇలాంటివి ఎన్నో జరుగుతుంటాయ్, మనం లక్ష్యపెట్టే ఎట్లా?" అనుకునే మాటలు ఆమెకు గుర్తుకు వచ్చాయ్, ఇంటికి వచ్చి, బట్టలు మార్చుకొని, కాఫీ త్రాగి, గోదావరి ఒడ్డుకు బయలుదేరింది. ఆమె మనస్సు చికాకుగా ఉంది. కమల ఒక్కతే రానే వచ్చింది "సమ్మర్‌లో నా మేరేజి. వస్తావ్ కదూ? జయా?" అంటూ విషయమంతా చెప్పింది. "మా నాన్నగారు అంగీకరించడం లేదు నేను పెళ్ళి ఆపుచేయమంటుంటే. బందరు, హిందూ కాలేజీ, బి. ఎ. స్టూడెంట్ అట !" అంది సిగ్గు దొంతరలు ఒలికిస్తూ. పెళ్ళి- సుఖానుభూతులు- మొదలగు విషయాలు చర్చించుకున్నారు, 'బానేను' అంటూ 'నాప' నవ్వు నవ్వుతూ క్రిందికి వెళ్ళిపోయింది. "రేపు ఆదివారంగా, సరదాగా సినీమాకు పోదాం మినర్వాకి ఫస్ట్ షోకి రెడి కదూ?" అంటూ ఉత్సాహంగా కమల అనేసరికి కాదన

లేకపోయింది జయ. "శీలం ఒక శ్వేత వస్త్రం లాంటిది. దాని మీద సిరామచ్చ మాయని మచ్చ. అల్లరి చిల్లరిగా, తప్పుడు త్రోవని పోయేకంటే, పెళ్ళి చేసుకుంటేనే మంచిదిగా" అని కమల అన్న మాటలు చెవుల్లో గింగురు మన్నాయ్.

*　　　*　　　*

ఆదివారం 'మినర్వా'కు సైకిల్ రిక్షాలో చేరుకుంది జయ. బయట ఎంతోసేపు నిలబడింది, ఆమె కళ్ళు కమలను వెదుకుతున్నాయ్. ఉహు, ఎక్కడా.... అరే. ఏమిటి కారణం? మరీ మరీ వస్తానంది.... షో ప్రారంభమయ్యే వేళ అయింది.... వెళ్ళిపోదామంటే.... సినీమా మంచి దాయె....'' అలాగే చూస్తోంది గేటువైపు. భానుమూర్తి టిప్ టాప్‌గా- తయారై- తనొంక చూస్తున్నాడు ఎదురుగా. అతని ముఖంలో అమాయకత్వం ఆమెను లొంగదీసింది. అతను హుందాగా, గౌరవప్రదంగా, సంచరిస్తాడు. ముఖం చిట్లించుకుంది. అతను దగ్గరకు వచ్చాడు. "సినీమాకు వెళ్దామా జయా''?...ఏమిటంత చనువు? ఎన్నిగుండెలుండాలి? ఎంత నిర్భయం? "కమల కోసం చూస్తున్నానండీ- వస్తానంది తప్పకుండా'' సభ్యతకు విరుద్ధంగా, సంచరించలేక ఆమె సమాధానం చెప్పక తప్పిందికాదు. "అరే, పాపం.... ఆరున్నర అయిపోతోంది- వస్తానుండండి...'' అంటూ రెండు రిజర్వ్ టిక్కెట్లు తీసుకొచ్చాడు. ఆమె సంకోచించి, సిగ్గుపడింది. కాలు కదపలేకపోయింది. 'జయా' తియ్యగా, మృదువుగా, 'తప్పు ఏముంది?' అన్నట్లు తనొంక చూచాడు. లైట్స్ ఆరిపోయాయ్. ఫిల్మ్ డివిజన్ వారి 'అగ్ని ప్రమాదాన్ని ఎట్లు తప్పించుకోవాలి?' అన్న భాగం ప్రదర్శించ బడుతోంది. మొన్నదే ఇదీకూడా. ఇద్దరూ కూర్చున్నారు.

'జయా, జీవితంలో ఇలాంటి సన్నివేశం, సంభాషించడానికి అవకాశం కోసం ఆరు మాసాలు అహోరాత్రులు ఎదురు చూశాననుకో. ఇక జీవితంలో నాకింకేమీలేదు" ...ఆమె సినీమాచూడలేకపోతోంది. తనను ఎవరో చూస్తున్నట్టు, ఎవరో భయపెడుతున్నట్టు భావించసాగించింది. "జయా....పవిత్ర హృదయంలో అమృతం చిలికించావ్'' అంటూ అతను అంటున్న మాటలకు ఆమె ఉప్పొంగిపోయింది. తలవని తలంపుగా జరిగిన సమావేశం. 'కూల్ డ్రింక్స్' తీసుకున్న పిమ్మట డబ్బులు తను ఇస్తానన్నా ఒప్పుకోలేదు భానుమూర్తి. 'ఎంత మంచివాడు!' అనుకుంది జయ, ఒక్కసారిగా ఆమెకు భానుమూర్తి మీదనున్న అసహ్యం, కరుకుతనం, మాయమైపోయాయ్. నిర్లక్ష్యంగా చూసిన 'భానుమూర్తి' ఈనాడు తన జాలి, అమాయక, చూపులతో తనతో స్నేహం కలుపుగోగల్గాడు. ఇంత మృదువుగా, ముద్దుగా, భానుమూర్తి మాట్లాడుతాడని ఆమెకు తెలియదు; ఆట అయింది, 'చీరియో' అనుకుంటూ ఎవరింటికి వాళ్ళు రిక్షాలపై వెళ్ళిపోయారు.

*　　　*　　　*

భోజనం తిన్నట్లే పీలయింది జయ. ఎన్నడూ తనను అంత చనువుగా, ముద్దుగా 'జయా' అని పిలవనేలేదు. హృదయాలు కలిస్తే అంతేమరి. 'బెడ్' పై అటూ ఇటూ దొర్లింది. మెత్తటి తలగడను తన హృదయానికి గట్టిగా అదుముకుంది. 'భాను' 'భాను' 'భాను' అతని అందం.... అతని చిరునవ్వు.... అతని జుత్తు.... రతనాలు విలువచేసే ముసి ముసి నవ్వులు.... నిద్రపట్టలేదు రెండింటివరకు. ఏవో కలలు.... ఏమిటో ఊహాలు- ఎందుకోవాంఛలు —

*　　　*　　　*

మరునాడు క్లాసులో 'కమల' విపరీతమైన తలనొప్పితో సినీమాకు రాబుద్ధి కాలేదని, క్షమించమని మరీ మరీ వేడుకుంది జయను. చాటుగా, భానుమూర్తి కోసం కళ్ళు క్లాసులోని ముఖాల్ని పరిశోధించాయ్. ఆమె హృదయం చివుక్కుమంది. 'రాలేదేంచెప్మా' అనుకుంది అంతవరకున్న ఉత్సాహం ఒక్కసారిగా కరిగిపోయింది. హిస్టరీ లెక్చరర్ చెప్పింది ఆమెకు బోధపడలేదు. ఏదో గొల్లుమని స్టూడెంట్స్ నవ్వడంతో, భావలోకంనుంచి, బయటపడింది. తను లేతగులాబీ రంగుచీర.... మధ్యాహ్నం వెయిటింగ్ రూమ్‌లో కాఫీకూడా త్రాగలేకపోయింది, ఆమె. ఎందుకో ఉషార్‌గా లేదనుకున్నారు స్నేహితురాండ్రు.

## అ భా గ్య రా లు

పండువెన్నెల, మిల మిల మెరుస్తున్న నక్షత్రాలు, పరుగులుపెడుతూ కిల కిల నవ్వుతున్న చందమామ జయను 'ఓస్ నీవింతేనా?' అని వెక్కిరిస్తున్నట్టు అనిపించింది. బెంగతో, దిగులుతో, రాత్రి గడిచిపోయింది.

పది గంటలకు కాలేజీకి అప్సరకన్యలా వచ్చింది. భానుమూర్తి 'చిరునవ్వు' ప్రసాదించాడు: అబ్బ! ఎంత అదృష్టవంతురాల్ని అనుకుంది జయ, దొంగచాటుగా, క్రీగంటి చూపులు చూసుకొనేవారు. సాయంత్రం ఇంటికి వస్తోంది నడిచి...."భానుమూర్తి మెల్లిగా నిన్న రాలేకపోయాను జయా! క్షమించవూ?" అన్నాడు. క్షమించాలా తను? ఎంత సహృదయుడో అని పొంగిపోయింది. 'ఒక్క రోజు కన్పించకపోతే బాధపడిపోయేవే.... ఆరుమాసాలు....ఊగించి ఉర్రూగించిన నీవు,,. కన్పించినప్పుడు ఎంతగా కృంగిపోయేవాడినో గ్రహించు జయా' అని చెప్పిన మాటలకు ఆమె నవ్వింది.

* * *

కొన్ని రోజులు, వారాలు, నెలలు కాలగర్భంలో కలిసిపోయాయ్. జయా, భానుమూర్తుల హృదయాలు ఆనంద కెరటాల్లో తేలిపోయాయ్. బిగికౌగిటిలో- తియ్యటి మృదు మధురమైన మాటల్లో- అనిర్వచనీయమైన ఆనందానుభూతులు పొందారు. వెలుగులో, వెన్నెల్లో వారు మైమరచి రసానుభూతి పొందారు. సంతోష సీమల్లో విహరించారు. ఇదంతా లోకం కళ్ళు కప్పి, ఇదంతా ఎంతోకాలం దాగలేదు. ఆమె భానుమూర్తిని తొందర పెట్టింది. పెండ్లికి యిక వాయిదా వేస్తే అప్రతిష్ఠ పాలవుతామని చెప్పింది. సెలవులు వచ్చి విరుచుకు పడ్డాయ్. 'వస్తా జయా!' అని రైలుకు బయలుదేరాడు భానుమూర్తి. వల వల ఏడ్చింది జయ. వీరి చర్యల్ని కొందరు కనిపెట్టలేకపోలేదు.

* * *

నెల రోజులు దొర్లాయ్. పిడుగులాంటి శుభలేఖపై ఆమె కన్నీటి బొట్లు బొట బొటా రాలాయ్. భాను పెండ్లి. ఆమె హృదయం రాజుకుంది, జోరు జోరుగా అది మండిపోసాగింది. మనస్సు ముక్కలు ముక్కలుగా, అదురుకు విడిపోతున్నట్టుంది. 'ఏం జయా.... అలా ఉంటున్నావేం? వంట్లో బాగాలేదా?' అని మామయ్య అడిగితే, 'అబ్బే ఏలాలే'దని, తలుపులు బిగించి, తలగడలో ముఖంపెట్టి వెక్కి వెక్కి ఏడ్చింది. "భాను హృదయం అమృతం అనుకున్నాను, అంత హాలహాలం అనుకోలేకపోయా. అందం వుందని, మెత్తని మనస్సు అని ఊహించాను. ఇలా అన్యాయం చేస్తాడని కలలో సహితం తలంచలేకపోయాను,— అంతా మోసం— దగా— భానూ— అన్యాయం— అక్రమం— పోనీలే— నా ఆశాసౌధాలు కూల్చు. నా శరీర సౌందర్యాన్ని మలినం చేశావ్....నేను మరెవ్వరినీ నీలా ప్రేమించలేదు. నిన్ను పొందలేని నేను జీవించడం వృథా. ఆత్మాభిమానం, శీలం, కుళ్ళిపోయాయ్. పేరు ప్రతిష్ఠలు మంటగలసినప్పుడు—" గోడ గడియారం టక్ టక్ మని శబ్దం చేస్తోంది. నెమ్మదిగా లేచింది. తలుపులు తెరిచింది. గోదావరి ఒడ్డుకు ఒడి ఒడిగా నడిచింది. దూరంగా నల్లటి కొండలు— మహావేగంగా ప్రవహిస్తున్న నది.... మరొకప్రక్క నిద్రపోతున్న లోకం— ఆమె కన్నీటి ధారలతో నిలుచుంది. గోదావరితల్లి ఇల్లా అంది గంభీరంగా: 'రా చిట్టితల్లీ- ప్రపంచం పోకడ ఇంతేనమ్మా— మెరిసే దంతాలు బంగారం కాదమ్మా— రా— భయపడతావేం?" ఈ లాలింపు మాటలకు ఆమె ఒక్క గెంతు గెంతింది. గోదావరిలో ఆమె కన్నీటిధారలు కలిసిపోయాయ్. సుడులుగా, వడులుగా, తిరుగుతున్న అలలలో జయ యౌవ్వనం, గిలిగింతలుపెట్టే అందాలచిందేటి ఆమె ముఖం, కలిసిపోయి, క్రిందికి తీసుకొని పోతోంది ప్రవాహం, దగాపడిన సుందరినికాదు—అభాగ్యురాలిని.



బాలానందంలోని విజ్ఞాన చదురానికి సమాధానం :—

| | | |
|---|---|---|
| 1. మారుతము. | 2. కపోతము. | 3. జీవితము. |
| 4. కాగితము. | 5. అజ్ఞాతము. | 6. అద్భుతము. |




# సృష్టి వికాసం

* శ్రీమతి కె. సుగుణమణి *

ఒకప్పుడు—(200 సంవత్సరాలకు పూర్వంమాట)— మన భూమి అప్పటికింకా యేర్పడలేదు; (సూర్యగోళం మాత్రం ఉండేది. సూర్యగోళం ఉద్భవించి 8 లక్షలకోట్ల సంవత్సరాలై యుంటుందని శాస్త్రజ్ఞుల లెక్క). దాన్నుంచి కొంతభాగం ఊడి వేరువేరు దూరాల్లో చేరుకొని, నవ గ్రహాలు (గోళాలు)గా యేర్పడి, సూర్యుడి చుట్టూ ప్రదక్షిణాలు చేయడం మొదలెట్టేయి. వాటిల్లో ఒక గ్రహమైన మన భూమి, ఆరంభంలో కొన్ని యుగాలవరకూ ఉష్ణాధిక్యంవల్ల, ఏ ప్రాణికీ నివాసయోగ్యంగా ఉండేదిగాదు. కొంత కాలానికి పైపొర చల్లబడి, కొంత భూభాగాలు యేర్పడ్డాయి.

ఈ భూగోళ జీవితంలో—130 కోట్ల సంవత్సరాలు (ప్రీపేలియోజోయిక్ యుగం అని) ఏ జీవరాసీ లేకుండా గడిచిపోయింది. అప్పటికి, ఎలాగ, ఆదిలో జీవాంకురం ఏర్పడిందో తెలియదు, ''ఎమిబా'' అనే ఏకకణ జీవివంటి జీవి, నీటిలో ఆవిర్భవమైంది. ఇది 'మొక్క', 'జంతువు' కూడాను.

తర్వాత 30 కోట్ల సంవత్సరాలకాలం (పేలియోజోయిక్ యుగం) గడిచిపోయింది. అప్పటికీ ఏకకణజీవి, క్రమక్రమంగా బహుకణ జీవియై పగడాలు, ముత్యంచిప్పలు, చేపలుగానూ, పాచి, నాచు, పూలులేని ఫెరన్ మొక్కలుగానూ 'జంతువులు'—'మొక్కలు' అనే కొంత కొంత భేధాలతో సృష్టిలోకి వచ్చేయి.

భూగోళం జీవితంలో మరొక 13 కోట్ల సంవత్సరాల కాలం (మీసోజోయిక్ యుగం) జరిగిపోయింది. జలచరాలు క్రమక్రమంగా నీళ్ళు విడిచి భూమిపై గూడ సంచరించడం మొదలెట్టగా మొసళ్ళు, బ్రహ్మాండమైన వికృతాకారాలుగల భూచర జంతువులూ పక్షులూ గూడ సృష్టిలోకి వచ్చేయి. ఈ రూపాలు సుమారు 10 కోట్ల సంవత్సరాలపాటు భూతలంమీద విచ్చల విడిగా సంచరించేయి. ఫెరన్సు, సైకాడ్సు అనే మొక్కలే గాక, పుష్పించే వృక్షజాతికూడా ఆవిర్భవమైంది. కీకారణ్యాలైన మహారణ్యాలు భూతలంపై పెరిగేయి. అప్పుడప్పుడు భూకంపాలు రావడం, విస్తారమైన అరణ్య ప్రాంతాలు భూమిలో కప్పడిపోవడం జరుగుచుండేది.

మరొక 6 కోట్ల సంవత్సరాలకాలం (సీనోజోయిక్ యుగం) గడిచింది. క్రమంగా మన మిప్పుడు చూస్తున్న అడవి జంతువులవంటి జంతువులు, వానరాలు, పక్షులు, పూలు పూచి—కాయలు కాచే—మొక్కలు, పంట జాతులు. పెద్ద చెట్లు, ఫలవృక్షాలు వగైరాలు సృష్టిలోకి

వచ్చేయి. ఈ యుగంలో సగం గడిచేటప్పటికి మానవ జాతికి ప్ర-ప్ర-ప్ర-పితామహులనదగ్గ జంటకాళ్ళపై నిలబడే అడవిమనిషి, వానరజాతినుంచి వికాసంపొంది, చెట్లపై నివాసం మానేసి, గుహల్లో జీవిస్తున్నట్లు రుజువులున్నాయి గాని, ప్రస్తుతానికి 10 లక్షల ఏళ్ళ క్రిందటి వరకూ గూడ మానవజాతికి తాతగారైన ఈ అడవిమనిషి పశుప్రాయుడు గానే జీవిస్తుండేవాడు. ఆ కాలం (ప్లీయిస్టొసీన్ లేక గ్లేషియల్ యుగం అని) ధారాళ వర్షపాతాలు, బ్రహ్మాండ మైన మంచుగడ్డలు, కొండల్ని పిండి చేసేటట్టు ప్రవహించే గ్లేషియర్లుగలకాలం. కొత్త భూభాగాలుపై కుదిరేవి. విస్తారమైనభూతలం సముద్రాంతర్గతమై జలమయమయ్యేది; ఈ పరిస్థితుల్లో, ఇప్పటికి, సుమారు 50 లక్షల ఏళ్ళక్రిందట 'మానవు'లనదగ్గ నేండర్తాల్ ఆదిమజాతివారు. పైన జెప్పిన వానరసంతతి అడవి మనుష్యులనుంచి క్రమ-క్రమంగా తయారయ్యేరు. ఇలాగ విశ్వమానవ వికాసంలో మాన వుడు ఈ భూరంగ స్థలానికి వచ్చింది—అనంతమైన జగ త్కాలంలో ఒక లిప్తం (కన్నుమూసి తెరచినంతపాటు) కన్నా స్వల్పం! ఇతఁడు క్రమంగా వేట, పచ్చిమాంసా హారం మానేసి, వ్యవసాయం చేయ బూనుకొన్నది ఆ లిప్తకాలంలో లిప్తమని చెప్పాలి.

ఇన్ని కోట్ల సంవత్సరాల కాలంలో మానవుడి పుట్టుక ఇలాంటిదని అవగాహనమొనర్చుకోవడం కష్టమే. దీన్ని సులభంగా గ్రహించడానికి మన మొక కొత్త గడియారం సృష్టిద్దాం. ఈ గడియారంలో సంవత్సరం ఒక్కొ సెకండుగా టిక్కు-టిక్కు-మని జరిగి పోతుందనుకుందాం. దీంట్లో ఒక నిమిషం అంటే మానవుడి షష్టిపూర్తి (60 సం॥రాలు) అన్నమాట! ఈ క్రొత్తగడియారం కాలంలో చూచుకుంటే మన భూగోళం సూర్యగోళంనుంచి విడివడి 70 ఏళ్లు మాత్రమే అయిందన్నమాట; మానవుడు విశ్వ రంగ స్థలంలో చూపట్టింది—3 రోజుల క్రితం అన్న మాట! ఇతడు నాగరీకుడనదగ్గకాలం, విద్యలు-కళలు-నేర్చి శాస్త్రపరిశోధనలు గావించింది 5 నిమిషాల క్రిందట మాత్రమే!! ఇంతలోనే ఇంతటి మహత్కార్యాలూ, మారణహోమాలూ చేయగలిగిన మానవుడు (మన కొత్త గడియారంలో) ఇంకా తన భూగోళంతోబాటు 70 ఏళ్ళ వరకు బ్రతకవలసి యుంది. అప్పటి కీతని తెలివితేట లకు శాస్త్ర పరిశోధనలకు ఎన్ని రెమ్మలు, కొమ్మలు, వెల్లివిరియనున్నవో తెలియరాదు! భూగోళం చరిత్రలో మానవుడి పుట్టుక చూస్తే—70 ఏళ్ళ పురాతనపుటింటిలో 3 రోజుల క్రితం పుట్టిన పసిబాలుడన్నమాట ఇప్పటి-నవ-నాగరికతా-వ్యామోహనా- వివశుడగుతున్న - మానవుడు! ఇతడు 70 ఏళ్ళ వృద్ధుకావలసి యుంది. ఇప్పటికే బ్రహ్మ సృష్టికి ప్రతి సృష్టిని చేయ యత్నిస్తున్న యీతని ప్రజ్ఞ—పరిశోధనలు ఏ రీతిగా మారుతవో ఆలోచించడం దురూ హ్యామేను!

ప్రకృతి నియమాలను, తన యూహాశక్తిని, ఆధారంగా జేసికొని మానవుడు—కోట్లకోట్ల మైళ్ళ దూరాల నున్న నక్షత్రలోకాల నిర్మాణాలను బైటపెట్టేడు; వాటి శీతోష్ణ పరిస్థితులను జెప్పి వయస్సులు నిర్ణయించేడు. పరమాణు గర్భంలో దూరి వాటి రహస్యాలు శోధించేడు. కాస్మిక్ కిరణాలను కనుకున్నాడు. అణువులు గాలించి, క్షకిరణ విసర్జనశక్తి (Radio Activity) గల ధాతువులను కని పెట్టేడు. 'దానెత్తిచ్చి కరిగిపోసిన యిత్తడి బంగార మౌనే?' అని యీమీదట యెవరూ సాహసంతో నన లేకుండా ఒక ధాతువును మరొక ధాతువుగా మార్చవచ్చు నన్నాడు. 'ఉ' అని, ఆ శబ్దాన్ని చిటికెలో భూగోళం చుట్టూ త్రిప్పి రప్పించి పట్టుకున్నాడు. జీవం అనేది యెప్పుడు, యెట్లుగా వుత్పత్తిచెందిందీ చెప్పేడు. యుగయుగాల క్రితం బ్రతికిన ఆదిమవాసులయుదంతం చూచినట్లే యేకరువుపెట్టి మానవజాతి వికాసాన్ని (Evolution) విమర్శించేడు. కణాంతరాలలోని "క్రోమో జోమ్సు" పరిశోధించి వంశ లక్షణాల కాకరములైన 'జీన్సు'ను నిర్ణయించేడు. సూక్ష్మాతి సూక్ష్మాలైన సూక్ష్మ జీవు ల్ని పరిశోధించి—అవి తెచ్చిపెట్టే రుగ్మతల అవ్యక్తాలను వ్యక్తంచేయ ప్రయత్నించేడు. హృదయం, శ్వాసకోశాలు నిలిచిపోగా, వాటికి తన శాస్త్ర పరికరాలు తోడిచ్చి పోయే జీవాన్ని నిల్పేడు. బుర్రలోని ఊహల్ని గూడ వెలికి చూపించగల యంత్రాన్నిగాని, ఫోటోతీసే తంత్రాన్నిగాని

త్వరలో కనిపెట్టేనంటాడు. శరీరాంతరాలలోని 'నిర్నాళికగ్రంధులు' (Ductless Endochrine glands) పసిగట్టి, అవి సమకూర్చే సేంద్రియ పదార్థాలను రసాయనిక పరిశోధన శాలలో తయారుచేసేదు. గర్భస్థమైన పిండానికి లింగభేదం కల్గించే సూత్రాన్ని వెదుకుతున్నాడు. ఇప్పుడు కోడిగ్రుడ్లను కోడి అక్కరలేకుండానే యంత్రంచే పొదిగించి పిల్లలను చేయించ గలిగినట్లు, గర్భధారణమైన వెంటనే అండాన్ని వెలికి దీసి పసిబిడ్డ తయారయేవరకు తన ప్రయోగశాలలో రసాయనములవల్ల పోషణకల్పించి పెంచడంకూడ కనిపెట్టేడంటే శాస్త్రజ్ఞుని పుణ్యమాయని స్త్రీలోకానికి అనాదినుండి అక్రమంగా సంప్రాప్తించిన పిండభరణ, ప్రసవ ప్రయాస నివారణమైపోతాయి !! ఇక వృద్ధుల్ని యవ్వనుల్నిగాను, విగత జీవుల్ని సజీవుల్నిగాను చేయ గలిగేడంటే "మానవుడు బ్రహ్మ పుత్రుడన్న" మాట సార్థక్యమౌతుంది.

కొంచెం వివేక దృష్టితో చూస్తే యీ అనంతంగా తోచే విశ్వమే చిత్రం! దానిలో ఎక్కడా పొడకట్టని 'జీవం' అనబడే అపూర్వం యీ చిన్న భూగోళంమీద ఉద్భవంకావడం చిత్రంలో చిత్రం !! అలాంటి జీవాన్నిమించే ఉత్కృష్టమైన మానవ జీవి కడకు తయారవడం అంతకన్నా చిత్రం !!! దాని చిన్న బుర్రకు (మనస్సుకు) స్థలవస్తునిర్దేశాలుగావించి — అండపిండ బ్రహ్మాండాలన్నిటికి లెక్కలు కట్టగల సామర్థ్యం కలగడం చిత్రాతి విచిత్రమైన విషయం !!!!

అచింత్యమై అనంతకాల గర్భంలో విశ్వాంతరాళమంతటా వ్యాప్తమై యున్న మహత్తరశక్తి క్రమంగా నెబ్యులాలుగా ఏర్పడి, పరమాణువు, అణువు, పదార్థంగా మారి, వృక్షమై, జంతువై కడకు (ఇదమిద్ధమని గ్రహించగల వివేకమూ, తనకు—సృష్టికర్తకుగల భిన్నత్వ ఏకత్వాల్ని గ్రహించగల సామర్థ్యమూ, అండపిండ బ్రహ్మాండాలకు లెక్కలు గట్టి తనలో ఇముడ్చుకోగల పూర్ణత్వమూ, ఆఖరుకు "ఆత్మవత్సర్వ భూతాని" అన్న అఖండ సత్యం చవి చూడగల జ్ఞానమూగల) మానవ జన్మగా పరిణామం జెందడం, నిజంగా చిత్రాతి చిత్ర విచిత్రమైన విషయం గదా!



## స్వీకారం

★

ఈ క్రింది పుస్తకాలు, సమీక్షార్థం, మా కార్యాలయం చేరాయి—

### ఆంధ్ర శ్రీ

రచన : రాజశ్రీ...మణి పబ్లికేషన్స్ ప్రచురణ, (శ్రీకాకుళం)

ఆంధ్రరాష్ట్ర సిద్ధికోసం, ప్రతి ఆంధ్రుడూ తన బాధ్యత తెలుసుకోవాలని ప్రబోధించే ఏకాంకిక.

వెల : 8 అణాలు.

*　　*　　*

### సుహేళీ

(బొమ్మల కథ)

కథ : సీను...బొమ్మలు : బాపు. సుహేళీ పబ్లికేషన్స్, (మైలాపూరు - మద్రాసు) వారి ప్రచురణ.

వెల : 6 అణాలు.

బాపు బొమ్మల రచన, కథా గమనం, చక్కగున్నాయి. సైజు కూడా ముచ్చటగా వుంది. ఇంకా ఎక్కువ పేజీలతో ప్రచురించి వుంటే బాగుండేది. ★






Edited & Published by, G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by Mrs. A. C. Krishna Rao, M.A.,L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Madras-4

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో
భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2—0—0
సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 .... సీనియర్ తరగతికి రూ. 9-0-0

నృత్యోపాధ్యాయిని :
శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2—0—0
సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని :
శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్, మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్. ఇంటర్మీడియెట్. ఇ.యస్.ఎల్.సి. పరీక్షలు. నృత్యము. గానము.

**పారిశ్రామిక విద్యాలయము** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

**వస్త్రములపై అచ్చువేయుట** : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

**సెక్రటరియల్ ఇన్స్టిట్యూట్** : స్త్రీలకు టైపు. షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము** : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యావ్యాప్తికై. స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము** : సభ్యురాండ్ర. విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ. ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్** : స్త్రీ. శిశువుల సంరక్షణశాల. ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మించబడుచున్నది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి. సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.



భారత ప్రభుత్వ పునరావాసశాఖవారి యాజమాన్యాన ఆంధ్ర మహిళా సభలో జరుగుచున్న అద్దకపుపని, వస్త్రములకు రంగువేయు వృత్తి విద్య నభ్యసించుచున్న విద్యార్థినులకు, జూలై 17, 18 తేదీలలో పరీక్షలు జరిగినవి. పరీక్ష వ్రాసిన 10 మందీకూడా కృతార్థులైరి.

ప్రథమ శ్రేణి

కె. [illegible], కె. [illegible], కె. ఎస్. [illegible], [illegible]

ద్వితీయ శ్రేణి

కె. ప్రమీలాదేవి, [illegible], ఎస్. ఆర్. నిర్మల, [illegible], [illegible], [illegible] లక్ష్మి

ఈ విజయాన్ని సమర్థిస్తూ, భారత ప్రభుత్వము ఇచ్చే సర్టిఫికెట్లవల్ల, వీరికి భారతదేశమంతటా ఎక్కడైనా ఉద్యోగము లభించే అర్హత వుంటుంది. ఇక్కడ నేర్చిన విద్యవల్ల, ఏ పెద్ద కంపెనీలోనైనా ఉద్యోగమునకుగాని, లేక స్వయం వృత్తికి గాని తగిన విజ్ఞానము లభిస్తుంది.

చక్కగా విద్య నభ్యసించి విజయముగాంచిన విద్యార్థిని బృందానికి మా అభినందనములు సమర్పిస్తూ, వారి భవిష్యత్తుకు సార్థకమైన శుభాకాంక్షల నందిస్తున్నాము.

★

## తిరిగి తరగతులు ప్రారంభం

ఆగస్టునుండి తిరిగి క్రొత్త తరగతులు ప్రారంభమైనాయి. ఇందు చేరుటకు కనీసపు అర్హత స్కూలు ఫైనల్ చదువు—లెక్కలెక్కువగా, విద్యార్థినియొక్క ఇష్టము ననుసరించి. ఇతర సమస్త వివరాలకు [illegible]. ముందు ఫారమ్ చదివినవారినికూడ యిందు చేర్చుకొనుట జరుగును.

ఆగస్టు రెండవ తేదీని, పునరావాస ప్రాంతీయశాఖాధికారి కార్యాలయములో అభ్యర్థుల అర్హతల పరిశీలన జరిగినది. 16 మంది విద్యార్థినులు ఆ రోజున యీ తరగతిలో చేర్చుకొనబడిరి. అందు కనీసము 8 మందికి మాసమునకు రూ. 25/- విద్యార్థి వేతనము యీయబడును.

ఆంధ్ర మహిళా సభ

# నర్సింగ్ హోమ్

## నూతన భవన ప్రారంభోత్సవము

స్త్రీ, శిశువులకు వైద్యశాల, సంరక్షణశాలల నిర్మాణమునకు ఆంధ్ర మహిళాసభవారు కృషి ప్రారంభించి మూడు సంవత్సరములు జరిగినవి.

ది. 7—1—1950 న కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్‌గారు నర్సింగ్‌హోం భవనాలకు శంఖుస్థాపన జరిపించినారు. రాష్ట్రప్రభుత్వ దానమైన అడయారు స్థలములో, మహిళాసభా ప్రముఖసభ్యురాండ్ర విరాళములు ఆధారంగా, భవననిర్మాణము ప్రారంభమైనది.

తదుపరి ది 19—6—1951 న శ్రీ నెమిలూరు జమీందారుగారి విరాళముతో నిర్మింపనున్న ప్రసూతి శాలకు, మధ్యప్రదేశ్ గవర్నరుగారైన డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు శంఖుస్థాపన గావించినారు.

ఈనిర్మాణముయొక్క అవశ్యకతను గుర్తించి, కేంద్ర ఆరోగ్యశాఖవారు, ఇదియొక నర్సులు, మంత్రసానులకు సంక్షిప్త ప్రణాళికలో శిక్షణనిచ్చే పాఠశాల కేంద్రంగా రూపొందునిమిత్తము రూ॥ 80,000 లు మొత్తము విరాళముగా నిచ్చియున్నారు. ఐదేండ్లపాటు వర్షా వర్షము రూ॥ 15,000 చొప్పున పాఠశాల వ్యయమును భరించునట్లుకూడ ఏర్పాటు చేసియున్నారు.

అభిమానుల ఆదరాభిమానాలతో ప్రారంభమైన కట్టడములు, భగవదనుగ్రహమువల్లనూ, సహృదయుల శుభకాంక్షల ఫలితంగానూ, యీ నాటికి పూర్తికానున్నవి.

ఆగస్టు నెల 17-వ తేదీన, కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీ చింతామణి దేశముఖ్‌గారు, యీ భవనమునకు ప్రారంభోత్సవము జరిపింతురు. 20 రోగులకు పడకలు, తదవసరమైన పరికరములు, ఇంకా ప్రసూతి శాలలో నుండవలసిన ముఖ్యమైన సామానులన్నియు సేకరించి, వైద్యశాల వెంటనే ప్రజా వినియోగమునకు తగినట్లుగా ఏర్పాట్లు జరుగుచున్నవి. నర్సు, మంత్రసానుల శిక్షణకూడ త్వరలోనే ప్రారంభము కాగలదు.

ఈ సందర్భమున మహిళాసభ సభ్యురాండ్రు, అభిమానులుజేరి, ఆగస్టు 18-వ తేదీన ఒక వినోద ప్రదర్శనమును గావింతురు.

ప్రారంభోత్సవ వివరములు, ప్రదర్శనముయొక్క వివరములు, సకాలములో సభ్యురాండ్రకు, తదితరులకు తెలియజేయబడును.

ఇట్టి సంస్థలయొక్క ఆవశ్యకతనుగూర్చి అందఱూ ఎరిగినదే. ఇట్టి నిర్మాణమునందలి బాధ్యతలు, కష్టనిష్ఠురములూ కూడ విజ్ఞులకు తెలియనివికావు. సేవాకాంక్షతో ప్రారంభించుచున్న యీ సంస్థకు, సర్వవిధములా, అంటే, ధన, వస్తు, కార్యరూపములలో అందఱూ సహకరించి, మా కృషిని సఫలీకృతమొనర్చవలసినదిగానూ, ప్రారంభోత్సవమునకు అందఱూ విచ్చేసి విజయవంతముగా జరిపింపవలసినదిగానూ కోరుచున్నాను

జ. జమునాబాయి,
నర్సింగ్ హోమ్ కార్యదర్శిని.
ఆంధ్ర మహిళా సభ.

వస్తున్నది

ముగ్గురు కొడుకులు

తెలుగు

జెమినీ చిత్రము

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడి యెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : నేత, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమంలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

వస్త్రములపై అద్దకపుపని : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ : స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడుచున్నది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

త్వరలో వస్తుంది!



ఈస్టిండియా
వారి

# సంక్రాంతి



ప్రేక్షకులు ఆనందముతో యెదురు చూచు
చున్న మహత్తర సాంఘిక చిత్రము....

డైరెక్టర్: సి. పుల్లయ్య
ప్రొడ్యూసర్: సుందర్‌లాల్ నహతా




సంపుటి 9 :: ఆగస్టు '52 :: సంచిక 4

# మన విద్యా విధానము

మన ప్రస్తుత విద్యావిధానం ఎక్కువ లోపాలతో కూడుకొని వున్నదని విజ్ఞులైన ప్రతివారూ ఒప్పుకుంటారు. ఈ పదేళ్ళుగా విద్యా బోధన, కేవలం—యాంత్రికంగా జరుగుతుండడం తప్ప, విద్యార్థులు ఒక నిర్ణీతమైన స్థాయి నందుకుని పురోగమించడానికి సహకరించడం లేదని, అసలు ప్రభుత్వం పెత్తందార్లే వక్కాణిస్తున్నారు. మన ప్రభుత్వ విద్యాశాఖ మంత్రిపుంగవులు ఎప్పటికప్పుడు మారుతూండడం, రాజకీయ వాతావరణంలో దుమారం రేస్తూండడం, తదనుగుణంగా విద్యావిధానంలోనూ విచిత్రమైన మార్పులు వస్తూండడం—ఇదీ, జరుగుతున్న చరిత్ర.

ఒకానొక ప్రముఖ వ్యక్తి ప్రవచించిన మోస్తరుగా-"విద్య, ఒక్క దేశమనే పరిమితిలేకుండా అన్ని దేశాల సారస్వత సంపదనూ అనుభవించేందుకు ఉపయోగపడాలి.... వివిధ రంగాల్లో మానవుడు సాధించ గల్గిన కార్య-కలాపాలయొక్క ఉదాత్తమైన విలువను అర్థం జేసుకుని ఆనందించే స్థోమత, విద్యద్వారా లభించడం అవసరం ".

విద్యకు ఇంత సువిశాలమైన అర్థం సృష్టించబడి వున్నప్పుడు, అధికారులు కేవలం వారి వారి వ్యక్తిగత—రాజకీయ అవసరాలకూ, దానికీ, ముడివేస్తూ రావడం, అపాయకరం.

ఒక సంవత్సరంలో అర్థభాగం సెలవులతోనూ, ఎక్కువ అనవసర విషయాలతోనూ, నిండివుండి—భారతీయ సంస్కృతికీ, సారస్వతానికీ, తావులేకుండా వున్న ప్రస్తుత విద్యావిధానంలో ఆమూలాగ్రమైన మార్పును తీసుకురావడం, అవసరం. ఏవో కొన్ని సమితులను నియమించడంతోనే సంతృప్తిపడకుండా ప్రభుత్వం: ముందుగా ఏ ఏ భాషలలో బోధించాలనే తీవ్రతర సమస్యను పరిష్కరిస్తూ, నిర్మాణాత్మకమైన కార్యరంగంలోకి దిగడమే కర్తవ్యం.

# ఆగస్టు వీరులు

మళ్ళీ—ఆగస్టు 15 తోబాటు—స్వాతంత్ర్య దినోత్సవ సుసందర్భం వస్తూన్నది ; మనం స్వతంత్రులమవడానికి ఎందరో వీరులు, త్యాగమూర్తులు, తమ తను మన ధనాల నర్పించి హింసాయుతంగానూ, అహింసాయుతంగానూ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని కీర్తిశేషులయ్యారు. వీరిలో పెక్కు మంది మహిళామణులుకూడా లేకపోలేదు.... దేశంకోసం తమ సర్వస్వాన్ని సమర్పించిన ఆగస్టు వీరుల సంస్మృతి చిహ్నంగా ఈ సంచికను వారి కంకితం గావిస్తున్నాం.

—:o:—



# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

జూన్ చివరివారం మొదలుకుని జులై మూడవవారం వరకూ మన దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ జరిగిన సంఘటనలను చూస్తే ఒక్క విషయం స్పష్టంగా కనిపిస్తుంది. వివిధ తరగతులకూ, భిన్న వర్గాలకూ, ఏర్పడ్డ వివాదాలు అంతకంతకూ ముదిరిపోయి, విషమ స్వరూపాన్ని దాల్చినట్లు తెలుస్తున్నది. వివాదాల మూలస్వరూపాలనూ, సమస్యల అసలు తత్వాలనూ కనిపెట్టి, వాటిని గురించి సహేతుకంగా ఆలోచించి, ధైర్యసాహసాలతో పూనుకుంటేనే తప్ప అవి పరిష్కారమయే అవకాశం లేదనీ, స్థూలదృష్టితో పైపైన కప్పి పుచ్చే కుటిల నీతి విధానాలేవీ పని చేయలేని పరిస్థితి ఏర్పడినదనీ తెలుస్తుంది.

*   *   *

పార్లమెంటు ఉభయ సభల్లో భాషా రాష్ట్రాలమీద జరిగిన చర్చ, దేశంలో ఆర్థిక పరిస్థితులూ, మధ్య ప్రాచ్య దేశాల పరిస్థితీ. కాశ్మీర్ వ్యవహారం, కొరియా సమస్యా ; ఇవన్నీ పై అంశాన్ని నిరూపిస్తున్నవి.

భాషల ననుసరించి రాష్ట్రాలు ఏర్పాటు చేయాలని కమ్యూనిస్టు సభ్యుడు తుషారకాంత్ చటర్జీ ప్రతిపాదించిన తీర్మానం జులై 12 వ తేదీన పార్లమెంటులోనూ, మద్రాసు రాష్ట్రంలో తగాదాలులేని తెలుగు ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రం నిర్మించాలని కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ సభ్యుడు పైడా వెంకట నారాయణగారు ప్రతిపాదించిన తీర్మానం జులై 21 వ తేదీన స్టేట్ కౌన్సిల్‌లోనూ ఓడిపోయినవి. రెండు సభల్లోనూ ఆంధ్ర సభ్యుల్లో ఎక్కువ మంది ఆంధ్ర రాష్ట్రావసరాన్ని విశదీకరించారు. ఇతర ప్రాంతాల కాంగ్రెసు సభ్యులు అనేక మంది, కాంగ్రెసేతర సభ్యులందరూ భాషా రాష్ట్ర వాదాన్ని సమర్థించారు. కాని పండిత నెహ్రూ స్వయంగా ఎదురు నిలిచి, కాంగ్రెస్ పార్టీ బలంతో వీటిని ఓడించారు.

పార్లమెంటు చర్చలో కమ్యూనిస్టు సభ్యులను వదిలి చేసి, తీర్మానాన్ని బలపరిచిన ఆంధ్ర కాంగ్రెస్, స్వతంత్ర సభ్యుల వాదాన్ని గమనించటం అవసరం. కాంగ్రెస్ సభ్యుడు కొత్త రఘురామయ్యగారు మాట్లాడుతూ ఆంధ్ర రాష్ట్రావసరాన్ని వివరించటమే కాక, ప్రత్యర్థుల సహేతుక శంకలకూ, కుశంకలకూ కూడా తగిన జవాబు ఇచ్చారు. ఆయన తన ప్రసంగంలో ఈ క్రింది అంశాలను స్పష్టం చేశారు :

"ప్రాజక్టులలోనూ, పరిపాలనలోనూ మద్రాసు ప్రభుత్వం ఆంధ్రులకు చేస్తున్న తీవ్ర అన్యాయమే ఆంధ్రుల రాష్ట్ర వాంఛకు ముఖ్య కారణం. కృష్ణాతీర ప్రజలు నీళ్లు లేకుండా అల్లాడుతూ ఉంటే, ఆ నీటిని తమిళనాడుకు తర్లించుకుని పోదామని మద్రాసు ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలు దీనికొక ఉదాహరణగా తీసుకోవచ్చును. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడితే అది కమ్యూనిస్టుల దేశంగా మారుతుందని భయపడక్కర్లేదు''.

స్వతంత్ర సభ్యుడు లంక సుందరంగారు, మాట్లాడుతూ ముందు నిర్వివాద ప్రాంతాలతో రాష్ట్రం ఏర్పాటు చేసి వివాద ప్రాంతాల విషయాన్ని తరవాత పరిష్కరించవచ్చని అన్నారు. కమ్యూనిస్టు సభ్యులూ తదితరులూ మాట్లాడుతూ భాషా రాష్ట్రాల నిర్మాణానికి హైదరాబాద్, మైసూరులు ఆటంకాలుగా ఉన్నవనీ, సంస్థానాలన్నీ విభ

జించి పక్కనున్న భాషా ప్రాంతాలలో కలిపివేయాలనీ సూచించారు.

దీనికి నెహ్రూ అంగీకరించలేదు. హైదరాబాదునే విభజిస్తే వింధ్య పర్వతాలకు దక్షిణాన ఉన్న దేశం యావత్తూ తల్లకిందులై పోతుందని ఆయన అన్నారు. ఎందువల్ల, ఎట్లా తలకిందు లవుతుందోమాత్రం ఆయన చెప్పలేదు. ఆయనే కాదు తీర్మానాన్ని ప్రతిఘటించిన పెద్దల్లో ఒక్కరుకూడా చెప్పలేదు. హైదరాబాదు విభజనే కోరితే అసలు ఆంధ్ర రాష్ట్రమే ఉండదు పొమ్మన్నారు. పోనీ విశాలాంధ్ర వద్దు, కొద్దిపాటి ఆంధ్రరాష్ట్రం సంగతి ఏమిటని అడిగితే, ఇరుగు పొరుగులలో ముందు సమాధాన పడితే, ఆ తరవాత చూద్దామని అన్నారు.

* * *

మొత్తం భాషా రాష్ట్రాల సంగతి ఎత్తితే మొదటికే మోసంవస్తుందేమోనన్న ఉద్దేశంతో వెంకట నారాయణ గారు తమ తీర్మానంలో ఎంతమాత్రమూ తగాదాలేని కేవలం తెలుగు ప్రాంతాలతోనే - శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు, పడమటి గోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారిలోని మూడు తాలూకాలు,—రాష్ట్రాన్ని నిర్మించాలని కోరారు. కాని నెహ్రూ దీనికికూడా సున్నా చుట్టారు. ఈ కోరికను తోసి వేయటానికి ఆయన చెప్పిన కారణం చూస్తే, ఆంధ్రుల మీదికి మిగిలిన వాళ్ళందర్నీ ఉసికొల్పటమే ఆయన ఉద్దేశమా అనిపిస్తుంది. పై ప్రాంతాలు ఏ విధంగానూ తగాదాలేనివి. వీటితో రాష్ట్రం నిర్మించటానికి మళ్ళీ ఒకళ్ళతో 'సమాధానం' పడాలన్న షరతు పెట్టటంలో ఉద్దేశం ఏమిటి? నూటికి నూరుపాళ్ళు తెలుగు ప్రాంతాలని మద్రాసు ప్రభుత్వమూ, అఖిలభారత కాంగ్రెసు సంఘం, అంగీకరించి ఉన్న ప్రాంతాలతో రాష్ట్రాన్ని స్థాపించటానికి ఇతరుల ఒప్పందాలు దేనికి? అట్లా రాష్ట్రం ఏర్పరిస్తే, ఎవరికి ద్వేషాలు కలుగుతవి?

ఈ ప్రాంతాలుకూడా తమవి అనేవాళ్ళు ఉన్నారేమో వెతికి పట్టుకుని వచ్చి, వాళ్ళని తృప్తిపరచమని నెహ్రూ గారు సెలవిస్తున్నారని అనుకోవాల్సి వుంటుంది. నెల్లూరు కూడా తమదేనని మద్రాసులో తమిళ నాయకులు కొందరు చేస్తున్న వ్యర్థ ప్రసంగాలను దృష్టిలో పెట్టుకుని, ఆంధ్ర రాష్ట్రానికి నెహ్రూ అడ్డుపుల్ల వేస్తున్నారని భావించవలసి వుంటుంది.

* * *

హైద్రాబాద్ విభజన అంటేనే నెహ్రూ అంత ఆవేశ పడటానికీ, పేచీలేని ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పరచటానికికూడా ఇష్టపడకపోవటానికీ కారణమేమయివుంటుంది? కృషికర్ లోక్ నాయకుడు రంగాగారు స్టేట్స్‌కౌన్సిల్‌లోనూ, వి. రామకృష్ణగారు మద్రాసు కౌన్సిల్‌లోనూ వెల్లడించిన కమ్యూనిస్టు భయమే నెహ్రూకికూడా ఉన్న దేమోనని అనుమానించవలసివస్తున్నది. రంగా, రామకృష్ణ గార్లు ఒక రాష్ట్రంలోనే ప్రాంతీయ పరిపాలన ఉండాలంటారు. ఆంధ్రరాష్ట్రం స్వయంపోషకం కాలేదనీ ప్రాజక్టులు నిర్మించుకోలేదనీ రామకృష్ణగారు అన్నారు. ఉమ్మడి రాష్ట్రంలో మనకు ఏమివచ్చినవో ఆయన చెప్పగలిగితే, విడిపడినప్పటి నష్టాల్ని గురించి ఆలోచించవచ్చు.

* * *

రాష్ట్రస్థాపనకై వ్యక్తిసత్యాగ్రహాలు నడిపిన స్వామీ సీతారాం నిజమయిన ప్రజోద్యమం నడపటానికి ఆలోచిస్తున్నారు, ఆంధ్రుల ఇష్టానికి విరుద్ధంగా మద్రాసు ప్రభుత్వం విధించిన పన్నులను ఆంధ్రులు చెల్లించవద్దని ఆయన విజ్ఞప్తి చేస్తున్నారు. సోషలిస్టులు మొదలైనవారు కూడా ఈయన్ను సమర్థిస్తున్నారు.

* * *

ప్రజల ఇష్టానికి వ్యతిరేకంగా, వాళ్ళకష్టాలను పరిగణించకుండా పన్నులు వేస్తున్నది ఒక్క మద్రాసు ప్రభుత్వమేకాదు. బొంబాయి, ఉత్తరప్రదేశ్, బీహార్ మొదలైన అనేక రాష్ట్రాలలోకూడా కొత్తపన్నులు విశేషంగా వేయబడుతున్నవి. వీటిని ప్రతిఘటించటానికి ఐక్య ప్రతిఘటనోద్యమాలు సాగుతున్నవి. దేశంలో డబ్బు బొత్తిగా

పెరగటంలేదు. నిరుద్యోగసమస్య పెరిగిపోతున్నది. ఆహార ధరలు మండిపోతున్నవి. ఇటువంటి పరిస్థితులలో గోరు చుట్టుమీద రోకటిపోటు మోస్తరుగా అదనపు పన్నులు పడితే ప్రజలు భరించగలరా అనే ఆలోచన ప్రభుత్వాలకు ఉన్నట్లు తోచదు.

ఇటీవల బొంబాయి ప్రభుత్వం ఒకే సరుకు ఎన్నిసార్లు చేతులు మారితే అన్నిసార్లు అమ్మకపు పన్ను విధించటానికి ఆలోచించింది. దానితోపాటుగా భూమి రెవిన్యూమీద సర్ చార్జి వసూలు చేయాలని ఉద్దేశించింది. తెలుగు ప్రాంతాలయిన ఉత్తర జిల్లాలలోనూకూడా ఇది చెప్పరేదు. సర్కార్ల బియ్యం మద్రాసు, బెంగళూరులకూ, అక్కడి నుంచి మరెక్కడికో, ఒకే పనిగా తరలించబడుతున్నది. బియ్యం బస్తా 60 రూపాయలు దాటిపోయింది. ధరలు పెరిగిపోతున్నవనీ, ప్రభుత్వం తనదగ్గర నిలవలు విడుదల చేసి ధరలను తగ్గించాలనీ ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు, తెనాలి యువజన కాంగ్రెసు మొదలైన సంస్థలు విజ్ఞప్తి చేసినవి. కాని ఇప్పుడే నిలవలు విడుదలచేస్తే, ఇంక ధరలనుపట్టి వుంచటమనేది సాధ్యంకాదు.

ధాన్యవ్యాపారాన్ని ప్రభుత్వం మిల్లర్ల చేతుల్లో ఉంచిందా: ఇటువంటి వ్యవహారాలను నడపటానికి ఎంతో ఉపయోగించకలిగిన ప్రొడ్యూసర్- కన్‌స్యూమర్స్ కోఆపరేటివ్ సొసైటీలను ప్రకాశంగారు ఏర్పాటుచేయగా, ఆయన్ను పడలాగిన ప్రబుద్ధులు, ఆ సొసైటీలను రద్దుచేసి ప్రజలను అసహాయస్థితిలో పడవేశారు.

దేశంలో ఆహారవిధానం అయోమయంగా నడుస్తున్నది. ఒక మంత్రిగారు కంట్రోళ్ళు తొలగించటమే తన విధానమంటారు. ప్రధాని నెహ్రూగారు కంట్రోళ్ళకు స్వస్తిచెప్పవద్దని ముఖ్యమంత్రులందరికీ స్వస్తి చెప్పారుట. ఆహార ధరలు తగ్గించాలంటే ఖచ్చితమయిన కంట్రోళ్ళు అమలు జరిపి, సేకరణధరలు, అమ్మకం ధరలు తగ్గించటమేనని పెప్సూ, రాజస్థాన్, ఢిల్లీ రాష్ట్రాలు ప్రభుత్వాలు నిశ్చయించి ఆవిధంగా తగ్గించినవి. కాని మద్రాసులో రాజాజీ మాత్రం కంట్రోళ్ళను తీసివేసి ఎప్పుడుండా తగ్గిపోతవనే చెప్తున్నారు.

* * *

మధ్యప్రాచ్యదేశాల పరిస్థితి అంతకంతకూ తీవ్రంగా తయారవుతున్నది. ఆదేశ సంపదలను దోచుకోవాలనే యూరపియన్ సామ్రాజ్యవాదులూ, వారిని దానే దోచుకోవాలని ఎత్తువేసిన మితవాదనాయకులూ, ఉభయులకూ, స్వస్తిచెప్పాలని ఉద్దేశించే ప్రజలకూ సంఘర్షణ జరుగుతున్నది. మితవాదనాయకులు ధైర్యంగా నిలబడి, ప్రజల సహాయంతో సామ్రాజ్యవాదులను ప్రతిఘటించే సంకల్పం కనపడటంలేదు. ప్రజల అండలేని బీక్షను సామ్రాజ్యవాదులు లెక్కచేయటంలేదు. ఈజిప్టులో నహాస్‌పాషా, హిలాలీపాషా, సిర్రీపాషా వరసగా నాటకం ఆడి నిష్క్రమించారు. పర్షియా ప్రధాని మొసాడిక్ కూడా రాజీనామా పెట్టవలసి వచ్చింది.

* * *

కాశ్మీర్ రాజ్యాంగ భవిష్యత్తుమీద ఢిల్లీలో అబ్దుల్లా ఢిల్లీ ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతున్నారు. ధోరణి చూస్తే ఇవి జయప్రదం కావచ్చుననే తెలుస్తున్నది. భద్రతామండలిలో తిరిగి కాశ్మీర్ సమస్య రాబోతున్నది. గ్రాహం మధ్యవర్తిత్వపు గడువును ఇంకా పొడిగించాలని పశ్చిమరాజ్యాలు మళ్ళీ ప్రతిపాదించినట్లు తెలుస్తున్నది. అజాద్ కాశ్మీర్ ప్రాంతంలో రోడ్లను చకచకా పాకిస్థాన్ నిర్మిస్తున్నది. ఆప్రాంత పరిపాలనను పూర్తిగా తన స్వాధీనం చేసుకున్నది.

* * *

కొరియాలో యాలూనది ప్రాజెక్టులమీద దాడులు జరిపిన అమెరికా తిరిగి చైనా భూభాగం మీదకూడా దాడి జరుపుతున్నట్లు చైనా ప్రధాని ఆరోపించారు. అవసరమయితే ఎటువంటి ఆయుధాలనయినా ఉపయోగిస్తామని యుద్ధవిరమణ ఒప్పందం కుదిరేవరకూ దాడులను ఆపేది లేదనీ, కొరియాలో కమ్యూనిస్టులు లేకుండాపోయేవరకూ

తమ సేనలు ఉంటవనీ అమెరికన్ భూసైన్య సర్వసేనాని జనరల్ కాలిన్స్ స్పష్టపరిచారు. క్రిమియుద్ధ ఆరోపణల మీద చర్చ జరిపేటప్పుడు ప్రధాన సాక్షులయిన చైనా ఉత్తర కొరియాలను పిలవటానికి భద్రతామండలి నిరాకరించింది.

అన్నిదేశాల్లోనూ నెహ్రూ మధ్యవర్తిత్వం వహిస్తేనే కాని వ్యవహారం పరిష్కారం కాదన్న నమ్మకం బలపడు తున్నది. బ్రిటిష్ లేబర్‌పార్టీ సెప్టెంబర్ సభలో నెహ్రూ మధ్యవర్తిత్వాన్ని కోరే తీర్మానం ప్రతిపాదించబడుతుంది. సామరస్యం కుదర్చటానికి ఢిల్లీ ప్రభుత్వం తన రాయ బారులద్వారా ఎంతోకృషి చేస్తున్నది.

ఇంతవరకూ జర్మనీ ఐక్యతకోసం ప్రయత్నించిన తూర్పుజర్మనీ ఇంక ఆప్రయత్నాలు కట్టిపెట్టి సోవియట్ పద్ధతిలో రాజ్యాంగ నిర్మాణానికి ఉపక్రమించింది. టునీషియా సమస్యమీద సమితిచర్చ జరపకుండా చేసిన ఫ్రాన్సు తన కీలుబొమ్మ అయిన బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని ఇండియా గుర్తించాలని సూచించటానికి సాహసించింది. బ్రిటిష్ సేనలు ఉన్న మలయా, లిబియాలపట్ల ఇండియా అనుసరిస్తున్న వైఖరి, ఇతర యూరోపియన్ సామ్రాజ్య దేశాలపట్ల అనుసరిస్తున్న వైఖరికీ చాలా తేడా ఉన్నదనే అంశం గమనించతగింది.



# ఇంటా - బయటా

గణిత శాస్త్రంలో తనకుగల అపార నైపుణ్యంచేత ఇరువైయేండ్ల వయస్సుగల ఒక భారతీయ యువతి అమెరికన్ నిపుణులను ఆశ్చర్యంలో ముంచివేస్తూంది. మైసూర్ నివాసియైన శకుంతలాదేవి 3,57,991 కి ఘనమూలం తృటిపాటిలో చెప్పగలుగుతూంది. ప్రస్తుతం ఆమె అమెరికాలో పర్యటిస్తూంది, ఆ పర్యటనానంతరం అమెరికాలోని ఒక విశ్వవిద్యాలయంలో గణిత శాస్త్రం అభ్యసించాలని ఆమె అనుకొంటూంది. గడచిన సంవత్సరాలలో ఏ తారీకయినాసరే ఏ వారమయిందో కూడా ఆమె చాలా సులువుగా చెప్పగలదు. ప్రేక్షకులు కోరిన సంఖ్యలతో ఆమె చదరపు గళ్ళ నేర్పాటుచేస్తుంది. వాటిని ఎటునుంచి కూడినా ఒకే మొత్తం వస్తుంది. అయిదవ యేటనే శకుంతలాదేవి కా నైపుణ్యం లభించింది. అప్పటి నుంచీ ఆమె తన శక్తిని పెంపొందించుకుంటూంది. ఇటీవలనే రెండేండ్లపాటు ఆమె యూరప్‌లో పర్యటించింది. తనకు ఇంతటి నైపుణ్యం ఏవిధంగా అబ్బిందీ శకుంతలాదేవికి తెలియదు. ఈ విషయాన్నిగూర్చి ఆమె ఇలా అన్నది; ' ప్రశ్నలకు జవాబులు వాటంతట అవి నాకు తోస్తవి. అంతేగాని, నేను వాటిని గురించి ఆలోచించను. ఒకవేళ ఆలోచించినా నాకు జవాబులేమీ దొరకవు.'

* * *

బెంగుళూరు కార్పొరేషన్ ప్రాంతంలో మొట్టమొదట రెండు సంతాన నిరోధ వైద్యశాలలు స్థాపించడానికి మునిసిపల్ కార్పొరేషన్ నేడు నిర్ణయించింది. ఈ కేంద్రాలు సంతాన నిరోధానికి తగిన సలహాలు వుచితంగా యిస్తాయి.

ఈ రెండు వైద్యశాలలలోను ఒకటి సిటీలోను, మరొకటి సివిల్ స్టేషనులోను నెలకొల్పబడుతాయి.

ఈ చర్యలలో మహిళాసభ్యురాలు పాల్గొనలేదు. ముస్లిం రోమన్ కాథలిక్ సభ్యులు తీర్మానాన్ని ప్రతిఘటించారు. ఈ ప్రతిపాదన మతానికి ఆస్తికతకు ప్రతికూలమని, మాతృత్వానికి ఘోరఅవమానంవంటిదని వారు వాదించారు.

* * *

అక్టోబరులో సమావేశం కాబోతున్న మిత్రరాజ్యసమితి సాధారణ సమావేశంలో పాల్గొనే ఇండియా రాయబార వర్గానికి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ నాయకత్వం వహించగలదని అధికారవర్గాలవారంటున్నారు.



# 'కవి' శ్రీ కవికొండల వేంకటరావుగారి

## షష్టిపూర్తి సన్మాన సభ: మద్రాసులో పలువురి ప్రముఖుల ప్రసంగాలు:

సుప్రసిద్ధ కవీశ్వరులూ, కథానవలా రచయితలూ, నేయా వాఙ్మయకర్తలు అయిన శ్రీ కవికొండల వేంకటరావు గారి షష్టిపూర్తి సన్మాన సభ యీనెల 20వ తేదీ ఆదివారం సాయంకాలం మద్రాసులో రాయపేటలోని ఆంధ్ర విజ్ఞాన సమితి కార్యస్థానంలో జరిగింది. సభకు నగరంలోని ఆంధ్ర ప్రముఖులు, స్త్రీ-పురుషులు పెక్కుమంది విచ్చేశారు.

చెన్నపట్నంలో ఏర్పడిన సన్మాన సంఘ సభాధ్యక్షులయిన శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు సదస్యులకు స్వాగతమిస్తూ సన్మాన సంఘ కార్యకలాపాల్ని గురించి నివేదించారు. శ్రీ కొంతి రామమూర్తిగార్ని నాటి ఉత్సవ రంగ సభకు అధ్యక్షత వహించవలసినదిగా కోరారు.

సుప్రసిద్ధ సినీతార కుమారి సూర్యకుమారిగారి ప్రార్థన గీతంతో సభ ప్రారంభమయినది.

అధ్యక్షత వహించిన శ్రీ కొంతి రామమూర్తిగారు, కవికొండల వారి రచనా సామర్థ్యాన్ని వుగ్గడిస్తూ ఆంధ్ర సారస్వత రంగంలో విశిష్ట స్థానాన్ని సంపాదించిన శ్రీ వేంకట్రావుగారి షష్టిపూర్తి మహోత్సవం జరపటం యెంతయో సమంజసమని ముచ్చటించారు.

శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారితో ప్రారంభమయిన వుపన్యాసాలు శ్రీ నాయకూర సత్యనారాయణగారూ, శ్రీ యం. యన్. ప్రకాశరావుగారి వుపన్యాసాలతో ఒక స్థాయిని అందుకొని గట్టెక్కాయి. ముఖ్యంగా శ్రీ సూర్యప్రకాశరావుగారు కవికొండలవారు 'మనకవి' అని సోదాహరణంగా ఋజువుపరచారు. తర్వాత శ్రీ జేసుమళ్ళ కామేశ్వరరావుగారు 'కవి' గారి జీవిత చరిత్రను వుగ్గడిస్తూ ప్రశంసావాక్యాలు పలికారు. శ్రీమతి గాడిచెర్ల సుబ్బాయమ్మగారు కవిగారిచే రచింపబడిన "శివరాత్రి ప్రభ"ను పఠించి, కవిగారిని అభినందిస్తూ తాము రచించిన పద్యాలను చదివారు. శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తి, శ్రీ తాపీ ధర్మారావుగార్లు శ్రీ వేంకట్రావుగారి కవిత్వాన్ని ప్రశంసిస్తూ వుపన్యసించారు.

శ్రీ పాడ గోపాలకృష్ణమూర్తి, శ్రీ హరి ఆదిశేషువు, శ్రీ కర్రా సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ గుమ్మలూరి సత్యనారాయణ, శ్రీ కర్రా ప్రభాకరరావుగారలు "ఊహా కవి సమ్మేళనం" అన్న పేరుతో ఒక కవితా గోష్ఠిని నడిపారు. అందు శ్రీ హరి ఆదిశేషువుగారు, శ్రీ అడవి బాపిరాజుగారి పాత్రనూ, శ్రీ గుమ్మలూరి సత్యనారాయణగారు శ్రీ [illegible] పాత్రలనూ, శ్రీ కర్రా ప్రభాకరరావుగారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పాత్రనూ, శ్రీ కర్రా సూర్యనారాయణ శాస్త్రిగారు స్వర్గీయ మల్లవరపు విశ్వేశ్వరరావుగారి పాత్రనూ వహిస్తూ వారి వారి రచనలకు ప్రోత్సాహమిచ్చిన ఆయా కాల పరిస్థితులనూ, వారి వారి కవితలపై ఆ పరిస్థితుల ప్రభావములనూ, వ్యక్తపరుస్తూ శ్రీ కవికొండలవారి నాయకత్వాన శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిచే కవికొండలవారి కవిత్వమందు వుండిన మెళకువలను చెప్పిస్తూ, వారిని ప్రశంసిస్తూ, గోష్ఠిని సంపూర్తి చేశారు. ఈ కవితా గోష్ఠికి నాందిగా శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు శ్రీ కవికొండలవారిచే ఆనాడు జరుపబడిన పెక్కు గోష్ఠులలో నొక గోష్ఠిగా దీనిని వారి జన్మస్థానమయిన శ్రీరంగపట్నంలో జరుగుచున్నట్లుగా హెచ్చరిస్తూ ఈ సమ్మేళనము, ఊహాకవి సమ్మేళనమేననియూ వ్యక్తపరచారు. ఈ కవి సమ్మేళనము జరుగుచున్నంతసేపు సదస్యులు శ్రద్ధాసక్తులతో ఆలకిస్తూ పరమానంద భరితులయ్యారు.

కుమారి సూర్యకుమారిగారూ, కుమారి మోతే వేదకుమారిగారూ, తమతమ గానమాధుర్యాలతో సభ్యులను రంజింపచేశారు. శ్రీమతి యం. రమాదేవిగారూ, శ్రీ జి. భావనారాయణగారూకూడా కొన్ని పాటలు పాడారు.

సభాధ్యక్షులయిన శ్రీ కొంతి రామమూర్తిగారు, వారి తుది పలుకులతో కవిగారి పరోక్షమందు జరిగిన ఈనాటి షష్టిపూర్తి సభా, సన్మానములు ప్రజలకు వారియందు వుండు మక్కువను చాటుటయేగాక, కవిగారి కవితా ప్రభావము ప్రజానీకాన్ని ఎట్లు వూపగల్గినది చూపగల్గుటకు తార్కాణమని నొక్కి వక్కాణించారు.

స్థానిక సన్మాన సంఘ కార్యదర్శులయిన శ్రీ దిగుమర్తి సాంబశివరావుగారు కవికి నూటపదహార్లు చెన్నపురి ఆంధ్రుల తరపున కానుకగా పంపిస్తూ అందరికి వందనములు సమర్పించారు.



# వెలుగూ — నీడా

* గిరి *

మనమున్నటువంటి సంఘంలో- అంగవైకల్యంతో సమసతసమ్యోవారూ - బలహీనులూ- ఏవిధమైన సహాయమూలేని నిరాధారులూ- ఇంకా అనేకరకాల పీడిత ప్రజలు నివసిస్తున్నారు. వీరందరికీ తగువిధమైన సహకారం అందజేసి, జీవన్మార్గాలను కొద్దిపాటిగానైనా ఆచాకిందాన్ని ప్రసరింపజేయడమనేదే 'సంఘసేవ' అని అనిపించుకుంటుంది. సంఘసేవ తోటిమానవులకు తోడ్పడ్డం, ప్రతిమానవునియొక్క విద్యుక్తిధర్మం- ఉత్తమాదర్శమనే కాకుండా, ఒక ప్రత్యేకకళగాకూడా భావింపబడుతోంది. అంటే, సంఘంకోసం సేవనాచరించడంలోకూడా హితాహితాలు ప్రదర్శించాలన్నమాట. అన్నిధర్మాలసారంకూడా పాత్రాపాత్రాల్ని చూసి దానం చేయమంటుంది, అదేలాగునే దేశ కాల పాత్రానుసారంగా సంఘాన్ని సేవించాలన్నది బహుజనామోదితమైన సత్యం. ఆవిధంగా జరుగనప్పుడు సమస్యల్ని పరిష్కరించేందుకువెళ్ళి మనమే కొత్తసమస్యలను సృష్టించినవారమవుతాము. అందుకే అది ఒక 'కళ' అన్నాను.

ఈ సేవాక్రమం ఒక్కోదేశంలోకూడా ఒక్క ఆకృతిని ధరించి వుండడాన్ని గమనించాలి,

మనదేశంలో "మానవసేవే మాధవసేవ" ఇలాంటి లోకోక్తులవల్లనేమి, వివిధకథలూ కలాపాల వల్లనేమి, సంఘసేవకోసం అనాదినుండీ విరివిగా ప్రచారం జరుగుతూనే వుంది. అవి సజీవంగా రాణిస్తూవుందికూడా. సేవాదీక్షలో నిరతమైన అనేక సంస్థలున్నాయి. ప్రభుత్వంలో చేరినవీ-ప్రభుత్వానికి సంబంధించనవీ,

కళాశాలల్లో డిగ్రీలనందుకున్న తరువాత సమాజసేవలో తర్ఫీదునిచ్చే పాఠశాలలు మనదేశంలో మొత్తం నాలుగున్నాయి. "టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషియల్ సైన్సెస్" వాటిల్లో అతి పురాతనమైనది. మిగత మూడు పాఠశాలలు ఢిల్లీ, బరోడా, బెనారెస్ యూనివర్సిటీలకు చెందినవి. బెనారెస్ పాఠశాలలో మన దేశభాషగా పరిగణింపబడుతున్న హిందీలో శిక్షణ ఇవ్వబడుతుంది. ఇలాంటి కేంద్రాన్నే త్వరలో మద్రాసులోకూడా ప్రారంభిస్తారని వినికిడి. ఇటీవలనే మన కేంద్రప్రభుత్వపు విద్యాశాఖ, కళాశాల చదువులు ముగించిన పట్టభద్రులందరికీ సంఘసంక్షేమ శిక్షణనందించే ఉద్దేశ్యంతో అనేక కొత్తస్కూళ్ళను తెరువడానికి నిర్ణయించింది. ఈనిర్ణయం అతి సమంజసమైంది. కాని ఈ స్కూళ్ళను నడిపేటప్పుడుమాత్రం రెండు ముఖ్యమైన అంశాలను ఎవరూ మరువరాదు. శిక్షణానంతరం ఎక్కువకాలం జీతం—ఉద్యోగంకోసమై తాపత్రయపడేవారుగా వుండకూడదు శిక్షణనందుకునేవారు. అందరికీ ఉద్యోగాలు లభించకపోతుందన్నది ఒక అంశం: తరువాత వీరికి మన ప్రజలతో సన్నిహిత సంబంధం, వారి హృదయాలను అర్థంచేసుకోగల్గిన స్థోమత, ఈ సేవాక్రమంలోని పుణ్యం— పురుషార్థాల అవగాహన, ఇవన్నీ వుండితీరాలి. మనకు శిక్షనిచ్చే అధ్యాపకులైనా విశిష్ట వ్యక్తులైవుండాలి. వీరికి విదేశీయ వ్యాసంగపు బిరుదులు వుండకపోవటమే మంచిది. విదేశాల్లో వ్యాసంగం జరిపినవారికి మనదేశ వాతావరణం బోధపడ్డం దుస్సాధ్యం గనుక.

కాని, స్వచ్ఛంద దేశసేవాసక్తే ధ్యేయంగా కల్గిన (Voluntary people) వారికి ఎప్పుడూ సంఘంలో ఉదాత్తమైన స్థానం ఉండనే ఉంటుంది.

* * *

మానవసేవే తన జీవిత లక్ష్యంగా ఎన్నుకుని, పవిత్ర జీవనాన్ని గడిపిన వ్యక్తి రామకృష్ణ పరమహంస. మనందరికీ ఇతని పేరు సుపరిచితమే. కాని ఆయన సతీమణి శ్రీమతి శారదాదేవిపేరు పైకి రాకపోవడానికి కారణం, ఆమె గడిపిన నిరాడంబర జీవితవిధానమే. కాని ఆదర్శప్రాయమైన ఆమె జీవితంనుండి మానవకోటికంతటికీ అమూల్యమైన ముత్యాలు దొరుకగలవు.

రాబోయే 1953 సం॥లో ఈమె జన్మదిన శతవార్షికోత్సవాన్ని జయప్రదంగా జరుపాలని నిర్ణయించి వున్నారు, బేలూర్‌లోని రామకృష్ణమఠం అధికారులు.



# ఆత్మశాంతి

* శ్రీ ఐనవల్లి చంద్రమౌళీశ్వరరావు *

మండువేసవి. తిరిగి తిరిగి వచ్చాను, అస్సలు సహించలేదు. నిద్దర కండ్లరెప్పలని మూసుకోమని రొంపు చేస్తున్నది. ఈజీఛైరులో నడుము జారేసి స్వప్నలోకకు కళ్ళప్పగించి ఒళ్ళుమరచి నిద్దర పోతున్నా. —

కారుమబ్బులను కప్పుకొని, ఉరుముంతో గర్జిస్తూ, మెరుపులతో భూమిని వెతుక్కుంటూ ఆకాశము ఒక్కుహోరున వర్షముతో, పిడుగులతో భూమిపై పడడానికి సన్నాహాలు చేస్తున్నది—

ఏమివచ్చినా బీదలకేగా ముప్పు! దరిద్రులపై దాడిచేసే పంచమహాభూతాలు ధనవంతుల దరికైనా పోలేవు. బీదల గుడిశల పైకప్పులు, గాలికి ఎగిరి వాన తాకిడికి గోడలునాని ముద్దయి భూమట్టమయినాయి—

నేనా గాలివానలో ఒకవీధిలో నుంచి యింటికిపోతున్నా. ఆవీధి చివర— కొనఊపిరితో ఘడియో, క్షణమో యని పడియున్న మాతాశిశువులను చూచి ముందు నాకు భయంవేసింది; తరువాత జాలివేసింది! మృత్యువుతో పోరాడి ప్రాణములు విడచిన శిశువును చూస్తూ, నా నిస్సహాయతకు కుములుతూ నేనట్లా నిశ్చేష్టనై నిలుచున్నా. ఆమె శిశు వియోగబాధ భరింపజాలక వాని వెనుకనే వెళ్ళిపోయింది, కాని ఆమె ఆత్మ నాతో —

"ఈనాటికి నా సంసారయాతన మాని ఆత్మశాంతి పొంద బోతున్నాను. ఈబిడ్డడు క్షణిక కాలము ముందరే విగతజీవుడైనాడు.

"నాభర్త కోమటి గుమాస్తా పుద్యోగము చేసి నెలకు ఏబది రూపాయలు తెచ్చేవారు. నేను, నా యిద్దరుపిల్లలు, భర్త కలసి కలత లెరుగని కాపురం చేస్తుండే వాళ్ళము..... ఒక నాడు నాచిరస్నేహితురాలు నావద్దకు వచ్చి తనభర్త నిస్సహాయతను తెల్పుతూ బావురుమని యేడ్చింది. మనసు కరగి మాయింట యుండమని వారిరువురిని పోషించుటకు పూనుకున్నా. ఆమెభర్త క్రమక్రమముగా ఆరోగ్యవంతుడై తిరుగ నారంభించాడు. అప్పటి నుండే మేము అప్పుల వారికి గురియయ్యాము. మాకు కష్టమయినప్పటికీ తోటి సోదరి వ్యథ మాన్ప పూనుకున్నా. ఆమె భర్త పుద్యోగవంతుడై పుద్యోగమునప్రవేశించి ధనమార్జింప సాగాడు. ఆమె భర్తతో మరోయింటికి వెళ్ళిపోయారు. నాసంసారము నానాటికి క్రుంగి కృశించిపోతున్నది.

"ఇంతలో నాచిన్ని బిడ్డకు ఒళ్ళుమెరుగని జ్వరము వచ్చినది. మాఆయన రాత్రనక పగలనక మందులకు డాక్టర్ల వద్దకు తిరిగి తిరిగి ఇక ప్రయోజనములేక బిడ్డను మృత్యుదేవత కప్పగించాము. బిడ్డపోయినది మొదలు మాఆయన వంట్లో నిస్సత్తువ, నీరసము బయలుదేరి పెద్దదై విషజ్వరం క్రింద దింపింది. మందు లిప్పించుటకు నావద్ద చిల్లిగవ్వైనా లేదు. ఏమిచేయుటకు పాలుపోలేదు. సెట్టి వద్దకువెళ్ళి నా భర్త పనిలోనికి రానివైనము నెరిగిస్తూ కొంత ధనసహాయము చేయమని కాళ్ళ వేళ్ళ బ్రతిమాలేను. పనిచేస్తున్నంత సేపే జీతంతో సంబంధం కాని పనిలేక జీతా లెవరిస్తారు? మీ ఆయన లేకపోతే ఇంకోడొస్తాడని, నిర్దాక్షిణ్యముతో కసిరివేశాడు సెట్టి.

"ఇంతలో నా పాతస్నేహితురాలు స్మృతికొచ్చింది, ఆసోదరి యింటికి వెళ్ళి ఆమె సహాయాన్నర్థించాను. ఆమెకు నేనెవరో తెలియదట. మరొకరికి ధనమిచ్చి సహాయం చెయ్యడానికని ఆమెభర్త పనిచేయడము లేదనీ తనటువంటి పనికెన్నడు పూనుకొననని నిర్మొగమాటముగ చెప్పి వెనుదిరిగి పోయింది.

"ఎక్కడికి వెళ్ళినా..లేదు" అన్నమాటే. ఆవేళకదృష్టం లేదేమోయని చింతించి మనశ్శాంతి చేసుకొని యింటికి వెళ్ళాను. యింకేముంది ఆ వున్న ఒక్క పెద్దదీపము కాస్తా ఆరి పోయింది. ప్రక్కని నారెండేండ్ల పాపడు వీరంతా తన వారు కారన్నట్లు హాయిగా ఉయ్యాల్లోపడుకున్నాడు. నాలుగు రోజులు గడచినై. అప్పుల వాళ్ళంతా వచ్చి గడువులిచ్చి పోయారు.

"అన్ని గడువులన్నీ దాటాయి. అప్పులవాళ్ళ దుమారంతో అవమానకు నెట్టబడ్డాను. ఆత్మహత్యకు సిద్ధపడ్డాను. కాని పిల్లవాని ముద్దుమోము హృదయము అడ్డువచ్చింది. నేనుబ్రతికేది వానికోసమే అని అనిపించింది. ముష్టెత్తి పెంచుటకు సంసిద్ధురాలనైనాను.

"వీధులన్నీ తిరిగాను. ఎక్కడా పిడికెడు అన్నము పుట్టలేదు నాబిడ్డకు. అయిదు రోజులై అన్నాహారములు లేని ఆపసిబిడ్డకు ఈ యీదురుగాలికి వానతాకిడికి ఒళ్ళెరుగని జ్వరము వచ్చింది. ఈ వీధిచివర గోడవారి పడుకోబెట్టి నా చింకి బట్టను కప్పేను. ఆఖరుకు అమ్మా అని అరచి పరలోకగతుడయ్యాడు. అదేఆఖరి పిలుపు. నన్నిక అమ్మాఅని పిలిచే వారెవరు? అసలు నన్ను చూచేవారెవరు ఈలోకంలో

"ధనవంతులూ ధనవంతులకే, సంసారులూ ధనమదాంధులకే సహాయాలు, సత్కారణలు జరుపుతారు. దరిద్రులపై దయచూపి యిన్ని గంజినీళ్ళు పోసేవారులేరు యీ లోకంలో — రోడ్డుమీద నోరెత్తి అడుక్కుంటె నిద్రాభంగమని కసిరి కొట్టేవారు — వీరందరూ బీదలపాలిటి యమదూతలు — నరరూప రాక్షసులు.

"ఆదుఃఖముతోనూ ఈఆవేశముతోనూ నాకళేబరమును వదలి శాంతి పొందడానికిపోతున్నాను. నేనుశాంతించుటకు నాయీ దీనగాధను నలుగురికిచెప్పి పుణ్యం కట్టుకో"యని ఆపవిత్రజ్యోతి పల్కి అంధకారంలో లీనమై పోయింది. కాఫీటైముకు మెలుకువ వచ్చింది, మంచికలే! కలలో కూడా కష్టజీవుల ఆర్తనాదాలేనా అనుకొన్నా. —



మనం మన జీవిత ధ్యేయాల్ని సంపూర్ణంగా సాధించలేమేమో.... కాని వాటిని గురించిన ఆలోచన్లు మనలోని లోపాలను చూపిస్తూ ఒక విధంగా ఔన్నత్యాన్నందుకునేందుకు సహకరిస్తూనే వుంటాయి.

—టి. యస్. ఎడ్వర్డ్స్.



# పెద్ద వదిన

* * *

పెద్ద నాటిక

* * *

.... శ్రీమతి ఎ. రత్నమ్మ ....

(గత సంచిక తరువాయి.)

[జరిగిన కథ:—ఒక పుష్కరం గడిచినా, కన్నవాళ్ళని కళ్ళారా చూసే భాగ్యంలేక, ఉరుముల్లాంటి అత్తా-ఆడబడుచుల చేతుల్లో అష్టకష్టాలు పడుతూంది, అన్నపూర్ణ. ఆఖరికి ఆమెను చూట్టానికని తోబుట్టువులు లీలా-మనోహర్‌రావు వీరే ఆమె ఊరికి బయల్దేరి వెళ్ళారు. వెళ్ళినవారిని శాస్త్రి ఇంటివారంతా నానా విధంగా ఆడిపోసి, పశువుల్లా ప్రవర్తించారు.

అన్నపూర్ణ పుట్టింటి వూరినుంచి హైకోర్టు జడ్జి సుందరంగారు శాస్త్రి తమ్ముడు నరసింహానికి తన పిల్లను ఇవ్వాలన్న ఉద్దేశంతో, వస్తారు. ఆయనకి శాస్త్రి కుటుంబ చరిత్రంతా తెలియదు. వివాహ సంబంధం నిశ్చయమవుతుంది.

ఈలోగా—ఇంట్లో, శాస్త్రి, నరసింహం ఇద్దరూ లేని సమయం చూసి అన్నపూర్ణను చావ బాది పుట్టింటికి తరుమగొట్టారు, అత్తా-ఆవిడ ముద్దు కూతుళ్లూనూ!

అన్నపూర్ణ మరణించిందనే, పుక్కిటి ఉదంతాన్ని పుట్టించి నరసింహంపెళ్ళి జేయిస్తున్నారు. కాని పెళ్ళికి పీటలమీదే విఘ్నం వచ్చింది. కారణం అన్నపూర్ణ—వాళ్ళ తల్లీ తండ్రులు కూడా ఆ పెళ్ళికి వచ్చి వుండడంచేత! శాస్త్రికి తగినంత పరాభవమూ జరిగింది. ఆఖరికి అనేక విషయాలమీద అతనిచేత బాండు వ్రాయించుకుని, పెళ్ళి సెల్లాగో పూర్తిచేయించారు, అక్కడి పెద్దలు.

ఈ పరాభవానికంతటికీ మూలకారణం అన్నపూర్ణేనని అన్యాయంగా భావించి—ఆమె కాళ్ళ వద్దకి వచ్చి బ్రతిమిలాడుకన్నా, రోషంతో "నీకూ-నాకూ-యీ జన్మలో సంబంధం లేదని" అంటాడు, శాస్త్రి. ఇక చదవండి.]

## ఆఱవ దృశ్యం

సమయం: రాత్రి 10 గంటలు. అన్నపూర్ణ మంచం మీద పడుకొని వుంటుంది. తల్లి చెంచాతో పళ్ళరసం పోస్తూ వుంటుంది. తండ్రి, తమ్ముడు, చెల్లెళ్ళు కళ్ళ నీళ్ళు కారుస్తూ ఆమెప్రక్కనే కూర్చుంటారు.

అన్న:-(కళ్లుమూసుకొని) అమ్మా'పిల్ల లేరే. పసివాడు పాలు తాగాడా? వారు ఎక్కడికి వెళ్ళారే? పెద్దబ్బాయిని నాదగ్గర కొకసారి తీసికొనిరా: నాదగ్గర పడుకోపెట్టవే వాడిని.

శార:-అమ్మా...నీ భర్త యిప్పుడే వస్తాడమ్మా. నాతల్లి! ఈ కాస్తరసం తాగవూ. నీ పిల్లల గురించి, భర్తగురించి ఎంతమాత్రం విచారం వద్దు నీకు. శాంతంగా పడుకో. నాతల్లి గాదు.

లీల:-అన్నయ్యా- బావను రమ్మనమని యీరోజే టెలిగ్రాం యిచ్చాడమ్మా. వచ్చే ఎక్స్‌ప్రెస్‌లో దిగుతారు.




# అమృతాంజనము

గాని,

" యధాయధా..................కాశీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్త్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

మనో :-అక్కా! నీ మనస్సుకు పూర్తయిన విశ్రాంతి కావాలమ్మా. ఇప్పుడు లేనిపోని బెంగలు పెట్టుకొని మనస్సును పాడుచేసుకో కూడదమ్మా.

విశ్వ :-(దగ్గరగా కూర్చుని గడ్డం పట్టుకొని) నా తల్లివి కాదూ. ఏవిధమయిన విచారం లేకుండా కళ్ళుమూసుకొని పడుకో. పిల్లల్ని తీసికొని రమ్మని యీరోజే నీ భర్తకు టెలిగ్రాం యిస్తాను.

(ఇంతలో డాక్టరు వస్తాడు. రోగిదగ్గరగా ఉన్న కుర్చీమీద కూర్చుని రోగిని పరీక్ష చేస్తాడు.)

డాక్టరు :-విశ్వపతిగారూ. ఈ అమ్మాయికి శారీరకమయిన అస్వస్థత లేమీ కన్పించటం లేదు. ఊపిరితిత్తులు చాల శుభ్రంగా ఉన్నాయి. మానసిక వేదనవల్ల వచ్చిన జ్వరంగా కన్పిస్తోంది గాని వేరేమీ లేదు.

అన్న :-అమ్మా, పిల్లలు వారు ఎప్పుడొస్తారు ?

డా॥ :-ఏమిటండీ, యీ అమ్మాయి కుటుంబ సంబంధమయిన సమస్యలవల్ల మానసిక వేదనను అనుభవిస్తోందా ? భర్త సరిగా చూడటం లేదా ? పిల్లలంటున్న దేమిటి ? పిల్లలున్నారా యేమిటి... ఎంత మంది? ఎక్కడున్నారు?

విశ్వ :-(కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ) భర్త సరయిన వాడయితే మాకీ కర్మం ఎందుకు పడుతుంది. అయ్యా పండువంటి సంసారం. 4 గురు పిల్లలు. పెద్దవాడు 13 సం॥ల వాడు. రెండోది ఆడపిల్ల 10 సం॥లది. మూడోవాడు మగపిల్లవాడు 6 సం॥ల వాడు. నాలుగోవాడు మూడు నెలల పసిగుడ్డు. నా బిడ్డను నాయింటికి పంపి 13 సం॥లయినది. పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిన తరువాత మళ్ళీ యీ పిల్లను మా యింటికి పంపలేదు. నా తల్లి అప్పటినుంచి అష్టకష్టాలు పడింది. ఒక మాసంక్రిందట అత్త ఆడబడుచు చావబాది వెళ్ళగొట్టారు. చేసేది లేక యిక్కడికి కొచ్చింది. నా బిడ్డ నాకు భారమవదు కానీయండి. కాని సంసారం అల్లరిపాలయిందే అనే విచారం మమ్మల్ని క్రుంగ తీస్తోంది. అదీగాక బిడ్డలకు, భర్తకు దూరమయిన నా బిడ్డ యేమి బ్రతుకుతుందో నాకేమీ అర్థంకావటం లేదు.

డా॥ :-భర్తకేమయినా దురలవాట్లున్నాయా ? ఏమైనా చదువుకున్న వాడేనా ?

శార :-ప్లీడరండి. సంపాదనకూడా బాగానే యుంది. మహాబుద్ధిమంతుడు. కనీసం సిగరెట్టయినా త్రాగడు. తెలివిగలవాడు. చదువుకున్న వాడు. బుద్ధిమంతుడనే పిల్లనిచ్చి చేసాగాని కర్మం యిలా కాలుతుందనుకోలేదు.

డా॥ :-తల్లి చెల్లెళ్ళ మాటలకు లోబడి విద్యావంతుడయిన వాడు భార్యనిలా యేడిపించడ మేమిటండీ ?

లీల :-ఇవన్నీ విద్యావంతులయిన పురుషుల లక్షణములు లెండి.

డా॥ :-పిచ్చిదానా, అందరూ అలా వుంటారా తల్లీ. సరే; తక్షణం పిల్లలను తీసికొని బయలుదేరి రమ్మని మీ అల్లుడికి టెలిగ్రాం యివ్వండి. ఈ అమ్మాయికి వేరే జబ్బేమిలేదు. వాళ్ళను చూస్తే యిప్పుడే లేచి తిరుగుతుంది. అప్పటికి రాకపోతే వేరేమార్గం ఆలోచిద్దాం. ఈ మాత్రలు రెండు వేయండి. మంచి నిద్ర పడుతుంది. ఆహారం మాత్రం వెంట వెంట చాల జాగ్రత్తగా యివ్వండి. మూడు నెలలయినా నిండని పచ్చి బాలింతరాలు. ఆహారం వేళకు యివ్వటంలో లోటు జరుగుతే నీరసం రావొచ్చు.

మనో :-ఇంజక్షన్ యివ్వనక్కర లేదండి.

డా॥ :-ఈ మందు రాసిస్తున్నాను. ప్రస్తుతం 4 యింజక్షను కొనుక్కోనిరా, నేను మళ్ళీ సాయంత్రము వచ్చి చూస్తాను. నీ చదువెలా వున్నది. బాగా చదువుచున్నావా ?

మనో :-ఆ. ఆ.

(డాక్టరు వెళ్ళిపోతాడు. లీల రెండు మాత్రలు రోగికి వేసి, విసురుతూ వుంటుంది.)

## ఏడవ దృశ్యం

సమయం : ఉదయం 10 గంటలు. దంతపు చెక్కామంచముపై పరచిన పరుపుమీద శాస్త్రి పడుకొని వుంటాడు. జ్వరంతో బాధపడుతూ వుంటాడు. ప్రక్కనున్న కుర్చీపై గంగాయమ్మ కూర్చుని విసురుతూ వుంటుంది. పిల్లలు, ముగ్గురు చెల్లెళ్ళు ప్రక్కగా వున్న మంచంమీద

విచారవదనంతో కూర్చుని వుంటారు. పసిపిల్ల ప్రక్కనున్న ఉయ్యాలలో అమాయకంగా నిద్రిస్తూ వుంటుంది).

గంగా :–నాయినా, ఎలా వుంది తండ్రీ యిప్పుడు వంట్లో. జ్వరవేదన ఏమయినా తగ్గిందా తండ్రీ.

విమల :–పెద్దన్నయ్యా, మందు త్రాగుతావా ?

శాస్త్రి :–పసివాడే దమ్మా. వాణ్ణి నాదగ్గర కొకసారి తీసికొనిరా అమ్మా. తల్లి లేని పిల్లవాడికి దేవుడే దిక్కు.

గంగా :–వాడి బెంగొద్దురా నీకు. వాడికిప్పుడే మొచ్చింది. ఇంతమంది వుంటే వాడి పోషణ కేమీ లోటులేదు. తల్లి మాత్రం యింతకంటే ఎక్కువగా చేస్తుందా యేమిటి. చిన్నమ్మాయి నిద్రాహారాలు మాని వాడి సేవలో నిమగ్నురాలైంది.

కమల :–అన్నయ్యా, యే ఆలోచన లేకుండా పడుకో.

శాస్త్రి :–అలా కాదమ్మా, తల్లిలేని పసిపిల్లల్ని పెంచటం భగవంతుడి తరంకూడా కాదు. ఎన్ని మాటలనుకున్నా, ఎన్ని పోట్లాటలు పోట్లాడుకున్నా పిల్లలు తల్లి ఒక చోట వున్నపుడు వాళ్ళ బాధ్యత నాకేమాత్రం ఉండేది కాదు. ఇప్పుడు చూడు: పిల్లలు బక్క మొహాలు వేసుకొని ఎప్పుడూ ఎలా విచారంగా కనిపిస్తారో. మీరు వాళ్ళకు లోపం చేస్తారని కాదమ్మా. ఎంతయినా మనం తల్లి తరువాతనే. పిల్లలంతా తల్లి గురించి బెంగ పెట్టుకొన్నారు. అబ్బా, అమ్మా...తలనొప్పి. కాళ్ళ నొప్పులుభరించలేనమ్మా. అమ్మాయీ, కాసేపు కాళ్ళు పట్టమ్మా. నేనీ బాధ భరించలేను.

విమ :–ఏమి కాళ్ళ నొప్పులన్నయ్యా. రాత్రింబవళ్లు పట్టినా నీకీ నొప్పులు పోవు. (విసుక్కొంటుంది.)

శాస్త్రి :–(తనలో) నాకు తలనొప్పి వస్తే అదెప్పుడన్నా యిలా విసుక్కొందా. తండ్రిలేని పిల్లల్ని ఎంతో గారాబంగా పెంచి, వారు ఆడిందే ఆట, పాడిందే పాటగా చేస్తే: యీనాడు నాకు ప్రాణంపోయే స్థితిలో ఉపచారం చెయ్యటం వీరందరికి కష్టంగావుంది. ఇదంతా నా కర్మ. కాకపోతే దాన్ని వెళ్ళగొట్టట మేమిటి ?

(ప్రకాశంగా) వద్దులే అమ్మా. ఏదో బాధ భరించలేక అడిగినాను. (కళ్ళనీళ్ళు కార్చును).

గంగా :–అయ్యో అదేమిటి నాయినా! నేనుండగా నీకేమీ ఫరవాలేదు. పిచ్చివాడా! యీ మాత్రానికి యేడవట మెందుకు (కాళ్ళుపట్టును).

(ఇంతలో నృసింహం, డాక్టరు సుందరరావుతో ప్రవేశిస్తాడు. డాక్టరు రోగియొక్క ప్రతి అవయవాన్ని జాగ్రత్తగా పరీక్షిస్తాడు.

డా॥ :–ఏమోయి నృసింహం, కేసు చాలా ప్రమాదం.

నర :–డాక్టరుగారు! ఎన్ని వేలయినా సరే క్రుమ్మరిస్తాం. అన్నయ్యను బ్రతికించే భారం మీది.

డా॥ :–నా చేతనయినంత ప్రయత్నం చేస్తాను. కడుపులో వున్న పుండు ఆపరేషన్ చెయ్యాలి. ఆ పుండు తగ్గితే గాని, జ్వరం తగ్గదు. కాని రోగి చాలా బలహీనంగా వున్నాడు. రక్తం చాలా తక్కువగా వుంది. కాబట్టి చిన్న వాళ్ళ రక్తమెవరిదైనా రోగి శరీరంలోకి ట్యూబు ద్వారా ఎక్కించాలి.

గంగా :–అయ్యా ! నారక్తం తీసికొని నా కొడుకును బ్రతికించండి. నాకు పుత్రభిక్ష పెట్టండి బాబూ. (అని ఏడుస్తుంది.)

డా॥ :–మీ రక్తం పనికిరాదమ్మా. ఆయన చెల్లెళ్ళు గాని, తమ్ముడుగాని రక్తాన్నిస్తే పనికి వస్తుంది. చిన్నవాళ్ళ రక్తమే కావాలి. కాని ఎవరైతే రక్తానిస్తారో వారి ప్రాణంకూడా ఒక్కొక్కప్పుడు పోవచ్చు. అంటే రక్తానిచ్చేవారు తమ ప్రాణాన్ని ధారపోయటమన్న మాట.

గంగా :–నా కూతుళ్ళిస్తారులెండి.

కమల :–బాగానే వుంది. ఆయన ప్రాణంకోసం మా ప్రాణం పోగొట్టుకోమంటావా యేమిటి ?

విమ :–(మూతి విరిచి) సరే. ఇదా నీ తీర్పు. 100 ఏళ్ళు బతకాల్సిన వాళ్ళను యీరోజే చావమంటోంది. అంత ప్రేమగల దానివయితే నీవే యివ్వు. లేకపోతే పెద్ద వదినను రమ్మను.

డా॥ :-అంత వ్యవధి లేదమ్మా. రోగి చాలా ప్రమాదస్థితిలో వున్నాడు. ఇప్పటికే చాలాకాలం మించింది. రోగిని చూచారూ. స్పృహలేకుండా పడిపోయారు. మనం మాట్లాడే మాటలన్నీ అతను వింటే చాల కష్టం. అవతల మాట్లాడండి.

(ఇంతలో జట్కాబండి వాకిట్లోకి ఆగుతుంది. బండిలోంచి మనోహర్, అన్నపూర్ణ దిగి ప్రవేశిస్తారు).

అన్న :-(పరిస్థితి గ్రహించి) డాక్టరుగారూ! నాభర్త బ్రతుకుతారా ? నాకు పతిభిక్ష పెట్టండి.

డా॥ :-చాల ప్రమాదంలో వున్నాడమ్మా. చిన్నవాళ్ళ రక్తం కావాలి. కాని రక్తం యిచ్చినవాళ్ళ ప్రాణం కూడా ఒక్కొక్కప్పుడు పోవచ్చు.

అన్న :-డాక్టరుగారు, మీకు ఎంత కావాలంటే అంత నా రక్తం తీసికొండి. నా భర్తను బ్రతికించండి.

(డాక్టరు ఆశ్చర్యంతో ఆమెవైపు చూస్తాడు. కావలసిన రక్తాన్ని తీసికొంటాడు. అన్నపూర్ణను రోగి మంచం ప్రక్కని పడుకో పెడతారు. 10 ని॥ల తర్వాత శాస్త్రి తన ప్రక్కనున్న భార్యను చూస్తాడు)

శాస్త్రి :-అన్నపూర్ణ! నన్ను క్షమించు. నీ విషయంలో చాల ద్రోహం చేసాను. చెల్లెళ్ళ ప్రేమను యీరోజు అర్థం చేసుకోగలిగాను. ఈ పాపికి నీ ప్రాణం ధార పోయటానికెందుకు సమకట్టావు. (నీరసంగా అంటాడు. అప్రయత్నంగా కన్నీరు కారుతుంది.)

అన్న :-ఇదంతా విధిఫలం. గతాన్ని గూర్చి విచారించకండి. మీరే నన్ను క్షమించాలి. శాంతంగా పడుకోండి.

గంగా :-నా అన్నపూర్ణ తల్లి యింత గొప్పదనుకోలేదు. పేరుకు తగినది. కూతురులాగ చూడవలసినదాన్ని అనేక కష్టాల పాలు చేశాను.

కమ :-వదినను కష్టాలు పెట్టటం నాకు యిష్టం లేకపోయినా మీరేమైనా అంటారని అనేక మాటలన్నాను.

విమల :-ఇంకేమి...మీరంతా ఒకటి...ఎటు తిరిగి యీ బోడిముండే ఎవరికి కానిది. (అని పగలేడ్పులు పేసుకుంటూ విసవిస లోపలికి పోతుంది.)...

(సమాప్తం)

★

# ...ద్యో...

* శ్రీమతి బులుసు సుభద్రమ్మ *

అదిగదిగోనమ్మా ఆకాశం!
ఇదిగిదిగోనమ్మా ఆకాశం!
సౌందర్యాకాశం!
అందని ఆకాశం!

చూడమ్మా ! చెల్లీ ! ఆ మిన్ను!
విప్పమ్మా! తల్లీ ! నీకన్ను!
కనిపిస్తోందామ్మా ! ఆకాశం?
వేచిఉంది రామ్మా! నీకోసం!

వెళ్లగలవా చెల్లీ! మింటికి
కనిపిస్తోందా తల్లీ! కంటికి!
దాని దూరమెంతో? వింటివా ?
వెళ్లగలవా చెల్లీ ! ఒంటిగా!
అవుపిస్తోందా చెల్లీ! ద్యోమార్గం ?
మవ్వెటనుండి వెళ్తే! అదే మార్గం!

ఉందంటావా ఒక దుర్గంలా?
భయపడకమ్మా! తల్లీ, దుర్గా!

సాయమెందుకు చెల్లీ, నింగికి?
చంద్రుడు చూస్తున్నాడమ్మా, తొంగి !
నీరాకకై! చూస్తున్నాడమ్మా జాబిల్లి !
త్వరగా బయల్దేరవమ్మా, నాచెల్లీ!

సోదరీ ! వెళ్లగలవా ! దివిపైకి!
బెదరిపోకమ్మా ! చెల్లీ ! దివిపైనే!
నీకు సహాయం కావాలంటావామ్మా ?
అదిగోనమ్మా, నీకోసం చూస్తున్నాయ్
ఆకాశంలో విహరించే విహంగాలు!
గహనం వంటి ఆకాశంలో
విహంగంపై విహరించవమ్మా!
ద్యోగమనం సాగించవమ్మా!

★

# అదృష్టం

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

జగల్పూరు పట్టణంలో సేఠ్ విమల్‌దాసు వాణిజ్యసంస్థ రజతోత్సవం వైభవంగా జరుగుతూంది. రజతోత్సవానికి వచ్చిన షాహుకార్లకి, అధికార్లకి, విమల్‌దాసు స్వయంగా మర్యాదలు చేస్తున్నాడు. వాణిజ్యసంస్థ రజతోత్సవానికి ఎంతోమంది వస్తున్నారు; వెడుతున్నారు. విమల్‌దాసుకి ఆ కార్యక్రమం కారణంగా తీరిక లేకపోతూంది. శక్తి కొద్దీ బీదలందరికీ అన్నదానం, వస్త్రదానం జరిపాడు. ఆప్తమిత్రులకీ, అధికార్లకీ, గౌరవనీయంగా విందులు జరిపించాడు. ఉత్సవం అంత వైభవంగా జరుగుతుందనుకోలేదు, విమల్‌దాసు. విమల్‌దాసు వ్యాపారాన్ని, అదృష్టాన్ని, ఎవరికి తోచినట్టు వాళ్ళు అభినందిస్తూ, తమ తమ ఇళ్ళకు చేరుకున్నారు.

చలికాలం. సాయంత్రమైంది. ఉన్నిశాలువ కప్పుకున్న సేఠ్ విమలదాసు చలికి వణుకుతూ ఉన్నాడు. రజతోత్సవ కార్యక్రమం ముగియవచ్చింది. సేవకులను, గుమాస్తాలను పని పూర్తిచేసికోమని చెప్పి సేఠ్ తిన్నగా, కారుమీద ఇంటికి వెళ్ళిపోయాడు.

విమలదాసు ఉంటోన్నది విశాలమైన భవనం— ఎత్తుగా మేడల అంతస్థులు అవుపిస్తాయి. గదులనిండా విద్యుద్దీపాలు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాయి. ఎక్కడచూచినా సోఫాలు. మెత్తని దిండ్లు. పట్టుపరుపులు. ఇవి చూస్తే సేఠ్ సంపన్నత కళ్ళకు కట్టినట్లు అవుపిస్తుంది. సేఠ్ సోఫామీద కూర్చున్నాడు— పది నిముషాలైనా, తన భార్య శాంతిప్రియ తనవద్దకు రాలేదు. అలసిపోయిన కళ్ళు బరువుగా వాటంతట అవే మూతలు పడుతున్నాయి. రజతోత్సవ కార్యక్రమంవల్ల విమలదాసు అలసి కొంచెం నీరసంగా ఉన్నాడు. సేవకుడు మధుని పిలిచి:''అమ్మగారేది?'' అని అడిగాడు— "సినీమాకు వెళ్ళారు బాబూ !" అంటూ మధు వెండిగ్లాసుతో నిండుగా కాఫీ పానీయాన్ని సేఠ్‌కి అందిచ్చి వెళ్ళిపోయాడు.

విమలదాసుకి పాలుపోవడంలేదు. ఏవో ఆలోచనలతో తల బరువెక్కుతూంది. సేఠ్ ఎంత సరదాపడినా శాంతిప్రియ రజతోత్సవ కార్యక్రమానికి రాలేదేమా అని ఆలోచిస్తున్నాడు. అంతులేని ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుంటున్న విమలదాసు సమస్యకు సరియైన సమాధానం దొరకలేదు. ఊలు వాణిజ్యంలో తను ఆర్జిస్తున్న లాభాలు ఒక్కడూ ఏంచేసికొంటాడు. తనకు దగ్గరబంధువులూ లేరు. పిల్లలూ లేరు. ఇదంతా శాంతిప్రియ హాయిగా ఎందుకు అనుభవించకూడదు? అరచేతిలో ఉన్న ఆనందాన్ని, సౌఖ్యాన్ని శాంతిప్రియ ఎందుకు తృణీకరిస్తూంది?. సేఠ్ విమలదాసు సమస్యలకు సమాధానం లేదు: సేఠ్ సంపాదిస్తున్నది ఎవరికోసం?. శాంతిప్రియ కోసమే !. సందేహంలేదు !. కాని ఆమె తన సంపాదనను ఎందుకు నిరాకరిస్తూంది? ఎందుకు సేఠ్‌ని అసహ్యించుకుంటూందో?. కారణం తనకు తెలియకుండా ఉంది.

విమలదాసు శూన్యంలోకి చూశాడు. ఆకాశమార్గంలో నల్లమేఘాల బారినుండి తప్పించుకొని దూరంగా పారిపోతూంది చంద్రబింబం.

సేఠ్ విమలదాసు మొదట్లో సంపన్నుడుకాడు. అతడు జగల్పూరుపట్టణం చేరుకునేప్పుడు అతనివద్ద కొద్ది పైకం మాత్రమే ఉంది. ఆ పైకంతోనే నూలు వ్యాపారం చేశాడు. ఇంతలో యుద్ధం వచ్చింది. సేఠ్‌కి వ్యాపారంలో లాభాలు బాగా వచ్చాయి. క్రమంగా ఊలు. ఉన్ని వ్యాపారం వల్ల లక్షలు పైకం వచ్చింది. సేఠ్ యుద్ధనిధికి ఎన్నివేలు విరాళంగా ఇచ్చాడు !. చూస్తుండగానే పాతిక సంవత్సరాలలోనే సేఠ్ విమలదాసు గొప్ప సంపన్నుడయ్యాడు. జగల్పూరులో విమలదాసు వాణిజ్యసంస్థ చాలాపెద్దది !. ఆ ఊరులో అతనిపట్ల అందరికీ గౌరవం ఉంది. ఆనాడు రజతోత్సవానికి ఎంతోమంది హాజరయ్యారు.

సేఠ్ తన సంపన్నతకూ, తన గౌరవానికీ ఎన్నడూ

గర్వపడలేదు. తనకు సంపద ప్రాప్తించడానికి శాంతి ప్రియ సౌభాగ్యరేఖలే కారణమని విమలదాసు నమ్మకం. తనూ, శాంతిప్రియా ప్రేమించుకొనే పెండ్లి చేసికొన్నారు. కొన్నాళ్ళు సుఖంగా దాంపత్య జీవనం చేసారు. కాని ఇప్పుడు శాంతిప్రియలో ఏదో మార్పు వచ్చింది. గడచి పోయిన మధుర స్మృతులలో ఆనందాన్ని అనుభవిస్తూ సేఠ్ ఒక్కడూ నిశ్చలంగా కూర్చున్నాడు. శాంతిప్రియ కోసం తాను సర్వస్వం త్యాగం చేసేందుకు సంసిద్ధుడే- కాని తనకు శాంతిప్రియ ప్రేమదానం చేస్తుందా?........

హఠాత్తుగా విమలదాసుకి ఒక సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఒకనాడు పనిమీద సేఠ్ మెయిలులో బొంబై వెళుతూండగా, ఎవడో త్రికాలవేది, సేఠ్ హస్తసాముద్రికంచూసి- "సేఠ్ జీ ! మీ అరచేతి గీతలలో అదృష్టం ఉం"దన్నాడు.

ధనరాసులు గడించి నిల్వచేయడం ఒక అదృష్టమేనా అనిపించింది సేఠ్‌కు. అదృష్టం అంటే డబ్బు ఉండడమా? ప్రేమించి పెండ్లిచేసికొన్న శాంతిప్రియ తనతో చనువుగా సంచరించకపోయినప్పుడు తనకూ, అదృష్టానికీ ఏం సంబంధం ఉంది?- విమలదాసు విషమ సమస్యలో చిక్కుకున్నాడు——

"బాబూ ! భోజనానికి లెండి" అని కేకవేసిన వంటవాడు విమలదాసు ఆలోచనలకి అంతరాయం కలిగించాడు- సేఠ్ 'ఉహూ !' అని తలవూపి అక్కడి నుండి లేచి తిన్నగా మేడ ఎక్కాడు-

రాత్రి ఎనిమిది గంటలయింది- పడుకొందామనుకున్నాడు- కాని నిద్రరావడంలేదు- బలంగా కళ్ళుమూసికొన్నా కళ్ళకెదురుగా ఏవో దృశ్యాలు అవుపిస్తున్నై- రజతోత్సవ సందర్భంలో జరిగిన అన్నదానానికి ఎంతమంది బీదలు వచ్చారు !- పాపం ! వాళ్ళకి ఎంతటి కృతజ్ఞత ఉంది ! చలికాలమైనా కప్పుకొనే ఆధారంలేక వాళ్ళు ఎంతబాధ పడుతున్నారో? విమలదాసు జాలిగుండె కలవాడు....మర్నాడు ఇంకా బీదలకి వస్త్రదానం చేయాలని నిశ్చయించుకున్నాడు.

విమలదాసుకి కావలసినంత ధనం ఉంది ! అదంతా ఎవరు అనుభవించి ఆనందించాలి? కాబట్టి కష్టపడి చెమటూడ్చే బీదసాదలకి ఆ ధనం దానం చేస్తే తన మనస్సు తృప్తి పడుతుందేమో !

విమలదాసుకి బీదలసంగతి ఇంతకుముందు తెలియదు- తెలిసిఉంటే యుద్ధానికి విరాళాలు ఇచ్చినట్లు బీదలకూ విరాళాలు ఇచ్చేవాడు. "పాపం ! బీదలు...." అంటూ పక్కమీంచి లేచాడు——

విమలదాసుకు తన పరిస్థితి అంతా అయోమయంగా కనుపించింది. ఆశతో శాంతిప్రియకోసం ఎదురుచూస్తున్నాడు. తనూ, శాంతిప్రియా కలిసి సుఖంగా జీవించే రోజులు తిరిగి వస్తాయా? తన గుమాస్తా జీవనదాసూ, అతని భార్య భైరవీ ఎంతసుఖమైన దాంపత్య జీవనం గడుపుతున్నారు. జీవనదాసుకి ధనరాసులు లేవు. కాని- విమలదాసు దృష్టిలో జీవనదాసు నిజమైన అదృష్టవంతుడు.

విమలదాసు శాంతిప్రియను ఎక్కువగా ప్రేమించాడు- శాంతిప్రియకూడా భర్తతో ఎంతో అనుకూలమైన జీవనం సాగించింది- కాని ఇప్పుడు విమలదాసుకి దాంపత్య సౌఖ్యం కలలలోకంలోనే అగుపిస్తుంది- తాను కట్టుకొన్న ఆశలమేడ అంతస్థులు ఒకటొకటే కూలిపోతున్నాయి.

విమలదాసు పరున్న గది నిశ్శబ్దంగా ఉంది. శాంతిప్రియ ప్రవర్తనను గురించి అదేపనిగా ఆలోచిస్తున్న విమలదాసువద్దకు, సేవకుడు వచ్చి "బాబూ ! అమ్మగారు బొంబై వెళ్ళారు- ఈ సంగతి తమతో మనవి చేయమన్నారు" అంటూ వెళ్ళిపోయాడు.

చల్లని గాలిరివట గదిలోకి వచ్చి, విమలదాసు కప్పుకొన్న ఉన్నిశాలువ వెచ్చదనాన్ని సవాలు చేసింది. అతని మనస్సూ, శరీరమూ చలికి కొద్దిగా చలించినాయి. తనకు అన్నివైపులా నిరుత్సాహం కనిపిస్తూంది. తనకు అనువైన ధర్మపత్ని ఇట్లా మారినందుకు అతని హృదయం గాయపడింది. కారణంలేని పరిణామం అనుకొంటూ మెల్లిగా లేచి రేడియో మీట త్రిప్పాడు.

# అదృష్టం

పాట: అరచేతిగీతలో అదృష్టమేముంది?
కన్నీటిలోకాల కారు చీకట్లలో
మలినరేఖలు నీవు తొలగించలేవోయి-
గాలిలోగల తీవమారిపోతుందోయి-

విమలదాసు కళ్ళు చెమ్మగిల్లాయి— తల వంచుకుని నిట్టూర్పు విడిచాడు. చలిగాలి రివ్వుమని వీచింది. విమలదాసు 'అదృష్టం' అని గొణుక్కుని, అరచేతి గీతలకేసి ఒక్కమారు చూసికొన్నాడు.

విమలదాసు మనస్సు సమాధానంచేసికొన్నాడు- మనకూ అదృష్టానికీ సంబంధం లేదు. తనకు సంతానం లేకపోవడం ఒక గొప్ప లోపం. అందుచేతనే శాంతిప్రియకూడా నిరుత్సాహంగా జీవయాత్ర సాగిస్తూంది. కాని కాలం ఖర్మం కలిసి రానప్పుడు తను విచారించి మాత్రం ఏం లాభం?

విమలదాసు కళ్ళవెంబడి రెండు అశ్రువులు రాలినై. ఆకాశంలో నల్లమేఘాలు దట్టంగా ఉన్నై. చంద్రబింబం మేఘాలకి దూరంగా, బాగా దూరంగా, వెళ్ళిపోతూంది.

(ఒక హిందీ రచన ఆధారం)



# తెలుగులిపి సంస్కరణ

శ్రీ చదలవాడ "ధర్‌మరాజు సిద్‌ధాంతి"

[తెలుగులిపిని సంస్కరించి, తెలుగు టైపుల సంఖ్య తగ్గించి, తెలుగు కేసును కుదించవలసిన ఆవసరం ఎంతైనావుంది. ఆవిధమైన లిపిసంస్కరణ మన భాషావ్యాప్తికి ఎంతో వుపకరించగలదు. భాషాభిమానులందరూ ఈ విషయమై శ్రద్ధగా ఆలోచించి, సాధ్యమైనంత త్వరలో ఆ మార్పులు తీసుకురావడానికి ప్రయత్నించాలి.

ఈ సందర్భంలో, ఆంధ్ర మహిళ 8 వ జన్మదిన సంచికలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు రచించిన వ్యాసాన్ని పాఠకులకు జ్ఞాపకం చేస్తున్నాం.

పాఠకులూ, తెలుగు లిపియందు శ్రద్ధకలవారూ, ఎప్పటికప్పుడు సాదరంతో పంపే సూచనల్ని, సలహాల్ని "ఆంధ్ర మహిళ" తప్పకుండా ప్రచురిస్తూ భాషామతల్లికి తన ఉడుత కైంకర్యాన్ని ఉత్సాహంతో నిర్వహిస్తుంది. — సం॥]

ఆంధ్ర మహిళ 8-వ జన్మదిన సంచిక (1952 మే) లో తెలుఁగులిపి సంస్కరణని గూర్చి మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిన వ్యాసం చదవడంతోనే నా అభిప్రాయాలు తెలియఁజేయాలని సంకల్పం కలిగింది. టైపురైటరులో ఇమడ్చడానికి లినోటైపు యంత్రంలో ఇమడ్చడానికి ఛందోవిరుద్ధము కాకుండ ఈ క్రింద ఉదహరించిన విధంగా తెలుఁగులిపిని సంస్కరింపవచ్చును. వ్యాకరణం సంధిపరిచ్ఛేదంలో ఒకటి, రెండు కొత్తనియమాలు సృష్టించవలసివస్తుంది.

సర్వేశ్వరుఁడు — సర్‌వేశ్‌వరుఁడు
ఈశ్వరుఁడు — ఈశ్‌వరుఁడు
విష్వక్సేనుఁడు — విష్‌వక్‌సేనుఁడు
న్యాయము — న్‌యాయము
స్థిరము — స్‌థిరము
ధ్యానము — ధ్‌యానము
యుధిష్ఠిరుఁడు — యుధిష్‌ఠిరుఁడు
జార్జి — జార్‌జి
మార్చి — మార్‌చి
ప్రత్యక్షము — ప్రత్‌యక్‌షము
ప్రక్షిప్తము — ప్రక్‌షిప్‌తము
ధర్మము — ధర్‌మము
స్వప్రయోజనము — స్‌వప్రయోజనము
జ్యోతి — జ్‌యోతి
సంస్కృతము — సంస్‌కృతము

# మన ప్రపంచం

* శ్రీమతి కె. సుగుణమణి *

మన ప్రపంచం ఎంత పెద్దది? మన భూమి ఎంతుంది? భూమికి సముద్రానికి అంతు ఉందా? మనం ఈ ప్రపంచంలో ఏమూలనున్నాం? ఇలాంటి విషయాలు తెలుసుకోవాలని అందరికీ సర్దాగా ఉంటుంది.

కొందరు జనులు ఒకచోట కాపురం ఉంటే దాన్ని గ్రామం అన్నారు పెద్దలు. ఇంకా ఎక్కువమంది ఉంటే పట్టణం అంటాం. కొన్ని ఊళ్ళు, పట్టణాలు కలిసి ఆ ప్రదేశాన్నంతా ఒక తాలూకా అని పేరెట్టేరు. కొన్ని తాలూకాలు కలిస్తే జిల్లా అవుతుంది. కొన్ని జిల్లాలు కలిస్తే ఒక రాజధాని అవుతుంది. (మనం ఉండేది చెన్న రాజధాని అంటారు. దీని విస్తీర్ణం లక్ష ముప్ఫైనాలుగువేల చదురపు మైళ్ళు. దీంట్లో 25 జిల్లాలు, 330 పట్టణాలు, 44 వేల ఐదువందలతొమ్మిది గ్రామాలు ఉన్నాయి. మొత్తం సుమారు 5½ కోట్ల జనులున్నారు.) ఇలాంటి రాజధానులు కొన్ని కలిస్తే ఒక దేశం అవుతుంది. (ఉదా॥ మన హిందూదేశం. దాంట్లో 11 రాజధానులున్నాయి. మనదేశం తూర్పునుంచి పడమరకు చూచినా, ఉత్తరాన్నుంచి దక్షిణానికి చూచినా సుమారు 2 వేల మైళ్ళు. విస్తీర్ణం, 18 లక్షల చదురపు మైళ్ళు. దేశం జనసంఖ్య దాదాపు 40 కోట్లు. ఇది మొత్తం ప్రపంచ జనసంఖ్యలో ఐదోవంతు. ఇలాంటి దేశాలు కొన్ని కలిపి ఒక ఖండం అన్నారు. మనది ఆసియా ఖండం. మన భూమి అంతా ఇలాంటి ఖండాలు 5 ఖండాలుగా పేర్లుపెట్టేరు. ఈ ఖండాలని విడదీస్తూ 5 మహాసముద్రాలు ఉన్నాయి. ఇవన్నీ కలిసి 19½ కోట్ల చతురపు మైళ్ళ విస్తీర్ణం. దీంట్లో 3 వంతులు సముద్రాలే. రెండు వంతులే భూమి. ఐతే ఎంత వుంది ఈ భూగోళం? అంటారేమో.

"పుట్టెడు ధాన్యం అంటే ఎంత?" అని అడిగిన అమ్మాయికి, కుంచం చూపించి "దీంతో 200 కుంచాలు కొలిచి, రాశివేస్తే ఎంత ఉంటుందో అంత'' అని చెపితే కొంత అర్థమవుతుంది. ఆలాగే, మన భూగోళాన్ని మనకు తెలిసిన వస్తువుతో పోల్చి చూచుకోవాలి. నిమ్మకాయంత సలిమిడి ముద్ద ఉందనుకోండి. అలాంటి ముద్దలు 126 వేల కోట్ల కోట్ల కోట్లు (126 అంకె తర్వాత 24 సున్నలు చేర్చండి) అన్ని ఉండలు కలిపి ఒక పెద్ద ఉండచేస్తే మన భూగోళం అంత అవుతుంది. "గోళం గోళం అంటున్నావు, మాట మాటకీ; గోళమంటే గోళీకాయలాగ గుండ్రంగా ఉందేమిటమ్మా- భూమి" అని అడుగుతారేమో. గోళీకాయలాగే ఉందని చెప్పాలి- ఉత్తర దక్షిణాల్లో కొద్దిగా అదిమినట్టు ఉన్నప్పటికినీ, భూగోళం గుండ్రంగా ఉండబట్టే- విమానాల్లోను, ఓడల్లోను ఎక్కి- చుట్టూ తిరిగిరాటానికి వీలవుతున్నది. భూగోళం చుట్టూ తిరగాలంటే 24 వేల మైళ్ళు. అంటే, నిమ్మపండుని పైనుంచి క్రిందికి అడ్డంగా కోస్తే దాని అడ్డుకొలత 8 వేల మైళ్ళు ఉంటుంది. ఆ రెండు చెక్కల్ని పక్కలకు విడదీసి, కోసిన వైపులు ఈ కాగితంమీద బోర్లించేమనుకుంటే, రెండువైపుల పైభాగాలు మనకు కనపడతాయి. ఐతే ఎంతో ఎత్తైన పర్వతాలు, మిట్ట పల్లాలు ఉన్నాయిగదా, భూమిమీద, ఇలాగ నున్నగా ఉందా? అంటారేమో. ఈ ఎత్తు పల్లాలు బ్రహ్మాండమైన భూగోళం మీద కనబడవు. నిమ్మకాయ చెక్కమీద, చిన్న చీమలాగైనా కనపడవు. భూమిమీద మహా ఎత్తైన హిమాలయాపర్వతాలుకూడాను. భూగోళంలో 5ఖండాలు, 5మహాసముద్రాలు కనబడతాయి. మొదటి ఖండంలో మన హిందూదేశం అంటే యిప్పుడు మనం భూగోళంలో ఎక్కడ నున్నామో కొంచం అర్థమవుతుంది. ఇలాగుంది మనం ఉండే భూగోళం తంతు. ప్రపంచంలో ఎన్ని ఇసుకరేణువులున్నాయో చెప్పగలరా? ఆ రేణువుల్లో ఒకే రేణువులాగుంది మన భూగోళమంతాను- బ్రహ్మాండమైన ప్రపంచంలో ఒక మారుమూల.

ఈ భూగోళాన్ని విడిచి 2 లక్షల ముప్ఫైతొమ్మిదివేల మైళ్ళు ప్రదేశంలో ప్రయాణం చేసి వెళ్ళేమంటే చంద్రగోళం చేరుకుంటాం. ఇదీ గోళమే. నిమ్మకాయ అడ్డుకొలత

లాగ చూస్తే దాని అడ్డుకొలత రెండువేల మైళ్లు. అంటే, భూగోళం, చంద్రగోళం కన్నా సుమారు 64 రెట్లు పెద్ద దన్నమాట. ఇక్కడ- ఇక్కడేగాదు, ఈ మహా ప్రపంచంలో మరెక్కడాకూడా- మన భూమిమీదలాగ ప్రజలూ లేరు, చెట్టుచేమలూ లేవు. చంద్రమండలంలో వట్టి పర్వతాలు, రాళ్ళు, అగాధమైన లోయలు తప్ప అఖరుకు గాలైనా లేదు. భూగోళం విడిచి 9 కోట్ల 29 లక్షల మైళ్ళు వెళ్ళేమంటే సూర్యగోళం చేరుతాం. సూర్యగోళంలో బ్రహ్మాండమైన వేడి; చెప్పటానికి తరంకానంత వేడి—లోహాలు సైతం అన్నీ కరిగిపోయి, పరమాణువులు పగిలిపోయి, వాయురూపంలోకూడా ఉండటానికి వీలులేనంత ప్రచండమైన వేడి. సూర్యగోళం అడ్డు కొలత తీసేమంటే తొమ్మిదిలక్షల మైళ్ళు. అంటే భూగోళంకన్నా సుమారు 14 లక్షల 24 వేల రెట్లు పెద్దదన్నమాట. సూర్యగోళం ఇంత పెద్దదైతే.- గుండ్రంగా అంతచిన్నదిగా కనబడుతుందే? అంటారేమో. ఎంత దూరంలో ఉందో చూచేరా?- 9 కోట్ల 28 లక్షల మైళ్ళు! అంటే గంటకు 100 మైళ్ళ చొ॥న వెళ్ళే ఒక విమానంలోఎక్కి, రాత్రింబగళ్ళు ఏకటాకీని వెళ్ళేమంటే 105 ఏళ్ళకు అక్కడకు చేరుకుంటాం ! !

నక్షత్రాలు దానికంటే ఎన్నో కోట్ల కోట్ల కోట్లు మైళ్ళ దూరాల్లో వున్నవి. నక్షత్రాలుకూడా గోళాలే. సూర్యుడికంటే లక్షలు, కోట్లు పెద్దవైన నక్షత్రాలున్నాయి.

భూమిచుట్టూ చంద్రుడు తిరుగుతుండబట్టే తిథులు ఏర్పడుతున్నాయి, మన భూమి తనచుట్టూ తానుతిరుగుతూ సూర్యుడిచుట్టూ ఏటేట ప్రదక్షిణాలు చేస్తుండబట్టే రాత్రింబగళ్ళు, కార్తులు, సంవత్సరాలు ఏర్పడుతున్నాయి భూమి ఒక్కటేగాదు. ఇలా సూర్యుడి చుట్టూ గురుడు, శని మొదలైన నవగ్రహాలు ఇంకా దూర దూర కక్ష్యల్లో ప్రదక్షిణాలు చేస్తున్నాయి. ఈ సూర్యమండలానికి అనంత కోటి కోటి కోటి మైళ్ళ దూరాల్లో అనంతకోటి నక్షత్ర గోళాలున్నాయి. ఇంతంత దూరాల్లో ఇవి గాలిలో తిరిగే నలుసుల్లాగ ఒకదానికొకటి తగలకుండా బంతుల్లాగ తిరుగాడుతున్నాయి. పెద్దలు "మాయప్రపంచం" అని అంటే ఆశ్చర్యమేముంది? ఈ మాయ ప్రపంచంలో మళ్ళీ ఎన్ని మానవ మాయలు—మటుమాయలు ఉన్నాయి ! !



# మాలోకపు కవికుమారులూ!

* శ్రీ శారదానాథ్ *

ఆలోకపు టంచుల మరగీ
ఈ లోకమునే మరచేరా ?....
మాలోకపు కవికుమారులూ!
భావాంబరవీధి విహారులు !....

స్వప్నాల్లో చూచేవింతల
సత్యాలని భ్రమియిస్తారా ?....
నిత్యం మీ ఎదుటను మసలే
సత్యాలను నిరసిస్తారా ?....

కన్నీరుగ కారే శోకం
మున్నీరుగ మారిన లోకం
బంగారం పండిస్తుందా.... ?
శృంగారం సృష్టిస్తుందా.... ?

కనుగొలకుల జారు విషాదం—
కనువేడుక గొలుపు ప్రసాదం ! ! !
మనసుంటే మాడ్చే పాపం—
మనలోకపు భామకలాపం ! ! !

చూచారా ! కవికుమారులూ !
మాచూపుల చీకటి చాపలు.... ....
ఈలోకపు చీకటినిలచే
ఆలోకమునటు చూస్తారేం ? ....

కాలానికి గతి కలదండీ— !
మాలోపల మనసుందండీ— !
ఆలోకమునిటు వద్దండి.... ....
మాలోకము నటు కొనిపొండి ....

# భార్య ప్రేమ

* శ్రీ వైకుంఠరావు *

లేఖకజాతి ప్రకృతిని అనుసరించి తారాప్రసన్నుడు బయటి మనిషి కనబడేసరికి సిగ్గుపడేవాడు. వాళ్ళ ఎదుట నోరు విడేదికాదు. బయటివాళ్ళను కలుసుకోవడమన్నా మాట్లాడడమన్నా అతనికి ప్రాణాంతకముగా ఉండేది. అతనికి చేతనయినది, ఇంట్లో కూర్చొని కలము నడిపిస్తుండడ మొక్కటే. అతనికి చిన్న గూని ఉండేది. దృష్టి తక్కువ, సంసారజ్ఞానము అతిస్వల్పము. సామాన్యమైన మాటలుకూడా ఇతని నోటివెంట సులభముగా వచ్చేవి కావు. కనుక గృహదుర్గం విడిచిపెట్టి బయటికి రావడం అతనికి ప్రమాదకరమైన అవస్థే.

అతను కేవలం చేతకాని పెద్దమ్మ అని అంతా అనుకొనేవారు—అనుకుంటున్నారని వాళ్ళను నిందించలేము. ఒక పెద్దమనిషి ఎవరైనా మొదటి పర్యాయం తారాప్రసన్నుని కలుసుకొని, బహుమర్యాదాగా "అయ్యా! తమ దర్శనం ప్రాప్తించినందుకు నాకు కలిగిన ఆనందం నేను ఒక నోటితో వర్ణించలేను", అని అన్నాడు అనుకుందాం. దానికి జవాబుగా తారా ప్రసన్న తన అరిచెయ్యిని విప్పి తదేక ధ్యానంగా చూస్తూ నిలుచుంటాడు. ఇతని వ్యవహారం చూచి పెద్దమనిషి ఆశ్చర్యపోతాడు. "మీకు ఆనందం కలగడం సహజమే, కాని అమాట విని నాకూ కూడా ఆనందం కలిగిందని నేను అబద్ధం ఎట్లా చెప్పగలను" అన్నట్టుగా తారా ప్రసన్న నిలుచొని, చూస్తుంటాడు.

లక్షాధికారి ఒకడు మధ్యాహ్నం విందుకి రమ్మని పిలుస్తాడనుకుందాం. వడ్డనలు ప్రారంభం అయేసరికి సాయంకాలమయిపోతుంది. విందుకు పిలిచిన గృహస్థుడు చేతులు జోడించుకొని బహు వినయంగా, "పేదవాడి ఇంటి విందు ఈ నాలుగు మెతుకులకోసం తమకు వృథాగా కష్టపెట్టాను"అని తారా ప్రసన్నుని ఎదుట విన్నవించుకుంటే "అంత స్పష్టముగా రుజువవుతున్నది మీరు వేరే మాటలతో చెప్పడం అనవసరం" అన్నట్టుగా అతను ఊరుకుంటాడు.

అప్పుడప్పుడు ఎవరో వచ్చి భక్తిపూర్వకంగా ఇలా అంటూ ఉండేవారు — "మీ పాండిత్యంవంటిది ఈ కాలంలో ఎక్కడో గాని కనబడదు. సరస్వతీదేవి తన పద్మాసనం విడిచిపెట్టి మీ కంఠాన్ని వాసస్థానం చేసుకొన్నది. దానికేమీ సందేహం లేదు". అటువంటి అప్పుడు, వారన్నది అతిశయోక్తి అని గాని నిజంకాదని గాని ఒక్క మాట అనేవాడు కాదు తారా ప్రసన్న-వారన్నది నిజమే అయినట్టూ, సరస్వతి దిగి వచ్చి నిజముగా అతని కంఠంలో కూర్చున్నట్టు మాట్లాడక చూస్తుండేవాడు. మన ముఖం ముందర మనను మహా పొగుడుతారు కొందరు—వారి స్తోత్రము విని, "అబ్బే, నాలో ఏమి విలువ ఉన్నదండీ" అని మనం జవాబు చెప్పుతామని వారి ఊహ. కొందరు వచ్చి ఆత్మనింద చేసుకుంటారు. దానికి ప్రతివాదముగా "అబ్బే, అట్లా అనుకోవడము తప్పు అండీ...తమరు చాలాగొప్పవారు" అని మనం అంటామని వాళ్ళ ఆశ. వారు ఆశించిన జవాబులు మన దగ్గరనుంచి రాకపోగానే వాళ్ళకు అసంతృప్తి కలుగుతుంది, పొరపాటు చేశామని విచారిస్తారు. కోపం వస్తుంది. వాళ్ళ స్తోత్రమూ, వాళ్ళ ఆత్మనిందా, నిజంకాదని మనము చెపితే వాళ్ళు దుఃఖించరు.

ఇంటివాళ్ళ దగ్గర తారాప్రసన్నుని ధోరణి వేరే మోస్తరు. అతని భార్య దాక్షాయణికూడా మాటలలో అతనితో చాలలేదు. దాక్షాయణి మాటమాటకి, "నేను నీతో చాల లేను, నేనే ఓడిపోయినాను. నాకు పని ఉంది వెళ్ళిపోవాలి," అని అనవలసి వచ్చేది. తాను ఓడి పోయినానని భార్య నోటితో ఒప్పించగల శక్తి భర్తలలో ఎంత మందికి ఉన్నది?

తారా ప్రసన్నుని దినములు హాయిగా గడిచిపోతున్నవి.

విద్యా బుద్ధులలోనూ, తెలివి తేటలలోనూ తన భర్తతో సమానులెవరూ కారని దాక్షాయణికి దృఢమైన నమ్మకం కలిగింది. ఈ సంగతి బయటికి చెప్పడానికి దాక్షాయణి సంకోచించేది కాదు. ఇది విని ఒకనాడు తారా ప్రసన్న "నీకున్న భర్త ఒక్కడే ఎవరితో సరిపోల్చి చూచి అట్లాగు చెప్పగలవు?" అని భార్యను అడిగాడు. భర్త ప్రశ్నలకి దాక్షాయణికి బాగా కోపం వచ్చింది.

దాక్షాయణికి గొప్ప విచార మొకటి ఉండింది. తన భర్తకుగల అసాధారణ పాండిత్యం బయటికి రాకుండా ఉన్నది ఆ విషయమై అతనేమీ ప్రయత్నం చేయడం లేదు—అతను వ్రాసినవేవీ అచ్చుపడలేదు.

దాక్షాయణి అప్పుడప్పుడు భర్తను అడిగేది, అతను వ్రాసింది చదివి వినిపించమని, ఆ కవిత్వము ఎంత బోధ పడకపోతే అంత ఆశ్చర్యంవేసేది, దాక్షాయణికి. ఆమె రామాయణం, మహాభారతం పురాణాలు చదివేది, అవి చక్కగా ఆమెకు బోధపడేవి—చదువురానివాళ్ళకు కూడా అవి బోధపడతవి. కాని ఆమె భర్త శక్తివంటి దుర్బోధ్య రచనాశక్తి ఆమె ఇంకెక్కడా చూడలేదు.

ఆ పుస్తకాలు అచ్చు అవుతవనీ, చదివితే బోధపడక అంతా ఆశ్చర్య పోతారనీ భర్త పాండిత్యం చూచి. అంతా నిర్ఘాంత పోతారనీ భార్య ఊహిస్తూ ఆనందించేది. ఆపుస్తకాలన్నీ అచ్చు వేయించమని భర్తతో వేయిసార్లు చెప్పి ఉంటుంది. భర్త దానికి జవాబు చెప్పాడు—"మను ఏమన్నాడో ఎరుగుదువా— 'ప్రవృత్తిరేషా భూతానాం నివృతిస్తు మహాఫలా''.

తారా ప్రసన్నుడికి నలుగురు సంతానం—ఆ నలుగురూ కూతుళ్ళే. అది కేవలం గర్భధారిణీయొక్క అశక్తివల్లేనని దాక్షాయణి నమ్మకము. కనుకనే ప్రతిభాశాలియైన భర్తకు భార్యగా ఉండదగిన యోగ్యత ఆమెకు లేదని ఆమె అనేది. ఒక్కమాట అర్థము కాకుండా వ్రాయగలశక్తి భర్తకు ఉన్నది. భార్య కడుపున ఒక్క కొమార్తెలు తప్ప పుట్టకుండా ఉన్నారు. భార్య చేతకానితనానికి ఇంతకంటె వేరే ప్రమాణమెందుకు?

మొదటి పిల్ల ఎదిగి తనకంటె ఎత్తు పెరిగినప్పటికి తారాప్రసన్నకు మెలుకువ కలిగింది. ఒకరి తరువాత ఒకరికి నలుగురు పిల్లలకీ పెళ్ళిచేయాలని జ్ఞాపకం వచ్చింది. ఆ పెళ్ళిళ్ళకు బాగా డబ్బు కావాలి. దాక్షాయణి మాత్రం భయపడలేదు. "నీవు కొంచెము శ్రద్ధవహించావంటే కంగారుపడ నక్కరలేదు" అని అన్నది.

"అట్లాగునా? అయితే చెప్పు ఏమి చెయ్యాలో" అని ఆత్రతతో అడిగాడు తారా ప్రసన్న.

ఎట్టి సందేహమూ సంకోచమూ లేకుండా, దాక్షాయణి జవాబు చెప్పింది—"కలకత్తా వెళ్ళుదాం పద. నీ పుస్తకాలు అచ్చువేయించుదాము. పది మందికి నీ సంగతి తెలియనీ, తరువాత చూదుపుగాని రూపాయలు వస్తాయో రావో!"

భార్య ధైర్యంవల్ల భర్తకుకూడా ధైర్యం కలిగింది. రాను రాను తాను మొదటినుండి వ్రాసినవన్నీ అచ్చువేయిస్తే ఆ పేటలో ఉండే పెళ్ళికాని అమ్మాయిలకు అందరికీ పెళ్ళి చేయించి తండ్రుల కష్టాలు నివారణచేయవచ్చునని కూడా గట్టి నమ్మకం కలిగిపోయింది.

ఇక కలకత్తా వెళ్ళబోయే ముందర దాక్షాయణి చాలా కంగారు పడడం మొదలుపెట్టింది. భర్త ఇంతకాలం కేవలం ఆమె సంరక్షణలోనే ఉన్నాడు. అతనికి మరి ఏ సహాయమూలేదు. అతను ఏ ఉపాయమూ ఎరుగడు. అటువంటి భర్తను ఒంటరిగా వదిలిపెట్టలేకుండా ఉన్నది. అతనికి రోజూ వేళకు వండిపెట్టి, ఎప్పుడు ఏపని చేయాలో జ్ఞాపకం తెచ్చి, ఏ ఆపదా రాకుండా కాపాడే వాళ్లెవరుంటారని ఆమెకు బెంగపట్టుకున్నది.

ఎట్టి అనుభవమూలేని తారా ప్రసన్నకు కూడా భార్యనూ కుమార్తెనూ ఏమీ ఎరగని విదేశానికి తీసుకు వెళ్ళడానికి భయంవేసింది. వాళ్ళను తీసుకువెళ్ళననే నిశ్చయించాడు. చివరకు దాక్షాయణి తమ పేటలోనే ఉండే ఒక మనిషిని కుదిర్చి తన స్థానే భర్తతో కలకత్తా పంప నిశ్చయించి, భర్తవిషయమై వాడు ఎప్పుడెప్పుడు ఏ ఏ పనులు చేస్తుండాలో వేయిరకాలుగా ఉపదేశం ఇచ్చింది. భర్తకు

ఏ ఆపదా రాకుండా పూజలు చేయించి, అతనికి తాయిత్తులు మొదలైనవి కట్టి కలకత్తా ప్రయాణం చేయించి తాను ఇంట్లోకి వచ్చి ఏడుస్తూ నేలకూలబడ్డది.

తారా ప్రసన్న కలకత్తా వచ్చి చతురతగల తన జట్టుగాని సహాయంతో "వేదాంత ప్రభాకరం" అనే గ్రంథం ప్రచురించాడు. భార్య తన నగలంతా తాకట్టు పెట్టి పంపిన సొమ్ములో చాలా భాగం ఇప్పటికి ఖర్చయిపోయింది.

అమ్మకానికి కలకత్తాలోని చిన్నా పెద్దా—అన్ని పుస్తకాల దుకాణాలకు కొన్ని కొన్ని ప్రతులు పంపాడు. విమర్శకు దేశంలో ఉండే సంపాదకులందరికీ ప్రతులు పంపాడు. భార్యకుకూడా ఒక కాపీ పంపాడు. రిజిస్టరీ చేయించి మరీ పంపాడు, పోస్టులో ఎవరైనా దొంగలిస్తారేమో అని జడిసి.

అచ్చు పుస్తకంలో అచ్చు పడి ఉన్న భర్త పేరు చూచిననాడు గృహిణి పేటలోని ఆడవాళ్ళందరినీ విందుకి పిలిచింది—అందరూ వచ్చి కూర్చుండబోయే స్థలంలో భర్త రచించిన, అచ్చు గ్రంథం పడేసి ఉంచింది.

అందరూ వచ్చి కూర్చున్న తరువాత దాక్షాయణి పెద్ద గొంతుకతో, "ఓయి అమ్మా అదేమిటే ఆ పుస్తకం అక్కడ పడేశారు—అది ఇటు ఇయ్యి తల్లీ, అన్నదా, తీసి ఉంచేస్తాను" అని అన్నది. విందుకు వచ్చిన వాళ్ళలో అన్నద చదువుకొన్నది. ఆమె ఆ పుస్తకాన్ని తీసి గూట్లో పెట్టింది!

మరొక నిమిషము పోనిచ్చి ఏదో తీయబోయినట్టు వెళ్ళి దాక్షాయణి ఆ పుస్తకాన్ని కిందికి తోసేసింది. అటు తరువాత తన పెద్దకూతురుని సంబోధించి, "శశీ, నాన్నగారి పుస్తకం నీకు చదవాలని ఉంటే చదువు అమ్మా, చదవడానికి సిగ్గు ఎందుకు?" అని అన్నది. శశికి ఆ పుస్తకము చదవాలని లేనేలేదు.

మరి కొంతసేపు అయిన తరువాత తల్లి కూతుర్ని చీవాట్లు పెట్టుతూ, "నాన్నగారి పుస్తకం అలాగు మురికి చేసేయ వచ్చా? కమల-అక్క చేతికి ఇచ్చేయి గోడ బీరువాలో ఉంచేస్తుంది," అని అన్నది.

ఆ పుస్తకానికి ప్రాణం వుండి ఉంటే ఆనాడు వాళ్ళు దానికి పెట్టిన బాధతో అందులోని వేదాంతానికి ప్రాణాంత పరిచ్ఛేదముదాకా వచ్చేది.

గ్రంథాన్ని విమర్శిస్తూ ఒకొక్క పత్రికలో వ్యాసాలు పడుతున్నవి. చాలా భాగం భార్య అనుకున్నట్టుగానే అయింది. గ్రంథంలో ఒక్క అక్షరమైనా బోధపడక దేశంలో ఉన్న విమర్శకులందరూ నిర్ఘాంత పాయినారు. అంతా ఏకగ్రీవముగా, "ఇంత సారవంతమైన గ్రంథం ఇప్పటివరకు ప్రచురింపబడ లేదు" అన్నారు.

'రైనాల్డ్స్ మిస్టీరీస్ ఆఫ్ లండన్' యొక్క తర్జుమాలు తప్ప వేరే గ్రంథాలేవి ముట్టుకోని విమర్శకులు కూడా అమితోత్సాహంతో వ్రాశారు— "మన దేశంలో గంపల కొలది ప్రచురించబడుతుండే నవలలూ నాటకాలకి బదులుగా మధ్య మధ్య ఇటువంటిది ఒక్క గ్రంథం వెలువడుతుంటే మన దేశ సాహిత్యం వాస్తవమైన పఠనీయ సాహిత్యమౌతుంది".

తరతరాలనుండి "వేదాంతము" అనే పదంకూడా వినని వ్యక్తి ఒకడు, ఈ విధంగా వ్రాశాడు— "తారా ప్రసన్న బాబుగారితో నేను అన్ని విషయాలలో ఏకీభవించలేను. సవిస్తరంగా వ్రాయడానికి స్థలం లేకపోవడం చేత ఆ అంశాలన్నీ ఇక్కడ ఉదహరించలేక పోయినాను. కాని మొత్తంమీద గ్రంథకర్త మతానికి నా మతానికి చాలా ఐక్యమున్నదని చెప్పగలను". ఈ విమర్శకుడన్నదే నిజమైతే గ్రంథాన్ని 'మొత్తంమీద' తగలపెట్టడం మేలు!

దేశములో ఉండే లైబ్రరీలనుండి లేని లైబ్రరీలనుండి గ్రంథము ఉచితముగా దయచేయమని ప్రార్థనలు వచ్చాయి. వేడుతూ వ్రాసిన ఉత్తరాలలో "మీ చింతాశీల గ్రంథం దేశములో ఉండే గొప్పలేమిని తొలగించింది," అని చాలా మంది కార్యదర్శులు తెలియచేశారు. ఎటువంటి గ్రంథాలను చింతాశీలమైనవని వర్ణించ వచ్చో తారా

ప్రసన్నకు బోధపడలేదు కాని ఆ జాబులు చదువుతుండే టప్పుడు అతనికి ఒళ్లు పులకరించేది, చేతి సొమ్ముతో పోస్టు చార్జీ కట్టి పుస్తకాలు ధర్మం చేసేవాడు.

ఈ విధంగా తారా ప్రసన్నుని హృదయం ఆనం దంతో పొంగిపోతూ ఉన్న రోజులలో ఒకనాడు హఠాత్తుగా భార్యవద్దనుంచి అయిదో పురుడు చాలా దగ్గిర పడ్డదని జాబు వచ్చింది.

తనకు దక్షతగా భార్యతోడిచ్చిన మిత్రుడితో కలిసి పుస్తకాల షాపులకు డబ్బు కొంత అడుగుదామని తారా ప్రసన్న తక్షణం వెళ్ళాడు.

అందరు షాపులవాళ్ళూ "ఒక్క పుస్తకమైనా చెల్లలే'' దని ఒకటేమాట. కాని ఒక షాపువాడు మాత్రం చెప్పాడు. ఎవరో ఒక ఆయన ఒక పుస్తకము పంప మంటే వి. పి. గా షాపువాడు పంపాడట. ఆ పుస్తకము ఎవరూ సొమ్ము చెల్లించి పోస్టాఫీసు నుంచి తీసుకోలేదట, వి. పి. తిరిగి వచ్చేసిందట. షాపువాడు 'పోస్టు చార్జి నాకు జరిమానా అయింది. చాలును, మీ పుస్తకాలు మీరు తీసుకోండి', అని అంటూ కోపముతో పుస్తకాలన్నీ అతనికి ఇచ్చేయబోయినాడు.

గ్రంథకర్త బసకు తిరిగి వచ్చి చాలా సేపు ఆలో చించాడు. కాని ఏమీ బోధపడలేదు. తన చింతాశీల గ్రంథంమాట ఎంత చింతించినా అంతా అగమ్య గోచర ముగానే ఉంది; మనస్సులో కలత అధికమయింది; తాను తెచ్చిన డబ్బులో ఏ నాలుగు రూపాయలు మిగిలి ఉండెనో అవి పట్టుకొని ఇంటికి బయలుదేరాడు.

తారా ప్రసన్నుడు ఇంటికి తిరిగి వచ్చి లేని ఆనందం తెచ్చుకొని బహు ఆడంబరముగా భార్యఎదుట నిలుచు న్నాడు. భార్య శుభవార్త కోసము ఎదురుచూస్తూ నవ్వు ముఖముతో కూర్చున్నది.

తారా ప్రసన్న "గౌడ వార్తావహము" అనే పత్రికను భార్య ఒడిలో వేశాడు. భార్య దానిని చదివి ఆ సంపాధ కుడికి అక్షయ ధనపుత్రలాభము కలగాలని కోరింది. భర్తకు తన మనస్సులో తాను పుష్పచందనాలు అర్ఘ్య ముగా ఇచ్చింది. పత్రిక చదవడము పూర్తికాగానే తిరిగి భర్తముఖం చూచింది.

భర్త అప్పుడు ''నవ ప్రభాతము'' అనే పత్రిక తెచ్చి భార్య కిచ్చాడు. ఆమె దానిని చూచి ఆనంద పరవశు రాలయి శ్రద్ధాప్రేమలతో భర్తవైపు మళ్ళా చూచింది.

తారా ప్రసన్న తరువాత ఒక ప్రతి ''యుగాంతర్'' తీసి ఇచ్చాడు. తరువాత ? ''భారత భాగ్య చక్రము'', తరువాత ? తరువాత ''శుభజాగరణము.'' తరువాత ? తరువాత "అరుణాలోకము'' తరువాత ''సంవాద రంగ భంగము'', దాని తరువాత ''ఆశ'', ''ఆగమనీ'', "ఉచ్ఛ్వాసము", "సహచరి", "సీతాగెజెట్", "అహల్యా లైబ్రరీ ప్రకాశిక" "అలిత సమాచారము", "విశ్వ విచా రక", "లావణ్యలతిక". నవ్వి నవ్వి దాక్షాయణి కళ్ళు ఆనంద బాష్పాలతో నిండిపోయినవి.

భార్య కళ్ళు తుడుచుకొని, కీర్తి రశ్మితో వికసిస్తున్న భర్త ముఖం వంక మళ్ళా చూచింది. "ఇంకా అనేక పత్రికలున్నవి", అని భర్త ఉత్సాహముతో అన్నాడు.

''అవి రెండోపూట చూస్తా, తక్కిన సంగుతులు వినా లని ఉన్నది'', అని భార్య అన్నది.

''మొన్న కలకత్తాలో ఉన్నప్పుడు విన్నాను. గవర్నరు గారి భార్య ఒక పుస్తకము అచ్చు వేయించిందట, కాని అందులో నా 'వేదాంత ప్రభాకరము'మాట వ్రాయలేదట,'' అని తారా ప్రసన్న అన్నాడు.

''ఆహా వాటి మాట కాదు నేనడిగేది, ఇంకేమి తీసుకు వచ్చావో చెప్పు'' అని అడిగింది.

''ఇంకా కొన్ని ఉత్తరాలున్నవి''అని భర్త అన్నాడు.

''రూపాయలు ఎన్ని తెచ్చావు ?'' అని స్పష్టముగా అడిగింది దాక్షాయణి.

''విధుభూషణ్ దగ్గిర ఐదు రూపాయలు బదులు తీసుకు వచ్చాను'', అని తారా ప్రసన్న అన్నాడు.

# భార్య ప్రేమ

చివరకు సవిస్తరముగా వృత్తాంతమంతా విని దాక్షాయణి మనుష్యుల సాధుత్వాన్ని గురించి తనకుండే అభిప్రాయాన్ని మార్చుకున్నది. దుకాణదారులందరూ కలసి ఆమె భర్తకు టోపీ వేశారు. దానికి ఏమీ సందేహము లేదు. పాతక వర్గంకూడా కుట్రపన్ని దుకాణదారులను టోపీ వేసి ఉండాలి—దానికీ సందేహం లేదు.

భర్తకు సహాయార్థము తనకు ప్రతినిధిగా పంపిన విధుభూషణ్‌కూడా రహస్యంగా ఆ దుకాణదారులతో కలిసి ఉండాలి. ఆలోచిస్తున్న కొలది వాళ్ళు చేసిన అన్యాయం మరీ స్పష్టమౌతూ వచ్చింది. తమ పేటలోనే ఉన్న విశ్వంభరచటర్జీ తారాప్రసన్నుని పరమ శత్రువు— ఇతనుకూడా వాళ్ళందరితో కలిసి ఈ దుర్మార్గం చేసి ఉండాలి. ఆమె భర్త, కలకత్తాకు వెళ్ళిన రెండోనాడు విశ్వంభర్ చటర్జీ మర్రిచెట్టుక్రింద నిలబడి కన్నైపాల్‌తో మాట్లాడుతుండెనని దాక్షాయణి విన్నది. విశ్వంభర్ కన్నైపాల్‌తో అప్పుడప్పుడు ఇలా మాట్లాడుతుండడం కద్దు. కాని ఇంతకాలం ఆమెకు అనుమానం తట్టలేదు. ఇప్పుడంతా కళ్ళకు కట్టినట్టు స్పష్టంగా తెలుస్తున్నది.

ఇవతల సంసార చింత దాక్షాయణిని మరింత బాధిస్తూ వచ్చింది. ధనార్జనకొరకై చేయగల కడపటి ఉపాయం ఈ విధంగా నిష్ఫలమై పోయింది— కాని తాను చేసిన అపరాధంలో— అనగా ఇంత మంది కుమార్తెలను కనడంలో—విధుభూషణుని మోసముగాని విశ్వంభరుని కుట్రగాని దాక్షాయణికి కనబడలేదు. ఈ అపరాధం అప్పటినుండి దాక్షాయణిని మరింత దగ్ధం చెయ్యడం మొదలుపెట్టింది. ఈ అపరాధం పూర్తిగా తనదే. ఈ అపరాధం ఇప్పటివరకు పుట్టిన అమ్మాయిలది కొంతవరకు కావచ్చును. ముందుకు పుట్టబోయే అమ్మాయిలది కావచ్చును. ఈ తలంపు అహోరాత్రాలు ఆమెను బోధిస్తు ఉండడంచేత ఆమె మనస్సుకు ఎటువంటి శాంతీలేక పోయింది.

దాక్షాయణి ప్రసవసమయం దగ్గర పడుతున్నకొలది ఆమె శరీరావస్థనుగురించి అందరికీ కొంత దిగులు కలిగింది. వేరు ఉపాయమేదీలేక తారాప్రసన్న పిచ్చివాడిలాగు ఇటూ అటూ తిరిగి చివరకు విశ్వంభర్ దగ్గిరికి వచ్చి బ్రతిమాలాడు. "నా దగ్గర ఉన్న ఈ ఐదువందల ఒక్క పుస్తకమూ తనఖా ఉంచుకొని నాకేమైనా బదులివ్వగలిగితే మంచి మంత్రసానిని నొకదానిని పట్నమునుంచి తెప్పిస్తాను" అని అన్నాడు.

"నీవేమీ గాబరా పడకు తారా, అవసరమైన రూపాయలు నేను ఇస్తాను. పుస్తకాలు నా దగ్గిర ఉంచ అక్కర లేదు. తీసుకు వెళ్ళు" అని అన్నాడు విశ్వంభర్. తరువాత కన్నైపాల్ సలహా తీసుకొని కావలసిన రూపాయలు విశ్వంభర్ దగ్గిర పుచ్చుకున్నాడు. విధుభూషణ్ తన ఖర్చు తానే పెట్టుకొని స్వయంగా తానే వెళ్ళి కలకత్తా నుంచి మంచి మంత్రసాన్ని తీసుకొని వచ్చాడు.

తరువాత ఏం బుద్ధి పుట్టిందోగాని దాక్షాయణి భర్తను తన గదిలోకి పిలిపించి ఒట్టుపెట్టించుకొని ఈవిధంగా వేడుకొన్నది: "నీకు శూలనెప్పి వచ్చినప్పుడల్లా ఆ కలలో విన్న మందు పుచ్చుకోవడం మరిచిపోకు; తరువాత ఆ బైరాగి ఇచ్చిన తాయిత్తు ఎప్పుడూ బయట ఉంచకు" ఇట్లాగు చెప్పి భర్తచేతులు పట్టుకొని అనేక చిన్న విషయాలలో ఎప్పుడెప్పుడు ఏమిటేమిటి చేస్తుండవలెనో అతనితోచెప్పి, అట్లాగు చేస్తానని అతనిచేత ఒప్పించింది. విధుభూషణ్ మీద నాకేమీ నమ్మకంలేదు. నిన్ను నాశనం చేసినవాడు అతనే." అని చివరకు అన్నది. అతనిమీద నమ్మకం ఉంటే ఈ మందూ ఈ తాయిత్తూ అతనికి అప్పచెప్పి పోయేదే!

అటు తరువాత, ఎవరిని పడితే వాణ్ణి నమ్మే భోలానాథుని వంటి తన భర్త ప్రపంచంలో ఉండే మోసగాళ్ళ వలలలో పడకుండా ఉండేటట్టు ఉపదేశం ఇచ్చింది. తరువాత బాగా దగ్గరికి పిలిచి చెవిలో చెప్పింది— "పుట్టబోయే అమ్మాయి బ్రతికి ఉంటే ఆమెకు "వేదాంతప్రభ" అని పేరు పెట్టు. పిలిచినప్పుడు మాత్రము "ప్రభ" అని పిలవ వచ్చును"

ఇట్లాగు అంటూ భర్త పాదధూళి తలమీద ఉంచుకొని తలలో తాను ఇట్లా అనుకున్నది- ''కేవలం కుమార్తెలను కనడానికి మాత్రమే నేను భర్తయింటికి వచ్చాను. కాని ఇటుపైని ఆ ఆపదకూడా ఉండదు !''

''అమ్మా చూడు, ఎంతచక్కని అమ్మాయో !'' అని మంత్రసాని అనగానే తల్లి ఒక్కమారు కళ్ళువిప్పి చూచింది. చూస్తూ ''వేదాంత ప్రభ'' అని అతి మృదువుగా అన్నది. తరువాత ఈ ప్రపంచంలో ఇంకొక్కమాట అనడానికైనా ఆమెకు అవకాశం చిక్కలేదు.

* * *



# మహిళల పరిశోధనలు

* శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి *

ప్రపంచం మొత్తంమీద మహిళల వున్నతి కొంచెం వెనకంజగానే వున్న సంగతి కాదనలేము. దానికి కారణం పురుషులతో చేరి సమానంగా స్త్రీలకు హక్కులు, సౌకర్యాలు కలగ చెయ్యకపోవటమే. అలాంటి అవకాశాలు వున్ననాడు మహిళలు. పురుషులతో పరిశోధనల విషయాల్లోకూడ ఏమాత్రం తీసిపోరని, యీక్రింద వుదహరించిన పరిశోధనలు రుజువు చేస్తున్నాయి.

నూర్‌మహల్ అనే రాకుమారి తోటలో వివిధ రకాల పుష్పాలు సుగంధంతో ఘుమఘుమలాడి పోతూవుండేవిట. కాని పుష్పాలు వాడి రాలిపోగానే, ఆ సువాసనకూడా నశించిపోయేది. కాని పుష్పాల్లోని సువాసన నశించకుండా వుండటానికి అనేక విధాల ప్రయత్నంచేసి, చివరకు వాటిని బట్టాపెట్టించి (perfumes) కనిపెట్టింది.

ఒక జెర్సీ బాలిక, తన వుంగరాల శిరోజములను చూసి అతి ముగ్ధురాలై, (curling-iron) కనిపెట్టింది. దీని వలన, అలాంటి జుట్టును, యితరులుకూడ యేర్పాటు చేసుకోవచ్చు.

పదునెనిమిదవ శతాబ్దంలో క్రిస్టీనా షా అనే ఒక బాలిక దారమును కనిపెట్టింది. దానివలన యీనాడు అంతులేని ప్రజానీకము సభ్యతగల మానవులయ్యారు.

షెఫీల్డు యువతి పియర్సు శుభ్రపరిచే యంత్రం కనిపెట్టి మూడు వారాల్లో సర్వసాధారణంగా చెయ్యగల పనిని మూడు నిమిషాల్లో చెయ్యటానికి అవకాశము కల్పించింది. ఈ అసమాన ప్రజ్ఞకు, ఆ యువతికి రజత పతకము బహూకరించారుకూడ.

ఒక యువతి తను నడుపుతున్న హోటలులోకి వచ్చే ప్రజానీకానికి ఒక్కసారిగా వంట చేసిపెట్టడం దుస్సాధ్యం అవటంవలన ఆలోచించి ఆలోచించి గ్యాస్ పొయ్యిని కనిపెట్టింది.

సముద్రాంతర టెలిస్కోపును మాదర్ అనే ఆమె కనిపెట్టింది. దానివలన అతఃపాతాళంలో మునిగిపోయిన ఓడలను చూడవచ్చు. పెద్ద పెద్ద నావల అడుగు భాగాలు పరీక్షచేసి, ఏవైనా మరమ్మతులు కోరుతోంచేమో తెలుసుకోవటానికికూడ వుపయోగపడుతోంది.

ఒక యువతి, పుక్కుసు సీసంతో పూతపూసి, యేవిధమైన పెద్దపెద్ద నావలను యెక్కువ కాలం మరమ్మతులు లేకుండా నడపవచ్చో, తెలియ చెప్పింది. దాని వలన పుక్కు యెక్కువ కాలం మన్నుతుందని కూడ రుజువు చేసింది.

స్టీమర్లకు వుపయోగపడు sesen-crank, క్రొత్త రకపు టార్పెడో యిత్యాదులుకూడ స్త్రీలు కనిపెట్టినవే !

అంతరాయాలు, అర్థంలేని అనుమానాలమధ్య, అవకాశాలు లేక అణిగిమణిగియున్న అంగనలు యింకా యెంత మందో !



# వచన రచనలు

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న, ఎమ్. ఏ. బి. ఎల్. (సాహితీ సమితి)

[ఆంధ్ర మహిళ 8-వ జన్మదిన సంచిక 67-71 పేజీల్లో రచయిత సారస్వత వ్యాసావళి-౧ అను శీర్షిక క్రింద వ్రాసిన "కవిత" వ్యాసాన్ని ప్రచురించి ఉన్నాం. —సం॥]

సారస్వతంలో మొట్టమొదట మాత్రాబద్ధంగా ఉండే రచనలు వెలువడతాయి అనీ ఆ తరవాత వచన రచనలు బయలుదేరతాయి అనీ క్రిందటి వ్యాసంలో వ్రాసేను. (ఆంధ్ర మహిళ- 8-వ జన్మదినసంచిక పేజీ 67-71) కాని మిగతా సారస్వతాలలోలాగ కాకుండా, తెలుగు సారస్వతంలో యీ గద్యపద్య రచనలు—వాఙ్మయ రచన ఆరంభం అయినప్పటినుంచీ—జములుగా కలిసిపోయి కనిపిస్తాయి. లబ్ధ సారస్వతాన్ని బట్టి చూస్తే తెలుగు వాఙ్మయంలో గద్యపద్య రచనలు రెండింటికీ సమానప్రాధాన్యమే లభించినట్టు తెలుస్తుంది. నన్నయ్యకి ముందువాడైన వేములవాడ భీమకవి రచనలు దుర్లభం అవడంచేతనూ, చాటువులూ కథలూ మాత్రమే జనాంతికంగా మిగలడం వల్లనూ, ఆయన రచనల్లో వచనం ఉందా లేదా అన్న ప్రశ్న ప్రస్తుతానికి మనకి అనవసరం. కాగా, నన్నయ్య గారి భారతం చూస్తే పద్యాలులాగే గద్యకూడా ఆయన ధారాళంగా ఉపయోగించేడని స్పష్టంగా కనపడుతుంది. ఈ మోస్తరుగా పదకొండో శతాబ్దాన్ని ఆరంభం అయి, నానాటికి వృద్ధిపొందిన వచన రచనలు యీనాడు కావ్య ప్రపత్తులలో ఎట్లా కనిపించుతాయో కాస్త పరిశీలిద్దాం.

తెలుగున, మహా కావ్యాలలోనూ, పురాణాలలోనూ, ప్రబంధాలలోనూకూడా వచనం కనిపిస్తూనే వుంది. ఈ వచనం ఏయే కావ్య, పురాణ, ప్రబంధకర్తలు ఏయే సందర్భాలలో ఏయే విధంగా వాడేరూ అన్నది వేరే ప్రశ్న; ఆయా కవుల కావ్య పరిశీలనా సందర్భంలో ముచ్చటించవలసిందిన్నీ. నానాటికి విపులం అవుతూన్న యీ వచన రచన నేటి రోజుల్లో ఈ దిగువని ఉదహరించిన గ్రంథాలు వ్రాయడానికి ఉపయోగపడుతోంది.

1. నాటకాలు (వీటిలో అక్కడక్కడ భావసౌకుమార్యాన్ని బట్టీ, ఉద్వేగ సంచలనం పురస్కరించుకునీ, పద్యాలు దొర్లుతూ ఉండడమూ కద్దు. కేవలమూ వచన నాటకాలూ ఉన్నాయి).
2. నవలలు.
3. చరిత్ర రచనలు.
4. జీవిత చరిత్రలు
5. వ్యాసాలు.
6. లేఖలు.
7. ఉపన్యాసాలు.
8. వేదాంత చర్చలు.
9. విమర్శనలు.
10. ప్రయాణ వర్ణనలు.

కాని యీ పైని చెప్పిన కావ్య రీతులన్నీకూడా తెలుగు సారస్వతంలో అతి నూతనంగా వెలువడ నారంభించేయి. ఇవి పందొమ్మిదో శతాబ్దంలో తలచూపడం మొదలెట్టి, నానాటికి యెంతో రసవంతంగా పరిణమిస్తున్నాయి. ఈ మోస్తరు రచనలు పూర్వం లేకపోవడానికీ, యిప్పుడు కనపడడానికీ కారణాలు పాశ్చాత్య విద్యావలంబనం, ఆంగ్ల భాషాభ్యాసనంవల్ల సమకూరిన ప్రపంచ సారస్వత సౌలభ్యమున్నూ. ఈ దృక్పథంనుంచి చూస్తే, పందొమ్మిదవ శతాబ్దం సారస్వత ద్వితీయ పునరుద్ధరణకీ మార్గసూచకం అవుతోంది. సారస్వత పునరుద్ధరణం ఆదిలో కృష్ణదేవరాయల యుగంలో జరిగింది కనక.

మానవకోటికి ఎల్లప్పుడూ రుచికరమయి కనపడే (జీవితాంతర) సంఘట్టనలలో గల దృశ్యాలూ, అనుభవమూ,

తత్సంబంధమయిన ఊహాభావన ఉద్వేగములవల్ల పుట్టినది సారస్వతం అని వెనకటి వ్యాసంలో వ్రాసే ఉన్నాను. అయితే, ఈ రీతిగా రసస్ఫోరకం, కావ్య జనకమున్నూ అయిన సంగతులు యేఁవిటి అంటే—

(1) జనన మరణాలు—పాపపుణ్యాలు—విధాతవ్రాతలు —జీవాత్మ, పరమాత్మ, తత్సంబంధం;— జాతీ, దాని ఉద్ధరణ మార్గాలూ మొదలయినవి కొన్ని.

(2) మానవుడికి తోడి మానవులతో ఉండే సంబంధ బాంధవ్యాలూ, సంఘ ప్రపంచమూ, దాని సమస్యలు యింకొన్ని;

(3) సృష్టి వైచిత్ర్యం—మానవ హృదంతరాళ రాగాను రాగాలు, మరి కొన్ని ;

(4) కల్పనేచ్ఛ—భావస్వభావం— రచనాభిలాషానూ.

ఇటువంటి సంగతులని క్రోడీకరించింది అవడంచేతనే సారస్వతంలో మనకి ఆనందం కలుగుతోంది. ఇంతే కాకుండా ఎవరిదయినా ఓ కావ్యం చదివిన కొద్దీ, ఆ కవి యెలాంటివాడో, ఏయే పరిస్థితుల్లో ఆ కావ్యం వ్రాసేడో మొదలయిన విషయాలుకూడా తెలుసుకుందాం అనే కోరికా బయలుదేరుతుంది. ఎంచేత అంటే ఏ యుగపు సారస్వతం ఆ యుగపు జీవిత పథాన్ని అనుసరిస్తుంది కనక. ఒకే యుగానికి చెందిన యే నలుగురు కవుల కావ్యాలనయినా తీసుకుని పరిశీలిస్తే, కవిహస్తం భిన్నం అవడంచేత ఆయా కావ్యాలు వేరువేరుగా కనపడినప్పటికీ, ఒకే యుగానికి చెందిన కారణంవల్ల వాటి అన్నింటిలోనూ కూడా యుగ సామాన్యం అయిన లక్షణాలు కొన్ని స్థూలంగా దొర్లుతూనే ఉంటాయి; దీనికే "A general resemblance under which their specific distinctions are arranged" అని షెల్లీ కవీ, (Perface to Prometheus - unbound) "......While the manner of expression will vary greatly with the individuality of each writer, dominant spirit of the hour, whatever that may be, will directly or indirectly reveal itself in his work" ("An introduction to the study of Literature") అని హడ్సన్ అనే విమర్శకుడూ చెప్పేరు. మనుచరిత్ర, పారిజాతాపహరణం, కళా పూర్ణోదయం లాంటి ప్రబంధాలలో పెద్దన, తిమ్మన, సూరన్నల సిద్ధహస్తం ప్రస్ఫుటంగా కానవస్తూన్నప్పటికీ, ఆయా కావ్యాలన్నీకూడా యుగ సంప్రదాయ సిద్ధంగా ఉన్న కొన్ని సామాన్య లక్షణాలుకూడా గోచరింప చేస్తాయి. ఇలాగ్గానే యిరవైయ్యో శతాబ్దానికి చెందిన కందుకూరి వీరేశలింగం పంతులుగారూ, గురజాడ అప్పారాయ కవీ, పానుగంటి లక్ష్మీనరసింహంగార్లవంటి ఏ ముగ్గురి రచనలయినా వీరి పరిశీలిస్తే, వారి వారి వ్యక్తిత్వాన్నిబట్టి తద్రచనలు భిన్న భిన్నంగా కనపడినప్పటికీ, ఒకే యుగానికి చెందినవి అవడంచేత—దేశంలో ఆంగ్ల విద్యా వ్యాప్తివల్ల కలిగిన భావ శబలత, దృక్పథాలలో మార్పు, నూతన రీతుల్లో రచనలు సాగించాలనే అభిలాష—యిలాంటివి యుగ సామాన్యం అయిన కొన్ని లక్షణాలు కనిపించుతవి.

అంచేత తేలింది ఏఁవిటి అంటే యుగ సంఘ పరిస్థితులను అనుసరించి కావ్య, ప్రబంధ రీతులలో ఆయా యుగాలలో జనించి, పరిఢవిల్లి, కొంతకాలానికి పాతపడి మూలపడి పోవడమూకూడా సంఘానికి సారస్వతంపైన ఉండే ప్రాబల్యాన్నే తెలియబరుస్తుంది. కాబట్టి ప్రాగల్భ్యాదికులయిన కవి శిఖామణుల మూలకంగా కావ్యరూపాలు యుగ యుగంలోనూ నూతన ఆకారాలు చేపడుతూ ఉంటాయి. అట్టి ప్రభావంవల్లనే నేటి రచనలలో నవలాది క్రొత్త రీతులు భాసిల్లుతున్నాయి.



ఆంధ్రరాష్ట్ర సాధనకు ఆంధ్ర ప్రజల ఏకగ్రీవామోదాన్ని పొందిన ఒక విధానాన్ని రూపొందించే నిమిత్తం త్వరలో సర్వాంధ్ర సర్వపక్షపరిషత్తు సమావేశపరచాలని, జూలై 16 వ తేదీన మదరాసులో జరిగిన ఆంధ్ర మహాసభ కార్యవర్గసమావేశములో తీర్మానింపబడినది.

పెద్ద కథ

# సూర్యాస్తమయం

మూలం : శాంతా రంగాచార్  అనువాదం: శ్రీమతి కొత్తపల్లి లలిత

ఆ పిల్ల గడపవతల నిల్చుంది. చేతిలో పుస్తకాలు- కళ్ళల్లో సందేహ సందిగ్ధాలతో నన్ను చూసి :

'మాకు మధ్యాహ్నం బడి విడ్చేశారు. అందుకని ఇంటికి పెందళాడే వచ్చాను' అంది ఏదో సంభాషణ సగంలో అందుకున్నట్లుగా.

'ఓహో- అలానా, అవుతే ఈ చుట్టుపట్లే నన్నమాట మీ ఇల్లు' అన్నాను, మెల్లిగా కోటు తొడుగుకుంటూ.

దీనికి జవాబివ్వకుండా నాకేసి తమాషాగా చూసి వూరుకొంది.

'మీరు తెలుగులో పుస్తకాలు వ్రాయకూడదూ?'

'ఏం? వ్రాయాలంటావా?'

'అవును. తెనుగులో వ్రాస్తేనేకూడా చదువుకోవచ్చును'

'పోనీ, నువ్వే ఇంగ్లీషు నేర్చుకోరాదూ?'

'ఓస్ అదేగా నే చేస్తున్న పని !'

'ఇంకేం. అవుతే ఏ క్లాసు?'

'III Form'

'ఓహో. అవుతే ఆరేళ్ళలో ఇంగ్లీషు బాగా మాట్లాడ్డం వస్తుంది'

'ఓస్. అదెంతపని. అంతకన్నా ముందుగానే నేరుస్తాను'

ఎంత చులాగ్గా అందీ ! ఈ కొత్తపిల్ల పెంకితనాన్ని గూర్చి ఆలోచిస్తూండగా మనోరమ గదిలోకి వస్తూనే పిల్లని చూసి తటాలున ఆగిపోయింది.

'సరేలే. పైకి వెళ్ళి ఆడుకో. చీకటి పడేదాకా ఇంట్లోకి రాకు. తెలిసిందా?' అంటూ మళ్ళీ గద్దించింది మనోరమ.

'నాకేం అర్థం కావటంలేదు. ఈ పిల్లని చీకటి పడేదాకా రావద్దంటావు దేనికే? ఈ పిల్ల ఎవరూ?' అన్నాను ఆశ్చర్యంతో.

మనోరమ భయపడుతున్నట్లుగా నాకేసి చూసి వూరుకుంది. నేనిక సహించలేక ఆ పిల్లనిచూసి 'ఏయ్ ఎవరు నువ్వు? నీ ఇల్లెక్కడా?' అనవసరమైన ఉద్రేకం నా కంఠంలోకి వచ్చింది.

'ఇక్కడే వుంటాను-' అంది స్ఫుటమైన గొంతుతో. ఆ వాక్యం పూర్తి చేసిందో లేదో మనోరమ మండిపోతూ దాని చేతిలో పుస్తకాలు లాక్కొని పైకి నెట్టివేయబోయింది.

'ఏయ్ ఏమిటీ గొడవంతా?' అని దబాయిస్తూ పిల్ల నామె చేతుల్లోంచి విడిపిస్తూ 'ఆగు ఈ పిల్లమీద చేయి చేసుకోకు. నిన్నే అడుగుతుంట- ఎవరీ పిల్ల?' మనోరమ తలుపు వెనకాల నుంచుని మాట్లాడలేదు.

'మా అమ్మ.' అన్నది పిల్ల.

'అమ్మ?' ఆశ్చర్యంతో తలుపు వెనక్కి చూసాను. 'ఇంకేం ! నీకో కూతురుందన్నమాట ! మంచి బాగుంది.' అన్నాను. ఆమె ముఖం మీది భయం నా ప్రశ్నకు సమాధానం.

'ఇన్ని సంవత్సరాలనుంచి దాన్ని ఎక్కడ దాస్తూ వచ్చావు? ఈ ఘనకార్యం మీ మేనత్త కొడుకుదనుకుంటాను'

'మా అమ్మతో అలా మాట్లాడవద్దు. ఎంత సాహసం' అని పిల్ల బుస కొట్టింది. మనోరమ నిట్టూర్చింది. ఏడ్పుకు సిద్ధమైంది. పాపం ! ఏంచేస్తుంది.

'ఈయనెందుకు రానిస్తావమ్మా ఇక్కడికి? నిన్నిలా ఈసడిస్తున్నాడు'

'రాక్షసిలావుందే ఈ పిల్ల, నీ కూతురేనా ?'

'నా కూతురే, నా మొదటి ప్రణయం పదేళ్ళ క్రింద టిది. ఇక అంతా అర్థమైందనుకుంటాను'

'ఇటువంటి విషయాలతో నాకేమీ సంబంధంలేదు' అతి ముభావంగా జవాబిచ్చాను.

'నిజమేనా! ఏ సంబంధమూలేదా?' అంది ఆశతో నా వేపు చూస్తూ.

'ఊఁ! నిస్సందేహంగా. నీ జీవితంలోకి నేను రాక పూర్వం నువ్వేమో మహా మడిగట్టుకూర్చున్న కన్యామణి వనుకోలేదులే! ' ఆమెను బాధకలిగిస్తున్నాననే ఉద్దేశ్యం నన్ను సంతోషపెట్టింది.

ఈ వాక్యాలకాపిల్ల కోపంతో కొయ్యబారిందని చూడ కుండానే గ్రహించా. నా కాగితాలతో తలుపు వద్దకు బయలుదేరాను.

'చీకటి పడేదాకా దాన్ని వీధిలో వుంచక్కరలేదు. దానికున్న వుక్రోషంతో ఇంట్లో కంటే అవతలే అల్లరి పాలవుతుంది సుమా.'

నిజమే "తన్ను తర్వాత తాయిలం_" అని పిల్ల మూతి విరిచి నా కందకుండా పారిపోయింది. తలుపు తీసుక మెట్లు దిగి వీధిలోకి వెళ్ళాను. ఎందుకోగాని మళ్ళీ వెనక్కు వెళ్ళి గదిలోకి తొంగిచూశాను...ఆ పిల్లమాత్రం కనుపించ లేదు... మనోరమ విషాదం మూర్తీభవించిన ప్రతిమలా నేలకేసిచూస్తూ కుర్చీలో కూర్చుని వుంది... ఆమె జుట్టు విరబోసుకొంది... నేలమీద పొడుగాటి సవరం వొకటి పర్చివుంది... ఎంతో అందమైందనుకొన్న ఆ నల్లని జుట్టంతా కృత్రిమమా! మెల్లిగా తలుపు జారవేసి వెళ్ళి పోయాను... ఆమె తలెత్తి చూడేనాలేదు. బహుశః నేను రావడం ఆమె గుర్తించివుండదు.

* * *

ఆనాటితో నటనంతా ముగిసింది. ఆ అమ్మాయి ఇల్లంతా తిరగడం మొదలుపెట్టింది. బడినుండి ఇంటికి రాగానే తల్లితో అంతులేకుండా ఏదోదాన్ని గుర్చి పటపట వాగుతూ వుండేది. నేను చూసిన వాళ్ళలో ఇంత ప్రేమించ డానికి వీలేని పిల్లని ఎక్కడా చూడలేదు. బక్కచిక్కిన దేహం, ఎప్పుడూ ఆకలితో చూసే కళ్ళు. ఆ పిల్లలో అందమైంది ఒక్కటే_ అది వాళ్ళమ్మను బోలిన తెల్లని పలు వరుస. సంప్రదాయసిద్ధంగా మనం అందమైనవని చెప్పుకొనే కళ్ళు కావు. కానీ ఆచూపుల్లో మనల్ని ఆకర్షించే గుణం ఏదో వుంది. జీవం కదలిక, అతృప్త పుణికి పుచ్చుకున్నవి ఆ కళ్ళు రెండూ! అందులో రహస్యాలు దాక్కొవు. దగా చేస్తుంటాయ్యా చూపులు...కోపం రాగానే కళ్ళుకాస్తా భగ భగ మండై. ప్రారంభంలో నాయందు కల్గిన కోపాన్ని ఒక చాక్లెటు పెట్టితో పోగొ ట్టినా తరుచు కోపం వస్తూనే ఉంటుంది. దానిక్కారణం? బహుశః వాళ్ళమ్మకీ నాకూవున్న సంబంధం! వాళ్ళమ్మంటే ఎంతో ప్రేమ. నాతో కలిసి వున్నప్పుడు మనోరమను ద్వేషంతో చూసేది. నాకా పిల్లమీద ఏమాత్రం ప్రేమ కలగకపోయినా, ఆ ఇంట్లో అది తిరగడానికి అలవాటు పడ్డాను.

ఇలా వుండగా ఓ రోజున మనోరమని చూడ్డానికి వెళ్ళి నప్పుడా పిల్ల కనుపించలేదు. ఆశ్చర్యంతో అడిగాను.

'ఈ వూళ్ళో లేదు' అంది మనోరమ.

'ఎక్కడికి వెళ్ళింది? పారిపోయిందా'

'తండ్రి దగ్గరికి వెళ్ళింది' బాధకల్గినా కోపం వచ్చినా ఉపయోగించే కంఠస్వరంతో__' నేనే పంపించాను ' అన్నది.

'అయితే, కన్నతండ్రి ఎవరోకూడా ఎరుగుదువన్న మాట?' ఇలా అనాలనే నా వుద్దేశ్యం కాకపోయినా మాట జారింది. అయినా వ్యవహారదృష్ట్యా ఆ ప్రశ్న సరిగ్గానే వుందనుకొన్నాను. మనోరమ నావేపు తిన్నగాచూసింది...

'మీకంటే ప్రపంచం చాలా విశాలమైందని మీరు మర్చిపోయారు'

'అంటే? ఆ పిల్లతండ్రి నాకంటే ఉన్నతస్థితిలోని వాడనే ధ్వని నీ మాటల్లో ఉంటే ఇంకో ప్రశ్న దానంతట అదే వస్తుంది. అలాంటి వాణ్ణి ఎందుకు వదిలేశావు? పాపం!'

'ఆయనే నన్ను వదిలేశారు'

'ఓహో ! అవుతే నువ్వతనికంత తగిన దానివని తోచక నిన్ను వదిలేశాడన్నమాట. ఇంక నేనీ శిథిలాలవద్ద పాకులాడుతున్నా. నన్ను నేనెలా గౌరవించుకోను? నువ్వే చెప్పు.'

'ఇక్కడ శిథిలాలేమీ లేవు. పట్టెడు బూడిద తప్ప !'

ఆమె ఉద్దేశ్యం? నాకు పట్టరానంత కోపం వచ్చి దగ్గరగా వెళ్ళా.

'సరే కొట్టండి_ ఊఁ.'

'ఛీ. ముండా. ఇంకా వాణ్ణే కోరుతోనాతోనా వుంట' అసహ్యాన్ని ఆపుకోలేదు.

'మీరేమీ అర్థం చేసుకోలేరు.'

'వాడి దగ్గరకు వెళ్ళి నిన్ను మళ్ళీ స్వీకరించమని ఏడ్వలేకపోయావా ?'

'ఆయనికి పెళ్ళయివుంటే తప్పకుండా మీరన్నపనే చేసేదాన్ని'

'పెళ్లయివుంటేనా? పెళ్లి కాకుండా వుంటేనా?''

'పెళ్లయివుంటేనే !'

'సరే. ఇప్పుడర్థమైంది. నీకిదో సరదా వుందని ఎరుగనులే. భార్యాభర్తల్ని వేరు చేస్తేనేగాని నీకు హాయి లేదన్నమాట. చాలా బాగుంది. అయితే నా విషయంలో మాత్రం నువ్వలా చేయనందుకు నన్ను అభినందించుకోవాలా ఏమిటి చెప్మా?'

'అదికాదు. వివాహితులు ఇటువంటిదాన్ని బాగా అర్థం చేసుకోగలరు. వాళ్ళ మనస్సులు వంకరటింకరగా వుండవు. కొంత వైశాల్యం హృదయంలోకి ప్రవేశిస్తుంది పెళ్ళవగానే.'

నేనప్పుడే ఆమెను చావబాదేవాణ్ణి !

'నా హృదయం ఒంకరటింకరగా వుందికదూ ?'

'లేకపోతే__మీరెందుకు పెళ్ళి చేసుకోరు?' ఇంకా చిరాకుతో అంది. 'ఇక్కడికి రావడం దేనికి? చెప్పండి చూద్దాం?'

'ఓహో. అదా__మగవాళ్ళు నీ సాటివాళ్ళదగ్గరకెందుకు వస్తారో నీకు చెప్పాలా? అనుభవజ్ఞురాలివి !'

'లేదు. అది అప్రయత్న సిద్ధంగా జరిగింది. మీ జీవితం ఇంకొకరితో సమంగా పంచుకోడానికి ఇష్టపడదు?'

'కాదు. కాదు. వెయ్యిసార్లకీ కాదు. స్త్రీలని కాలక్షేపానికి భరించడమే దుస్సాధ్యం. అలాంటిది జీవితమంతానే. అమ్మో !'

'ఏం ? మీకు మేమంటే అంత అసహ్యం?'' మమ్మల్ని నీచంగా చూస్తేనేగాని మీకు తృప్తి వుండదు. మీరు గౌరవించవలసిన వారితో చనువుగా వుండడాని కెందుకంత భయపడ్తారూ?'

'నిన్ను నీ చేతులార నాశనం చేసుకుంటున్నావు సుమా !'

'నాశనం చేసుకోనూ! నేను ముండను. పతితను. మీరు దయదల్చి నన్ను ఈ పెద్ద ఇంట్లో ఆదాయంతో ఉంచకపూర్వం నేనూ మిగిలిన వాళ్ళవంటి దాన్నే. కాకపోతే మరేముంది గనుక? మా బ్రతుకు తెరువు మేం మేం చూసుకోవద్దా.? మగవాళ్ళు మంచి బేరగాళ్ళు. పరస్పరంగా అవసరాలు తీరుతవి. ఆ బాంధవ్యం అంతవరకే ! వాళ్ళంతా మీరు నన్ను ఈసడించిన విధంగా నన్ను చులకన చేయడానికి వీల్లేదు. నా ఆత్మను విక్రయించ నవసరం లేకపోయేది. వాళ్ళ పనై వెళ్ళగానే నేను మళ్ళీ నా మామూలు వ్యక్తిత్వాన్ని తెచ్చుకోగలను. మళ్ళీ ఇంకోరాత్రి వచ్చేవరకూ అందరి మనుష్యుల్లా నేనూ నవ్వుతూ చిరాకుపడ్తూ కావలసింది సరదాగా తింటూ__ కాలాన్ని అసహజంగా గడిపేదాన్ని.

'నే చూపిన దయాదాక్షిణ్యాలకిదా ప్రతిఫలం ? పెంటపోగులో పురుగులా గిజగిజలాడవలసిన నిన్ను నాగరిక స్త్రీవలె బతకడానికి సావకాశం కల్పించినందుకా ?'

'చాలా కృతజ్ఞురాల్ని !' ఏకోశానా కృతజ్ఞత ధ్వనించేటట్లులేని కంఠస్వరంతో జవాబిచ్చింది. కానీ ఇవన్నీ మీరిచ్చినా నన్ను, హృదయం, ఆత్మా లేని దానిగా మంచం మీద ఉపయోగించి అవతలకు తోసి పారేసే ఒక వస్తువుగా మాత్రమే లక్ష్యపెట్టారు. మీరు నా దేహాన్నేకాక అంతకంటే ఎక్కువ ప్రియమైన నా హృదయాన్నికూడా ఉపయోగించుకొన్నారు. నేను మీ

అహంకారానికి సానరాయిని. నన్ను అవమానించిన ప్రతి సారీ, అది మీ అహంభావాన్ని ఎక్కువచేసి మీకు అధికార సంబంధమైన శక్తిని ఇస్తోంది. పెళ్ళామైతే అటువంటిది సహించలేదు—ఆఖరికి మీరన్న పెంట పోగుమీద పురుగుకూడా సహించదు'............

అంతే. కోపంతో ఇల్లు వదిలేసి వీధిలోకి వచ్చా.... బాధతో ఉదాసీనంగా వూరంతా తిరిగాడాను... ఓ వారం తర్వాత మళ్ళీ అదే యింటికి తిరిగి వచ్చాను. గత కలహాన్నిగూర్చిన ప్రసక్తి తేలేదు. మనోరమకూడా ఏమీ అనుకోకుండా వూరుకుంది... ఆమె తరుచు వెళ్తూవచ్చినా ఆమె శరీరంమీద మళ్ళీ చేయి ఎప్పుడూ వేయలేదు... ఏడేళ్ళు గడిచాయి......

* * *

ఆమె మరణకాలంలో సుశీల వచ్చింది. డాక్టరు పరీక్షిస్తూంటే మంచం పక్కని నుంచున్నా. డాక్టరుది ఆత్మతృప్తి వున్న నడివయస్సు. పొట్టిగా వున్న చేతివేళ్లు. పలచబడుతున్న జుట్టు. పరీక్ష చేసిన తర్వాత నిస్పృహతో తల ఆడిస్తూ—

'జాగ్రత్తగా వుండాలి. సాఫీగా జీవించాలి' అన్నాడు.

'మీ అభిప్రాయ మేమిటి?' అన్నా విసుగ్గా.

'ఈరకం మనుష్యు లీప్రకారంగా అంతమయ్యేవాళ్ళేను. యవ్వనం వున్నన్నాళ్ళు దేహాన్ని జీర్ణింప చేస్తారు. ఆ కామోద్రేకాలకు బలికావడానికి వీళ్ళు పూర్తిగా అర్హులే అంటాను.'

'డాక్టరుగారూ! మీరు కురుపుకు మందువేయడానికి బదులుగా దాన్ని రేపుతున్నారు.' గడపదగ్గరనుంచి వచ్చిందా సుకుమార కంఠస్వరం. ఎవరూ?... సుశీల!

మనోరమ మంచంమీదలేచి కూర్చుంది. ఠీవీగా నిల్చున్న ఆ పిల్ల తన కూతురని నమ్మలేకపోయింది. సుశీల నిమిషంలో తల్లిని జేరి తన లావణ్య హస్తాల్లో ఎండిపోయిన తల్లి చేతిని నిమురుతూ 'ఏమమ్మా, నాకింకా ముందే వ్రాయలేదెందుకూ? నే వచ్చేదాన్నిగా!' అంది లలితంగా.

'తప్పనిసరి అవుతేనేగాని నిన్ను పిలిపించడం ఇష్టంలేదు'

'తప్పని సరేమిటమ్మా— బాగానే వుందీవరస. ఏమండీ డాక్టరుగారూ, జబ్బు అపాయకరమంటారా?

'క్షయరోగం—' అన్నాడు డాక్టరు మోటుగా.

'ఆ. ఇదిప్పుడిప్పుడే మొదలైందిగా. గాలి మార్పుచేస్తే చప్పున నిమ్మళిస్తుంది' అన్నాను, డాక్టరు తెలివి తక్కువదనానికి మండి పడ్తూ.

కానీ నాకు తెలుసు— నన్ను నేను మోసగించుకుంటున్నానని! అంత్యదశలో వున్నది. పైగా అది పరుగులు వేసే క్షయరోగం!

* * *

మూడు రోజుల తర్వాత ఓ రాత్రి మనోరమ మంచంమీద కూర్చుని విపరీతంగా దగ్గడం మొదలు పెట్టి వెనక్కు పడిపోయింది... ఊపిరి అందడం లేదు... తెల్లారింది. సుశీల నాకోసం కబురు చేసింది—

'నిన్నరాత్రి పోయింది.'

'ఆ—'

'అవును. అర్ధరాత్రి.'

'నాకోసం కబురు చేయలేదేం?' అన్నా తీవ్ర విషాదంతో.

'ఎందుకూ?' అంది నావేపు చూస్తూ. గొంతులో అపహాస్యంలేదు. 'మీకు రాత్రిళ్ళు ఇక్కడకు రావడం ఇష్టంలేదని నాకు జ్ఞాపకం.'

* * *

అంతా అయిపోయిన తర్వాత జీవితం ఎంత సాఫీగా వెళ్తుందో తల్చుకొంటే సిగ్గు వేస్తుంది... మనోరమ పోయాక ఆ ఇల్లు సుశీలదైపోయింది... మొదట్లో ఆమె తల్లిమరణాన్ని ఏ విధంగా భరిస్తుందో ఊహించలేక కొంప తీసి నేను గనుక పెత్తనం వహించాల్సి వస్తుందేమోనని కంగారుపడ్డా. మంచినెమ్మది, గాంభీర్యం, పెద్దవాళ్ళతో సమానమైన ఆత్మవిశ్వాసం వున్న విద్యావతి పట్ల పెద్దరికం చేయడానికి మనస్సు తిరుగుబాటు చేస్తోంది. కాలం ఆమెను లొంగదీసుకోకపోతే బాగుండుననుకున్నా... రంగు

పులుముకొన్న ఆవీధిలోని ముఖాలు సుశీల లైబ్రరీకిగానీ- పోస్టాఫీసుకుగాని వెళ్తూంటే పరిశీలిస్తూండేవి. ఆవూళ్ళో ఆమె వెళ్ళే స్థలాలవి రెండేను. ఏదో లైబ్రేరియన్ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నట్లుగా తెలిసింది. క్రమేణా తల్లిపోయిన దుఃఖం పోవడంతోనే మెల్లిగా మామూలు మనిషి కావచ్చింది. అంతులేని ఆనందంతో హుషారుగా వుండే వ్యక్తి సుశీల. దానికితోడు కొంచం అహంభావం. నేను తరుచుగా వాళ్ళింటికి వెళ్ళి ఆమెను షికారుకు తీసుకొని పోతూండేవాణ్ణి... ఓ రోజు అన్నాను 'నువ్వీ ఇంట్లోంచి మారవా?'

'ఎందుకూ?' నా కళ్ళల్లో కళ్ళుపెట్టి అడిగింది.

'ఏమీలేదు. నువ్వు మిగిలిన వాళ్ళవంటి దానివి కావుగదా?'

'నాకు వాళ్ళందర్నీ గుర్తించడం అలవాటులేదు.' అంది తూష్ణీభావంతో.

ఆవిషయమైన సంభాషణ ఆమెకు ఇష్టంలేదనిగ్రహించా. బహుశః ఆమెకు- ఆవీధి పాత స్మృతులను జ్ఞాపకం చేసే దానిగా ఉపయోగపడుతోందేమో. ఆ విధంగా ఆ వీధి ఆమె దృష్టిలో అమూల్యం కావచ్చునని నుకొని వూరుకున్నా.

'స్కూల్లో పని నీ కిష్టమేనా?' అన్నా విషయాన్ని మారుస్తూ.

'ఓ. తప్పకుండా. ఒక్క ఐదేళ్ళపాటు లైబ్రేరియన్ పనిచేసి, చేతికిదొరికిన పుస్తకాలన్నీ చదివి పారేయ్యాలి' అని కొంచంసేపాగి 'అన్నట్టు మీ రచనలు చదివాను' అంది.

'ఓ దానికేం భాగ్యం. ఓ రోజు నువ్వో పుస్తకం వ్రాయొచ్చు' అన్నా ఎగతాళిగా.

'అంత సాహసం చెయ్యను' అంది నవ్వుతూ.

'ఏముంది గనుక. ఎంతో తేలికైనపని. బల్లముందు రోజుకిన్ని గంటలని కూర్చుంటేచాలు.'

'అది అంతకంటే విశిష్టమైనది మిసర్. నేనే పుస్తకం వ్రాస్తే నా ఆత్మ అంతా అందులోకి వచ్చేదాకా వూరుకోను' అంది.

'సుశీలా. నన్ను ఆశ్చర్య పెడ్తున్నావు. కొంపతీసి నువ్వో ఛాందసు రాలివేనా చెప్మా. కలం నీ హృదయంలో ముంచిరాస్తే అదంతా కేవలం రాగపూరితమైన తుక్కు- అవుతుంది.' నేననుకున్నట్లు దీనికామె నవ్వలేదు.

'నాకు రాగరంజితహృదయం వుండని మీకెలా తెలుసు'.

"అవును. నీవయస్సు అదే వయస్సులో వుంది. ఆకైమలో పిల్లలంతా రాగరంజిత హృదయాలు కలిగి వుంటారు!'

'I See. అదా మీ గొడవ. మధువు, నీరవసంగీతం, శిల్పం, మధుర ప్రేమ మంచిచెడ్డలు— ఈ తెలివి మాలిన వన్నీ నా స్వప్న వీధిలోని సామగ్రి అనుకుంటున్నారన్న మాట. భళే!'

'మిగిలిన వాటిని గూర్చి నాకు తెలియదుగానీ- మధువు మధురప్రేమ, సంగీతం, శిల్పం—ఇవన్నీ నీ కలలనే నా అభిప్రాయం'

'మీకు ప్రేమమీద నమ్మకం లేదు కదూ?'

'మునుపు దానిమీద ఎక్కువ నమ్మకం వుండేది. అంటే- అది నిత్య జీవితంలో అతి చవకగా దొరికే కృపణ వస్తువు కాక పూర్వం.'

'ప్రేమ వెలుతురంత సామాన్యమైనా- దానితో పరిచయం అవజ్ఞత కలిగించదు, విశాల ఆకాశంలా సర్వపోషక మైన గాలిలా, అది నక్కనీ నాగలోకాన్నీ సమానం చేస్తుంది' అంది వివరాల్ని విప్పి చెప్పాలనుకొనే కళ్ళతో.

'అదిగో అక్కడే నా ప్రతిబంధకం. చాలా నక్కలు నాకలోకంలోని దేవతా దుస్తుల్ని ధరిస్తాయి. అందులో దురహంకారంలేని మంచివంటూ వుంటే అవి నాకియ్యి. ఆనక్కలే నాకు చాలు.'

'I See. ఇతరులు భగవంతుని భావం వహిస్తే ఓర్చుకోలేని ఆ కొద్దిమందిలో చేరేవారా మీరు.'

నాకు నిష్కారణంగా కోపం వచ్చింది.

'చాల్లే ఊరుకో. నువ్వన్నట్లు ప్రేమ, నక్కనీ నాకలోకాన్నీ ఏకం చేయగలిగితే, ఆ ప్రేమసౌందర్యం నన్నంటకుండా, దాని నీడలోనే నించుంటాను. నాకది చాలు.

అప్పుడు నక్కలూ నాకలోక దేవతలూ తమ తెలివి తక్కువలను ప్రదర్శించుకొంటూంటే నే చూస్తూండవచ్చు.'

'ఛాయల కౌగిలింతతో హాయిచెందే వాళ్ళకీ ఆ నీడలకు కర్తే చలనమే కల్గుతుంది.' అంది ఉత్సాహంతో. ఆమె భావవీధిలో కడుగు లెట్టి 'వస్తువుని ఓసారి చేతుల్లోనికి తీసుకొని యావజ్జీవం దాన్ని పోగొట్టుకోడంకంటే నీడలే నిలకడ గలవేమో!' అన్నాను నా అభిప్రాయంగా.

'ఈమాటలు అచ్చంగా మీవే' అని ఎగతాళి చేసి కానీ 'పరిపూర్ణమైనది క్షణంలో సగమే నాచాలు.' నాకు మాత్రం ఏం లాభం?

నీకాక్షణంలో సగం ఈ వెధవ వూళ్ళో దొరికేది కాదు.

'ఏ- ఎందుకు దొరకదూ?' కళ్ళు కొంచెం చిట్లించి నావేపు ఓరగా చూసింది. అప్పుడు అచ్చు వాళ్ళమ్మలా కనుపించింది.

'నీకు కావలసింది మహాపట్నం—— నీ ఊహలకు ఆశలకు భ్రాంతులకు తగిన అవకాశం ఇవ్వగల్గినంత మహాపట్నం! సరేకానీ నువ్విక్కడికి మళ్ళీ తిరిగి వచ్చావేమి? మీనాన్నగారి వూళ్ళోనే లైబ్రేరియన్ కాలేకపోయావా?' ఈ ప్రశ్న ఎన్నెళ్లనుంచో అడగవలెననుకొంది, అడిగాను.

'నన్నలా చేయనివ్వరాయన. నా యవ్వనాన్నంతా వృధాచేస్తూ అర్ధంలేని, రూపం లేని సోమరితనంతో గడపాల్సింది అంతే. అంచేత మా నాన్నతో స్పష్టంగా చెప్పే నేను. 'నాన్నా మీరు పుష్పంలేని ఓ చెట్టుకోసం అనవసరంగా శ్రమపడుతున్నారని. అంటే నా అభిప్రాయం అక్కడ మొగ్గ దొడగలేదని-' నవ్వులతో పూర్తిచేసింది వాక్యాన్ని.

నేను సమ్మోహితుణ్ణి కాక తప్పలేదు.

'నువ్వు మంచి మాటకారివి సుశీలా!'

'పైగా నాకు బాధ్యుణ్ణి అన్నాడు మా నాన్న. నా అవసరాల్ని తీర్చడం ఆయన విధి అన్నాడు. అవసరమున్న దాన్ని అలా కేవలం బుద్ధిబలంతో సమర్ధించకు అన్నా నేను' నేను నవ్వలేక నవ్వలేక రోడ్డు పక్కని వున్న చెట్టును పట్టుక నిల్చున్నా కాస్సేపు.

'అసాధ్యురాలివి సుశీ. నిన్ను సాకి పెద్దచేసినందుకిదా కృతజ్ఞత?'

'కృతజ్ఞత!' అంది చీదరించుకుంటూ సుశీల. 'అది నరకంలోని లోతులు మా పిన్ని ఎలాంటి మనిషను కొన్నారు? గయ్యాళి గంప. విషపురుగు. ఆమె ఒకసారే నవ్వడం చూసాను. అది నేను వచ్చేసేప్పుడు! నాన్న పిన్ని చేతుల్లో మూది బొమ్మ!'

'నీకు తెలవదేమో. మీ అమ్మకి ఆయనంటే చాలా ప్రేమ.'

'Did She?' అంది తటస్థంగా 'ప్రేమిస్తున్న మమ్మల్ని ముందరుంచుకొని గతించిన ప్రేమకోసం పరితాప పడడం వివేకంకాదు!' అక్కడితో వూరుకుంది

అప్పట్లో నే నామెను అర్ధం చేసుకోలేదు. నా దృష్టిలో ఆమెకింకా స్త్రీత్వాన్ని ఆపాదించలేదు. జీవితంలో బొమ్మలాట లాడుకుంటూ చమత్కార వాక్యాలతో కళ్ళలో చిలిపితనం, పెదవులపై మందహాసం దొంతర్లుగల అల్లరి పిల్ల... నాకళ్ళ కింతే కనుపించింది. నా వయస్సు యాభై. ఆ పిల్లది ఇరవై. సమస్త ఉద్రేకాల్ని కడిగివేసుకొన్న ఖాళీని నేను. సుశీల అప్పుడే ఉల్లాసంతో సూర్యునికి వికసించే తొలి మొగ్గ. రెండు సంవత్సరాలలో ఎప్పుడు పడితే అప్పుడు పోగల్గినా ఆమెను చాలా తక్కువ సార్లు కలుసుకొన్నా. నా పుస్తకంతోనే నాకు సరిపోయేది. మెల్లి మెల్లిగా నాకు అవగతం కావచ్చింది. ఆమె ఈ సంవత్సరంలో ఎంతగా మారుతూ వచ్చిందో. నేనా మార్పు ఊహించినంతగా గుర్తించలేదు. ఆమె చిరాకుగా, విసుగ్గా ఇదమిద్ధమని చెప్పలేనట్లుగా ఉంది. అంతలో నవ్వు, అంతలో ఆగ్రహం, అంతలో ఏడుపు. ఇదీ సగస. నా పుస్తకం ఆమెకంత కుతూహలాన్ని కల్గించకపోయినా దాన్ని గూర్చే విశేషంగా మాట్లాడేవాణ్ణి. అదికాక వ్యక్తిగతమైన సంభాషణలు మాకిద్దర్కీ దెబ్బలాట్లు తెచ్చేవి. అధోరణి నా కిష్టంలేదు. ఓసారి నేను ఆమెతో యాదాలాభంగా భవిష్యత్తుని గూర్చి ప్రశ్నించాను. వెంటనే మండిపడుతూ విరుచుకపడింది నామీద. "మీరు నా జన్మకు కారణం కాదు. అందులోమాత్రం మీ

(46-వ పేజీ చూడండి)

## నాడు — నేడు

# వస్తుసామగ్రి

* శ్రీమతి పాటిబండ త్రిపురసుందరమ్మ *

మానవుని మొదటి గృహము కొండగృహం. అదైనా గాలి, వాన, యెండ మొదలైన వాటినుంచి కాపాడుకొనుటకు గృహమనునది మానవునికి అవుసరమనిపించింది. అతని గుహలో వేటకు పనికివచ్చేటట్టు అరగతీసిన రాతిపనిముట్లు అతని వస్తుసామగ్రులు. పాత్రలు అనునవి అతను యెరుగనేయెరుగడు. మానవుని విజ్ఞానము పెంపొందినకొలదీ, అతని అవుసరాలు యెక్కువైనకొలదీ, అతని అలవాట్లు మారుతున్నకొలదీ, అతను వాడే వస్తుసామగ్రికూడా మారుతూ వచ్చింది. ఆహారము వండి తినడమనేదికూడా మానవచరిత్రలో తరువాత ప్రకరణమే. మహేంజోదారో, హరప్పాలో భూగర్భితమై ఇటీవలే బయటపడ్డ వస్తుసముదాయముల మూలముగా, నాటినాగరికత, అద్భుతమైనదని తెలుస్తుంది. అప్పటికే వెండి, బంగారు లోహములతో వస్తువులు తయారుచేసి, వుపయోగించుకునే నేర్పు మానవునికి లభించింది. క్రమేణా ఒక గృహము నిర్మించుకుని, తనకు ఉపయోగపడే వస్తుసామగ్రి చేర్చుకొని నాగరికుడనిపించుకున్నప్పటినుంచి అతనినిగూర్చి మనకు యెక్కువ తెలుసు.

మానవుడు దేవుని ఒకరూపములో నిర్మించుకొని, ఆరాధించుట మొదలుపెట్టిన తరువాత ప్రతిగృహమందు ప్రత్యేకముగా వక గది ఏర్పాటైనది. పోనుపోను మానవుడు ప్రకృతిలో తానుచూచి ఆనందించిన దృశ్యాలను చెక్కడము, చిత్రించడము మొదలైన లలితకళలలో నిపుణుడైనాడు. ఆ కళావిజ్ఞానాన్ని తను ఉపయోగించే ప్రతివస్తువును తయారుచేయుటలో వినియోగించాడు. కళ నిత్యజీవితములో ప్రతిఫలించినపుడే, అది సార్థకమైనదన్న సత్యాన్ని రుజువుచేశాడు. నాటిపూజామందిరముండే గది కళామందిరముగా, కళ్యాణమయముగా యుండేది. రంగు రంగుల పూలతో, పసుపు కుంకుమల కలయికలతో, ముగ్గులతో దీపస్తంభాల వెలుగులో, అగరుకర్పూరాది సుగంధములతో, కళకళలాడుతూ ఉండేది. ఆ దీపస్తంభాలు రకరకాల ఆకారంతో, లతలతో, పూలతో చెక్కబడి ఉండేవి. ఇప్పటికి కొన్ని దేవాలయాలలోని దీపస్తంభాలు కళావిశిష్టతను చాటుతూ యుంటాయి. ఎలక్ట్రిక్ దీపాల ఉపయోగానికున్నా, దేవాలయాలలో యుంచిన దీపస్తంభాలను అలంకారార్థం యింకనూ అమర్చుతున్నారు. అప్పుడు గృహమునంతనూ కళావంతముచేసేది.... ఆ ఒక్కగదే.

ఉపయోగించుకునే వస్తుసామగ్రిలో పంచపాత్ర, ఉద్ధరిణ, పాత్రలు, పళ్ళెములు, ముఖ్యమైనవి. ఉద్ధరిణ తలలు పడగ విప్పిన నాగుపాములాగున, లతలుగాను, నగిషీలు దిద్దబడి యుండేవి. యిక మనముపయోగించే బిందెలు, పాత్రలు, మరచెంబులు ముఖ్యముగా ఆంధ్రదేశములో అంతమార్పు చెందినట్లు కనిపించదు. అప్పటికీ, ఇప్పటికీ ఒకే ఆకారములో ఉంటున్నాయి. దక్షిణాది బిందెలు, మరచెంబులు, మంచినీళ్ళు త్రాగే పాత్రలు, ముఖ్యముగా పాలఘాటు కంచుసామగ్రులు, రకరకాల ఆకారాలతో మెరుస్తూ చూడడానికి యింపుగాయుంటాయి. మనము వాడుకునే పీటలకు వెండిపూల నగిషీలు సామాన్యముగా యుండేవి. వెండి కంచాలమధ్య, బంగారపు పూవు, ఉండడం ఆరోగ్యకరముగా భావించబడేది. పన్నీరు బుడ్లు, అగరవత్తులు అమర్చబడే వస్తువులు గంధపుగిన్నెలు, కూజాలు, తాబేటికాయలు, కొమ్ముచెంబులు ఆఖరికి, సన్యాసుల బిక్షాపాత్ర, కమండలము, అన్నీ కళానైపుణ్యాన్ని చాటుతాయి. స్త్రీలువాడే, దువ్వెన రకరకాలుగా దంతపు నగిషీతో ముచ్చట కొలిపేది. యిక పురుషులు వాడే చేతికర్రలు, వాటిమీద శిల్పము చెప్పుకోతగినది. వకటేమిటి, ప్రతివస్తువుమీద కళ తాండవించేది. నిత్యము ఉపయోగపడే వస్తువులే రేఖా, వంపువన్నె కలిగిన అందముతో, అలంకారములై యుండేవి. యీ సౌందర్యము ప్రథమంలో దేవతార్చనమీదికి అల్లుకుని, పుష్పించి పరిమళించేది.

మొగలు సాంప్రదాయము కొన్ని మార్పులు తెచ్చినది. మనదేశములో ప్రభుత్వపు అభిమానాన్ని పొందడానికనండి, ప్రభుత్వపు ఉద్యోగముల కనండి, మనదేశ

ములో కొన్ని కొన్ని మార్పులు తెచ్చుకున్నాము. ఇంటికి వచ్చిన అతిథిని తివాచీమీదనో, చాపలమీదనో, కూర్చో పెట్టడం, అనుకొనడానికి మెత్తని బాలీసులు, దిండ్లు యేర్పరచడం అప్పటి పద్ధతి. మొగలు సాంప్రదాయము కలిసిన తరువాత తమలపాకుల కొరకు ఒక నగిషీ పని చేసినపెట్టె- దానిని పాందాను అంటారు. దానిలో సుగంధ ద్రవ్యాలకు ప్రత్యేకపు అరలు యుండి వాడు కొనుటకు వీలుగా యుండేది. యీ తమలపాకుల పెట్టెలు మన హైదరాబాదు మిత్రుల యిండ్లలో కనిపిస్తూ యుంటాయి. వెలుపలికి వెళ్ళి ఉమ్మి వేయడానికి బద్ధకించేవాళ్ళకు, యిన్నిసార్లు యింట్లోకీ బయటికి వెళ్ళడం తాహతుకు తక్కువనుకునేవారికి ఉపయోగపడే మరొక విశేషము "ధూకీదానీ". తాంబూలము హిందూసాంప్రదాయములోను, మహమ్మదీయ సాంప్రదాయములోను ప్రధానమైనది. ఆంగ్లకాలములో, దానికి ప్రభుగౌరవము తగ్గినది. పెదవులకు రంగువేసుకోడం ప్రారంభమైంది. సామాన్యకుటుంబాలలో అతిథిని ఆదరించాలంటే కాళ్ళు, ముఖము, కడుక్కొనేందుకు నీళ్ళిచ్చి, పీటవేసి, ఫలహారమో, పాలో, మజ్జిగో యిచ్చి ఆదరించేవారు.

సంపన్నులు చిలుకలను, గోరింకలను, హంసలను, పెంచేవారు. వీటికి పంజరాలు, కృత్రిమ సరస్సులు, కొండలు నిర్మించుకున్నట్లు తెలుగు ప్రబంధాలలో కనపడుతున్నాయి. వింజామరలు, విసనకర్రలు విసరడానికి రాజాస్థానములలో స్త్రీలు, నౌకర్లు ఉండేవారు. వీణ వాయించి పాడడమునందు గౌరవముండేది. కాలము గడిచినకొద్దీ ఈనాటికి అతిథిరాగానే రకరకాలకుర్చీలు, సోఫాలతోగూడిన డ్రాయింగు రూములో చెప్పులైనా విడవకుండా కూచోబెట్టి, యెలిక్ట్రిక్కు ఫానుపెట్టి, రేడియోపెట్టి, కాఫీ, టిఫిను సిగరట్లతో ఆదరిస్తున్నారు. వెండి బంగారాలు తగ్గిపోయి యెవరుసిల్వరు, పింగాణీ, గాజు వస్తువులు వెలిసినవి.

కాలపు మార్పులవల్ల గృహారామములకు, వినోదవస్తువులకు వీలు తగ్గడంవల్ల బస్తీలలో పార్కులు, క్లబ్బులు హోటళ్ళు వచ్చి గృహోపకరణాదులకు బదులు, సంఘ ఉపకరణాదులుగా మారుతున్నాయి. స్త్రీలకు కోపమువస్తే తెల్లచీరకట్టి కోపగృహమునకు వెళ్ళినట్లయితే కోపశాంతి జరుగాలన్నమాట. ఇవి కృష్ణుడు- సత్యభామల కాలములో యున్నా యుండకపోయినా కృష్ణరాయల కాలములో యున్నట్లు పారిజాతాపహరణములో కనపడుతుంది.

ఉండడానికే ఇండ్లు దొరుకని యీ కాలములో, కోపగృహాలమాట- తాపగృహాలమాట యెత్తకూడదు — ఈ కాలానికి గృహోపకరణాలతోపాటు ఒకటి రెండు టిఫిను క్యారియర్లు, టీసెట్లు, శక్తికొద్దీ అమర్చుకుంటున్నారు. ఆపద్ధర్మంగాగాని, అలవాటుగాగాని పూటకూళ్ళ యింటి నుంచి, క్యారియరులో అన్నము తెప్పించుకొని, తాము తిని, అతిథులకు పెట్టడం మునుపు తప్పు అనిపించుకున్నా యిప్పటి పరిస్థితులలో తప్పుకాదు సరిగదా- కొన్నిచోట్ల ఫాషనైపోయింది. పదార్థాలు చేతులతో వడ్డించుకోడం, కలపడం, అనే పద్ధతి అంతరించిపోయి, లోహపుచేతులు చెంచాలు, ప్రవేశించినాయి. కిరసనాయిలు వచ్చింతరువాత కూడా, భోజన శాలలోను, చదువుకునేచోట్ల ఆముదపు దీపాలు వాడడం మనకందరకు తెలిసినవిషయమే. అందులో కండ్లకు ఆరోగ్యము వున్నదనేవారు. నేడో నీడకనపడనంత లైటు యుంటేగాని చాలదు. ఇంతకూ మార్పులలో విశేషమేమిటంటే, మనిషి శరీరశ్రమపడి మనసులో యూహించుకొని పూర్వము తెచ్చుకున్న సుఖములన్నీ, యిప్పుడు యంత్రసహాయంవల్ల సమకూరుస్తున్నారు.

కళా దృష్టి, సౌందర్య వాంఛ పూర్వమున్నంత యిప్పుడూ యున్నది. అది క్రొత్త క్రొత్త దోవలు తొక్కుచున్నది.

(ఆలిండియా రేడియో- విజయవాడ కేంద్రం వారి సౌజన్యంతో)





బాలానందం

# మిత్ర ధర్మం

* ద్వారకా జవహర్ *

ఒక ఊర్లో సుందరం, శంకరం అనే యిద్దరు స్నేహితులుండేవారు. వారిలో శంకరం జమీందారు పుత్రుడు. సుందరం, తల్లితండ్రి లేని అభాగ్య జీవి. వారాలు చేసుకుని శ్రద్ధగా చదువుకునేవాడు. సుందరం, శంకరం, యిద్దరూ ఒకటే క్లాసు. ఐదవ ఫారం చదువుతున్నారు. ఇద్దరూకూడా ఒకరిని విడిచి ఒకరుండేవారుకాదు.

జమీందారుగారికి వీరిద్దరి స్నేహం చూస్తే ఒళ్ళు మండేది తన కొడుకు ఒక బికారి వెధవతో, తిరగడమా ? అని ఆయన ఉద్దేశం. తనకు తెలిసినంతవరకూ సుందరాన్ని, శంకరాన్ని, ఒకటిగా తిరగనిచ్చేవాడుకాదు. ఒక్కగాని ఒక్క కొడుకు. శంకరానికి తల్లి చిన్ననాడే పోవడంవలన, ఎంతో ముద్దుగా పెంచాడు. అలాంటి వాడు చెడుసావాసాలతో చెడిపోతాడేమోనని అతని భయం ఎన్నిసార్లు శంకరాన్ని, సుందరంతో తిరగవద్దన్నా మానలేదు. కాని పాపం ! సుందరం స్థితి చూస్తే, శంకరానికి జాలిగా వుండేది. ఏమి చేయగలడు ? తండ్రి పిసినారి కావడంవలన, శంకరానికి ఒక్క కాని ఐనా యిచ్చేవాడు కాదు !

ఇలా వుండగా ఒక రోజు శంకరానికి పుట్టినరోజు వచ్చింది. ఆవేళ వాళ్ళిల్లు కలకల్లాడుతూ, పచ్చ తోరణాల్తో మెచ్చుకునేటట్లుంది. వచ్చేవారు పోయేవారితో యిల్లు ఒకటే గోలగా వుంది.

మరి నాలుగు రోజులకి సుందరం పుట్టినరోజు వచ్చింది. ఈ వార్త సుందరం, శంకరంతో చెప్పేడు. ఈమాట శంకరానికి చాలా కష్టంగా తోచింది. తన పుట్టినరోజుకి, సుందరం పుట్టినరోజుకీ ఎంత భేదం ! కారణం ? డబ్బు !

ఆవేళ రాత్రల్లా శంకరానికి నిద్రపట్టలేదు. ఎట్లాగైనా శంకరం, సుందరంయొక్క దరిద్రాన్ని పోగొట్టాలని ఆలోచించేడు. ఏదో ఉపాయం తట్టింది. ఆ రాత్రి హాయిగా నిద్రపోయేడు. మర్నాడు వుదయాన్నే నిద్రనుండి లేచి, సుందరాన్ని కలుసుకున్నాడు. సుందరంతో తను రాత్రి ఆలోచించుకున్న ప్లాను చెప్పేడు, శంకరం. "వద్దు ! శంకరం, నా గురించి నీకెందుకు శ్రమ ?" అన్నాడు సుందరం. "ఫరవాలేదోయ్ ! యిదొక కష్టమేమిటి?" అన్నాడు శంకరం. ఆవేళల్లా శంకరం తనింటికి వెళ్ళలేదు. మర్నాడు వెళ్ళలేదు. కొడుకు కనిపించక పోవడంవల్ల జమీందారుగారు పడ్డబాధ యింతా అంతాకాదు.

మూడోరోజు దినపత్రికలో యిలా పడింది—"తప్పిపోయెను ! నా కుమారుడు, పేరు శంకరం. 14 సంవత్సరములు. వెదకి యిచ్చినవారికి 500 రూపాయలు బహుమానం" అని. ఇది చూసి శంకరం, సుందరంతో, "మన పాచిక పారింది ! పద !!" అన్నాడు. ఇద్దరూ

జమీందారుగారింటికి వెళ్ళేరు. చింపిరిజుత్తు, చిరిగిన బట్టలూ కట్టుకొనివున్న శంకరాన్ని చూపి జమీందారు బావురుమన్నాడు. "అయ్యా! చూశారా !! ఇతను రైలు పట్టాలపై పడుకొని వుండగా, తీసుకు వచ్చా!" అన్నాడు సుందరం. వెంటనే జమీందారు "బాబూ! నీవు నాకు పుత్రభిక్ష పెట్టేవు", అని 500 రూపాయలు యిచ్చి, సుందరాన్ని తనింట్లోనే వుంచుకున్నాడు. నాటితో సుందరం కష్టాలు గట్టెక్కేయి.

చూశారా! శంకరంయొక్క మిత్ర ధర్మం !!

★

# బసవయ్యా బండి

* కె. వి. రమణా రావు *

ఒకానొక వూరిలో ఒక బసవయ్యా ఉండేవాడు. అతను మంచి స్వభావము కలవాడు. అతని భార్య పేరు రాజేశ్వరి. అమె గయ్యాళి. అతనికి ఒక బండి కలదు. ఆ బండిమీద డబ్బు తెచ్చుకుని పొట్ట పోషించుకొనుచుండెను. ఒక రోజున బసవయ్యాకు ఎంతతిరిగినా డబ్బు దొరకలేదు. అప్పుడు బసవయ్యా విచారముతో తన ఇల్లు చేరుకొనెను. ఇంటికి రాగానే భార్యకి డబ్బు తేలేదన్న సంగతి తెలిసి బసవయ్యాను నానా చీవాట్లు పెట్టెను. బసవయ్యాకి కోపమువచ్చి నేను డబ్బు తెస్తేనేగానీ ఈ గుమ్మము ఎక్కనని బయలుదేరెను. అతను బయలు దేరి నడచి, నడచి, అలసటవచ్చి ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద విశ్రమించెను. కొంతసేపటికి అలసట తీర్చుకొని, మరల తన ప్రయాణము సాగించెను.

చివరకు బసవయ్యా రత్నాలపురము చేరుకొనెను. ఆ పట్టణమును చంద్రశేఖరుడు పరిపాలించుచుండెను. ఆరాజు బీదలయందు దయకలవాడు. బసవయ్యా రాజుగారినిదర్శించి తన పరిస్థితులన్నియు రాజుతో చెప్పుకొని తనకేదయినా నౌకరు పని ఇప్పించమని వేడుకొనెను. రాజుకి బసవయ్యా స్థితిచూచి మనసు కరిగెను. ఆ రాజ్యములో దొంగలబాధ ఎక్కువ. రాజు దొంగలను పట్టుకొనుటకై బసవయ్యాను నియమించెను.

బసవయ్యా తనభార్యను పట్టణమునకు తీసుకువచ్చెను. ఒకరోజు ప్రజలందరు రాజుగారి దగ్గరకువచ్చి దొంగల బాధనుండి తప్పించమని మొరపెట్టుకొనిరి. అది విని రాజు బసవయ్యాను ఆ దొంగలను పట్టుకు రమ్మని ఆజ్ఞ ఇచ్చెను. బసవయ్యా దొంగలను పట్టుటకై ఒక పన్నాగము పన్నెను. ఒకరోజు రాత్రి బసవయ్యా బండి తోలుకుని దానిలోపల విషము కలిపినఆహార పదార్థములుపెట్టి దొంగలువచ్చు దారిని తనబండి తోలుకు వెళ్ళెను దొంగలింకొక దారినించి వూరు అంతా దోచుకుని ఆ అడవిలోకి వెళ్ళిరి. వారినిచూచి బసవయ్యా తనబండిని అక్కడ వదిలిపెట్టి చెట్టెక్కి వారు చేయు పనులు చూచుచుండెను.

దొంగలు బండిదగ్గరకొచ్చి తనిఖీ చేసి ఆహార పదార్థములు చూచి సంతోషించి భుజించిరి. భుజించిన ఐదు నిమిషములకల్లా మరణించిరి.

అది చూచి బసవయ్యా సంతోషించి తన బండిని రాజు గారి దగ్గరకు తోలుకువెళ్ళి జరిగినదంతా విన్నవించెను. బసవయ్యామాట నమ్మలేక దొంగలు మరణించిరో లేదో చూచిరమ్మని రాజు తన భటులను ఆజ్ఞాపించెను. భటులు దొంగలు చచ్చిపడివుండుట చూచి రాజుగారితో దొంగలు చనిపోయి ఉన్నారనిచెప్పిరి. అందుకు రాజు సంతోషించి బసవయ్యా ఉపాయమునకు మెచ్చి మంత్రి పదవి ఇప్పించెను.

మంత్రి బసవయ్యాగారి గుడిసె భవనమయింది.

బండి ఏమయినది?

★

# మాతృ ప్రేమ

"రా జే శ్వ ర్"

నాన్న కొడితె చేరదీసి
అక్క తిడితె లాలించి
బుజ్జగించుతుంది అమ్మ
ముద్దు పెట్టుకుంటుంది.
సినిమాకని మారాంచేస్తే
బడికెళ్ళనని గోలచేస్తే
కాఫీకప్పు విరుగగొడితె
కోపించదు దండించదు.
చేరదీసి లాలించును
మరి చెయ్యకని బోధించును
మా దైవం మా అమ్మే,
మా సర్వం మా అమ్మే.

బిడ్డలంటె యెంతప్రేమ,
మరపించిన మురపించిన,
కోపించక లాలించిన,
దండించక బోధించిన,
కనిపెంచిన మా అమ్మకు.
ఉగ్గుపాలు పోస్తుంది
మలమూత్రము లెత్తుతుంది
ఉన్నతముగ చేస్తుంది
అమ్మలేందె బ్రహ్మెందుకు
బ్రహ్మంటె మనకెందుకు.

(అంకితం, మేనకోడలు "భాగ్యలక్ష్మి"కి)

★

# చదవండి!

## నిజవార్త

"కాకినాడలో టెలిఫోన్ స్తంభాలన్నీ ధ్వంసమైనా యట!"

"అది మీకెట్లా తెలిసింది ?"

"యిప్పుడే కాకినాడనుండి టెలిఫోనులో విన్నా—"

*  *  *

## కారణం

"ఏంరా యింత అర్ధరాత్రివేళ పోస్టుఆఫీసుకి వెళ్తున్నావేమి ? రేపు వెళ్ళరాదూ ?"

"ఆఁ, ఏమీలేదు! పగలైతే ఎవరైనా చూసి పట్టుకుంటారేమో అని."

*  *  *

## తొందర ప్రయాణం

"అయ్యా! మెడ్రాసుకి ఒక టిక్కెట్టు యిప్పించండి!"

"ఏ క్లాసు ?"

"ఏది, త్వరగాపోతే, ఆ క్లాసు!"

*  *  *

## సరియైన జవాబు

"నాన్నా! పిల్లలెందుకు పుడతారు ?"

"ఇటువంటి ప్రశ్నలేసి విసిగించడానికి!"

*  *  *

## ఎడ్రసు

ఒకరు "ఏమండీ! మా వుత్తరం యిప్పిస్తారా ?"

పోస్టుమేన్ "ఏమిటండీ మీ ఎడ్రసు ?"

అతను "ఆ వుత్తరంమీదే వుంటుందండీ!"

★

(40 వ- పేజీ తరువాయి)

పెట్టుబడి ఏమాత్రం లేనప్పుడు నా భవిష్యత్తుతో మీకేలాటి సంబంధం వుందీ?"

'ఇదే నీతో వచ్చిన సమస్య. మనం ఒక విధంగా స్నేహితులం అనుకొన్నా.'

'స్నేహితులం?' ఆమాట నామీద విసిరి కొట్టింది. 'ఏమీ ఇవ్వలేనివారితో, ఇస్తే పుచ్చుకోలేని వారితో, ఎవరేనా ఎలా స్నేహం చేయగలరు?' అంది, అర్థంకాని చూపుల్తో.

'నీధోరణి నాకర్థం కావటంలేదు సుశీలా'

'Oh yes you do! అమ్మని బురదకన్నా నీచంగా చూసి బాధించలేదూ? మీతో ఆమె నెన్నడూ స్నేహం చేయనివ్వలేదు. మీరు మీపిరికి గుండెను పవిత్రంగా మీలోనే భద్రపర్చుకోండి. ఎవరిక్కావాలి? మా అమ్మ అవన్నీ పడింది. ఎందుకూ? తన జీవనం కోసం! కానీ నేనలా వుండను.'

నాకు తీవ్రమైన బాధ కల్గించింది.

'నువ్వు చెప్పిందాన్నిబట్టి చూస్తే, నిన్ను నేను గౌరవంతోగానీ, అభిమానంతోగానీ చూడలేదంటావు. నువ్వు పొరపడ్తున్నావు సుశీలా. నే నిదివరకెక్కడా నీ అంత సౌందర్యవతిని, విద్యావతిని చూడలేదు. నీకిది ఇదివరకే చెప్పాననుకొంటాను. ఇంక మీ అమ్మని బురదలా చూసిన విషయమై నీకొకటి చెప్పవలసి వుంది. అది నీ వెరుగవు. ఈ ఏడు సంవత్సరాలనుంచీ మేము ప్రేమికులం గాము. కేవలం స్నేహితులం. ఆమె చనిపోయినప్పుడు ఏదో అమూల్యమైన నావస్తువు పోయినట్లనిపించింది. నన్ను ఇప్పటికైనా నమ్ముతావా?'

'ఓ. మీ ఇద్దరి సంగతి నాకు తెలుసు. ఆమె వ్రాసింది. కానీ ఈ విషయం మీకెప్పుడూ వింతగా తట్టలేదా? ఆమె బుద్ధిహీనురాలని, మెత్తనిదని, పరభృతయని మీరనుకొని ఆమెను పీడించినప్పుడు మాత్రమే ప్రేమింప గలిగినారు. కాని ఆమె ఆత్మగౌరవం కలదనీ, మీ అభిమానానికి ఆస్పదురాలు కాదగినదనీ మీకు తెలిసినవెంటనే ఆమెతో స్నేహంగా వుండగల్గినారు. కానీ ఆమెను ఆనాటినుంచి ప్రేమించలేదు. ఇది చాలా అర్థవంతమైన విభాగం. నాకది ఇష్టంలేదు. That's all'...అకస్మాత్తుగా ఆపేసింది, ఏదో చెప్పవలసిందానికంటే మించి చెప్పినట్లుగా భయపడ్తూ-బాల్యంనాటి కోపశేషమనుకొన్నాను. (సశేషం)

# పోలిక

* శ్రీ అద్దేపల్లి వెంకటేశ్వరరావు *

అవిగో మేడలు
అవిగో మిద్దెలు
మేడలపై మేడలు
మిద్దెలపై మిద్దెలు
అద్దాల తలుపులు
తలుపులకు తెరలు
తెరల నిండా బొమ్మలు
బంగాళా చుట్టూ
రక రకాల చెట్లు
రంగు రంగుల పూల తోట్లు
చెట్లకు తోట్లకుమధ్య
చేనంత చెరువు
చెరువు గట్టుకు చుట్టు
చెప్పలేనన్ని
పాలరాతి బొమ్మలు
బొమ్మల ప్రక్కన
నీరు చిమ్మే పంపులు
పంపులు పట్టుకు
నుంచుని వున్నాయి
నగ్న స్త్రీ విగ్రహాలు!
సిమెంటు బాటపై
తిరుగుతున్నాయి
వరుస వరుసలుగా
తళుకు తళుకుమని
మెరుపున మెరిసే
రోల్సురాయిస్, ఫోర్డు,
పాంటియాక్, డాడ్జి,
రోవర్, క్రైస్లర్, స్టుడి
ఎన్నెన్నో ఏవేవో
నోర్లు తిరగని
పేర్లు గల కార్లు
కార్ల లోపల
కళ్లు గానక
కదులు తున్నాయి
కనకమూర్తుల విగ్రహాలు!
మేడ మిద్దెల చుట్టూ
ఇనుపరాతి గోడ
నాలుగు ప్రక్కల గేట్లు
గేటుకు రెండువైపుల
సీమ కుక్కల కాపలా
ఏమరు పాటున
కాలు కదిపితే చాలు
కండలు తీస్తాయి.
బంగాళా లోపల
మహేంద్ర లోకం
అంతా ఇంద్ర జాలికం
దీపాల కాంతులు
పట్టపగలును
ఇట్టే మరిపిస్తాయి
స్ప్రింగు సోఫాలు
మరల కుర్చీలు
పట్టు పరుపులు
బింబంలో ప్రతిబింబం చూపే
నిలువుటద్దాల వరుసలు
లెక్క లేనన్ని
చెప్ప వీలవని
వింత వింతలతో
విండిన గదులు
ఒక్కొక్క జీవికి
పదేసి గదులు
భవన మంతా
మారు మ్రోగుతుంది
ఆకాశ వాణిగీతం
అను భవించలేనంత

## పోలిక

అధిక ఐశ్వర్యం
అది భవనంకాదు
భూలోక స్వర్గం
స్వర్గాధిపతికి
సౌఖ్యం, సౌఖ్యం, సౌఖ్యం !!!

.... .... ....

ఇవిగో పాకలు
ఇవిగో గుడిసెలు
పడిన పాకలు
కూలిన గుడిసెలు
ఆకులు లేని పాకలు
పూరి లేని గుడిసెలు
ఎండా, వానా, గాలి
పాకలో నిట్టాడికి
కట్టివేశేసారు
గుడిసె చుట్టూతా
కుప్పలు కుప్పలు
ఎముకల ప్రోగులు
ప్రోగుల చుట్టూతా
మురికి గుంటలు
గుంటలలో పొరిలే
పందుల సంతానం
చక్కని పరిసరాలు
పరిసరాలల్లోంచి
పుట్టు కవస్తోంది
భూమంతా పగిలిపోయే
మహా దుర్గంధం
మానవ మాత్రుడు
నిలువ లేనంత
మహా సుగంధం
వీటికి సావాసం
కుక్క, నక్కలు
గాడిదెలు ,గ్రద్దలు
పీలికలవంటి
గుడిసెకు దారంతా
యమలోకమార్గం
గుడిసెల సంగతి
గుడిలో రాతిబొమ్మకు
గుట్టుగా తెలుసు
ప్రపంచంలో కల్లా
మహా మేధావియట
మానవ మాత్రునకు
మచ్చుకైనా తెలియదు
తెలియాల్సిన కారణం ?
గుడిసెలో దీపం
పగలు సూర్యుడు
రాత్రి చంద్రుడు
పాకలో జీవాలకు
గాలి—వానలె
ఆహారం—నీళ్లు
ఏదో అనుమానం
మనసులో పీకుతోంది
పాకలోవి జీవాలేనో ?
మనుష్యులైనా
మృగాలైనా
అవి జీవాలేగా !
మరి ఆ అవతారాలు
అవకరములతో నిండిన
అపురూప అవతారాలు
కాలు చేతులు
ఉదర పొట్టలు
ఎండిపోయిన డొక్కలు
మాడిపోయిన ప్రేగులు
గుంటపోయిన కళ్ళు
సంస్కారంలేని కేశాలు
నగ్న శరీరాలు
పాక పాకంతా
మారు మ్రోగుతోంది
ఇనుపగజ్జెల తల్లి
వికటాట్టహాసం
అది భవనం కాదు
భూలోక నరకం
నరకాధిపతికి
దుఃఖం, దుఃఖం, దుఃఖం !!!



# స్వర్గీయ కలగర పిచ్చమ్మగారికి జోహార్లు

## నెల్లూరు శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో సానుభూతి సమావేశము :

సుప్రసిద్ధ దేశసేవా ధురీణయు, త్యాగధనియునైన శ్రీ కలగర పిచ్చమ్మగారి నిర్యాణమునకు తమ గాఢ సంతాపమును వెల్లడిస్తూ నెల్లూరు శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో ఉపాధ్యాయినులు, విద్యార్థినులు సమావేశమై సానుభూతి వెల్లడించినారు. శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, ఇట్లు ప్రసంగించినారు.

"దేశసేవలో జీవితం అంకితం చేసుకున్న త్యాగశీల, దయామయి, శ్రీ కలగర పిచ్చమ్మగారి నిర్యాణము మమ్మలను దుఃఖితప్తులను చేసింది. ఆమె మా అందరకు మాతృదేవి. విశేషించి ముఖ్యంగా నాకు కన్నతల్లివంటిది. నాలుగు నెలల క్రింద చూడడానికి పోయినప్పుడు ఓపికలేకపోయినా లేచి ఎదురు వచ్చి కౌగలించుకుని దగ్గర కూర్చుండబెట్టుకుని అతి ఆప్యాయతతో ఎంతోసేపు ముచ్చటిస్తేనేగాని ఆమెకు తృప్తికలుగలేదు. తుదకు చిరునవ్వుతో "ఇక మా పని తీరిపోయింది. మీ ఆశయాలు మీరే నెరవేర్చుకోవాలి" అన్నారు. అది చాలా లోతయినమాట. 'మీ ఆశయాలు' అంటే స్వర్గీయ శ్రీ అన్నపూర్ణదేవి ఆశయాలు అవి. మళ్ళీ వచ్చినప్పుడు తృప్తిదీరా నాలుగునాళ్ళు ఉండక తప్పదన్నారు. ఇంతలోనే తృప్తి తీరిపోతుందనుకోలేదు.

"పండు ముత్తయిదువ. బంగారు ముఖంమీద చంద్రబింబంవంటి కుంకుమ బొట్టుతో భారత సాధ్వీమ తల్లులను ప్రతిబింబిస్తూ ఆంధ్ర నారీలోకానికి మాతృ మూర్తివలె ప్రత్యక్షం అయేది ఆ మహాతల్లి. గొప్ప విద్యావతి కాకపోయినను ఆత్యాగమూర్తి సేవాపరత, ధైర్యసాహసాలు, పట్టుదల, కార్యదీక్ష జండాపట్టుకుని ముందు నిలిచి నలుగురిని ముందుకు నడుపుకుపోగల శక్తిసామర్థ్యాలు, ధీరత్వం గల తల్లి. అట్టి యోగ్యత అరుదుగా ఉంటుంది.

పూజ్యబాపూజీ పిలుపు విన్నది మొదలు తుది, ఊర్పు వరకు ఒక్క లక్ష్యముతో ఒక్క ఆదర్శముతో నిష్కామ సేవచేసి ధన్యురాలైనది ఆ యిల్లాలు. అట్టి భాగ్యము అందరికీ కలుగదు. కాంగ్రెసు ఉద్యమాల్లో, మహిళా ఉద్యమాల్లో, సాంఘిక సేవలో ఆమె ముందంజవేయని కార్యరంగంలేదు. శ్రీ పిచ్చమ్మ తల్లి డెబ్బది ఏండ్ల నిండు జీవితములో అర్థశతాబ్దం మించి సేవాక్షేత్రములోనే చరితార్థమైనది. తన ఏకైక ప్రియపుత్రిక, దేశంకోసం అసువులు బాసిన వీరనారి, స్వర్గీయ శ్రీ అన్నపూర్ణాదేవి ఆదర్శాలకోసం, ఆశయసిద్ధికోసం శ్రీ పిచ్చమ్మ తల్లిగారు తమ జీవితం ముడుపు కట్టుకున్నారు. స్వర్గీయ అన్నపూర్ణాదేవి స్మారకచిహ్నాలుగా ఒక వంక బిడ్డ ఝాన్సీ లక్ష్మీబాయి, మరియొక వైపున అన్నపూర్ణాదేవి విద్యాలయమూ, రెండూ రెండుకన్నులుగా ఆమె చూచుకున్నది. అన్నపూర్ణాదేవి స్కూలును కృష్ణాతీరంలో ఒక ఆదర్శనీయమైన ఉన్నత పాఠశాలగా రూపొందించవలెనని ఆమె తపస్సు. కాని అమె ఉండగా అది కార్యరూపంలో ఫలించి స్థిర నిర్మాణం జరుగలేదు. అదియే ఆ తల్లి కొరత.

తెలుగు తల్లులు ఒక్కొక్కరే వెళ్ళిపోవుచున్నారు. శ్రీ ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు, కలగర పిచ్చమ్మగారివంటి ఏ సతీమతల్లులులేని కొరత ఆంధ్రజననికి ఇంతటంత తీరేదు కాదు.

దేశంకోసం జీవితాలు ధారపోసిన మహనీయులకు వారి ఉత్తమాశయ సంసిద్ధికోసం శక్తికొలది కృషిచేయుటయే మన మీయగల పూజాంజలి. శ్రీ పిచ్చమ్మగారి సేవాచిహ్నలుగా రాష్ట్రకాంగ్రెసు, కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యాలయాల్లో ఆమెగారి చిత్రపటాలు నెలకొల్పవలెనని సూచనలు జరుగుట ముదావహము. అన్నిమహిళా సంఘాలుకూడ సమావేశాలు జరిపి సానుభూతి తెలుపవలెనని కోరుతున్నాము.

"శ్రీ పిచ్చమ్మతల్లిగారు ధన్యజీవి. వెలుగూ - నీడావలె ఆమె సేవాక్షేత్రంలో వెనుకనిల్చి దోహదమిచ్చిన భర్త శ్రీ రామస్వామిగారు పూజ్యులు. సోదరులు బాపినీడుగారు, బిడ్డలు ఝాన్సీ దంపతులు, బంధుమిత్రులు స్వజనము అందరూ దగ్గర ఉండగా పతి సాన్నిధ్యంలో పరమపదించింది ఆ పుణ్యసాధ్వి. పరమేశ్వరుడు అయమ్మకు శాశ్వత దివ్యపథము ప్రసాదించుగాక యని ప్రార్థిస్తూ కుటుంబమునకు సానుభూతి తెలుపుతున్నాను. మృత్యువునుండి అమృతమునకు నిర్గమించిన ఆ పవిత్రాత్మకు ఇవే మా జోహార్లు" అని చెప్పిరి.

తరువాత విద్యార్థినులు శాంతిగానముతో సానుభూతి తీర్మానము చేయబడినది. మౌనముతో లేచి నిలబడి ఆపుణ్యా సాధ్వి ఆత్మశాంతికి పరమేశ్వరుని ప్రార్థిస్తూ వారికుటుంబమునకు సానుభూతి తెలిపినారు.




# అల్పతాపక్రమంవద్ద
# ద్రవ్య ప్రవర్తన

* శ్రీ వసంతరావు వేంకటరావు *

ఒక కప్పులో పోసిన ద్రవ్యం ఆ కప్పు అంచుల వెంబడి పైకెగబ్రాకి, దాని మట్టుకదే క్రిందికి జారిపోగా కప్పు ఖాళీ అవుతుందంటే నమ్ముతామా ? ద్రవ్యంయొక్క ఇట్టి విపరీత ప్రవర్తన ద్రవ్య లక్షణాల విషయమై మన కున్న అభిప్రాయాలకు వ్యతిరేకమౌటచేత, ఆ సంఘటన నమ్మడానికి మనసొప్పదు. అథవా, అది నిజం కాగలదా అని సందేహమైనా కలుగక తప్పదు. కాని, కొందరు విజ్ఞాను లిట్టి గారడీచేసి చూపించినప్పుడు మాత్రం ప్రేక్షకులా విషయ సత్యాన్ని నమ్మక తప్పింది కాదు. అయితే, అత్యల్ప తాపక్రమాలవద్ద మాత్రమే ద్రవమింత విచిత్రంగా ప్రవర్తిస్తుందని జ్ఞాపక ముంచుకోవాలి.

ద్రవ్య లక్షణాలను తెలిసికొందామన్న పట్టుదలతో విజ్ఞాను లనేక ప్రయోగాలు చేసేరు, చేస్తున్నారు. తెలిసిన లక్షణాల నాధారంగా జేసికొని, కొన్నికొన్ని పరిస్థితులలో ద్రవ్య మెట్టి లక్షణాలను ప్రదర్శిస్తుందో ఊహిస్తుంటారు. అట్టి యూహలు సామాన్యంగా నిజమౌతాయి ; ఒకప్పుడవి తప్పడముకూడ కలదు. విజ్ఞానులూహించిన దానికి వ్యతిరేకంగా జరిగిన సంఘటనలలో ఇదొకటి.

అణు సమూహాలకూటంతో ద్రవ్య మేర్పడుతుందని ఎరుగుదుము. అట్లు కూడిన అణువుల యేర్పాటును బట్టి ఘనంగానో ద్రవంగానో, వాయువుగానో ద్రవ్యం ఆవిర్భవిస్తుంది. క్రమమైన చక్కటి ఏర్పాటులో నున్న అణు సంఘం ఘనపదార్థమై గట్టిగా నుండగా, అణుచలనాని కెక్కువ అవకాశమున్న కూటం ద్రవమై పలచనౌతుంది. యధేచ్ఛగా అణువులు సంచరించగల స్థితిలోనున్న అణు కూటం కంటికి కనిపించని వాయురూపంలో వ్యాప్తమై యుంటుంది.

అణు సమూహాల స్థితిని మార్చేవి తాపక్రమం (టెంపరేచర్) ఒత్తిడి (ప్రెషర్). తాపక్రమం ఎక్కువైన కొద్దీ అణువులకు శక్తి ఎక్కువకాగా, వాటికి చలించే సామర్థ్యంకూడ అధికమౌతుంది. అందుచేత ఘనపదార్థంలో నిలుచున్న చోటనే స్పందిస్తూన్న అణువులు, ఆ పదార్థాన్ని వేడి చేసిన కొద్దీ ఎక్కువ శక్తిని సంపాదించి, సులభంగా స్థాన చలనం పొందడానికి ప్రారంభిస్తాయి. అయితే ద్రవరూపంలో నున్న పదార్థంలో ఆ ద్రవం ఎంత వరకు పాత్ర నాక్రమించిందో, ఆ స్థలంలోనే అణువులు సంచరించ గలవు. కాని, వాయు పదార్థంలో నున్న అణువులు యధేచ్ఛగా ఎక్కడికైనా పోగల సామర్థ్యం గలవి.

# విజ్ఞానపు వేయిపడగలు

ఒక్కొక్క స్థితిలోనున్న పదార్థం కొన్నికొన్ని ప్రత్యేక లక్షణాలను ప్రదర్శిస్తుంది. విద్యుత్ ప్రవాహానికి ఘనపదార్థాలు కలిగించే నిరోధం (రెసిస్టెన్సు) వాటి ముఖ్యలక్షణాలలో ఒకటి. విద్యుత్ ప్రవాహానికి నిరోధం లేకపోతే మనకు విద్యుద్దీపాలే లేకపోయేవి. విద్యుద్దీపంలో నున్న సన్నటి తీగ, దానిలో ప్రవహించే విద్యుత్తుకు నిరోధం కలిగించబట్టే, వేడి, వెలుగు జనిస్తున్నాయి. అదే కారణంచేత, ఎలెక్ట్రిక్ హీటర్‌ద్వారా వేడిని, బల్బుద్వారా కాంతిని మనం వాడుకొంటున్నాము.




ఘనపదార్థాలను చల్లార్చినప్పుడు వాటి విద్యున్నిరోధంలో మార్పు కలుగుతుంది. తాపక్రమాలను కొలవడానికై పై సత్యాన్ని వినియోగిస్తారు. ఘనపదార్థాన్ని దానిలో అణు సంచలనం పూర్తిగా ఆగిపోయే స్థితికి చల్లార్చడానికై విజ్ఞాను లనేక విధాల ప్రయత్నించేరు. పదార్థాన్ని వేడిచేయడం సులభంగాని, దానిలో నున్న వేడిమిని పూర్తిగా తీసివేయాలంటే చాలా కష్టపడాలి. ఆ విధానంలో విజ్ఞాను లింకా పూర్తిగా కృతకృత్యులు కాలేదు. అట్టి ప్రయత్నాలలోనే కొన్ని విచిత్రమైన ద్రవ్య లక్షణాలను కనుగొన్నారు.

అణు సంచలనం పూర్తిగా స్తంభించిన స్థితిలో ద్రవ్యం యొక్క తాపక్రమాన్ని 'పరమ శూన్యం'గా నిర్వచించేరు. దానిని సున్నగా భావించిన మానానికి 'పరమ శూన్యమానం' అని పేరు. ఆ మానంలో సుమారు 4 డిగ్రీల వద్ద హీలియం వాయువు ద్రవీభవిస్తుంది. 2 డిగ్రీల క్రింద వరకు ద్రవంగానే ఉంటుంది. కాని 2 డిగ్రీలకంటె తక్కువ తాపక్రమంలోనున్న హీలియం మాత్రం అపూర్వ ద్రవత్వాన్ని ప్రకటిస్తుంది. అట్టి హీలియంగల పాత్రలో ఒక గళాసును సగానికి ముంచినప్పుడు, గళాసు సగం వరకు హీలియంతో నిండుతుంది. అంటే పాత్రలోను గళాసులోను మట్టాలు సమానమగువరకు హీలియం గళాసులో ప్రవేశిస్తుంది—(చిత్రాలు 1, 2.) గళాసును పాత్ర నుండి పైకెత్తి పట్టుకొన్నప్పుడు, చుక్కలు చుక్కలుగా హీలియం కారి, పాత్రలో పడుతుంది. గళాసు ఖాళీ అయే వరకు ఈ క్రియ సాగుతుంది—(చిత్రం 3.) అంచుల వెంబడి పైకెగబ్రాకి పాత్రలో నున్న హీలియం గళాసులో ప్రవేశించడం, తరువాత గళాసులోనుండి అదేవిధంగా పైకి రావడం జరిగింది. ఇది చాలా విచిత్రమైన సంఘటన. సామాన్య తాపక్రమాలవద్ద ద్రవాలా విధంగా ప్రవర్తింప మొదలిడితే మన జీవితం క్లిష్ట సమస్యగా పరిణమించేది. ద్రవాలను పాత్రలలోనే భద్రపరచాలి. కాని, వాటి మట్టుకవే ద్రవాలు పైకివచ్చి పాత్రలు ఖాళీయైతే మనకెంత కష్టంగా నుండేది ! అయితే, వాయు ప్రసరణను నిరోధించునట్లు ఏదో విధంగా ద్రవాలతోకూడా తంటాలు పడతాము.

అత్యల్ప తాపక్రమంలో కొన్ని లోహాల నిరోధం పూర్తిగా నశిస్తుంది. ఒక లోహ వలయంలో విద్యుత్తును ప్రవహింప చేస్తే అది కాలాంతం వరకు ఆ వలయంలో ప్రవహిస్తునే ఉంటుంది ; ఎందుచేతనంటే, ఆ ప్రవాహానికి నిరోధమే లేదు ! వేక్యూమ్ ఫ్లాస్కులో ద్రవాన్ని పోసి విద్యుద్దయస్కాంత ధ్రువాలమధ్య దానినుంచగా ధ్రువాలు ఆ ద్రవాన్ని ఆకర్షించినట్లు ప్రయోగంవల్ల రుజువయింది.

ఇట్టి విచిత్ర సంఘటనలే మానవ బుద్ధిని గిలిగింతలు పెట్టి సూక్ష్మంగా పరిశీలించడానికి పురిగొల్పుతాయి.



# అంగవిహీనులైన శిశువులకు చికిత్స

వికలాంగులైన బిడ్డలను చూస్తే మనసు తరుక్కు-పోతుంది. ముందు నూరేళ్ళు గడపవలసిన వారి జీవితం ఎంత కంటకావృతము, ఎంత నిరుత్సాహ జనకముగా ఉంటుంది అని ఆలోచించిన వారిది ఎంత కఠినమైన మనసైనా కరుగకపోదు. పుట్టుకతో అంగవైకల్యము కలిగినవారు కొందఱు, పుట్టిన తరువాత అనేక విధములైన వ్యాధులవల్ల అంగవైకల్యమును పొందినవారు మరి కొందఱు.

పోలియోమైలిటస్, శిశుపక్షవాతము, ఎముక క్షయ, ఇత్యాది వ్యాధులవల్ల ఎందఱో శిశువులు అంగవైకల్యమును పొందుచున్నారు. శిశుపక్షవాతము వచ్చి అనేక శిశువులు అంతలో మృత్యువాత తప్పుకొన్ననూ, నడవలేక, కూర్చోలేక, సరిగా చూడలేక, మాట్లాడలేక, ఒక్కొక్కమారు మెదడుకూడ కొంత చెడిపోయి, శోచనీయమైన భవిష్యత్తుకు గురియగుచున్నారు.

ఒకప్పుడు కుదర్చరానిది అనుకున్న శిశుపక్షవాతం ఇప్పుడు చికిత్సకు స్వాధీనమైనది అని నిర్ణయమైనది. మిసెస్ ఫాతిమా ఇస్మాయెల్ అను బొంబాయి యువతి, ప్రసిద్ధ సంఘసేవిక, బొంబాయిలో కొందఱి వైద్యుల, మిత్రుల సహాయ సానుభూతులచే, అంగ విహీనులైన శిశువుల చికిత్సార్థం, ఒక వైద్యశాలను నిర్మించారు. ఈమె పట్టుదల కారణంగా, అనేక పరిశోధనలు జరిగి ఇప్పటికి శిశుపక్షవాతం చికిత్సకు 'సాధ్యపడే వ్యాధి అని ఋజువైనది.

1952 సం॥ బొంబాయి 'హజిత్ ఆలీ పార్కు' లో, 50 మందికి వైద్యము చేసే వైద్యశాల, అన్ని అధునాతన సదుపాయాలతో, ఆపరేషన్ థియేటర్ మున్నగు హంగులతో, యీమె నిర్మించారు. బయటినుండి వచ్చి, 150 మంది పిల్లలు చికిత్స పొందే అవకాశాలుకూడా యీ హాస్పిటలులో ఉన్నవట. ఇచట విధానాలు ఇతర దేశాల వైద్యశాలలోని విధానాలకు ఏమాత్రమూ తీసిపోవు.

ఇక్కడి విధానాలలో, మర్దన, తొట్టిస్నానము, కాంతి ప్రసారము, వ్యాయామము ముఖ్యమైనవి. చికిత్సకు ఉపయోగించే కట్లు, మెత్తలు, దిండ్లు, ఇత్యాదులు బొంబాయిలోనే శ్రేష్ఠముగా తయారుచేయబడుచున్నవి.

ఇట్టి వైద్యశాల భారతదేశము మొత్తంమీద ఒక బొంబాయిలోనే ఉండడం యీ ముఖంగా జరుగవలసిన అభ్యుదయాన్ని సూచిస్తూ ఉంది. ప్రతి పెద్ద వైద్యశాలలోనూ, యిటువంటి పిల్లలకు చికిత్స జరిగే ఏర్పాట్లు జరుగడం అత్యవసరం. ఇలాంటి అత్యవసర కార్యక్రమమునకు ఒక భారతీయ మహిళ మార్గదర్శిని కావడం మహిళాలోకం గర్వించదగ్గ విషయం. అమెరికాలోని ఒక మహిళ యిట్టి పిల్లలకు చికిత్సాలయం నిర్మించగా ఆమెకు చేదోడు వాదోడుగా ఇతర అమెరికను మహిళలు అది ఒక మహా సంస్థగా రూపొందుటకు తోడ్పడిరట—ఈ ఆదర్శాన్ని భారతీయ మహిళలు అనుసరించి, యిట్టి సంస్థల నిర్మాణానికి, నిర్మిత సంస్థల అభివృద్ధికి తోడ్పడినచో, తమ జాతికి సేవ చేయగలరని హెచ్చరిస్తున్నాము.



## ఆంధ్ర మహిళా సభలో

# ఐదవ స్వతంత్ర దినోత్సవము

పరరాజులు వైదొలగి, భారతీయులు స్వతంత్రం సంపాదించుకుని 5 సం॥ జరిగినది. 5-వ స్వతంత్ర దినము, ఆంధ్ర మహిళా సభలో యథా ఉత్సవ సంరంభంతో జరుగగలదు. పతాకావిష్కరణ, ఉపన్యాసములు, సంగీతము మున్నగునవి ఏర్పాటు జరుగును. వివరములు సభ్యురాండ్రకు వార్తా పత్రికల మూలంగా తెలుపబడును. సభ నోటీసు బోర్డులో ప్రకటించబడును.

—కార్యదర్శినులు.

## స్వీకారం

ఈ క్రింది పుస్తకాలు మా కార్యాలయం చేరాయి.

శ్రీ వరవెంకట సత్యనారాయణ దండకము
రచన: కామవరపు సూర్యనారాయణ, అలమూరు.
వెల: 5 అణాలు.

*  *  *

శిక్ష
(నాటికల సంకలనం)
శ్రీ రెంటాల గోపాలకృష్ణ రచన, సాహితీ స్రవంతి ప్రచురణ
వెల: ఒక రూపాయి.

*  *  *

ప్లానింగు—ఇంకా 3 విషయాలుమీద కరపత్రాలు
నవహైద్రాబాదు ప్రచురణలు.
వెల: రెండణాలు.

*  *  *

శ్రీ కుసుమ హరనాధ లీలా సంగ్రహం
గ్రంథకర్త: శ్రీ క్రొత్తపల్లి బుచ్చయ్య శాస్త్రి
నవజ్యోతి ప్రచురణములు, పొలమూరు.
వెల: రూ. 1-0-0.

## మ్యూజిక్ డైరెక్టర్ సుబ్బరామన్

దక్షిణాపథ చలనచిత్ర పరిశ్రమలో దీపస్తంభంగా వెలుగొందుతూ దాదాపు 32 తమిళం- తెలుగు భాషల్లోని చిత్రాలకు సుశ్రావ్యమైన సంగీతాన్ని సమకూర్చిన ప్రఖ్యాత సంగీత దర్శకుడూ, వినోదాసంస్థ వాటాదారూ, అయిన సుబ్బరామన్ మొన్న జూన్ 27 న హఠాత్తుగా దివంగతుడయ్యాడన్న సంతాపకరమైన వార్త విని, పరిశ్రమలో విషాదించనివారు అరుదు.

సుబ్బరామన్ 28 ఏళ్ళ యువకుడు. అతను స్వర్గస్థుడయ్యేనాటికి ఇంకా 13 చిత్రాలకు సంగీతం సమకూర్చవలసి వున్నది. ఎంత శీఘ్రంగా ఉచ్చదశ నందుకో గల్గాడో అంత ఆకస్మికంగానే దాపురించింది మరణం అతనికి.

సుబ్బరామన్‌వల్ల మద్రాసు చిత్రపరిశ్రమ కింకా జరగవలసివుండిన అపారమైన సేవకు అత్యాకస్మిక అంతరాయం కల్గింది. ఒక విశిష్ట సాంకేతిక నిపుణుణ్ణి పోగొట్టుకున్నారు మన నిర్మాతలు.

అతని ఆత్మకు శాంతిని చేకూర్చమని ప్రార్థిస్తూ, అతని కుటుంబీకులకు, తదితర ఆప్తులకు మా సానుభూతిని తెలియపరుస్తున్నాం. —ఆంధ్ర మహిళ.


## ఆంధ్రమహిళ

స్థాపితము : 1944

ఆంధ్ర మహిళా సభవారి యాజమాన్యమున
ప్రచురింపబడుచున్న
స్త్రీల సచిత్ర మాస పత్రిక

సంవత్సరచందా రూ. 6-0-0 లు—విడిపత్రిక రూ. 0-8-0

మీరు చందాదారులు కండి.

స్త్రీ సమస్యలపై మీ చక్కని రచనలను పంపండి.
కథలూ, కబుర్లూ, నాటికలూ కూడా కావాలి.

వర్ణచిత్రములూ, రేఖా చిత్రములూ,
ఛాయా చిత్రములూ పంపండి.

అన్ని విధములా మీ అమూల్య సహకారము కాంక్షిస్తున్నాము
—సంపాదకురాలు.


## ఆంధ్ర మహిళా సభలో

### పారిశ్రామిక విద్యాలయముతో జేర్చిన వస్తూత్పత్తి కేంద్రము

ఏపేటా పారిశ్రామిక విద్యాలయంలో నేత, నూలు వడకుట, కత్తిరింపు కుట్లు, ఎంబ్రాయిడరీ, లేసు ఊలు అల్లికలు మున్నగు గృహ పరిశ్రమలలో పలువురు విద్యార్థినులు శిక్షితులగుచున్నారు. అభ్యాసనానంతరం ఉత్తీర్ణలై సర్టిఫికెట్లు పొందిన కొందఱు విద్యాలయాల్లో ఉపాధ్యాయినులుగా నున్నారు. మఱి కొందఱు, తమకు వలసిన పరికరముల నమర్చుకొని తాము నేర్చిన పరిశ్రమ సహాయంతో స్వయంపోషకత్వం సంపాదించు కుంటున్నారు.

ఇంక మఱి కొందఱి సహాయార్థం, విద్యాలయములోనే వస్తూత్పత్తి కేంద్రము నొకదానిని స్థాపించి యున్నాము. పరిశ్రమలలో శిక్షితులైన యువతులు ఇందు పనిచేయుదురు.

వస్త్రములు నేయుట, కుట్టుట, అల్లుట, రంగులు వేయుట మున్నగు పనులన్నియూ ఇక్కడ చేయబడును. ఇక్కడ ఉత్పత్తి అయిన సరుకును విక్రయించుటయేగాక, కొనుగోలుదార్ల సూచనలపై వలసిన వస్తువులు తయ్యారుచేయుటకూడ కలదు.

బీద యువతులకు విద్యా సౌకర్యములను కలుగజేయుటకై ఏర్పడ్డదీ విద్యాలయం. వారి ఆర్థిక సహాయానికై ఏర్పడ్డదీ ఉత్పత్తి కేంద్రం. సహృదయలందఱూ, సహకరించి, యీ కృషిని సఫలీకృత మొనరించ వలసినదిగా కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ,
కరెస్పాండెంటు.

# మైసూరు పట్టు బట్టలు

## హెచ్చుకాలము మన్నిక కలవి

మునుపటికంటె ఇప్పుడు మైసూరు సిల్కు వస్త్రములే హెచ్చుగా స్త్రీలు ధరించుచున్నారు. మైసూరు సిల్కులో శ్రేష్టమైన చీరెలు, గౌను గుడ్డలు, రవికె గుడ్డలు మొదలైనవి స్త్రీలకు, పురుషులకుకూడా అవసరమగు సర్వ విధములగు దుస్తులును అధికముగా వాడబడు చున్నవి.

★

మైసూరు సిల్కు్స
100 కి నూరు వంతులు
స్వచ్ఛమైనవి, కల్తీలేని
పట్టువి.

★

## మైసూర్ సిల్కు్స్

గవర్నమెంట్ సిల్కు వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరియుట, చుండ్రు, బట్టతల, పేను కొరకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువారి గుణమును పొంది యున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశ మంతటా దొరకును.

వెల సీసా 5 అణాలు.

**RITA**

**HAIR TONIC**





# ఆంధ్ర మహిళా ప్రెస్

ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది

## ఆంధ్ర మహిళా ప్రెస్

ఇక్కడ

పుస్తకములు, కరపత్రములు, ఫారములు, ఆహ్వాన పత్రికలు మొదలయినవన్నీ

తెలుగు, ఇంగ్లీషు భాషలలో ముద్రించబడును.

విద్యార్థినులకు ప్రెస్ పనులు నేర్పుటానికి క్లాసులుకూడ ఏర్పాటు చేయబడినవి

*

మీ అవసరములు ఆంధ్ర మహిళా ప్రెస్‌లో చేయించి

సంస్థను సహకరించిన వారవుతారు.

○

ఇతర వివరములకు : ప్రెస్ మేనేజరు, ఫోన్ నెం. 863

14, ట్యాంక, మైలాపూరు, మద్రాసు-4

---

## ఆంధ్ర మహిళా సభ

స్త్రీల విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థికోన్నతికై III సం॥ పైగా కృషి చేయుచున్న జాతీయ సంస్థ

ఇందు

| | |
|---|---|
| విద్యాలయం | ఆంధ్రమహిళా పత్రిక |
| పారిశ్రామిక శాఖ | నర్సింగ్ హోమ్ |
| శిశుశాల | ముద్రణాలయం |

సారస్వత, క్రీడా, గ్రంథాలయ, క్లబ్బుశాఖలు

సహృదయంగా చేరి యీ సేవా సంస్థను పోషించండి

—ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్రమహిళ



మాతా శిశు సంరక్షణశాఖ ప్రత్యేక సంచిక

SEPTEMBER 1952 ANDHRA MAHILA ANNAS 8

## ఆంధ్ర మహిళా సభలో

# దసరా ఉత్సవములు.

ఆశ్వయుజశుద్ధ అష్టమి శుక్రవారం. నవమి శనివారం, దశమి ఆదివారం, (26-9-52, 27-9-52, 28-9-52) మూడురోజులు, ఆంధ్ర మహిళాసభలో, వర్షా వర్షం జరిగే పద్ధతిలో దసరా ఉత్సవములు జరుగును. ఆటలలో. గానము వక్తృత్వము, నాటకాలలో, కుట్టు, నేత ముగ్గుల చేతిపనులలో పోటీలు జరుగును. అందరూ ఉత్సాహముగా యిందు పాల్గొని, కార్యక్రమము జయప్రదము గావించవలసినదిగా కోరుచున్నాము.

**కార్యక్రమము**

ఉదయము 8 గం॥ దేవీపూజ. మధ్యాహ్నం. పోటీలు. సాయంత్రం, వినోద కార్యక్రమం.

కార్యక్రమ పూర్తి వివరములు సభకు వచ్చి తెలిసికొనవచ్చును.

పోటీలలో. వేడుకలలో పాల్గొనదలచిన విద్యార్థినులు, సభ్యురాండ్రు. సభ్యురాండ్ర పిల్లలు ఈనెల 20-వ తేదీలోగా కార్యదర్శినులకు లిఖితపూర్వకముగా తెలుప కోరుచున్నాము.

జి. జమునాబాయి.
అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శినులు.



పతాకము ఎగురవేయుచున్న
శ్రీమతి బలుసు కనకరాజేశ్వరమ్మగారు



ది 15-8-1952 శుక్రవారం ఆంధ్ర మహిళా సభలో 5-వ స్వాతంత్ర్య దినోత్సవము జరిగినది. ఉదయం 8 గంటల నుండి సభ్యురాండ్రు, విద్యార్థినులు నూలు వడికిరి. తరువాత సభ ఆవరణలో పతాకావిష్కరణ. జెండా వందనము జరిపించిరి.



# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: సెప్టెంబరు '52 :: సంచిక 5

ముఖచిత్రం : ఆంధ్ర మహిళా సభ ప్రాంగణములో, భారత ఆర్థికమంత్రి శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్ గారికి బాలికల గౌరవ వందనము.


భారత్ సేవక్ సమాజ్ ... సంపాదకీయం

ఆంధ్ర మహిళా సభ మాతా శిశు సంరక్షణశాఖ ప్రారంభోత్సవము

ప్రస్తుత పరిస్థితులు ... శ్రీమతి అచ్యుతుని గిరిజ

ప్లానింగ్ కమిషన్ మెంబరు శ్రీమతి దుర్గాబాయమ్మ గారు

రాజకీయాలు ... శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు

తప్తముద్ర - చారిత్ర శ్రవ్య రూపకం ... శ్రీ వాడ్రేవు జోగి పంతులు

బిజిలీ - కథ ... "శ్రీ శిల్పి"

వేష భాషలు - రేడియో ప్రసంగం ... శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

నోముల సరద - కథ ... శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

నేటి సాహిత్యం ... శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

పెళ్లా, బేరమా - చిన్నకథ ... శ్రీమతి వరలక్ష్మి రామమోహనం

సూర్యాస్తమయం - అనువాద కథ ... శ్రీమతి కొత్తపల్లి లలిత

నిర్ణీత సంతానం - వ్యాసం ... "ఏ. వి. ఆర్."

ఇంకా, కథలూ, కబుర్లూ, గద్యాలూ, పద్యాలూ, విజ్ఞానం, బాలానందం, మహిళా లోకం, సినిమా.



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.,

సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 9 :: సెప్టెంబరు '52 :: సంచిక 5

# భారత్ సేవక్ సమాజ్

ప్లానింగ్ కమీషన్‌వారి పంచవర్ష ప్రణాళిక, సక్రమంగానూ, ప్రజాశ్రేయోభివృద్ధికరంగానూ, విజయవంతం గానూ, అమలుజరగాలంటే, ప్రజాసహకారం అత్యంతప్రధానమైన సాధనమని, ఈ సహకారం రెండురూపాలుగా లభించాలని, కమీషన్ వారు అభిప్రాయపడుచున్నారు.

ఏ ఒక్క ప్రాంతంలోనైనా జరుగవలసిన నిర్మాణం, ఆ ప్రాంతీయప్రజలకు లాభదాయకమైనది, అత్యవసరమైనది అని వారి ఆమోదాన్ని బడయాలి. ప్రత్యేకవ్యక్తులయొక్క స్వార్థానికిగాకుండా, దాని పర్యవసానం సాముకయదాయమైన అభివృద్ధిని కలిగించేదిగా ప్రజావిశ్వాసాన్ని పొందాలి. అందువల్ల ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి, ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలు ప్రస్తుతపరిస్థితులలో ఎట్లా లాభదాయకమైనవో ప్రజలకు బోధించడానికి, ప్రజలలో కలిసిమెలిసి తిరుగుతూ, వారి విశ్వాసాన్ని చూరగొనగలిగే సిబ్బంది కావాలి.

ఇక రెండవది : నిర్మాణప్రాంతాలలో జరుగవలసిన కార్యక్రమమంతా, కేవలం ప్రభుత్వసిబ్బందివలనే జరుగాలంటే అసంభవము. ప్రజలలో చాలామంది, విద్యాధనులు, స్త్రీలు, పురుషులు, స్వచ్ఛందంగా వీనిలో పాల్గొనకపోయినచో, దేశం మొత్తంమీద అమలుజరుగవలసిన యీ కార్యక్రమం దుస్సాటం కాగలదు.

యీ పై రెండువిధములుగా ప్రజాసేవను సమీకరించి, ప్రజాసహకారమును సాధించడానికి, జాతీయ సలహా సంఘముయొక్క ఆధ్వర్యాన్న 'భారత్ సేవక్ సమాజ్' అనే ఒక జాతీయ సంస్థను నెలకొల్పడానికి నిశ్చయించబడ్డది.

ప్రస్తుతము దేశమంతటా పెక్కుచోట్ల ప్రజలలోగల సాంఘికసేవా మనస్తత్వం కొన్నిసేవాసంస్థల రూపాన్ని దాలుస్తూ ఉంది. అననుకూల పరిస్థితులవల్ల, యీ సంస్థలు పెక్కు అభివృద్ధి గాంచలేక, కొన్నినామ మాత్రావశిష్టమైనవి కావడం, కొన్ని అసలు నశించడం జరుగుతూవుంది. ఏవోకొన్ని, అభివృద్ధిజెందుతూనూ ఉన్నవి. వర్తమానంలో, యిట్లాంటి సంస్థలు, కూనా, గుజ్జూ, చిన్నా, పెద్దా అన్నీకలిసి 6000 దాదాపు గలవని యిటీవల సాగించిన పరిశీలన వలన స్పష్టపడుతూవుంది. ఇన్నిచోట్లజరిగే కార్యక్రమాల్ని, ఇక్కడ జరిపించే వ్యక్తులయొక్క పూనికను, సేవాసక్తిని, బుద్ధిబలాన్ని, విశ్రాంతికాలాన్ని, చక్కని మార్గంలో, వినియోగించుకునే ఆలోచన, ఏ ప్లానింగ్ కార్యక్రమానికైనా అవసరం. యీ సంస్థలయొక్క పూర్తికార్యక్రమాలను తెలిసికొని, వీటికన్నింటికీ, ఉపయోగకరమైన సూచనలు, ప్రోత్సాహం యీయగలగడానికి, వీనిని భారత్ సేవాసమాజ్‌కి అనుబంధం చేసుకోవడం మొదటిమెట్టవుతుంది.

భారత్ సేవక్ సమాజ్ కార్యవర్గం:— సాంఘికసేవలో ఆరితేరిన పెద్దల కేంద్రసంఘం— అట్టివారితో కూడిన రాష్ట్రసంఘం— అలాగే జిల్లాసంఘాలూ ఉంటూఉంటాయి. స్వచ్ఛంద సేవాదళం ఇందలి సభ్యులు. వారమునకు కనీసం 5 గం॥ సంఘసేవయనేది యిందలి సభ్యత్వరుసుము. ఏవ్యక్తియైనా, యిందు సభ్యుడుగా జేరవచ్చును. సాముదాయకంగా యీ సమాజానికి రాజకీయముద్ర యేమీ ఉండదు. ఇది క్లుప్తంగా దీనియొక్క తత్వం.

ఇలాంటి సంస్థయొక్క ఆవశ్యకతనుగాని, ప్రజాశ్రేయోభివృద్ధినిగూర్చిన దీని ఆశయాలనుగాని, ప్రజాశ్రే

# భారత్ సేవక్ సమాజ్

యస్సుకు అంకితము జేసుకొనబోతున్న యిందలి సభ్యులయొక్క సేవాతృష్ణనుగాని, ఎవ్వరూ సందేహించరు, కాదనలేరుకూడా. అయితే సాముదాయకంగా సమాజానికి కుల మత భాషా తత్వాలు, రాచకీయతత్వాలు లేకపోయినా, వెలుపల యిల్లాంటి తత్వాల్లో నూటికి నూరుపాళ్ళు మునిగితేలుతున్నవారికి, యితర రంగాలలోవారి ప్రాముఖ్యత, పలుకుబడి, నిర్మాణదక్షతలు ఎంత ఉన్నప్పటికీ, యీ సమాజ కార్యకలాప నిర్వహణలో ప్రధానస్థానాలనీయడం పొరపాటు కాబోతుంది; ఆరంభంలోనే ఆత్మహత్యాకారకంగాకూడా పరిణమించగలదు. మన రాష్ట్ర ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారివంటి బుద్ధిబలసంపన్నుఁడు, బాధ్యతాయుతమైన పరిపాలన కొనసాగించవలసినవాడు, తను దాక్షిణాత్యుఁడు, అందులోనూ అరవవాడుననే అహంభావమును తన పరిపాలనకాండలో మరచిపోలేదు సరిగదా, ఆంధ్రరాష్ట్ర విభజన సమస్యలో తన అరవ పక్షపాతాన్ని బహిరంగంగా వేదికలమీద బల్లగుద్ది చెప్పటంలోని అసభ్యతనుకూడా విస్మరిస్తున్నారు. ఇక అంతకన్న తక్కువశ్రేణిలోగలవారు తమ అహాన్నిగాని, తమ పార్టీ అహాన్నిగాని మరచిపోవడం అసహజం.

మరొకవిషయం:—భారత్ సేవక్ సమాజం యొక్క తక్షణ కార్యక్రమం- రోడ్లపరిశుభ్రతనుండి, మానవ, మానసిక పరిశుభ్రతవరకూ అనేక ఆశయాలతో కూడినదై యున్నది. ఇందు జేరగోరువారు "నేను లంచము తీసికొనను- నేను లంచమీయను- నేను ఆహారపదార్థాలు కల్తీచేయను- కల్తీ సరుకును అమ్మను" అనే ప్రమాణాలు స్వీకరించాలి. ఇతరులు స్వీకరించేటట్టు ప్రబోధంకూడా చేయాలి. సేవకదళం యీ ప్రమాణాలకు కట్టుబడిఉండాలంటే నిర్వాహకులు దీనికి కట్టుబడి మార్గగాములు కాగలవారుగా ఉండాలి. అభివృద్ధినిరోధక ఉద్యమాల్లోనూ, విద్రోహకరమైన ఉద్యమాల్లోనూ, చిక్కుకొనియున్నవారికి మాత్రం ఈ సమాజంలో సభ్యత్వమునకు అర్హత లేదనడం చాలా చక్కటి సిద్ధాంతమే. అయితే, అభివృద్ధి నిరోధక కార్యక్రమాలంటే ఏమిటి? కేవలం రైలుపట్టాల బిశ్శలు తొలగించడమే విద్రోహచర్యా, ఆహారపదార్థాలూ, మందులూ, నల్లమార్కెట్టులలో అమ్మడంకూడా విద్రోహ చర్యలేనా? ఇలాంటి విషయాలు, ఇంకా పెక్కులు పూర్తిగా పరిశీలించి, ఏవిధంగానూ నల్లటి మచ్చలేని కార్యనిర్వాహకులను నియమించినప్పుడుగాని, యీ సమాజం పూర్తిగా ప్రజలయొక్క అభిమానాన్ని, సహకారాన్ని పొందలేదు. నిర్వాహకుల బాధ్యతలను స్వీకరించువారు ఆత్మ పరిశీలనచేసికొని తమ అర్హతలను నిర్ణయించుకోవడం ప్రత్యేకమైన సాంఘిక సేవగా భావింపబడగలదు.



# ఆంధ్ర మహిళా సభ

# మాతా శిశు సంరక్షణశాఖ

## భారత ఆర్థిక మంత్రి శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్‌గారిచే

# ప్రారంభోత్సవము

ది 17-8-1952, ఆదివారం సాయంకాలం 6గం॥లకు అడయారు బ్రిడ్జిరోడ్‌లో, ఆంధ్రమహిళాసభ నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవము అతివైభవంగాజరిగింది.

ఇందు నిమిత్తం ఢిల్లీనుండి ది 16-8-1952, మదరాసు కువచ్చిన, సభవ్యవస్థాపక కార్యదర్శిని, ప్రస్తుతంప్లానింగ్ కమీషన్ సభ్యురాలునైన శ్రీమతి దుర్గాబాయిగార్కి, సభ్యురాండ్రు, ఇతరసేవాసంస్థలప్రతినిధులు, విమానాశ్రయములో ఘన స్వాగతమొసంగిరి.

ఉత్సవప్రారంభనిమిత్తం, ది 17-8-1952న మదరాసుకు వచ్చిన, భారతప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్‌గార్కి, విమానాశ్రయంలో శ్రీమతి దుర్గాబాయిగారు, సభకార్యదర్శినులు, సభ్యురాండ్రు, స్వాగతమొసంగిరి.



సభా భవనములో ఆర్థికమంత్రికి స్వాగతం

ప్రారంభోత్సవానికి ముందు, ఆర్థిక మంత్రిగారు లజ్ చర్చిరోడ్‌లోని ఆంధ్రమహిళా సభా భవనములను సందర్శించిరి. భవన ప్రాంగణములో బాలికలచే పూలమాలాలంకృతులై వారొసగిన గౌరవ వందనాన్ని పరిశీలించిన తరువాత శ్రీమతి దుర్గాబాయిగారు సభదాతలను, ట్రస్టీలను కార్యనిర్వాహక వర్గ సభ్యురాండ్రను, ఉపాధ్యాయినులను, యితర ప్రముఖులను వారికి పరిచయము చేసిరి. అనంతరము, మహిళావిద్యాలయము, హాస్టలు, ప్రాథమిక విద్యాలయపు బాలికల చేతిపనుల ప్రదర్శనములను తిలకించి, సభప్రక్కన పార్కులో ఆంధ్ర బాలానందం సంఘమువారి రాలీని సందర్శించిరి.

## ప్రా రం భో త్స వ ము.

ది. 17-8-1952 మధ్యాహ్నము 3 గంటలకు-నర్సింగ్ హోమ్ నూతన భవనముల ఆవరణలో హోమము, వేదపారాయణ మున్నగునవి ఘనాపాటి శ్రీ ఘంటి సోమశేఖర సోమయాజులవారి ఆధ్వర్యాన జరిగినవి. లజ్‌చర్చిలోని మహిళాసభ భవనములనుండి, సభ్యురాండ్రు బాలికలు ఊరేగింపుతో నర్సింగ్‌హోమ్ ఆవరణలో నూతనగృహ ప్రవేశము గావించిరి.

నిర్ణయ ప్రకారము సరిగా 6 గంటలకు సభ ప్రారంభమైనది. డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు సభాధ్యక్షురాలు. ముఖ్యమంత్రి రాజగోపాలచారి, ఆరోగ్యమంత్రి డాక్టరు షెట్టి, విద్యామంత్రి డాక్టరు ఎమ్.వి. కృష్ణారావు, మెడికల్ సర్వీసుల డైరక్టరు శ్రీ అరుణాచలం, మదరాసు విశ్వవిద్యాలయ వైస్‌చాన్సలర్ శ్రీ లక్ష్మణస్వామిమొదలియారు ఇంకా పలువురు పురప్రముఖులు, ప్రముఖవైద్యులు పెద్ద ఉద్యోగులు ప్రఖ్యాతమహిళలు, మహిళాసభదాతలు, అభిమానులు మొదలైనవారితో వేదిక, సభాస్థలికూడ కిటకిటలాడింది.

ప్రార్థనానంతరం, అధ్యక్షురాలు శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు ఆర్థికమంత్రికి స్వాగతంచెప్తూ, శ్రీమతి దుర్గాబాయి గారిని ప్లానింగుకమీషన్ సభ్యురాలుగా నియమించినందులకు ఇండియా ప్రభుత్వాన్ని అభినందించి యీ విధంగా చెప్పారు.

## 'వైద్యులను, నర్సులను గ్రామాల వంకకు ఆకర్షించాలి'

"ఈనాటికి కూడా మనదేశ జనాభాలో బాలింతల, మృత్యుసంఖ్య చాలా హెచ్చుగా నున్నదనుట యదార్థం. అందువల్ల ప్లానింగ్ కమీషన్ పంచవర్షప్రణాళికలో, మాతా శిశువుల సౌభాగ్యానికి ప్రాధాన్యత యిచ్చినందున, మేమెంతయూ కృతజ్ఞులము-మద్రాసు రాష్ట్రంలో 511 మాతాశిశు

# ప్రారంభోత్సవము



నర్సింగ్ హోమ్ ప్రాంగణములో ఆర్థిక మంత్రి దేశ్‌ముఖ్ గారికి స్వాగతం

సంరక్షణశాలలు నెలకొల్పబడ్డాయి. అయినా, ఎక్కువ భాగం యివిపట్టణాలలో ఉండబట్టి, నూటికి 90 పాళ్లు జనాభా గ్రామవాస్తవ్యులు కావటంవల్ల, శాస్త్రయుక్తమైన వైద్యసహాయం గ్రామస్త్రీల కందుబాటులో లేదని ఒప్పుకు తీరాలి. వైద్యులు, నర్సులు, మంత్రసానులు, నూటికి నూరు పాళ్లు, వర్తమానంలో పట్టణాలనే అంటిపెట్టుకొని ఉంటున్నారు. వీరిని గ్రామాలవంకకు ఆకర్షించే ప్రయత్నం అతిప్రధానమైనదిగా ప్రభుత్వం, ప్రజ కూడా గుర్తించాలి.

"గ్రామాలలో నూటికి 7 ప్రసవాలకే శాస్త్రయుక్తమైన సహాయం అందుతూంది. కుగ్రామాలలో అదీలేదు. స్త్రీజన్మలో ఉత్కృష్టమైన సమయంలో, అనాగరీకపు దాదులుతక్క వేరుదిక్కులేక, అనేకమంది స్త్రీలు మృత్యువాత చిక్కుకొనుచున్నారు. ఒకవేళ మృత్యువును తప్పించుకున్నా, జీవిత పర్యంతమూ బాధాయుతమైన అనారో-గ్యానికి గురియగుచున్నారు. ప్రభుత్వము, ప్రజలూకూడ యీముఖ్యలోపాన్ని గమనించి, దానికి తక్షణపరిష్కార మార్గాలు చూడటం అవసరం. ఈనాడు ప్రారంభింప బడే సంస్థవంటి శిక్షణకేంద్రాల నిర్మాణం, యీపరిష్కారాని అత్యవసరం. స్వతంత్ర భారతంలో ప్రజలు, సోదర దేశాల ప్రజలవలె ఆరోగ్యం, సౌభాగ్యం, అనుభవించ సమయానికై, ఆతృతతో ఎదురు చూద్దాం.

తరువాత, సభకార్యదర్శిని, శ్రీమతి జమునాబాయిగార చదివిన కార్యనివేదికలో యిలా చెప్పారు.

"చిన్నపిల్లల ఆటపాటలకు రంగస్థలముగా పదేళ్లక్రితం ప్రారంభింపబడిన 'బృందావనగోపీల'క్లబ్బు, కార్యదక్షత ఆత్మవిశ్వాసము, నిర్మాణశక్తిగల శ్రీమతి దుర్గాబాయిగా



నర్సింగ్ హోమ్ సలహా సంఘ సభ్యులగు డాక్టరు దొరస్వామి, డాక్టరు సత్యనారాయణగార్లను, శ్రీ బులుసు సాంబమూర్తిగారిని, శ్రీ దుర్గాబాయిగారు ఆర్థిక మంత్రికి పరిచయము చేయుచున్నారు.

# ప్రారంభోత్సవము



నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవమునాడు, ఆంధ్ర మహిళాసభ కార్యదర్శిని శ్రీమతి జమునాబాయి గారు కార్య నివేదికను చదువు చున్న దృశ్యం.

వేదికమీద ఎడమప్రక్కనుండి వరుసగా శ్రీ దేశ్‌ముఖ్, సభాధ్యక్షురాలు డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి, డాక్టర్ అరుణాచలం. శ్రీ రాజగోపాలాచారి, శ్రీ సాంబమూర్తి.

అఖండ కృషివల్ల, శాఖోపశాఖలుగా అల్లుకొని, నేటి ఆంధ్ర మహిళాసభగా రూపొందినది. కులమతభాషా విభేదాలు లేకుండా, స్త్రీలకు అన్నిరకముల అవకాశములు కల్పించి, వారిఅనుకూలము, పరిస్థితి, అవసరములను గ్రహించి, సామాన్యవిద్యలో, పరిశ్రమలలో, లలితకళలలో శిక్షణనిచ్చి, సమాజములో వారికొకవ్యక్తిత్వం, ఆర్థికంగా వారికొక స్వాతంత్ర్యం కల్పించడమే మా ఆశయం- ఆ ఆశయసిద్ధికైనమాకృషిని గుర్తించి, తెలుగుజమీందారులు, ఇతర సంపన్నులు, సభసభ్యురాండ్రు, తమవిరాళములనిచ్చి సంస్థను ధారాళంగాపోషించారు.

కేవలం యీవిధమైన ప్రజాసహకారంతోనే మహిళా సభ లజ్‌చర్చ్ రోడ్డులో భవనాలు నిర్మించుకొని, 1949 సం॥ వరకూ తన కార్యక్రమమును నిరాటంకంగా సాగించుకుంటూ వచ్చింది. ఆసంవత్సరం, ఆంధ్ర మహిళాసభ మాతా శిశు సంరక్షణశాఖనుకూడా తన కార్యప్రణాళికకు జేర్చినప్పుడు, మదరాసు ప్రభుత్వము అట్టిశాఖయొక్క ఆవశ్యకతను గుర్తించి, ప్రస్తుతము భవనములేచిన స్థలాన్ని విరాళంగా యిచ్చారు. సహృదయులగు సభ్యురాండ్రు పలువురు ఈ నిర్మాణానికి విరాళాలిచ్చారు- రాజకుమారి అమృతకౌర్‌గారు 7-1-1950 న భవనాలకు శంఖుస్థాపన చేశారు.

తరువాత సెయితూరు జమీందారుగారు ప్రసూతిశాల నిర్మాణమునకై రూ. 15000/- విరాళంగా యిచ్చారు. యింతపెద్ద విరాళాన్ని యిచ్చిన అరవప్రముఖులు వీరొక్కరే యగుటవల్ల వీరికి మా ప్రత్యేక కృతజ్ఞత తెలుపవలసివుంది. శ్రీ పట్టాభి సీతారామయ్యగారు 19-6-1951న ప్రసూతిశాలకు శంఖుస్థాపన చేశారు.

ప్రపంచమంతటిలో నర్సుల కొరత అధికంగా ఉంది, అయితే భారతదేశంలో ఆకొరత అత్యంత తీవ్రమైనదిగా వుంది. ఇండియన్ నర్సింగ్ కౌన్సిలువారు, యీ కొరతను తీర్చుటకై, తయారుచేసిన. తేలికై, తక్కువ కాలములో నభ్యసించదగు సహాయనర్సు మిడ్వైఫరీ శిక్షణవిధాన ప్రణాళిక ఆచరణ యోగ్యంగా మమ్మాకర్షించుటచే, అట్టి కేంద్రస్థాపనకు సహాయము చేయవలసినదిగా భారత ప్రభుత్వమువారిని శ్రీ దుర్గాబాయిగారు కోరినారు. ఈ ప్రణాళిక ప్లానింగ్ కమీషన్‌వారి ఆమోదాన్ని బడయగా, దీని నిర్మాణానికి భారత ప్రభుత్వం రూ. 80000/- విరాళమిచ్చి, 5సం॥ పాటు నిర్వహణ వ్యయములో 15000 మించని అర్ధభాగమును భరించునట్టి ఏర్పాట్లు చేసియున్నారు. వీరికి మా కృతజ్ఞత. ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్ నియమించినప్రకారం యీ శిక్షణ రెండు సంవత్సరములు- మూడవఫారమ్ అర్హతగలవారిందు చేర



వచ్చును. మొదటి సంవత్సరములో 8 గురు. రెండవ సంవత్సరములో మరి ఎనమండుగురు యిందు శిక్షణకు తీసికొనబడుదురు. ప్రాథమిక నర్సింగ్, ప్రథమ చికిత్సలలో మొదటి సంవత్సరము తరువాత, మంత్రసానిపనిలో రెండవసంవత్సరము తరువాత పరీక్షలు జరుగును. ఈ శిక్షణ క్షుణ్ణంగా ఉండగలందులకు, తగిన అవకాశములు తర్ఫీదుకాలంలో శిక్షితులకు జనరల్ హాస్పటల్, కస్తూర్బా హాస్పటల్సులో కల్పించవలసినదిగా, మద్రాసు ఆరోగ్య మంత్రిని కోరుచున్నాము.

కమ్యూనిటీ ప్రాజెక్టులలో ప్రజారోగ్య అభివృద్ధికూడా ఒక విషయం. ఇది కొనసాగటానికి వందలకొలది నర్సులు, మంత్రసానులు తక్షణం కావలసి యున్నారు గనుక, వారిని తర్ఫీదుచేసే యిలాంటి శిక్షణకేంద్రానికి, ప్రజలు, ప్రభుత్వం బహుముఖంగా సహకరించవలెనని ప్రార్థిస్తున్నాము."

## మంత్రి దేశముఖ్ గారు ప్రసంగిస్తూ:

"1951-52 బడ్జెట్టుచర్చలో, విద్య, ఆరోగ్యముల అభివృద్ధికి కేటాయించిన మొత్తము అతి స్వల్పమని పలువురు తీవ్రముగా విమర్శించినారు. అందులో శ్రీమతి దుర్గాబాయిగారు ఒకరు. వీరి వాదనను నేను కాదనలేకపోగా, అవకాశమునుబట్టి యీ విషయంలో శ్రద్ధవహించ గలనని వాగ్దత్తము చేయడం, తరువాత, ఆంధ్రమహిళా సభవారి క్రొత్తప్రణాళికయైన, నర్సుల శిక్షణ, ఆకర్షవంతమై ప్లానింగ్ కమీషన్‌వారి ఆమోదాన్ని బడయడం జరిగింది. దీని పర్యవసానం. గతసంవత్సరం మహిళాసభకు లభించిన ప్రభుత్వసహాయం"

## 35000. జనాభాకు ఒక్క మంత్రసాని

"ప్రపంచమంతటా నర్సుల సంఖ్య కొరవయనుట యదార్థం. కాని, మనదేశంలో వారు స్వల్పాతి స్వల్పం కావడం శోచనీయాంశం. యునైటెడ్ కింగ్‌డమ్‌లోను, యునైటెడ్ స్టేట్సులోను. 350 జనాభా కొక్క నర్సు చొప్పున ఉన్నారు. మనదేశములో 35000 మందికి ఒక్కనర్సుమాత్రమే. ఇతరప్రాంతాలకన్న అభివృద్ధిలో నున్న మదరాసు రాష్ట్రంలోసహా, 8000 మందికి ఒక మంత్రసాని మాత్రమే ఉన్నది. భారతదేశానికి అవసరమైన 7,40,000 నర్సులను తర్ఫీదుచేయాలంటే, ప్రస్తుత పరిస్థితులలో ఒక శతాబ్దం పడుతుంది.

## కారణత్రయం

ఈ దుస్థితికి మూడు కారణాలు గోచరిస్తున్నవి. 1. తగినంత విద్యార్హతగల స్త్రీలు పలువురు యీ వృత్తి నవలంబించుటకు ముందంజ వేయకపోవడం. 2. తగిన బోధనా పరికరాలు, సమర్థులగు ఉపాధ్యాయులుగల శిక్షణ కేంద్రాలు బహు స్వల్పసంఖ్యలో ఉండడం. 3. ఇట్టి కేంద్రాలను ఒక్కమారుగా అవసరమైనన్ని సమకూర్చగల ఆర్థిక స్థోమత మనకు లేకపోవడం.

ఈకారణాల నెదుర్కొనగల అనుకూలపరిస్థితులేర్పడి, విద్యావంతులగు పెక్కురు స్త్రీలు యీ వృత్తియందు అభిమానము చూపునంతవరకూ, ఆంధ్ర మహిళాసభవంటి సేవాసంస్థలు పూనుకొనుచున్న సంక్షిప్త శిక్షణతో మనసు సరిపెట్టుకోవాలి.

ప్రస్తుతంలో మనదేశమంతటిలోనూ, 171 వైద్యశాలలలో మాత్రమే నర్సుల శిక్షణ జరుగుచున్నది. ఇందులో తగినంతమందికి శిక్షణ ఇచ్చే అవకాశాలు చాలా తక్కువగా ఉన్నవి.

## అనుబంధ విద్యాప్రణాళిక

ప్రతినర్సూ, మంత్రసాని విద్యనభ్యసిస్తే, కొరత కొంత వరకూ తీరగలదు. అయితే యిది ఎట్లా సాధించడం?

# ప్రారంభోత్సవము

పూర్తిగా తర్ఫీదుపొందిన నర్సులక్రింద పనిచేయడానికి నర్సు-మంత్రసాని విద్యలో సులభమైన, సంక్షిప్త విద్యా ప్రణాళికలో కొంతమందిని తర్ఫీదుచేసుకోవడం, ప్రస్తుతానికి ఒక పరిష్కారమార్గంగా తోస్తుంది. ఇటువంటి ఆగ్సలియరీ నర్సులశిక్షణ, నాగరికదేశాలగు బ్రిటన్, అమెరికాలలోకూడ అమలులో ఉంది. ఆదేశాలలో అవలంబించే ప్రణాళికా విధానాలనే, ఇండియన్ నర్సింగ్ కౌన్సిలువారుకూడ అవలంబించుటకు నిర్ణయించుకున్నారు. ఆసుపత్రులలోను, లేక ఇండ్లలోనూ పనిచేయడానికి యిలాంటి సహాయ నర్సులు చాలా ఉపయోగపడ్తారు.

ఇప్పట్లో, మదరాసులో నర్సు ట్రయినింగ్ కావాలనుకున్నవారు మెట్రిక్యులేషన్ అర్హత గలిగి, నాలుగేండ్లు శిక్షణపొందాలి. కాని, యీ సహాయనర్సుల శిక్షణకు-రమారమి మూడవఫారమ్ అర్హత, రెండేళ్ళ తర్ఫీదు, కావడంవల్ల పలువురకు అందుబాటులో నుండుటయేగాక, తక్కువకాలంలో ఎక్కువమంది శిక్షితులయ్యే అవకాశం కలుగుతుంది. అసలు నర్సులవలె, వీరివల్ల, పెద్దపెద్దకేసులలో పూర్తిసహాయం సమకూరకపోయినా ఆరోగ్యంగా ఎలావుండాలో, పరిశుభ్రంగా ఎలావుండాలో వీరు చెప్పగలరు. జిల్లాఆసుపత్రులలో పెద్దనర్సులక్రింద, కొన్ని చోట్ల మంత్రసానులుగానూ వీరు పనిచేయవచ్చు. అయితే యిట్టివారికి తగినంత కట్టుదిట్టంగా, శ్రద్ధగా శిక్షణనిచ్చే భారం, శిక్షణకేంద్ర నిర్వాహకులపై ఉన్నది.

ప్లానింగ్‌రీత్యాచూస్తే, ఆంధ్రమహిళాసభ తలపెట్టిన ప్రస్తుత కార్యక్రమం అతి ప్రాధాన్యమైనది. కేంద్ర ప్రభుత్వం, ఒక సేవాసంస్థకు ఇలాంటి ప్రణాళిక బాధ్యతను ఒప్పగించడం ఇదే ప్రథమం. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలయొక్కయు, ఆంధ్ర మహిళా సంస్థయొక్కయు సమిష్టి కృషి ఫలితమే ప్రస్తుతము యీ శిక్షణ కేంద్రం", అని ముగించారు.

వైస్ ఛాన్సలరు లక్ష్మణస్వామి మొదలియారుగారు ప్రసంగిస్తూ,

"ఆంధ్ర మహిళాసభ కార్యక్రమం, అందరకూ పరిచయమైనదే- ఈ సంస్థ నర్సు- మిడ్‌వైఫ్ శిక్షణకేంద్రం స్థాపించడం అభినందనీయం. సామాన్యంగా, మంత్రసాని పనిచేస్తున్న నర్సులు, మంత్రసానివృత్తి నవలంబించక పోవడంవల్ల వారు పొందిన శిక్షణ వృథా అవుతూవుంటుంది. గనుక, నర్సు-మిడ్‌వైఫ్‌లను తయారుచేయు చున్న ఆంధ్ర మహిళాసభ దీనిని గుర్తించి, తగు శ్రద్ధ వహించగలదని విశ్వసిస్తాను— గ్రామాలలో పనిచేయవలసిన నర్సులు, మంత్రులు చాలా క్షుణ్ణంగా తర్ఫీదైన వారుండాలి. కొన్నిగ్రామాలకు కేంద్రంగా ఒక సంచార వైద్యశాల, దానితో నిపుణులైన వైద్యులు ఉండాలన్న భోరేకమిటీ సూచనకు నేనెంతయూ సుముఖుడను" అని చెప్పారు.

శ్రీ సెయితూరు జమీందారుగారు, శ్రీ బులుసు సాంబమూర్తిగారు ప్రసంగిస్తూ, దుర్గాబాయిగారి కృషిని ఉగ్గడించి, ఆంధ్ర మహిళా సభ చేయుచున్న కార్యక్రమంలో సహకరించినవారికి తమ కృతజ్ఞత తెలియజేశారు.

కార్యదర్శిని శ్రీమతి చన్నుభొంట్లమ్మగారు వందనము సమర్పిస్తూ, అత్యంత కార్యభారంలో విశ్రాంతి ఎరుగకపోయినా, తమ ఆహ్వానము నంగీకరించిన శ్రీ దేశముఖ్‌గారికి కృతజ్ఞత తెలుపుతూ, వారు ప్రారంభోత్సవము జరిపించడం మహిళాసభయొక్క ప్రత్యేక అదృష్ట



ది 17-8-52 న మహిళా సభలో శ్రీ దేశ్‌ముఖ్ గారి గౌరవార్థం జరిగిన విందు.

# ప్రారంభోత్సవము

దినాంకము 18-8-'52న శ్రీ దేశ్‌ముఖ్ గారు, శ్రీమతి దుర్గాబాయిగారితో సహా, మద్రాసు నగరములో స్త్రీలచే నిర్వహించబడుచున్న అనేక సేవా సంస్థలను సందర్శించిరి. అప్పుడే ఆంధ్ర మహిళా సభవారు 14, ద్వారక, మైలాపూరులో జరుపుచున్న ప్రెస్‌ను, వస్త్రములపై అద్దకపు పని తరగతులను సందర్శించిరి. శ్రీ దేశ్‌ముఖ్‌గారికి ఆంధ్రమహిళా ప్రెస్‌లో స్వాగతం.



మేనన్నారు. సంఘసేవలో స్త్రీలకొక మార్గదర్శిని, వైద్యవృత్తిలో గొప్ప యనుభవశాలియైన శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు ఆనాడు అధ్యక్షపీఠాన్నలంకరించడం ఎంతేయూ సవ్యంగా ఉన్నదనిచెప్తూ, వృద్ధులయ్యూ, అస్వస్థులయ్యూ తమ అహ్వానాన్ని అంగీకరించి, ఉత్సవాన్ని జరిపించినందుకు కృతజ్ఞత తెలియజేశారు. ఆనాటి ఉపన్యాసకులైన శ్రీ శెట్టిగార్కి, శ్రీ లక్ష్మణస్వామి మొదలియారుగారికి, శ్రీ సెయితూరు జమీందారుగారికి అతిథి ప్రముఖులకుకూడ వందనములర్పించారు.

తరువాత నర్సింగ్‌హోమ్‌కు ఆదిలో విరాళములిచ్చిన వారందఱనూ ఒక్కొక్కరిని పేర్కొని కృతజ్ఞతను తెలిపిరి.

[దాతల స్మరణ:- మద్రాసు ప్రభుత్వం- 21 గ్రౌండ్ల స్థలం- శ్రీమతులు వెనిగండ్ల లక్ష్మీపార్వతి, ఉయ్యూరు జమీందారిణి, పురం అన్నపూర్ణమ్మ. నిడమర్తి లక్ష్మీనరసమ్మగార్లు ఒక్కొక్కరు రూ 5000/- శ్రీమతి పి. శకుంతలమ్మగారు రూ 2500/- శ్రీమతులు లక్షలమ్మ స్వర్ణమ్మ గార్లు కలిసి రూ 1000/- శ్రీ సెయితూరు జమీందారు గారు రూ 15000/- శ్రీ ఎన్. సుబ్రహ్మణ్యంగారు 1016/- శ్రీ జి. టి. శాస్త్రిగారు 500/- శ్రీమతి లక్ష్మమ్మ గారు 500/- కేంద్ర ప్రభుత్వం రూ 80000/- నర్సింగ్ హోమ్ సహాయార్థం ఏప్రిల్ 1951 లో నృత్యప్రదర్శనము నొసంగిన శ్రీమతి ఉషారాణీగారు.]

కట్టడములను గూర్చి. అందు అమర్చదగు పరికరములను గూర్చి, అవలంబించవలసిన శిక్షణ ప్రణాళికను గూర్చి, చక్కటి సలహాలను సదా యిచ్చుచున్న ప్రభుత్వ ఉద్యోగులు, తదితరులగు ప్రముఖ వైద్యులకు కృతజ్ఞత తెలియబరచిరి.

తరువాత, కట్టడములో అన్నివిధములా తోడ్పడి సహకరించిన, గానన్‌డంకర్లీ కంట్రాక్టర్లకు, కార్పొరేషన్ వారికి, మదరాసు ఎలక్ట్రిక్ సప్లయివారికి, ఎలక్ట్రికల్ ఇంజనీర్లకు, శానిటరీ ఇంజనీర్లకు యింకా ఉత్సవమును జయవంతంగా జరిపించుటకు తోడ్పడ్డ కార్యనిర్వాహక సభ్యురాండ్రకు, తదితర సభ్యురాండ్రకు, సదస్యులకు వందనములు సమర్పించి, ఇంతకూ కారణభూతులైన శ్రీమతి దుర్గాబాయిగార్కి కృతజ్ఞత తెలియపరచారు.

ఈ ప్రారంభోత్సవ సమయంలో విరాళా లిచ్చిన యీ క్రిందివారికికూడ కృతజ్ఞత తెలియపరచారు.

శ్రీ జున్ జున్‌వాలా రూ. 1000-0-0, దాదా కంపెనీ రూ. 501-0-0, శ్రీమతి మిరియాల లక్ష్మీనరసమ్మ రూ. 200-0-0, మదరాసు గవర్నరు, శ్రీమతి దువ్వూరు నరసమ్మ, మిసెస్ ఎస్. సుందరరామశాస్త్రి ఒక్కొక్కరు రూ. 116-0-0. డాక్టరు పి. రామారావు, శ్రీమతి రత్నసరన్, మెడ్రాస్ లైఫ్ ఫౌండరీవారు ఒక్కొక్కరు రూ. 101-0-0, శ్రీమతి కొండా జానికమ్మ, శ్రీమతి ఆల్వార్ చెట్టి, శ్రీ సి. వి. కృష్ణస్వామి చెట్టిగార్లు ఒక్కొ-

త్వరలో వస్తూంది!

విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో
అందించు



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి

# పేదరైతు

దర్శకత్వం.. కె.బి.నాగభూషణం
అసోసియేట్.. ఇంటూరి

అంజలీదేవి
కన్నాంబ
శ్రీరామమూర్తి



చమ్రియా రిలీజ్

క్కరు రూ. 100-0-0, మిసెస్ వాట్కిన్స్, నాగరత్నం వజ్రవేలు అండ్ కో. ఒక్కొక్కరు రూ. 50-0-0, మిసెస్. డి.యస్. శాస్త్రి, మిసెస్. ప్రసాద్, మిసెస్. ఎ.వి. రావు ఒక్కొక్కరు రూ 25/-, శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం రూ. 20/-, మిసెస్. టి. కె. అడ్రన్‌వాలా రూ. 15/- శ్రీ ఆచంట జానకీరామ్‌గారు ఒక బీరువా.

జనగణమనగానంతో సభ ముగిసింది. అతిథులంతా నూత్న భవనాన్ని, అందలి పరికరాలను తిలకించారు.

ఆతరువాత ఆంధ్ర మహిళాసభలో శ్రీ దేశముఖ్‌గారి గౌరవార్థం విందు జరిగింది.

## నర్సింగ్ హోమ్ సహాయార్థం వినోద కార్యక్రమం

ది 18-8-52 సాయంకాలం నర్సింగ్‌హోమ్ సహాయార్థం, మహిళా సభ సభ్యురాండ్రు, విద్యార్థినులు, అభిమానులు కలిసి, మ్యూజియమ్ థియేటరులో మంత్రి దేశముఖ్ గారి సమక్షమున ఒక వినోద ప్రదర్శనము గావించిరి.

సభ నృత్యశాఖ విద్యార్థినులు మేనకావిజయం డాన్స్ డ్రామాను ప్రదర్శించారు. సభ్యురాండ్రు ఆర్కెస్ట్రా వాయించారు. నృత్యోపాధ్యాయిని శ్రీమతి సామ్రాజ్యంగారు 'శతపత్రసుందరి' నృత్యం, 'బాలగోపాల' తరంగం అభినయం చేశారు. శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గారు పాటలు పాడారు. దక్షిణభారత హిందీప్రచారసభ వారు షాజహానునుండి కొన్ని దృశ్యాలు చూపారు. 'లైట్ ఆవ్ ఏషియా' నుండి కొన్ని దృశ్యాలు సభ విద్యార్థినులు ప్రదర్శించారు. ఇందుపాల్గొన్న విద్యార్థినులకు, సభ్యురాండ్రకు, బుద్ధుడుగా నటించిన సభ ఉపాధ్యాయిని కుమారి కృష్ణమ్మకు, నృత్యోపాధ్యాయిని శ్రీమతి సామ్రాజ్యంగారికి, సంగీతోపాధ్యాయిని శ్రీమతి సుబ్బలక్ష్మిగారికి, మేనకావిజయం రచయిత, లైట్ ఆవ్ ఏషియా నిర్వాహకులయిన శ్రీ రజనీకాంతరావుగార్కి, లైట్ ఆవ్ ఏషియా స్క్రిప్టు రచయిత డాక్టరు సత్యనారాయణగార్కి, హిందీ ప్రచార సభవారికి, శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారికి, యింత ప్రదర్శనంలో సహకరించిన మహిళాసభ కళాశాఖ వారికి, ప్రదర్శనమునకు విచ్చేసి తమ అభిమానమును జూపిన ప్రేక్షకులకు- ఆంధ్ర మహిళాసభ, యిందుమూలముగా వందనములర్పిస్తూఉంది.

[ప్రదర్శనమునకు సంబంధించిన చిత్రాలు అట్టమీద చూడండి ]





# ఆంధ్ర మహిళాసభలో

5- వ స్వతంత్రదినోత్సవము— 15—8—52 శుక్రవారం.

మల్లమదేవి హాస్టలు విద్యార్థినులు అతిధి
సత్కారానికి సన్నద్ధులగుచున్నారు.









పతాకవందనము తరువాత
సభ్యురాండ్ర ముచ్చట్లు.

# ప్రస్తుత పరిస్థితులు

* శ్రీమతి అచ్యుతుని గిరిజ *

## సంకురుమయ్యా రైల్వే:

ప్రస్తుతం సంకురుమయ్య రైల్వేలమీద నడుస్తున్నాడు. ప్రతిరోజు పత్రికల్లో రైల్వే సలహా సంఘంవారి మీటింగో, స్టేషను మాస్టర్ల తలపోతలో, ఉద్యోగస్తుల కుంచింపులో, టికెట్టు హెచ్చింపులో, ఒకటోతరగతి పీకివేయటమో, ఒకటిన్నర తరగతి కొత్తగా పెట్టటమో, చివరకు యేమీ లేకపోతే ఒకవాగను పట్టాలు తొలిగి పదిగజాలు పరిగెత్తిందనో కనిపించుతునే వుంటుంది, ఇంతేకాదు. కొత్త రకపు మూడవతరగతిలో మంత్రులతో కొలువుతీర్చిన భారత అధ్యక్షుడి ఫొటో, నావంటి పాఠకులకనేకమందికి నోరు వూరించేట్టుగా వున్నది. అంత విలక్షణంగా మూడవ తరగతి పెట్టెలో యెక్కి కూర్చుని చిరునవ్వు నవ్వగలిగిన రాజేంద్రబాబు చిదానంద స్వరూపుడే! సామాన్య భారతీయుడింకెవరైనా అయితే యీనాడు మూడవతరగతి పెట్టెలో నవ్వటం సరిగదా యేడవకుండ వుండగలడా అని సందేహం. అక్కడే వున్నది చిన్న పెద్దల తారతమ్యం. ఈమధ్య అనవసరంగా రేట్ల హెచ్చింపులను గురించి ప్రజలు ఆందోళన కనపరచారు. ఉత్త ఆర్భాటమేకాని నిజానికి హెచ్చించినందువల్ల నష్టమేమిటో అంతుపట్టటంలేదు. బిచ్చగాళ్ళు, ముష్టివాళ్ళు, సాధుపుంగవులు, సన్యాసి మహాత్ములు టిక్కెట్లు కొనుక్కోరు. వాళ్ళంతా ఆగ్రహంవస్తే రైలెక్కి అనుగ్రహంవస్తే రైలు దిగి మానవసేవచేస్తారు. ఇంక రైల్వేవుద్యోగస్తులు, మిలిటరీవాళ్ళు, విమానశాఖ వాళ్ళు వగైరా వగైరాలంతా కన్సెషన్లతో తిరుగుతారు. డాక్టర్లకు పేషంట్లు కొంటారు. లాయర్లకు పార్టీలు యిస్తారు. ఆఫీసు పనులమీద తిరిగేవాళ్ళకు అలవెన్సు లిస్తారు. ఇంటర్వ్యూలకు వాటిని ప్రకటించినవాళ్ళు యిచ్చుకుంటారు. ఇట్లా తీసివేయగా నిజానికి యెంతమంది హెచ్చుడబ్బిచ్చి టిక్కెట్టు కొనుక్కొనేవాళ్ళు మిగులుతారో మీరే చూడండి. అసలు యెవరిఖర్చు వాళ్ళు భరించుకోవలసిన సామాన్య ప్రజలు చివరకు తేల్తారు. ఎన్నిటికని కన్నీళ్ళు కాచ్చగలరు, వాళ్లు మాత్రం. అందుచేత వాళ్ళూ ఒప్పుకుంటారు. అదీకాక ముచ్చటైన మూడో తరగతి పెట్టెలు కొత్తముస్తాబుతో కొత్తవాసనలతో ఎలక్ట్రిక్ పంకాలతో రాబోతున్నవి. ఇంక గునుపు యెందుకు. కాకపోతే ఒక్క చిక్కు వుంటుంది. సాధారణంగా యిప్పుడువున్న పద్ధతినిబట్టి మొదటి తరగతి రెండో తరగతి పెట్టెలలోనే మూడువంతులు స్విచ్చీలకు మూతడిప్పలు వుండవు. దీపం వేయబోయే ప్రయత్నంలో ప్రయాణీకులకు ఒళ్ళు ఝల్లుమని, తపీమని వెనక్కి తిరగటం పరిపాటి. మరి వాళ్ళకు వెనక్కి తిరగటానికి చోటంటు వున్నది కాబట్టి తప్పుకుంటారు. తేనె తుట్టెలో తేనెటీగలల్లే సూదిమోప సందులేకుండ వేళ్ళాడుతువుండే యీ మూడవతరగతి ప్రయాణీకుల సంగతి యేమిటి? సముద్రంలో కొట్టుకుపోయేవాళ్ళు గడ్డిపోచ కనిపించినా అమాంతం దాన్ని పట్టుకున్నట్లు, పట్టుకు నిలబడటానికి యే ఆధారం దొరక్క యే పంకా కడ్డీనో, స్విచ్చిమీటనో, పట్టుకుంటే యేమయేటట్లు? ఇంతా ఈ తయారయివచ్చిన కొత్తపెట్టెలు యింకా మచ్చు సరికేగా. అసలు ఆర్డరు యిచ్చిన సరుకంతా దేశంలోకి దిగుమతి అయేవేళకు మనకు ఎన్నెన్ని మార్పులుకావాలో అన్నీ ఆలోచించుకుని, అనుభవించి చూసుకుని నివేదించుకోవచ్చు. తీరికగా లోపలకూర్చుంటేగదా కొత్తపూతల అందంచూసి ఆనందించటం అని నిరుత్సాహ పడకూడదు. కూర్చుంటే జానెడులెక్క కంటికి కనిపిస్తుంది. కడ్డీలు పట్టుకుని బయటికి వేలాడుతు వుయ్యాల వూగుతూవుంటే పొడుక్కి యెన్ని పెట్టెలో చూసి ఆనందించవచ్చు.

రైలు ప్రయాణీకుల పుణ్యం పండి పరిపక్వానికి వస్తు వస్తు వున్నట్లే వున్నట్లుంది. ఎందుచేతనంటే సెంట్రల్ టీ బోర్డువారు, అఖిలభారత మహిళాసంఘంవారు కలిసి నెలకొల్పిన 'అన్నపూర్ణ' భోజన ఫలహార శాలలు రైళ్ళల్లోకూడ పెట్టే సంకల్పం కొంత కదలబారినట్లు వినికిడి. ఎట్లాగయినా అన్నపూర్ణలన్నీ పెద్దపట్టణాలలోను, విరి

# ప్ర స్తు త  ప రి స్థి తు లు

విగా హోటళ్ళు యిదివరకే వున్నచోట్లనే వుంటయ్. వాటితో మిగతా వుత్తహోటళ్ళు పోటీకి దిగలేవు. వ్యాపారం మానుకోలేవు. అందువల్ల అన్నపూర్ణలేని యింకోచోటుకి పోవలసివస్తుంది. ఇట్లా బయలుదేరటంలో కొంత కొంత మంది హోటలు నిర్వాహకులు తప్పనిసరిగా కొత్త స్టేషన్లకు వస్తారు. కుక్కబిస్కెట్లు, కానీ రంగు సోడాలు కూడ దొరక్క, జనం విలవిలలాడే పరిస్థితుల్లో వెచ్చని కాఫీనీళ్ళు దొరకటం సామాన్యభాగ్యమా. దేవుడు మేలు చేసి అన్నపూర్ణభవాని అన్నిస్టేషన్లలో వెలిసేటట్లు ప్రభుత్వం పౌరోహిత్యం చేసిందంటే టికెట్టు హెచ్చింపు యెవరు గర్హించగలరు?

ఉన్నట్టుండి ప్రభుత్వానికి రైలు ప్రయాణీకులమీద యెంతగానో అనుగ్రహం వచ్చింది. "పోనీలె అబ్బాయిలూ, రైల్వేపనికయ్యేఖర్చుల్లో కొంత తగ్గించి మీ సౌకర్యాల నిమిత్తం సర్దుతాములే" అని అభయం యిస్తున్నారు. అంటే మరికొంతకాలం రైలు మార్గం బాగయ్యే సూచనలుగాని, డొక్కుపెట్టెలుపోయి కొత్తవి రావటంగాని, ఆడే పట్టాలు గట్టిగా బిగించటంగాని వగైరా వగైరా లేమీ జరగవన్నమాట. భగవంతుడిచ్చిన ఆయుర్దాయం బాగా వుండాలిగాని కొత్తపెట్టెలు కొత్త పట్టాలు మనలను వుద్ధరించగలవా? వెనక నుయ్యిలో నీళ్ళు లభించలేదు. ముందు గొయ్యిలోనైనా కోరికలు అవసరాలు ఫలించగలవేమో చూతాము. ఇంతగా రైల్వే బయటికి రావటానికి కారణమేమిటి? సంకురుమయ్యకు పులి, సింహం, ఏనుగులాంటి పాతవాహనాలు విసుగేసి యీ సంవత్సరం రైలు యెక్కవస్తున్నాడేమోనని నాకు సందేహం. అయినా పంచాంగం తిరగవేయడం మంచిది!

## తెల్ల ప్ర హ్లా దా యి :

తూర్పు పడమర, అత్తాకోడలు పొత్తు కుదరని విషయాలని అందరికి గట్టినమ్మకం. కాని కోడలిమాటకు పక్కతాళం వేసే అత్తగార్లలేనే తూర్పు ప్రజలకోసం నానా బాధలు అనుభవించటానికి సిద్ధపడే పాశ్చాత్యులుకూడ లేకపోలేదు. ఇంగ్లండులోని ప్రధాన చర్చి అయిన కేంటరుబరీ చర్చి డీను యీతెగకు చెందినవాడే. ఈ మత గురువుగారు దూరప్రాచ్య దేశాలన్నిపోయి తిరిగివచ్చారు మొన్ననీమధ్యనే. వెళ్ళిన మనిషి తనదేశం తరపున డబ్బావాయించుకురావాలి, లేదా నాలుగు పార్టీలు సన్మానాలు యిప్పించుకుని, మూడు పార్టీలు ఇచ్చి, ఐదు ఫొటోలు తీయించుకుని, యెండిపోయిన పూలదండల తాలూకు నార పీచులు చేతిపెట్టెలో భద్రంచేసుకుని యిల్లు చేరుకోవాలి. దోవనపోయే ప్రతి పత్రికావిలేఖరిని పిలిచి, "అహో మనమన్నా మనదేశమన్నా వాళ్ళకు యెంతగౌరవం, యెంత ఆపేక్ష అబ్బో" అంటూ నాలుగు సుభాషితాలు వల్లించాలి. అదీపోయి, ఇదీపోయి, ఈ ఛాందసపు పూజారి కడగాపోయే పెద్దమ్మా దయచేసి నాకాలుమీదుగా పొమ్మని ప్రాధేయపడినట్లు పాశ్చాత్యదేశాలు, అందులోను ఇంగ్లండు అమెరికాలు యేవిధంగా చైనావంటి తూర్పుదేశాలను అవస్థపెడుతున్నవనేవి నిగ్గుతీసి తెలుసుకున్నాడు. కొన్నివందలమంది సంతకాలతో న్యాయంకోరుతు విజ్ఞప్తి పత్రాలు తీసుకున్నాడు. ఇవేమీ చాలనట్లు తన పెట్టినిండా క్రిములు, కీటకాలు, తేళ్ళు జెర్రులు వగైరా వగైరాలన్నీ నింపుకు వచ్చాడు. ఇంక ఇంగ్లండులో అడుగు పెట్టిన దగ్గరనుంచి "అమెరికన్లు చైనామీద కురిపించిన వాన బాపతు వడగళ్ళు యివిగో" నంటూ యీ పురుగూపుత్రా మాంత్రికుడల్లే బయటికి తీసి చూపిస్తున్నాడు. 'ఏమిరా ప్రహ్లాదా నీకీబుద్ధులెవరు చెప్పినారురా' అని హిరణ్యకశిపుల వారు కొడుకును మందలించిన ఘట్టం ఆధారంగా తీసుకొని బ్రిటిషు పెద్దతలలందరు నయాన మందలించారు. కాని ఆతెల్ల డీనుగారు మన నల్ల ప్రహ్లాదుడి పాత్ర బాగానే ధరించుతున్నారు. "ఇందుగల వందులేవని సందేహము వలదు; యీ క్రిములు సర్వోపగతులు, యెందెందు వెదకి చూచిన చైనాయందు కనిపించు" అనే పద్యం యిట్టే యేకరువు పెడుతున్నారు. మరి దానవాగ్రణి అంతటితో వూరుకుంటే ప్రయోజకత్వం యేముంది? అందుకని "వీడిని కొండమీదినుంచి సముద్రంలోకి తోయటం వగైరా

(16-వ పేజీ చూడండి)

# అభినందనమిదే—అందుకోవమ్మా!

శ్రీమతి గిడుగు లక్ష్మీకాన్తమ్మగారు

[ప్లానింగ్ కమిషన్ సభ్యత్వ పదవీ స్వీకరణానంతరం, యిటీవల మద్రాసుకు విచ్చేసిన శ్రీమతి దుర్గాబాయి గారిని గూర్చి, ఆంధ్ర మహిళాసభ సభ్యురాలగు లక్ష్మీకాంతమ్మగారు రచించిన స్వాగత పద్యములు.

ఉ॥ స్వాగతమో అశేషజన సన్నుత వైభవ శీవిశాలినీ
స్వాగతమో స్వతంత్ర నవభారత భావికళా విశాలినీ
స్వాగతమమ్మ నీవిమల సద్గుణరాజికి ఆంధ్రభామిణీ
స్వాగతమమ్మ నీకఖిల సౌఖ్యపరంపర గల్గుగావుతన్.

ఆంధ్ర మహిళాసంస్థ యభివృద్ధి గాంచుట
నీ కృషిఫలితమే - నింతదనుక
లలితకళా విశారద లౌట మహిళలు
నీచేతిచల్వయే - నెలతమిన్న
రాజకీయప్రవృత్తి - రాణింపజేయుట
నీజ్ఞానశక్తియే - నిజముసుమ్మ
అతులసేవాధర్మ - మాచరింపంగ - నీ
కరుణాస్రవంతియే - కారణంబు.

గీ॥ ఆంధ్రమహిళామతల్లి! నీ యడుగుజాడ
లందు నడువంగ విధిసుమ్మ - అతివలకును
మధురమౌనీదుపల్కులు - మాహృదాబ్జ
ములను గదలించు, చల్లని పలుకునీది.

శా॥ భావింపంగను - భారతావనికి - సౌభాగ్యంబు
చేకూర్పగా
సేవాధర్మమునుగ్గుపాల దిని పించెన్‌మాత బాగొప్పగా
నీవిజ్ఞాన పరోపకారగుణముల్ - నీ నీడగాతోడుగా
శ్రీ విస్ఫారగ గాచుచుండు ధరణిన్ చెన్నారు
సత్కీర్తులన్,

సీ॥ ఉదయమౌటకుమున్నె - మదినానెనో యేమొ
స్వాతంత్ర్యశక్తి వాక్పటిమశక్తి
కనులువిప్పకమున్నె - గాయత్రిగాబోలు
సంఘసంస్థాపనా - సాధకంబు
జననియుగ్గునబోసి - చవిచూపెకాబోలు
మహితసేవాధర్మ - మార్గమవని
దేశోద్ధారణకెంత - దీసిపోవనిభక్తి
చిననాడె వంటబట్టినదియేమొ.

గీ॥ ఆంధ్రజాతిమహోదయ - మవనిగాంచ
కంకణముగట్టినట్టి - సత్కాంతవీవు
ప్రథితశ్రీ గుణవల్లి దుర్గామతల్లి
మాదుజోహార్లునీకు - సమ్మోదమలర.

గీ॥ అవని నీయనుగుబిడ్డయౌ - ఆంధ్రమహిళ
ధరణి తామరతంపరై - వరలుగాత!
ఆయురారోగ్యములునీకు - నమరుగాక!
భారతావనిసౌఖ్యంపు - పంటయనగ!



## కృతజ్ఞత



ఈ దిగువ పేర్కొన్నవారు ఒక్కొక్కరు ఆంధ్ర మహిళా సభకు రూ. 100 లు, చందా చెల్లించి, యావజ్జీవ సభ్యురాండ్రైరి.

శ్రీమతి మామిడన్న శకుంతలమ్మగారు
,, కొర్ని కమలమ్మగారు
,, దామెర్ల జోగులాంబగారు
,, ఎస్. చంద్రాబాయిగారు

వీరికి మా కృతజ్ఞత. —ఆంధ్ర మహిళా సభ.

# కమ్యూనిటీ ప్రాజెక్టులు........

రాష్ట్రంలో వర్కర్ల శిక్షణకు మైదుకూరులోని ఆనం ద్రాక్షమంలోనూ, సామర్లకోటలోనూ శిక్షణకేంద్రాలు నడుపబడును. ప్రాంతీయ వర్కర్లు తమ శిక్షణకేంద్రములో 3 నెలలూ తరువాత 3 నెలలు రెండవప్రాంత కేంద్రంలోనూ శిక్షణపొందుతారు,

ప్రాంతీయసలహా సంఘంవారి సూచలనతో, ప్రాజెక్టులలో ఏకార్యక్రమానికి ప్రాముఖ్యత యీయవలసిందీ ప్రాజెక్టు ఆఫీసరు నిర్ణయిస్తాడు.

ఈ ప్రాజెక్టుల సక్రమనిర్వహణకు, వినియోగానికికూడా ప్రజాసహకారం చాలా అవసరం.

## సాంఘిక సేవా సంస్థలకు ప్లానింగ్‌కమీషన్ ప్రోత్సాహం.

ప్లానింగ్ కమీషన్ నివేదికలో సాంఘికసేవ ఒక విషయం. దేశంలో అంతటా, సంఘసేవఅనేకరూపాలుగా కొన్నిసంస్థలవారు జరుపుతున్నారు. అయితే, ప్రభుత్వ ప్రోత్సాహంలేక, అనేకయిక్కట్లకులోనై, సంస్థఅభివృద్ధి కుంటుపడుతున్నాగాని, ఊరికేఉండలేకపోవడం అనే కారణంవల్ల, ఈసంస్థ నిర్వాహకులు అట్లా అట్లానిర్వహిస్తూన్నారు. ఇట్లాంటిసంస్థలు, చిన్నవీ, పెద్దవీకలిసి, దేశం మొత్తంమీద 6000 ఉన్నాయి. సరియైనఅవకాశాలు, ప్రోత్సాహంలేకపోవడంవల్ల, ఎంతో మానవశక్తి, సేవా సక్తి, విలువలేక, నశిస్తూవుంది. ప్రథమంలో, యీసేవా సంస్థల సహాయానికని, ప్లానింగ్‌కమీషన్‌వారు ఒక రూపాయికూడా కేటాయించలేదు. కాని,యిటీవల శ్రీదుర్గాబాయి గారిప్రేరణవల్ల, కొన్నికోట్ల రూపాయలు దీనికై కేటాయించబడ్డాయి. సాంఘిక శాశనాల సవరణ, బాలబాలికల శ్రేయస్సు, యువజనోద్ధరణ, జైళ్లసంస్కరణ - యివన్నీ యీసాంఘిక సేవకుసంబంధించినవే కాగలవు.

## భారత్ సేవక్ సమాజ్.

ఇట్లుప్రజాసహకారంపై ఆధారపడి ఉండగల అన్ని అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలోను, ప్రజాసహకారాన్ని సాధించేనిమిత్తం, జాతీయసలహాసంఘం అన్నిపార్టీల ప్రతినిధులతోనూ కేంద్రంలో నియమింపబడినది. ఈ సంఘం ప్రజలకూ ప్లానింగు కమీషనుకు మధ్య సమన్వయం కుదురుస్తుంది. ఈ సలహాసంఘం ఆధిపత్యాన ప్రజల యొక్క సాంఘిక సేవాసక్తిని సమీకరించడానికి, భారత్ సేవక్ సమాజ్ ఏర్పాటయినది. ఈ సమాజ్ శాఖలు దేశమంతటా ఉంటాయి. సేవక్ సమాజ్ ప్రాంతీయ శాఖల నిర్మాణంలో సలహాసంఘానికి సహాయం చేయటానికి తాత్కాలిక కార్యవర్గాలు నియమించబడగలవు. ఈసమాజ్‌లో జేరగలవారి సభ్యత్వరుసుము రోజువారీ పనిమాత్రమే. కులమత పక్ష విభేదాలతో సంబంధం లేకుండా అందరూ తాముచేయగల సేవనుబట్టి యిందులో సభ్యులుగా జేరనగును.



మంత్రి శ్రీ దేశముఖ్‌గారు ఆంధ్ర మహిళా ప్రెస్, పారిశ్రామిక విద్యాలయపు నూతన భవనపు ప్లానులను పరిశీలించుచున్నారు.

# దేశాభివృద్ధిలో స్త్రీల సహకారం

# కమ్యూనిటీప్రాజెక్టులు - భారత్ సేవక్ సమాజ్.

మదరాసు నగరంలో అనేకసంస్థలలో ఉపన్యసిస్తూ, పైవిషయాలనుగూర్చి ప్లానింగ్ కమిషన్‌సభ్యురాలు జాతీయసలహా సంఘ కార్యదర్శినియైన శ్రీమతి దుర్గాబాయిగారు యీ దిగువ సూచనలు చేశారు.

### నారీశక్తిని దేశాభివృద్ధికి సమీకరించాలి

ఇతరదేశాలలో స్త్రీలవలె మనదేశపుస్త్రీలు కూడాఅభివృద్ధికిరావాలి. నిన్నమొన్నటివరకూ బానిసత్వం అనుభవిస్తూవున్న చైనాస్త్రీలు జాతీయకార్యరంగంలో ఇప్పుడు నిర్వహించే పాత్రను చూస్తేఆశ్చర్యంవేస్తుంది. చైనాస్త్రీలు పురుషులతో సమానంగా పెద్దపెద్దవ్యవహారాలు ఉద్యోగాలు చేస్తున్నారు. అక్కడ ప్రధాన న్యాయాధిపతులుస్త్రీలు, న్యాయాధిపతులలో సగభాగంస్త్రీలు, రైల్వేఇంజనీర్లుస్త్రీలు, కడకు హువాయినది ప్రాజెక్టు ఒకస్త్రీ ఆధిపత్యాన్నజరుగుతూవుంది. న్యాయశాఖ, శాంతిభద్రతలశాఖల మంత్రులు స్త్రీలు- మనదేశంలో పద్ధతిదీనికికేవలంవ్యతిరేకం- మద్రాసురాష్ట్రానికి ఒకస్త్రీ యైనామంత్రికాలేదు. ఒకహైకోర్టు న్యాయవాది స్త్రీ కాలేదు. ఈ సందర్భములో చైనాదేశంస్త్రీల వద్దనుండి మనమునేర్వవలసిన పాఠం చాలావుంది. మనదేశంలో స్త్రీ పురుషభేదంమీద నిర్మింపబడ్డ ఆటంకాలనన్నింటినీతొలగించాలి. జాతీయపునర్నిర్మాణకృషికి స్త్రీలు తమశక్తిసామర్థ్యాల నర్పించాలి. గ్రామాలలో స్త్రీలు పురుషులకు వ్యవసాయం మున్నగు వృత్తులలో తోడ్పడుతారు గనుక వారిదొకసమస్యేకాదు. పట్టణాలలో 30-35- సంవత్సరాల వయస్సుగల యువతులకు గృహపరిశ్రమలరూపంగా పనిపాటలు కల్పించడం,నిర్మాణకార్యక్రమంలో సంపన్నులగు స్త్రీలసేవను సమీకరించడం జరగాలి.

### కమ్యూనిటీ ప్రాజెక్టులు

సెప్టెంబరు నెలమధ్యలో ప్లానింగ్ కమీషన్ నివేదిక వెలువడగలదు. వ్యవసాయం, ఇరిగేషన్‌పనులు, రహదారులనదుపాయాలకు, అధికాహారోత్పత్తికి, కుటీరగ్రామపరిశ్రమలకు యీనివేదిక ప్రాధాన్య మీయగలదు.

గ్రామాల అభివృద్ధికై ఏర్పరుపబడ్డ కమ్యూనిటీ ప్రాజెక్టులు, దేశంమొత్తంమీద 35, అందు మదరాసు రాష్ట్రంలో ఆరు ప్రారంభింపబడ్డాయి. కడప-కర్నూలులలో ఒకటి, కాకినాడలో ఒకటి యీప్రాజెక్టులు వెంటనేప్రారంభమౌతాయి. ఒక్కొక్క ప్రాజెక్టుక్రింద 300 గ్రామాలు వుంటాయి. ప్రతీ 5 గ్రామాలకూటమి ఒకగ్రామవర్కరు అధికారం క్రింద ఉంటుంది .

స్థానిక సలహా సంఘాలు, జిల్లాఉద్యోగులు. స్థానికశాసనసభ్యులు, అనధికార్లతో కూడిన ఒక సెలెక్టుకమిటీ ప్రాజెక్టువర్కర్ల సెలెక్షనుకుగాను నియమింపబడుతుంది. గ్రామవర్కర్లు సాంఘికసంస్థల సంప్రదింపుతో నియమితులగుతారు. యీనియామకానికి తగిన కార్యక్రమంసెప్టెంబరు 15వ తేదీకి వెలువడుతుంది.

ఒక్కొక్క ప్రాజెక్టుకు60 మంది వర్కర్లు కావలసివుంటారు. అందులోసగంమందిస్త్రీలను నియమించడానికి ప్రభుత్వము అంగీకరించారు. ఆఫీసరు ఉద్యోగాలలోకూడా స్త్రీలను నియమించడానికి ఆందోళన జరగాలి.

ప్రాజెక్టుప్రాంతాలలో ఎక్కువగా సెకండరీ ఆరోగ్య కేంద్రాలను నిర్మించాలని శ్రీమతి దుర్గాబాయిగారు ప్రభుత్వాన్ని కోరారు. ఇందుకు రాష్ట్రప్రభుత్వం 70 మంది నర్సులను మాత్రమే ఇవ్వగలుగుతుంది. హెల్తు విజిటర్లు లేనేలేరు. హెల్తువిజటర్లగా, నర్సులుగా చాలామంది స్త్రీలు శిక్షణ పొందవలసివుంటుంది. ఈరకంగా ఎక్కువమంది స్త్రీలు సాంఘికసేవారంగములోనికి రావడానికి అవకాశము ఏర్పడుతున్నది.

విద్యార్థులు, విద్యార్థినులు కాలేజీ విద్య అయినతరువాత, గ్రామాల కమ్యూనిటీ ప్రాజెక్టులలో పనిచేయుటలో అవసరం- దానికి సిద్ధపడినవారికి ప్రభుత్వము అన్నిసౌకర్యాలు కల్పించగలదు.

ప్లానింగ్ కమిషన్ సభ్యురాలు, ప్లానింగ్ సలహాసంఘానికి కార్యదర్శినియైన

# శ్రీమతి దుర్గాబాయిగార్కి

## మద్రాసులో స్వాగతము.

శ్రీమతి దుర్గాబాయిగారు యిటీవల మదరాసులోనున్నప్పుడు, అనేక సంస్థల వారు, వారిని ఆహ్వానించి స్వాగత మొసగి, సన్మానించిరి. మదరాసులోని స్త్రీలసంఘాలన్నీ అఖిలభారత మహిళాసంఘపు మదరాసు శాఖవారి ఆధ్వర్యాన్న రాజాజీహాలులో సమావేశమై సాముదాయికంగా వారికి స్వాగత మిచ్చిరి.



సన్మానసభ సందర్భములో తీసిన ఛాయాచిత్రం

శ్రీమతి దుర్గాబాయిగారు, సభాధ్యక్షురాలు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు, సేవాసంస్థల ప్రతినిధులు శ్రీమతులు క్లబ్బువాలా, నల్లముత్తు అమ్మాళ్, రక్షసరన్, మిసెస్ విశ్వనాధన్‌గార్లు, తదితరులు.

చెన్నపురి ఆంధ్రమహాసభవారు శ్రీమతి దుర్గాబాయిగార్కి ప్రత్యేక సన్మానము నేర్పాటుచేసి, ఆమెసమర్థతను దీక్షనూ ఉగ్గడిస్తూ ఒకసన్మానపత్రమునొసంగిరి. పక్క పేజీలో ఆపత్రము పూర్తిగా ప్రకటించడమైనది.

"తెలుగు తల్లి కడుపు పసిడిపంటయై, భారత మహిళా మండలికే ధ్రువతారయై"న

# శ్రీమతి దుర్గాబాయిగారికి

## చెన్నపురి ఆంధ్ర మహాసభ సభ్యులు స్వాగతమిస్తూ,

చిరుతప్రాయపు నీ వీర గాథలు ఝాన్సీ రాణిని తలపించుతవి. పదునాలుగేండ్లు నిండీ నిండని నీవు భారతమాత పిలుపునందుకొని సంఘ సేవాంగణంలో పారాణి దిద్దుకున్నావు. పూవు పుట్టగనే పరిమళించునన్న నానుడి కాకినాడలో హిందీ పాఠశాల స్థాపనతో నీయెడ అన్వర్థమైనది. నాటి ఆ లేలేత పొలపులే నేడు దేశమంతట ఈ గుమగుమల గుబాళింపులు.

దండీయాత్రతో విదేశప్రభుత్వంపై దండయాత్ర సాగించిన బాపూజీ వీరశంఖారావం విన్న నీవు అహమహమికతో స్వాతంత్ర్య సమరరంగంలో ముందు కురికినావు. ఉప్పుసత్యాగ్రహ సమయములో 'ఉదయవన' శిబిరంలో నీ ఉగ్ర దుర్గామూర్తిని కని రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమే గజగజలాడింది. నీ వీపుపై బ్రిటిష్ బంట్ల లాఠీలు పటపట విరిగినవేకాని నీ గుప్పిట ఉప్పు, నీ చేతి మూడు రంగుల జండా లవమైనా నేలకొరుగలేదు. పెక్కుసార్లు కారాగారవాసక్లేశ మనుభవించిన యోధురాలవు. నీ ధైర్యసాహసాలకు గాంధిమహాత్ముడే విభ్రాంతిపడగా, చెన్నపురి పౌరులు నీకు నీరాజనము పట్టగా, తెలుగు తల్లికి వీరగంధ మలంది వన్నె తెచ్చినదానవు.

స్వయం కృషికి నీవు పెట్టినది పేరు; లక్ష్యసాధనకు నీవు కట్టినది కంకణం. పాతికేళ్లు పైగొనగా ఎ. బి. సీ.డీలు ప్రారంభించి ఎం. ఏ., బి. ఎల్. పట్టమునందుకొన్న నీ పట్టుదలకు, పాండిత్య ప్రకర్షకు మా జోహార్లు.

పసితనమునుంచి నీలో పొంగి పొరలే సేవాసక్తి, కార్యనిర్వహణశక్తి రెమ్మై, కొమ్మై నేడు ఆంధ్ర మహిళాసభగా అవతరించింది. చెన్నపురి ఆంధ్ర మహాసభ స్త్రీల శాఖగా ఆరంభమై, ఈ మహిళా సభ నేడు ఆంధ్ర జాతికే మహాశోభగా పరిఢవిల్లడం మాకు అత్యంత ముదావహం. ఈ అపురూపపు కళాపీఠాన్ని నెలకొల్పిన నీవు ఆనాటి సంఘమిత్రను మించినావనుటలో అతిశయోక్తి లేదు. అట్టి నీవు గాంధీజీ విశ్వాసాన్ని చూరగొని, కస్తూర్బా స్మారక నిధికి ఆంధ్ర ప్రతినిధి వగుట అబ్బురం కాదు. నవభారత రాజ్యాంగ రచనా పరిషత్తులో, చైనాకు వెళ్ళిన సంస్కృతీ రాయబారవర్గంలో, భారత పునర్నిర్మాణమే పరమార్థమైన ప్లానింగు కమిషన్‌లో నీవు సభ్యత్వమందడం సహజాతిసహజం.

అభ్యుదయ పథగామినివైన నీ భవిష్యత్తు అత్యుజ్వలం. దానికి ఇవన్నీ సువర్ణ సోపాన పంక్తులు. నీ అనుగుబిడ్డ ఆంధ్ర మహిళా సభ, తామరతంపరగా అల్లుకొని కార్వే యూనివర్సిటీవలె విశ్వవిద్యాలయంగా రూపొందగలదని మా హార్దికవాంఛ. నిన్ను మంత్రిగా, రాయబారిగా చూడ గోరే తెలుగు వారి ఆశ త్వరలోనే ఈడేరనీ!

బాధలన్నీ పెట్టండిరా'' అని ఆజ్ఞ యిచ్చారు. పాపం చర్చిలు వెన్నపూసలాంటి మెత్తని మనిషి. కొడుకు గొడవ చూసిన లీలావతి హృదయంలాగ అతని సుతి మెత్తని గుండె బాధ పడ్డది. ఏదో తెలియనివాడు, పోని స్తురూ, మీకు వాడితో పంతమేమిటి అర్భకుడు'' అని సర్దుతున్నారు. నిరీక్షించి పరీక్షించెదముగాక అంటున్నారు పెద్దలు. కాని యీతెల్లడీను చాలా చురుకుగానే కనిపిస్తున్నాడు. తోటి పిల్లలకు తన తత్వం వుపదేశించిన ప్రహ్లాదుడి మాదిరి చర్చిలో బోధచేస్తు చేస్తునే చైనీయుల బాధలు భక్తులకు వివరిస్తున్నాడు. ఇది వినిన అమెరికన్ భక్తులు అవ్వాయి చువ్వాయిలల్లే తుర్రుమని తారాపథం అంటుతు బయటికి లేచిపోతున్నారు, ఇప్పటికీసప్తమ స్కంధం యింతలో వున్నది, ఈ తెల్లప్రహ్లాదాయి జరగి బోయేకధ ముందు ముందు విన్నవించుకుంటాను.

మ న లో మా ట :

కేంద్ర శాసన సభలో లంచగొండితనం నిర్మూలించటానికి ఒక చట్టం ప్రవేశపెడుతున్నారు. అబద్ధము చెప్ప రాదు, దొంగతనము చేయరాదు అని అన్నట్లే లంచాలు తీసుకోరాదు. అందరికి తెలిసిన చక్కనినీతే. కాని అబద్ధాలు చెప్పక మానటంలేదు. దొంగతనాలు చేయక వూరుకోవటంలేదు. అట్లాగే లంచగొండి మనుష్యులు లంచం తీసుకోకుండా వూరుకోలేరు. అబద్ధానికి యింకో మారు పేరు లేదు. దొంగతనానికి మరొక బురఖాలేదు. కాని లంచానికి చాలా దుస్తులున్నయ్. ఆఫీసులకు ఆస్పత్రులకు మొదలయిన చోట్లకుపోతే ద్వారపాలకులయిన జయ విజయులిద్దరు ముగ్గురు ప్యూన్లకు చిల్లర సమర్పించుకోవాలి. లేకపోతే యీ నరాధములు ద్వారం దగ్గర పడిగాపులు పడి వుండాలిసిందే. కాని దీనిని లంచం అనేదానికన్న చాలీచాలని జీతంతో పొట్టగడవని ఆపేదవాడికి యేదో దానమో ధర్మమో చేశామని తృప్తిపడవచ్చు. ఇదీ లంచమే అయినా తప్పే అయినా ఆపద్ధర్మంగా యేదో పొట్టకక్కుర్తి అని సరిపుచ్చుకోవచ్చు. కాని అసలు పెద్దయెత్తున నంజేవాళ్ల ఉంటారు. వీళ్ళంతా పెద్ద వుద్యోగస్తులు. వందలు వందలు జీతం వుంటుంది. కాని తృప్తి వుండదు, ఎక్కడ ఏది లభించేట్టుగా వుంటే అక్కడ అది వొడిసి లాక్కుంటారు. ఉద్యోగరీత్యా యేవైనా పరీక్షించటానికి వెళ్ళినప్పుడు యివి చాలా బాగున్నవే అని నాలుగు చేతిలో పుచ్చుకుంటారు. అంతే దాన్ని యేపేరులో పిలుస్తారో పిలవండి. ఇంకో రకం వాళ్ళు క్రింది వుద్యోగితో "మీప్రాంతాల్లో చాలామంచి—దొరుకుతయ్ అంటారు నిజమేనా'' అంటూ తనకు కావలసిన వస్తువు పేర్కొంటాడు. కింది వుద్యోగికి అతని భావం వెంటనే అర్థమవుతుంది. ''అవునండి చాలా మంచివి దొరుకుతాయ్" అంటూ శక్తినిబట్టి నజరానా ముడుపు చెల్లించుకుంటాడు. మరికొంతమంది పెద్దమనుష్యులు పెళ్ళి పేరంటాలవంటి సమయాల్లోనో పండుగల్లోనో సప్లయిలు గౌరవపూర్వకంగా స్వీకరిస్తారు.ఎంత సప్లయివుంటే అంత పెద్దవుద్యోగి అని, పలుకుబడికలవాడు అని అర్థం. ఇవన్నీ మనం ప్రతిరోజు చూసేవే. కాని లంచం అని యెవరు అనటానికి సాహసించగలరు? అసలు ఈరకం లంచాలు యెక్కువగా ప్రబలటానికి కారణం యింట్లో గృహిణి. ఎన్నివందలు జీతం తెచ్చినా భర్త సమర్థుడని అనుకోదు, ఏదో గానుగెద్దులాంటి సాధారణ మనిషి అని భావిస్తుంది, కాని ఈ సప్లయిలు చూసేటప్పటికి అవి బంగారమయినా, పళ్ళయినా, పుచ్చువంకాయలైనా ఫరవాలేదు, ఏనుగు నెక్కినట్లు సంతోషిస్తుంది. తన భర్త అక్షరాల ప్రయోజకుడేనని మురుస్తుంది. సగర్వంగా ఆ సప్లయి వచ్చిన ఫదార్థాలు లేసుగవిసెనలువేసి వెండిపళ్లాలలో తన స్నేహితురాళ్ళందరి యిళ్ళకు పంపుతుంది. అపర కర్ణుడల్లే నౌకర్లందరికి పంచుతుంది. మనలో మాటసుమండీ, ఈ భావం స్త్రీలలో నశిస్తేనేగాని, లంచాలు సప్లయిలు, మామూళ్లు- అంటే దొంగతిండి అనేభావం కలిగితేనేగాని యేశాసనాలు యీ దొంగలను పట్టలేవు. స్త్రీలే గ్రహించుకుని యిటువంటి వాటిపట్ల నిరసన చూపాలి. అప్పుడు పురుషులు అంటే లంచాలు, మామూళ్ల సప్లయిలు పుచ్చుకునే వుద్యోగస్తులు వగైరాలు ప్రయోజనం లెని తప్పుచేసి లాభమేమిటని మానుకుంటారు. ఇది కేవలం మనలోమాట సుమండీ!

(10-వ పేజీ తరువాయి)





# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

జూలై నెల చివరి వారంనుంచి ఆగస్టు మూడోవారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయరంగంలో సంభవించిన ముఖ్యసంఘటనలను ఈవిధంగా పేర్కొనవచ్చును— ఈజిప్టులో సైనికవిప్లవం జరిగి ఫరూక్ రాజు దేశభ్రష్టుడు కావటం, పర్షియాలో డా॥ మొసాదిక్ తిరిగి ప్రధాని కావటమేకాక దాదాపు దానియాతృత్వాధికారాలను సంపాదించటం, పర్షియా నూనె జాతీయకరణ సమస్యను విచారించే అధికారం తమకులేదని అంతర్జాతీయ న్యాయస్థానం తీర్పుచెప్పటం, కొరియాలో యుద్ధఖైదీల పరటామినహా మిగిలిన అంశాలన్నిటిమీదనూ సంపూర్ణ ఒప్పందం కుదిరినసందర్భంలో అమెరికన్ విమానదాడులు చెలరేగిపోవటం, నేపాల్ ప్రధాని ఎం. పి. కోయిరాలా రాజీనామా, దక్షిణాఫ్రికాలో రంగుజాతుల సత్యాగ్రహ విజృంభణ, భీమవరంలో ఆంధ్ర రాష్ట్ర సత్యాగ్రహులపై పోలీసుల జులుం, రాష్ట్రకాంగ్రెసు సంస్థలకూ, మంత్రివర్గాలకూ ఉండే సంబంధాలవిషయమై తీవ్రస్పర్థలు ఏర్పడటం.

* * *

సుడాన్ సంపదలను దోచుకొనటానికీ, అరబ్ రాజ్యాల పీకమీద కత్తిపెట్టి ఉంచటానికీ సూయజ్ ప్రాంతంలో తిష్టవేసుకున్న బ్రిటన్‌తో పోరాడుతున్న ఈజిప్టు జులై చివరివారంలో ఒక సైనిక విప్లవానికి గురి అయింది. మధ్యతరగతి కుటుంబానికిచెందిన సైనికోద్యోగి జనరల్ నగీబ్ అకస్మాత్తుగా ఫరూక్ రాజును పదభ్రష్టుడుగా చేసి విదేశాలకు సాగనంపాడు. ఎటువంటి రక్తపాతమూ లేకుండా జరిగిన ఈ విప్లవానికి దేశంలో వివిధవర్గాలూ ఆనందించారు. చిత్తంవచ్చినటుగా మంత్రివర్గాలను మార్చివేస్తూ, అవినీతిపరులయిన అధికారులకు అండగా ఉంటూ, రాజకీయాభివృద్ధికి అడ్డుతగులుతున్న ఫరూక్ వదిలిపోయినందుకు వారందరూ సంతోషించారు.

జనరల్ నగీబ్ మాజీప్రధానుల్లో ఒకడయిన అలీమెహర్ పాషాను ప్రధానిగా నియమించి, జాజకీయాల్లో జోక్యం కలిగించుకోనని హామీ యిచ్చాడు. ప్రధ్ధాన జాతీయపక్షమయిన వాఫద్‌పార్టీ నాయకులతో ఎన్నికలవిషయమై సంప్రదింపులు జరుపుతున్నాడు. సుడాన్, ఈజిప్టుల ఐక్యత కావాలని తాను కోరుతున్నానని చెపుతూ, ఆ ఐక్యత సుడాన్ ప్రజల ఇష్టంమీదనే జరగాలని స్పష్టపరచి ఉచితజ్ఞతను వెల్లడించాడు. అయితే వాఫద్‌పార్టీ మొదలైన వర్గాలన్నీ ఈజిప్టు సుడాన్‌లు ఏకంకావాలనే కోరుతున్నవి. ఫరూక్ రాజు పదభ్రష్టుడయిన తరువాత 7 నెలల వయస్సుగల అతని కుమారుడిని రాజుగా ప్రకటిస్తూ అతడు ఈజిప్టు, సుడాన్‌ల రాజుగా ప్రకటించటం జరిగింది.

జనరల్ నగీబ్ పశ్చిమ రాజ్యాలదగ్గర సహాయం స్వీకరించటానికి సంసిద్ధతను ప్రకటించాడు. ఈ కారణంవల్లనూ బ్రిటన్ చెపుతున్నట్లుగా సుడాన్ భవిష్యత్తును ఆ ప్రజల ఇష్టానుసారమే నిర్ణయించాలని అంగీకరించటం వల్లనూ, నగీబ్‌తోనే బ్రిటనుకు సమాధానంకుదిరే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నవి.

మామూలు ప్రజల్ని తన వైపుకి తిప్పుకునేందుకు నగీబ్ భూమిసంస్కరణలను కొన్నిటిని అమలుజరపాలని ప్రయత్నిస్తున్నాడు. వీటని పెద్దభూస్వాములు ఆటంకపరుస్తున్నట్లు ప్రకటించబడ్డది. అయితే ఇటీవల అలెగ్జాండ్రియా కార్మికవర్గాల్లో అశాంతి బయలుదేరి కల్లోలాలుకూడా జరిగినవి. ఈకారణాలవల్ల నగీబ్ సంస్కరణసన్నాహాలు ప్రజలకు ఎంతవరకు ఇష్టంగా ఉన్నదీ చెప్ప వీలులేక పోతున్నది.

నిజంగా సామాన్య ప్రజలకు ఉపయోగించే చర్యలను నగీబ్ తీసుకుంటేనే అతడికి ప్రజల అండ లభించగలదు. అదిఉన్న వారిని మాత్రమే బ్రిటన్ లక్ష్యపెడుతుందని గత చరిత్ర నిరూపిస్తున్నది. అటువంటి చర్యలను నగీబ్ తీసుకోనలేక పోతే, మధ్యప్రాచ్యంలోని ఇతర 'కీలుబొమ్మ' నాయకుల్లో ఒకడవుతాడు.

* * *

ఈజిప్టుకన్నా ఎక్కువగా బ్రిటన్‌ను కాల్చుకుతింటున్న మధ్యప్రాచ్య దేశం పర్షియా. పర్షియాలో బ్రహ్మాండమైన నూనెగనులు ఉండగా, ప్రజలు నిత్యదరిద్రులై ఉన్నారనీ, వారిపరిస్థితిని బాగుచేయాలంటే నూనెగనుల ఆదాయం పర్షియాకే లభించాలనీ వాదించినందువల్ల ప్రధాని మొసాదిక్ దేశంలో ప్రజానీకం తోడ్పాటును సంపాదించకలిగాడు. అదేకారణంవల్ల అంతర్జాతీయ సానుభూతినికూడా సంపాదించకలిగాడు. తనదేశంలో పరిశ్రమలను జాతీయం చేసుకునేహక్కు పర్షియాకులేదని బ్రిటన్ అంతర్జాతీయ న్యాయస్థానానికి ఫిర్యాదు చేయగా, అది పర్షియా ప్రభుత్వపు సొంత విషయం కనుక దానిని విచారించే అధికారమే తనకు లేదని ఆ న్యాయస్థానం తీర్పుచెప్పింది. భద్రతా మండలికి ఫిర్యాదు చేసినాకూడా బ్రిటన్ వాదం గెలిచే అవకాశం కనిపించదు.

అయినప్పటికీ ఆంగ్లో ఇరానియన్ కంపెనీకి పరిహారం ఇచ్చేవిషయమై సంప్రదింపులు జరపటానికీ, తాను గనులను పనిచేయించి తీసిన నూనెను అమ్మేవిషయమై ఏర్పాట్లు చేసుకునేందుకూ పర్షియా ప్రభుత్వం ఒప్పుదలను వెల్లడించింది. పర్షియాలో కమ్యూనిస్టు ప్రాబల్యం రాకుండా ఉండాలంటే మొసాదిక్‌తో ఏదోవిధంగా రాజీ చేసుకోవలసిందని అమెరికా బ్రిటన్‌ను ఒత్తిడిచేస్తున్నది. పర్షియాకు అదనపు సౌకర్యాలను ఇస్తే, ఇతర మధ్యప్రాచ్యపు నూనెగని దేశాలన్నీ ఎక్కువ లాభాలను కోరవచ్చునని బ్రిటన్ భయపడుతున్నది. పర్షియా అధికారులు మాత్రం ఇటలీ వ్యాపారస్తుల సాయంతో నూనెఅమ్మకాలు సాగించటానికే ప్రయత్నించుచున్నారు. గనుల నిర్వహణలో ఇంగ్లీషు మాట్లాడే దేశాలవాళ్ళను దగ్గరకు రానిచ్చేది లేదని స్పష్టపరచారు.

* * *

పర్షియా వ్యవహార సందర్భంలో అమెరికన్ దూరాలోచనను వెల్లడించే సంఘటన ఒకటి కనపడుచున్నది. అంతర్జాతీయ న్యాయస్థానంలో అమెరికన్ ప్రతినిధి పర్షియాకు వ్యతిరేకంగా అభిప్రాయం ఇచ్చాడు. దానిమీద పర్షియాలో అమెరికన్ వ్యతిరేక ప్రదర్శనలు జరిగినవి. అమెరికన్ రాయబారి హెండర్సన్ ఉపసంహరించుకోవలసిందని మొసాదిక్ కోరినట్లుకూడా వార్తలు వచ్చినవి.

నగీబ్ మోస్తరే మొసాదిక్‌కూడా రైతులకు సహాయం చేస్తున్నాడు. వాళ్ళమీద పన్నులన్నిటినీ రద్దుచేసి, వెట్టిచాకిరి రద్దుచేయించి, భూస్వామికి ఇవ్వాల్సిన భాగాన్ని తగ్గించివేశాడు. ఈ చర్యద్వారా కమ్యూనిస్టుల పలుకుబడిని అరికట్టడం జరుగుతుందని మొసాదిక్ ప్రకటించాడు. బ్రిటన్, అమెరికాలు ఏదోవిధంగా మొసాదిక్, నగీబ్లతో రాజీపడకతప్పదు. వీళ్ళనే కాదంటే, వాళ్ళకు సర్వమంగళమే.

* * *

ఏడాదినుంచీ జరుగుతున్న కొరియాయుద్ధవిరమణ సంప్రదింపులు దాదాపు ఫలించినవని చెప్పవచ్చును. ఖైదీలపరటామినహా ఇతరదేశాలన్నింటిమీదనూ పూర్తి ఒప్పందం ఆగస్టు 5వ తేదీన కుదిరింది. ఖైదీలు స్వదేశాలకు పంపబడిన తర్వాత వారిని తిరిగి కొరియా యుద్ధంలో ఉపయోగించరాదని కూడా ఆకిందటిరోజునే ఉభయపక్షాల ప్రతినిధులూ అంగీకరించారు. పరటా ఏవిధంగా జరపాలో, అడిగితే చెప్పగల నిజాయితీదార్లు ప్రపంచరాజకీయవేత్తలలో ఉన్నారు.

'అంగట్లో అన్నీ ఉన్నయ్, అల్లుడినోట్లో శని' అన్నట్టుగా అసలు సమాధాన పడాలనే ఉద్దేశ్యమే అమెరికాకు ఉన్నట్లు కనిపించదు. జులై చివరివారంలో ఫార్మోజా జలసంధిలో, చైనాతీరానికి కూతవేటుదూరంలో అమెరికన్ నౌకాబలాలు పెద్ద ఎత్తున విన్యాసాలు జరిపి ఎంతో ఆర్భాటం చేసినవి. ఇవి సమితి అనుమతితో జరగలేదని బ్రిటిష్ ప్రధాని చర్చిలే అంగీకరించాడు. యాలూనది స్థావరాల మీద జరుగుతున్న విమానదాడులు దాదాపు సరిహద్దు ప్రాంతాలమీదనే జరుగుతున్నట్లు అమెరికన్ అధికారులే అంగీకరించుచున్నారు. ఈ పరిస్థితుల్లో కమ్యూనిషులు ఊరుకోటం అసాధ్యం. ఆగష్టు మధ్యలో చైనా ప్రధాని

(51‌-వ పేజీ చూడండి)



# తప్తముద్ర

* * *

చారిత్రకం : శ్రవ్యరూపకం :

* * *

* వాద్రేవు శ్రీభోగిపంతులు *

[శాలివాహనశకం ౧౦౩౦ సం॥ ప్రాంతాల కాంచీనగరం. ఆంధ్ర భారత కృతిపతి రాజ రాజ విష్ణువర్ధనుని తనయుడు మొదటి కులోత్తుంగ చోడదేవుని పరిపాలనం. రాష్ట్రాన్ని కంతకూ రాజుల అభీష్టం మేరకు వీరశివుడే ఆరాధ్యదైవం కాదనేవారికి కారాగారవాసం... కులోత్తుంగ మహీపతి దర్బారు. నేలనాలుగు చెరగులా తమ యశశ్చంద్రి కలు నింపిన మహాయోధులూ, కవికంఠీరవులూ, గాంధర్వ సార్వభౌములూ ఆ పేరోలగానికొక ప్రత్యేకాలంకరణ]

## దృశ్యం ౧

మంత్రి : కులోత్తుంగ మహీపతులకు జయమగుగాక !

రాజు : మహామంత్రీ ! పరమ శివుని కారుణ్యాన ప్రజలెల్లరు సుఖంగా వున్నారనే విశ్వసిస్తున్నాము.

మం : చిత్తం మహాప్రభూ ! రాష్ట్రవాసు లెల్లరు త్రిలోకాలలో, త్రికాలాలలో ఎరగని సౌఖ్యం అనుభవిస్తున్నామనే సంభావిస్తున్నారు.

రా : మంచిది, మహామంత్రీ! మాటల వరుసలో మరిచాము. మన శైవమతాభినివేశానికి పరవశులుకాక పరవళ్ళు తొక్కేవారిని అప్రమత్తులై అణచివేస్తున్నారు కదూ !

మం : చిత్తం, మహాప్రభూ !

రా : మన నిర్ణయాన్ని తృణప్రాయంగా ఎంచి త్రుంచివేసిన ఆ వైష్ణవ మతాచార్యుని పైనం....?

మం : చిత్తం ప్రభూ ! వైష్ణవమతాచార్యులైన రామానుజులు దేవర ఆజ్ఞను మన్నింప నిష్టపడలేదు; ప్రతిగా ఆతనిని బందీని చేయమని దండనాధునకు పత్రిక వ్రాయించి పంపాను.

రా : తదుపరి?

మం : చిత్తం ! ఈ విషయం ఆతడు ముందుగానే పసికట్టి పరారైనాడు పరివారంతో !

రా : పంద ! జాడలేమియు తెలియలేదుగా?

మం : చారులు కొద్ది సమాచారాన్ని సంగ్రహించారు ప్రభూ. విఠలరాజు హయామునందున్న హాలేవీడులో ప్రచ్ఛన్నులై ప్రవర్తిస్తున్నారట.

రా : పరమశివుని నామానికి అపవిత్రత ఆపాదించేవారికి ఆశ్వాసాంతం కావల్సిందే ! జయ్ శంకరా ! భక్తవశంకరా ! !

## దృశ్యం ౨

[కులోత్తుంగ మహీపతి సమకాలికుడు విఠలదేవరాయలు హాలేవీడు రాజధానిగా 'గాంగనాడి' దేశాన్ని పాలిస్తున్న మహామండలేశ్వరుడు. జైనమతావలంబి ...

రాయల కుమార్తెనొక బ్రహ్మరాక్షసి పట్టి పీడిస్తున్నది. జైనమత గురువులెందరో చికిత్సలు చేసినా ఏమంతైనా. ప్రయోజనం కలుగలేదు. రాయల రాజప్రాసాదం. అంతరంగిక గృహం. విచారగ్రస్థులైన రాయలూ, భార్య శాంతలదేవి.]

దేవి : బిడ్డ ఆ బ్రహ్మరాక్షసి బారిన పడినప్పటినుండి పిచ్చి పట్టిన దానిలాగా దిగంబరిగా తిరుగుతున్నది కద ! నలుగురిలోనూ నగుబాటుగావుంది. పరిస్థితి నానాటికీ విషమిస్తున్న దేకాని.....................

రాయ : ఇట్టిది మన 'యింటా వంటా' లేదు. రాజుల పోషణ మరిగిన జైన గురువులంతా గాజులు తొడిగించుకొని కూర్చున్నారు. మహామహిమాన్వితులైన రామానుజు లనే వైష్ణవ మతాచార్యులొకరు నగరంలో తిరుగాడు చున్నారట- నగరుకు విజయం చేయమని విజ్ఞప్తి పత్రిక వ్రాయించి పంపాను. జైనులకు జడిసి మొదట అసమంజసంగా జవాబు పంపినా తదుపరి విన్నపాన్ని మన్నించామని వర్తమానం చేశారు; ఈసరికి రావల సిన వారే.

కంచుకి : విఠలదేవులకు విజయం కలుగుగాక !

రాయ : కంచుకీ ! రామానుజులు రాజప్రాసాదమునకు విచ్చేసినారా ?

కం : చిత్తము ! నగరులో తమరాకకై నిరీక్షిస్తున్నారు.

రాయ : అవశ్యం అంతరంగిక గృహంలో ప్రవేశపెట్టు . దేవీ ! రాజకుమార్తెను రప్పించు సంపంగీ ! వలసిన సంబరాలన్నీ సంసిద్ధం చేయ్.

రామానుజులు : జయ్ నారాయణ, ఆర్తత్రాణ పరాయణ!

రాయ : ఓహో ! రామానుజ భగవత్పాదులు ! నరపతి నతశీర్షనమస్కృతులు. పుణ్యచరితుల ఆగమనంచే నగరు పునీతమైంది. మా విన్నపాన్ని మన్నించి సన్నిహితులైనారు. కష్టాలు కడతేర్చి కావుమనేదే మాకోర్కె.

రామా : మహీపతీ- మహావిష్ణుప్రసాద లబ్ధుడివయ్యేదవు గాక. "దివ్యదేవో ఏకోనారాయణః" అని సాక్షాత్ శ్రీమన్నారాయణ ఉవాచ. అట్టి నారాయణ చరణదాసు లకు అశ్లీలములు సంఘటింపనేరవు.

రాయ: మహాభాగా ! మా ముద్దుబిడ్డ మాధవిని మూడేళ్ళ నుండి ఒక బ్రహ్మరాక్షసి పట్టి పీడిస్తున్నది- తమవంటి మహాత్ముల కిదొక మహావిషయంకాదు.

రామా : మహారాజా ! ప్రపూతమైన మాయీ పాదజలాన్ని నీబిడ్డ శిరాన సంప్రోక్షించు- మహారాక్షసి మటుమాయ మవుతుంది.

రాయ : మహానుభావులు- మహావిష్ణ్వంశ సంభూతులు -

రామా : జయ్‌నారాయణ ! ఆర్తత్రాణపరాయణ !

(కొద్ది క్షణాలు విరామము)

దేవి : మహాత్మా ! మహారాక్షసి మటుమాయమైంది. మాధవి మతి తెలిసినది. సిగ్గుపడి చివాలున మందిరం లోనికి పోయినది. మాకు మహానందం కలిగించాడు.

రామా : మానవులు నిమిత్త మాత్రులు. జగన్నాథుడు జగ న్నాటక సూత్రధారుడు.

రాయ : మహాసామ్రాజ్యానికి నాధులమైవుండీకూడా అనా థులమైన మాయెడ కృపాళులైనందుకు కృతజ్ఞతగా మేమూ, మా జనతా నేటినుండి శ్రీవైష్ణవం స్వీకరించి తమ పాదదాసులం కావాలని కాంక్షిస్తున్నాము. మరి మీరే మాకు ప్రభువులు, గురువులు, సర్వాలూను.

రామా : తప్తముద్రాస్వీకరణత రుణము మహార్నవమి. నాటి మహోత్సవము మహోత్సాహంగా జరగాలెనని మా అభిమతం.

రాయ : అవశ్యం మహానుభావా. కంచుకీ . 'రామానుజ భగవత్పాదులు నేటినుండి రాజగురువులనీ, రాజమ తంగా శ్రీవైష్ణవం నిర్ణయింపబడిందని నగరంలో, రాష్ట్రం నాలుగుమూలలా దండోరా వేయించమని దండనాథునితో మా ఆజ్ఞగా తెలియజేయ్.

కం : చిత్తం దేవరా,

రాయ : ఆఁ. ఇటుచూడూ, మహార్నవమినాటి తప్త ముద్రా స్వీకరణ మహోత్సవానికి మన రాష్ట్రమంతటా అలంకరింపబడాలని మహామంత్రికి తెలియజేయ్.... మహాత్మా , అతిధిగృహాన ఆ రామ మంటపంలో

ఘడియకాలం విశ్రమింతురుగాని దయచేయండి.

రామా : జయ్‌నారాయణ. ఆర్తత్రాణపరాయణ.

దృశ్యం 3

[నిస్సందేహంగా మున్నెన్నడూలేని మహావైభవంతో విరాజిల్లే రాజప్రాసాదం- ప్రాచీనకళా వైభవాన్ని పరిఢవిల్లజేసే అలంకార సందోహం- మహోన్నవమినాటి మహోత్సవం- తప్తముద్రాస్వీకరణ తరుణం- మంగళతూర్య నినాదాలుమిన్నుముట్టే సమయం-]

రామా : జయ్‌నారాయణ. ఆర్తత్రాణపరాయణ. మహీపతీ. మహోన్నవమీ పర్వదినాన తప్తముద్రాధారుడవై పునీతుడవైనావు. ఇదే నీకు 'విష్ణువర్ధను'డని నామకరణము చేస్తున్నాను. భవిష్యత్ భారతచరిత్రకారులు నీ యీ నామాన్నే ఉల్లేఖింతురుగాక.

రాయ : మహాత్మా, మహా ప్రసాదము. ఈ శుభసమయాన రాజప్రకటన నొకదానిని మహామంత్రి పఠిస్తారు.

మంత్రి : రాజాధిరాజ, మహారాజ, మార్తాండతేజ, ఉదారదయాగుణవర్ధన శ్రీశ్రీశ్రీ విష్ణువర్ధన విభులప్రకటనాపత్రిక- ఈ తప్తముద్రా స్వీకరణ శుభతరుణ జ్ఞాపకార్థము బేలూరులో చెన్నగినారాయణుని, తలక్కాడులో కీర్తినారాయణుని, గడగులో విజయనారాయణుని, హరదనహల్లిలో లక్ష్మీనారాయణుని ప్రతిష్ఠించి మహాశిల్ప విలసితముగ దేవాలయములు నిర్మింప సంకల్పించితిమి. శ్రీ మద్రామానుజ భగవత్పాదుల అభీష్టం మేరకు రాష్ట్రంలోని యేడువందలతొంబది జైనదేవాలయములూ సమూలం నాశనం కావింపబడవలెనని ఆనతియ్యబడింది. అవశేషాలలోని ప్రశస్త శిల్పాలతో తొండనూరిలోని తిరుమల సాగరమనే చెరువునకు చీడీలు కట్టించబడాలి. రాజమతాన్ని ధిక్కరించి హైరాన పడవలదని రాష్ట్రవాసులను హెచ్చరిసున్నాము- మంగళమ్.

(కలకలము- నినాదాలు వినవస్తున్నవి) మహీపతీ ! మహాదారుణం ! వైష్ణవం పేరిట జైనమతాన్ని నాశనం చేయబూనటం దైవద్రోహం !

రాయలు : మహామంత్రీ ! ఎవరా నినాదాలు ?

మంత్రి : మరెవ్వరూకాదు ప్రభూ ! మన సైన్యాధ్యక్షుడు గంగరాజు శిష్యవర్గం- ఆతదే ఈగల్లంతుకు కారకుడు.

రామా : అట్టివారు క్షంతవ్యులుకారు ప్రభూ !

రాయ : అట్టిదే ! మహామంత్రీ, గంగరాజుకు ఉద్యోగం నుండి ఉద్వాసనచెప్పి, 24 ఘడియలలో రాష్ట్రం విడిచి పోవాలని మా ఆజ్ఞ- ఆచరింపబడేట్లా చూడండి.

మంత్రి : చిత్తం.

రామా : ఇంతేకాదు నీవు చేయవలసినది మహారాజా.

రాయ : తమ అభీష్టం నాకర్థమైంది. మహామంత్రీ. శ్రీ వైష్ణవం పొడగిట్టనివారు ఏమంత వారైనా సరే హతం కావలసిందే.

రామా : రాజా, శంఖచక్రగదాధరుడగు శ్రీమన్నారాయణుడు నిన్ను సర్వదా బ్రోచునుగాక.

రాయ : ధన్యుడను. మహాత్మా, ధన్యుడను.

రామా : రామానుజ విద్యాపీఠమనబడే మతకళాశాల నొకటి స్థాపించి అందు శ్రీ వైష్ణవ ప్రధాన సూత్రాలు ప్రబోధింపబడాలి. మత్కుమారులు శ్రీ సనత్కుమారులా పీఠానికాచార్యత్వం వహిస్తారు.

రాయ ; అవశ్యం. మహాత్మా.

రామా : అంతేకాదు. రాష్ట్రవాసులెల్లరు తప్తముద్రాధారులుకావాలి. నిత్యం విధిగా విద్యాపీఠానికి వెళ్ళవలె.

రాయ : తమ ఈప్సితం వెంటనే నెరవేరగలదుస్వామీ.

దృశ్యం 4

[దేశములో, నగరములో నాలుగుమూలలా రామానుజుల మత దురహంకారమును దూషించే వారధికులైనారు. అంతా అంతరంగాల్లో ఆడిపోసుకునేవారే; పైకి పల్లెత్తుమాటంటే పట్టి గొంతుకపిసుకుతున్నారు- చీకటిప్రొద్దులో

మారుమూల గ్రామాన రామాలయంలో- అంతా వయసు మళ్ళిన ముది వగ్గులే-కూడారు.]

ఒకడు : మతం వేరైనంతమాత్రాన హతమార్చేయటమే,

మరొకడు : మొన్నేమైందనుకున్నావ్ ? రామానుజులు బౌద్ధులతో వాదాన గెలిచారట. అది వారికంట కారం కొట్టినట్టయింది కాబోలు- గడుగులోని విశ్వాలయాన్ని ముట్టడించి విజయనారాయణుని విగ్రహాన్ని సమూలం నాశనం చేశారట.

ఇంకొకరు : అయ్యో !

మరొకరు : అయ్యో అంటావేం? దానికి రామానుజులు చేసిందేమిటో ఎరుగుదువా?

ఒక : చూచాయగా విన్నాను- ఏదోవార్ని చంపించారని.

మరొ : వట్టి చంపడమా ? కంఠం వూడినంతమాత్రాన కసితీరొద్దూ? కడజాతి మాలవారినిపంపి ఆ బౌద్ధ ముద్దాయీలను గానుగలలోత్రోసి పిప్పిచేశారట.

ఒక : నిజమేనా?

మరొ : నిజమేనా ? దండనాధుని బావమరది నాకు దూరపు బంధువు. వారంనాడు బేలూరినించి వస్తూంటే దారిలో తారసిల్లారు. కచ్చితంగా చెప్పాడీ కథంతా.

ఇంకొ : అల్లాఅయితే నమ్మవలసిందే.

మరొ : అంతేననుకున్నావేమో- ఎంతో వుంది. తనకు విరోధులైనవారిని చంపినందుకుగాను మాలమాదిగలకు మహారాజుతో చెప్పి మడిమాన్యాలిప్పించాడట. ఏటేటా జరిగే లక్ష్మీనారాయణోత్సవాలలో ఏడవనాడు మొదలు తొమ్మిదవనాటిదాకా వీరికి గర్భగుడిలో ఏటా ప్రవేశం ఇప్పించాడట. కైంకర్యాదులు సమర్పించుకోడానికి అనుమతి ప్రసాదించాడట.

ఇంకొ : ఇదేంపెద్దవిషయమూ కాదు- ఇందులో పెద్ద విశేషమూలేదు.

మరొ : అవుననుకో.

ఒక : ఆఁ, మహామంత్రి రాజుతో మనవిచేశాడటే- ప్రజలు మహాబాధలనుభవిస్తున్నారూ- రామానుజుల బలవంతంగా మతం మార్పించే పద్ధతికి స్వస్తి చెప్పించండని.

ఇంకొ : మహారాజేమన్నాడేం?

ఒక : ఏమంటాడు? రామానుజులాయనకు నెత్తిమీది దేముడు. ఆయనంటే ఎంతఇష్టంలేకపోతే- ఆయన శిష్యులు అమానుషకృత్యాలు ఎన్నో చేస్తూంటే ఎలా వూరొక్కంటాడూ చెప్పు.

మరొ : అవునట ! రామానుజులకి పన్నాలుగువందల పరివారమట ! వారంతా రాజుగారి హవేలీలో పడి తినేవారేనట.

ఒక : పరివారం పాత జైనమతాచారుడికీ వుండేది కాని ఇంతదండిగాకాదు.

ఇంకొ : ఏంవుందీ, పొట్టగడవకపోతే పట్టివర్ధనాలు, మతప్రచారమూను.

ఒక : బాగాచెప్పావ్. దున్నల్లేమేస్తూ మహాదుండగాలు చేస్తున్నారు.

మరొ : దుండగాలనిమెల్లిగా అంటున్నావూ ? బండిలో పోతున్న ఒక స్త్రీని బలాత్కారంగా బయటికిలాగి మానభంగం చేశారటమొన్న.

ఒక : మహారాజుకు తెలియదంటావా వీరిఆగడాలు ?

మరొ : ఏమో ! తెలిసో తెలియకో మాట్లాడడంలేదు ! అయినా మనకెందుకులే- గట్టిగాఅంటే పట్టి కొట్లో పెడతారు !

ఒక : పెద్దవాళ్ళం మనకే అక్కర్లేకపోతే మరి పిల్లలకా కావలసిందీ?

ఇంకొ : గట్టిగా మాట్లాడితే పట్టి కొట్లో కూలేస్తారనే భయం వున్నన్నాళ్ళూ మన మీ బాధలనుభవించాల్సిందే. అయినా చేసేవాళ్ళు చేస్తూనేవున్నారు.

ఒక : ఏమైందేమిటి?

ఇంకొ : చైత్రమాసంలో చెన్నగినారాయణుని కళ్యాణం జరిగిందిగా అప్పుడు.

ఒక : ఊఁ. అప్పుడేలే. ఏమైంది?

ఇంకొ : బేలూరి పక్కనున్న బయ్యారంనుంచి వచ్చిన యాత్రికులజట్లు రామానుజుల శిష్యులతో జట్టీలు పెట్టు కొన్నారట. రామానుజులు అనుచరుల్ని వెనకేసుకొచ్చి వార్ని నానాదుర్భాషలూ ఆడి అంతం చూస్తానని పంతం పట్టాడట.

ఒక : పడితే?

ఇంకొ : 'అయితే మేమేనా తక్కువతిన్నది' అని రామానుజులపై పాదరక్ష ప్రయోగాలుచేసి............

ఇద్దరూ : ఆఁ! ఆఁ! అంతపనీ అయిందీ!

ఇంకొ : వినండి సాంతం. రక్షణకు రాజభటులు లేక పోగా పట్టుకొని పారిపోయి వచ్చేసరికి "తాడుతెగి తప్పేలా నూతులో" పడినంత పనయిందట,

ఒక : అయితే వాళ్ళెవరో మొనగాళ్ళే!

ఇంకొ : మొనగాళ్ళుకూడానూ. రామానుజుల పస పట్టిస్తామని ప్రతిజ్ఞచేశారు.

మహా : అబ్బా, అయితే కథ రసవత్తరంగానే నడుస్తూన్నదన్నమాట.

ఇంకొ : ముందు మహారసవత్తరంగా వుంటుంది.

దృ శ్యం ౦ ౩

[విష్ణువర్ధన విభుని రాజప్రాసాదము- అంతరంగికగృహము]

రాయ : మహామంత్రీ! రామానుజులు మతప్రచారార్థము ఢిల్లీనగరానికిపోయి మూడు వారాలు కావచ్చింది. మరుసటి వారంలో తిరిగి వస్తామన్నవారల్లా మూడు వారాలు నిలవుండిపోయారు- కారణమేమో?

మంత్రి : కావలసినంతపని కాకపోయి వుండవచ్చును ప్రభూ. అందుకోసమే ఆగిపోయివుంటారు.

రాయ : రామానుజులవెంట వెళ్ళినవారెవరు?

మంత్రి. హరిహరుడు, శ్రీమన్నారాయణుడు, అనంతుడు మొదలగు ఎనమండుగురు అనుంగు శిష్యులు- మహారాజా. మన్నిస్తే చిన్నమనవి-

రాయ : ఆలోచిస్తారేం మహామంత్రీ?

మంత్రి : రామానుజుల మతప్రచార విధానాలవల్ల ప్రజలు పరిపరివిధాల పడరానిపాట్లు పడుతున్నారు ప్రభూ!

రాయ : సైన్యాధ్యక్షుడు కొంతసమాచారం మాకు నివేదించాడు.

మంత్రి: రామానుజులు అనుచరులు అమానుషకృత్యాలనేకం చేస్తున్నారు ప్రభూ. గ్రామాలలోని భామలను బలవంతంగా బయటకులాగి మానభంగం చేస్తున్నారు. తప్తముద్రాధారులు కానివారి తలలు నిత్యము అనేకం తలారి పాలబడుతున్నాయి. దేశంలో ప్రజలందరు భీతావహులై ఉన్నారు. ప్రాణభీతిచే పైకి పల్లెత్తు మాటాడక పోయినా అంతరంగాల్లో ఆడిపోసుకుంటు న్నారు, దేశంలో దారుణాలిట్లాగే మరికొంతకాలం సాగనిస్తే అరాచకమూ అల్లకల్లోలమూ తప్పవు.

రాయ : మహామంత్రీ రామానుజులు మనపాలిట పరమాత్మనిలా అవతరించారు. అనేక అవాంతరాలను అధిగమించాము. ఆహ్వానించిన నోటితోనే ఆవలికంపడం ఎట్లా?

మంత్రి : రామానుజులను రాష్ట్రంనుండి సాగనంపనవసరంలేదు ప్రభూ. రామానుజులు రాజకుటుంబమునకమోఘమైన సేవచేశారు. యదార్థమే. అందుకు కృతజ్ఞతగా వారిని రాజగురువులుగా నియోగించారు- బాగుంది. రాజగృహంలోనే వారికి అర్ఘ్యపాద్యాదులు సమర్పించండి- చాలు. రామానుజులమీద అభిమానం పాటిస్తే రాష్ట్రవాసులు బహువిధాల బాధలు పడుతున్నారు. మహారాజులు తమ స్వీయప్రయోజనాలకోసం ప్రజలనిట్లా బాధలు పడనీయడం ధర్మమా? మన్నించండి. శైవుల నిరంకుశత్వాన్ని సహించలేకనే సపరివారంగా రామానుజులిచ్చటికి తరలి వచ్చారుకదా. ఇక్కడ మత నిరంకుశత్వం మితిమీరితే దేశంలో

అసహనం ప్రబలి తీరుతుంది. అది పరాయణతకు దారితీసిన దేశం రుద్రభూమిగా మారగలదు- గమనించండి.

రాయ : రాజుల స్వీయప్రయోజనాలకోసం రాష్ట్రాన్ని కష్టాలపాలు చేయడం మాయింటా—వంటా. లేదు-అది మా అభిమతము కాదుకూడా. ప్రభువుల ప్రత్యణువూ ప్రజాశ్రేయస్సునే ఆక్రోశించాలి. రాష్ట్ర క్షేమాన్నే ఆశించాలి. ఆదిలోఅంతా శ్రీ వైష్ణవం స్వీకరిస్తారనే ధైర్యంతో రామానుజులపై గల భక్తివలన చండ శాసనాలు అమలుపరిచాం.

మంత్రి : ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు ప్రభో. రామానుజులు వచ్చిన వెంటనే మతప్రచారానికి స్వస్తి చేయించి అతిథిగృహాన్నే వుంచివేయడం వినా మరో విధానం లేదీ అరిష్టాన్ని అరికట్టడానికి.

రాయ : అట్లాగే చేదాం.

(కంచుకి ప్రవేశించి)

కంచుకి : విష్ణువర్ధన విభులకు విజయమగుగాక. రామానుజ తనయులు తమను కలుసుకో గోరుతున్నారుప్రభూ.

రాయ : ప్రవేశపెట్టు. మహామంత్రీ. రామానుజతనయులు తండ్రితో వెళ్లలేదా ?

మంత్రి : వెళ్లారుప్రభూ! తిరిగివచ్చేసి వుంటారు.

రాయల : ఒహో. సనత్కుమారులా. దయచేయండి. దయచే ......... .

సనత్ : మహాప్రభూ, మహాదారుణం . ఘోరం . ,
(గద్గదికతో)

రాయ : ఒక్కక్షణం విశ్రమించండి, మార్గాయాసంకాబోలు.

సనత్ : మార్గాయాసమేమీకాదు మహారాజా. మాతండ్రి గారిని.........

రాయ : ఊం. మీతండ్రిగారి కేమైనది?(ఆతురత,ఆందోళన పూర్వకంగా)

సనత్ : ఢిల్లీనగరంనుండి వస్తూంటేదారిలో దొంగలు - కాదుకాదు -దొరలే-వీరశైవుల్లావున్నారు . మాపైబడి సర్వం దోచుకొని.... మాతండ్రిగార్ని .........

మంత్రి : వధించారా?

సనత్ : మహాటవ్వులోకి పారద్రోలారు ; మటుమాయం చేశారు. ఏక్రూరజంతువో ఈసరికే వారినిపొట్టనెట్టు కుని వుంటుంది. ఈఅవతారానికిక ఈనిర్భాగ్యుడికి తండ్రినిచూసే భాగ్యంలేదు మహారాజా. (భారంగా)

మంత్రి : పీడాపోయిరి . (గొంతునొక్కి)

రాయ : కంచుకీ వీరిని విశ్రాంతి గృహానికి తీసుకువెళ్ళు (చికాకుగా)

(సమాప్తి)

*

## కస్తూరిదేవి ప్రారిశ్రామిక విద్యాలయం, నెల్లూరు.

## విజ్ఞప్తి

మా విద్యాలయములో - అనుబంధములుగా ఎన్నియో ఉపశాఖలు స్థాపింపవలెనని ప్రథమము నుండియు మా సంకల్పము. కేవలం హైస్కూలు, కాలేజి విద్యా విధానములు మాత్రమేగాక స్త్రీలకు అత్యావశ్యకములైన గృహపరిశ్రమలు, లలిత కళలు నెలకొల్పవలె ననే ఆశయముతో మేమీ సంవత్సరము శ్రీ కస్తూరిదేవిపారిశ్రామిక విద్యాలయం ప్రారంభిస్తున్నాము.

ఈ పారిశ్రామిక సంస్థ ముఖ్యముగా పదోజనులైన యువతుల కొరకు ఉద్దేశింప బడియున్నది. ఆయా కళలయందు అభిరుచిగల యువతుల కందరకును ఇందు ప్రవేశము కలదు. మరియును అనేక కారణాలచే ఆర్థిక దుస్థితికి లోనై జీవనోపాధికి ఆర్జించుకో వలసి యున్న యువతులకును, స్కూలు ఫైనలు వరకైనను చదువులు కొనసాగించు కోలేని విద్యార్థినులకును, ఇది అత్యంత ప్రయోజనకారి కాగలదు. స్వయంశక్తి మీద ఆధారపడి గౌరవంగా జీవయాత్ర గడుపుకోగలశక్తి సామర్థ్యాలు అలవడి బ్రతుకు తెరువు కల్పింపగలదు.

ఈ విద్యాలయములో ప్రభుత్వ పారిశ్రామిక శాఖవారి ఆమోదముతో వారి నియమావళి, విధానాలు ఆధారంగా బోధన గరపబడుతూ గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ ఈయబడును.

ఉదారహృదయులు సదా మాకు ప్రోత్సాహముతో చేయూతనివ్వవలె నని అభ్యర్థిస్తున్నాము.

విద్యాలయ కమిటీ.

బిజిలీ.... ఎర్రగులాబీలను వెక్కిరించే నవ్వు....ఆమె
హృదయాన్ని చూరగొన్న ఆ పుత్తులు ఆమె
జీవన్మార్గంనుండి వైదొలగిపోతేనేం ?....బిజిలీ-
కిలకిలమనేనవ్వు-ఆ పాటలూ శాశ్వతమై నిల్చున్నాయి—

# బిజిలీ

"శ్రీ శిల్పి"

గిరిజ, గోపీలు పందేలువిూద అన్నం తింటుంటే వాళ్ళమ్మ మజ్జిగ జేస్తూ మందలిస్తుంది. "యేమిటాతొందర, పొలమారుతుంది. కొంచెం నింపాదిగా తినకూడదూ ?" "కాదమ్మా, బిజిలీ తంబుర వినిపిస్తుంది. ఆలస్యం అయితే మన వీధి దాటి పోతుంది మరి". ఈలోగానే సుచి, వాణి, రాములు పరువెత్తుకుంటూ వచ్చి 'యేం గిరిజా, గోపీ, యింకా అన్నందగ్గరే వున్నారేం ? మన బిజిలీ వస్తూంది' అని గంతులువేయడం మొదలుపెట్టేరు. గిరిజా గోపీలకు అన్నం యింక సహించలే. మజ్జిగన్నంలోనే చేతులు కడిగేసుకొని వారి జట్టుతోకలిసి అమ్మవారి వేపచెట్టువైపుగా బయలుదేరేరు. అటువంటి జట్టులే చాలావైపులనుండి వచ్చి అమ్మవారి చెట్టుక్రింద సమావేశమవుతున్నారు "త్వరగా రా, ...జీజీ...బిచ్చీ...చిచ్చీ త్వరగా రా" అని గెంతులు వేస్తున్నారు.

బిజిలీ తీయగా నవ్వింది; ఆమె నవ్వుల్లో పూవులు రాలిసేయి. దొండపండ్లవంటి ఆమె పెదవులలోనుండి తీర్చిదిద్దిన పలువరుస తొంగి చూసింది. బిజిలీ నవ్వితే ఎఱ్ఱగులాబీ పూలను వెక్కిరించబోయేయి ఆమె చెక్కిళ్లు. ఆమె కండ్లల్లోని చిలిపిదనం చిందులు తొక్కింది. మనస్సు ఆనందంతో అల్లీ బిల్లీ తిరిగింది. బిజిలీ ఆ చింకిబట్టలు వేసుకుంటే మాత్రం యేం ? బిజిలీకి, బిజిలీయే సాటి ! భగవంతుడు అందాన్నంతా ప్రోగుచేసి బిజిలీలో యిమిడ్చి వుంటాడు. బిజిలీ యెప్పుడు చూచినా ఒకేరకం దుస్తుల్లో వుంటుంది. ఆ గళ్ళపరికిణీ, కొంచెం పైకి కట్టుకుంటుంది. పైన రవికె వింతవింత అంచులతో చూడ్డానికి కొంచెం చిత్రంగానే వుంటుంది. మోచేతివరకు చేతులు, వెనుక విడవడివున్న రవిక తాళ్ళతో బంధించి వుంటుంది. పొట్టి వెంట్రుకలు, అవి జడా, ముడీకాని మధ్యరకంగా త్రిప్పి వుంటాయి. చిన్న చిన్న గిరజాలు లలాటం సగం కప్పేస్తుంటాయి. చెవులకు చిన్ని చక్రాలు, మెళ్ళో గురివింద గింజలాటి పూసలు గొలుసు పొడువుగా వేళ్ళాడుతుంటుంది. దాని చివర వేళ్ళాడేబిళ్ళమీద యేదో అర్థం కాని బొమ్మ ఒకటి. చేతులకు లావుగావుండే ఒక్కోగాజు. కాళ్ళకు నగిషీలుచెక్కిన, చిరుశబ్దంచేసే తోడాళ్ళు. భుజంమీద వేళ్ళాడే ఓగజం బట్టకు ఓమూల చిల్లరిమూట. బిజిలీ ఆ దుస్తులు మారుస్తుందో లేదో ! మహామార్చినా యింకో జతకన్నా యెక్కువవుండి వుండవు. రెండూ ఒకేరకంవి అవడంవల్ల కాబోలు ఆ భేదంకూడ కనుపించదు. బిజిలీ పరికిణీ అక్కడక్కడ తూట్లుబడి, మాసి, మాసికలతో వుంటుంది. అయితేనేం ? బిజిలీ ఆ చింకిబట్టల్లోనే మహారాణుల్ని తలదన్నినట్లుంటుంది. ఆమెకు యెడం కంటిక్రిందనున్న పుట్టుమచ్చ యెంతో కళ తెచ్చింది. మరి యే రాజకుమారి దుస్తుల్లోనయినా అయితే, బిజిలీ ముందు యే నూర్జహానూ పనికిరాదేమో !

బిజిలీ వుప్పొంగే ఆనందంలో "నాకొరకే, నాపాట కొరకే వాళ్ళంతా వేయికండ్లతో కనిపెట్టుకొనున్నారు. వేయి చెవులొప్పగించి నారాకకు యెదురు తెన్నులు చూస్తున్నారు. నేనే ప్రపంచంమంతటిలోనూ ఆనందంగా బ్రతికే జీవిని. నా ఆనందరాశిలో అందరికీ భాగాలు పంచగలను". అనుకుంటూ అడుగులు వేస్తుంది. ఆ సన్నని వేళ్ళతో, తంబురతీగలమీద మీటే మధురనాదం వారిని మెల్లగా సమీపిస్తుంది. ఆమె తోడాల చిరుశబ్దాలు దానికి అనుగుణంగా తాళం వేస్తున్నాయి. అమ్మవారి చెట్టుదగ్గరకు చేరగానే, అక్కడి కోలాహలం చెవులు

గింగురు లెత్తించేస్తుంది. "బిజిలీ...బిజిలీ! నిన్న రాలేదేం!" "పనిమీద వుండిపోయేను—చాచా కొత్తపాటలు చాల నేర్పించేస్తుంటే..." "మరయితే నిన్న పాడవలసిన పాటలు, యీవేళటి పాటలూ కలసి అన్నీ యీరోజు పాడేయాలి. లేకపోతే వప్పుకోం" అని గారాం చేసేరు. బిజిలీ కిల కిలా నవ్వింది. ఆ నవ్వుల్లోనుండి వెల్వడే తీయదనాలు పాషాణాల్ని కరిగించేలా—మోళ్ళని చిగిర్చేలా—విచారాన్ని పారదోలేలా వున్నాయి. పెదాలు రెండూ గుండ్రంగాచేసి, కండ్లు సగం మూసివేసి "మరి, మీరిలా అల్లరిచేస్తే నేను పాడను వెళ్ళిపోతాను." అన్నది కోపం అభినయించాలని ప్రయత్నిస్తూ! ఆ చిరుకోపంలో బిజిలీ అందం కవుల కలాలకుకూడ అందకపోను. "మేం అసలు అల్లరిచేయం. గుప్. ఛిప్...వుప్...వుప్. నీవుమాత్రం అన్ని పాటలూ పాడేయాలి. లేకపోతే బాబాకి చెబుతాం_అహా నీతో మాట్లాడం." అని ప్రమాణాలు చేసేరు. మళ్ళా కిలకిల నవ్వింది బిజిలీ. ఆమె వేళ్ళు తంబురతీవలు కొరకు వెతుకున్నాయి. ఆమె నిమీలిత నేత్రాలు యెంత చక్కగా వున్నాయో! ఆనల్లని, వంపులుతిరిగిన దట్టమైన కనురెప్పల్ని యే చిత్రకారుడు సృష్టించగలడు! ఆమె యవ్వనను రసికవంపులు, మృదువైన హస్తాలు, ప్రతి అవయవంలోను సలలిత వంపులు దిద్దింది. బిజిలీకి, బిజిలీయే సాటి. కాని, వీటన్నింటికీమించి, యెందుకూ కొరగాకుండా చేసే గానం! ఆ అమరగానం! బిజిలీ గొంతెత్తిపాడితే కోయిల రివ్వుమంటుంది సిగ్గుతో. చీమ చిటుక్కుమన్నా వినిపించేటంతటి నిశ్శబ్దం అలుముకుందంతటా. బిజిలీ అమృత గానంలోని తీయదనం అందరినీ అందులో లీనంచేసింది. "...తులేరి భాషత్ తులేరి షాజాతే..." రాగసుధా రసమూ... "తుమెబంధం తుమెనాథ్ నిషాదిన్..." అంటూ ఒకదాని తరువాత యింకొకటి, అన్నివిధాలయిన పాటలూ పాడేస్తుంది. మధ్యమధ్య "ఆపాట బిజిలీ" అంటూ యెవరో ఒకరు జ్ఞాపకం చేస్తుంటారు. దారినపోయేవారు, చుట్టుప్రక్కల యిండ్లలోవారు, యెవరిపనులు వారు మరచి కండ్లూ, చెవులూ వొప్పగించేసేవారు. ఆ పాటలోని ఆకర్షణశక్తి ముసలివారిదగ్గరనుండి, పసిపిల్లలవరకు మంత్రముగ్ధుల్ని చేసివేసేది. బిజిలీ ఓనాడు యేకాంతంగా పాడుతుంటే నాగుపాము వచ్చి ఆడిందని అందరూ కథగా చెప్పుకుంటూన్న విషయమే. సరే, బిజిలీ ఆ రెండు రోజుల పాటలూ పాడివేసింది. "ఇంక పాడలేవా బిజిలీ?" అన్నారందులో ఒకరు. "రేపు మళ్ళా వస్తాగా" అంది కిల కిల నవ్వుతూ. ఆ ధ్వని ఆమె గీతానికి తానం అయింది. పిల్లలు తమ మానంమాని గొల్లుమంటూ బిజిలీ బుజంమీది వస్త్రం లాగి దానిలో తలో ఓ కానీ వేసి మూటకట్టి బిజిలీకి ఇచ్చివేసేరు. బిజిలీ అంది: "కానీకన్న యెవరూ యెక్కువ వేయలేదుకదూ? వేస్తే మరి నేనింకరాను సుమ!" అంది, మళ్ళా పెదాలు గుండ్రంగాచేస్తూ, అది అందరికీ తెలిసిన సంగతేగా. అందుకని యెవరూ ఆ పని చేయలేదని వప్పుకున్నారు. బిజిలీలో ఆ వింతస్వభావం యేమిటో, యెన్ని పాటలు పాడినాసరే, యేనాడూ, యెవరిచ్చినా ఒక్క కానీకన్న యెక్కువ తీసుకోదు. "అది నా వ్రతం" అంటుంది కిల కిల నవ్వుతూ. అంతకన్న యెక్కువ అడిగే సాహసం యెవరికీలేదు. ఆ మాట వెనుక వేళాడుతూంటే తంబుర మీటుతూ కాళ్ళ తోడాల చిరుశబ్దంతో బిజిలీ నెమ్మదిగా కదిలింది. బిజిలి కదలికతో అంతా నెమ్మదిగా యెక్కడివారక్కడకు సర్దుకున్నారు. బిజిలీ యింటి ముఖం పట్టింది.

ఇది రోజూ జరిగే మామూలు. బిజిలీతో గడిపే ఆ నాల్గు ఘడియలు, ప్రతివారికీ ఆ రోజంతటిలోనూ ఆనందంగా గడిపే ఘడియలు. ప్రతివారి మనస్సుల్లోనూ బిజిలీ పాడిన పాటల తీయదనం హత్తుకు పోతుంది. బిజిలీ నాల్గు సంవత్సరాలు పిలగా ఆ ఊళ్ళో అందరికీ తెలుసును. ఆ రోజుల్లో బిజిలీ, బాబా ఆ ఊరు వచ్చేరు. ఎక్కడినుండో ఎందుకో. ఎవరికీ తెలీదు. ఆ నాటికీ ఈ నాటికిన్నీ వారి కులం, గోత్రం అంతకన్న యెవరికీ తెలీదు. వారు యేదేవుని కొలుస్తారోకూడా అంతులేదు. అసలు వారిద్దరూ యే దేవునీ పూజించినట్లగుపడదు. గానమే వారి దైవం అయి వుండొచ్చును బహుశా. రాజారాంగారు వుచితంగా యిచ్చిన ఊరి బయిటి ఇంట్లో వారి బస. బాబా, దినచర్య బిజిలీకి గానశిక్షణ. బిజిలీ గురువును మించిన శిష్యురాలు. ఏపాటయినాసరే యిట్టే పట్టుకుంటుంది. బిజిలీకసలు మాటతో పాటకూడ అబ్బింది. బిజిలీ దుస్తుల్లో ఆ నాల్గేళ్ళ

పిల్లదగ్గర్నుండే యేమార్పు రాలేదు. అదేరకం గళ్ళ బుల్లి పరికిణీలు, అవేరకం ఆభరణాలు ధరించేది చిన్నప్పుడు కూడా. బిజిలీకి పది సంవత్సరాలు రాగానే, బాబా చిన్న తంబురకు బదులు చక్కని పెద్ద తంబుర యిచ్చేడు. "ఈ తంబుర మా బాబా చేసిందే," అంటుంది బిజిలీ గర్వంగా ప్రమ్మిదల అంచుల్లావుండే ఆ కనుబొమలు యెగరవేస్తూ. "మా బాబాకి సరస్వతీదేవే పాట నేర్పిందట" అంటుంది మరోకసారి బింకంగా. ఎవరేనా నవ్వితే "నేను పాట పాడను" అని అంటుంది పెదాలు రెండూ గుండ్రంగా పెట్టి. అప్పుడందరూ బ్రతిమాలేవారు. ఆమె పాటకు పోటీ లేదు.

బిజిలీకి పధ్దెనిమిదేళ్ళు రాగానే బాబా ఓరోజు పిలిచి "బిజూ! నీవు పెండ్లి చేసుకోవాలమ్మా" అంటే, మాట్లాడకుండా అక్కడినుండి గిర్రున తిరిగిపోయింది. ఆ మరుచటిరోజున బాబా యేకాంతంగావుండగా వెళ్ళి కాళ్ళ దగ్గర నిశ్చలంగా కూర్చుని, బాబా చేతులు రెండూ పట్టుకొని, "బాబా, నాకు పెండ్లి చేసేవా నన్ను చంపివేసినట్లే" అంది ఒకే మాట. బాబా కండ్లప్పగించేడు. మరి ఆ మాట తేవడాన్కి కూడా భయపడ్డాడు. బిజిలీ పట్టుదల బాబాకు బాగా తెలుసు. తాను ఎంత తలిస్తే అంతే. బిజిలీకి పెండ్లంటే అమితభయం. రోజూ తాను ఊళ్ళోకి వెళ్ళి యెన్ని కాపురాలు చూడ్డంలా? భార్యాభర్తలు యేదో ఒకదానికి అస్తమానం జగడాలు, తగాదాలు చిక్కులు. పెండ్లంటేనే విచారం. "మరి నా జీవితమో! ఓ తీయనిపాట! నేను గానరాణిని. నేను పాడుకుంటాను. నవ్వుకుంటాను. నా పాటలో నేను కరిగిపోతాను. నాకొరకు రోజూ యెందరో యెదురు తెన్నులు చూస్తూంటారు. బాబా నేనూ హాయిగా బ్రతుకుతాం. పెండ్లి చేసుకుంటే బాబోయ్... అంతా విచారమే. నాకొద్దు బాబోయ్," అనుకుంది. ఈ తన నిశ్చయాన్ని బాబాకు కూడా చెప్పేసింది కాబట్టి యింక భయములేదు అనుకుంది తృప్తిగా. బిజిలీ ప్రేమ కొరకు యెందరెందరో తపస్సు చేసేరు. ధనవంతులు తమ ధనం, తమ హృదయం అంతా బిజిలీ పాదార్పణ చేయడాన్కి సిధ్దపడ్డారు. బీద వారు తమలోని సర్వస్వం బిజిలీదేనన్నారు. బిజిలీలేని జీవితం జీవితంకాదని గోవిందు కంకణం కట్టి కూర్చున్నాడు.

సాహసించి బిజిలీని యెవరేనా ఆవిషయం అడిగిచూస్తే వారిమొహంలోనే కిలకిలా నవ్వేసి "నాకా పెండ్లి? నా కొద్దు." అని పెదాలు గుండ్రంగా చేసి, కనుబొమలు చిట్లించేది. మరింకోమాటు అడగడాన్కి ఎవరికీ గుండెలు చాలేవికావు.

నాలు సంవత్సరాలు చిటుక్కున వెళ్లిపోయేయి. బిజిలీకిప్పుడు యిరవైరెండేండ్లు. ఓనాడు బాబాకు అకస్మాత్తుగా గుండెనొప్పి వచ్చింది. బాబా బిజిలీని దగ్గరకు పిలిచి: "బిజూ! నా చివరికోర్కె తీర్చలేవా? నేను వెళ్ళిపోతే నిన్నెవరు చూస్తారు? నీవు పెండ్లి చేసుకోవాలి నాకొరకైనా." అన్నాడు ఆయాసంగా. మరి ఆలోచించలేదు బిజిలీ "సరే బాబా" అంది. బాబా తృప్తిగా చిరునవ్వు నవ్వేడు. ముడుతల మొఖం అంతా కళకళలాడింది. గోవిందు అదృష్టం పండింది- చావుముఖంనుండి బయటపడ్డాడు.

బిజిలీ పూర్వపు బిజిలీ కాదిప్పుడు. గోవిందుడంటే పంచప్రాణాలు. గోవిందుతోనే తన స్వర్గం. బిజిలీకి గోవిందే సర్వప్రపంచం. దానికి మిగతా అంతా మసగలై అంతరించిపోయింది. కిలకిలా నవ్వి అనుకుంది చాటుగా "పెండ్లంటే విచారంకాదు. స్వర్గం. గోవిందు ఎంతమంచివాడో!" గోవిందులో కొండంత లోట్లు కూడా బిజిలీకి అసలు కనిపించవు. పైగా అవన్నీ సుగుణాల జాబితాలో వేస్తుంది కూడా. బిజిలీ దుస్తులు, అలంకారం అంతా మార్పే. ఆ గళ్ళపరికిణీగాని, ఆ చిరుశబ్దంచేసే తోడాలు గాని యిప్పుడగపడవు. ఖరీదైన చీరలు, రవ్వల నెక్లెసులు, నాజూకు గాజులు యింకా లక్ష. గోవిందు పెండ్లి కాగానే ఆజ్ఞాపించేడు "బిజీ! నీవింక వీధుల్లోకిపోయి పాటలు పాడకూడదు. కానుల మూట బుజాన వేసుకుని కాళ్ళరిగిపోయేలా తిరిగే ఖర్మ నీకింక అవుసరంలేదు. నీవు నా పత్నివి." అని ఆజ్ఞాపించేడు. గోవిందుమాట వేదవాక్కు. 'సరే' నంది. అసలు వింత యేమంటే పాటలు పాడకపోతే కొరత యేమీ కనిపించటంలేదు. "గోవిందువుంటేచాలు" అనుకుంది. బాబా కూడా అంతగా గుర్తుకు రావడంలేదిప్పుడు. గోవిందు దగ్గరలేని సమయంలో యెప్పుడేనా అనుకునేది "పాపం. బాబా!" అని. "నా జీవితమంతా ఓ ఆనంద మాలికే" అనుకునేది పెదాలు రెండు దగ్గరకు

చేస్తూ కండ్లు తళుక్కున మెరిసేవి. అయిదు సంవత్సరాలు గిర్రున చిటికెలో తిరిగేయి. ఇద్దరు పాపాయి లిప్పుడు బిజిలీకి. ఓనాడు అకస్మాత్తుగా ఓ వార్త వింది బిజిలీ. "బిజిలీ నీ భర్త సముద్ర స్నానంలో కాలుజారి-చనిపోయేడు." ...

బిజిలీకి పిచ్చెత్తిందన్నారు అంతా. ఓ రోజు మాత్రం మాటాడలేదు. మరోరోజు అనుకుంది బిజిలీ. బాబాని ఆనాడు తనడిగింది, 'బాబా! యెందుకంతమంది ప్రజలు పుణ్యక్షేత్రాలకనీ తండోప తండములుగ వెళ్ళుతున్నారు?' అని. "వారి కష్టాలు భగవంతునితో మొఱపెట్టుకోడానికి, కోర్కెలు కోరుకోడానికి"... "ఆ చాలు నాకు కష్టాలేవీ లేవుగా!" అంది బిజిలీ గర్వంగా తల వెనుకకు విసురుతూ. ఈనాడు ఆమాటలు గుర్తుకువచ్చేయి. చరచరా ఆమూల గదిలో ప్రవేశించి, చెక్కపెట్టిలోనుండి తన పాత గళ్ళ పరికిణీ— అలంకారాలు తీసి చకచకా ధరించింది. ఇనుప పెట్టె తెరిచి దానిలో డబ్బంతా పైబట్టలో మూటగట్టి బుజాన వేలాడవేసింది. శరవేగంతో బయలుదేరింది. గిరిజా గోపీల జట్టులు కిలకిలమంటూ పరువులెత్తారు. "బిజిలీపాట! బిజిలీపాట" అంటూ, అందరూ బిజిలీ అమ్మవారిచెట్టు సమీపించగానే "బిజిలీ! ఆపాట" అని కేకలు వేసేరు. అసలు వినిపించుకోకుండానే బిజిలీ సాగిపోయింది. అంతా తెల్లబోయి ఒకరిముఖా లింకోరు చూచుకున్నారు. శూన్య దృష్టులతో మాట లేదు మన్నులేదు. అంతా ప్రశ్నార్థకంగానే మిగిలిపోయింది.

బిజిలీ కాశీలో అన్నపూర్ణా విశ్వేశ్వరుల్ని, గయ, రామేశ్వరం... యింకా యెన్నో పుణ్యక్షేత్రాలు దర్శించింది వేలాది ప్రజలతో. వారంతా దేవునిముందు చెంపలు వేసుకుంటూ, తప్పులు వప్పుకుంటూ, కోర్కెలు కోరుకుంటూ, దేవునిలాంఛనాలు యిచ్చే ప్రమాణాలు చేస్తూంటే చూచి బిజిలీకూడా అదేపని చేసింది. "గోవిందును బ్రతికించు, నామూటలోని డబ్బంతా నీ కిచ్చివేస్తా" నని అందరి దేవుళ్ళకూ చెప్పింది. ఏ దైవమూ మాట్లాడలేదు. విసిగి, వేసారి అలసిపోయింది. తిండీతిప్పలులేని శరీరం చిక్కి శల్యమయింది. కండ్లు లోతుకు పోయేయి. తల చెరిగింది. కడుపు కాలుతుంది. చింకి పీలికలైనాయి వస్త్రాలు. ఓ సత్రం మెట్ల మీద నడుం వాల్చింది. కన్నుమూసింది. "వింతదార్లు... అన్నీ వింతదార్లు" లేచింది వింతదార్లలో దారితీసింది. చేరింది గమ్యస్థానం. తూలేదేహాన్ని ఆ పాడుపడ్డ సత్రానికి చేర్చింది. మెట్లమీద యిద్దరు పాపాయిలు. చినిగినవస్త్రాలు లోతుకుపోయిన పొట్టలు, గుంటలుపడ్డ కండ్లు, ఇద్దరికీ యెడమ కండ్లక్రింద పుట్టుమచ్చలు, వారి పస్థితిని వెక్కిరిస్తున్నాయి. వారిని లేపి హృదయానికి హత్తుకుంది. అక్కడి చెట్లపండ్లు తెచ్చి తినిపించి నీరు పట్టింది. పాపాయిలు తెప్పరిల్లుకొని "అమ్మా!" అన్నారు. ఆనందం గట్లు తెగింది. ఒక్కసారి వెక్కి వెక్కి ఏడ్చింది. వెంటనే కండ్లు తుడుచుకొని కిలకిలా నవ్వింది. "గోవింద్, నీవు యీ పాపాయి లిద్దరిలోను జీవించే వున్నావు." అని అరిచింది.

తెల్లవారింది. బిజిలీ తన రెండవ గళ్ళపరికిణి ధరించింది. మూలనున్న తంబుర చేతపట్టింది. ఇద్దరి పాపలకు గానశిక్షణ మొదలు పెట్టింది. "బాబా! బాబా!" అనుకుంది కండ్లుమూసుకొని. బిజిలీ ఊళ్ళోకి బయలుదేరింది యిద్దరు పాపాయిలతోసహా. "బిజిలీ పాట! బిజిలీ పాట!" కేకలు మిన్నుముట్టేయి. అమ్మవారి చెట్టుక్రింద యిసుకవేస్తే రాలని జనసమ్మర్దం. బిజిలీ కాళ్ళకంకణాల చిరుశబ్దం- తంబురతీగెల తీయదనం సమీపించేయి. కిలకిలా నవ్వింది బిజిలీ. పూర్వం బిజిలీయే. బిజిలీ రెండు ప్రక్కలా పాపాయిలు చిన్ని తంబూరలతో ముద్దుముద్దుగా మీటుతున్నారు. అమ్మవారిచెట్టుక్రింద అందరిముఖాలు వికసించేయి. బిజిలీ పాడుతుంది. అందరూ తన్మయులైనారు. "బిజిలీ! బిచీ, చీచీ, జీజీ... ఆ పాట!" అన్నా రందులో ఒకరు "మళ్ళా రేపు వస్తానుగా!" అంది కిలకిలామని నవ్వుతూ కిలకిల నవ్వుల్లోని తీయదనం అందరిహృదయాలనూ తిన్నగ తాకింది. బిజిలీ మళ్ళా కిలకిలామని నవ్వింది.



# వేష భాషలు

* శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ *

మానవులు పుట్టడం, పెరగడం, మరణించడం జరుగుతూ ఉంటుంది. స్వతసిద్ధమైన అతి సనాతనమైన యీ సృష్టిలో పరివర్తన కనుపించదు. కొన్ని యుగముల క్రిందట మానవులు ఏ విధంగా జననమరణాదులు కలిగి ఉన్నారో యిప్పటికీ అట్లాగే ఉన్నారు. కాని ఆ మానవులు నివసించే గృహాలు ఉపయోగించే వస్తువులు, ధరించే దుస్తులు, నిరంతరము మార్పులు చెందుతూ ఉండటము, ఆ మార్పులోనే మానవులు ఆనందానుభూతిని పొందడము నిత్యసత్యమైన విషయం. ఈ పరివర్తనానికి కారణము కొత్తవానిపై మానవులకుండే సహజమైన అభిలాషో, విజాతీయ వ్యామోహమో, రాచరికాల పరిణామమో, మహాత్ముల ప్రబోధమో, విద్యా వివేకాదుల్లో కలిగిన అభివృద్ధియో, లేక వీటన్నిటియొక్క సమిష్టి సమ్మేళనమో నిరూపించడం కష్టమే కాని మానవుల వేషభాషల్లోనేమి, అలంకారదుల్లో నేమి, గృహోపకరణాల వినియోగంలోనేమి నిరంతరము మార్పు చెందుతూ పాతవానిని త్రోసి పుచ్చి క్రొత్తవానిని వినియోగించడంలో ఉత్సాహాన్ని చూపుతూ ఉండటం మాత్రం సత్యం. నవనాగరికులు యీ విషయంలో విశేషోత్సాహం చూపించి ఆనందిస్తూ ఉంటారు. పూర్వాచారపరాయణులైనవారు ఈ క్రొత్త పద్ధతులు పనికిరావని వాదిస్తూ వానిని అవలంబించడానికి వెనకంజవేస్తూ ఉండటం ప్రాయికంగా కలదుకాని, కాలం వారితో ఎకసక్కేలాడుతూ తన ప్రభావాన్ని వారిపై రుద్ది వారిని వశగతులను చేసుకొని పరిహాసం చేస్తూ ఉండటం వల్ల వారూ ఈ మార్పులకు లోనుకావలసే వస్తున్నది.

నిజం ఆలోచిస్తే పోతబోసిన బొమ్మలలాగా, అచ్చులు దీసిన యిటుకల్లాగా, మూసలలో బోసిన కడ్డీలలాగా, తమ మనోభావాలను ఏ పురాతన సాంప్రదాయపు చట్రాలలోనో యిముడ్చుకొని నిర్జీవంగా ఉండటం మానవుల స్వభావంగా కనిపించదు. తాను నివసించే గృహాల్లో తాను ఉపయోగించే వస్తువుల్లో తాను ధరించే వస్త్రాద్యలంకారాల్లో క్రొత్తక్రొత్తవి అపరూపమైనవీ చూపటానికి మానవులు అభిలాషపడుతూ ఉంటారు.

మానవుల యీ సహజాభిలాషను కనిపెట్టి ఆయా వస్తువులను తయారుచేయడానికి ఆయా పనులలో ప్రవీణులైనవారు ప్రయత్నం చేస్తూ ఉంటారు. ప్రత్యేక వ్యక్తులే కాకుండా పెద్దపెద్ద కంపెనీలుకూడా యిందులకు ఏర్పడి ఉంటాయి.

పరికాయించిచూస్తే మానవుల మాటేమిటి: భగవంతుని లోనే యిట్టి యిచ్ఛ, ప్రకృతిలోనే యిట్టి పరిణామదశ గర్భితమై ఉన్నట్టు మనకు విశదమవుతుంది. ఈ వసంత ఋతువునే చూచుకోండి. ఫాల్గుణంతో శిశిరం వెళ్ళిపోయింది. వసంత ఋతువు రాగానే లతాద్రుమాదుల లేజివుళ్ళూ, మల్లికాకుసుమముల సౌరభములూ, మామిడి పిందెల పులుపులూ, మత్త కోకిలల కలస్వరాలూ, మలయ పర్వతపు పిల్లతెమ్మెరలూ మనకెంత ఆనందాన్ని సమకూరుస్తున్నాయో....

అయితే యిందులో ఉన్న వింతలో వింత ఏమంటే యివి సరికొత్తవి మాత్రంకావు. సహజంగా క్రొత్తవానికి చోటిస్తూ తొలగిపోయిన ఆ పాతవిషయాలే కాలచక్రభ్రమణలో కొన్నాళ్ళు కనుమరుగై క్రొత్తదనం ఆరోపించుకొని మరల మనచేత అభినందలందు కొంటున్నాయి. ప్రకృతేగాదు.... శ్రీరామనవమి పండుగ వచ్చింది, ఆ సీతారాముల దివ్యచరితామృతంలో ఏదో నవ్యత ఉన్నట్టూ సరిక్రొత్త విషయం చూస్తూ ఉన్నట్టూ ఆనందిస్తున్నాం—కాని యిది క్రొత్తవిషయమా....పాతదే, ప్రతి సంవత్సరం చేస్తూ ఉన్నదే, చూస్తూ ఉన్నదే, కాని ఒక్క సంవత్సరం విరామంలో దానికి నవ్యత చేకూరి మనకు ఆనందోత్సాహాలను కలిగించింది.

క్రొత్తవాటియందు ప్రజలకింత మోజు ఉండటంవల్లనే గృహాల్లో యిన్ని రకాలూ, గృహోపకరణాల్లో యిన్ని మాదిరులూ, నగలకిన్ని నగిషీలూ, దుస్తులలో యిన్ని రీతులూ, చీరలకిన్ని రంగులూ—అంచులూ, గాజులకిన్ని వన్నెలూ, రిబ్బన్లకిన్ని మెరుగులూ వచ్చాయి. ఈ ఫాషన్లకు ఈ రోజుల్లో వాయువేగ మనోవేగములకు మించిన గమనవేగం ఉన్నది. నాగరికతకు మేరమీరిన పాశ్చాత్యదేశాల్లో ప్రొద్దుటి ఫ్యాషన్ సాయంత్రానికి మోటై పోతూంటుందంటారు. వెనకటికి పారిస్‌లో ఒక దొరగారు తన భార్యకొరక గౌను కుట్టించుకొని చేతిలో పట్టుకొని పరుగెత్తి పోతున్నాడుట. 'ఎందుకయ్యా అట్లా పరుగెత్తి పోతున్నావ'ని త్రోవలో ఎవరో అడిగితే 'నేనింటికి చేరే టప్పటికి ఈ గౌను ఫాషన్ మారిపోతుందేమోనని యిలా పరిగెత్తి పోతున్నా'నన్నాడుట. అందుకే మేము బస్తీలో ఒక జాకెట్టు నమూనా ఒక క్రొత్తరకం చీరాచూచి మోజు పడి కొనుక్కొని మా గ్రామం తీసుక పోయేటప్పటికి ఇది మోటైపోతుందంటీ అని ఒక పల్లెటూరి ఆమె విచారించింది.

ఫాషన్ అనేది అన్నిటికంటె స్త్రీపురుషుల వస్త్రధారణపై తన ప్రభావాన్ని అత్యధికంగా చూపిస్తూ ఉంటుంది. అయితే యిది మగవారికంటె స్త్రీల కెక్కువ అని అనడం కద్దుకాని పురుషులైనా యీ విషయంలో తీసికట్టుగా ఉండటం లేదు. పింజెపోసి ధోవతి కట్టుకొని లోపల షర్టు వేసుకొని కోటు తొడుక్కొని పైన ఉత్తరీయం తలపాగ పెద్దమనిషైన పూర్వీకుల దుస్తుల లాగా ఉండేవి. పాశ్చాత్య నాగరికతా సంపర్కంవల్ల సూటు. బూటు, హ్యాటు గూడా ఉన్నతోద్యోగులకు అలవాటైంది. ఈనాడు ఎంత పెద్దవారికీ పొట్టిచేతుల కోటు, ప్యాంటు ఫాషనుగా ఉన్నది. ఇక విద్యార్థుల నాగరికతకు అంతేలేదు. లుంగీలు, గూడ కట్టులు మొదలుకొని రంగు రంగుల పువ్వులద్దిన బుష్ కోట్లు తొడిగే దాకా వచ్చింది. అంతేకాదు కోటుకు ముందువైపు ఒకరంగైతే వెనకవైపు ఒకరంగూ, కోటంతా ఒకరంగైతే చేతులు మెడపట్టీలు మరొక రంగు గల చొక్కాలు, యింకా పులిచారల చొక్కాలు, చిరుతపులి మచ్చల చొక్కాలు యింకా ఏవేవో వింత వింత దుస్తులు చూస్తున్నాము!

మగవారి దుస్తులలోనే యింత వింత వింత మార్పులు వస్తుంటే సహజంగా శృంగార ప్రియులైన స్త్రీలు ధరించే చీర రవికలలో క్రొత్త క్రొత్త మాదిరులు కనిపించడం ఆశ్చర్యం అనిపించదు.

పూర్వం మన అమ్మలు అమ్మమ్మలు నాయనమ్మలు కాకినాడ చుట్టుచెంగావి చీరెలు, బందరు కలంకారీ చీరెలు, మధుర మల్లెపందిరి చీరెలు, గువ్వకన్ను చీరెలు, వెంకటగిరి నేత చీరెలు, నెల్లూరి రోజురంగు చీరెలు ధరిస్తూ ఉండేవారు. ప్రతి స్త్రీకి జరీబుటాలువేసిన బెనారసు చీరె ముదురు గులాబీరంగుదో, ముదురునీలపురంగుదో ఉండక పోతే ఏ పేరంటమూ జరిగేదికాదు. పెండ్లి కొమార్తెకు పమిటంతా జరీతోనిండిన పట్టుచీర లగ్న సమయంలోనూ, బెనారసు జరీబుటాల చీరె సదస్యములోనూ. బరంపురం పట్టుచీరె నాగవల్లిలోనూ, పెట్టిన పెండ్లివారే ఘనమైన చీరెలు పెట్టినవారుగా ప్రశంసింపబడేవారు.

ఈనాడు ఆ చీరెలు మచ్చుకైనా కానరావు. బెనారసు చీరెలు వదియాలగుడ్డలై పోయినాయి. పెద్ద జరీచీరెలు పల్లెటూరి వేషమైపోయాయి. బరంపురం పట్టు చీరెలు మోటు సరుకై పోయాయి.

మొన్నమొన్నటివరకు ఫాషన్‌గా ఎంచబడుచున్న బెంగుళూరు చీరెలు, ఖాదీ సిల్కుచీరెలు, ఆర్గండివాయిలు చీరెలుగూడా వెనుకబట్టుతున్నాయి. ఇప్పుడు టిస్యూ చీరెలు, జార్జెటు చీరెలు, బెన్నీ లెనిన్ చీరెలు, ఎటాచ్ బార్డరు శారీసు - అంటే ఒక రంగుచీరెకు మరో రంగు అంచులు పమిటకొంగుకుట్టిన చీరెలు వస్తున్నాయి. వీటన్నిటిని మించిపోయినవి బొంబాయి ప్రింటు చీరెలు! ఈ చీరెల్లో చీరంతా ఏదో డిజైనుతో అద్దడమో, లేక అంచులు కమ్ములుమాత్రమే అద్దడమోకాకుండా చీరె అంచులు పమిట కొంగులు మాత్రమేగాక చీరె మధ్యభాగములో అద్దబడే పాటలీపాలు ఫాషన్ చీరెలు ప్రస్తుతము వాడుకలో ఉన్నవి. నూలు, పట్టు, నార చీరెలే కాకుండా

యిప్పుడు ప్లాస్టిక్కు చీరెలుగూడా వస్తున్నవంటున్నారు.

యింకా రెవికల్లో కల్గిన—కల్గుతున్న—మార్పులకు అవధికనిపించదు. పూర్వం గుండీలు లేని సాదా రెవికలు ఏ నిండు రంగులువో మోచేతికి కొంచెం పైగా పొడుగు పెట్టి బిగువుగా తొడుక్కునేవాళ్ళు....పూర్వకాలపు ముత్తైదువులు. వాటిలో జరీ అంచువి, పట్టుఅంచువి, నూలంచువి కూడా ఉండేవి. అంచు రెవికలంటే పెద్దవాళ్ళకెంతో ప్రీతి. కొన్నాళ్ళక్రిందట యీ రెవికలు క్రమంగా పైకి పోయిపోయి బుజాలదాకా పోయినాయి. యిక బుట్ట రెవికలు, కుచ్చీరెవికలు ఉండేవి. వీటికి ఎంబ్రాయిడరీ, లేసు, గోటు ఏవేవో అలంకారాలు చేసేవాళ్ళు. కాని యీ జాకెట్లూ యిప్పుడు మోపైపోయినాయి. రెవిక చేతులిప్పుడు మోచేతులకు సన్నిహితంగా ఉండి సన్నంగా గొట్టాలులాగా అతిబిగువుగా తొడుక్కోడం ఆ బిగువు చాలక వానికి గుండీలుగూడా పెట్టుకోడం జరుగుతున్నది. ఇప్పుడు ఈ ఫాషణ జాకెట్లుగూడా దూరమై నిండుచేతులు జాకెట్లు తొడుగుకోడం సామాన్యంగా కనిపిస్తున్నది. విడిగా తయారై వస్తూ ఉన్న జరీ అంచులు రెవికకు చివరలను కాకుండా నడిమీపున వేసుకోడం క్రొత్తఫాషన్‌గా కనిపిస్తున్నది. విడిగా తయారై వస్తున్న పమిట కొంగులు అంచులు, గోటులు తమకిష్టమైన వాయిలో జార్జెటో కొనుక్కొని వానికి వేసి కుట్టించుకొని తమకిష్టమైన చీరెలను తమే తయారు చేసుకోడం సరికొత్త ఫ్యాషన్‌గా ఉన్నది. ఫాషన్లు ఎన్ని రకాలున్నా అవి అందరూ ఒకే విధంగా ధరిస్తారనుకోడం పొరబాటే. ఫాషన్‌లయందు అభిలాషగల యువతులు ఒక్కొక్కరొక్కొక్క విధంగా ముస్తాబౌతుంటారు. ఆ ముస్తాబవటంలో కొందరిలో ప్రత్యేకత, విశిష్టత, ఉంటుంది.

ఆ విశిష్టత కొందరి నాకర్షించి వారిని అనుకరింపజేస్తూ ఉంటుంది. అట్లా పలువురి నాకర్షించి అనుకరింపజేయగల నవనాగరికురాండ్రే ఫాషన్లకు మాతృకలు. ఇందులో విచిత్ర మేమంటే ప్రస్తుతం ఫాషన్లుగా ఎంచబడేవి తీరా విచారిస్తే పూర్వం మనవాళ్లు వాడినవిగా ఉండటం ఆశ్చర్యం కలుగజేస్తుంది.

మా అమ్మమ్మ అద్దాలరెవికలు బహుసొగసుగా కుట్టేదనీ, పెండ్లిండ్ల వియ్యపురాండ్రకు తొడిగే హాస్యపురెవికలపై తేళ్లు పాములుకుట్టడంలో ఆమెకు ఆమే సాటనీ మా అమ్మగారు చెప్పుతూ ఉండేవారు. ఛీ అవి యిప్పుడెవ్వరు తొడుక్కుంటారని మేము నవ్వేవాళ్ళం. మొన్న ఈ మధ్యనే యీ వూళ్ళోనే ఒక అమ్మాయి హైద్రాబాద్‌నుంచి అద్దపు బిళ్ళలు తెప్పించుకొని తనసిల్కు జాకెట్టుమీద పసందుగా కుట్టుకొని తొడుక్కుంటే, ఆశ్చర్యపోయి ఇదేమిటంటే "యిది న్యూఫాషన్" అన్నది. క్రొత్త ఫాషనేమిటి, అమ్మ తొడిగిన అద్దాల రెవికేగా అన్నాను.

పాతదే కొత్తదై అభినందనలందుకోడమే కాలగతిలో ఉన్న గొప్ప!

(ఆలిండియారేడియో,విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో)



# రాగమయి

* శ్రీమతి తంగిరాల శకుంతలాదేవి *

నీలి మేఘాలచాటున నిలచినావు
తొంగి చూచెదవేల "దొంగ" నన్ను
చూడ నిమ్మొకసారి నీ సోయగమును
చాటుకేగెదవేలనో చందమామ
మేటి రాజునటంచును మిడిసిపోక
సాటియౌదులె అందాన చెలునకెందు
మచ్చ కలదోయి నీయందు మాయనట్టి
నిన్ను మించిన అందమా వన్నెదొరది.
"నీకు సాటేనె అందాన నీ ప్రియుండు"
కలదొ గర్వంబు కాస్తంత కట్టిపెట్టి
చేరి చూడగ రావయ్యా....

....కోరికలర



# నోముల సరదా!

* శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి *

'పండగ వస్తోంది వస్తోందని నేను నోరు ఖాళీచేసుకోవటమేకాని, మీకు చీమకుట్టినట్లుగానన్నా వుండదేమంటః నేనూ చూస్తాను అట్టే, ఆఖరుక్షణంలో వుత్తరం వ్రాస్తే వాళ్ళు పంపిస్తారా అమ్మాయిని?'

'వాళ్ళదాకా యెందుకు; మొన్న వియ్యంకుడు వుత్తరం వ్రాస్తే మనం పంపామా కోడలిని'——

'కోడళ్ళనవుతే మన యిష్టం కాబట్టి పంపపున్నాము. వక అయ్యచేతిలో పెట్టినతర్వాత కూతుర్ని యింట్లో కూర్చోపెట్టుకోవటం యెట్లా ! వాళ్ళ చిత్తం.'

'అవుతే యేమంటావు పండగవచ్చిందంటే సరి' ....

'మనఘటాలు వున్నంతవరకైనా అమ్మాయిని తీసుకు రావటం; చీరో, సారో, యివ్వటం ; లేకపోతే తర్వాత యీ అన్నలు పెట్టేదేమిటో, చేసేదేమిటో యెవరు చూడొచ్చారు ! ఇంతకీ తల్లిఘటం అంటూ వున్నాకాబట్టి యీ జంఝాటనఅంత'

'అమ్మాయిని యీ పండగకు పంపమని కబురుచేశాను. పంపిస్తామన్నారు. ఆవిషయం సరే. ఇప్పుడేమొ నరసయ్య గారి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది. ఈపండగకు అల్లుణ్ని, కూతుర్ని తీసుకువెళదాం అనుకుంటున్నట్లు వ్రాశాడు.'

'ఈ పండగకు మాత్రం పంపించకండి యెవ్వర్నీ, తర్వాత యెవరికి కోపాలొచ్చినాసరే. నలుగురం ఈ పండగకు కలిసివుందామని మొదటినుంచి అనుకుంటున్నాం. అందుకనేగా పెద్దకోడల్ని పంపకండా పనివేళ్ళఆపింది.'

'పైగా నరసయ్యగారి రెండోకూతుర్ని వాళ్ళ అత్తవారు పంపక పంపక పంపుతున్నారుట. అందువలనకూడ ఆయనకు పెద్దమ్మాయిని గట్టిగా తీసుకువెళ్ళాలని వుందని వ్రాశాడు. మనము యెప్పుడు చెపుతే అప్పుడు తీసుకు వచ్చి తీసుకు వెళుతూ వుంటాడు. ఆయన పెద్దమనిషి. ఇవ్వాళ ఆయనకూతుర్ని తీసుకువెళతానని వుత్తరంవ్రాస్తే వద్దంటే బాగుంటుందా అని ఆలోచిస్తున్నా.'

'బాగుండేదేమిటి, ఈవిషయమే వ్రాయండి..... ఈ ఏడాదికి మా అమ్మాయి వాళ్ళ వదినలతో నోము నోచుకోవాలని సరదాపడుతోంది : అందువలన ఈపండగకు పంపటానికి వీలులేదని వ్రాయండి.'

'వ్రాయటానికే నిముషంలో వ్రాయవచ్చు. పెద్దకోడల్ని యెట్లాగా పంపలేదుకద. ఈసారికి దీనిని పంపిస్తేయేం?'

'నలుగురు వకచోటవుండి నోచుకోవాలనిగద వుద్దేశం. బాలింతరాళ్ళు, చూలింతరాళ్ళు వీలుగా వున్నప్పుడే నోములు పట్టిస్తే సరిపోతుంది. ఈసారికి మాత్రం వీలు లేదని వ్రాయండి'

'సావిత్రిని మొన్ననే తీసుకువచ్చామాయెను. అమ్మాయిని వాళ్ళు పంపిసామన్నారు. పెద్దకోడలు వుండనేవుందె. ఈ ముగ్గురు నోచుకుంటేచాలదూ ? మనం పంపటానికి వీలులేదని వ్రాస్తే, ఆ నరసయ్యగారు యెంతనిరుత్సాహ పడిపోతాడు.'

'ఆయన నిరుత్సాహపడతాడనేకాని, ఇంట్లోదానికెంత నిరుత్సాహంగా వుంటుందో మీరు ఆలోచించటంలా.'

'అమ్మా! పోనీ పంపరాదుటే, వీళ్ళముగ్గురు కలసి నోచుకుంటారు. మనము ముద్దుముచ్చట్లు అనుకున్నట్లే వాళ్ళు అనుకుంటారుగా !'

'అవునురా నాయనా, పొట్టచేతపట్టుకుని మీరేమో వూళ్ళమీద తిరుగుతున్నారు. ఏకళనున్నాడో పెద్దవాడు పంపించాడు పెళ్ళాన్ని. అమ్మాయిని పంపటానికి వప్పుకున్నారు వాళ్ళు. తలొక వూళ్ళో వుండటమేను. వకరికి వీలయినప్పుడు యింకొకళ్ళకు వీలుకాకపోవచ్చు. నాకు మాత్రం యీసారి........ అయినా కామాక్షిని అడుగుతా ఏమంటుందో.... కామాక్షీ !.... నిన్ను తీసుకువెళదామని

మీనాన్న వుత్తరం వ్రాశాడట. నీకు అక్కడికి వెళ్ళి చెల్లెలు, వదినలతో నోమునోచుకోవాలని వుందా, లేక యిక్కడే వుండి తోడుకోడళ్ళు, ఆడబిడ్డతో నోచుకోవాలని వుందా! మొహం చిట్లించుకునివుంటె నాకసలు చిరాకు. నీవుద్దేశం చెప్పు'

'...మీ యిష్టం...'

'ఇప్పుడు నాయిష్టంకాక నీ యిష్టం అనటంలా. అసలు నీ వుద్దేశ్యం చెప్పు.'

'ఎట్లాగైనా నాకు సంతోషమేనండి.'

'అయినా దానిని అడిగితే ఏంప్రయోజనం కాని, ఒరేయ్ ఇక పండగలు రావాపోవా, యేదో పండగకు పెళ్ళాంతో కూడ అత్తవారింటికి వెళుపుగాని, పెద్దవాడు అత్త వారింటికి వెళ్ళటం, వాళ్ళు పిలవటం లేనేలేదు. యీసారికి మాత్రం యిక్కడే వుండనీ'

'సరే నీ యిష్టం'

'ఈ పండగకు నలుగురు కలసి నోములు ఇక్కడే నోచుకుంటారు అని ఒక వుత్తరంముక్క వ్రాయండి'

'ఊఁ...'

'ఆ చప్పుడు కామాక్షేనా. అప్పుడే మొదలుపెట్టావు హాళ్ళ పెళ్ళు. నేను అందుకనే చెప్పా. వెళ్ళమ్మ వెళ్ళు, యెందుకొచ్చింది, వుత్తరం వ్రాయండి తీసుకువెళ్ళమని'.

'నేను కాదండి... అక్కయ్య చేతిలోంచి పళ్ళెం జారిపడింది.'

'మగవాడు యెట్లా ఉన్నా సరిపోతుంది. వాడి హడా వడి నువ్వు నేర్చుకున్నావంటె నీకు క్షణం సాగదు అమ్మాయి చెపుతున్నా...... ఎవర్రా వాయిట్లో చూడు....'

'ఎవరు?'

'నేనండి నేను. సోమనాధంగారు పంపారు.'

'రా, అంతా కులాసా...అమ్మాయి, సావిత్రి! మీవూరు నుంచి యెవరో వచ్చారమ్మా—యిటురా ఒకసారి.'

'సావిత్రమ్మగారూ బాగుండారా... నాన్నగారు పంపారు, మిమ్మల్ని తీసుకురమ్మని......, సోమనాధంగారి రెండవకూతుర్ని పంపుతున్నారండి. మొదటేమొ సత్యవతమ్మగారి ఆడబిడ్డను వాళ్ళ అత్తవారు పంపుతామనిచెప్పి తర్వాత వాళ్ళింట్లో వాళ్ళమ్మాయిని మొదట పంపనన్నవాళ్ళల్లా పంపుతామని కబురుచేశారుట, ఇంకే మా అమ్మాయి వస్తోందని, సత్యవతమ్మగారి ఆడబిడ్డను వాళ్ళ అత్తవారు తీసుకువెళ్ళారుట. సరే కూతుర్నిపంపమన్నారు మీరు అడిగేరు కాబట్టి ఈ పండగకు మీ అమ్మాయిని తీసుకువెళ్ళమని కబురు చేశారు, సత్యవతమ్మగారొస్తారు. అందుకని సావిత్రమ్మగార్ని తప్పకుండా తీసుకురమ్మని వుత్తరం వ్రాసి ఇచ్చారండి.'

'బాగానేవుంది. ఈ పండగకే అందరికీ అవసరం వచ్చింది. ఇప్పుడు మా పెద్దకోడల్ని, రెండోకోడల్ని తీసుకువెళతామని వుత్తరాలు వ్రాస్తే, యీపండగకు వీలు పడదని సమాధానం వ్రాశాము. రేపో యెల్లుండో వెళ్ళి మా అమ్మాయిని తీసుకువస్తాము. ఈసారి నలుగురు ఇక్కడేవుండి నోములు నోచుకోవాలని అనుకుంటున్నారు అని చెప్పు'.

'తప్పకుండా తీసుకురమ్మని మరీమరీ చెప్పారండి ఈసారికి.'

'ఈసారికిలేదు. ఆసారికిలేదు. వీల్లేదని చెప్పేసెయ్యి. ఈసారి నలుగురూ నోములు యిక్కడ నోచుకోవాల్సిందే'

'వుత్తరం వచ్చిందే అమ్మా... అనసూయ మామ గారు వ్రాశారు.'

'ఏమని... అమ్మాయి కులాసాగా వుందా?'

'మా అమ్మాయి ఆడబిడ్డను వాళ్ళ అత్తవారు పంపించారట. ఇంట్లో నోములరోజుల్లో యెవరూ లేకుండా యేమిటని, మా అమ్మాయిని పంపమన్నారు మొదట. తర్వాత వాళ్ళ అమ్మాయి రాగానే మా అమ్మాయిని పంపారు. మా అమ్మాయి వాళ్ళ వదినలతో నోము నోచుకోవాలని సరదా పడుతోంది కాబట్టి, మా కోడలిని పంపటానికి వీలుపడదు....'

'మన అమ్మాయినా!....'



# నేటి సాహిత్యం

* శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ *

సాహిత్యమంటే ఏమిటి? సహితస్యభావం సాహిత్యం అన్నారు పెద్దలు. సహితుడు అంటే— కూడుకున్నవాడు. దేనితో కూడుకున్నవాడు? అని ఆకాంక్ష. సకల కళా విజ్ఞానంతో అని అనవలెను. కాగా- సాహిత్యమనగా సకల కళా విజ్ఞానమా? అయితే అలాగే అనకూడదా? దానికి మరల మరో పదమెందుకు? ఆలోచిస్తే పదాల చరిత్ర అద్భుతంగా అవుపిస్తుంది. ఒక పదానికి అర్థం నిర్ణయించాలంటే— దాని ప్రయోగం శరణ్యం.

తన గ్రంథానికి 'సాహిత్య దర్పణం' అని పేరు పెట్టాడు విశ్వనాథకవిరాజు—

"సంగీత సాహిత్య కళావిహీనః
సాక్షాత్పశుః పుచ్ఛ విషాణహీనః"

అన్నాడు మరోకవి. గనుక సాహిత్య పదం అనేక విధాలుగా వాడారు. అతనిది నైషధాంతం సాహిత్యమండీ— వట్టి సాహిత్యగాడు- శాస్త్రమేమీ రాదండీ అంటూ ఉంటాము. అనగా ఒక పండితునిలో సమన్వయ స్వరూపంగా బయలుదేరిన జ్ఞానరాసి యావత్తూ సాహిత్యమన్నమాట. శాస్త్రజ్ఞానం కాకుండా వట్టి కావ్యవాఙ్మయ జ్ఞానానికే సాహిత్యమనే వాడుకవుంది. ఒక మహాకవి—

"సాహిత్య పాథోనిధి మంథనోత్థం
కావ్యామృతం రక్షత హే కవీంద్రాః"

అన్నాడు. ఇచ్చట సాహిత్యమంటే-- వాఙ్మయమంతా అని అర్థం.

ఈ సాహిత్యం మహాసముద్రం. ఈ సాహిత్య పదాన్నే సంగీత సంబంధంగాకూడా, వాడారు. ఈయన పాటకుడేగాని- ఈతనిలో సాహిత్యం లేదండీ అంటారు వ్యవహారంలో. చివరకు సాహిత్యమంటే రెండర్థాలు మనం గ్రహించవచ్చు. ఒకటి— పండితునిలో ఉండే విజ్ఞానం, రెండు— బహిర్గతమై గ్రంథరూపంగావున్న వాఙ్మయం. ఒకటి ఆంతరంగికమైనశక్తి : రెండవది- వస్తు స్వరూపంలో ఉన్న సృష్టి లేక రచన.

సాహిత్యమంటే ఏమిటో సంగ్రహంగా తెలుసుకున్నాం. ఇక- దాని స్వరూపం, స్వభావం తెలుసుకుని విలువ కట్టాలి. ఒక కవి సాహిత్యమును జగన్మాతఅయిన సరస్వతీ స్తన్యమన్నాడు; ఆలోచనామృతం అన్నాడు. అంటే— సాహిత్యం దుగ్ధం, అమృతం అన్నమాట. ఓ కామధేనువుకాని- ఓ మాతృదేవతగాని లోకంలోని ఉత్తమాహారపదార్థంతిని జీర్ణించుకుని సారమును రక్తకణాలలో ఐక్యం చేసుకుని బయల్పరిస్తేగాని- ఈ అమృతం వ్యక్తంకాదు. అలాగే కవికూడా తన జీవితానుభవమంతా గ్రహించుకుని ఒక ప్రవాహంగా బయల్పరిస్తే అదే సాహిత్యం అవుతుంది. ఇది సాహిత్యంలో ఏకదేశం. వ్యక్తి విషయం, జాతిరూపకంగా ఇటువంటి రచనల రాశి ప్రపంచ సాహిత్యంక్రింద ఏర్పడింది. చెంబేడు నీరైనా నీరే. చతుస్సముద్రమునందలి నీరైనా నీరే. అయితే- ఈ సాహిత్యంలో ఉండవలసిన శక్తులు పై ఉపమానం వల్లనే బోధపడతాయి. పాలు త్రాగితే బలం కలుగుతుంది. ఆహారాలన్నింటికంటె సులభంగా, స్వాభావికంగా అప్పుడు పుట్టిన పిల్లకు కూడా జీర్ణమవుతాయి పాలు.

తర్క- కర్కశమైన శాస్త్రరచన అందరూ తిని ఆరగించుకోలేని బాదంపప్పు వంటిది. లడ్డూవంటిదనికూడా కొందరనవచ్చును. కాగా—పాలవలె అనుభవయోగ్య భోజ్యమయినది కావ్యం. స్త్రీలు, బాలురు, అపండితులు అందరూ ఆరగించేదీ, ఆనందింపతగ్గదీని ఇది.

ఈ పాలు స్వచ్ఛమైనవిగా ఉండాలి. నీళ్ళు కలయగూడదు. ఎక్కడివో కొన్నిపాలు తెచ్చి నీళ్ళుకలిపి అమ్ముకుంటూ ఉన్నారు. డబ్బుకూడా వస్తూవుంది. కొనుక్కున్నవాళ్లు తిట్టుకుంటూనూ ఉన్నారు; అయితే గతిలేకా

మహాకటి దొరక్కా- ఆ నీళ్ళపాలే కొనుక్కున్నట్లు-ఓహో మహాకవులు వచ్చారండి ! అని కావ్యసృష్టికి తాత్కాలికంగా సంతోషిస్తున్నారు. ఇంకా ఈ పాలలో భేదంవుంది. తల్లిపాలు, ఆవుపాలు, బర్రెపాలు గొర్రెపాలు ఇంకా ఎన్నెన్నో రకాలు ఉన్నాయి.

మన ప్రాచీన భారతీయ, వాఙ్మయం చూడండి. భారతం, రామాయణం, అవి—అజిరం, అమరం, అవి అమృతం అనడంలో విరోధం లేదుకదా ! అవి చదువుకున్నవాళ్ళకి శబ్ద జ్ఞానం, అర్థజ్ఞానం కలిగి తల్లిపాలు త్రాగిన పిల్లాడి మిసమిసలాగ మంచి విజ్ఞానం కలుగుతుంది.

ఇక పైదేశాన్నుండి వచ్చిన డబ్బాపాలున్నాయి. అవి త్రాగే పిల్లలూ ఉన్నారు. అలాంటి డబ్బాపాల సాహిత్యం కూడా నేటి వాఙ్మయంలో కనిపిస్తూవుంది. కొందరీ విగుమతి పాలతోనేగాని- సంతుష్టి పొందరు. అది వారి అలవాటు, అభిలాషానూ. కొన్ని పుస్తకాలు చదివితే ఇందులో ఏముంది?- అనిపిస్తుంది. ఇది అమృతంకాదు సరికదా ! మృతమే.

"నా కవిత్వం అధర్మాయ మృతయే దండనాయవా" అని ఒకరన్నారు. దీని అర్థమేమిటంటే— న- అకవిత్వం- అధర్మాయ- అని విరుపు; అనగా కవిత్వంలేకుంటే అధర్మంకాదు, మరణంలేదు, దండన విధింపబడదు. ఇలాంటి సందర్భంలో అకవిత్వం అయినదానిని కవిత్వంగా భాసింపచేసి లోకవంచన చేయడం ఎందుకు? అన్నాడు. ఇందుకు చమత్కారంగా ఓక పండితుడు— నా కవిత్వం అనేదానికి తెలుగు అర్థం చెప్పి నేను వ్రాసిన కవిత్వం—మరణాన్నికాని, అధర్మాన్నికాని, దండనాన్నికాని ఇప్పిస్తుంది అన్నాడు. వ్యాఖ్యాన చమత్కారం ఇది.

అయితే కలగలుపు పాలు మ్యునిసిపాలిటీవారు పట్టుకుంటే శిక్షిస్తారు. ఇది దండనే. మేకపాలు తెచ్చి ఆవుపాలని అమ్మితే అధర్మమే. అలాగని ఏపాలు దొరికితే ఆపాలు— అనగా—పుర్రిపాలు, పిండిపాలు, పాలగుండ పాలు పిల్లలకు పడితే మరణమే కలుగుతుంది. కాబట్టి అధర్మం, మృతి, దండన మూడూ సిద్ధిస్తాయి, ఇదీ ఒకవిధమైన సాహిత్యమే.

అయితే- ఇది 'నా' కవిత్వం అంటే— 'నా' అహం పదార్థం, గనుక అహంభావ కవిత్వమనీ, అందులో ఏకదేశమైన భావకవిత్వమనీ, కొందరంటున్నారు. వారు పండితులు, మహానుభావులూను, ఏమన్నా సరసంగా అనగలరు, సమరసంగా స్థాపింపగలరు: వారి దయ. ఇక సత్యమా? అసత్యమా? అని విచారించడానికి తాహతు ఉన్నవాడేడీ?

ప్రతిదినమూ చూస్తూవున్న స్థూలరూపకమైన ఈపాంచభౌతిక ప్రపంచమే మిథ్య అనీ, భ్రాంతి అనీ, పరమార్థం కాదనీ నిర్ణయింపగలిగిన వారేమి చేయలేరు?

సరేలేకాని— సాహిత్యంలో వుండవలసిన గుణాలేమిటి? అమృతత్వం, అమరత్వం, ఒక మహాకావ్యం ఉదయించిందంటే చీకటిని పోగొడుతుంది, ఆనందాబ్ధి పొంగిపొర్లుతుంది. నక్షత్రాలెన్నైనా ఎందుకుపనికివస్తాయి—

"ఏకశ్చంద్రః తమోహంతి—
నచ తారా గణోపిచ—"

అని కాళిదాసన్నట్లు క్రిందు మీదౌతుంది. ఒక జాతి విజ్ఞాన సంపత్తు ఒకానొకప్పుడు సరస్వతి అంతర్వాహిని అయినట్లే—భూమిలోని నిధుల్లాగ అదృశ్యమైపోతుంది. ఒక భావుకుడు అంటాడు—

"నాకవిత్వం నక్షత్రంలా వుందన్నారు. నిజమే. సూర్యుడు ప్రకాశిస్తున్నాడుకదా ! సూర్యునికంటె కొన్ని రెట్లు గొప్పది ఈ నక్షత్రం. మీకు చాలా దూరంకావడం వల్ల అలా కనిపిస్తుంది. నాకవిత్వంమీదకూడా సానుభూతి వుంటే— దగ్గరవుతే తెలుస్తుంది, అన్నాడు. కావచ్చును.

ఈ విచారణకంతులేదు. కవిత్వం విషయంలో సాహిత్యం సత్తా తెలుసుకోవాలంటే ఎవరికివారే ప్రమాణం.

## నేటి సాహిత్యం

మా పూరుదగ్గర పదకలపూడి వుంది. అందులో వాళ్ళకి మా బొమ్మలాట బ్రహ్మయ్య రచనలు చాలా గొప్పవి. మా తాతయ్యగారు నైషధమే మహాకావ్యం అంటారు. అయితే ఇది 'విద్వదౌషధం' దీన్ని అప్పష ధంలాగ మ్రింగేవాడు మా తమ్ముడు. మన తెలుగు వాఙ్మయంలో సొగసేముంది? షేక్స్పియరు, మిల్టను వ్రాస్తే ఎలావుంటుంది? వాళ్ళది భావనా ప్రపంచం. అందులో అంతా స్వతంత్రమే, అన్నాడు ఒక నవీనపండితుడు.

ఇక నేటి సాహిత్యానికి విలువ కట్టమన్నారు. నా తరమా? సముద్రానికి లోతుచెప్పేవారెవరు? ఒకచోట మోకాలుబంటి, మరోచోట ఏనుగుముంపు, ఇంకోచోట పాతాళలోకంలో పరుగులెత్తుతూవున్న పిల్లపడుచుల పాపట రత్నాల కాంతులు ప్రసరిస్తూ వుంటాయి. కొలిచేవారెవరు?

సాహిత్యం అఖండం. నేడేమిటి- నాడేమిటి, ఉద్దేశ మేమిటి?

మీరందరూ చదువుకుని ఎవరిపట్టుకు వారు ఆనం దించండి- ఇదే సాహిత్యం తాలూకు సొగసు!

★

# పెండ్లా?.... బేరమా??

* శ్రీమతి ఎస్. వరలక్ష్మీ దామోదరం *

తెల తెల వారుతూవుంది. కోళ్ళుకూస్తున్నాయి. కాని నాకెప్పుడు ప్రొద్దునలేచే అలవాటులేదు. మాచెల్లి నన్నొచ్చి లేపడానికి మొదలెట్టింది. నాకు లేవడానికి బద్ధకమేసింది. మరీ మా చెల్లిమీద కోపం వచ్చింది. లేవడానికి తెలుసు పొమ్మన్నాను. "అమ్మ లేపమంటూ వుంది. ఇహ నాకు తెలీదు. లేస్తే లేచుకో, లేకుంటే పో అనేసి మాచెల్లి పరుగెత్తింది. ఇహ మా నాన్నగారు కూడా "శాంతా"అన్నారు. "ఇదేమిటా యెన్నడూలేక ఈదినం అందరూ నన్ను లేపుతున్నారు అనుకుంటూ విసుగ్గా లేచి లోపలి కెళ్ళాను..

మాఅమ్మ నన్ను పలుతోముకొని, స్నానంచేసి మంచి చీర కట్టుకోమన్నది. ఎవ్వరో పెళ్ళివారు వస్తారట. అది మానాన్నగారికి కూడ నిన్న రాత్రే తెలుసట— నాకేం పెండ్లంటే అంత విముఖభావమేమీలేదు. ఏదో అందంగా తయారు కావాలనేవుంది; కానీ సాధారణంగా కనుపించాలి అనుకొని స్నానంచేసి ఒక్క కాటన్ ప్రింట్ చీర కట్టుకొని, నాగదిలో కూర్చున్నాను. నా లెసన్స్ యేదీ చదువ బుద్ధికాలేదు. మేగజైన్సు తిరుగేస్తూ కూర్చొన్నా.

ఇంట్లో నౌకరులు వస్తువులన్ని సర్దారు: మాసిన టేబిల్ క్లాత్సు తీసేసి క్రొత్తవి పర్చారు. ఫ్లవర్ వేసెస్ పెట్టారు. ఇవన్నీ చేస్తున్నారని తెలుసు కాని యేదీనాకు తెలవనట్లు కూర్చున్నా. ఏడుమున్నావై యుంటుంది. ఒక్క కార్ మాయింటి ముందాగింది. ఇద్దఱు మగవాళ్ళు-ఒక్కనల్లభై యేండ్లావిడ దిగారు. ఆమేమో తిన్నగా మా అమ్మ దగ్గరి కెళ్ళింది. వాండ్లకందరికి కాఫీలు మర్యాదలు గొప్పగా జరుగుతూవుంది. మాఅమ్మ నన్నుపిలిచింది. 'ఏమమ్మా' అంటూ యేదీనాకు తెలవ నట్లుగా లోపలికెళ్ళాను. "ఇదేనమ్మా నాకూతురు ఈ సంవత్సరం ఇంటర్ ఫస్ట్-ఇయర్" ఐయింది" అన్నది మా అమ్మ. "నమస్తే" అన్నాను.

వారిలో ఒకడు పెండ్లికొడుకట. ఇంకో అతనతని తండ్రట. మానాన్నగారు వాళ్ళకుక్కడ నన్ను పరిచయం చేసారు. అప్పుడు మాత్రం యేదో సిగ్గుగా వుండింది. ఎట్లో తప్పుకొన్నాను.

వరకట్నం- పదహైదువేలట, పెండ్లికొడుకు యమ్. బి.కంప్లీట్ చేసాడు కాబట్టి. మేమేమో డాంబికంగా కనిపిస్తాంగానీ మానాన్నగారేమో అంత ధనవంతులుకారు. పదివేలవరకు బేరం జరిగినట్లుంది. మిగతా నాకు తెలీదు.

రాత్రి 9½గంట ఐనది. వచ్చిన వారంతా సాగిపోయారు. డాబాపై పడుకొన్నా. వెంటనే నిద్రాదేవి మోహించింది. కానీ గాలిలేదు. ఈఘనుల్లో ఫేన్ఐనా నా పక్కకు ప్రక్క తెచ్చి పెడ్డానికి మరచి పొయ్యారు.దాహం వేస్తూవుంది. లేచి ఫేన్ పెట్టుకొని పడుకొన్నా. మరీ ఆనాడు పున్నమ వెన్నెల. నిదురపోనీలేదు. మబ్బు అప్పుడప్పుడు చంద్రుని కప్పుతూవుంది. ఏదో అందంగావుంది చంద్రునికి. అక్కడక్కడ వొక్కొ నక్షత్రం మెరుస్తూవుంది. నాకేమో నిద్ర పట్టలేదు. నాకొచ్చిన సంబంధాలను గూర్చిన విషయాలన్నీ బుఱ్ఱలో కొస్తున్నాయ్.

పెండ్లి కొడుకేమో అంత బాగాలేడు. సామచాయగా వున్నాడు కానీ మంచి బలశాలి. ఏమైతేనేం. కట్నం 15 వేలట. ఇహ పెండ్లి కర్చులూ, ఇవీ అవీ 10 వేలు. మొత్తం 25 వేలా? యేమంటే యమ్.బి. చేసాడట. యమ్.బి. చెయ్యడానికి మించి పెట్టితే 8 వేలు పట్టదే.—దానికి రెట్టింపు పిల్లింటి వాళ్ళు పెట్టాలా? డిగ్రీకి తగ్గట్లు కట్నం. యేదో గ్రాడ్యుయేట్ అయితే 8 వేలో 9 వేలో డబ్బు! లేకుంటే అసలు మాకు డబ్బు లేదు. డబ్బిచ్చి పిల్లనిచ్చు కోండి అని చెప్పరాదూ? ఈ డాబుసరి ఎందుకు?

వీళ్ళకు డిగ్రీవుంటే మరి మాకొచ్చే గౌరవ మేమిటి? ఆ డిగ్రీ నాకే వుంటే నాకింకా యెంతో గౌరవం, నాదీ సెకండ్ గ్రూపే.

ఇంకా 7 వేల రూపాయలు ఖర్చుపెట్టానా. లక్షణంగా యం. బి. బి. ఎస్., బిరుదు వస్తుంది. అప్పుడు వాండ్లు నాకు కట్నమేమిస్తారో! అదీ యిస్తారే? పోని, ఇద్దరికీ డిగ్రీలున్నాయి కాబట్టి ఒకళ్ళ కొకరు కట్నాలిచ్చుకో పనిలేదు అంటామన్నా అదీలేదు. అప్పటికూడా పిల్లింటి వాళ్ళు కట్నమే యిచ్చుకోవాలి. అంతా చూడబోతే యేమీలేదు—వాళ్ళకు డబ్బుకావాలి—అంతే!

పూర్వం ఆడపిల్లలకి కట్నమిచ్చి పెళ్ళిచేసుకొనే వారట—కాలం అడ్డం తిరిగిందట—అందుకని పెళ్లి కొడుక్కి కట్నమిచ్చుకోవాలట. బలేవుంది. అట్లే యిచ్చుకొంటాం. ముందేమో పెళ్ళి కూతుళ్లు అత్త వారింటికి వెళ్ళేవారు. కాలం అడ్డం తిరిగింది. వాళ్ళ మాయింటికిరానీ : మాఅమ్మ నాన్నదగ్గర పనులు చేయనీ; పూర్వం ఆడపిల్లలు అత్తమామలకు సేవ చేసుకొన్నట్లు? మేము గ్రేన్డ్‌గా కుర్చీలమీద కూర్చుంటాం.

ఇప్పుడొచ్చి నాతను యింకో యింటికి కూడా వెళ్ళాడట. ఆ అమ్మాయి ఎస్.ఎస్.ఎల్.సి. పాస్‌చేసిందట వాళ్ళ నాన్నేమో 12 వేలనటకు బేరమాడాడట. కానీ లాభం లేక పోయిందట అసలు వీళ్ళు పెళ్ళిచేసుకోవడం పిల్లనా? లేకడబ్బునా? పరిస్థితులు. గౌరవ మర్యాదలు మాట్టంలో అర్థముంది గానీ డబ్బడగటంలో యేమైనా అర్థముందా? అసలు బోలెడంత కట్నమిస్తే యేమి తెలీని దద్దమ్మ నన్నా పెళ్ళి చేసుకొంటారు, ఆమె "నాభార్య" అని తన స్నేహితుల కెట్లా పరిచయం చేసుకుంటారో? కట్నాలు బోలెడంతఅడగటం- పిల్లింటి వాళ్ల బేరమాడ్డం—బలెతమాషాగా వుంది !

ఇంకా యేవేవో బలే తమాషాగా నాబుఱ్ఱలో తిరుగుతూన్నాయి. గంట మూడు కొట్టింది. చల్లటి గాలి ఫేన్ అఫ్ చేసాను. నాకళ్లు తనంతటకవే మూసుకు పోయినాయి.

★

# సూర్యాస్తమయం

మూలం: శాంతా రంగాచార్



అనువాదం: శ్రీమతి కొత్తపల్లి లలిత

[వెనుకటి గాథ :—సంఘం దృష్టిలో పతితగా పరిగణింపబడుతోన్నవ్యక్తి మనోరమ- 'అతని'కీ మనోరమకీ ఎక్కువగా సాంగత్యముంది. అతను పేరుమోసిన రచయిత. మనోరమ బుద్ధిహీనురాలనీ, మెత్తనిదనీ, పరభృత అనీ అనుకుంటూ ఆమెను అతను పీడిస్తూండడం అలవాటై పోయింది. తనే దయదల్చకపోతే, ఆమె అంతటి పెద్దభవనంలో, అంతటి ఆదాయంతో నివసిస్తూండేదికాదని అతని నమ్మకం. మనోరమ- మొదటి ప్రణయంతాలూకు చిహ్నం- ఆపిల్ల.... 'అతని'కి భయపడి ఇన్నాళ్ళూ సుశీలను ఇంట్లో దాస్తూ వచ్చిందేమోకాని ఒకనాడు రహస్యం బయట పడకపోలేదు. ఇద్దరిమధ్యా విపరీతమైన వాదోపవాదాలు జరిగాయి. తత్పర్యవసానంగా సుశీలను తండ్రి దగ్గరికే పంపించివేసింది మనోరమ.

........ఎల్లాగో ఏడేళ్ళూ గడిచాయి- మనోరమకు తీవ్రమైన క్షయరోగ మాసన్నమై మృత్యుముఖంలోవుంది. యౌవ్వనపు తొడుగుళ్ళలోవున్న సుశీలవచ్చి, తల్లి పరిస్థితిజూసి కొయ్యబారిపోయింది. ఆ అర్ధరాత్రిని మనోరమని మృత్యుదేవత తన ఒడిలో పెట్టుకుంది............... మనోరమ పోయాక ఆయిల్లు సుశీల దయ్యింది, ఏదో లైబ్రేరియన్ ఉద్యోగంకోసం ప్రయత్నిస్తూంది, జీవితంలో సుశీలకుండే నమ్మకాలు సుశీలకున్నాయి. గాంభీర్యం. చిలిపిదనం, నవయౌవ్వనం, ఆమె ఆభరణాలు. తన తల్లిని బుడదలా చూశాడన్న కసికొద్దీ అతనంటే మండిపోతూ వుంటుంది, సుశీల. వారిద్దరికీ తీవ్రమైన వాక్సంఘర్షణాలు జరగడం కద్దు. కాని అతను మాత్రం సుశీలంటే పట్టుకు వేళ్ళాడుతున్నాడు, ఎందుకో ? !........ ఇహ చదవండి.]

అచ్చయిన నాపుస్తకం ఆమెకు శాంతి సమర్పణం. అమ్మకం బాగానేవుంది. సామాన్యమైన విమర్శకులు కొంత పొగడ్డం, ముఖ్యమైన విమర్శకులు కొంత ఎగతాళి చేయడం మామూలుపద్ధతిలో నడిచింది. మూడురోజుల తర్వాతనే సుశీలను చూడటానికి వెళ్ళాను. ఆమె సోత్సాహంగా వుండి నాకు సుస్వాగతం ఇచ్చి స్నేహపాత్రంగా మాట్లాడింది. నా పుస్తకం పేరుమాత్రం ఎత్తలేదు. నేనుకూడా కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడి ఇక వుండబట్టలేక బల్లమీద వున్న పుస్తకంవేపు చూపుతూ, 'దాన్ని గూర్చి నువ్వేమీ చెప్పలేదే?' అన్నాను.

'అదా? దానికే. మామూలు ప్రమాణాలకు తీసిపోదు'

'ఓహో! అంటే అది నీ ప్రమాణాన్ని అందుకోలేదంటావు'

'నాకు అందులో కథానాయకుడు నచ్చాడు. చాలా తమాషాగా వున్నాడు గదూ!'

'అతడు తమాషాగా వుండాలని వ్రాయలేదు'

'ఆహా! అయితే అతనెందు కావిధంగా పేలవంగా బుద్ధిమాలినతనంతో ప్రవర్తిస్తాడు? వాస్తవిక పరిస్థితుల్ని ఎదుర్కోడానికెందుకు వెనకబడ్తాడూ?'

'నువ్వు విమర్శనలు చదువుతున్నావు.' అన్నా కొంచం కోపంతో.

'నే నెప్పుడూ విమర్శనలు చదవను. నాకు అవి చదవ వలసినంత గత్యంతర మేమాత్రం లేదు. నా అభిప్రాయాలు నేను మార్చుకోగలను. నాయందు మీకున్న అభిప్రాయా నికి కృతజ్ఞత'

'అయితే ఈ పుస్తకం చెత్త అంటావా?'

'ఊహూ ! Second-rate!'

ఒక్కసారి ఆమెను సాభిప్రాయంగా గణించాను.

'నీకింకా దెబ్బలుతినే వయస్సు దాటిపోలేదని తెలుసా? నీచేత ఈ విధంగా అవమానాల్ని ఎందుకు భరించాలీ?'

'Don't you'

'నేను ఎవ్వరికీ ఏమీ ఇవ్వలేని వాణ్ణి అన్నావు. నువ్వు కూడా అదే జాతికి చెందిన దానివని తెలుసుకొంటే మంచిది.'

'Oh you fool' అంది ఆగ్రహంతో. 'స్త్రీలను గూర్చి మీకేమీ తెలియదు. మళ్ళీ వాళ్ళనిగూర్చి వ్రాయ డానికి సాహసిస్తారు. మీకు అభివందనాలు కావాలంటే అవి నాదగ్గరనుండి రావు. మా అమ్మ పెంచిపెట్టినంత సుళువుగా నేను పొగడ్తల్ని పెంచి పెట్టేదాన్ని కాదు. ఆమె గౌరవించింది. పొగిడింది. మీ కాళ్లదగ్గర దాసిలా నిలిచింది; మీ అనుగ్రహాలకోసం...... అతి సామాన్య... సామాన్య............'

'ఊఁ. కానియ్. చెప్పదల్చుకుందేదో పూర్తిచేయ్. నువ్వనబోయేది ఏమిటో నాకూ తెలుసులే. అవును మనో రమ సామాన్య వేశ్య ! కనీసం ఆమెలో ఆడవాళ్ళలోవుండే లక్షణాలన్నీ వున్నాయి. మనోరమ స్త్రీ !'

'ఆ. చివరికి మీరది అంటారని నాకూ తెలుసు.' అంది సుశీల విజయం పొందినట్లు. అవును. ఆమెలో స్త్రీత్వం వుంది. ఆమె మిమ్మల్ని బుజ్జగించింది, పొగిడింది, దేవునిలా పూజించింది. అలా గద్దెమీద దైవంలా కూర్చొని క్రిందికి చూడ్డం మీకు చాలా ప్రియమైన కార్యం కదూ? మీకా పాత్రధారణ ఎంతో శక్తివంతులనే భావం కల్పిస్తుంది. తనంతట తాను వచ్చేది. ప్రజలచే గౌరవింపబడే ఏదో ఘనత మీలో వుంటే బాగుండేది. కాని ఆధిక్యంలేని మీకు, ఆమె అలా ఆరాధించడం, లేని ఆధిక్యాన్ని తెచ్చిపెట్టిన దానివలన వచ్చే అధికార పదవిని మీకు ఇచ్చింది. మీకు కావలసింది అదే! విగ్రహంలా వుండి ధూపవాసనలతో ఊపిరితిత్తులను నింపుకొంటూ తృప్తిపడినారు. నేను మిమ్మల్ని ఆ దేవపదవిలో వుంచను. నామట్టుకి మీరు అందరిలా భూమ్మీదేవున్నారు. అవిగో మీకాళ్ళు-ధూళిదూసరితాలు!'

'Clever' అన్నాను ఈసడిస్తూ. 'నువ్వు సాహిత్య రంగంలో ప్రవేశించడంవలన నాట్యరంగానికి తీరనిలోటు ఏర్పడింది. అపూర్వమైన విషాదనాయికామణివి !'

'అది సరేగాని. మీరు పెళ్ళెందుకు చేసుకోలేదూ? నాకు ముందది చెప్పండి'

'బాగుంది. నువ్వు మీ అమ్మకి అచ్చం కూతురివే! ఇదే ప్రశ్న ఒకప్పుడు మీ అమ్మ వేసింది. పెళ్ళిచేసుకుంటే ఆ స్త్రీవలన నాపనికి అంతరాయం వస్తుందని నేను పెళ్ళి చేసుకోలేదు'... అని అబద్ధం, నేను చెబుతాను. అసలు కారణం. You are afraid. మీకంటే నైతికంగానూ బుద్ధిబలంతోనూ అధికమైన స్త్రీతో యావజ్జీవం కట్టుబడి వుండవలసివస్తుందని భయపడినారు. మీ ఈసడింపునకు అర్హమైన వాళ్ళకి తప్ప అంతకంటే అధికమైన ప్రజ్ఞగలవాళ్ళకి ఏదీ ఇయ్యగల శక్తిసామర్థ్యాలు ఉన్నంత మీలోలేవు. మీ డిగ్రీని నిలుపుకోడానికి మీకు పొగడ్త జోహార్లు అనవ సరం. మట్టితో పోల్చుకొంటేనేగానీ మిమ్మల్ని మీరు అభినందించుకోలేరు. You can't share. పంచుకోడం అంటే సమానత్వం. సమానత్వం అంటే మీ అహం ప్రత్య యానికి విశిష్టత లేకపోవడం. అందుకనే పెళ్ళి చేసుకోలేక పోవడం. మీకంటే నైతికంగానూ మానసికంగానూ తక్కువ అంతరువులోవున్న స్త్రీనిగాని మీరు ప్రేమించ లేరు. అందుకనే మీరీ వూరులోని వంకరటింకర ఇరుకు సందుల్లో— అలాంటి వారికోసరం— తచ్చాడుతారు. వాళ్ళని ఉపయోగించుకొని తరువాత తోసి పారవేయ వచ్చును. అందుకనే మీరే ఉద్గ్రంథం వ్రాయలేకపోయారు. You cannot. మీలో ఒక లోపం ఏర్పడింది. అది మీ ఆత్మయొక్క Perversion'

'Well' ఆ లజ్జావిహీనమైన విషపు ప్రసంగానికి మండి

ప్రస్తూ...! 'దీంతో అంతా నిర్ణయం అయింది. ఒకటి రెండు రోజుల్లో ఈవూరు విడిచిపోతున్నా. ఇదే Good bye' అన్నాను.

'This is so sudden'... తెల్లబోయింది సుశీల. 'వెళ్ళిపోవటం లేదుగదూ, నిజంగానే?' సుశీల కంఠం వణికింది.

'ఇప్పుడే అది నిశ్చయించుకొన్నా. కొంతకాలం నుంచీ ఈ విషయమే మనస్సులో మెదులుతోంది. నేను వెళ్ళిపోతున్నాను శాశ్వతంగా. ఏం ఎందుకు వెళ్ళిపోను. నన్నిక్కడ కట్టివుంచేది ఏముందిగనుక? ఏసావాసాలు స్నేహితులూ లేవు. నేను Sefite అవడానికి ఏదైనా స్థలం చూసుకోవలసిన కాలం వచ్చింది. ఏం చెప్పగలం! నేను పెళ్ళికూడా చేసుకొని నువ్వన్న- నా ఆత్మవంకరని— తీర్చుకోవచ్చును' అన్నాను తేలికగా.

సుశీల చిన్న నవ్వునవ్వింది.

'దానివిషయంలో నాకు సందేహం లేకపోలేదు. మీ రెక్కడో మళ్ళీ మా అమ్మవంటి స్త్రీని సంపాదించుకొని ఆమెతో మీరు నిర్మించుకున్న స్వర్గంలో క్షేమంగా భద్రంగా ఉండగలరని మాత్రం చెప్పగలను, నాకు తెలుసు.'

'ఆహా! ఆమె ఎవ్వరో నీకు తెలిసినట్లు మాట్లాడేవే! సుశీలా.' అన్నాను బలవంతాన్ని మర్యాద మాటల్లోకి తెచ్చిపెడుతూ.

'ఏదయినా. Where do you come in your life?' అన్నాను.

'కొందరి జీవితాలు ఎన్నటికి కలియవు. జీవితమంతా పక్కపక్కగా పయనం చేసినా కలిసే చోటంటూ ఉండదు!'

'నువ్వా నేనా? నిన్ను నాతలుపుదగ్గర ఒకనాడు కనుక్కొన్నానన్న విషయం మర్చిపోయావు.'

'మీరు నిజంగానే వెళ్ళిపోతున్నారా?' అంది సుశీల చిన్నగానే లేవడంచూసి.

'అవును' అన్నాను జంకూగొంకూ లేకుండా. 'పోనీ వెళ్ళేముందు దీపం వెలిగించి పోనా! అప్పుడే చీకటి పడుతోంది'

'నన్నుగురించి క్లేశపడవద్దు- నాకు చీకటంటే భయం లేదు. రాత్రిపోతుంది. ఉదయం అవుతుంది. మానసపథం నక్షత్రమార్గాన్నే వుంది. సాహసికులకే స్వర్గం.' అంది తొణకని కంఠస్వనితో సుశీల...........

* * *

సుఖంగా, తృప్తిగా మూడేళ్ళు ఇక్కడా అక్కడా తిరిగిన తర్వాత సుశీల జ్ఞాపకం వచ్చింది. ఏం చేస్తోందో? పెళ్ళి చేసుకొందా? పిల్లతల్లి అయిందా? స్కూల్ టీచరా? ఆమెనుచూసి మళ్ళీ స్నేహం చేసుకోవాలనిపించింది... నాకప్పుడు యాభై నిండింది. ఆమెకింకా ఏమీ బంధనాలు లేకపోతే, నాదగ్గరే కూతురులా వుండవచ్చును. ఆవూళ్ళో అదే ఇంట్లోకి వెళ్ళాను. అక్కడలేదు... కొత్తవాళ్ళెవరో వున్నారు. ఆశ్చర్యం వేసింది. మనోరమ కూతురు ఎక్కడుంటుందీ? అని అక్కడెందర్నో అడిగి కనుక్కొన్నా. ఆఖరికి ఎదురింటిలో వృద్ధుడు చెప్పాడు. ఊరికి ఇంకోవేపునకు వెళ్ళింది. ఈ వెధవ వీధిలోంచి ఇంకో వీధిలోకి వెళ్ళింది! దీనివలన ఆమె జీవితంకూడా మంచి దారిలోనే నడుస్తోందన్న మాటే. ఆ ఇల్లు చేరాలంటే మూడు మైళ్ళు నడిచి వెళ్ళాలి. అకస్మాత్తుగా నాకు నిస్పృహ నిరాశ ముంచుకొచ్చినై. ఎందుకీ పాతపరిచయాల్ని రేపడం? ఆఖరికి మనోరమ సాహచర్యానుభూతులుకూడా మనస్సులో మసక బారినది. సుశీలతో ఆఖరి దెబ్బలాట, అప్పుడామె అన్న వాక్యాలు, ఆసంభాషణలో ఆ ముఖవైఖరికీ అన్నీ క్షణమాత్రంగా కళ్ళకట్టినవి. ఈ భావసముచ్చయముతో మునిగి తేలుతూ నడుస్తూ ఆ ఇంటి ముందు అప్రయత్నంగా ఆగిపోయాను. చీకటిలో ఆ ఇరుకుసందు మరీ ఇరుగ్గా వుంది. ఈ ఇల్లేనా? అనవసరమైన డాబుసరిగా వుంది- ఆ రంగు గంగు తెరగుడ్డలతో- అయినా సరే—తలుపు తట్టాను. ఎవరిదో స్త్రీ కంఠం 'రండి' అని జవాబు ఇవ్వగానే కొద్దిగా వెలుతురు పడుతున్న ఆగదిలోకి వెళ్ళాను. చిన్నకిటికీ... సరిగ్గా దాని క్రిందే మంచం... చేతులు రెండూ పైకెత్తి తలలో పువ్వులు పెట్టుకొనే అపూర్వ భంగిమలో వుందొక స్త్రీ మూర్తి... మంచంమీది చిన్న అద్దంలోకి కళ్ళు చిట్లించుకుంటూ ప్రతిబింబాన్ని ఓరగా చూసుకుంటోందామె. గడపలోపలికి

వెళ్ళి తలుపు మూయగానే ఆమె నావైపుకు తిరిగి చూసింది. ముఖం జేవురించింది. చెవులకీ చేతులకీ వున్న ఆభరణాలు తళుక్కుమన్నాయి. పెన్సిలు గీతవంటి కను బొమ్మల్లోకి ప్రాణం వచ్చింది. ఆమె ప్రదర్శిస్తున్న పెదవ నవ్వులో ఆహ్వాన తరంగాల్లేవు. పమిట ఆమె వక్షస్థలాన్ని అంటీ అంటనట్టుంది. గదిలో గాలిలేదు. రకరకాలైన సెంట్ల వాసనతో ఉక్కిరి బిక్కిరిగా వుంది. అవును... జ్ఞాపకం వచ్చింది... ఇదేవ్వూళ్ళో ఇదే ప్రకారంగా ఒక ఇంట్లో తలుపు తీశాను. అప్పుడక్కడ మనోరమ- ఇప్పు డిక్కడ సుశీల !......

'సుశీలా, నిజంగా నువ్వేనా ?'

'ఆ మీరా, వచ్చారా ?'

ఇంతకు మించి ఒక్కమాటేనా మాట్లాడలేదు. సంగీతం దొంతర్లు కట్టుక ప్రవహించింది... మరుక్షణంలో సుశీల నాపక్క నిల్చింది.

'ఉహూ. ఇక్కడుండవద్దు... ఒక్కక్షణమేనా వుండ వద్దు... ఊ. వెళ్ళండి... వెళ్ళరూ?' తొందర చేయబో యింది.

'ఊహూ !'...

'వెళ్ళరూ?'...

'వెళ్ళను'—

'అయ్యో ! మీరిక్కడుండవద్దంటే వినరూ? దయచేసి వెళ్ళండి ఊ.'

'సుశీలా నేను వెళ్ళనంటే వెళ్ళను తెలిసిందా?'

ఆమె తలుపుతీసి నన్ను బయటకు త్రోసెయ్యాబోయింది. నేను బలవంతాన్ని ఆమె చేతులు పట్టుకొని ఎదుర్కొన్నా. ఈ సంఘర్షణకు ఆమె చేతుగాజులు ఫెళ్ళు మన్నాయి. రక్తపు చారికలు నాచేతిమీదికి జారినయి. సుశీల వెక్కి వెక్కి ఏడుస్తూ గోడమీదికి వొరిగిపోయింది. పశుత్వం పడగలెత్తింది. నన్ను నే మర్చిపోయాను. సుశీలను బలవం తాన్ని నా చేతుల్లోకి లాక్కొన్నాను. ........

సాయంసంధ్య వెలుగు కడసారిగా కిటికీలోంచి వస్తూ సుశీలముఖాన్ని వెలుగులోకి తీసుకొచ్చింది. ఆ అవస్థలో ఆమె పతనం చెందిన స్థితిలో—సుశీల కళ్ళల్లో అత్యంత ప్రశాంతమైన విజయరేఖలు తాండవం చేస్తున్నాయి. నాకు అర్థమయింది. ........

మళ్ళీ నేనెన్నడూ నవల వ్రాయలేదు. .........

(సమాప్తం)



# క్షమాపణ

* శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు *

(పల్నాటి సోదరకవులు)

ఏ యపరాధి పూర్వము సహింపక నిన్నొక కీలుబొమ్మగాఁ జేయఁ దలంచి గంటమును జేకొని వాకొని తాటియాకుపై మాయలఁ జేర్చి పేర్చి నడమంత్రపు శాసనమల్లి నీ మన స్థాయి హరించెనో తెలియదాయె గదా జననీ ! ప్రవాసినీ !

వంచక చక్రవర్తి యిటు వ్రాసెనటంచు రవంతయైన గు ర్తించక తత్ప్రధంబునఁ జరించితి మిప్పటిదాక, ఐన మా మంచినిఁ గోరుచుండెడి యమాయకురాలవు కాలమెంతయో మించె గ్రహించికొంటిమి- క్షమించుముతల్లి దయామయా త్మవై !

ఈ యవమానమెట్లు భరియించితివో? భయమందియెంతవా పోయి నిరాశఁజెంది పడిపోయితివో? హృదయమ్ముఁ జీల్చు- ఈ గాయము పెచ్చరిల్లు నెడగల్గు నపాయము-పారఁజూచి య మ్మా ! యిఁకనైన మాన్పికొనుమా ! జగముఙ దరి యింప దీక్షతో

ఓపికదాల్చి నిల్చి యెదియుంబదులాడని నిన్ను దాసిగా రాపిడి చేసి చేసి యపరాధులమైతిమి- మాత ! యీ మహా పాపము కొండయై పెరిగి బ్రద్దలుగాఁదెగఁ బ్రేలి దుర్ధ్వనిఙ మాపయి దూఁకియున్నది - క్షమాపణలంది తొలంగఁ దీయుమా !



# బాలానందం

## అమ్మమ్మ ట్రెయినింగ్

* శ్రీమతి లంక అమృతాంబ *

మా తమ్ముడి కెందుకో
మా అమ్మమ్మంటే ప్రేమ
దానికి తోడు వాడికి లెక్కలో,
ఆవిడ ఎంతో బాగా
చదువు కున్నది- తెలివిగలది
ఏదైనా కావలసొచ్చినా
గనుక, ఏమైనా తెలియకపోయినా
ఆవిడ దగ్గరకు పోతాడు
అన్నీ పూర్తిగ అడుగుతాడు
చెప్పినవన్నీ వింటాడు

ఒక రోజున మావాడు
బడి నుండి గెంతుతువచ్చి
అమ్మమ్మ దగ్గర చేరి
"నీవు చెప్పిందమ్మమ్మా
బడిలో చెప్పేశా" నన్నాడు.
"ఏమిటిరా అదం'టూ !"
అడిగితేను మా అమ్మమ్మ—
"మేష్టరు తిన్నగ లేచి
'రెండో పానిపట్టు యుద్ధం
ఎప్పుడు జరిగించ'న్నారు,
వెంటనే లేచి నేను
మొదటి పానిపట్టు
యుద్ధం తర్వాతన్నాను—
గోలగా పిల్లలు నవ్వారు—
నేనూ చక్కగ నవ్వాను—
పిల్లల్ని నన్ను జూచి,
మాష్టరు చిన్నగ నవ్వారు-
ఎంచక్కా ఉందిగా
జవాబంటూ" వాడునవ్వుతే
అమ్మమ్మ ట్రెయినింగు
తల్చుకు నే నవ్వాను—



ఆంధ్రమహిళ

ఇకనుంచి ప్రతినెలా—పత్రిక, ఒకటో తేదీ
నాటికే పాఠకుల కందజేయబడుతుంది

—సం॥

# సూర్యుడుదయించడేం!

* శ్రీమతి కె. యస్. లక్ష్మి *

త్రిచినాపల్లి కావేరీనది ఒడ్డున ఉంది. చాలాకాలంగా త్రిచినాపల్లి రాజధానిగా జేసుకొని ఒకరాజు రాజ్యం పాలిస్తున్నాడు. ఒకనాడు రాజు తన మంత్రితో నది ఒడ్డున చల్లగాలిలో విహారం చేస్తున్నాడు. కావేరీనది పశ్చిమంనుంచి తూర్పుగా ప్రవహిస్తూంది. చెంగు చెంగున గంతులువేస్తూ హాయిగా సంగీతం పాడుతూ, చల్లగా పరుగులు తీస్తున్న నదిని చూచేవరకు రాజుగారి హృదయ కుహరంలో చెప్పరాని ఆవేదన ఆరంభమయింది. "తూర్పున ఏదేశముంది?" అని అడిగాడు మంత్రిని. "తూర్పున తంజాఊరు జిల్లా ఉంది" అని బదులు చెప్పాడు మంత్రి. మంత్రి సమాధానం వినేవరకు రాజుగారికి కోపంతో నొసలు ముడిపడ్డాయి. "మన నదియొక్క నీటితో తంజా ఊరు ప్రజలు లాభాన్ని పొందుతున్నారు. ఇది సరిగా లేదు. నేటినుండి అలా జరుగుటకు వీలులేదు. నేడే నదికి అడ్డుకట్ట నిర్మించి నదీప్రవాహం నిలుపుచెయ్యి. ఒక్క బొట్టుకూడా బయటకు పోరాదు. తెలిసిందా?" అంటూ కఠోరంగా శాసించాడు. రాజుగారు కోపభరితుడై ఉండటం గ్రహించి మంత్రి ఏమిచెప్పినా ప్రయోజనంలేదని ఊహించి "సరే" అన్నాడు.

దేశాన్ని పాలించేరాజు ఆయన ఆజ్ఞకు తిరుగేమిటి? రాజాజ్ఞానుసారం మరునాడే కావేరీనదికి అడ్డుగా కట్ట తయారయింది. ప్రవాహం నిలిచిపోయింది. నది నిండింది. నది గట్లులనుంచి పొంగి పొర్ల నారంభించింది. నీరు గట్టులమీంచి పొర్లి పట్టణంలో ప్రవహింపసాగింది. సాయంత్రం అవుతూంది. తమాము పట్టణం నీటితో నిండ సాగింది. వీధులలో నీరు, ఇండ్లలో నీరు, అంగళ్ళలో నీరు, మేడలలో నీరు, మిద్దెలలో నీరు, ఎక్కడచూచినా నీరే! అంతా నీటిమయం అయిపోయింది. ఎక్కడా జానెడు నేల తడవకుండాలేదు. పట్నం అంతా నానా గందరగోళంగానూ ఉంది. తలదాచుకోవడానికి పొడి జాగాలేక ప్రజలు సతమతమవుతున్నారు, రాజుగారి తెలివి తక్కువవల్ల ఈచేటు వాటిల్లిందని గుర్తించి మంత్రి గాని, ప్రజలుగాని రాజుగారివద్దకుపోయి ఫిర్యాదు చేయడానికీ ఒక్కరికీ ధైర్యం చాలిందికాదు. క్షణం గడిచే కొలదీ విపరీత విద్భూరం కాసాగింది. ఆఖరికి ధైర్యంచేసి ప్రజలంతాకలిసి మంత్రిగారి పాదాలమీద వ్రాలారు. "ఈ అపాయం గడిచే ఉపాయం సూచించమని". మంత్రికూడ చాలాసేపు యోచించగా ఆఖరికి ఒక చక్కని ఉపాయం స్ఫురించింది. "సరే"నని ప్రజలను పంపివేసి తాను కోట ముఖం పట్టాడు.

ఆకాలంలో ఇప్పటివలె ఇంటింటా గడియారాలులేవు. ఆరోజుల్లో అందరకు టైముతెలియటానికి రాజమహల్‌లో ఒక పెద్ద గంటకట్టి గంట గంటకు ఒక సిపాయి ఆగంట కొడుతూండేవాడు. ఆవిధంగా అందరకూ టైము తెలిసేది.

మంత్రి గంటలుకొట్టే సిపాయిని పిలిచి "ఈ రాత్రి గంటలు తొందర తొందరగా కొట్టమని" ఆజ్ఞాపించాడు. "చిత్తం ప్రభూ" అని సిపాయి తన పనిమీద వెళ్ళిపోయాడు.

సిపాయి అరగంట అరంగటకు గంటకొట్ట నారంభించాడు. పది పదిన్నరకు పదకొండు పదకొండుకు పన్నెండు, ఈవిధంగా తిరిగి ఒకటి, రెండు, మూడు, నాల్గు, అయిదు ఆఖరు ఆరవ గంటకూడా కొట్టాడు, 6 వ గంట విని తెల్లవారిందని ప్రజలందరూ లేచారు. రాజుగారుకూడా లేచారు. కాని ఇదేమిటి? ఆరుగంట లయినా తెల్లారలేదు! సూర్యుడెక్కడా కనుపించడేం? అని మంత్రిని పిలిచి ప్రశ్నించాడు. "ఆరుగంటలైనా సూర్యుడుదయించడేం?" అని.

మంత్రి తీక్షణంగా ఆలోచిస్తున్నట్లు ముఖంపెట్టి కాస్సేపు నటించి చెప్పాడు. ప్రభూ! అర్థమయింది. తంజా ఊరువాసులు మనకు సైతాన్లుగా తగిలారు. సూర్యుడు

ఎప్పుడూ తూర్పున ఉదయిస్తాడు. మనం తంజాఊరు ప్రజలకు నీరు పోకుండా నిలుపుచేశాం. బహుశా దానికి ప్రతిక్రియగా తంజాఊరు ప్రజలు సూర్యుని రాకుండా కట్టి వేసి ఉంటారు. అంతే అయి వుంటుంది హుజూరు. మీ ఆజ్ఞ అయితే నదికి వేసిన కట్ట నరికిస్తా" అన్నాడు వినయంగా.

"అదా విషయం! అయితే తొందరగా చేయించు ఆ పని" అన్నాడు రాజు, ఆశ్చర్యాన్ని ముఖంలో ప్రస్ఫుటింపచేస్తూ.

మంత్రి లోలోన సంతోషిస్తూ కట్ట నరకమని పురమాయించాడు. కూలీలు తొందరగా పనిసాగించారు. నీరు తూర్పుకు ప్రవహింపసాగింది. ఇంతలో తెల్లవారింది. సూర్యుడు ఉదయిస్తున్నాడు.

మంత్రి రాజుగారితో అన్నాడు. "హుజూర్ నీరు వెళ్ళింది. నీటినిచూచి తంజాఊరు ప్రజలు సూర్యుని వదిలారు. తూర్పునుంచి వస్తున్నాడు చూడండి"....

రాజుగారు మంత్రి బుద్ధిబలానికి చాలా ప్రశంసించాడు. ప్రజలు రాజుగారి తెలివితక్కువ కార్యానికి ఎవ్వరికీ హాని కలుగకుండా బుద్ధిబలంతో చమత్కారంగా ఆపద తప్పించినందుకు మంత్రిని లోలోన పొగడ్తూ సంతోషంతో ఇళ్ళకు చేరారు.



# కాయకోసం

"రాజేశ్వర్"

ఉన్న దొక్కటి
జామికాయ
చివరి కొమ్మను
తొంగి చూచును
నింగిపైకి....
యెగప్రాకుచు
చెట్టు యెక్కెను
రెడ్డిగాడు:
కాయకోసము
ప్రయత్నించెను—
కాలుజారి
క్రిందపడెను!
కాలువిరిగెను
చెయ్యివిరిగెను
ఆసుపత్రిలో
ఆరునెలలు
బాధపడెను
అదేనొప్పితో.

* * *

కాని కాయకు
చెట్టు యెక్కగ
కాలువిరిగెను
రెడ్డిగాడికి!
కానిపనికి
పోకుమోయి—
కాళ్ళుచేతులు
విరచు కొనకు,
మారెడ్డిగాడి
బోలెనీవు.



మద్రాసులో :

# ఆంధ్ర బాల మహాసభ

మొన్న అగస్టు 9-10 తే॥ మద్రాసు, త్యాగరాయనగరంలోని వాణీమహల్లో ఆంధ్ర బాల మహాసభ (1952) జయప్రదంగా జరిగింది. శ్రీ మల్లిపూడి వెంకటకృష్ణారావుగారు (మద్రాసు విద్యాశాఖమంత్రి) అధ్యక్షత వహించారు. శ్రీ గిడుగు సీతాపతిగారు మహాసభను ప్రారంభించారు.

కార్యదర్శి శ్రీ ఎన్. రాఘవరావుగారు తమ నివేదికలో ఆంధ్ర బాలానంద సంఘమును గురించిన వివరాలను ఈ క్రింది విధంగా తెలియజేశారు :—

"సంగ్రహచరిత్ర :—ఆంధ్ర బాలానంద సంఘము "బాల" సంపాదకులు శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి (రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్య) గార్లచే 1947 సం॥లో స్థాపించబడింది. మదరాసులో తెనుగుపిల్లల కలయికకు వీలుగా ఈసంఘము బాలల సమావేశములు, దసరా ఉత్సవములు, నాటకము నృత్యము, పాటలు, చిత్రలేఖనము వ్యాసరచన మొదలగు వాటిలో పోటీలు, ప్రదర్శనములు మొదలగునవి ఏర్పాటు చేయుచు పిల్లలలో నూతనోత్సాహము కలుగజేసింది. రాను రాను ఈ సంఘము పెరిగి 1952 సం॥లో రిజస్టర్డు చేయబడింది.

ముఖ్య ఆశయములు:—పిల్లలు సరదాగా కలిసి ఆడుకొనుట, పాడుకొనుట, తద్వారా పిరికితనముపోయి విజ్ఞానము, వినోదము పొంది అన్నివిధములా అభివృద్ధి పొందుట; పిల్లల గ్రంథాలయము, పఠనమందిరము స్థాపించుట; పిల్లల నాటకశాలను, నర్తనశాలను నిర్మించి, నాటకములు, నృత్యములు ప్రదర్శించి, వారి కళా నైపుణ్యము పెంపొందించుట, పిల్లల సభలు, సమావేశములు జరిపించి సభా పిరికితనము పోగొట్టుట; క్రీడారంగములో వివిధ రకముల ఆటలు పిల్లలు ఆడుకొనుటకు అవకాశము కల్గించుట, ఆటపాటలలోను, నృత్యతము, నాటక ప్రదర్శనము, సాహిత్యము, చిత్రలేఖనములోను పోటీలు పెట్టి ప్రోత్సహించుట మొదలగు పిల్లల విజ్ఞాన వినోదములను అభివృద్ధిచేయు కార్యక్రమములను నడుపుటయే ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశము.

బాల సంఘ శాఖలు :— మదరాసులో కనీసము 100 సభ్యులు గల పేటలో ఒక బాల సంఘ శాఖను స్థాపించుచున్నాము. మదరాసులోని తెనుగు బాలల అభివృద్ధినికోరు ప్రతి ఆంధ్రుడు తమ పిల్లలను వెంటనే సభ్యులుగా చేర్పించ మనవి. ముమ్ముందు ఇతర గ్రామములలోకూడ బాలసంఘశాఖలు స్థాపించబడును.

చేయవలసినపని :— నేటి బాలలే రేపటి పౌరులు. బాలలు చిన్నప్పుడు అలవరచుకొన్న మంచి అలవాట్లు అభిరుచులనుబట్టే వారు పెద్దవారయాక తెనుగుజాతికి, దేశానికి ఉపయోగపడతారు. బాలల అభివృద్ధి చదువుతో సరిపోదు. వారి విజ్ఞానం వికసించాలంటే వారికి గ్రంథాలయాలు కావాలి. పఠనమందిరాలు కావాలి. నాటకరంగము కావాలి. నర్తనశాల కావాలి. క్రీడామందిరం కావాలి. ఆటస్థలములు కావాలి. వీటన్నిటికీ పెద్దల సహాయముకావాలి. ధనసహాయము కావాలి. విరాళములు కృతజ్ఞతతో స్వీకరింతుము."

రెండు రోజులు అనేక వూళ్ళనుంచి వచ్చిన బాలలు- అమితోత్సాహంతో- ప్రసంగాలు, నాటకాలు, నాట్యాలు, ప్రహసనాలు వీటన్నిటిలో పాల్గొంటూ, వాణీమహల్ వాతావరణాన్నంతా కలకలలాడించారు.

# నిర్ణీత సంతానం

"ఏ. వి. ఆర్"

దేశ కాల పరిస్థితులకు అనుగుణ్యంగా సాంఘిక జీవితాన్ని సరిదిద్దుకోవాలి. ఇందుకుగాను అవసరమైన మార్పులను,అవకాశాన్నిబట్టి, అంగీకరించవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఈ మార్పులు విప్లవాత్మకంగా గోచరించవచ్చును; తరతరాలనుండి అనుభవంలోవున్న ఆచారవ్యవహారాలకు విరుద్ధంగా కనబడవచ్చును, కాని అంతమాత్రం చేత నూతన పరిణామాలకు విముఖత చూపగూడదు. సాంఘిక జీవితంలో సామరస్యంకోసం పరిస్థితులను బట్టి సాహసించక తప్పదు.

ప్రస్తుతం భారతదేశాన్ని ఇబ్బంది పెడుతున్న సమస్యలలో ప్రధానమైనది ఆహారసమస్య. ప్రజలూ, ప్రభుత్వమూ ఎంత కృషి చేస్తున్నా ఇప్పటిలో మనదేశం స్వయం సమృద్ధికాగలదనే అవకాశం ఎక్కడా కనపడదు. ఆహారోత్పత్తిని పెంచవలెనంటే సకాలంలో వర్షాలు కురవాలి; నీటిపారుదల కట్టడాలను నిర్మించి నీటి సరఫరా చేయాలి; ఆధునిక పద్ధతులతో వ్యవసాయాభివృద్ధి చేయాలి. ఇవన్నీ ఎప్పుడు సాధ్యం కాగలవో ఊహించలేము.

అధికంగా ఆహారాన్ని పండించటములో దేశం ఎంతగా నిమగ్నమై ఉన్నప్పటికీ, నానాటికీ విపరీతంగా పెరిగిపోతున్న జనాభావ్యాప్తిని అదుపులో ఉంచటానికి ప్రయత్నాలు జరగకపోతే మనదేశపు ఆహారసమస్య ఎప్పటికీ పరిష్కారం కాకపోవచ్చును. ఆయుర్దాయ ప్రమాణం సగటున ఎంత తగ్గి ఉంటున్నా, ప్రజారోగ్యం ఎంత అసంతృప్తికరంగా ఉంటున్నా, కొన్నిప్రదేశాలలో కాటకం నిరంతరం విజృంభిస్తున్నా జనసంఖ్య పెరిగిపోవటమేకాని తగ్గటం కనబడడంలేదు. ఇతరదేశాలలోవలె యుద్ధభీభత్సం మన దేశంలో ప్రభావం చూపించలేదు. ప్రత్యేకమైన పరిస్థితులుగాని, నియమాలుగాని అవసరం లేకపోవటంవల్ల సంతానోత్పత్తి నిరాటంకంగా సాగిపోతున్నది.

జనాభా పెరుగదలను అదుపుచేయకపోతే ఇతర ప్రయత్నాలను ఎన్ని చేసినా ఆహార సమస్యా పరిష్కారం దుర్లభమే మోనని దేశశ్రేయోభిలాషులు అభిప్రాయ పడుతున్నారు. కుటుంబవ్యాప్తిని శాస్త్రీయమైన విధానాలవల్ల కొంతవరకు అరికట్టితేనేగాని మనదేశానికి మోక్షం లేదని ఆలోచనాపరులు విశ్వసిస్తున్నారు. ప్రభుత్వంవారు కూడ ఈ సూత్రాన్ని ఆమోదించి నిర్ణీత సంతాన ఉద్యమాన్ని కొంతవరకు ప్రోత్సహిస్తున్నారు.

సంతానాభివృద్ధిని అదుపులో ఉంచటానికి కేవలం ఆహారసమస్యా పరిష్కారమే హేతువుకాదు. దీని అవశ్యకతకు ఇంతకంటె ప్రబల కారణాలు అనేకం ఉన్నవి. సంతానాన్ని బడయటం సంతోషకరమైన విషయమే. కాని దానివల్ల ఏర్పడే బాధ్యతలను గూడ మనం గమనించాలి. జన్మించే శిశువులకు కావలసిన పోషణకు, పెంపుకు, చదువుకు మొదలైన వాటికి అవసరమయే సదుపాయాలకు అవకాశం ఉన్నదా, లేదా, అని ఆలోచించాలి. ఒక ఆవునుగాని, గేదెనుగాని, గుఱ్ఱాన్నిగాని పెంచదల్చుకొన్నప్పుడు వాటిపెంపుకు కావలసిన హంగులన్నీ ఉన్నవా లేవా అని విచారిస్తారు. కాని సంతానం విషయంలో మాత్రం ఎటువంటి ఆలోచనా జరగదు. 'నారుపోసిన దేవుడు నీరు పోయడా' అని భగవంతుడిమీద భారం వేస్తారు.

సంతానాన్ని వాంఛించేముందు తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితినేగాక ఆరోగ్యాది లక్షణాలను గూడ బాగా గమనించాలి. వారిరువురిలో ఏ ఒక్కరికైనా సంతానానికి సంక్రమించగల మానసిక లేక శరీర సంబంధమైన జాడ్యాలు ఏవైనా ఉండినట్లయితే ఆ దంపతులు సంతానార్హులుకారు. ఆపైన తల్లియొక్క వయస్సు, దారుఢ్యము ముఖ్యంగా యోచించాలి. ఇవి గమనించక పోవటం వల్లనే స్త్రీలలో కాన్పులవల్ల ప్రమాదాలు, రక్తహీనత, క్షయ మొదలైన

అవాంతరాలు అధికంగా సంభవిస్తున్నవి. నిష్పాక్షిక దృష్టితో విచారించితే సంతానాభివృద్ధి ఒక నిర్ణయప్రకారం జరుగవలసి ఉంటుందని స్పష్టంగాకతప్పదు.

ఒక నిర్ణయ ప్రకారం సంతానాన్ని బడయవలసిందేనని సంఘశ్రేయోభిలాషులు అందరూ ఒప్పుకుంటున్నప్పటికీ దానిని సాధించటం విషయంలో అభిప్రాయ భేదాలు లేకపోలేదు. దాంపత్య ధర్మం నియమప్రకారం నెరపేప్పటమే దీనికి అత్యుత్తమ మార్గమని కొందరి విశ్వాసం కాని ఇది జనబాహుళ్యానికి సర్వత్రా స్వాధీనంలో లేని విషయం. అంత నిబ్బరం అందరికీ ఉంటుందనడం కేవలం పొరపాటు. ఆపైన దీనివల్ల సహజమైన సంసార సౌఖ్యం తగ్గిపోవటమేగాక ఆరోగ్యమే దెబ్బతిన వచ్చును. ఇక రెండవ మార్గం "రిథం పద్ధతి" (Rhythm method) బయటచేరిన ముందునా తరువాతనూ కొన్ని దినములలో మాత్రమే గర్భోత్పత్తికి అవకాశం ఉంటుందనీ. మిగరా రోజులలో నిశ్చయముగా వ్యవహరించవచ్చుననీ. ఈ పద్ధతి ఆమోదించేవారి వాదన. మన ప్రభుత్వంవారు కూడ ఈ పద్ధతినే ప్రోత్సహింప నిశ్చయించారు. కాని ఈ పద్ధతిని విద్యావంతులైనవారే ఆచరణలో పెట్టటం కష్టం. దేశ ఉష్ణతను ఉజ్వలత్వాన్ని గమనించి ఏ యే దినములలో నిశ్చయముగా వ్యవహరించవచ్చునో నిర్ణయించటం అతి క్లిష్టమైనపని. అదీగాక ముఖ్యంగా పేదస్త్రీలలో బహు కొద్దిమంది మాత్రమే లెక్కప్రకారం ప్రతినెలా మారంగా ఉంటారు. కాబట్టి ఈనియమిత రుతు మధ్య సమాగమ పద్ధతిమీద నిస్సంకోచంగా ఆధారపడేందుకు వీలుకాదు. నిజానికి ఈపద్ధతి సంతాన నిరోధానికి పనికిరాదనీ, సంతానం కావలెనను కునే వారికే ఇది ఎక్కువ ఉపయోగపడగలదనీ మేరీ స్టోప్సులాంటి శాస్త్రవేత్తల అభిప్రాయం.

(49 వ పేజీ చూడండి)




# సూర్యకుటుంబం

* శ్రీమతి కె. సుగుణమణి *

గ్రహాలజననం:— కొన్ని కోట్ల సంవత్సరాలకు పూర్వం సూర్యగోళంనుంచి కొంత ద్రవ్యం విడివడి, వేరు వేరు దూరాల్లో జేరుకొని నవ గ్రహాలు (గోళాలు)గా యేర్పడి, సూర్యునిచుట్టూ ప్రదక్షిణాలు చేయడం మొదలెట్టేయనీ, వీటిల్లో మన భూగోళం ఒకటి అనీ యిదివరలో విన్నాం. సూర్యుడొక పెద్ద సూదంటురాయివలె యీ నవగ్రహాల్ని ఆకర్షించి వుంచుతుంటే- అవి వేరు వేరు కక్షల్లో సూర్యునిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తూన్నాయి. ఈ నవగ్రహాల్నిగూర్చి శాస్త్రజ్ఞులు కనుక్కున్న వివరాలు చూడండి:—

1. బుధుడు (Mercury):— ఈ గ్రహం సూర్యునికి 3,60,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 300 మైళ్ళు. ఇది సూర్యునికి దగ్గరలో ఉంది గనుక దీనిమీద తాపక్రమం భూమిమీద కంటే 7-8 రెట్లు యెక్కువ ఉంటుంది. సీసం సులువుగా ద్రవించేటంతటివేడి. ఈ గ్రహం తనచుట్టూ తాను 25 గంటల్లో తిరుగుతూ సూర్యునిచుట్టూ 88 రోజుల్లో ఒక ప్రదక్షిణం పూర్తి చేస్తుంది. దీనిమీద 11 మైళ్ళ ఎత్తయిన పర్వతాలున్నాయి.

2. శుక్రుడు (Venus) :— ఈ గ్రహం సూర్యునికి 6,72,000 మైళ్ళ దూరంలో ఉంది. ఇది చాలా కాంతివంతమైంది. దీని అడ్డుకొలత 7,700 మైళ్లు. ఇది తనచుట్టూతాను 24 గంటల 16 నిమిషాల్లో తిరుగుతూ సూర్యునిచుట్టూ 225 రోజుల్లో ప్రదక్షిణం పూర్తిచేస్తుంది.

3. భూమి (Earth) :— భూగోళం సూర్యగోళానికి 9,28,00,000 మైళ్ళ దూరంలో ఉంది. భూమి అడ్డుకొలత 7,914 మైళ్ళు. బరువు 589 తరువాత 19 సున్నలు చుట్టండి. అన్నిటన్నులు. భూమి తనచుట్టూతాను ఒక రోజులో తిరుగుతూ సూర్యునిచుట్టూ ప్రదక్షిణం ఒక సంవత్సరంలో పూర్తిచేస్తుంది.

4. అంగారకుడు (Mars) :— ఇది సూర్యునికి 14,10,56,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 4,200 మైళ్ళు. ఇది తనచుట్టూ తాను 24½ గంటల్లో తిరుగుతూ సూర్యునిచుట్టూ ప్రదక్షిణం 687 రోజుల్లో పూర్తిచేస్తుంది. దీనిమీద వాతావరణం జీవం ఉత్పత్తి కావడానికి అనుకూలంగా ఉందనీ, చెట్టూచేమ ఉండవచ్చుననీ అన్నారు. మనకు తెలిసినంతవరకు భూగోళంకాక జీవోత్పత్తికి కొంత అనుగుణ్యంగా ఉన్నది విశ్వమంతట్లోను యీ గ్రహం ఒక్కటే.

5. గురుడు (Jupiter) :— నవగ్రహాలన్నిట్లోకి యిదే గురుగ్రహం. భూమివంటి గోళాలు 1400 అందులో వేసినా యింకా ఖాళీ ఉంటుంది ఇది సూర్యునికి 48,30,00,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 88,640 మైళ్ళు. దీని బరువు భూమిబరువుకు 300 రెట్లు ఉంటుంది. తనచుట్టూ తాను 10 గంటల్లో తిరుగుతూ 12 సంవత్సరాల్లో సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం పూర్తి చేస్తుంది.

6. శని (Saturn) :— సూర్యునికి 88,60,00,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 70,000 మైళ్లు. ఈ శనిగ్రహంచుట్టూ మేఘాల్లాంటి వలయాలు చుట్టి ఉండటంవల్ల దూరదర్శిని యంత్రంలో చాల తమాషాగా కనబడుతుంది. ఇది భూమికంటె 745 రెట్లు పెద్దది. తనచుట్టూ తాను 10 ½ గంటల్లో తిరుగుతూ 29 సంవత్సరాల్లో సూర్యుడిచుట్టూ ప్రదక్షిణం పూర్తిచేస్తుంది.

7. యురేనస్ (Uranus) :— సూర్యునికి 180,00,00,000 మైళ్ళ దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 32,000 మైళ్ళు. దీని దినప్రమాణం తెలియలేదు. ఇది సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం చేయడానికి 84 సంవత్సరాలు పడుతుంది.

8. నెప్ట్యూన్ (Neptune) :— సూర్యునికి 280,00,00,000 మైళ్ల దూరంలో ఉంది. దీని అడ్డుకొలత 32,000మైళ్లు. దీని దినప్రమాణం కూడ తెలియదు. ఇన్నికోట్లమైళ్ల దూరంలో సూర్యునిచుట్టూ ప్రదక్షిణం చేస్తూంది కనుక ఒక చుట్టు తిరగడానికి 165 సంవత్సరాలు పడుతుంది.

9. ప్లూటో (Pluto) :— ఇదే అన్నిటికంటే అతి దూరంగానున్న గ్రహం. సూర్యునికి 371,20,00,000 మైళ్లదూరంలో ఉంది.

ఈ నవగ్రహాలకుమధ్య సూర్యగోళం ఉంది. దీని అడ్డుకొలత 8,66,400 మైళ్లు. అంటే మన భూగోళం 3 అంగుళాల అడ్డుకొలతగల బత్తాయికాయి అనుకుంటే సూర్యగోళం 28 అడుగుల అడ్డుకొలతగల బంతి అంత ఉంటుందని ఊహించుకోవాలి. భూమిచుట్టూ 8 రోజుల్లో తిరగగల విమానం సూర్యునిచుట్టూ తిరగాలంటే 24 సంవత్సరాలు పడుతుందన్నమాట. సూర్యుని పరిమాణం భూమి పరిమాణంకంటె 13,05,000 రెట్లు పెద్దది. సూర్యగోళం బరువు 19 సంఖ్యవేసి దానితర్వాత 26 సున్నలు చుట్టండి : అన్ని టన్నులు. అంటే భూమికంటె సుమారు 3 లక్షల 33 వేల—రెట్లు బరువు అధికం. నవగ్రహాలు ఒకముద్దచేసి దానితో సూర్యునితూచినా, దానికంటె 750 రెట్లు బరువుంటుంది. సూర్యుడు వేడినీ, వెలుగునూ వెదజల్లుతూ, తన్నిమిత్తంగా ప్రతినిమిషం, 240 లక్షల టన్నుల బరువు తగ్గుతున్నాడు. ఈ వెలుగు, వేడిలో కోటానకోట్ల పాళ్లల్లో ఒక్కపాలు మన భూగోళం చేరుతుంది. ఇదే జీవోత్పత్తికి, జీవపోషణకు హేతుభూతమౌతూంది.

ప్రదేశం (Space) అనే మహార్ణవంలో సూర్యుడు: అతని సంతానమైన నవగ్రహాలు. చెమ్మా చెక్కా ఆడుకుంటున్నట్లు గిరగిరా తిరుగుతూన్న దృశ్యం, మానసికంగా అవగాహన చేసుకుంటే మహా అద్భుతలీలగా తోస్తుంది:

"అయితే చంద్రునిమాట ఎక్కడా చెప్పలేదేం" అంటారేమో. చంద్రుడు 'ఉపగ్రహం' క్రింద లెక్క. ఎందుకంటే సూర్యునిచుట్టూ మనభూమి తిరుగుతుంటే, భూమిచుట్టూ చంద్రుడు తిరుగుతున్నాడు. ఇలాంటి ఉపగ్రహాలు అంగారకుడికి రెండు, గురుడుకి నాలుగు, శనికి ఎనిమిది, యురేనస్‌కి నాలుగు, నెప్ట్యూన్‌కి ఒకటి ఉన్నాయి.

శాస్త్రజ్ఞులు దూరదర్శిని యంత్రాలుపెట్టి విశ్వాంతరాళమంతటా గాలించినా— సూర్యునికంటె లక్షలు కోట్లు పెద్దవైన నక్షత్రలోకాలు కానిపించేయిగాని ఎక్కడా ఇలాంటి గ్రహోత్పత్తి— జీవోత్పత్తి గోచరించలేదు.

"........ఆశ్చర్యములకెల్ల నాస్పదం బాదిత్యు—
డాతనివలననభూతజాల మఖిలంబుఁ జనియించు- నది
యచ్చెరువుగాదె!................" (భారతం)



# నిర్ణీత సంతానం

నిర్ణీత సంతానాన్ని సాధించటానికి మూడవపద్ధతి శాస్త్రీయమైన కృత్రిమ సాధనలను ఉపయోగించటం. ఈ పద్ధతిని అఖిల భారత నిర్ణీత కుటుంబ వ్యాపక మహాసభ (Family Planning Association of India) వారు ఆమోదించి ప్రోత్సహిస్తున్నారు. దీనివల్ల నిర్ణీత సంతానాన్ని సౌలభ్యం చేసుకోవడమేగాక ఆందోళనగాని, దైహిక మానసిక బాధలుగాని, వ్యయప్రయాసముగాని పొందనవసరంలేదు. ప్రజాబాహుళ్యానికి ఈ పద్ధతి ఎంతో అందుబాటులో ఉంటుంది.

కుటుంబవ్యాప్తిని శాస్త్రీయమైన విధానాలవల్ల అదుపులో ఉంచటానికి హైదరాబాదు రాష్ట్రంలో ఏవిధంగా కృషి చేస్తున్నారో తెలిసికొనటం మన విధ్యుక్తధర్మం. ఇండియాలోని రాష్ట్రాలలోకెల్ల కాశ్మీరు తరువాత పెద్ద రాష్ట్రం హైద్రాబాదు. దీని విస్తీర్ణం 82,000 చదరపు మైళ్ళు. జనసంఖ్య ఒక కోటి తొంభై లక్షలు. వారిలో నూటికి పదిమంది మాత్రమే చదువుకున్న వాళ్లు, రాజకీయంగాను, సాంఘికంగాను హైదరాబాదు చాలా వెనుకబడి వున్నది. కనుక ఈనాడు నిర్ణీత కుటుంబ వ్యాప్తి విషయంలో ఆరాష్ట్రమే ముందంజ వేసిందంటే ఆశ్చర్యకరంగా ఉండక మానదు.

ఇప్పుడు హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలలో ఆరు ఆధునిక నిర్ణీత సంతాన ప్రచారక కేంద్రాలు (Family Planning Clinics) నెలకొల్పబడి వున్నవి. ఈ కేంద్రాలలో సంతాన నిరోధక పద్ధతులను గురించి బోధిస్తారు, ఈ సంస్థలు ఏర్పడిన ఒక సంవత్సరములోనే సగటున మాసానికి 125 మందికి తక్కువలేకుండా సలహాలకోసం వస్తున్నారు. సంతాన నిరోధక పరికరాలను (Contraceptives) గురించి తెలుసుకుంటున్నారు.

మొదట ఈ ఉద్యమం సాంఘిక సమావేశం (Social Conference) వారి ఉపశాఖగా ఆరంభమయింది. హైదరాబాదు, సికింద్రాబాదు మునిసిపాలిటీలలో ఉండే శిశుసంరక్షణాలయాలలో ముందు కృషి ప్రారంభించారు. ఇద్దరు లేడీ డాక్టర్లు వారానికి రెండు రోజులు మాత్రం అక్కడికి వచ్చినవారికి సలహాలను నడుపుతున్నారు. క్రమక్రమంగా ప్రజాదరణను సంపాదించి ఈ ఉద్యమ నిర్వాహకులు "హైదరాబాదు నిర్ణీత సంతాన ప్రచార సంఘం"(The Family Planning Association of Hyderabad) అనే సంస్థను స్థాపించగల్గిరి. ఈ హైదరాబాదు సంస్థ బొంబాయిలోని అఖిల భారత నిర్ణీత కుటుంబ వ్యాపక మహాసభకు అనుబంధంగా వ్యవహరిస్తున్నది, ఆరోగ్యశాఖలో ఇన్‌స్పెక్టరు జనరలైన మేజరు జనరల్ భాటియా దీనికి అధ్యక్షుడు, ఈ సంఘపు కార్యవర్గంలో హైదరాబాదు స్థానిక వైద్యులు కూడ కొందరున్నారు.

ఈ సంఘాన్ని నెలకొల్పిన తరువాత పని చాలా చురుకుగా సాగుతున్నది. క్రమపద్ధతిలో మంచి పరికరాలతో 4 నిర్ణీత సంతాన ప్రచారక కేంద్రాలు హైద్రాబాదు సికింద్రాబాదులలోను, 2 శిశుసంరక్షణ కేంద్రాలలోను నడుపబడుచున్నవి. ఒక లేడీ డాక్టరు వారానికి రెండు రోజులు హైదరాబాదులోని కేంద్రాలకు, ఇంకొకామె సికింద్రాబాదు కేంద్రాలకు హాజరవుతారు. ప్రతి కేంద్రంలోనూ ఒక హెల్తు విజిటరూ, నర్సులూ పని చేస్తారు. ఈ హెల్తు విజిటరు సలహాకు వచ్చినవారి యోగక్షేమాలు తెలుసుకుంటూ, విషయాలను విశదంగా తెలియజేస్తూ ప్రచారం కొనసాగిస్తుంది. సలహాకోసం వచ్చిన ప్రతివారిని రెండు మూడు పర్యాయములైన కేంద్రానికి ఆహ్వానించి సంతాన నిరోధక మార్గాలను సమగ్రంగా తెలియచెప్పటమే కాక ఆపరికరాలను ఏవిధంగా ఉపయోగించవలెనో, ఏవిధంగా పదిల పరచుకోవలెనో బోధిస్తారు.

1950 జూన్ నెలలో ఈ కేంద్రాలు ప్రారంభించినప్పటి నుండి వీటిని నడుపుటకు గాను హైదరాబాదు ప్రభుత్వము సాలుకు రూ 5000/- లున్నూ, హైదరాబాదు పురపాలక సంఘం రూ 7000/- లున్నూ, సికింద్రాబాదు పురపాలక సంఘం రూ 5000/- లున్నూ ఇస్తున్నారు. అఖిల భారత సంఘసేవా సమాజంవారు (The Indian Conference of Social Work) కూడ కొంత సహాయం చేస్తున్నారు,

# నిర్ణీత సంతానం

కమిటీ మెంబర్లుకూడా నియమిత వేళలలో వచ్చి కేంద్రాలను తనిఖీ చేస్తుంటారు. లేడీడాక్టర్లు సంతాన నిరోధక పరికరాలను ఉపయోగించేపద్ధతిని, వాటిని ఉపయోగించటంవల్ల కలిగే ప్రయోజనాలను విశదపరుస్తారు. సలహా కొరకు వచ్చిన ప్రతివ్యక్తికి చక్కగా బోధించవలెనంటే కనీసం 20 నిమిషముల కాలము పట్టినప్పటికీ ఈ డాక్టర్లు ఎంతో ఓపికతో వారికి తెలియ చెప్పటం ప్రశంసనీయం.

ఈ కేంద్రాలను ప్రారంభించునప్పుడు ఇండియాలో సంతాన నిరోధక పరికరాలు దొరకటమే కష్టంగా ఉండేది. దొరికినప్పటికి ధర ఎక్కువ అవటంవల్ల సామాన్యప్రజకు అందుబాటులో లేకపోయినవి. అదీగాక ఇండియాలో విరివిగాను, సక్రమంగాను వీటిని సప్లయిచేసే వర్తక ప్రతినిధులు లేకపోయిరి. అందువల్ల మొదటిలో వాటిని లండన్ నుంచే తెప్పించవలసి వచ్చింది. అప్పట్లో వీటిని ఎక్కువమంది ఉపయోగించక పోవటంచేత ఏవర్తకుని వద్ద కావలసినన్ని దొరుకలేదు. ఈ మధ్యనే బొంబాయిలోని ఒక వ్యాపార సంస్థతో కావలసినంతగా ఆ పరికరాలను దిగుమతి చేయటానికి నిర్ణీత కుటుంబ వ్యాపక సంఘం వారు ఏర్పాటుచేసి ఉన్నారు. అందువల్ల ఈ సమస్య తీరినట్లే- ఈ కృత్రిమ సాధనాలను అధిక సంఖ్యాకులు ఉపయోగించేందుకు అనువుగా వీటిని ఇండియాలోనే తయారుచేయగల్గితే తృప్తికరంగా ఉంటుంది. మన దేశంలో రబ్బరు ఉత్పత్తి అవుతుంది. కనుక ఏ వ్యాపార సంస్థ అయినా తయారుచేసే ఏర్పాటుచేస్తే కావలసిన వారందరికి సులభముగా లభ్యమవుతవి. కాని ప్రభుత్వము సహాయము లేకుండా ఇది ఎంతవరకు కొనసాగుతుందో అనేది సంశయాంశము.

మొట్టమొదట స్త్రీలు ఈ కేంద్రాలకు వచ్చేందుకు జంకేవాళ్లు. వారికి రావలెననే ఉత్సాహముకూడా అంతగా లేకపోయింది. కాని ఈ సంఘంవారు ప్రజాసామాన్యపు విజ్ఞానాన్ని క్రమంగా పెంపొందించిన తర్వాత ఏడెనిమిది మంది బిడ్డల తల్లులు కూడ సిగ్గుపడకుండా ఇప్పుడు బోధనకొరకు వస్తున్నారు. కొండంత దిగులుతో కుములుతూ వచ్చినవారు సంతోషంతో మరలి వెళ్తున్నారు. ఇప్పటికీ ఎక్కువ మంది బీదస్త్రీలే ఇక్కడకు వస్తున్నారు. మధ్యతరగతి స్త్రీలు ఈ కేంద్రాలకు రావటానికి బిడియపడుతున్నారు. పురుషులు మచ్చుకుకూడా ఆ చాయలకు రానేరారు. దీనిని బట్టి సంతాన నిరోధక సాధనాలను ఉపయోగించేది చదువుకున్న పైతరగతుల వారేనని సాధారణముగా అనుకునే విషయం ఎంతవరకూ నిజమో తేటతెల్లమవుతుంది. అదీగాక పేదవారికే గొప్ప సంతానం ఉండటం మనమందరమూ ఎరిగినదే.

మొదట కొంత నిరాదరణకు గురి అయినా ప్రజల యొక్క సానుభూతి సహకారాలతో ఈలాంటి కేంద్రాలు అభివృద్ధిలోకి రాగలవని ఊహించవచ్చు. సహగమనము, బాల్యవివాహాలు అంతరించినట్లే విచ్చలవిడిగా సంతానాన్ని కనడం కూడ అంతరించి తీరక తప్పదు. ఉత్సాహపూరితులూ, అనుభవశాలులూ అయిన పెద్దలు సంకల్పించిన ఈ మహా ప్రయత్నం దేశమంతటా అభివృద్ధి చెందగలదని ఆశింపవచ్చును.



ఈ ప్రపంచమంతా ఒక నాటకరంగం. ఆ రంగంమీద నువ్వు ఏడుస్తూ కూచోడానికి నీ కధికారం లేదు! .... జీవిత నాటకంలో దురంత పాత్రల్ని నిర్వహిస్తున్నవారుకూడా అది కేవలం 'నాటకమ'ని మరచిపోవడం, అపరాధం!





# రాజకీయాలు

(26-వ పేజీ నుండి)

చౌఎన్‌లై మాస్కో వెళ్ళి సోవియట్ నాయకులతో జరుపుతున్న సంప్రదింపులలో ఈ ప్రస్తావన రాకతప్పదు.

*　　*　　*

పసిఫిక్ రంగంలోకానీ, యూరప్ రంగంలోకానీ, అమెరికా ఎవ్వరినీ నిలవనివ్వటంలేదు. యూరప్‌లో అట్లాంటిక్ ఒప్పందం పేరుతో ఆయుధసన్నాహాలను చేస్తున్నది. అక్కడ అన్నీ తెల్లదేశాలే కనుక ఇబ్బంది లేకుండా సరిపోయింది. పసిఫిక్ ప్రాంతంలో నల్లదేశాలు, పచ్చదేశాలు తటస్థపడ్డవి. వీటిల్లో తనకు ఆప్తమిత్రాలయిన జపాన్, ఫిలిప్పైన్స్ మొదలైన దేశాలనుకూడా తీసుకోకుండా అచ్చగా ఆస్ట్రేలియా, న్యూజిలాండులను మాత్రమే కలుపుకుని ఒక కూటమిని ఏర్పాటుచేసింది. ఈ తెల్లజాతుల గూడుపుఠాణీ ఇతర ఆసియాదేశాలకు నచ్చటంలేదు.

యూరప్‌లో సైన్య నిర్మాణ ప్రయత్నాలు ఇంకా తృప్తికరంగా సాగటంలేదు. ఒక్కొక్క సైనికుడు యూరప్ సేనలో ఎంతకాలం ఉండాలన్న విషయమై ఏకాభిప్రాయం కుదరలేదు. యూరప్ ఉక్కు, బొగ్గు పరిశ్రమల ఏకీకరణ కార్యక్రమానికి మాత్రం ప్రారంభం జరిగింది.

*　　*　　*

దక్షిణాఫ్రికాలో జాతివిద్వేష శాసనాలను ఉల్లంఘిస్తూ భారతీయులు, ఆఫ్రికన్లు కలిపి నడుపుతున్న సత్యాగ్రహోద్యమం అంతకంతకూ విజృంభిస్తున్నది. రెండువేలకు పైగా నిర్బంధించబడ్డారు. కొన్నిసందర్భాలలో పోలీసుకాల్పులు జరిగినవి. ప్రముఖ నాయకులు అరెస్టయినారు. ప్రధానిమలాన్ పార్టీనీ వారితో కేవలం రాజ్యాంగ తగాదాలను పెట్టుకున్న యునైటెడ్ పార్టీనీ ఈరంగుజాతులు ప్రతిఘటించుచున్నవి.

*　　*　　*

నేపాల్ ప్రధాని మాతృకా ప్రసాద్ కోయిరాలా ఆగస్టు 10 వ తేదీన తనపదవికి రాజీనామా ఇచ్చాడు. ఇది కేవలం కుటుంబకలహమని మాత్రమే చెప్పవలసివుంటుంది. ప్రధాని కోయిరాలా తమ్ముడు విశ్వేశ్వర ప్రసాద్ కోయిరాలా నేపాల్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్నాడు. మంత్రివర్గ సంఖ్యను తగ్గించాలని కాంగ్రెస్ కార్యవర్గం కోరగా ప్రధాని అంగీకరించలేదు. దానిమీద కార్యవర్గం అతణ్ణి బహిష్కరించింది. ఇంతవరకూ నడిచిన వృత్తాంతాన్ని పట్టిచూస్తే, మూలసూత్రాలలో వీళ్ళకు ఎటువంటి తేడా లేదని స్పష్టపడుతుంది. నేపాల్ రాజు మంత్రివర్గానికి బదులు ఒక సలహా సంఘాన్ని నియమించాడు.

*　　*　　*

మలయాలో బ్రిటిష్ సేనలకు కావలసిన గూర్ఖాలను బ్రిటన్ రిక్రూట్ చేసుకునేందుకు భారత ప్రభుత్వం కొన్ని అవకాశాలను ఇచ్చి ఉన్నది. వాటిని తొలగించాలని కోరటం జరగ్గా, అది నేపాల్ కోరికమీద జరిగినట్లు ప్రధాని నెహ్రూ జవాబిచ్చారు. సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించటమే తమ సంకల్పమని చెపుతున్న భారతదేశం సామ్రాజ్య దేశాలకు సేనల్ని సమకూర్చిపెట్టటం గౌరవప్రదం కాదు. ఈవిషయాన్ని నేపాలుకు నచ్చచెప్పేపాటి పలుకుబడి ఇండియాకు లేకపోలేదు.

*　　*　　*

భీమవరంలో స్వామీ సీతారాం నాయకత్వాన నడుచుచున్న సత్యాగ్రహంలో కొత్త ఘట్టం ఆరంభమయింది. ఇంతవరకూ సాక్షిమాత్రులుగా ఉన్న పోలీసులు ఆగష్టు 19, 20 తేదీల నుంచి బలప్రయోగానికి దిగారు. స్త్రీ సత్యాగ్రహులనుకూడా ఈడ్చివేస్తున్నారు. దీనివల్ల సత్యాగ్రహం తగ్గిపోవటానికి బదులుగా అంతటా వ్యాపించగలదు. అయితే ఒకే గవర్నరుక్రింద ఆంధ్ర తమిళ ప్రాంతాలను భిన్నపరిపాలనా ప్రాంతాలుగా విభజించాలన్న ప్రతిపాదనను స్వామీ సీతారాం ఆమోదించిన తరవాతనే పోలీసుల జులుం మొదలయింది. ఇందువల్ల ఆ ప్రతిపాదనపట్ల ప్రజలకు ఇష్టంలేదనో, లేకపోతే సత్యాగ్రహోద్యమం స్వామీజీ చేతులు దాటి ఇతరుల చేతుల్లోకి వెడుతుందనో అధికార్లు భయపడుతున్నట్లు ఉన్నది.

*　　*　　*

రాష్ట్రకాంగ్రెసు సంఘాలకూ, కాంగ్రెసు మంత్రివర్గాలకూ పరస్పరవివాదాలు చాలాకాలంనుంచీ వస్తూనేవున్నవి. ఉభయులకూ సయోధ్య కుదర్చటమన్నది కాంగ్రెస్ అధిష్ఠాన వర్గపు ముఖ్యసమస్య. ఇప్పుడు బొంబై కాంగ్రెస్ నాయకుడు ఎస్. కె. పాటిల్ ఈవిషయమై గట్టిగా నిలబడుతున్నాడు. వివిధరాష్ట్ర కాంగ్రెస్ నాయకులతోనూ సంప్రదింపులు జరుపుతున్నాడు. బొంబై ప్రభుత్వం ప్రతిపాదించిన పన్నులు కొన్నింటిని పాటిల్ తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాడు.

★

# ★ మహిళాలోకం- ★

## తెలుగు రచయిత్రికి సన్మానము.

తెలుగుభాషాసమితి పరిముఖంగా, జరిగిన 1951-52 సం॥ గ్రంథరచన పోటీలలో, సాహిత్య విమర్శనాత్మక గ్రంథమైన 'ఆంధ్రకవయిత్రులు' అను గ్రంథము ఉత్తమమైనదిగా ప్రభుత్వ పారితోషిక బహుమానమును పొందినది. ఈ గ్రంథము రచించిన శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారికి రాజమండ్రిలో, గాంధీజయంత్యుత్సవ సందర్భమున ఆగష్టు 18వ తేదీనుండి ప్రారంభమైన తెలుగు సారస్వత సభలలో అఖండమైన సన్మానము జరిగినది. అనేక సంఘముల తరఫున సగౌరవపూర్వకముగా ఆమెకు పూలహారము లొసంగబడెను. పట్టు చీర, వెండిపళ్లెము, శాలువ ఆమెకా సమయములో బహుమానముగా యీయబడెను.



శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు తమకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞత తెలుపుతూ, ప్రస్తుత గ్రంథ రచనలో తమ యనుభవములను చెప్పిరి. తరువాత, ఆంధ్ర కవయిత్రులలో ముద్దుపళని మినహా మరెవ్వరూ శృంగారరసమువైపు తమ నడక సాగించకపోవటము మహిళాకవితలో విశేషమంటూ, యీనాటి విశృంఖల శృంగార ప్రచారక పత్రికలను గర్హించారు.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు రచించిన గ్రంథముయొక్క వివరములు యీ క్రింద పేర్కొనుచున్నాము.

13 వ శతాబ్దియందలి ఖడ్గతిక్కన భార్య చామనాంబ మొదలుకొని నేటివరకు లభించిన సుమారు 100 మంది కవయిత్రుల జీవితచరిత్రలతో, వారి సంపూర్ణ కావ్య విమర్శనలతో కూడిన 500 పుటల వాఙ్మయచరిత్ర యీ గ్రంథము.

(1) పురాసాహిత్యము (తంజావూరు ఆస్థానమువరకు)

(2) సంధియుగము (కందుకూరి వీరేశలింగకాలము)

(3) ఆధునికాంధ్రయుగము (కంచనపల్లి కనకమ్మగారి కాలము.)

(4) అద్యతనాంధ్రయుగము (సోనాపతి రుక్మిణమ్మగారి సమవయస్కులకాలము)

(5) నవ్యాంధ్రయుగము (క్రొత్తపల్లి లలితాంబాదుల భావకవిత్వ ప్రారంభము)

(6) యుగలక్షణ సమన్వయము సమీక్ష.

ఉత్తమ వాఙ్మయాదర్శము అను ఆరు భాగములతో రాయలసీమవిభాగ, తెలంగాణావిభాగ కవయిత్రులతో వాఙ్మయములో ఇదివఱకెవ్వరును ఒనరింపని అపూర్వ కృషి యిది.

సాహిత్యములో కృషిచేసి, ఇట్లు పండితభూషితులైన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని ఆంధ్ర మహిళ అభినందించుచున్నది.

## హాలీవుడ్‌కు 'మద్రాసు సుందరి' ప్రయాణం.

'మద్రాసు సుందరి' శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి గారిని అమెరికా ప్రభుత్వ ఆహ్వానముపై హాలీవుడ్‌కు సెప్టెంబరు 12 వ తేదీని పయనమగుచున్నారు. హాలీవుడ్‌కు ఆహ్వానింపబడిన 16-గురు సినీమాతారలలో ఈమె ఒకరు. గతఫిబ్రవరి నెలలో ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ ఫిల్మ్ ఫెస్టివల్ సందర్భములో, ఢిల్లీ జర్నలిస్టుల ఆహ్వానముపై ఈమె ప్రెస్ ప్రతినిధుల సమావేశములో ప్రసంగించారు. ఆ సందర్భములో ఆమె ప్రసంగము, ప్రతినిధుల ప్రశ్నలకు ఆమె యిచ్చిన జవాబులు మిసెస్ ఎలినర్ రూజ్‌వెల్ట్ ప్రసంగముతో సమానమైన ప్రతిభగలవిగా ప్రశంసించబడినవి

## మదనపల్లె మహిళాసమాజం వార్షికోత్సవం.

మదనపల్లె మహిళా సమాజం 10 వ వార్షికోత్సవం 17_8_52 న శ్రీమతి ఆర్. రత్నాబాయి ఎం. ఏ. గారి అధ్యక్షతను జరిగింది. శ్రీమతి కె. సుందరాబాయి సదస్యుల నాహ్వానిస్తూ, సభకు కజిన్సుసతిగారు రావడం వలన తమ కెంతో ఆనందంగా ఉందని చెప్పి, ఆమె మహిళా సమాజములను స్థాపించి మనదేశంలో స్త్రీలకు చేసిన సేవను ప్రశంసించారు. శ్రీమతి ఆర్. అమృతవల్లియమ్మ వార్షిక నివేదికను సమర్పించారు.

పిమ్మట రత్నాబాయిగారు ఉపన్యసిస్తూ, నూతన రాజ్యాంగ రీత్యా స్త్రీలకు పురుషులతోపాటు సమాన హక్కులు కలవనీ, స్త్రీ ప్రకృతికి నర్సింగ్, వైద్యవృత్తులు ఎక్కువ అనుకూలమైనవనీ, స్త్రీలు బాగుగా విద్యనభ్యసించి కేవలం ఉద్యోగవాంఛలకు లోనుగాక సంఘ సంస్కరణ సత్కృ ఆసక్తి చూపాలనీ ఉద్బోధించారు. ఈ మహిళా సమాజం ఆధ్వర్యాన ఒక శిశు అనాథ శరణాలయమును నర్సరీ స్కూలు నడిపిన బాగుండునని ఆమె సూచించింది.

శ్రీమతి గౌరమ్మగారి అభినందనములతో సభ ముగిసినది.

## ఆంధ్ర ప్రాంతంలో మహిళలకు క్రొత్త కళాశాలలు.

ఇప్పటివరకూ, గుంటూరులో మాత్రమే ఆంధ్రప్రాంతంలో మహిళలకు ప్రత్యేక కళాశాల నెలకొల్పబడిఉన్నది. ఇటీవల తిరుపతిలో, స్త్రీలకొక ప్రత్యేక కళాశాలను స్థాపించినారు. ఇప్పుడు ఏలూరులో స్త్రీలకు ప్రత్యేక కళాశాల స్థాపించుటకు, జిల్లాబోర్డువారు స్థలమును కేటాయించినారని వినుట చాల ముదావహం. గృహనిర్వాహణకళ, లలితకళలు మున్నగు ప్రత్యేక శిక్షణలిచ్చుటకే కళాశాలలు శ్రద్ధవహించినచో, ప్రత్యేక కళాశాలలు సార్థకమైనవి కాగలవు. ఇందుమూలంగా, ఇతర కళాశాలలలోవలె సామాన్యవిద్యలను నేర్పుటకూడదనికాదు. అవసరమున్నంతవరకు ఆవిద్యలతోపాటు, ఈ ప్రత్యేక విద్యాబోధన కెక్కువగా కృషిజరుగుటకు వాంఛనీయమైనవిషయమని మా సూచన.

## ఆంధ్ర మహిళాసభలో పారిశ్రామిక శాఖలు.

ఈ సంవత్సరము కుట్టు, నేతపని తరగతులు అభివృద్ధిలో ఉన్నవి. 60 మంది విద్యార్థినులు యిందు నేర్పబడు వివిధ విద్యలలో శిక్షితులగుచున్నారు.

వచ్చే నవంబరులో జరుగనున్న కుట్టు, ఎంబ్రాయిడరీ హయ్యర్, లోయరుగ్రేడ్ పరీక్షలకు 25 మంది విద్యార్థినులు దరఖాస్తులు పంపియున్నారు. ఇందు పలువురు రెండేసి పరీక్షలకుకూడా హాజరుగానున్నారు.

అచ్చుకూర్పు, ముద్రణ పనులను నేర్చుటకు యింకనూ యువతులు వుత్సాహముతో ముందుకు వచ్చుటలేదు. క్రమముగా యిందలి విద్యార్థినుల సంఖ్యకూడ అభివృద్ధి చెందగలదని నమ్ముచున్నాము.

స్కూలు ఫైనలు అర్హతగల విద్యార్థినులకు తెలుగు, ఇంగ్లీషు, భాషలలో ప్రూఫులు దిద్దుట మొదలైనవి నేర్పబడును.

* * *

భారత ప్రభుత్వపు పునరావాసశాఖ యాజమాన్యాన వస్త్రములకు రంగువేయుట, అద్దకపుపనులలో శిక్షణ తిరిగి ఈ సంవత్సరము ఆంధ్ర మహిళాసభలో ఆగస్టు 1 వ తేదీ నుండి ప్రారంభమైనవి. ఇందు 12 మంది విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు. అందు 7 గురికి ప్రభుత్వమువారు ఒక్కొక్కరికి రూ 25/- చొప్పున ఉచిత విద్యార్థి వేతనము నిచ్చుచున్నారు.

క్రిందటి సంవత్సరమే ఈ తరగతులు ప్రారంభమైనవని శిక్షణ పొందిన 11 గురిలో పరీక్షకు హాజరైన 10 మంది విద్యార్థినులు కృతార్థులైరని, అందు నల్గురు ప్రథమశ్రేణిలో విజయము గాంచిరని, యిదివరకటి సంచికలో ప్రచురించియున్నాము.

11_వ విద్యార్థిని కుమారి గిడుగు భారతీ సుందరి, అనారోగ్యంవల్ల అప్పుడు పరీక్షకు హాజరు కాలేదు. ఆమెకై మొన్న ప్రత్యేకముగా ఏర్పరచిన పరీక్షలో కృతార్థత పొంది, ప్రభుత్వ సర్టిఫికెట్టుకు అర్హత పొందినదని తెలుపుటకు సంతోషించుచున్నాము.

అ. చన్నఘంటమ్మ.

కరెస్పాండెంటు.



ఈస్టిండియా వారి

# సంక్రాంతి

అన్నపూర్ణమ్మ సంసారము పాలసముద్రము వంటిది. కాని దానికి విరుగుడుగా తయారైన పెద్ద కోడలు శాంత అంతులేని ధనాశతో, భర్త విశ్వంను కీలుబొమ్మగా జేసి సంసారాన్ని అనాథాను పాలు చేస్తుంది. దీనికితోడు విద్యావంతుడైన రెండవ కొడుకు బ్రహ్మానందం వైరాగ్యంలో పడి వుంటాడు. శాంత విజృంభించి తోటికోడలు లక్ష్మిని నానా హింసలూ పెడుతుంది.

ఆవూరిలోనే చంద్రయ్య అనే లక్షాధికారి వున్నాడు. చంద్రయ్య కూతురు రాధ. అన్నపూర్ణమ్మ మూడవ కొడుకు మోహన్‌ను ప్రేమిస్తుంది. కాని ఇద్దరి కుటుంబాలకు బహుకాలంగా విరోధం. మద్రాసులో బి. ఏ. చదువుతూన్న మోహన్ సెలవులకు గ్రామానికి వచ్చాడు. రహస్యంగా తరచు రాధామోహనులు కలుసుకుంటూండేవారు.

శాంత కుటిలత్వం వలన మోహన్ చదువుకు స్వస్తి చెప్పిస్తుంది. ఆఖరికి మామగారి తద్దినానికి గూడ డబ్బు లేదంటుంది. ఈ అన్యాయాన్ని భరించలేక మోహన్ దొంగతనంగా ఇనప్పెట్టిలోంచి డబ్బుతీస్తాడు. ఈ దొంగతనాన్ని శాంత లక్ష్మికి అంట గట్టుంది. లక్ష్మితలమీద పడిన నేరాన్ని తొలగించటానికిగాను మోహన్ తన దొంగతనం ఒప్పుకుంటాడు. వెంటనే శాంత లక్ష్మి మోహన్‌లను గురించి అపవాదువేస్తుంది. ఈ అవమానం భరించలేక లక్ష్మి నూతిలోపడిచనిపోతుంది. బ్రహ్మానందం విరక్తితో యిల్లువదలి పోతాడు.





శాంత ధనాశతో రహస్యంగా కూడబెట్టిన ధనంతో విశ్వం సకుటుంబంగా మద్రాసుపోయి యఫ్. యన్. రావు అనే వింత వ్యక్తితో వ్యాపారంచేసి సర్వనాశన మవుతాడు. అక్కడ చంద్రయ్య ఖూనీ అవుతాడు. నేరం మోహన్ మీద పడుతుంది. దానికి సాక్ష్యం రాధామోహన్‌ల ప్రణయం సక్రమంగా పరిణమించడంతో కథ సమాప్తం.

టూకీగా యిది ఈస్టిండియావారి "సంక్రాంతి" లోని కథ. జూలై నెలలోనే విడుదల కావలసి సెప్టెంబరులో విడుదలకానున్న సాంఘిక చిత్రం.

"సంక్రాంతి" చిత్రంలో శాంతకుమారి, శ్రీరంజని, సావిత్రి, ఆశాలత, శివరావు మున్నగువారు నటించారు. రచన బలిజేపల్లివారు. దర్శకత్వం సి. పుల్లయ్యగారు.

చిత్రం సెప్టెంబరు మాసములో దసరాకు విడుదల జేయటానికి సన్నాహాలు జరుగుచున్నవి.



# లోక చక్రం

* శ్రీ వసంతరావు రామకృష్ణారావు *

కాలాపకాలాలు కలిసిన లోకచక్రంలో
లోపలి పూర్ణవృత్తంలో — అంతరంలో
పరిధిలో — పడిపోయిన మానవుడు,
విశాలమైన విశ్వాంతర వీధుల
విశ్రామ సుఖానుభవం కోసం
వెడలి వెడలి — కడలి కెరటాలలో
సుడిగుండంలోపడిన చుక్కానులేని
నావలోని సముద్రప్రయాణికుని
మాదిరిగా — భవితవ్య మనబడే
మహత్తర శుభాంచిత తీరాన్ని
చేరుకోడానికి చిత్తశుదితో
ఎన్నో ప్రార్థనలు చేస్తున్నాడు !

లోకచక్రపు సరిహద్దులలో
చెలరేగిన బాధల కల్లోలంలో —
ఆకలి అంపపు వాడికోరలలో
చిక్కి — బాధపడి — తెలివితప్పి
చెడిపోయిన — మరణించిన
నియత్నాహుల కన్నీటిచరిత్రలతో
నిండిన హృదయవిదారక విషయాలు
చరిత్రగ్రంథాలను నల్లటిపుటలలో
చదువుకొనే దుఃఖసమయంలో
చిత్రించలేక వర్ణించలేక
మానవుడు వేదనపడుతున్నాడు!
హృదయమనే ఆకాశసీమలో
మెరసిన ఆశల నక్షత్రకాంతుల
అందాన్ని ఆనందానుభవాన్ని
చిత్రించిన చిత్రకారుని చేతిలో
చిరునవ్వులు చిందిన కళారూపం
లోకచక్రపు సరిహద్దులు దాటి
ఉద్వేలమైన కాలవాహినిలో పడి
కొట్టుకొని పోయిన - భిన్నశక్తుల
సంఘర్షణలో తనకు కనిపించిన
మృత్యుతరంగిణి ఆవలిదరిని
చూచి - వణికే గుండెలతో - ఎండిన
దేహంతో మానవుడు పడిపోయాడు !









# మైసూరు పట్టు బట్టలు

## హెచ్చుకాలము మన్నిక కలవి

మునుపటికంటె ఇప్పుడు మైసూరు సిల్కు వస్త్రములే హెచ్చుగా స్త్రీలు ధరించుచున్నారు. మైసూరు సిల్కులో శ్రేష్ఠమైన చీరెలు, గౌను గుడ్డలు, రవికె గుడ్డలు మొదలైనవి స్త్రీలకు, పురుషులకుకూడా అవసరమగు సర్వ విధములగు దుస్తులును అధికముగా వాడబడు చున్నవి.

★

మైసూరు సిల్కులు 100 కి నూరు వంతులు స్వచ్ఛమైనవి, కల్తీలేని పట్టువి.

★

## మైసూర్ సిల్క్స్

గవర్నమెంట్ సిల్కు వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.

---

ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన

## మెహతావారి

## విశేష ఔషధములు

1. సుందరి ఎలిక్సర్ :- సమస్త ఋతు దోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపమ నివారిణి.
2. ఫాస్ఫరస్ ఆయిల్ :- బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానా పిల్సు :- సాధారణబలహీనత, కీళ్ళనొప్పులు జ్వరములన్నిటికి అమోఘముగా పనిచేయును.
4. ద్రాక్షాసవము :-(బంగారము, మకరధ్వజము కలిసినది) రక్తమును శుద్ధిపరచునటువంటి, అజీర్ణము రూపుమాపునటువంటి బలవర్ధకౌషధము.

కెమిస్టులందరివద్ద దొరకును.

తయారుచేయువారు :

**K. S. MEHTA & CO.**

*250, China Bazar, Madras.*

---

## PANNEERU MEEGADA

**(CREAM OF ROSES)**

## పన్నీరు మీగడ



ఇది ముఖమునకు అందము తెచ్చుటయందు చాల ప్రశస్తమైనది. మంచి సువాసన, మొటిమలు పొక్కులను పోగొట్టి ముఖమునకు చల్లదనము, మృదుత్వము, కాంతి, తేజస్సు ఆకర్షణయు కలిగించును. ఎండ తాకుడువల్ల కలిగిన నలుపు పోగొట్టి హాయిని కలిగించును. సౌందర్య పోషణకు ముఖ్యమైనది.

వెల రూ. 1-0-0. (పోస్టేజి ప్రత్యేకము)

విక్టోరియా డిపో, మైలాపూరు, మద్రాసు-4

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras-4
by Mrs. A. C. Krishna Rao, M.A.,L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras-4

ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్ సహాయార్థం 18-8-1952 న సభ విద్యార్థినులు,
సభ్యురాండ్రు, అభిమానులు కలిసి, మ్యూజియమ్ థియేటర్‌లో
ఒక వినోద ప్రదర్శనము జరిపించిరి.



'Light of Asia' లోని దృశ్యము. రచన : డాక్టర్ సి. సత్యనారాయణగారు.
నిర్వాహకులు : శ్రీ రజనీకాంతరావుగారు.



సభ సభ్యురాండ్ర వాద్యగోష్ఠి. నిర్వాహకులు : సభ సంగీతోపాధ్యాయిని శ్రీమతి సుబ్బలక్ష్మిగారు.



'మేనకావిజయం' నృత్యనాటిక. రచన : శ్రీ రజనీకాంతరావుగారు. నిర్వహణ - సభ నృత్యోపాధ్యాయిని
శ్రీమతి సామ్రాజ్యంగారు.



అడయారు బ్రిడ్జ్ రోడ్డులోని

ఆంధ్ర మహిళా సభ మాతా శిశు సంరక్షణశాఖ

నూతన భవనములకు ది 17-8-1952 న ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్‌గారు ప్రారంభోత్సవము జరిపిరి.



విజయదశమి ఆదివారం, ది 28-8-52 న, ఇందు పని ప్రారంభము కాగలదు.

# ఆంధ్ర మహిళా సభ

## వస్త్రములపై రంగువేయుట, అద్దకపుపనులు

విద్యార్థినుల ప్రవేశమునకు గడువు పొడిగింపు. ది 31—10—52 ఆఖరు గడువుగా భారత ప్రభుత్వపు పునరావాసశాఖవారి ప్రకటన :

భారత ప్రభుత్వపు పునరావాసశాఖవారి యాజమాన్యాన, ఆంధ్ర మహిళా సభలో, వస్త్రములకు రంగు వేయుట, అద్దకపు పనులలో, శిక్షణ తరగతులు జరుగుచున్నవి. ఇందు 16 గురు విద్యార్థినులు చేరవచ్చును. ఈ తరగతులలో విద్యార్థినులను చేర్చుకొనుటకు 31—10—1952 తుది గడువుగా ప్రభుత్వము నిర్ణయించి యున్నారు. గనుక కొద్దిపాటి ఇంగ్లీషుజ్ఞానము గలిగి, మూడవ తరగతి కనీస అర్హతగలవారు, వెంటనే యిందు చేరుటకు దరఖాస్తు పెట్టుకొనవలెను.

ఆంధ్ర మహిళా సభ,
మైలాపూరు, మద్రాసు-4

అ. చన్నఘంటమ్మ.
కార్యదర్శిని.



నావిక దళ ఆఫీసర్లుగా తర్ఫీదు పొందిన తొమ్మండుగురు బాలికలకు, భారత నౌకా దళాధిపతి ఎడ్మిరల్ పిజీ, ఢిల్లీలో ఆఫీసర్ బ్యాడ్జిల నొసంగునప్పటి దృశ్యము.



త్వరలో వస్తూంది!

విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో అందించు

శ్రీరాజరాజేశ్వరీ ఫిలింకంపెనీ వారి

# పెదరైతు

అంజలీదేవి.. కన్నాంబ
లింగమూర్తి.. రేలంగి.. శ్రీరామమూర్తి

డైరెక్టర్...
కె.బి.నాగభూషణం
అసోసియేట్
ఇంటూరి





చిత్రియా రిలీజ్...

N44

# కిన్నెర

## సచిత్ర మాసపత్రిక

ఎడిటర్: పందిరి మల్లికార్జునరావు ★ అసిస్టెంట్ ఎడిటర్: పందిరి మీరాబాయి

ఆంధ్రాభ్యుదయానికి కంకణంకట్టుకున్న పత్రిక కిన్నెర. ఆంధ్ర జనానీకం పత్రిక కిన్నెర. ఆంధ్ర సేవకై పుట్టిన పత్రిక కిన్నెర. మన సంఘం, మన ఆర్థిక జీవనం, ఈ విషమ పరిస్థితులలో ఏవిధంగా పునర్నిర్మాణం కావలసిందీ, మన జీవిత సమస్యలూ, వాటిని యెట్లా పరిష్కరించ వలసినదీ వర్ణించే హృదయంగమములైన కథలతోను వినోదాన్ని, విజ్ఞానాన్ని చేకూరుస్తుంది కిన్నెర.

భాష సాహిత్యం, శిల్పం, కళ, ఆర్థిక రాజకీయ విషయాలు, శాస్త్ర విషయక వ్యాసాలు, కథలు, నాటికలు మొదలైనవాటితో సర్వాంగ సంపూర్ణంగా ముచ్చటైన ఆకారంతో ప్రకటింపబడుతుంది.

విడి కాపీ 6 అణాలు — సంవత్సర చందా 4 రూపాయలు.

మేనేజరు : కిన్నెర, 16, జోన్సు స్ట్రీట్, మదరాసు-1.



# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: అక్టోబరు '52 :: సంచిక 6

ముఖచిత్రం : సోదరిప్రేమ.

చిత్రకారుడు : శ్రీ రావు వెంకట్రావు.


కులపతి అడివి బాపిరాజు ... సంపాదకీయము

ఆంధ్ర మహిళా సభలో దసరా ఉత్సవాలు ...

కవి — గేయ నాటిక ... శ్రీ సూరంపూడి భాస్కర రావు

గానప్రశంస ... శ్రీ సోమంచి నరసింహశాస్త్రి

ఆదర్శ జీవులు — కథ ... శ్రీమతి బాపట్ల సుశీల

కవిగారి భార్య - కథ ... శ్రీమతి కొమ్మూరి ఉషారాణి

నగలు-నా గోలు ... శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి

బాలానందం - కథలు ... కుమారి సిద్దాబత్తుల హేమలత, కె. వి. రమణరావు, వణుకూరి బుచ్చిబాబు.

షష్టిపూర్తి - గేయం ... శ్రీ చక్రవర్తి రంగస్వామి

ఇంకా, గద్యాలూ, పద్యాలూ, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష.



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.,

సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.






## కృతజ్ఞత

శ్రీమతి శ్రీరాజా వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మ గారు ఆంధ్ర మహిళాసభకు రూ. 500 లు చందా చెల్లించి పోషకులుగా నైరి.

శ్రీమతి పెమ్మసాని పద్మకుమారిగారు, శ్రీమతి డి. ఎల్. నాచ్చారమ్మగారు ఒక్కొక్కరు ఆంధ్ర మహిళాసభకు రూ. 100 లు చందా చెల్లించి యావజ్జీవ సభ్యురాండ్రైరి.

వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.

ఈమె సిఫారసు



# లోధ్ర



నారీమణులకు

దివ్యౌషధము

ఋతుబాధల తొలగించును

వరుస తప్పుట సరిచేయును

గర్భస్రావముల నరికట్టును

వంధ్యత్వము రూపుమాపును

దొరుకు చోట్లు: ఏ మందులషాపైనా, లేదా,

**కేసరికుటీరం లిమిటెడ్.,**
**మద్రాసు 14**

ఒరిస్సా, నైజాము, ఆంధ్ర, తమిళ, మైసూరు జిల్లాల

ఏజంట్లు:

**శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు**

బరంపురం, సికింద్రాబాద్, బెజవాడ, మధుర, బెంగుళూరు.

# అశోకా అమ్లా హేర్ ఆయిల్




అనేక హేరాయిల్సు

రావచ్చును — పోవచ్చును.

గాని

శాశ్వతముగా వుండునది

**అశోకా అమ్లా హేర్ ఆయిల్**

తలనూనె కుండవలసిన అన్ని సుగుణములు యిందు గలవు. ఓషధిసత్వముల గుణమున్నది. దేశీయ అత్తరువుల సహజ పరిమళ మున్నది. వనస్పతి నూనెలనే ఉపయోగించుటవల్ల ఇది శ్రేష్ఠమైనది. భారతదేశమందే గాకయితర దేశములందును మహిళలు దీని సుగుణ మునుగ్రహించి సదా ఉపయోగించుచున్నారు.

ఘాటైన శింథటికు కెమికల్సువల్ల తయారైన బూటకపు తలనూనెలు వాడుటలో వెంట్రుకలకు, కన్నులకు మెదడునకు హాని కలుగునునగా అశోకా అమ్ల ఆయిల్‌ను ఉపయాంగిచి గుముణను పొందుడు.

★

**విజయ కెమికల్ అండ్ టాయిలెట్ వర్క్సు**

మిక్కిలి శ్రేష్ఠమైన రసాయనములు - పరిమళ ద్రవ్యాల

తయారీదారులు:

15, క్లెమెన్స్ రోడ్, పురశవాకం, మద్రాసు-7.




సంపుటి 9 :: అక్టోబరు '52 :: సంచిక 6

# కులపతి అడివిబాపిరాజు

సుప్రసిద్ధ ఆంధ్ర చిత్రకారులైన శ్రీ అడివి బాపిరాజుగారు, వారి నవలలద్వారా ఆంధ్రులకందఱకూ సుపరిచితులే. వారి ఆఖరు నవల జాజిమల్లి ద్వారా మా పాఠకులకూ పరిచితులే.

కాలధర్మం జెందడమనేది జీవికి సహజం. పుట్టుటగిట్టుట యనేవి ప్రకృతిలో నిరంతరాయమానంగా జరిగే కార్యకలాపాలు. సామాన్యంగా వ్యక్తుల ఉదయాస్తమానాలు ప్రకృతిమాతకు పెరుగు తరుగులొనగూర్చకపోయినా, కొంత మంది ప్రత్యేక వ్యక్తుల అస్తమయంవల్ల మానవ సమాజంలో ఒక తరుగు జరిగి, ఒక ఖాళీ ఏర్పడినట్లు భావించబడ్తుంది. అట్టి ప్రత్యేక వ్యక్తులలో శ్రీ బాపిరాజుగారొకరని చెప్పాలి.

ఒక్కొక్కరు ఒక్కొక్క కళలో ప్రవీణత సంపాదించడమే ఒక గొప్ప విషయం. అటువంటిది శ్రీ బాపిరాజుగారు చిత్రకళలోనూ, సాహిత్యంలోనూకూడా, అసమానమైన ప్రావీణ్యత గడించి అనేక ఉత్తమ చిత్రాలను వ్రాశారు; సాహిత్య రంగంలో ముఖ్యంగా నవలాకాండలో ప్రత్యేక స్థానమునలంకరించ గల రచనలను మన కందించారు.

అయితే, సాహిత్యకారుఁడుగా, చిత్రకారుఁడుగా, ఆయన సంపాదించుకున్న కీర్తికన్నా, సహృదయుఁడు, నిరాడంబరుఁడునైన వ్యక్తిగా, దేశం మొత్తంమీద వివిధరంగాలలో పనిచేస్తున్న వందలాది కళాకారులలో, రచయితలలో శ్రీ బాపిరాజుగారు సంపాదించుకున్న ఆత్మీయత ఎక్కువైనది. కుచ్ఛితమంటే యేమిటో ఎరుగకుండా, ఎంత అపరిచిత వ్యక్తికైనా మనస్సులోని మాట మర్మము లేకుండాచెప్పి, నిర్మలమైన మనస్సుతో, ఆప్యాయత నొలకబోసే ఆయన బోళాదోళీతనం, ఆయనకు మానవత్వాన్ని ప్రసాదించినా, వర్తమానవ్యవహార లోకంలో చలామణీ సంపాదించలేకపోయింది. రాజపోషకత్వం లోపించిన ఆధునిక యుగంలో, వ్యవహారదృష్టి లేని కళాకారులు సౌభాగ్యవంతమైన సుఖజీవనాల ననుభవింపలేరు.

న్యాయవాదవృత్తిలో ఉండికూడా, స్వాతంత్ర్యోద్యమంలో ఇతర సత్యాగ్రహులతోపాటు కారాగారవాసమనుభవించి, తరువాత బందరు జాతీయకళాశాల ప్రధానాచార్యులుగానూ, గుంటూరు కళాపీఠంలోనూ ఎందఱినో కళాకారులుగా చేశారు. చిత్రరచనా, సాహిత్యరంగాలలో వీరికున్న శిష్యులు అధిక సంఖ్యాకులు.

అయితే, కళనొకవృత్తిగా, సంపాదనసాధకంగా ఉపయోగించలేకపోయిన వీరు, తమ 57- ఏండ్ల జీవితంలో, చాలాభాగం, దారిద్ర్య దేవతతో పోరాటం జరిపారు.

సజీవుఁడైన వ్యక్తియొక్క సరియైన విలువను కనిపెట్టి, సకాలంలో తగు ప్రోత్సాహమిచ్చి దేశాభ్యుదయానికి వారిని ఉపయోగించుకోగల జిజ్ఞాస, మొత్తంమీద భారతీయులలోనూ, ప్రత్యేకముగా ఆంధ్రులలోనూ లోపించియున్నదనుట యదార్థము.

ఆంధ్రజాతికే ఒక కొరత, కళాపీఠానికే ఒక వెలితి యని ఆయన అస్తమయాన్నిగూర్చి ఎక్కువగా దుఃఖించుచున్న ఆంధ్రజాతి, ఆయన ఆప్యాయతనూ, ఆత్మీయతనూ అనుభవించిన శిష్యవర్గము, స్నేహబృందమూకూడా, ఆయనపట్ల తమ ధర్మాన్ని సజీవులైయుండగా కొంచమైనా పాటించినట్లయితే, అబలసంతోషి యగువారి ఆత్మ కొంతంత తృప్తిజెందియుండగలదు.

జాజిమల్లి నవలను సీరియల్‌గా ఆంధ్ర మహిళలో ప్రచురించుకొనుటవల్లనేమి, మీరాబాయి త్రివర్ణ చిత్రము, ధాన్యకటకభారతి, రుద్రమదేవి మున్నగు బొమ్మలను ఆంధ్ర మహిళ సంచికలో ముద్రించుకొనుట వల్లననేమి, పత్రిక నిర్వహణలో పొందిన సలహాలవల్లనేమి, "ఆంధ్ర మహిళ" పత్రిక శ్రీ బాపిరాజుగారి వద్ద నుండి మరువరాని సహాయమును, ప్రోత్సాహమును పొందింది. అందుకు కృతజ్ఞత తెలియపరుస్తూ, యీ దుఃఖసమయంలో వారి ఆప్తబంధువులైన భార్య, కుమార్తెలు, వృద్ధమాతలకు, తదితరులకు హృదయపూర్వక సంతాపము తెలుపుతూవుంది.

# ఆంధ్ర విద్యాసంఘం — ఢిల్లీ

## పాఠశాల భవనానికి శంఖుస్థాపన

దిః 21-9-1952, ఇండియా ప్లానింగ్ మంత్రి శ్రీ గుల్జరీ లాల్ నందాగారు, పై పాఠశాల భవనానికి శంఖుస్థాపన చేసినారు. ఇండియా ఉపాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు సభాధ్యక్షత వహించారు.

1948 లో ఈ ఆంధ్ర విద్యాసంఘం స్థాపితమైనది. ఆంధ్రసారస్వతమును, ఆంధ్రసంస్కృతిని, ఆంధ్రదేశవిశిష్టతకు కారణభూతమైన తదితర వ్యాసంగములను అభివృద్ధిజేయుట, ఆంధ్రసంస్కృతిలోని విశిష్టతను, సంస్కృతీసారమును ఆంధ్రేతరప్రజలకు తెలుపుట, ఆంధ్రేతరుల సంస్కృతీ సాంప్రదాయములను పరిచయము చేసుకుని వానిని ఆంధ్రసంస్కృతిలో ఇముడ్చుట యనే వివిధాశయములతో ఆంధ్ర విద్యాసంఘం, ఢిల్లీలోని ప్రముఖులైన ఆంధ్రులచే స్థాపించబడినది. ఇందుకు ప్రథమసోపానముగా, ఢిల్లీలోని ఆంధ్రబాలబాలికలకు మాతృభాషలో విద్యనేర్పి, తమసంస్కృతిని జీర్ణంచేసికోగల అవకాశమును కల్పించడం అవసరమని భావింపబడినది.

దానికిగాను- 1950 మేనెలలో మద్రాసీ ఉన్నత పాఠశాల ప్రాథమిక శాఖలో తెలుగు పిల్లలకని ఒకటి రెండు తరగతులు ప్రత్యేకంగా ప్రారంభించే ఏర్పాట్లు యీసంఘం వారు చేసారు. ఆక్లాసులు చక్కగా జరుగుతూవున్నవి. అనేక దాతలు యీకృషికి ధారాళమైన విరాళాలొసంగి తోడ్పడ్డారు. అందులో ముఖ్యంగా తెలుగుఫిల్ము నిర్మాతలు ఢిల్లీలో తమచిత్రాలు చూపించి, దానిపైవచ్చిన వరుంబడి యీ సంఘానికి విరాళంగా యిచ్చి, చాలాప్రోత్సహించారు.

గతరెండు సంవత్సరాలుగా, యీసంఘంలో జరిగిన అభివృద్ధి కారణంగా, దనిఆధ్వర్యాన్న జరిగే విద్యావ్యాపక కృషికి, ప్రత్యేకమైన భవనావశ్యకత కలిగింది. ఢిల్లీరాష్ట్ర ప్రభుత్వమువారు ఈకృషిని ప్రోత్సాహిస్తూ, ఒక ఎకరము స్థలవిరాళాన్నిచ్చారు, ఇక్కడనే, ఆంధ్రపాఠశాల భవన నిర్మాణానికి దిః 21-9-1952 న శంఖుస్థాపన జరిగినది.

ఈ సందర్భంలో ఆంధ్ర సంఘంవారు, ఆంధ్రులందఱూ భవననిర్మాణంలో విరాళాల రూపంగా తోడ్పడమని విజ్ఞప్తి చేశారు.

భవననిర్మాణానికి 1 లక్ష రూపాయలు కావలెనని అంచనావేశారు. విరాళములు ఆంధ్రవిద్యాసంఘాధ్యక్షులు, 30, పృథ్వీరాజ్ రోడ్డు, న్యూఢిల్లీకి పంపవచ్చును.

ఈసంఘ నిర్వాహక వర్గము.

అధ్యక్షులు— డాక్టర్ స్వామి జ్ఞానానంద
ఉపాధ్యక్షులు— శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగారు
,, బి. రామచంద్రారెడ్డి
కోశాధికారి— ,, సి. వి. నారాయణరావు
కార్యదర్శి— ,, కె. రామగోపాలరావు
సంయుక్తకార్యదర్శి ,, కె. లక్ష్మన్న

ఇతర సభ్యులు శ్రీయుతులు పి. ఎన్. మూర్తి, సి. సంజీవరావునాయుడు, కె. ఈశ్వరదత్తు, కె. రఘురామయ్య, ఎన్. రామశేషయ్య, కె. లక్ష్మణరావు, ఎన్. వి. రామమూర్తి, ఐ. ఎ౯. చారి, శ్రీమతి జి. దుర్గాబాయి.

# ఆంధ్ర మహిళాసభలో

# గాంధీజయంతి

ది 2-10-1952 లక్ష్మివారం సాయంకాలం 4 గంటలకు ఆంధ్ర మహిళాసభలో గాంధీజీ జన్మదినవర్ధంత్యుత్సవం జరిగింది. సభావిద్యార్థినులు, 4 గం॥ నుండి 5 గం॥ వరకూ నూలు వడికిరి. చిరంజీవి గిడుగు భారతి జాతీయ గీతాలు పాడింది. తరువాత జరిగిన బహిరంగసభకు శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మ, ఎమ్. ఎల్. సి. గారు అధ్యక్షత వహించిరి. శ్రీ కొత్త రఘురామయ్యగారు ఎం. పి. శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు ఎమ్. ఎల్. ఏ. సభలో ఉపన్యసించారు.

## కమ్యూనిటీప్రాజెక్టులు—భారత్ సేవక్ సమాజ్

శ్రీ కొత్త రఘురామయ్యగారు ఉపన్యసిస్తూ,గ్రామపునర్నిర్మాణము కమ్యూనిటీ ప్రాజెక్టుయొక్క ప్రధానలక్ష్యం. 300 గ్రామాలొక కేంద్రంగా, అందులో ప్రజల స్వయం సమృద్ధికి, విద్యా, వైద్య సదుపాయములకు తగిన అవకాశాలు, బావులు, చెరువులు తవ్వడం ద్వారా, డామ్‌లు కట్టడంవల్ల, రోడ్లు విద్యాసంస్థలు. వైద్య శాలల నిర్మాణంద్వారా కల్పించడం, కమ్యూనిటీ ప్రాజెక్టుల ఉద్దేశమని, ప్రభుత్వమువారు వారి సిబ్బందిద్వారా, ప్రభుత్వ విత్తముతోనూ, అమెరికా వద్దనుండి అభివృద్ధి నిమిత్తము మనకు రానున్న ధనసహాయముతోనూ, 5 సం॥ యీ ప్రాజెక్టులను అమలు జరపాలని ప్లానింగ్ కమీషన్‌వారి పథకమని వివరించారు.

అయితే ప్రస్తుతము ప్రభుత్వమువారు నిర్మాణముచేయబోయే 55 ప్రాజెక్టులు కేవలం 1½ కోట్ల ప్రజలకే ఉపకరిస్తాయి. 35 కోట్ల ప్రజలకూ అవసరమైన ప్రాజెక్టులను వెంటనే అమలు జరపడానికి ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి ఒప్పదు. అట్లాగని ప్రభుత్వమే దీనిని నిర్వహించాలని కనిపెట్టుకునిఉంటే కొన్ని దశాబ్దాలకుగాని యివి నిర్మాణం కావు. అందువల్ల కేవలం ప్రజాసహకారంతో ఎక్కువ భాగం నిర్మాణం జరుగవలసివుంది. దానికి ప్రభుత్వ సిబ్బందిగాని, ఆర్థికసహాయముగాని కలుగదు. ప్రజలయొక్క ఉత్సాహం, ప్రజలయొక్క నిర్మాణ సమర్థత, ప్రజలయొక్క సేవానురక్తిని సమీకరించి, వారే తమకు తమతోటివారికి స్వయం సమృద్ధి కనువగు కమ్యూనిటీ ప్రాజెక్టులవంటి వ్యవస్థలు నిర్మాణము చేసికోవడానికని యీ భారత్ సేవక్ సమాజ్ ఉద్దేశింపబడినది. రచ్చబండ రాజకీయాల్లో, అనవసర విమర్శనలలో, అంతులేని సోమరితనంలో, వర్తమానంలో విస్తృతంగా వ్యయమగుచున్న యువకశక్తిని సమీకరించడానికి యీ భారత్ సేవక్ సమాజ్ ఒక అవసరమైన సంస్థగా ప్రభుత్వమువారిచే ఉద్దేశించబడినది.

ప్రజలలో ప్రబలిపోయి ఉన్న అవినీతి, లంచగొండితనము మున్నగు అభ్యుదయ నిరోధక శక్తులను నశింపజేయడంకూడా యీ సమాజ్‌యొక్క ప్రధానాశయమని శ్రీ రఘురామయ్యగారు ఉపన్యాసాన్ని ముగించారు.

## ప్రజాసహకారం ఎట్లాసాధించాలి?

తరువాత శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు, ప్రజలకు సంబంధించి, ప్రజాశ్రేయస్సుకై ఉద్దేశింపబడి, ప్రభుత్వముచే అమలు జరుపబడనున్న కమ్యూనిటీ ప్రాజెక్టుల యొక్కగాని, ప్రజాసహకారముతో కొనసాగనున్న భారత్ సేవక్ సమాజ్ యొక్కగాని యదార్థ స్వరూపాలు అవగాహన కాగల పూర్తి వివరాలు యింకా ఆయనకు లభించలేదనీ, నిజంగా యివి ప్రజలకు అభివృద్ధి కూర్చగల ప్రజల వ్యవస్థలేయై, పక్షవిభేదాల కతీతమైన వ్యవస్థలుగా వర్ధిల్లాలంటే, కాంగ్రెసేతర పక్షాలకు చెందిన ప్రజాప్రతినిధులనుకూడ వీని నిర్వహణలో పాల్గొనమని ఆహ్వానించి వారు యిందులో శ్రద్ధతోనూ, ఉత్సాహముతోనూ పనిచేసే సదుపాయాలూ, అవకాశాలూ కల్పిచడం చాలా వాంఛనీయమని, ప్రతిపక్షాన్నీ, కాంగ్రెసేతర పక్షాలను, ప్రజాభ్యుదయ కార్యక్రమాల్లో, కాంగ్రెసేతరులన్న కారణంచేత, అవిశ్వసనీయులని దూరముగానుంచి, నిర్వాహకవర్గాలకు ఆహ్వానింపకపోయినంతవరకూ యీ వ్యవస్థలకు కాంగ్రెసుముద్రే ఉంటుందిదక్క, పక్షరహితమైన వ్యవస్థలుగా ప్రజలలో విశ్వాసమును కల్గించలేవని చెప్పారు.

ఇంకా అవినీతి,లంచగొండితనము నిర్మూలించాలని ఈ భారత్ సేవక్ సమాజ్‌యొక్క ప్రధానాశయమైతే, యీ ప్రక్షాళన వర్తమానంలో సెక్రెటేరియట్‌కు పైలెవెల్

నుండే ప్రారంభించాలి, ఋజుప్రవర్తనలోపించినదని విశ్వసనీయంగా తెలిసినప్పుడు, అనామకులు, అనాథలు. అజ్ఞానులు, అతిస్వల్ప జీతగాళ్ళు ఐన వ్యక్తులపై ప్రభుత్వముచేసే తీవ్ర దండన ప్రయోగము, తెలివితేటలుగల్గి ప్రభుత్వముతో ఎక్కువ పలుకుబడికలిగి, ఉన్నత ఉద్యోగ స్థానములనలంకరిస్తూ, పెద్దజీతములు నందుకొనుచున్న వ్యక్తులపై ప్రయోగించుటకు ప్రభుత్వము వెనుకతీస్తున్న దని ప్రజలలో నాటుకుపోయిన అవిశ్వాసాన్ని తొలగించాలి. జీవనోపాధికారణములు కాగల ప్రాజెక్టునిర్మాణాలు మున్నగు ముఖ్యసమస్యలలోనూ ఇంకా వివాదాస్పదములైన పెక్కు ప్రజాసమస్యలలోనూ, నిష్పాక్షికమైన పరిశీలనసంఘాలు ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలను ప్రజలకు తెలిసేటట్టు ప్రకటించాలి. అప్పుడుగాని ప్రస్తుతం ప్రభుత్వం ఉద్దేశించి దేశమంతా యీనాడు ఆరంభమయ్యే కమ్యూనిటీ ప్రాజెక్టులుగాని, దేశం మొత్తం ప్రజాసేవకై ప్రజలసహకారంతో నిర్మాణముకానున్న భారత్ సేవక్ సమాజ్‌గాని అభివృద్ధి గానేరవు- అని చెప్పారు.

అధ్యక్షులు శ్రీ సీతా మహాలక్ష్మమ్మగారు ఉపన్యసిస్తూ కాటకబాధతో ఆకలిమంటల కెరయగుచున్న ప్రజలలోని సోమారితనమును పోగొట్టి పని కల్పించి దేశసంక్షేమం సాధించడానికి ఉద్దేశించబడ్డ కమ్యూనిటీ ప్రాజెక్టులు వానికి అనుబంధమైన భారత్ సేవక్ సమాజ్‌కూడా ప్రజలు సహకరించవలసిన కార్యప్రణాళికలతో కూడి ఉన్నవి. విజ్ఞానపూరితమై నిర్మాణాత్మకమైన విమర్శ ఏకార్యకలాపానికైనా అత్యవసరమేగాని ప్రభుత్వము తలపెట్టిన ప్రతి చర్యనూ ఎలాగో ఒలాగ విమర్శించడమనేది ప్రజాస్వామ్యానికి మంచిలక్షణముకాదని సలహాచెప్పారు.

వందన సమర్పణ జనగణమన గానంతో సభ ముగిసింది.





ది 28-9-1952, విజయదశమి ఆదివారం సాయంకాలం, ఆంధ్ర మహిళా సభ దసరా పోటీలలో బహుమానములు పుచ్చుకొన్నవారు.
మధ్య పూలమాలాంకృతులు శ్రీమతి రాజా వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మగారు.

# ఆంధ్ర మహిళాసభలో

## దసరా వుత్సవములు.

సెప్టెంబరు 26, 27, 28 తేదీలలో **ఆంధ్ర** మహిళా సభలో, దుర్గాష్టమి, మహానవమి, విజయదశమి పండుగలు వర్షావర్షం జరిగే పద్ధతిలో, దేవీపూజ, బొమ్మల కొలువు, పేరంటములు వినోద కాలక్షేపములతో జయప్రదంగా జరిగిపోయినవి. ఆటలు, పాటలు, వివిధ భాషలలో వక్తృత్వము, నాటకములు, చేతిపనులలో పోటీలు జరిగినవి. గెల్పొందినవారికి విజయదశమినాడు శ్రీ రాజా వాసిరెడ్డి **రాజ్యలక్ష్మమ్మగారు** ఆంధ్రమహిళాసభ తరఫున **బహుమానములు** పంచిరి.

### ఆటల పోటీలు

ది 21-9-52, 22-9-52 లలో విద్యార్థినులకు, సభ్యురాండ్రకు, వారి పిల్లలకు ఆటలలో పోటీలు జరిగినవి.

విద్యార్థినుల సాముదాయక ఆటలలో జండా, జిగ్‌జాగ్ పందెముల రెండింటా మోతీదళము గెలిచి షీల్డును పొందినది. పొటాటో పందెములో హీరాదళము గెలుపొందినది.

మూడు కాళ్ళ పరుగు పందెములో సీనియర్ శాఖవారు పుష్పాగాంధీ, తెరీసాగేబ్రియల్, జూనియర్ శాఖలో బేబీరామ్, జయశ్రీలు గెలుపొందినారు.

బుక్ బేలన్సింగ్‌లో సీనియర్ శాఖ ఎల్. కామేశ్వరి, పుష్పాగాంధీలకు, జూనియర్‌శాఖ బేబీరామ్, ఎన్. భానుమతులకు, పారిశ్రామికశాఖ ధనలక్ష్మికి, ప్రథమ బహుమానములు, వి. విమలకు ద్వితీయబహుమానము యీయబడినవి.

పరుగెత్తు పందెము, సూదీ దారం, ఫైర్ ఆనది మౌ ఔటౌ పందెములలో ప్రథమ బహుమానములు వరుసగా, వి. ఆర్. కాంతి, ఆర్. తులసి—పి. డి, ఇందిర జట్టు, బీనాజజూడియాలకు, రెండవబహుమానము బేబీరామ్, ఎన్. భానుమతి— తెరీసాగ్రేబియల్ జట్టు, ఎల్. కామేశ్వర్లకి యీయబడినవి.

సభ్యురాండ్రు, వారి పిల్లలకు ఆటలు : రొట్టి తినే పందెములో సీనియర్సు గిడుగు సావిత్రి, టి. జి. హైమవతులకు, జూనియర్సు పి. లీల, కె. జోత్స్నలకు, వరుసగా ప్రథమ ద్వితీయ బహుమానములిచ్చిరి.

కుంటే పందెములో సీనియర్సు పి. అనసూయారెడ్డి, జి. పాపాయిలకు, జూనియర్సు కె. ప్రమీల, పి. లక్ష్మీ పూర్ణమ్మలకు, వరుసగా ప్రథమ ద్వితీయ బహుమానము లీయబడినవి.

ఆబ్స్టికల్ రేస్‌లో, ఎమ్. ఎన్. లీలావతి, సి. రాధాబాయిలు, స్కిప్పింగ్ పందెములో ఎమ్. ఎన్. లీలావతి, ఆర్. అనూరాధలు, దిండునందుకోవడంలో ఎ. ఆర్. బి. రాజేశ్వరి, ఎ. సరస్వతులు, ప్రథమ ద్వితీయ బహుమానములు వరుసగా పుచ్చుకొనిరి,

కప్పగంతుల్లో కె. ప్రమీల, ఎస్. మురళి ప్రథమ ద్వితీయ బహుమానములు పుచ్చుకొనిరి.

సూదీదారం పందెములో పి. అనసూయ—పి. సరోజని జట్టుకు ప్రథమ బహుమానము, జి. పాపాయి—జి. సావిత్రి జట్టుకు రెండవబహుమానము యీయడమైనది.

పరుగెత్తు పందెములో కె. ప్రమీలకు ప్రథమ బహుమానము, ఎన్. అమరావతి, పి. లక్ష్మీపూర్ణమ్మలకు ద్వితీయ బహుమానములు యీయబడినవి.

### విద్యార్థినుల చేతిపనులలో పోటీలు

కత్తిరింపుకుట్లు, ఎంబ్రాయిడరీ, నూలు వడకుట, వస్త్రములపై రంగువేయుట, నేతపనులలో ది 22-9-52, 23-9-52 లలో ప్రారిశ్రామిక శాఖ విద్యార్థినులకు పోటీలు జరిగినవి. కుట్టు ఎంబ్రాయిడరీ పరీక్షలకు శ్రీమతి ఎమ్. ఎన్. లీలావతిగారు, నూలు వడకుటకు శ్రీమతి బలుసు కనకరాజేశ్వరమ్మగారు, రంగు అద్దకమునకు శ్రీమతి జ. జమునాబాయిగారు, నేత పనికి శ్రీ ఎన్. గోవిందయ్యగారు పరీక్షాధిపతులుగా నుండిరి.

కుట్టు ఎంబ్రాయిడరీలలో సీనియరు శాఖలో కె. భగీరథి, వి. ఎస్. సరళలకు ప్రథమ బహుమానములు, ఐ. సుందరమ్మ, రోహిణీనాయక్‌లకు ప్రత్యేక బహుమానములు యీయబడినవి. జూనియర్ శాఖలో సుందర లక్ష్మి, తిరులక్ష్మిలకు ప్రథమ బహుమానములు, ఆర్. పద్మ, నాగలక్ష్మిలకు ద్వితీయ బహుమానము యీయబడినవి. నూలు వడకుట, రంగు అద్దకము, చేనేత,

పేషువేయు పనులలో వరుసగా, టి. సుభద్ర, మణి, ఎస్. సుశీల, శంకుతలలకు ప్రథమ బహుమానములు, జి. వెంకు బాయమ్మ, పంకజం, రామలక్ష్మి, ఎమిలియాలకు ద్వితీయ బహుమానములు యీయబడినవి.

## వక్తృత్వపు పోటీలు

ది 24-9-52, 25-9-52 లలో తెలుగు, తమిళం, హిందీ, ఇంగ్లీషు, భాషలలో విద్యార్థినులకు వక్తృత్వ పోటీలు జరిగినవి.

తెలుగు సీనియర్లు, విద్యార్థులు- సంఘసేవ, సమ్మె లను సమర్ధించవచ్చునా, హిందూదేశ జాతివ్యవస్థ, విద్య యొక్క ప్రయోజనములు అను విషయములపై ఉపన్య సించిరి.

జూనియరు శాఖవారు ఒక వచన భాగమును కంఠ స్థముచేసి భావయుక్తముగ ఒప్పగించిరి. శ్రీమతులు గోళ్ళమూడి రాజ్యలక్ష్మమ్మ, పి. రామకృష్ణమ్మ, వి. శకుంతలగార్లు పరీక్షాధిపతులు. సీనియరు శాఖలో కె. ప్రభావతి, జి. వెంకుబాయమ్మగార్లకు, జూనియర్ శాఖలో జి. శంకుతల, ఎమ్. కమలకుమార్లకు వరుసగా ప్రథమ, ద్వితీయ బహుమానము లీయడమైనది.

తమిళంలో సీనియర్ శాఖవారు స్త్రీలు- వైద్యవృత్తి, స్త్రీలు- రాజకీయాలు, విద్య- కర్తవ్యం, అను విషయా లపై ఉపన్యసించిరి. జూనియర్ శాఖవారు ఒక పాఠ్య భాగమును కంఠస్థముచేసి, భావయుక్తముగ వప్పగించిరి. శ్రీ ఎస్. శంకరనారాయణ, శ్రీమతులు కమలా జీవా నందం, రత్నాల అనూరాధగార్లు పరీక్షాధిపతులు- సీనియ ర్సులో కె. కమల, ఎస్. లక్ష్మిలకు, జూనియర్సులో, ఆర్. పద్మ, శాంతలకు వరుసగా ప్రథమ, ద్వితీయ బహు మానములీయబడినవి.

హిందీ భాషలో సీనియరు శాఖవారు ఆడపిల్లలకు ఎట్టి విద్య కావలయును, గృహిణీజీవిత విధానమును గూర్చి విద్యార్థినుల యభిప్రాయములు, విద్యాబోధన ఏభాష ద్వారా జరుగాలి, అనే విషయములపై ఉపన్యసించిరి. శ్రీ దేవరాజయ్యర్, శ్రీమతులు గంగాబాయి ఆప్టే, కస్తూరి రంగనాయకమ్మగార్లు పరీక్షాధిపతులు. ఆర్. సద్గుణకు ప్రథమ బహుమానమును, కుసుమ పటేల్‌కు ద్వితీయబహుమానము యీయడమైనది.



శ్రీమతి రాజా వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మ గారు మోతీదళంవారికి ఆటల షీల్డును బహూకరించు చున్న దృశ్యము.

# దసరా వుత్సవములు

ఆంగ్లభాషలో సీనియరు శాఖవారు విద్యార్థి జీవితముపై సినీమాల ప్రభావము, స్త్రీలకు ఉన్నతవిద్య అవసరమా, కత్తికన్న కలం బలమైనది, వసతిగృహనివాసముయొక్క లాభనష్టాలు, ముష్టివారి సమస్యలనుగూర్చి ఉపన్యసించిరి. జూనియర్సు ఒక పద్యభాగమును కంఠస్థముచేసి ఒప్ప గించిరి. శ్రీ శంకరనారాయణ, శ్రీమతులు ఎమ్. ఎల్. లీలావతి. పి. రామకృష్ణమ్మగార్లు పరీక్షాధిపతులు. సీనియరు శాఖలో బీనాజజూడియా, పి. శమంతకమణి, జూనియరు శాఖలో జి. పుష్ప, పి. డి. ఇందిరలు వరుసగా ప్రథమ ద్వితీయ బహుమానములను పొందిరి.

## సంగీతములో పోటీలు

ది 26-9-52 న గాత్రపాట, వీణ, ఫిడేల్ వాయిద్యా లలో పోటీలు జరిగినవి. పరీక్షాధిపతులు శ్రీమతులు ఎ. లక్షలమ్మ. పి. శకుంతలమ్మ, టి. అహల్యాగార్లు. తేలిక సంగీతంలో ఎస్. రాజ్యలక్ష్మికి ప్రథమ బహుమా నము, జి. శకుంతలకు ప్రత్యేక బహుమానము, కర్ణాటక సంగీతములో పి. లీలాకుమారికి, వీణ వాయిద్యములో వెంకటరత్నమ్మకు ప్రథమ బహుమానములు, ఫిడేలు వాయిద్యములో గుళ్ళపల్లి సుబ్బలక్ష్మమ్మ బహుమానము వి. పద్మావతికి యీయబడినవి.

## నాటకములలో పోటీలు

ది 27-9-52 న భాషలు వారీగా నాటకములలో పోటీలు జరిగినవి. పరీక్షాధిపతులు శ్రీయుతులు అన్నాప్రగడ వెంకటకృష్ణారావు, చామకూరి సత్యనారాయణ, బాలచంద్ర ఆప్టే, శ్రీమతులు సరోజినీ వరదప్పన్, శారదా సుబ్ర హ్మణ్యంగార్లు- ఆదర్శనీయమైన వైవాహిక జీవితం అన్న హిందీ నాటక ప్రదర్శనానికి ఈ మారు షీల్డు యీయబడినది. ఆంగ్లములో రీఫండ్, తెలుగులో మూగ భార్య, అరవములో స్టూడియోలో ఒకరోజు అనే నాట కాలు ప్రదర్శించబడినవి. ఇంగ్లీషు, తెలుగు, అరవ, హిందీ నాటకాలలో చక్కగా నటించినందుకు లెక్కల మాష్టర్ బీనా జజోడియా, జడ్జి ఎస్. రాజ్యలక్ష్మి, దశరథ వేషధారి మేనక, రఘుగావేసిన కుసుమ పటేల్ బహుమా నములు పొందిరి.

ది 28-9-52 న సభ్యురాండ్రు తమ పిల్లలచే నృత్య. నాటక ప్రదర్శనములను జరిపించిరి. శ్రీమతులు కన్ఠా కమల, పాతూరి కల్పకం, శారదా సుబ్రహ్మణ్యంగార్లు యీ నిర్వహణ జరిపిరి. మొదటివారు శ్రావణ భాద్రపదాలు, రెండవవారు క్రొత్త అల్లుడు, అనే నాటకమును ముచ్చటగా ప్రదర్శించిరి, పాతవిద్యార్థినులు జమీందారు మంగలి అనే ప్రహసనం, హాస్టలు విద్యార్థినులు విచిత్ర వేషధారణ ప్రదర్శించిరి. శ్రీమతి ఖిజావతిగారు వీణ వాయించిరి. శ్రీమతి కన్ఠా కమలగారి పిల్లలజట్టుకు, శ్రీమతి కల్పకం గారి పిల్లల జట్టుకు, అభినందనసూచకముగా వెండి గ్లాసులు బహూకరించడమైనది. మంగలి పాత్రధారి అన్న పూర్ణకు, చైనా స్త్రీ, పురుషుల వేషము ధరించిన రూప కుమారి, సుచరితలకు, సోదెమ్మవేషం వేసిన పి. డి. ఇంది రకు ప్రత్యేక బహుమానము లొసంగబడినవి.

**శ్రీమతి రాజా వాసిరెడ్డి రాజ్యలక్ష్మిగారు, బహుమాన ములు పంచిరి.**

శ్రీమతి జమునాబాయిగారు, బహుమానములు పొం దినవారిని అభినందిస్తూ, దసరా కార్యక్రమ నిర్వహణలో సహకరించిన కార్య నిర్వాహక, ఉపాధ్యాయ, పరీక్షా వర్గాలకు, తదితర సభ్యురాండ్రకు కృతజ్ఞత తెలియ జేసిరి. అంతటితో దసరా కార్యక్రమము జయప్రదముగా ముగిసినది.



# ఆంధ్రరాష్ట్ర సాధనకు

## మహిళల సత్యాగ్రహం

ది-28-9-1952, ఆదివారంనాడు, శ్రీమతి మద్దిపట్ల కృష్ణవేణమ్మ (పశ్చిమగోదావరిజిల్లా, దొమ్మేరు) శ్రీమతిసుబ్బమ్మ (భీమవరం) గారలు, సెక్రెటేరియట్ ముందు, ఆంధ్రరాష్ట్ర సత్యాగ్రహోద్యమం సందర్భంగా నిరాహార దీక్షప్రారంభించారు- శ్రీమతి కృష్ణవేణమ్మగారు కాంగ్రెస్ వర్కర్; పశ్చిమ గోదావరిజిల్లా హరిజన హాస్టలు సూపరింటెండెంటు పదవిని నిర్వహిస్తున్నారు.





# కవి

## గేయనాటిక

కథామూలం : మాఘునిగాథ.

శ్రీ సూరంపూడి భాస్కరరావు

అవతారిక :—

కవీ, భార్యా, ఒక బ్రాహ్మణుని ఇంట్లో ఉంటూ ఉంటారు. పాటలలో తన్మయుడై కాలం గడుపుతూన్న కవిని కడుపునింపుకొనే ఉపాయం వెతుక్కోవలసినదిగా ఉద్బోధిస్తాడు బ్రాహ్మణుడు. కవిమాత్రం చిదానందాన్ని కోరుతాడు గాని ఆకలిని ఒప్పుకోడు. కవి మహనీయుడని యెరిగికూడా, అతడికి ఆకలిబాధను తెలియజెప్పే ఉద్దేశ్యంతో, తన యిల్లు విడిచి పొమ్మంటాడు బ్రాహ్మణుడు.

కవి బహిరుద్యానవనంలో ఫలమూలాలుతిని, ఆకలిని దాటి, ఆనందం నిలుపుకుందామని నిశ్చయించుకుంటాడు. భీరురాలైన భార్య ఆ వనవాసపు సౌఖ్యాన్ని శంకిస్తుంది. ఇంతలో ఆ ఫలమూలాలైనా ముట్టరాదని రాజభటుడడ్డుకుంటాడు. కవియొక్క కృతులని మహారాజుకి చూపి ఉదరపోషణకి మార్గం వెతుకుదామని వెడుతుంది కవి పత్ని.

౧

కవి : (తన వాక్కునే శూన్యంగా
అసత్యంగా, తేజోమయంగా
ఉన్న నీలాకాశంలో భావిం
చుకుని తన్మయుడై ఉంటాడు)
ఓ దేవి వాగ్దేవి!
ఈదీనగళమందు
నాదామృతమువోసి
పూదేనె లాలికించె
దోదేవి వాగ్దేవి!
శబ్ద శబ్దము నాత్మ
జగము బింబించునో!
తాన తానమునందు
తేనె తొణుకాడునో,
నాదేవి వాగ్దేవి!
అజుడొసంగినది బ్ర
హ్మాండభాండమిదెల్ల
కవికల్పిత జగత్తు
కరుణించె వాల్మీకి

హే దేవి వాగ్దేవి !
కావ్యగీతానంద
కళ్యాణమయ స్వప్న
కాదంబినీ గర్భ
గతతటిత్కామినీ
వాగ్దేవి వాగ్దేవి !

భార్య : ఈ మనోహరగీతి
కేదేవి పలుకునో
ఈరసార్ద్రగళాన
ఏ బ్రహ్మదాగెనో !
కల్పించుమిా, నాథ !
కావ్యహర్మ్యము లిట్లె
కల్పించి కల్పించి
కలలలో తేలించు ॥

కలుగునే ఈసుధా
కరసుధా నిష్యంది
కోటి జన్మలకేని
కోటి పూజలకేని ॥
కడుపు చిల్లులుపడిన
కలతపడ నేటికో !
చాలునీయతి లోక
సౌఖ్య సంపదనాకు ॥

బ్రాహ్మ : కవిరాజ లేలెమ్మ !
గడచునే కాలమ్మ ?
కవిరాజ చాలునీ
కడుపునిండని పాట.
కావ్య గానము నెవరు
కాంక్షించినారోయి ?
లోకమే మరి నిదుర
లో, కలలుగను టేల ?

కవి : లోకమే పెన్నిదుర
లో మునింగినదేమొ !
లోకమావలనాదు
లోకమే నిజమేమొ !

బ్రా : లోకమావలనేమి
లోకమున్నను నీకు
నా కమ్మ గాబోదు.

క : కనుగొందు నీనిజము
మనియుండినందాక.
ఆనందమే నిజమొ,
ఆకలియె నిజమొ !

బ్రా : కనుగొనుట నీకేల ?
కంటిరెవ్వరు మున్ను ?
కను తెరచి నంతలో
కలలు నిజమాౌనె ?

క : ఇదియేమి మహాత్మ,
ఇటు పల్కగానౌనె ?
ఈరసోపాసకుం
డిటెసాగి పోదగదా ?

బ్రా : కట్టెదుట నిల్లాలు
పట్టెడన్నమునకై
కనలునప్పుడు నీకు
కనరాక పోదులే.

భా : మాయింటి వేలుపా,
మాకేటి బాధలో ?
పట్టెడన్నము నీవు
పెట్టినన్నాళ్ళు ?

బ్రా : నేటి బోనమెగాక
నీకేటి గావలయు,
ఆనందమే బ్రహ్మ
మనుకొందువేగాని ?

క : ఆనంద సిద్ధియే
అతధి జీవులకెల్ల
పరమ యోగులకేని
పామరులకేని ?

బ్రా : గాలిపటములనెగుర
గానైతో బ్రతుకంత ?

# క వి

క : గాలి పటములుగాక
గడ్డి బొమ్మలెగాక
నిలచునే భువనాలు ?
నిలుతురెటు లీజనులు ?
పొట్టనిండినవారు
పొందిరే సౌఖ్యమ్ము,
తనువుకంటెను శాశ్వ
తముగాదె రససిద్ధి ?

బ్రా : ఆనందమే పొందు
మాహ్లాదమే చెందు
మట్టులే భావన
మ్మందుసిద్ధిని బొంది.
పేద బాపడ నేను
బిచ్చమెత్తెడివాడ !
భోజరాజే నిన్ను
పోషింపగలఁడేమొ
క్షమియించి రెపకడ
కదలిపొమ్మెటకేని.

క : బ్రాహ్మణోత్తమ నీకు
బాధగలిగించితినొ
క్షమియింపుమీ నేడె
కదలిపోగలవాడ.

భా : ఇన్నాళ్లు దయజూచి
ఈనాడు కినియుదురె ?
నాథు పాదార్చనకు
నా కరమ్ములు లేవొ ?
మీయింట నూడిగము
సేయుదానను, తండ్రి.

: పయనింతమిక లెమ్ము
భయమంద నేలనే !
రస సృష్టిలో జగతి
రాగిల్లి పోవునే !
శలవయ్యా బుధవరా
శలవింక నెప్పుడో
కలసి మాయింట మీ
కాతిథ్యమిడుదాక
శలవయ్యా బుధవరా,
శలవన్న దాత !

౨

క : ఇదిగోనె నాలోక
మిదె నానివాసమ్ము,
ఈ విశాలాకాశ
మే మనకు నిలయమ్ము !
ఆనందమిచ్చోట
నవధిలేనిది సుమ్ము,
ఇచటనే ముద్దగ
ట్టినది సౌందర్యమ్ము !

భా : ఊరి వెలుపలనేమి
యున్నదండురుస్వామి ?
రేయి చీకటితెరల
రేగ విప్పినయపుడు
ఘూకమో, క్రోష్టువో,
ఘోషలెత్తిన వేళ
పసిడి భూముల కడుపె
విసపునాల్కల బలుప
నూరి వెలుపల నేమి
యున్నదందురు స్వామి ?
ఈ సౌఖ్యమయ సీమ
నేశ్మశానపు చితులు
దాగున్నవో, మనసు
తత్తర మందెడిని.

క : ఆరటించెద వింత
ఆడఁదానవుగదే !
ఏ శ్మశానపు చితులు
ఏ శివుని కారతులో !
మంగళమ్మే ప్రకృతి,
మంగళమ్మే వికృతి !
చావు బ్రతుకులు రెండు

సరిసాటి క్షణికము లె
రింటి విడదీయకే,
రికార్థ మెచనును.

భా : ఈ చిదానందమే
హృదిలోన వాసించి
తరలిపోదురు మీరు
దాసినై నేనత్తు.

క : ప్రకృతి దేవతయొడిని
పవళింప భయమటే ?
పసిపాపలకు లేని
పామరత నీకేల ?

భా : కడుపులో ప్రాణాలు
కళవళించెడుపట్ల
గడియాగ నేర్చునే
కనలు పామరవిజ్ఞ ?

క : నీవేన నీవేన
నిప్పురగిలించెదవు ?
ఈ నీటి కోనేరు
లీ పండ్ల వృక్షమ్ము
లివియెల్ల మనల పో
షించు గృహమేధులే !
నీకేల నాలోన
నిప్పు రగిలించంగ ?

భటుడు : ఈ కొలనులీ చెట్టు
లీ మహీస్థలినేలు
భోజరాజుని సొమ్ము
పొందు యెవ్వరో !

క : పైడి పంటల తల్లి
పాలుపండ్లను గురిసె
రాజాజ్ఞ లేటికో
రాజెవ్వరిచట ?

భ : భోజాజ్ఞ లేనిదే
భోగార్హ తలులేవు.
రాజభటుడను నేను
రాజాజ్ఞ లేక కెం
జిగురాకు నేని చే
జిక్కనీయను మీకు.

భా : భోజరాట్సన్నిధికి
పోయివత్తును నాథ,
మీ కావ్య సంచయమె
మృష్టాన్న మిడగలదు

భ : కవిచంద్రుడా యితడు ?
కవినాథభోజుండు
కనక వృష్టిని గురియు
కలత నొందకుడు.

క : కావ్యసంచయమమ్మి
గణియింతువటె సొమ్ము ?
భూమాత, గోమాత
పూత వాఙ్మయమాత
నరుని ప్రాణాలతో
నరనాథుపాలేన ?
మనుజేశ నామాంకి
తున కర్పణము లేన ?

భా : ఈ పంతములమాట
కిది వేళగాదేమొ
భోజరాట్సన్నిధికి
పోయివత్తును నాథ! సశేషం



అమెరికా పౌరుల మత, రాజకీయ, వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని అంగీకరిస్తూ అమెరికా కాంగ్రెసు 163 సంవత్సరాలక్రిందట 1789, సెప్టెంబరు 25 వ తేదీన శాసనం చేసింది. ఈ శాసనాన్నే సాధారణంగా, 'హక్కుల చట్టం' అని అంటూంటారు.

మతారాధనా స్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం, సమావేశాలు జరుపుకునే స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, తమ ఇబ్బందులను తీర్చమని ప్రజలు ప్రభుత్వానికి దరఖాస్తులు పెట్టుకునే స్వాతంత్ర్యం, వారంటేదైనా వుంటే తప్ప ఎవరి ఇండ్లు సోదాచేయబడని వీలు, విచారణ జరుపకుండా నేరం చేసినట్లు తీర్పు ఇవ్వబడని వీలు, ఉరిశిక్షనుండి విముక్తి, ఒక నేరానికి అనేకసార్లు శిక్ష పొందకుండే వీలు మొదలయినవి.

# గాన ప్రశంస

* శ్రీ సోమంచి నరసింహశాస్త్రి *

మానవజీవితమందు సంగీతమను పదార్థము చాల ముఖ్యమైనదిగా పరిగణింపఁబడుచున్నది. అయ్యది మానవుని హృదయాంతరాళమునకు మార్గము సూచించుచున్నది. అనేక విధములుగ కుందుచున్న మానవుని మనస్సునకు శాంతినొసంగు దివ్యౌషధము గానము. అంతియెగాక సత్వరజస్తమోగుణంబులతో కూడుకొన్న మానవుని అంతరాత్మకు నవబోధముఁగల్గించు పీడలనెల్ల నడఁచి, విశుద్ధాత్మనుఁ బయల్వరుచునది సంగీతముతప్ప వేరెద్దియును కన్పట్టదు. తత్సమయంబున ప్రాకృతంబైన లక్షణములు మానవునియందుఁ గాననగును. మానవునియందు సాధారణముగా గాంచగల విమర్శనాజ్ఞానము, వీనులకింపుగా నుండు మాధుర్యముతోఁగూడిన సంగీతమువలన నశించెనో యనునట్లుండును. అరిషడ్వర్గములు విచ్చవచ్చిన రీతిని పరుగులిడక, కాపరి దగ్గరనుండు తరిగొఱ్ఱియల కైవడి, కట్టుబాటులోనుండునట్లు చేయునది సంగీతము.

మానవుడు జీవమును గోల్పోవును. ఆతని యాత్మ వేరొకవ్యక్తి నాశ్రయించును. పూర్వజన్మకృతప్రారబ్ధము ప్రతివ్యక్తియందునుఁ గాంచఁగలము. అయ్యది మానవుని వీడిపోదు. పుట్టుట,నశించుట. తిరిగిపుట్టుట యనునవియేకదా సృష్టికి మూలసూత్రములు. కాని గానమట్టిదికాదు. అద్దానికి పుట్టుట, నశించుట, తిరిగి పుట్టుట యనునవిలేవు. అయ్యది అమరత్వముఁ బొందియున్నది. అది యొక మహాసముద్రము. కాని అందు మనము దైనికజీవనమందు చూచుచున్న ఘోష కన్పట్టదు. అయ్యది శాంతిసాగరము. విశుద్ధాత్మకు స్థానము. జీవితమందుగల పరిణామములతో ప్రసక్తిలేదు. ఆకాశమందు మేఘములమాడ్కి జీవితమందు గల ద్వంద్వములకది దూరము. అద్దానికి మన ప్రపంచముతో సంబంధములేదు. అదియొక ప్రపంచము. గగనమండలమున అపురూపమగు మేధాసంపత్తిచే సాధారణ మానవుల కగమ్యగోచరమై యుండురీతిని, యెల్లవేళలయందును నక్షత్రములను సద్దుచేయకయె సాగించు నొకా మహత్తరమైనశక్తి తన దివ్యహస్త సంజ్ఞవలన నీ సంగీతమను ప్రపంచమును, యెన్నివిషమపరిస్థితులుఁ గల్గినప్పటికి విధానములోగల క్రమమునుఁదప్పకుండునట్లు గఁజేయుచున్నదని చెప్పుటతిశయోక్తిగాదు. ప్రపంచమందు గల శక్తులన్నియు నెట్లు విశ్రాంతిఁ బొందకయె తమ పని సాగించుచున్నవియో, అట్లే సంగీతమను ప్రపంచములోని శక్తులు నైరము తమ వ్యాపారములు సాగించుచున్నవి. మన ప్రపంచమందు వస్తుసముదాయమంతయు మానవాతీతమైన శక్తిచే నాకర్షింపబడి యొకదానికి మరియొకటి దూరము గాకయున్నవి. అట్లే సంగీతమందుగల భాగము లొకదానికొకటి సంబంధించియున్నవి. ప్రకృతి శక్తుల విడదీయుటెట్లసాధ్యమో, అట్లే గానమందుగల భాగముల విడదీయుటయు నసాధ్యము.

రవితేజస్సువలనఁ గాంతిఁ గోల్పోయిన చక్షువులకు శీతకాంతుఁడొసంగు శాంతి తెఱఁగున, దైనికజీవనమందు మనుజుడుఁబొందిన క్లేశములను పటాపంచలుచేసి సుషుప్తావస్థనుఁ బొందింపఁజేయునది గానమనిఁజెప్పుట సాహసము గాదు. అయ్యది ద్వంద్వములచే గుందుచున్న మర్త్యుని తన యక్కునఁజేర్చుకొని, స్తన్యమిచ్చి మనోవేదనఁజల్లార్చును. మానవజీవితమందుగల సమస్త కామముల ఫలమును తన గర్భకుహరంబున దాచియుంచిన అవ్యక్త సుధీమణిగానము. అద్దాని కటాక్ష వీక్షణములచే మానవుని మైమరపింపఁజేసి తనవైపునకు లాగుకొను దృగ్గోచరము కాని మహత్తర శక్తి గానము.

అయ్యది ద్వంద్వాతీతము. అద్దాని నాశ్రయించిన వ్యక్తిని ప్రపంచము తోడి సంబంధము లేకుండగను, కాలమానముఁ దెలియకుండగను, జేయగలదు. అట్టితరి మానవుడు భీషణహుంకృతులతోఁగూడిన కాలుడు సమీపించినను భయమందఁడు. సంసారసాగరమందు దారితెన్ను గానక పరిపరివిధంబుల వాపోవు మానవునికి మార్గదర్శి

నిమై, పట్టుఁగొమ్మయై, ధైర్యమునొసంగి, శాంతినిఁ గల్పించి, ఉత్సాహమును రేకెత్తించునది గానామృతము. అయ్యది సమస్త మానవలోకమునకు ప్రేమింపదగిన దియు, దాచుకొనదగినదియు, నగు అమూల్యాభరణము. తప్తహృదయు లాశ్రయింపదగిన మహాసంస్థ. ఆ సంస్థ నాశ్రయించిన వ్యక్తులు మహాపురుషులు. సులభసాధ్య ముఁగాదనిఁ దలంచు భగవత్సాన్నిధ్యమును, సునాయాస ముగాఁ బొందగలరనుటాశ్చర్యముగాదు. గానమే భగవం తుడు. భగవంతుడే గానము.

అందువలననే "సదాశివమయమగు నాదోంకార స్వర విదులుజీవన్ముక్తులు" అని త్యాగరాజు చెప్పియుండనోపు. ఆ మహాపురుషుడు గానమందు లీనమై, తన్నుఁదామఱచి, భగవత్సాక్షాత్కారమును బొందియుండవలయును. తన్నుఁ దామఱచునపుడే వ్యక్తికాత్మానుసంధానము గలుగును. ఆత్మానుసంధానముఁ బొందుటయే భగవత్సాన్నిధ్యముఁ జేరుట. అయ్యదియే జీవన్ముక్తికి ముఖ్యలక్షణము. అద్దానిఁబొందుటకై మర్త్యులందఱును పడరానిపాట్లు బడుచు ప్రయత్నింతురు. కర్మమార్గమునఁగొందరు సాంఖ్యమార్గమున మరికొందఱు, జ్ఞానమార్గమున మరి కొందఱు భగవంతునిఁ గన్గొనుటకుఁ బ్రయత్నింతురు. కాని గీతా పారవశ్యముచే సంకల్పములేకయె గాయకుఁడు సిద్ధినిఁబొందుచున్నాడు. అనగా పరమేశునిఁజేరుచున్నాడు. అట్టిమార్గ మన్వేషించి కృతకృత్యులైనవారిలో త్యాగరాజు అగ్రగణ్యుఁడని చెప్పనగును. ఆమార్గము ననుసరించిన వారే జయదేవుఁడు, నారాయణతీర్థుఁడు మొదలుగాగల గాయక శిఖామణులు.

పాపునిసైతము తనయొక్క కటాక్ష వీక్షణములచే మైమరపించి దాసునిగఁజేసికొనగల శక్తిగల్గిన నిర్గుణా కారుడు భగవంతుడు. అట్లే దుష్టునిసైతము సమ్మోహింపఁజేసి అతనిలోనున్న క్రూరతను పోఁగొట్టి దాసునిచేసి కొనగల సామర్థ్యముగల్గినది గానమొక్కటియె. గానము వినునెడ జంతువులుసైతము తమ జాతివైషమ్యమును మరచి సంచరించును. శ్రీకృష్ణపరమాత్మ తన గానమాధుర్యముచే లోకమంతయుఁ దనకు లోబరుచుగొనుట విని యున్నాముగదా. గానముయొక్క మహిమను చాటుట కొరకై భగవానుఁడు లీలామానుష వేషధారియగు శ్రీకృష్ణుని అవతారమునుఁ దాల్చియుండుట నిక్కము. పరాత్పరుని లీలల మానుషములుగదా!



# ఆదర్శ జీవులు

* శ్రీమతి బాపట్ల సుశీల *

రాత్రి 10 గంటలైనది. కృష్ణ పుస్తకము చదివి చదివి అలసట చెంది విసుగుకొని, "ఎన్ని పుస్తకాలు చదివినా ఏమీ ప్రయోజనము లేదు. ఎవరికి తోచినట్లు వారు రాస్తారు: ఈ వెధవ పుస్తకాలు చదివి మనము జీవితాలని పాడుచేసు కోటం అంతకంటె ఏమీ కనిపించదు" అంటూ పుస్తకాన్ని విసిరి, టేబిల్ మీద కొట్టి, మేడమెట్లు దిగి, గబగబా విశ్రాంతికై బీచికివెళ్ళాడు. రాత్రి 10 గంటలు దాటినపిదప బీచిలో ఎవరుంటారు? ఎవరూలేరు. ప్రశాంతంగా ఉంది! చక్కని పిల్లగాలి వొస్తోంది. ఆకాశమంతా కారుమేఘాల తో నిండి ఉన్నది. సముద్రంలో అలలు వీణామందరస్థాయి వలె వీనుల విందుగా ధ్వనిస్తున్నాయి. "భగవంతుడు లేడు లేడని అంటున్నారు చాలా మంది నవనాగరికులు. ఉన్నా డని చెప్పేందుకు కనిపిస్తూవున్న పంచభూతములు ఆధార ములు కావా? మానవమాత్రులు ఎవరు సముద్రాన్నీ, గాలినీ సృష్టించగలరు?" అనుకుంటూనే కృష్ణ బీచివొడ్డున నిద్రపోయాడు. అట్టి రాత్రి సమయమున ఎవరో తొంద రగా గబగబా సముద్రపునైపు నడుస్తూవస్తూ మనస్సు మరొక భావంపై ఉండటం చేతను, చీకటి సమయం కావడం చేతను; దారిలో ఉన్న కృష్ణ కాళ్ళకు తగిలి పడ్డాడు. నిద్ర సమయంలో ఎవరో త్రొక్కటచేత తత్తరపాటులో లేచి వెంటనే చేతిలోని టార్చివేసి చూచాడు. పడినవారు లేచి గబగబ నడుస్తున్నారు. వెంటనే,

"ఆగు! ఆగకపోతే చంపేస్తాను"

...అంటూ వెంబడించాడు, కృష్ణ. వెళ్ళేవారు తప్పని పరి స్థితి అగుటచేత ఆగిపోయేరు. కృష్ణదగ్గరకుచేరి "ఏరా? నిద్ర పోతున్నానని దొంగతనం చేసేందుకు వచ్చావా? నీ దుప్పటీ నీ వ్యవహారం చాలా బాగా ఉంది! ఇక్కడ నిన్ను చంపేస్తే నీకు దిక్కెవరు? మాట్లాడవేం" అంటూ ఎదుటికి వెళ్లాడు: ఎవరో గుర్తించాలని. నెత్తిమీద దుప్పటి ఒత్తి గించాడు. వెంటనే కంగారు పడ్డాడు. ఆమె 16 సంవత్సర ముల చక్కని యువతి. ముఖం చంద్రబింబంలా వున్నది. కాని దీనభావం మబ్బువలె ముఖాన్ని కప్పింది. కృష్ణకు మనస్సులో భావాలు రైళ్ళలాగు పరుగెడుతున్నాయి. అంత చదువుకున్నవాడూ నీరైపోయాడు. ఏం మాట్లా డాలో తెలియటం లేదు. ఆమె తలవంచి కన్నీరు బొట బొటా రాలుస్తూనే ఉంది. వెనుకకుపోయిన ధైర్యాన్ని తిరిగి ముందుకు లాగుకొని, కృష్ణ "అమ్మా! మీరెవరు? దీనంగా కనిపిస్తున్నారు. యిల్లా అర్ధరాత్రి సమయంలో ఒంటరిగా యిక్కడికి ఈ వేషంలో రావడంలో మీ ఉద్దేశ మేమీ నాకు బోధపడటం లేదు" అన్నాడు.

ఆమె చేతులు జోడించి నమస్కారం చేసి, "అయ్యా నా దోవను నన్ను వెళ్ళనియ్యండి. అదే నా కోరిక" అని పలికింది.

—"చూడకపోతే ఏమి జరిగేదో తెలియదు కాని, చూచిన తర్వాత విచారంతో నిండిన స్త్రీని పురుషుడు వదలి పెడతాడా? ఎక్కడికి వెడతారు? మీ ముఖాన్ని చూస్తే మనస్సు చాలా విచారంగా వున్నట్లుంది. మీరు ఎవరు? ఏం పనిచేస్తున్నారు?" అని అడిగాడు.

కాని, మనస్సులోమాత్రం చాలా బాధపడ్డాడు. ఈమె జీవితంలో ఎన్నో కష్టాలను భరించలేక సముద్రంలోపడి ఆత్మహత్య చేసుకుందామని వస్తూన్నట్టు గ్రహించాడు.

"నేను సామాన్య కుటుంబానికిచెందిన ఒక అమ్మాయిని. నాకు ఈ దేశంలో స్థానంలేదు. పంచభూతాలు నాకోరకు ఎదురు చూస్తూన్నవి. ప్రశాంత సమయంలో నా త్రోవను నన్ను వెళ్ళనియ్యండి" అన్నది రేఖ.

కృష్ణ ఆమె చెయ్యి పట్టుకొని ప్రక్కకు తీసుకొని వస్తూ "అమ్మా! కష్టాలు జీవితాన్ని వెంబడిస్తూ ఉంటాయి. కాని, వాటికి లోబడి ఆత్మహత్య చేసుకోటం మహా దోషం కాదా? ఆదర్శాన్ని అజ్ఞానంచేతనైనా సాధింపవచ్చును. పూర్తిగా జ్ఞానంచేతనైనా సాధింప వచ్చును. కాని మూర్ఖత్వంచేత ఎవరూ సాధింపలేరు. ఆత్మహత్య మూర్ఖ త్వంకంటె చెడ్డది" అన్న మాటలు వినగానే...

"బాబూ! నా జీవిత పరిస్థితి మీకు తెలియదు. మా నాన్నగారు దేశానికి సేవ చేస్తూ ఉండేవారు. క్రిందటి సంవత్సరం కాలంజేశారు. అమ్మగారికి కండ్లు జబ్బుచేసి, కండ్లు పోయాయి. మేము చిరకాలంనుంచి ఉంటూవున్న ఇల్లు ఈరోజున అప్పులవారి వశమైపోయింది. చదువు కుందామంటే ధనం లేదు. ఒక సంవత్సరంనుంచి జాకెట్లు కుట్టి జీవితం గడుపుతున్నాను. వారం రోజుల నుండి కుట్టుపనికూడా జరగడంలేదు. నిన్నటినుంచీ ఇంటిలో తిండికికూడా బియ్యంలేవు. ఇటువంటి కష్టాలతో బ్రతికి వుండి ప్రయోజనమేముంది. జీవితాన్ని ఎలా గడపను? తల్లి తిండిలేక యింటిదగ్గర మలమలా మాడిపోతూంటే చూడలేక......"

రేఖ కష్టాలు వింటూంటె కృష్ణకు తీరని దుఃఖం వచ్చింది. కళ్ళవెంబడి నీరు కారుస్తూ "రేఖా! చిన్న వయస్సులోనే నీకు తీరని కష్టాలు వచ్చినమాట నిజమే. కాని దేశం స్వతంత్రమైనది. ఎన్ని కష్టాలు వచ్చినా స్వతంత్ర దేశంలో జీవితం గడపటం ఉత్తమమైనది కాదా?"

"బాబూ! స్వాతంత్ర్య మన్నది ధనవంతులకే కాని నావంటి బీదవారికి కాదుకదా? సామాన్యుల జీవితాలు ఆనాటికానాడు తిండీ బట్టా లేక అడుగంటుతున్నాయి. భాగ్యవంతుడు, భాగ్యవంతుడినే గౌరవిస్తాడు. మావంటి బీదవారిని చూసేది ఎవరు దేశంలో?"...రేఖ జ్ఞానవంతురా లని కృష్ణ గ్రహించాడు. రేఖకూడా మాటలనుబట్టి, కృష్ణ మర్యాదస్థుడనీ జ్ఞానవేత్త అనీ ఊహించింది. ఈలా మాట్లాడుతూనే కృష్ణ ఆమెను తన గదికి తీసుకొనివచ్చాడు. అతనికి లోటు ఏముంది? జమీందారు కుమారుడు. ఎం.బి. బి.ఎస్. చదువుతున్నాడు. సుందరరూపుడు. సరస్వతితో లక్ష్మికూడా అతని గదిలో తాండవమాడుతున్నది. వెంటనే కృష్ణ గూటిలో ఉన్న పండ్లు తీసుకొని వచ్చి ఆకలితో ఉన్న రేఖకు తినమని యిచ్చాడు.

"నా కిన్ని అవసరం లేదు. రెండు పండ్లుమాత్రం యివ్వండి. మా అమ్మగారికి తీసుకొని వెడతా" అన్నది. అల్లా కాదని కృష్ణ దగ్గర కూర్చొని పండ్లు తినిపించి గ్లాసు లోని పాలుకూడా ఇచ్చాడు. పండుతిని పాలుత్రాగింది. తరువాత ఆమె తల్లికి కావలసిన ఫలాలుకూడా యిచ్చాడు. వెంటనే జేబులో ఉన్న పర్సుతీసి "రేఖా! యిదిగో తీసుకో: ధనమనేది జీవితానికి ఆదర్శం కాకపోయినా, దేశంలో యిది వుంటే కాని నిముషమైనా గడవటం లేదు. నాకు ధనానికి లోటులేదు. పుట్టినది జమీందారు వంశం. నీకు ఏ సహాయము కావలసినా నేను చేస్తాను. కాని, ఆత్మహత్యకు మాత్రం ఎప్పుడూ సాగిపోకు".

ఆమె చేత చేతిలో ప్రమాణం చేయించుకొని, ఆమెను తీసుకొనివెళ్ళి యింటివద్ద దిగపెట్టి, ఆమె తల్లిని చూసి, ఓదార్చి,

"శెలవు రేఖా! వెళ్ళి వస్తాను" అన్నాడు.

వెంటనే రేఖ కృష్ణపాదాలకు నమస్కారంచేసి, "యీ రోజున మీరు కేవలం భగవంతునివలె ప్రత్యక్షమయ్యారు. లేకపోతే మా రెండు జీవితాలు అధోగతిపాలే కదా? మీ మేలు మరచిపోలేను" అన్నది. కృష్ణ ఆమె ఇల్లు వదలి తన గదికి వెళ్ళినాడు. అతను వెళ్ళిన తర్వాత జరిగిన కథ అంతా రేఖకు ఒక స్వప్నమువలె కనబడుతోంది. గదికి వెళ్ళేటప్పటికి అతని స్నేహితుడు మోహన్‌కూడా అప్పుడే చేరుకున్నాడు. మోహన్, కృష్ణ క్లాసుమేట్. ఈతడు తన జీవితంలో ఏ నియమాన్నీ పాటించలేడు; అర్థంకాక కాదు. ఆచరణలో పెట్టలేక! నవనాగరికుడు. ఫేషన్ని జీవితానికి ఆధారంగా చేసుకున్నాడు. వేశ్యా లోలుడు. మోహనుని కృష్ణ చూచి "మోహన్! నిన్ననే కదా యిక వేశ్యల యింటికి వెళ్ళనని చెప్పావు. కాలేజిలో చదువుకుంటూ యింత అవివేకంగా ఉంటే ఎల్లా చెప్పు?"

"కృష్ణా! నీవు నిన్నటిదాకా చెప్పిన నీతులన్నీకూడా విన్నాను. మనస్సు ఎంత మార్చుకుందామన్నా మార్చుకో లేకపోయాను".

"మోహన్! ఆనాటికానాడు పిచ్చివాడవు అవుతు న్నావు. నవనాగరికత జీవితానికి ఆధారమని నీవూ, పుస్తకమే జీవితానికి ఆధారమని నేనూ: దేశపరిస్థితీ ప్రజల భావమూ మనమిద్దరంకూడా గుర్తించటంలేదు: ధనగర్వం చేత".

అతని మాటలు విని మోహన్ చాలా చిన్నబుచ్చుకున్నాడు. ఇద్దరూ పవళించారు—యిద్దరూ బాల్యం నుంచి స్నేహితులు—దేశ నియమాలలోనూ, సాంప్రదాయంలోనూ, మంచి వుందని వాటి ననుసరించి జీవితం గడపాలని కృష్ణ ఉద్దేశం. దేశ నియమాలయందు నమ్మకం తక్కువ; ప్రత్యక్షంగా చూసే విషయాలనుబట్టి సుఖ జీవితం గడుపుతున్నాడు, మోహన్.

* * *

మరునాడు రేఖ, తిరిగి ఎస్. ఎస్. ఎల్. సి.లో ప్రవేశించింది. స్వంత యిల్లు నిలబెట్టుకుంది. ప్రతిరోజు సాయంత్రం 5 గంటలకు తాను తయారుచేసిన ఫలహారం, కాఫీ తీసుకొని కృష్ణ గదికి వస్తూ ఉండేది. కృష్ణ, ఆమెకు విద్యలలో కూడా తోడ్పడి ఆనాటికానాడు జ్ఞానవంతురాలిని చేస్తూ ఉండేవాడు. యిద్దరూ మనస్సులో గాలిమేడలు కడుతున్నారు. యౌవనవంతులకు ప్రేమ భావాలలోను భాషా విలాసాలలోను లోటేముంటుంది? ఒకనాడు రేఖ కృష్ణ గదిలో ఉన్న సమయంలో కృష్ణ తండ్రి, జమీందారు నారాయణరావు కృష్ణుని చూద్దామని వచ్చాడు. కృష్ణ ఫలహారం తీసుకుంటున్నాడు—రేఖ విసురుతూంది. ఆ దృశ్యాన్ని చూచి నారాయణరావు నిర్ఘాంతపోయాడు. తండ్రిని చూచి కృష్ణ భయపడ్డాడు. ముఖభావాలిని గ్రహిస్తున్న రేఖ వెంటనే లేచి యింటికి వెళ్ళిపోయింది. నారాయణరావు కృష్ణ జీవితం చెడిపోయినదని నిశ్చయించి వెంటనే అతనిని తన గ్రామానికి బలవంతంమీద తీసుకొని వెళ్ళాడు. కృష్ణ వెళ్ళేటప్పుడు ఒక వుత్తరం వ్రాసి రేఖకు అందజేయమని మోహన్‌కు యిచ్చి వెళ్ళిపోయాడు. రేఖకు లేఖ చేరినది. చదువుకుంది.

"రేఖా! నేను మా నాన్నగారితో యింటికి వెడుతున్నాను. కొద్దిరోజులలోనే తిరిగివస్తాను. నీకు ఏమి కావలసినా మోహన్ని అడిగి తీసుకో. నాకోసం విచారించవద్దు. సంతోషంగానే తిరిగి చేరుకుంటాను" అని సందేశం.

* * *

నారాయణరావు వెంటనే కృష్ణకు జమీందారు గోపాలరావుగారి కూతురైన లతాదేవి నిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు. కృష్ణతో "నాయినా! కృష్ణా! ఈ వారంలో గోపాలరావుగారి కూతురు లతాదేవితో నీ పెళ్ళి నిశ్చయించాను. ఆమె చాలా అందమైనది. అమెరికా వెళ్ళి చదువుపూర్తి చేసుకుని వచ్చింది. నీ స్నేహితులకి వెంటనే శుభలేఖలు పంపుకో" అని నారాయణరావు చెప్పగానే కృష్ణ మనస్సు చెదిరిపోయింది. చిన్నతనంలోనే తల్లి గతించటంచేత ఏనాడూ తండ్రిమాటకు ఎదురు చెప్పి ఎరుగడు. కాని విధి బలవత్తరమైనది.

"నాన్నగారూ! యిప్పుడు నాకు పెళ్లికి తొందరేముంది? ఈ సంవత్సరం చదువు పూర్తి అయిన తర్వాత చేసుకుంటాను" అని కృష్ణ చెప్పగానే పట్టలేనికోపంతో నారాయణరావు, "పట్టణంలో నిన్ను చదువుకు పెట్టింది పల్లెపిల్లలతో తిరగమని కాదు. జమీందారు వంశానికి కళంకం తీసుకొని వస్తున్నావు. యీ పెండ్లి జరిగి తీరవలసినదే"...ఆ మాటలు వినగానే కృష్ణకు తగని దుఃఖం వచ్చింది. "నాన్నగారూ! నేనూ చదువుకున్నవాడినే. నేను జమీందారు వంశానికి కళంకమేమీ తీసుకు రాలేదు. కాని నా పెళ్లి విషయంలో నాకు స్వాతంత్ర్యం యివ్వండి" అని ఎంత కోరినా నారాయణరావు వినలేదు. జమీందారు, జమీందారునుండే స్వాగతం పొందాలని చూస్తూండడం మానవ సహజం కదా? "తప్పని సరిగా పెండ్లి జరిగి తీరవలసినదే" అన్నాడు, నారాయణరావు. యింక కృష్ణ యేమీ సమాధానం చెప్పలేదు. రాత్రి నిద్ర పట్టటం లేదు. రేఖ ప్రేమను కోరి మాట యిచ్చిన కృష్ణ, ఆమెను ద్రోహం చేయటమా? లేక తండ్రిమాట నిరాకరించటమా? జీవిత సమస్యలలో ముఖ్యమైనది పెండ్లి. వెంటనే అర్ధరాత్రి బయలుదేరి కృష్ణ యిల్లు వదలిపెట్టి వెళ్ళిపోయాడు. తిరిగి మదరాసు చేరుకున్నాడు. రేఖను చూడగానే అపరిమితానంద భరితుడయినాడు.

* * *

మరునాడు సాయంత్రం కృష్ణా రేఖా కలిసి బీచికి వెళ్ళారు. చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. మిగిలిన జనమంతా వెళ్ళిపోయారు. పండు వెన్నెల... రేఖ చిరునవ్వుతో,

"కృష్ణ బాబూ! మనస్సు ఎప్పటికప్పుడు మిమ్ములిని

ఏదో అడుగుదామని అనుకుంటూ ఉంటుంది. కాని అడిగేందుకు భయపడుతూ ఉంటుంది. దీని భావమేమిటో నాకు తెలియటం లేదు" అనగానే కృష్ణ రేఖను దగ్గరగా చేరదీసుకొని, "అడుగు భయమెందుకు? మనది నిశ్చలమైన ప్రేమ రేఖా!

వెంటనే రేఖ అతని చేయి పట్టుకొన్నది......పంచ భూతములసాక్షిగా యిద్దరు ఆ పండువెన్నెలలో పెండ్లి చేసుకున్నారు...

ఆనాడు కష్టాలు భరించలేక విధి చూపించిన అమావాస్య కారు చీకటిలో సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకుందామని వెళ్ళిన రేఖకు ఈనాడు పండువెన్నెలలో పెండ్లికి అదే స్థలం స్వాగతమిచ్చినది. విధివిలాసం ఎవరికి తెలుసు? ఏనాటికి ఏ జీవితంలో ఏ మార్పు కలుగుతుందో...

ఆనాటినుంచి రేఖా కృష్ణులు ఇద్దరూ ఒక చోటనే ఉండి సంసారం చేస్తున్నారు. భర్తకూ, తల్లికీ రేఖ సేవ చేస్తూ సంతోషంగా కృష్ణతో జీవితం గడుపుతోంది.

* * *

కృష్ణ ఎం.బి. బి.ఎస్. ఉత్తీర్ణుడైనాడు. రేఖకూడా ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. మనస్సులో చాలా బాధపడుతున్నాడు కృష్ణ! ఎందుకు? తండ్రి మాట నిరాకరించినందుకు. వెంటనే బయలుదేరి రేఖను తీసుకుని కృష్ణ తన వూరువెళ్లి యిల్లు చేరుకున్నాడు. తండ్రికి నమస్కారం చేశాడు. రేఖకూడా మామగారి పాదాలకు నమస్కారం చేసింది. జరిగిన కథ అంతా తండ్రితో చెప్పాడు కృష్ణ.

నారాయణరావు తాను పెండ్లికి కుమారుని నిర్బంధించినందుకు పశ్చాత్తాపపడ్డాడు. కృష్ణకు వెంటనే స్వంత ఆస్పత్రి కట్టించిపెట్టాడు. అనారోగ్యవంతులగు బీదవారికి తీరని సేవ చేస్తూన్నారు రేఖా కృష్ణులు. గ్రామమంతా వీరిద్దరిని ముద్దుబిడ్డలవలె చూసుకుంటున్నారు. రేఖ యింటి పనులందు ఆరితేరి ఆస్పత్రిలో కృష్ణకు చేదోడు వాదోడుగా ఉంటూ పవిత్రమైన ప్రేమని అనుభవిస్తూ జీవితం గడుపుతోంది. కాని మోహన్, వేశ్యాలోలుడవటంచేత రోగపీడితుడై, జీవితంలో సౌభాగ్యాన్ని కోల్పోయి తన మిత్రుని ఇంటికి చేరుకున్నాడు. కృష్ణ, రేఖ, మోహానుని పరిస్థితికి చాలా విచారించి అతనిని ఆరోగ్యవంతుని జేయుటకు ఎన్నోవిధాలు ప్రయత్నం చేశారు. ఆఖరిరోజున మోహన్ కృష్ణను పిలిచి, "మీ జీవితాలు భారతదేశంలో చాలా పవిత్రమైనవి. నేను ధన గర్వంచేత నీవెంత చెప్పినా వినక జీవితాన్ని పాడుజేసుకున్నాను. మీ సంసారాన్ని భగవంతుడు ఎల్లవేళలా కాపాడుతూనే ఉంటాడు" అని చెప్పి ప్రాణాలు విడిచాడు, మోహన్. కృష్ణ మిత్రుని మరణానికి చాలా విచారించాడు.

ధనమహాత్మ్యము! ఒకరిని పాడుజేసింది. మరొకరిని బాగుజేసింది. కృష్ణ రేఖల ప్రేమ ఫలితంగా ఒక ముద్దు బిడ్డడు, జన్మించాడు. కృష్ణ మిత్రుని కోల్పోయినా అతని ప్రేమమరవక కుమారునికి "మోహన్" అని పేరు పెట్టాడు.



మిలిటరీ సర్వీసులో స్త్రీలు చేరడం తనకు సమ్మతమేనని ఈజిప్షియన్ సర్వసేనాని జనరల్ నజీబ్ మహిళోద్యమ నాయకురాలు మదాం డోరియా షఫీక్‌కు తెలియజేశాడు.

సాయుధ బలాల శాఖలో గుమాస్తాలుగాను, కారు డ్రైవర్లుగాను, విమాన విధ్వంసక శతఘ్నులను ప్రయోగించే సిబ్బందిగాను స్త్రీలుకూడా పనిచేయడానికి అనువుగా సైనిక సంప్రదాయాల చట్టాన్ని సవరించడానికి ఆయన సుముఖత్వం ప్రకటించాడు కూడా.



కథానిక

# కవిగారి భార్య

శ్రీమతి కొమ్మూరి ఉషారాణి, బి.ఏ.

యమున అనే పేరులో ఎంత మాధుర్యముందో ఆ పేరు గల వ్యక్తిలో గూడా అంత మృదుత్వం ఉందంటే అతిశయోక్తి కాదేమో! యమునని చూస్తే గులాబీ పువ్వులు, అజంతా విగ్రహాలు, కృష్ణశాస్త్రి కవిత్వం జ్ఞాపకాని కొస్తాయి. తెల్ల జార్జెటు చీర కట్టుకుని, తలంటి పోసుకొని, వదులుగా వేసుకున్న జడలో మల్లెపూలు పెట్టుకొని, యమున డాబామీదికి వస్తే, ఆమె ఒక్కసారి కనుపిస్తే చాలునని, సైకిళ్లేసుకుని కుర్రాళ్లందరూ, యింటిచుట్టూ తిరిగేవారు. ఎర్రగా, పొడుగ్గా, సన్నగా అతి నాజూకుగావుండేది. యమున నవ్వినప్పుడల్లా బుగ్గన పడేసొట్టలు, గడ్డం కింద ఉన్న పుట్టుమచ్చా, ఆమె చక్కదనానికి మరింత వన్నె తెచ్చేది. ఎప్పుడూ నవ్వు ముఖంతో ఉండే ఆమెలో వెకిలితనం ఎక్కడా కనుపించదు. గంభీరంగా ఉన్నా ఆ ముఖంలో ప్రశాంతత కనుపిస్తుంది. అంత చెలాకీది కాక పోయినా ఆమెతో ఒక్కసారి పరిచయం చేసుకున్న వాళ్లు ఆమెను వదిలిపెట్టేవాళ్లు కారు. నూరుమంది అడవాళ్ల మధ్యననిలుచోపెట్టినా, యమునను ఇట్టే కనిపెట్టేయవచ్చును. అదే ఆమెలో ప్రత్యేకత.

బరంపురంలో పేరుపడ్డ వకీలు వెంకయ్యగారి ఒక్కగానొక్క కూతురు యమున. చిన్నప్పుడే భార్యను పోగొట్టుకున్న వెంకయ్య తన పంచప్రాణాలు కూతురు మీదే పెట్టుకుని ఆమెనెంతో మురిపెంగా పెంచాడు. పునర్వివాహం చేసుకుంటే, యమున కేమైనా కష్టాలు కలుగుతాయేమోనని, ఆ మాట తలపెట్టనే లేదు వెంకయ్య. తల్లిలేని పిల్ల అనే కారణంచేత, మేనత్తలు, అమ్మమ్మలు యమున నెంతో గారాబంగా పెంచారు. ఆమె ఎక్కువ నడిస్తే కాళ్ళరిగి పోతాయని, వంట చేస్తే చేతులు మొద్దుబారిపోతాయని, పువ్వులో పెట్టి ఎంతో ముద్దుగా పెంచాడు వెంకయ్య. యమున అల్లరిచేస్తే ఎవ్వరూ విసుక్కునేవారు కాదు. ఆమె ఏడిస్తే అందరూ ఆమెతో కలసి ఏడ్చేవారు. ఇంటిల్లిపాది ఆమె ఒక్కసారి నవ్వితే చాలునని చుట్టూ భజనచేసేవారు.

ఇటువంటి వాతావరణంలో పెరిగిన యమున సామాన్యమైనవ్యక్తిని ఎలా పెళ్ళిచేసికుంటుంది? పుస్తకాలు చదవటం, పెయింటింగ్సు వందలుకొద్దీచూసి ఆనందించటం, సముద్రతీరానికి షికారు వెళ్ళడం, ఆమె నిత్యకృత్యాలు. నవలలు, పద్యాలు చదవటం ఆమెకు బహు సరదా. సాహిత్యమంటే ఎక్కువ ప్రీతిగల ఆమె రచయితల సంఘ సమావేశాలకీ, అభ్యుదయ మీటింగులకి తప్పకుండా హాజరయేదనటంలో ఆశ్చర్యంలేదు. కథలు వ్రాద్దామనే ఉబలాటం ఆమెకున్నా తీరా వ్రాయడానికెందుకో భయపడేది. స్కూలుఫైనలు పాసయాకే, ఒంట్లో అస్వస్థతవల్ల చదువు మానేసింది. కాని ఎప్పుడూ తెలుగు, ఇంగ్లీషు నవలలు చదివేది. యమునకోశ గదినిండా పుస్తకాలుండేవి. ఆమెకు ముఖ్యంగా బుచ్చిబాబు కథలు, గోపీ నవలలంటే చాలా యిష్టం.

యమునని వివాహం చేసుకుందామని చాలా మంది ప్రయత్నించేవారు. కాని ఫలించలేదు. యమునదాకా రాకుండానే, వెంకయ్యే వారందరినీ తరిమేశేవాడు. అంత చక్కని తన కూతురుని సాధారణమైన వాడికిచ్చి పెళ్ళి చేయటము ఆయనకి సుతరమూ యిష్టంలేదు. డాక్టర్లనీ, ఇంజనీర్లనీ, లాయర్లనీ, అందరూ వివాహం చేసు కుంటారు. తన కూతురు మటుకు అట్లాగాక ఒక ప్రత్యేక విశిష్టత వున్న వ్యక్తికి భార్య కావాలని ఆయన కోరుకునే వాడు. ఆకోరిక ఫలించ డానికే యన్నట్లు మద్రాసులో వెంకయ్యకి మధుసూధన రావుతో పరిచయ మయింది.

గోపీ అనే మారుపేరుతో వెలువడిన కథలన్నీ అతను వ్రాసిన వనీ, గొప్పఆస్తి పరుడయిన సుబ్బరాయశాస్త్రి

గారి కొడుకే మను అని తెలుసుకున్న వెంకయ్య పొంగిపోయాడు. బరంపురం వచ్చిన తరువాత కూతురుకి గోపిని గురించి చాలా గొప్పగా చెప్పాడు. యమునకి మొదటి నుంచీ గోపీ కథలన్నా, నవలలన్నా పిచ్చిమోజు కనుక, ఆ గోపియే అవివాహితుడని, తన తండ్రికి పరిచయమైనాడని తెలియగానే, ఎందుకో చాలా ఆనందం పొందింది.

అనుకోకుండా గోపీ ఒకసారి బరంపురం వచ్చాడు. వెంకయ్య గారింటికి అతను రావటం, ఆయన ఇంట్లో లేక పోవటంవల్ల యమున అతనికాతిథ్యం యివ్వటం జరిగాయి. యమున చక్కదనం, అమాయకత్వం గోపిని ముగ్ధుణ్ణి చేశాయి. ఎలాగయినా ఆమెను తనదిగా చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఏదో పనున్నట్లు గోపీ బరంపురం రావటం, వెంకయ్య యింట్లో దిగటం, యమునతో చనువుగా తిరగటం అన్నీ తండ్రికిష్టంగానే వుండేవి. కొంతవరకూ తండ్రి ప్రోత్సాహంవల్లే యమున గోపిని దగ్గిరకి రానిచ్చేదని మనం ఒప్పుకోవాలి.

గోపీ చక్కనివాడు ఎఱ్ఱగా, పొడుగ్గా ఉన్న అతని శరీరానికి సిల్కు జుబ్బా, గ్లాస్కో పంచా ఎంతో శోభనిచ్చేవి. ఎటువంటి వాళ్లనైనా సరే ఇట్టే మాటలతో ఆకర్షించే శక్తి అతనిలో వుంది. వయస్సులో 35 సంవత్సరాలకి పయినబడ్డా, మాట్లాడుతున్నా, నడుస్తున్నా, నవ్వుతున్నా, చాలా చిన్నవాడిలాగా కనుపించేవాడు. రాత్రి వెన్నెట్లో డాబామీద కూర్చుని తనపుస్తకాల గురించి, అందులోని పాత్రల ఔచిత్యాన్ని గురించి గోపీ చర్చిస్తోంటే, "అబ్బ! ఆవుంగరాల జుట్టు గాలికి ముఖం మీద ఎట్లా పడుతోంది? అతని కళ్లల్లో ఎంత కాంతి, తెలివి తేటలు కనిపిస్తున్నాయి!" అనుకునేది యమున.

డబ్బుగలవాడు కథలు వ్రాస్తాడు అఖండమైన కీర్తిసంపాయించాడు. అతనికి ఇంతవరకూ పెళ్లెందుకు కాలేదని తండ్రి కూతుళ్లిద్దరికీ తట్టలేదు. అతను యింటికి వచ్చిననాటి మొదలు తిరిగి వెళ్లేంతవరకు అందరూ తన చుట్టూ నాట్యం చేసేట్టు చేసేవాడు. యమునని మద్రాసు రమ్మని ఆహ్వానించాడు. ఆమెమీద పద్యాలు, కథలు వ్రాశాడు. అంత కంటే ఆపిల్లకి ఏమి కావాలి? అభ్యుదయరచయితల సమావేశంలో, అధ్యక్ష పదవి నలంకరించి, మెడలోని రోజాపూవులదండలు మోయలేకుండా, అతను మాట్లాడుతూంటే, యమున మురిసి పోయేది. గోపీ పరిచయమైన ఏడాదిలోనే, వారిద్దరికీ వివాహం బరంపురంలో అతి వైభవంగా జరిగింది.

గోపీ అంత సాహితీ ప్రియుడు తనకు భర్త అయాడని యమున ఎంతో ఆనందాన్ని, తృప్తిని పొందింది. అందరూ ఆమెను "కవిగారి భార్య" అని పిలిచేవారు. పెళ్లయిన కొత్తలో యమునను అతి జాగ్రత్తగా చూచుకునే వాడు గోపి. ఆమె కాలు కింద పెడితే అరిగి పోతుందనీ, గట్టిగా మాట్లాడితే అలసి పోతుందనీ, అందరితో అనేవాడు. రోజుకి పదిసార్లన్నా "యమునా, అబ్బ! ఆపేరులో ఎంత మృదుత్వం వుంది" అనేవాడు. అతని తియ్యని మాటలు, ఒక్క నిముషమయినా వదిలి పెట్టని అతని ప్రేమ, సంఘంలో అతని కున్న గౌరవ ప్రతిష్ఠలు, యమునను ఉక్కిరి బిక్కిరి చేశాయి. ఈ పరిస్థితులే యమునకు ముందు రాబోయే కష్టాలను ఓర్చుకునే శక్తినివ్వలేక పోయాయి.

రెండేళ్లు గడిచాయి. గోపీలో ఏదో మార్పు కనుపడింది యమునకి. అది ఫలానామార్పు అని గట్టిగా మనస్సుని కుదుట పెట్టుకో లేక పోయింది ఆముగ్ధ. ఇంటి పట్టున సరిగా ఉండటం మానివేసాడు మొగుడు. ఇంట్లో వంటమనిషిని మాన్పించి వేశాడు. సాయంత్రం పూటల యముననుషికార్లకి తీసుకు వెళ్లటం మర్చిపోయాడు. ఆమెను మెల్లిగా చీదరించుకోవడం, విసుక్కోవడం మొదలుపెట్టాడు.

పెళ్లయిన కొత్తలో తను వ్రాసే కథలనిగూర్చి ఆమెతో చర్చించేగోపీ యిప్పుడామె "ఏమిటండీ వ్రాస్తున్నారు?" అన డుగుతే "అన్ని విషయాలు కావాలి నీకు లోపలికెళ్లి వంట పనేదో చూచుకో" అనిసమాధాన మిచ్చేవాడు. అన్నంలో కొంచెం ఉప్పుగాని, ఇంగువగాని ఎక్కువయితే "నీ దుంప తెగ! ఇదేమి వంటే? కుక్కలుకూడా తినవు" అని కసిరి కొట్టేవాడు. అవకాశం దొరికితే ఆడవాళ్ళని కొట్టే అంత సంస్కారం అతనిలో ఉందని యమున గ్రహించింది.

ఒకసారి "కవిగారున్నారా?" అంటూ ఓ బక్క పల్చటి ఆవిడ పెట్టా పరుపుతో సహా రావటం చూసి యమున ఆశ్చర్యపోయింది. "లేరు మీరాయనకి బంధు

వులా?" అంది కూర్చోమంటూ. "నా పేరు పరదాబాయి, నా కాయన రచనలంటే చాలా యిష్టం. నే నస్తానని ఆయనకు వ్రాసానే" అంది తెల్లబోతూ. "ఆఁ ఏదో పని తొందరలో మరచిపోయుంటారు చెప్పడం" అన్నది యమున పరాగ్గా. ఈ స్నేహితురాలు వస్తోందని భర్త తనకెందుకు చెప్పలేదో? బహుశా చెప్పడం అనవసర మనుకున్నాడేమో! పరదాబాయిని చూడగానే గోపీ ముఖంలో కనపడిన చురుకుదనం, ఆమెతో అంత చనువుగా తిరగటం, యమున మనస్సుని కష్టపెట్టాయి. ఆ పరదాబాయి యింట్లో తిష్ఠ వేసిన నాలుగు రోజులూ, యమున నే మనిషి ఇంట్లో వున్న సంగతే మరచిపోయాడు గోపి.

ఆ సంఘటన జరిగిన కొన్నాళ్ళకి గోపీకి పురుషులకంటే స్త్రీలు ఎక్కువ స్నేహితులని తెలుసుకుంది యమున. మీటింగులకని, కాలేజీ వార్షికోత్సవాలకని ఊళ్ళకి వెళ్ళి పదిహేను రోజులకి ఇంటికి వచ్చేవాడు కవి కుమారుడు. అతను ఎక్కడికి వెళ్ళిందీ, ఏమి ఉపన్యాసాలిచ్చిందీ, ఆమె కనవసరం లేదిప్పుడు. ఆమెకి జీవితంలోని ఆనందమంతా ఆ పెళ్ళిలోనే అంతమయింది.

"ఒంట్లో బాగా లేదు బరంపురం వెళ్తాను" అంటే, "సరే" అనేవాడు తడుముకోకుండా. అంతకు ముందరంతా "ప్రేయసీ! నిన్ను ఒక్క నిమిషం వదలలే"ననే గోపీ అలా సమాధానమిస్తే యమున మనస్సు చివుక్కుమనేది. మూడేళ్ల క్రితం యమున పుట్టినరోజుకి ఆమె మీద ఓ పద్యం వ్రాసిన గోపీ, ఇప్పుడామె పుట్టినపండగ వస్తే, ఆ సంగతే మర్చిపోయి గుంటూరు వెళ్ళాడు. ఊర్నించి రాగానే బెడ్డింగంతా ఏదో వెదుకుతోంటే "ఏముంది" అనడిగింది యమున. "నీకు కొత్త చీర కొన్నాను. ఇందులో పెట్టేను. దొంగవెధవ లెవరో కూలి వాళ్ళు కొట్టేసుంటారు" అన్నాడు. గోపీ అలా అబద్ధం ఆడకుండా వూరుకుంటే తనకింకా సంతృప్తి నిచ్చేది అనుకుంది యమున.

ఇంట్లో ఏమీ తోచక బయటికి వెళ్ళేది ఆ అభాగ్యురాలు. బయట అందరూ 'కవిగారి భార్య' అని గౌరవించుతోంటే సహించలేకపోయింది. ఓ సారి యమున చిన్న కథ వ్రాద్దామని ప్రయత్నించి కృతకృత్యురాలయింది. గోపీకి ఆ కథ చూపించి ఎలావుందని అడిగింది. "నీ మొహం లాగుంది. ఇంకెప్పుడూ యిలాంటి పిచ్చివ్రాతలు వ్రాయకు. ఇటువంటి కథలు వ్రాసి నీ అజ్ఞానాన్ని బయట పెట్టడం కంటే వూరుకుంటే ఉత్తమం" అన్నాడు వెకిలిగానవ్వుతూ. ఆ ముఖం యమున చూడలేకపోయింది. ఆనాటినుంచి గోపీమీద ఓ విధమైన అసహ్యం బయలుదేరింది యమునకి.

పోనుపోను గోపీ యింటిపట్టున వుండటం మానివేశాడు. అతనికి ఇంకో స్త్రీతో సంపర్కం ఏర్పడిందని ఆమె పేరు సుహాసినీ అని యమున మెల్లిగా కనుక్కుంది. డాక్టరు వల్లభరావుగారి మూడో కూతురు సుహాసినీ. కాలేజీలో చదువుతున్న ఆ అమ్మాయితో ప్రేమ కలాపాలు సాగించాడు గోపీ. అనుకోకుండా ఓసారి యమున, సుహాసినులు పేరంటములో కలుసుకున్నారు. "మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి. మిమ్మల్ని ఎక్కడ కలుసుకోగలను" అన్నది యమున సుహాసినితో దిగులుగా. "రేపు మాయింటికి రండి" అన్నది సుహాసిని నివ్వెరబోతూ. గోపీకీ ఆమెకీ ఉన్న సంబంధం తెలుసుకుని ప్రేమభిక్ష పెట్టమనో, లేక నిందించటానికో, యమున వస్తోందని సుహాసిని అనుమానపడింది. ఆమెకి ఎట్లా నచ్చచెప్పి తిరిగి పంపటమా అని ఆలోచనలతో తికమక పడింది సుహాసిని.

చిరునవ్వుతో యమున గుమ్మంలో అడుగు పెట్టడం చూసి సుహాసిని ఆశ్చర్యపోయింది. "మీరు నాకేసి అలా భయపడి చూడకండి. గోపీకి మీకు మధ్యవున్న సంబంధం తెలిసి మిమ్మల్ని దూషించడానికి నేను రాలేదు" అన్నది యమున. "నాగురించి మీరు తప్పభిప్రాయ పడుతున్నారు. నాకు ఆయన కథలంటే యిష్టం అంతే. గోపీ నా స్నేహితుడు" అన్నది సుహాసిని బిక్కమొగం పెట్టి.

"ఎందుకలా నిజం దాచటానికి ప్రయత్నిస్తారు. అన్నేళ్లనుంచి నడుస్తున్న గ్రంథమంతా నాకు తెలుసు. మూడేళ్ళు అతనితో కాపురం చేసిన నా అనుభవం మీద చెపుతున్నాను. మీరు గోపీ విషయంలో చాలా పొరబడ్డారు. మీకంటే అతని సంగతి నాకు బాగా తెలుసు. వినండి. పాపం! మీ కింకా వివాహం కాలేదు. అమాయకులు. గోపీ పన్నిన వలలో మీరుగూడా పడుతున్నారు. మిమ్మల్ని

ప్పుడు ఎలా ప్రేమ లేఖలు వ్రాసి, తియ్యని కబుర్లు చెప్పి వశం చేసుకున్నాడో. అలాగే నన్ను మభ్య పెట్టి వివాహం చేసుకున్నాడు. కొత్తొకవింతా పాతతో కరోతా. ఇప్పుడు మనయిద్దరికీ ఒకటే తేడా. నేను కట్టుకున్న భార్యని, మీరు కొత్త ప్రియురాలు. నేను విసుగెత్తి పోయాను. ఇంకో ఏడాది మిమ్మల్ని వదిలేసి ఇంకో ఆడదాన్ని పడతాడు" అన్నది యమున ఆలోచిస్తూ.

"ఆగండి, ఆగండి" అని సుహాసిని ముఖం రెండు చేతులతో కప్పుకుని ఏడ్వటం ప్రారంభించింది. యమున మళ్లీ ఇలా అందుకుంది.

"మీమీద నాకేటువంటి ఈర్ష్యా లేదు. మిమ్మల్ని చూస్తే నాకు జాలి వేస్తోంది. పాపం! గోపీని మీరు చాలా ప్రేమించినట్లు కనబడుతున్నారు. అతని మాటలు, వాగ్దానాలు మరచి పోవటానికి మీకు కనీసం ఒక ఏడాది పడుతుంది. ఎప్పుడయితే నన్ను వదలి మీదగ్గిర చేరాడో, రేపు మిమ్మల్ని వదలి ఇంకొక స్త్రీ మీద వ్యామోహం కలిగే శక్తి అతనిలోవుందని గ్రహించ లేక పోయారా? పదిమంది ఆడవాళ్లని ఒకేసారి ప్రేమించి, నమ్మించి,వాగ్దానాలు చేసే చాతుర్యం అతనిలో వుంది. గోపీకి దేవుడిచ్చిన శక్తి అది ఒక్కటే. మనం ఆడవాళ్లం అలా కాదు. ఒక్కరిని ప్రేమించేటప్పటికి ఉక్కిరి బిక్కిరవుతాము. మీ ఆత్మనిగ్రహమంతా ఉపయోగించి గోపీ నెట్లాగయినా మర్చిపోవటానికి ప్రయత్నించండి. నాకోసరంమీరేత్యాగం చెయ్యవద్దు. ఇది మీమంచి కోసరమే చెపుతున్నాను"అని లేచి నమస్కారం చేసి నిష్క్రమించింది. యమున చెప్పిన మాటలన్నీ తల్చుకుంటూ ఏమి చెయ్యడమా అని సుహాసిని దుఃఖించింది.

అసలు మొగవాళ్లకి నిశ్చలప్రేమంటే ఏమిటో తెలియదు. వాళ్ళు ప్రయత్నించినా అలా ప్రేమించలేరు. పురుషులు స్త్రీలని ఎక్కువగానన్నా ప్రేమించగలరు, తక్కువగా నన్నా ప్రేమించగలరు. సాధారణంగా ఎక్కడో తప్ప ఆఎక్కువ ప్రేమన్నది, పెళ్లికాక ముందు, తక్కువ ప్రేమన్నది, పెళ్లయినాక వాళ్లలో కలుగుతోంది. వివాహితులయిన ఆడవాళ్లందరూ ఎప్పుడో అప్పుడు ఈసత్యాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది. పెళ్లికాక ముందు చేసిన వాగ్దానాలు,చూపిన ప్రేమ వాళ్ళు తరువాత నిలబెట్టుకోలేరు. అలావుండమనడం కూడా అన్యాయమనిపిస్తుందిప్పుడు. మొగవాడికెప్పుడూ తను తప్ప జీవితంలో మరో ఆనందమునేది ఉండకూడదనుకుంటుంది ఆడది. అందుకే చాలామంది ఆడవాళ్ళు వాళ్ళు కట్టుకున్న మొగుళ్ళతో తృప్తి పడరు. ఇప్పుడు యమునకూడాఅదే చిక్కులోపడింది.

గోపీ కాక సామాన్యమైన వ్యక్తిని పెళ్లిచేసుకుంటే ఆమె అంత బాధ పడేది కాదు. కొంత మంది ఆడవాళ్ళు తమ భర్తలు ఎంతమందితో పోయినా, అవసరమయినప్పుడు వాళ్లమీద అనురాగం చూపిస్తే తృప్తి పడతారు. కాని యమున అటువంటిది కాదు. గోపీని ఆమె స్వార్థంతో పెళ్లి చేసుకోలేదు. నిజంగా, అమాయకంగా అతన్ని ప్రేమించింది. గోపీని అలా ప్రేమించి పెళ్లి చేసుకోక పోతే అంత నిరాశ చెందేది కాదేమోనని దిగులుపడేది యమున. గోపీమీద ఈర్ష్యగాని, కోపంగాని, వుండేవి కావు. అదేదో చెప్పలేని అసహ్యం అంతే.

అంత మాత్రానికే భర్తనొదిలి పెట్టి వెళ్లిపోయేటంత దుర్బలత్వం యమునలో లేదు. గోపీ సంగతి తండ్రికి చెప్పి,బరంపురం వెళ్లి ముసలితనంతో ఉన్న తండ్రికి మరో వ్యథ కలిగించడం ఆమెకు అవివేకమనిపించింది. మొగుణ్ణి వదలి వీధిని బడటం సంస్కారానికి విరుద్ధమనిపించింది యమునకు. తన కంటే ఇంకా నిరాశతో ఎంతమంది స్త్రీలు ఇంకా దుర్భరమైన సంసారాలు చేస్తున్నారో? దేవుడు తనకెంత ఇచ్చాడో అంతే. విధివైపరీత్యాన్ని ఎవరు మట్టుకు దాటగలరు.

ఆత్మహత్య చేసుకుని జీవితం అంతం చేసుకోవడం పిచ్చి. ఇకముందు ఎవరినైనా ప్రేమించి. కొత్తరకమైన జీవితం గడపుదామనే ఆశలు ఆమెలో ఎప్పుడో నశించాయి. జీవితంలో భర్త తప్ప తనకింకెవరూ లేరు. అసలు ఈ సంసారం, కీర్తి, డబ్బు, వాటికంటె మనుష్యులకు శాంతి సుఖాలనిచ్చేది ఏది? అని ఆలోచించటం ప్రారంభించింది. అంత మృదువైన యమున ముఖంలోనూ మనోవ్యథవల్ల కాబోలు ఏవో విషాదరేఖలు కనుపిస్తాయి. పాతిక

సంవత్సరాలకే 40 ఏళ్ల మనిషిలాగ తయారయింది యమున.

ఆమెకి దేవుడ్ని గురించి ఆలోచించే అవసరమే చిన్నప్పటినుంచి కలుగలేదు. కష్టాలొచ్చి ఈశ్వరుణ్ణి ప్రార్థించే అగత్యమే ఆమెకు పట్టలేదు. అటువంటి యమున ఇప్పుడు మెల్లి మెల్లిగా ఆ విషయం ఆలోచించడం, మొదలు పెట్టింది. రామాయణం, మహాభారతం, భగవద్గీత మొదలైన పుస్తకాలు చదవటం ప్రారంభించింది. తీరికసమయాల్లో దేవుడి పటాలకు దండలు గుచ్చుతోనో, కొవ్వొత్తులు చేస్తోనో కాలం వెళ్లబుచ్చేది. రోజూ సాయంత్రం దుర్గ గుడికి వెళ్లి ఒకగంటసేపు కూర్చుని వచ్చేది. సౌందర్యము నశించినా ఆముఖంలో ఏదోవెలుగు కనుపించేది.

ఆ అమాయకపుగాలు ఏమి పుణ్యంచేసుకుందో, దుర్గాంబ ఆమెను ఏమని ఆశీర్వదించిందో ఏడాదిలో గుండెఆగిపోయి యమున మరణించింది. ఆమె పోయిన సంగతివిని గోపీని పరామర్శించడానికి వచ్చిన వాళ్లంతా వెళ్ళిపోతూ "పాపం! కవిగారి భార్య పోయింది" అన్నారు. యమునకు మిగిలినదల్లా ఆకీర్తి ఒక్కటే.



నాడు - నేడు

# నగలు—నాణేలు

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి

నాడు అంటే మన అమ్మమ్మ, అమ్మలనాడు, నేడు అంటే యిప్పుడు నడుచుచుండు కాలము.

ఆనాటి తలకు ధరించు వస్తువుల పేర్లు విన్నారా? రాగిడి తమలపాకు, మొగలిరేకు యివి పాపటకు మధ్య మాడుమీద వెంట్రులకలకు గుచ్చి సన్నగా జడఅల్లి, ఆ జడ వెనుకకు లాగి, రాగిడి అను ఆభరణమునకు తగిలించేవారు. ఈ రాగిడి తలకు వెనుకవైపుగా నడినెత్తి మీద ధరించేవారు. యీ రాగిడి ఎంత భారీగా వుంటే అంత ఘనత, అంత అందమూ అని ఆనాటివారి తలంచి మెచ్చుకొనేవారు. అసలు యీ రాగిడి అంటే రాజ్యపాలకులగు రాజు రాణీగార్లకు కిరీటమెట్లవస్యాలంకరణీయమో, గృహ రాజ్యపాలకురాండ్రగు స్త్రీలకు యీ రాగిడి అట్లే, అయితే పురుషులకు కాదులేండి.

ఇక పావటికిరుప్రక్కలా గోష్పాదములు, సూర్య చంద్రులు అను నగలు ధరింతురు. పాపటబిందిణీలు, ముత్యములతో, రత్నములతో, చేయబడు సరము. దీనిని తలకు ముందు అంచున ఈ చెవినుంచి ఆ చెవివరకు కట్టేవారు, పాపట పొడుగున కట్టబడి దీనిచివర పాపట బొట్టు, ఆకు, చిన్నపతకము, ముఖముమీదికి వెలగుచుండేది. బంగారుజడ జడమీద పొడుగున కట్టేవారు.

మాంచిధనవంతులకు పైటజడఅని యింకొక పెద్దజడ వుండేది. అది వెనుకనుంచి త్రిప్పి ముందరికి పైటగా వేసుకునేవారు. కూచిపూడి భాగవతులు, భాగవతమాడేటప్పుడు సత్యభామ వేషానికి యిట్లా రెండు జడలుండేవి. యీ సత్యభామ యీ పైటజడత్రిప్పివేసికుంటూ అన్ని భంగిమముల నాట్యము చూపించేది.

అయితే బంగారుజడ చిన్న పిల్లలకే పెట్టేవారు. పెద్దవారు కొప్పుపెట్టి యీ తల సామానుతోపాటు ముత్యాల కమ్మలు, జేరీగొలుసులు, కొప్పుగొలుసులు, చెంపగొలుసులు ధరించి, కొప్పునిండా లేక కొందరు జడచుట్టనిండా శశిరేఖ, నక్షత్రములు, నవరకుప్పె, కొప్పెరపువ్వు, గుంట చావంతి, రేకులు చేమంతి, యివన్ని పెట్టుకుని శ్రావణ మాసములో పేరంటము వెళ్ళుతువుంటే చూచిన ముసలమ్మలు, పొంగిపోయేవారు. కంచి తేరు కదలినట్లు

శ్రీ మహాలక్ష్మలవలె పూచిసతంగేడులల్లే యెంచక్కగా సున్నారో చూడండి అంటూ వేయికళ్ళతో చూస్తూ మెచ్చు కునేవారు.

ఒకప్పుడిట్లా యీ పెద్దముత్తైదువలు, చిన్నతరగతి ముత్తైదువలము మేమొక కొంత మంది, వస్తుంటే నా సహవాసకత్తె విరగబడి నవ్వుతూ యీ పెద్ద ముత్తైదువలను చూచి "బాగున్నది పెద్దమ్మగారు. మీ సొమ్ములు, యుద్ధానికి వెళ్ళే గుఱ్ఱాలవల్లె, గాలి గోపురము మీది శిఖరమువలె, గోవాడప్రభవల్లే, గడ్డివామిమీది గుమ్మడి పువ్వల్లే యీ రాగిడీ బాగుంది" అన్నది. మాకారు వాళ్ళందరము నాగరాలు దాల్చేవారము, సూదుల చివర పింగాణీ పోతబోసిన చిన్న చిలకలు జడలపై, చుట్టలపై పెట్టుకునేవారము. అవి క్రొత్తగా వచ్చినవి. యీ నాగ రికతా ధురీణురాలు యిట్లా అంటే, యింతకంటెను అశేష విశేష నాగరకతాగ్రేసరురాలు వొకమ్మాయి, వ్రేలితో చూపుతూ వింతగా నవ్వుతూ "పూరిగుడిసే మీద బీరపువ్వుందీ—సూరమ్మ తలమీద చూడు యేముందో" అన్నట్లు పాడింది. మేము తెల్లబోయి చూస్తున్నాము. సూరమ్మ యిట్టే గ్రహించి దవ్వనయింటికి వెళ్ళి నాగ రము విప్పేసి సాదాగా జడచుట్టుకు వచ్చింది. వెంటనే కొంతమందికూడా నాగరాలు తీసేశారుగాని మేమొక కొందరము మాత్రము పది రూపాయల కూలి యిచ్చాము, పదినెలలైనా కాలేదే, పోనీలే మనకు బాగానే వుందిలే, అని వూరకున్నాము.

ఇక చెవుల సామాను:—ముత్యాలకమ్మలు. జేరీగొలుసులు, చెవులదిద్దుల్లో జూకాలువెనుక తగిలించి యీ కమ్మలగొలుసు, జేరీగొలుసు, దిద్దుముందు తగిలించి అక్కడనుంచి, చెక్కిళ్ళమీదుగా నెగబ్రాకించి తలపై కెక్కించి, పాపడకిరుప్రక్కల స్థాపించేవారు. చంపగొలుసులు యీమధ్య చంపస్వరములవలె దిద్దులో తగిలించి చెవిపొడుగునాసాగి చెవిదగ్గర వెంట్రుకల్లో గుచ్చబడేవి. కొప్పుగొలుసులు చెవుల పైభాగముననుండు బావిలీల సముదాయములో నొకదానికి తగిలించి కొప్పుదాక తీసుకు వెళ్ళి యిరుప్రక్కల గుచ్చేవారు. బావిలీలు చాలా రకాలు. జల్లిబావిలీలు, చాటలవలె ఆకారములరి జల్లెడవలె చిల్లు లొప్పారు చుండునవి. జంపులు నాలుగుపరసల ముత్యాల చేరులు వొక్క కొక్కెమునకే అంటుకుని చెవిపైనుంచి క్రిందికి వ్రేలాడుచు ఎటుకదిలితే అటు ఉయ్యాల్లో జంపాలో అని వూగే యిప్పటివారి తలలోని పూలదండ వలె పైచెవులకు పది రకాల బావిలీలుండేవి. కొంచెము తక్కువగా ముసల్మాను స్త్రీల చెవులకున్నన్ని కుట్లుండేవి. యిప్పుడువారికీ లేవులెండి. తరువాత కొంచెము నడిమి కాలములోవారు యింకొక షోకు నాగరకతని కనిపెట్టి నారు. చెవుల ప్రక్కఅంచున తలూకా బావిలీలు గూబ గూబ్బావికలు అని ధరించేవారు. యివి మా అమ్మగారి కాలములో లేవు. మా అక్కగార్లనాడు వచ్చినవి.

ఇట్లాగే వొకమ్మాయి గూబలు కుట్టించుకుంటే పాపము మూతివంకర పోయిందట. యీ సంగతి విని చాలా మంది మానివేసినారు. తర్వాతవాటి పేరే తలచుటలేదు. దీనినిబట్టియే కాబోలు మా చిన్నప్పుడు ఒక పాటపాడు తుండేవారు, "గూబలు కుట్టించుకుంటె మూతివంకర బోయెనే, యేమెవో వయ్యారివదినే, ఎంతటీ నెఱజాణవే." అంటూ, హాస్యప్పాటలేండి. యీ వస్తువులన్నీ చూచి వొక కొంటెపిల్ల అన్నదిగదా "వోయిబాబో యీ తల సామాను, చెవిసామానూ పెట్టి తీసేటప్పటికి మీకు తల ప్రాణము తోకకురాదా, చూస్తేనే నాకు తలతిరిగి నోట్లో కొస్తున్నదే అమ్మమ్మా?" అని. తర్వాత మధ్యకాల ములో నానుపేటలు, చైనాగొలుసు, రైలు గొలుసు, బాదంగొలుసు, దోసగొలుసు వచ్చినవి. వీటిమధ్య ఆనాటి పిచ్చవాళ్ళు కుతికనంటునట్లు, నల్లపూసలకుత్తి కంట్లు, నూలు తాటితో మంగళసూత్రముకూడా ధరించు వారు.

యీ మధ్య కుత్తికంట్లు, యీ నూలుసూత్రమున్నూ ఉన్నతులమధ్యమున పేదలుండ లేక జారిపారిపోయినవి అయితే పై కుత్తికంట్లు సినిమావారి పుణ్యమా అని

యిప్పుడు కుతికను గట్టిగా కౌగలించుకుని యిప్పుడున్నవి గదా మరల నెల్లు మారిపోవునో.... యిక బులాకీ, వేసరి, హంసలనత్తు, ముక్కుపోగు, ముక్కుపుడకలు. ఇవి ముక్కున ధరించునగలు. పూర్వము ముక్కుపోగులో నుంచి, ముద్దదూరి నోటిలోనికి పోవునదట, అంత పెద్ద ముక్కుపోగు.

ఇంక మెడలో గుళ్ళకంటె, నాగపేచీకంటె, పెరిక కంటె, కడ్డీకంటె ధరించువారు. అయితే యీ కంటెలన్నీ వొక్కమారే యెట్లా ధరించారా అని మీరు దిగులు పడతారేమో, అబ్బే తడవకొకటి ధరించేవారు. ఇన్ని నగలు ధనవంతులైనవారికే సుమండీ లేసివారెప్పుడు లేనట్లే.... యింకా చాలా నగలున్నవి, చెపుతాను; వాళ్లెట్లా మోయగలిగినారా అని మీరు ఆశ్చర్యపడవద్దు. హాస్యం చెయ్యవద్దు. యేమంటే మునుపు వాళ్ళుదించిన నాలుగు మానికలగుండిగ మీరు దించగలరా? వాళ్లు బుజానకెత్తుకున్న మూడు మానికలబిందె ఫిరెత్తుకోగలరా? అంతే దండచేతులుంటే పైచేతులు. ఆ నగలు తాబేదులు, బాజుబందులు, భుజబందులు అని అంటారు. దండకడియములు, వట్టెవంకెలు, పురుషులుకూడా యీ భుజబంధములు, తీగెదండకడియము, సింహతలాటమ్మురుగులు, చేమపువులకడియాలు ధరించువారు.

ఇక స్త్రీలపాద భూషణములు: అందెలు, కడియాలు, పాంజేబులు, పావడాలు చుట్టగొలుసు, పుదుచేరిగొలుసు, గొళ్ళెపుగొలుసు, అత్తికాయగొలుసు, తుమ్మకాయగొలుసు, వెల్లిపాయిగొలుసు యివన్ని రకరకములుగా క్రమంగా సృష్టింపబడినవే. ఒక్కమారే రాలేదు. ముంజేతి నగలు: మురుగులు బోచీలు కంకణాలు, సూదిగాలు మురిడీగొలుసులు వుండేవి. మంటిగాజులుకూడా ధరించేవారు. యీమధ్య మంటిగాజులనలే మోటయిపోయి, యిప్పుడు గాజులమలారంలో పొట్లాలేనా అన్నట్లు బంగారు నగలతోకలిసి కలవక కూడా, ముంజేతికి మోజేతులకు ఒకటే గాజులబాట అయింది. యీ మధ్య యివన్నీపోయి మెడకు ఒక గొలుసు, చేతికొక గొలుసు, కాలికొక గొలుసు మాత్రమే నిలిచినవి. అసలు నా చిన్నప్పుడు చూస్తుండగానే వొక మార్పుకలిగింది.

బెత్తెడు వెడల్పు మురుగులు. చుట్టుకొలత నాలుగంగుళములలావు వొళ్ళ కడియాలు రూపాయి వెడల్పు దిద్దులు పావలా వెడల్పు ముక్కుపుడకలు, రెండు బెత్తల వెడల్పు యొడ్డాణము యిట్లా కలిగిన కొలది బలిసిపోయినవి. ఇట్లా పెరిగిపెరిగి యేమి అరిష్టము కొట్టిందోగాని, అన్నీ నవసిపోయి, చిక్కి నామావశిష్టమై పోయినవి. ఒకప్పుడది బాగు ఒకప్పుడు కాదు. యిక చెవులకు లోలాకు రేకలోలకలో లకలకలో, కలకలలో ఎవరో లోలక్కునగా విన్నాను. యేవో యివి వేపకాయలై, మద్దికాయలై, చక్రములై, శంఖములై, శార్ఙములై, గదలై, ఖడ్గములై, జల్లెడలై, చేటలై, గొలుసులై, తట్టలై, బుట్టలై, తిరిగి బుట్టలు పూర్వపు జూకీలకు ప్రతినిధులై నిలుచుటయేగాక ఒకబుట్ట రెండుబుట్టలు మూడంతస్థుల బుట్టలు దిద్దులతో తగిలించిన గొలుసులు సహాయమున, బుజములదనుక వ్యాపించి, భుజకర్ణములకు మైత్రినెలపుచు, కొన్నాళ్ళుండినవి. యిప్పటికిని యింకను ఒకటి రెండు చుట్టలు వుంటున్నవి.

కాళ్ళకు, పట్టాగొలుసై, గజ్జలపట్టాలై మరల పాంజేపులై, చల్లగా పాదాలుబట్టి వదలమని ప్రార్థిస్తున్నవి. యేమో మరల యెప్పుడు తొలగంద్రోయబడునో, యేం జెప్పగలము. మరల కుతికంటులేగాక, మరికొన్ని నగలు కూడా కంఠాన్ని కౌగలించి కదలమంటున్నాగాని యిట్లా యెన్ని అయినవి, యేమిటి వీటి యెక్కువ, నల్లపూసల కుతికంటనంటేవి యెక్కువా, యింకా చాలా నగలున్నవి యీ జగన్నాటకమంతా యింతలో పూర్తిగామగదా....

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# తూర్పు దేశాలలో మహిళాభ్యున్నతి

# చైనా

* శ్రీమతి పరిటి సుభద్రమ్మ *

[నడిచినచరిత్ర : ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం లేక, విద్యా విజ్ఞానాలు లేక, కేవలం అజ్ఞానాంధకారంలో దాస్య జీవనాలను గడిపిన చైనా మహిళలు.]

నేటి చైనాలో మహిళలందుకొన్న అభ్యున్నతిని చూచి అనేక దేశాలు ఆశ్చర్యపడుతున్నవి. కలకాలంగా, చైనా స్త్రీలు దారుణమైన దాస్యం, దారిద్ర్యములతో నానాబాధలు పడ్డారు. అయితే ఈనాడు వారి జీవితంలో ఒక నూతన పరిణామం కలిగింది. మహిళాభ్యున్నతి అతివేగంగా పరుగులిడుతూ వుంది. 1919 లో నిజపరిపాలనతో కూడిన నవచైనా ఆవిర్భవించింది. ఆనాటినుండియే మహిళలకు ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయంగా సమస్త హక్కులు లభించినాయి.

దాదాపు 500 ఏళ్ళనుండి మొన్నటిదాక పట్టుమని ఏ పదుగురు స్త్రీలకప్పు అత్యధిక సంఖ్యాకులు పుట్టినింట, మెట్టినింట, ఆర్థికంగా పరాధీనలు. విద్యా విజ్ఞానాలకు నోచుకోలేదు. తమ వివాహ విషయాల్లో, కుటుంబ జీవితంలో, మరెట్టి సాంఘిక విషయాల్లో కాని మహిళలకెట్టి స్వాతంత్ర్యము ఉండలేదు. మహిళ ఎంత విధేయతగా, వివేక శూన్యంగా వుంటే, అంత ఉత్తమురాలు అని పించుకొనేది. ధనికుల ఇంట జన్మించనీ, పేదవారింట పుట్టనీ, సామాన్య ప్రజాకోటితోపాటే అజ్ఞానాంధకారంలో వుండిపోయి కూపస్థ మండూకంలాగు, లోకజ్ఞానమే లేకపోయింది. పురుషునివలె తనకూ వ్యక్తిత్వమున్నదని గ్రహించుకోలేము. పెక్కువేల ఏండ్లనుండి వస్తూన్న అంధయుగపు భూస్వామి పద్ధతిలో విజృంభించి, కుళ్ళి, రోగక్రిములతోనిండిన ఆచార సాంప్రదాయములగుటివైమైన మహిళ పెక్కు బాధలుపడింది.

ఇందుకు కొన్ని ప్రధానకారణాలు లేకపోలేదు. ప్రాక్, పశ్చిమ ఖండములలోని అనేక దేశాలలో మనుజులు ఆటవీ మనుష్యుల స్థితిలో నుండగా చైనామాత్రం నాగరికత పొందిన దేశమనిపించుకొంది నిజమే. ఆనాటి మానవులు వ్యవసాయ పద్ధతిని కనిపెట్టి, ఇళ్లు, గొడ్డుగోదలు స్థిరనివాసము, వివాహపద్ధతి, కుటుంబ జీవితం, సంఘజీవితము మున్నగువాటి నేర్పరచుకొన్నారు. అనగా, భూస్వామ్య నాగరికతన్నమాట. కాని, ఇతర పశ్చిమదేశాలు—అంతెందుకు తనకు పొరుగుననున్న జపాన్ దేశంకూడా—ఆటవీ మనుజుల స్థితినేగాక భూస్వామ్య విధానమునైతము గడిపి పారిశ్రామిక యుగానికి వచ్చారు. యంత్ర పరిశ్రమలు, రైళ్లు, స్టీమర్లు, విమానములలో రాకపోకలు, వీటితో విజ్ఞానము, దేశ సౌభాగ్యం పెంపొందుతూ వీటికి తగిన నవీన ఆచార సాంప్రదాయాలు ఏర్పడినవి. చైనామాత్రం అంతవడిగా పారిశ్రామిక దశను అందుకోలేక పోయింది. ఫలితం, మొన్నటిదాక. అంధయుగపు అమానుషాచార వ్యవహారాలుండి పోయినవి.

చైనాలో అసలు నగరాలసంఖ్య అతిస్వల్పం. గ్రామాలు మాత్రం లక్షలకొలది వున్నాయి. ఇంతకు పూర్వం ఆ గ్రామాల్లో భూస్వాములదే సర్వాధికారం. ప్రతి భూస్వామికి భూస్థితి వేల యకరాలు, లెక్కలేనన్ని గొడ్డుగోదలు ఇళ్ళువాకిళ్ళు, వడ్డీ వ్యాపారం, వుండేవి. వందలకొలది వ్యవసాయ కూలీలు, పాలేళ్లు, బానిసలు—(స్త్రీ పురుషలతోసహా) ఏ ముగ్గురో నలుగురో భార్యలు, ఉంపుడుకత్తెలు వుండేవారు. ఇటీవల కొందరికి నగరాలలో మిల్లులు, ఫ్యాక్టరీలుకూడ వుండేవి.

గ్రామాల్లో, ఒకటి రెండు యకరాలు మాత్రమే వున్న రైతుల సంఖ్య అత్యధికం. ఇంత స్వల్ప భూమిలో పండిన ధాన్యాదులు కుటుంబ పోషణకే చాలదు. పైగా పన్ను కట్టుకోవాలి. భూస్వామినుండియే అప్పు పుచ్చుకోక తప్పదాయె. ఇట్టి పన్నుభారంచేత, వడ్డీకి మారొడ్డితో పాపంలాగు పెరిగిపోవు ఋణభారంచేత, రైతులు క్రుంగిపోయేవారు. తమ కొమాళ్ళను, కూతుళ్ళను, భూస్వామికో లేక నగరాల లోని ఇతర వృత్తులవారికో అమ్ముకొని అప

తీర్చుకొనేవారు. ఇంతేకాదు, తామే భూస్వాములకు దాసి సలగా, కూలీలు పనిచేసేవారు. కొన్ని సందర్భాలలో భూస్వాములే తమ దాసీలను ఇతరులకు గొడ్డుగోదల లాగు విక్రయించి డబ్బు మూటకట్టుకొనేవారు. ఈ పద్ధతి చాలకాలందాక అమలులో వుండినది. పొట్టకు బట్టకు లేనపుడు, కొందరు తండ్రులుసయితం తమ కూతుర్లను ఫ్యాక్టరీ, మిల్లులలో పనిచేయుటకు నగరాలకు పంపేవారు. స్త్రీ కూలీకి జీతం తక్కువ. తన పొట్టకే చాలదు. అంచేత ఈ పల్లియపడుచు పడుపు వృత్తివారిండ్లకు వెళ్ళి రాత్రిళ్ళు తన శీలాన్ని విక్రయించుకొనేది. అట్టి డబ్బును కుటుంబ పోషణకని తండ్రికి పంపేది.

ఇక ధనికులఇంటి స్త్రీల విషయం:—వీరు ఆర్థికంగా పరాధీనలు. పుట్టినింట,తండ్రి అన్నదమ్ముల పోషణలో, భర్త ఇంట, భర్తలేక మామగారి పోషణలో, తరువాత పుత్రుల పోషణలో వుండాలి. ఆస్తి హక్కులేదు. విద్యాభ్యాసానికి, ఉద్యోగానికి అధికారం లేదు. ఆడజన్మమే పాపభూయిష్టం. ఆడబిడ్డ పుట్టితే సంతోషించరు. గిట్టితే దుఃఖించరు. సాంఘికంగా చూస్తే, వివాహ విషయంలో వధూవరుల ఇష్టానిష్టాలకు, పరస్పర సందర్శనాలకు అవకాశాలులేవు. పిల్లలు తొట్లలోనున్నపుడే వారి పెండ్లి విషయం వధూవరుల కుటుంబ పెద్దలు నిశ్చయం చేసేవారు. వివాహ నిశ్చయానంతరం కర్మంచాలక మొగబిడ్డ చనిపోతే, ఆ పసిబాలికకు వైధవ్యం సంప్రాప్తించినది అనేవారు. చైనా దేశీయులలో ఒక వింత ఆచారముండేది. కుటుంబంలో చనిపోయిన వారికందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క బల్లవంతున ఇంటిలో ఒక చోటవేసి వుంచుతారు. సంవత్సరమునకొక పర్యాయం ఒక నిర్ణీతదినమున ఆ బల్లలమీద చనిపోయిన వారికిష్టమైన ఆహార పానీయాదులనుంచి ఆరగించమని ఆహ్వానిస్తారు. పితృదేవతలు సూక్ష్మశరీరాలతో వచ్చి భుజించిపోతారని వారి నమ్మకము. అదే రీతిగా, చనిపోయిన కొడుకుబల్లకు. పెండ్లి నిశ్చయమైన ఈ పసిబాలికకు పెండ్లిచేసే ఆచారముండేది. ఆ విధంగా పెండ్లి జరిగిన క్షణంనుండి ఆ పసికందు విధవ. భర్త కుటుంబంయొక్క సొత్తు. ఆ జన్మాంతరం మామగారింటనే ఊడిగము చేస్తూ కాలం గడుపుకోవాలి. యుక్త వయసువచ్చిన యువతీ యువకులకుకూడా తమ వివాహ విషయంలో ఎంతమాత్రం స్వేచ్ఛలేదు. వధూవరులింటి పెద్దలు, లేక మధ్యస్థులు వివాహ విషయంలో మంతనాలు జరిపి నిశ్చయించాలి. ఈమధ్యస్థులకిదే వృత్తి. వితంతువైన యువతికి వివాహాపేక్ష కలచూపిందని తెలిసినా, దాని తల ఎగిరిపోయిందన్నమాటే.

ఇక పురుషుని విషయం చూద్దాము. ఎంత పుణ్యం చేసుకొంటేగాని పురుషజన్మంరాదు. పుత్రులు వంశోద్ధారకులు. ఇహంలో, పరంలో మోక్షదాయకులు. అగ్రికిచెదలంటని రీతి. పురుషుల కెట్టి పాపమంటదు. వారికెందరైనా భార్యలు, ఉంపుడుకత్తెలు వుండవచ్చును. సంఘం దానికి సమ్మతించేది. చెయింగ్ కై షేక్ పరిపాలనా కాలంలో పేరుకు బహు భార్యా నిషేధం ఉండేది. కాని మరొక వింత ఆచారప్రకారం పురుషునికి వెక్కు భార్యలుండ వచ్చును. పుత్రసంతతిలేని మూడునాలుగు బంధు కుటుంబాలకు ఏకకాలంలో దత్తతపోవుటకు పురుషుని కధికారముండినది. ఆ కుటుంబ వంశాభివృద్ధికిగాను, ముగ్గురు నలుగురు భార్యలను వివాహమాడ వచ్చును. ఈ ఆచారం మొన్నటిదాక ఆచరణలో వుండినది.

భార్యకు పుత్రసంతతి కలుగకపోయినను, ఆ భార్యమీద ఏవగింపు కగిలిననూ, పురుషుడు రెండవభార్యను వివాహమాడవచ్చును. ఇక వివాహ విచ్ఛేదన విషయంలో భర్తకు హక్కు వుండేది. భార్యకు లేదు. భర్తచే విడువబడిన భార్య కెక్కడా పుట్టుగతులు లేవు. పుట్టినింట వుండనివ్వరు. అసలు ఆ గ్రామంలోనే బ్రతుకనివ్వరు, అట్టి స్త్రీకి ఆత్మహత్యయో, లేక దేశాంతరగతియో శరణ్యమన్నమాట.

ఈవిధంగా మహిళలకు ఎట్టి స్వాతంత్ర్యము ఉండలేదు. పైగా, బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం, బహుభార్యాత్వం. పడుపు వృత్తి, దాస్యం మున్నగు అమానుషాచార సాంప్రదాయాలకు గురియై చిత్రహింసల ననుభవించారు.

[ వచ్చేసంచికలో- వర్తమానంలో చైనా స్త్రీలందుకున్న అభ్యున్నతి, రాజకీయ సాంఘిక రంగాలలో వారు వహిస్తున్న ప్రధానస్థానాలు- మున్నగువానిని గూర్చి శ్రీమతి సుభద్రమ్మగారు వివరిస్తారు. ]



# రాజశ్రీ — నాగశ్రీ

"రాగశ్రీ"

మధుర స్మృతి
రేకెత్తింది....
ప్రణయజ్వాల
వెలరేగింది....

ప్రకృతి పరిహాసం ....
ప్రేమకు ఉద్రేకం—
వెన్నెల్లో
వలపు........
తొలిచూపుల
తళుకు—

బంగారంవంటి మేను
శింగారం చేసుకుని....
రాగోదయ సీమలోను
రాజు — ఉదయించేడు—
వెన్నెల
రాణి — విరజిమ్మింది—
హృదయమనే దద్దం....
ప్రేమకు భూతద్దం—
ప్రేమామృత
సెలయేరులు....
పొంగి పొరలి
పోతున్నాయ్
వలపు తలుపు
తెన్నెన్నొ....
ప్రకృతిలో
పరుగెత్తేయ్—
పుష్పాకృతి
మోములపై
చిరునవ్వుల సాటి....
మధువుల
చోరత్వానికి
భ్రమరాలతో పోటి—

మలయ పవను
నానందం....
కొమ్మలతో
చెలగాటం—
మేఘతెరల
ముసుగులోంచి....
నవ్వుల నగు
మోమువంచి....
మధురాలను
చిలికేటి....
రాజశ్రీ— రాగం....
ఆవెన్నెల
ఛాయల్లో....
మొగలి పూల
తెన్నెల్లో....
రాగానికి
తాళంగ....
నాగశ్రీ — నృత్యం—
వలపు పూల
నావలోను
ప్రణయార్ణవ
మంతుచూడ
పయనం — సాగిస్తున్న
ప్రేమికుల
పొత్తు చూసి....
ఈర్ష్యచెంది — పరమేశుని
శిరసుపైని — అధిష్టింప....
సాగేడా — రాజశ్రీ
నెచ్చలి — నిష్క్రమణతో....
కైలాసం — చేరుకుని....
శివునికంత — మలంకరణ
చేశాడా — నాగశ్రీ



ఆంధ్ర మహి

# హాస్యానందం

## గయ్యాళిగౌరి

కుమారి సిద్ధాబత్తుల హేమలత

పాతస్నేహితులైన రామయ్య గోపాలం ఒకనాడు కలుసుకున్నారు. అయిదారేళ్ళయింది ఒకరినొకరుచూచుకొని చిన్నతనంనుండి ప్రాణస్నేహితులు. యోగక్షేమాలుమాట్లాడుకొని గోపాలాన్ని తనయింటికి భోజనానికి రమ్మన్నాడు రామయ్య. గోపాలం ఏదో పనిమీద రామయ్య ఉన్న ఊరువచ్చాడు. తలవని తలంపుగా యిద్దరూ కలుసుకొన్నారు. గోపాలాన్ని బలవంతం మీదతీసుకువచ్చాడు రామయ్య.

గోపాలాన్ని రమ్మన్నాడేకానీ అతనికి మాత్రము గుండెలో దడగానేఉంది. ఎందుకంటే అతని భార్య చాలాచెడ్డది. రామయ్య చెప్పినట్లువినదు. అవునన్నది కాదంటుంది. కాదన్నది అవునంటుంది. అతనిమీద అధికారం చెలాయిస్తుంది. రామయ్యకు తెలుసు తనకెలాగ యింటివద్దమంగళహారతులు తప్పవని. అయితేనేం ? ప్రాణమిత్రుడు అయిదేళ్ళయింది కలుసుకొని, మళ్ళీఈనాడు కలుసుకొన్నారు. జడుస్తూ జడుస్తూ తీసికొనివచ్చాడింటికి గోపాలాన్ని. స్నేహితుని గదిలోకూర్చోపెట్టి భార్యదగ్గరికి వెళ్ళి మిత్రునికివంట చేయమని చెప్పాడు. అదివిని గౌరి జయ్యిమని లేచి "యిక్కడ చేసేవాళ్ళెవరూలేరు. వెధవ చుట్టాలు, దాచపెట్టినట్టు వస్తారు. ఇదిధర్మసత్రమా ఏమైనానా? మీరేమైనాచెప్పండి, నేనుమాత్రంచెయ్యలేను"అని నిష్కర్షగా చెప్పేసింది. ఎలాగోబ్రతిమాలి ఒప్పించాడు రామయ్య "నీవు మడికట్టుకుంటూవుండు. నేనుబజారుకెళ్లి సరుకులు తీసికొనివస్తాను" అనిచెప్పి వెళ్ళిపోయాడు.

ఇకగౌరి ఎలాగ ఆవచ్చిన బంధువుని వెళ్ళగొట్టడమా అని ఆలోచిస్తోంది. ఆమెకొక ఉపాయం తట్టింది. వెంటనే రుబ్బురోలి పొత్రము తీసికొని దానికి పసుపు, కుంకము పూసి గోపాలం వున్నగది కెదురుగా కూర్చొని పూజచేస్తూంది. ఇదంతా చూస్తూన్న గోపాలం ఆశ్చర్యపోయాడు. "ఇదేమిటి? ఈవిడ యింత ప్రొద్దెక్కినా వంటచేయకయిలా చేస్తుందేమిట్రా " అనుకొన్నాడు. ఇంకఅడగకుండా ఉండలేకపోయాడు. "ఏమండీ, మీరేమిటి ఈ పొత్రానికి పూజచేస్తున్నారు? " అనిఅడిగాడు.

"ఏంచెప్పను నాయానా, చెప్పితే భర్తగుట్టుబయలుపెట్టినదాన్నవుతాను. చెప్పకపోతే బ్రాహ్మణహత్యాపాతకురాలనవుతాను " అందిగౌరి. గోపాలానికి అదేమిటో తెలుసుకోవాలని చాలా కుతూహలము కలిగింది. గోపాలం అన్నాడు, "అదేమిటో తెలిసికోవాలని ఉంది చెప్పండి" అని. "చెప్పటానికి నోరురావటంలేదు. అంతగా అడుగుతున్నారు గాబట్టి చెబుతున్నాను, చాలారోజుల క్రితం మావారుఒక మ్రొక్కుమ్రొక్కారు. అదేమిటంటే, దబ్బపండువంటి శరీరచ్ఛాయ గలవానిని ఈ పొత్రంతో తలపగలగొట్టి కాళికాదేవికి బలియిత్తుమని మ్రొక్కారు. అటువంటి

వారు నేటికి మీరు దొరికారు. అందుకే యింత పట్టుదల గా మిమ్మల్ని తీసికొనివచ్చారు. ఆయన పూజసామగ్రి తేవ టానికి వెళ్ళారు," అందిగౌరి. అదివిని గోపాలం హడలి పోయాడు. ఒక్కగంతుకో దొడ్డిగుమ్మం తలుపు తీసి కొని పారిపోతున్నాడు.

ఇంతలో రామయ్యా వచ్చి "మామిత్రుడేడి?" అని అడిగాడు. "అయ్యో! మీమిత్రుడేం మిత్రుడండీ? నేపూజచే సుకుంటూండే ఈపొత్రం తనకిమ్మని అడిగాడు. ఇది మీ కెందుకు నేపూజ చేసుకోవాలి అన్నాను. అంతే కోపము వచ్చి పారిపోయాడు. మీరువచ్చేసరికుండ నన్నా ఉండలేదు" అంది గౌరి. "పాపిష్టిముండా! ఈపొత్రమిస్తే నీసొ మ్మేమైనాపోయిందా? రాకరాక వచ్చినమిత్రుడు భోజనమై నావేయకుండా వెళ్ళిపోయాడు. ఆపొత్రమిలాతే. అదిఇ చ్చి వాడినిబ్రతిమాలి తీసికొనివస్తాను" అని పరుగెత్తివెడ్తు న్నాడు, ముందు గోపాలం, వెనుక పొత్రంతో, రామయ్యా పరుగెత్తుతున్నారు.

"ఒరేగోపాలం రారా, యిదిగోయీపొత్రం తీసికోరా" అనిరామయ్యా అంటూంటే, అదివినిపించు కోకుండా "నీ యింటికి ఎరక్క పోయివచ్చాను. నన్నిందికేగాబోలు మ హాదయ ఉన్నట్టుతీసికొని వచ్చావు. పోయేవాడిని పోనివ్వ క అది పుచ్చుకొని చంపుదామని తరుముకొని వస్తున్నావా?" అనుకుంటూ, ఒకదేపరుగు తీశాడు గోపాలం. పరుగెత్తి, పరుగెత్తె చివరికి విసుగుచెంది యింటికి వచ్చేశాడు రామయ్యా.

తన పాచిక పారినందుకు చాలా సంతోషిం చింది గౌరి.



# ఆకాశనిచ్చన

కె. వి. రమణరావు.

శ్రీరామచంద్రుడు చందమామనుచూచి దాన్ని కావా లని కోరేడు. దానిని తీసుకవచ్చే మార్గము తెలియక తల్లిదండ్రులు చాలా విచారించేరు. కాని శ్రీరామచంద్రుడు మాత్రము చందమామ కొరకు ఏడవటం ప్రారంభించేడు. ఆ ఏడ్పును ఎవ్వరూ ఆపలేకపోయారు.

"శ్రీరామచంద్రుడు చందమామనుఇస్తే ఏమిచేస్తాడు? అటువంటి చిన్నపిల్లవాడిక్కి చందమామ ఎందుకు? ఆకా శానికి నిచ్చన వేసుకు చందమామదగ్గరకు వెళ్ళలేమా!

"ఆచందమామ కొరకు రాజు రాణి ఆమాత్రము ప్రయ త్నము ఎందుకు చేయలేక పోయిరి! ఆ చందమామలో వింత వింత మనుష్యులు, వింత వింత వస్తువులు, ఆశ్చ ర్యకరమైన జంతువులు ఇవన్నీ వుంటాయని ఎవరో పెద్దలు చెప్పగా విన్నాను" అంటూ ఆలోచనలో దిగేడు. ఎనిమిదేళ్ళబాలుడు వెంకటేశ్వరరావు. చందమామదగ్గిరకు నిచ్చనలువేస్తే సులువుగా వెళ్ళవచ్చుగదా! ఏ కష్టముం డదుగదా, అనుకొన్నాడు. అయినా. ఎందుకుప్రయత్నం చేసి చూడకూడదు? అనుకుంటూ తల్లి ప్రక్క పడుకుని నిద్రపోయేడు వెంకటేశ్వరరావు.

చూడండిగమత్తు: ఒకనిమిషములో తమాషా నిచ్చనలు వేసుకొని చిన్న చిన్న కుర్రాళ్లు గాలిలో ఎగిరిపోతున్నారు. ఇంక చందమామలో చూడాలి. ఎక్కడచూచినా పిల్లలే. అనేక రకరకములైన ఫలవృక్షములు, అనేక వింత వింత జంతువులు, అక్కడ మనుష్యులు చూడటానికి అత్యా శ్చర్యకరముగా ఉన్నారు. మేడలు చాలా అద్భుతముగా ఉన్నవి. అలా వీధులలో వెడుతూ వెడుతూవుంటే ఆ వూరు రాజు, రాణిగారు ఒక బండినెక్కి వస్తున్నారు. చాలామంది జనం కిటకిటలాడుతున్నారు. ఈలోకంలోంచి నిచ్చనలుమీద వచ్చిన పిల్లలు గుంపులో చేరిపోయేరు.

ఇంక రాజు, రాణిని చూడటానికి తండోప తండములుగా వస్తున్నారు. వారికిముందు సన్నాయి మేళం వాయిస్తూ వస్తున్నారు కొంతమంది. అందులో మన పిల్లలు కలుసుకు పోయి అపరిమితమైన సంతోషములో ఉన్నారు. ఆ చంద్రమండల వీధులలో తిరుగుతున్నాడు మన వెంకటేశ్వరరావు. తిరిగి, తిరిగి ఆనందము పట్టలేక శ్రీరామ చంద్రుడుకి సాధ్యముకాని చందమామ, ఆ చంద్రమండలంలో తాను తిరుగుతున్నాడని గర్వపడ్డాడు వెంకటేశ్వరరావు. అక్కడి వినోదాలు, వింతలు యింటివద్ద చెప్పవచ్చునని సంతోష పడ్డాడు.

ఇంతలో రాజుగారి అనుచరులు ఇతనిని పట్టుకుని రాజుగారి దగ్గిరకు తీసుకుపోయిరి. రాజుగారు ఈ కుర్రవానిని చూచి "ఏమి అబ్బాయి, ఎవరవు నీవు? ఎందుకు వచ్చావు? ఎలావచ్చావు? నీకు కావలసినది ఏమిటి?" అని ప్రశ్నలు వేశారు. వెంకటేశ్వరరావు గజగజ వణుకుతూ "శ్రీరామచంద్రుడుకే సాధ్యముకాని ఓ చంద్రమండలపు రాజా, నేను నరలోకమునుండి ఆకాశ నిచ్చనలు వేసుకుని వచ్చేను. నాకు ఒకే కోరికగలదు. ఎన్నిదినములనించో చంద్రమండలము రాజకుమార్తెను వివాహము చేసికొనవలెనని" అని మనవిచేసేడు రాజుగారితో. రాజు అతని వినయ విధేయతలకు మెచ్చి "ఈ పిల్లవాడు సామాన్యుడుకాడు లేనియెడల చంద్రమండలమున కెట్లు వచ్చెను? ఇతనిలో ఏదో ఉన్నది" అని సరే అన్నాడు. ఒక మంచిరోజున అతి వైభవముగా వివాహము జరిగెను. మన వెంకటేశ్వరరావు చంద్రమండలం రాజుకి అల్లుడు అయ్యాడు.

ఇంతలో భూలోకమునకు పోవుదము రమ్మని తన సతీమణిని కోరేడు. కాని ఆమె ఇష్టపడలేదు. ఈ పెనుగులాటలో తను నిద్రపోతున్న మంచంనుండి క్రిందకు దొర్లేడు. నిద్రభంగమయినది. చక్కనిదృశ్యము నిముషములో మాయమయినది. కలలో కాంచిన వివరాలు కల్ల అయినవి.

చూచేరా బాలలూ! ఆకాశ నిచ్చన వేస్తే ఒక చంద్రమండలమేగాదు, అన్నిమండలములు తిరిగి రావచ్చును. కాని ఇది కలలో మాత్రమే సుమండి!



# నిరక్షరుడు

* వణుకూరు బుచ్చిబాబు *

ఇద్దరు అన్నదమ్ములుండేవారు ఒక పల్లెటూళ్లో. అందులో పెద్దవాడికి గౌరవం, మర్యాద, విద్య మొదలైన సద్గుణాలు వున్నాయి. సూక్ష్మంలో చెప్పాలంటే సర్వజ్ఞాని. ఎవరైనావస్తే ఆదరణ చెయ్యడం, మృదులంగా మాట్లాడ్డం అవీ చేస్తాడు. ఇక రెండో వాడు: అన్నయ్యకున్న గుణాలు ఇతనికి లేకపోవడం. అలా అనీ ఎవరైనావస్తే నిరాదరణ చెయ్యడు. కసరడం, తిట్టడం, కొట్టడం మాత్రం చెయ్యడు లెండి. అతనిలో వున్న దురదృష్టం ఏమిటంటే గౌరవం అన్నది చేయడానికి అసమర్ధుడు. అలాంటప్పుడు మరి అన్నయ్యను గ్రామీణులు గౌరవిస్తూ,తనని ఖాతరీ చెయ్యనప్పుడు, మరి అతనికి అన్నయ్య మీద ఈర్ష్య అనేది కలగక పోతుందా? అంచేత అసూయ చెందేవాడు.

ఇద్దరూ వ్యవసాయం మీద బ్రతుకుతున్న వాళ్లే. ప్రతి దినం పెద్దవాడు పొలంగట్టు మీద కూర్చుని తమ్ముడు చేస్తూన్న వ్యవసాయాన్ని వీక్షిస్తు, అలాకాదు, ఇలాచెయ్యాలని హెచ్చరిస్తుండేవాడు. ఇదితమ్ముడికి ఈర్ష్యకలిగించింది. అన్నయ్యలానే పేరుప్రతిష్ఠలుసంపాదిద్దామని కుతూహలం పడేవాడు.

(తరువాయి—44-వ పేజీలో)

# షష్ఠిపూర్తి

* శ్రీ చక్రవర్తి రంగస్వామి *

౧

పాత 'రావుసాహెబ్'గా రద్దాయికి
క్రొత్తపదవి చూపించారు
క్రొత్త షావుకారల్లనికొక
గొప్ప పదవి చూపించారు !
బస్సులటినర్ చౌదరిగారికి
మరో 'రూటు' చూపించారు
నల్లబజారు ధనికులకెన్నో
లైసెన్సులు, పర్మిషన్లు నిప్పించారు !
బాబుగారు "పిచ్చివా" డంటా
రనుకోండొకణ్ణి
"పిచ్చివాడా !" అంటూ
పిలుస్తారందరూ అతణ్ణి !
బాబుగారి మాటంటే
మీరరాదు ఎవ్వరికి
'బేంకీ' ఆయనది 'కమిటీ' ఆయనది
'బోర్డు' ఆయనదే 'స్టోరూ' ఆయనదే !
బాబుగారి హోదా అది
బాబుగారి దర్జా అది
బాబుగారు తిమ్మంటే—తిమ్మి
బ్రహ్మంటే బ్రహ్మ ! !
ఇంద్రుడు బాబుగారు ఆపట్నానికి
చంద్రుడు బాబుగారు ఆప్రాంతానికి
బాబుగారు గొప్పవారు
వారిమాట గొప్పమాట !
ఆయనకథ అలాగుంది
పేరేమో పెరుగుతోంది
అందరికీ ఆయననే
ఆశ్రయించ వలసిఉంది !
బాబుగారు పేదలకడ
రక్తమంత గుంజి గుంజి
దాచిపెట్టినారు తుదకు
ధనవంతుల బొజ్జలలో !
ఎన్నేండ్లయినా పేదలపని
కానేకాదాయనకడ
ఒకచిటికలోనె నెరవేరును
ధనికులపని ఆయనకడ !
ఈ సంగతి నెరుగలేక
మిడుతలవలె పేదవారు
బాబుగారి చుట్టుతిరిగి
ఆశ్రయింప మొదలిడిరి !

౨

చిన్నతనమునందె
తల్లి దండ్రులు చనిపోగా
ప్రేమతోడ పెంచుచున్న
తాతయు చనిపోగా—
దిక్కులేని ఆబాలుని
పెంచువారు ఎవరుకలరు?
ఎవరికెందు కంతశ్రద్ధ ?
ఎవరికేల అంతజాలి ?
ఆ అనాధ బాలకునకు
ఆస్తి కొంత కలదు గనుక
బాబుగారు బయలుదేరి
నే జూచెద పీనిననెను.
"భేష్ భేష్" అనుచు జనులు
బాబుగారి నెంతో పొగిడి
ఆ అనాధ బాలునపుడె
అతనివెంట పంపినారు
బాబుగారి హుకుములలో
అదపులలో, శిక్షలలో
అణగి మణగి పడి
ఉండెను పాపమతడు !
బాబుగారు అంటేనే
సింహస్వప్న మాతనికి
అంతభయము గలవానికి
చొరవ, ధైర్య మెట్లబ్బును?
తెలివితేట లెట్లమరును?

బాబుగారి పోషణలో
చదువేమో అబ్బలేదు
ఏపనిలో నేర్పులేదు
దేహములో పటిమలేదు
మాయమర్మ మెరుకలేదు.
ఆ దరిద్ర యువకుని
సుఖజీవనానికేది దారి?
బాబుగారు చూపలేదు
ఉన్న ఆస్తి నంతమ్రింగి
తరిమినారు — పెండ్లిజేసి.

3

కల్లకపటాలతో
మాయ మర్మాలతో
రాగద్వేషాలతో
రగిలిపోయే జగము
వైపు నడిచాడు.
ఎండుడొక్కలతోడ
మండు పెడదలతోడ
ఆరిపోతూ బ్రతుకు
లెన్నో కనిపించాయి.
ఆ అభాగ్యుడుచూడ
లేక కంపించాడు...
ఎవడు సంపన్నుడో
ఎవడు మేధావియో
ఆ అభాగ్యునకిపుడు
అంతుపట్టినది.
"ప్రజలరక్తము పీల్చువాడు
సంపన్నుడా?
ప్రజలద్రోహము చేయువాడు
మేధావియా?''
అనుకొనుచు భార్యతో
బయలుదేరాడు.
బ్రతుకుతెరువుకు మార్గ
మెట్లయినగాని దొరికించుకో
వలెనను పట్టుదలతో—
తిరిగారు తిరిగారు
దిమ్మతిరిగారు
గ్రామాలు, పట్నాలు అన్నిటిని తిరిగి
వేడాడు వేడారు పెద్దలెందరినొ
మ్రొక్కారు మ్రొక్కారు దేవులెందరికొ.

4

బాబుగారి వంటివారు
పంతులుగారింకొకరు
వారి కడకు వెళ్ళి అతడు
"బాబూ, ఇటు చూడండీ
పేదవాడ నేనిట్లు
బ్రతుకలేక వచ్చాను
దయతో ఏదైనా ఒక
పనిని నాకు చూపండి
వ్రాయగలను, చదువగలను
ఏదైనా చేయగలను
ఆప్తులెవరు లేరండి
ఆశతో వచ్చానండి"
అని వినయముతో
ప్రార్థించగ—
దినపత్రిక చదువుతోన్న
పంతులుగారటుతిరిగి
బ్రతుకులోనె తీరికలే
దన్నట్లుగ తీక్ష్ణముగా
చూచి చూచి
"చొరవలేదు, నీలో
చురుకులేదు. పోపో
పనికిరావు మాక" నియెను.

*　　*

బ్రతుకు తెరువుకు
మార్గమెక్కడాలేదు
కరుణజూపేవారు
మచ్చుకూలేరు
దరికిరమ్మను ఆప్త
బంధువులు లేరు.
తిరిగి తిరిగీ తుదకు
విసిగి వేసారి
బ్రతుకులపై ఆశలు
వదలుకొన్నారు.

బ్రతుక నేర్వనివారు
బ్రతుగగలరెట్లు?
బ్రతుక నేర్వనివారి
బ్రతికింతురెవరు?

౩

మూరానగంభీర
జలరాశి హోరు
గాఢాంధకారము
అలమె లోకమును :
నక్షత్రములుగూడ
వెలతెలాబోయె !
పక్షులు, మృగములు
నిద్రబోయినవి :
మానవకోటులు
కనుమూసిపడిరి ! :
చెట్ల ఆకులుగూడ
కదలుటలేదు
ఎక్కడజూచినా
నిశ్శబ్దమొకటె :
ఆకటి మంటతో
క్రాగినవారు
ఆశకవకాశమే
కనలేనివారు
ఏలాగునిద్రలో
మునిగిపోగలరు?
ఏలాగు కనుమూసి
పడి ఉండగలరు?
చీకటిలోవారు
ఒకరికి ఒకరు
ఊతగా పట్టుక
నడువగలిగారు
తూలుతూ సోలుతూ
కడుదూరమేగి
చివరకు చేరారు
సాగరముదరికి :

"ప్రకృతికొన్ని
కొన్ని భాగాలుగ
పంపిణీలు జరిగాయి.
లేనివాడు— బ్రతుక
లేనివాడే— నిజమేను.

ఐనాను—
రావద్దు నాదరికి
పోపొండి ఆవలికి
ఆత్మహత్యకు వీలు
లేదు— పోపొండి"
అనుచు సాగరరాజు
గర్జించినాడు.
ఆ సముద్రుని ఆజ్ఞ
నా బిడదంపతులు
వినలేదు :
వినలేరు వినలేరు
వారున్నస్థితిలో :
ఆ అభాగ్యపు
దివ్యదంపతుల కదిగో
మృత్యుదేవత పిలుపు
వినబడుతోంది :
విడలేక విడలేక
ఎడబాయలేక
రోదించి కడలిలో
కాలిడినారు :
వారిబ్రతుకునకదే
కడసారి రాత్రి : :

*  *

ఆ సముద్రుడు కూడ
రోదించినాడు !
వాయుదేవుడు కని
కంపించినాడు !
నక్షత్రములు జాలి
కన్నీరు నింపె :
ప్రకృతి దేవత
కృంగి కృంగి ఏడ్చినది ! :

## షష్టిపూర్తి

౬

బాబుగారి
షష్టిపూర్తి సభ
జరుగుతోంది దివ్యంగా !
పంతులుగారి
ప్రసంగం పరుగిడుతోంది
ప్రవాహంగా !
రకరకాల బహుమతులతో
ధనవంతులు వచ్చారు !
అమాయకుల పూల
భ్రమకులురిపడినవి
మాలలలో ! !

* *

పెద్దలుచెప్పే మాటలలో
కొన్ని నిజము కావేమో !
"పాపీ చిరాయు" వంటారే
అదిమాత్రము నిజమేను.



## ఆదర్శ మహిళా హిందీ విద్యాలయము.

ఈవిద్యాలయము ఆగస్టు నెలాఖరులో జరిగిన హిందీ పరీక్షల అనన్తరము శలవు లివ్వబడి తిరిగి అక్టోబర్ 3 తేదీని తెరువ బడును.

దీనియందు ప్రాథమిక మొదలు విశారదవరకు గల అన్నితరగతుల హిందీ పరీక్షకు ఉచితముగా మహిళ లకుశిక్షణ యొసంగబడును.

సంగీతము, రాట్నం పరిశ్రమ, నవారునేయుట, మొద లగు చేతిపనుల యందుగూడ శిక్షణ నొసగుటకు తగు యేర్పాట్లు చేయడమయినది.

పొరుగూరి విద్యార్థినులకు ఉచిత బస యొసగబడును.

వివరములకు:-

బి. కె. వెంకటరమణమ్మాదేవి.

వ్యవస్థాపిక:

వీరభద్రపురం, రాజమండ్రి.

# స్త్రీలు—సాంఘిక సేవ

గ్రామాలలో, చిన్న పెద్ద పట్టణాలలోకూడా, క్రింద మధ్యతరగతికి, కూలి, రైతు తరగతికి చెందిన స్త్రీలు, ఇంటిపనులలోనూ, బయట మిల్లు, పొలంపనులలోనూ, నిమగ్నులై యుంటారు. తీరికయనేది వారికి ఉండనే ఉండదు. పురుషులతోపాటు కాయకష్టపడి సంపాదించు కోవడం, ఇంట్లో వంట మొదలైనవి చూచుకుంటూ పిల్లా జల్లాను సాకుకోవడం, యీ పనులతో వారి కాలమంతా గడిచిపోతుంది. ఇక పై మధ్యతరగతికి జెందిన స్త్రీలు, ధనిక వర్గానికి చెందన స్త్రీలు, అందులో చాలా మంది విద్యావతులైనవారు, ఉన్నత విద్య బడసి డిగ్రీలు పుచ్చు కున్నవారుగూడ, ఎక్కువ తీరిక గలిగి. తమ కాలాన్ని ఏదేని ఒకవిధమైన కార్యక్రమంలో సద్వినియోగము చేయ గల అవకాశము కలిగి ఉన్నారు—సమర్థులైన వారి నాయకత్వంతో, తమ విద్యనూ, జ్ఞానాన్నీ, కాలాన్నీ, పరోపకారార్థం, దేశసంక్షేమార్థం, వినియోగించడానికి సిద్ధ ముగానూ ఉన్నారు. స్వతంత్రించి కార్యరంగంలో ఉరికే సామర్థ్యం మాత్రం అందఱి సొమ్ము కాదు. అట్టి సమర్థత గలవారే నాయకులని చెప్పబడుతారు. నాయకత్వము వహించగల ప్రత్యేక వ్యక్తిత్వము, ప్రత్యేక సమర్థత బహు కొద్ది మందికే లభిస్తుంది. అట్టి సమర్థతగలవారు, సేవయందు అభిలాషఉండి, ఇతర విధములైన అవకాశ మున్నవారిని సమావేశపరచి, సేవా విధానములో వారికి తగిన సూచన లిచ్చి, వారి యోగ్యతా యోగ్యతలను బట్టి ఖచ్చితమైన మార్గములను నిర్దేశించడం అవసరం.

ప్లానింగ్ కమీషన్‌వారి దేశాభ్యుదయకారక ప్రణాళిక లను సక్రమంగా నిర్వహించడానికి మహిళలలో గల సేవా శక్తిని ఎక్కువగా వినియోగించుకోవడం అత్యంత అవలంబనీయమైన సాధనమని, ఆంధ్ర మహిళా సభా నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవ సమయంలో భారత ఆర్థిక మంత్రి శ్రీ చింతామణ్ దేశ్‌ముఖ్‌గారు యీ క్రిందివిధంగా చెప్పారు.

"కేవలం ఒక దశాబ్ద పరిమితికాలంలో ఆడపిల్లల క్లబ్బుగా ప్రారంభమైన ఆంధ్రమహిళాసభ యిన్ని శాఖోప శాఖలతో అభివృద్ధి నొందినదంటే, యిక్కడి మహిళల దృఢసంకల్పం, సేవానిరతి, స్పష్టమౌతూవుంది. మహిళ లలో సంఘసేవాభిలాష ఎక్కువగానున్నదని, వారి యీ ఆసక్తి దేశసంక్షేమానికి వినియోగించుకోవడం అత్యావ సరమని ప్లానింగ్ కమీషన్ సభ్యులు అభిప్రాయపడు చున్నారు.

"ఈ విశ్వాసంతోనే ప్రధాని నెహ్రూగా శ్రీమతి దుర్గాబాయి గారిని ప్లానింగ్ కమిషన్ సభ్యురాలుగా నియమించారు. ఈ పదవికి ఆమె ఎంతయూ అర్హులనుట అతిశయోక్తి, ముఖస్తుతి, గానేరవు. స్వయం కృషివల్ల, అనేక ఆటంకా లను ధైర్యస్థైర్యాలతో ఎదుర్కొని, యీమె చేసిచూపిన నిర్మాణమే, యీమెకీ అర్హతను కలిగిస్తున్నది. అనేక చోట్ల విద్యాధికులైన స్త్రీలు, 'సంఘసేవ' అనే వ్యాపకం కలిగి ఉన్నారు. వారి కృషి కేవలం వృథాకాలక్షేపం కాకుండా, నిర్మాణాత్మక ఫలితాలనిచ్చే సలహాలు. సూచ నలు, పథకాలు, అవసరం—ఈ సందర్భములో తమ ఉద్దేశాలను శ్రీమతి దుర్గాబాయిగారు ప్లానింగ్ కమిషన్‌కు నివేదించారు. ఇలాంటి కృషికి కొంత సొమ్మును ఆర్థిక మంత్రులచే కేటాయింప చేయడంలో ఆమె కృతకృత్యు రాలు కావచ్చు".

ఇంకా ఈవిధంగా చెప్పారు.

"ప్లానింగ్ కమిషన్ నివేదిక ప్రచురింపబడినప్పుడు సంఘసేవా రంగములో స్త్రీలకు తగిన ప్రణాళిక తప్ప కుండా వుండగలదు. వివిధ ప్రాంతాలలో, విద్యావతు లగు స్త్రీలు, పరస్పర సంబంధం లేకుండా చేసే సాంఘిక సేవనంతా సమన్వయించి, స్త్రీలయొక్క తీరిక సమయం, సేవా తృష్ణ, సంఘ క్షేమానికి పూర్తిగా వినియోగించే పథక మొకటి యీ ప్రణాళికలో సూచింపబడగలదు. మహిళలందఱూ నిస్వార్థమైన కార్యదీక్షతో యీ ప్రణాళి కను స్వీకరించినప్పుడు, మన భవితవ్యాన్ని గూర్చి నిస్పృహజెందనక్కరలేదు."



# ★ గాలిమేడలు ★

* శ్రీ పి. వి. రత్నం *

అది సంధ్యా సమయం. పర్వతాలవలెలేచి తరంగాలు నన్ను జడిపిస్తున్నాయి. హోరుమని గాలి, చుట్టూ నవ నాగరికత యువతులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు, నాకు పిచ్చి ఎక్కినట్లయింది. ఏమిటో లోపల బాధపడసాగాను. ఒంటరితనానికి నొచ్చుకున్నాను. ఒక ప్రక్క ధనికులు విలాస జీవితాలు గడుపుతున్నారు. మరొకప్రక్క రిక్షావాలాల వంటివారు చెమటలు గ్రక్కుతున్నారు. నాజీవితాన్ని నవ్యంగా, స్వేచ్ఛగా నడుపుకోవాలని అంతులేని ఆశ. ఏవేవో కోర్కెలు పుడుతున్నాయ్........ ఏమిచేయాలో తెలియకుండావుంది. చిన్న పిల్లలు అలల్నిచూసి ఆడుకుంటున్నారు. ముసలివారు రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు. నాకివేమీ బుర్రకెక్కవు. నా దీదరనానికే బెంగపెట్టుకున్నా. ఒక ప్రక్క నిరుద్యోగం....తెల్లారితే ఎట్లా అనే సమస్య ఎక్కువగా వేధించింది. గట్టిగా ఆలోచిస్తే 'వేదాంతి'లా మారిపోతానేమో. ఒక్కొక్కసారి జీవితంమీదే విరక్తి పుట్టుతూ వుంటుంది. ఆలోచిస్తున్నా తీవ్రంగా. ఏమిచేయాలి?

ఇంతటి మహానగరంలో మర్యాదకు భంగంలేని ఉద్యోగం నాకు దొరకలేదు. నాకెవరిప్పిస్తారు? నేనేమైనా గొప్పవాడినా? అసలు పారిపోయి ఎందుకొచ్చానాయని ఏడ్చా. అయినా అక్కడమాత్రం అంతటి అమ్మాయిలు ఎవరున్నారు? చదువు ఇంటర్ తగలబెట్టినా ప్రయోజనం ఏమి కన్పిస్తున్నది? అందరిజీవితాలింతేనా? ఎందుచేత? నేనెలాబ్రతకగలను?

బ్రతికితే అంటే చిన్నఉద్యోగం సంపాదించుకుంటే ఏపంచనో ఏడ్వవలసిన అవసరమేముంటుంది? ఇక మహా వుంటే నాదగ్గర మూడు రూపాయిలు ఉంటాయేమో. రేపు ఎలాగో గడిపితే ఎల్లుండిమాటేమిటి? ఛాఛా, ఇంత దుర్భరజీవితాన్ని మానవుడు గడుపుతూవుంటే, ఈ ధనికులంతా దర్జాగా తిరుగుతున్నారేమిటి? అది అదృష్టమా? ఏమో..........

ఒకవేళ ఉద్యోగం రేపు దొరకకూడదా? దొరికితే నేతిలో రొట్టె పడినట్టేగా. రేపువెళ్ళి అడుగుతా. ప్రార్థిస్తా పోనీ, దయతలచిఇస్తే ఇంక కావలసినదేముంది? సుమారు నెలకు రూ 80 లు ఇవ్వవచ్చునేమో. ఇంటరు చదివానుగా, అంతమాత్రమైన ఇవ్వరా ఏమి? ఇస్తే మర్నాటినుంచి మహారాజులా తిరగొచ్చు,

ధగధగామెరిసే ఈ రోడ్లపై నేను కాళ్ళు అరిగేటట్టు తిరిగే శని విరగడైపోతుంది. చివరకు సిజర్స్ అయినా కాల్చుకోవచ్చు. మొదటి నెల జీతం రావడంతో మంచి "బిన్నీ" బట్టలు తీసుకొని, కొత్తబట్టలు కుట్టించుకోవచ్చు. పైన ఏమైనా ముట్టకుండా వుంటుందా? ముట్టినా ముట్టకపోయినా, ఆ రూపాయిలతో ఎలాగో సరిపెట్టుకోవచ్చు. మరొక ముఖ్యవిషయమేమంటే సిటీ బస్సుల్లో హాయిగా ఎక్కొచ్చు. ఎక్కితే ఇన్నిబాధలుండవుగా.

అసలు అప్పుడే మనతెలివి చూపించవలసివుంటుంది. నే నేమైనా తెలివితక్కువవాడ్నా కాదుగదా. ఆంగ్లో ఇండియన్స్ అంటే పూర్తిగా అసహ్యం. పోతే ఎవరినైనా నెమ్మదిగా, చల్లగా మంచిచేసుకుంటా. మంచి బట్టలు వేసుకొని టిప్ టాప్‌గా వున్నప్పుడే ఇది సాధ్యంకదా. ఎవరైనా అందమైన అమ్మాయి కనిపిస్తే చిన్నగా మందహాసం చేయాలి. పిట్ట దొరికితే మహా మజాగా ఉంటుంది మన రాజుగారిపని.

ఎన్నాళ్ళనుంచో నేను అనుకుంటున్నా ఒక రిస్టువాచీ కొనుక్కోవాలని. నాజీతంలో కొంచంకొంచం డబ్బుమిగిల్చి తక్కువలో మంచిరకం వాచీ కొనుక్కోవాలి. 'వాచీ' వుంటే గౌరవం పెరుగుతుందనడంలో సత్యం లేకపోలేదు.

అప్పుడుకదా మనం సగర్వంగా నలుగురిలో నిలబడగల్గడం? ఏంబ్రతుకో పట్టుమని ఇరవై సంవత్సరాలున్నాయోలేదో ఎన్నోకష్టాలు పడవలసి వస్తోంది. కొన్ని రోజుల్లోనే, పెద్దవారితో స్నేహం చేసుకోవడానికి పూర్తి ప్రయత్నాలు చేయడం శ్రేయస్కరం.

అప్పుడు సుఖంగా కేరింతలు కొట్టవచ్చు. సినీమాలు చూడవచ్చు. ఎన్నో విషయాలు తెలుస్తాయి. అవసరమైన అన్ని సదుపాయాలూ వారివల్ల చేసుకోవచ్చు. పెద్దవారి స్నేహం ఊరికే పోతుందా? దరిద్రంపోతే అంతా రాజ్యం ఏలవచ్చు. వారివల్లనే ఎవరినైనా పెండ్లిచేసుకునే

ఏర్పాట్లు చేసుకోవచ్చు. గట్టిగా ఆలోచిస్తే నాదికూడా ఒక జీవితమేనా? నేనుకూడా ఒక మనిషినేనా? అప్పట్లో రోజులు బాగుండేవి. మరిప్పుడో, రెండుపూటలా భోజనానికే భయపడిపోవలసి వస్తోంది. అప్పుడు అంతగా ఆవేదన అనుభవించ నవసరంలేదు.

*  *  *

ఎన్నో ఊహలు పరుగెత్తాయ్. నెమ్మదిగా కార్యాలయానికి బయలుదేరాను. నేను వెళ్ళేసరికి మేనేజరుగారు కస్సుబుస్సుమంటున్నారు. లోపల భయపడ్డా. ధైర్యంచేసి నమస్కారమన్నాను. అంతగా ఆయన ఈ విషయంలో ఉత్సుకత చూపించలేదు. నా దైన్యస్థితిచూసి దయ తలుస్తాడేమో యని భ్రమ— "ప్రతీవాళ్ళకీ ఉద్యోగాలు.... పోవయ్యా పో" అన్నాడు నేనుచెప్పే మాటలు పూర్తిగా వినకుండానే. గాలిలో నేను కట్టుకున్న మేడలు ఒక్కసారిగా బ్రహ్మాండమైన శబ్దంచేస్తూ కూలిపోయినట్లనిపించింది. బెంగతో, జెడదతో తలదించుకొని వస్తున్నా సెంట్రల్ వైపుకు. ఒక ఆంగ్లో ఇండియన్ యువతిని 'డాష్' ఇచ్చా. నేను తబ్బిబ్బు పడ్డా. 'ఫూల్' అంటూ సాగిపోయింది. ఇక చాలు దొంగతనంగా రైల్లో కూర్చున్నా ఊరు చేరుకుందామని. నన్నుచూసి పెద్దగా నవ్వింది టవర్ క్లాక్. తల దించుకున్నా. పచ్చ జెండా ఊగింది. రైలు కదిలింది. చెట్లూ, చేమలూ నన్ను ఊపివేసినట్లయింది. ఒక దీర్ఘనిట్టూర్పు విడిచా.

★

# కాలచక్రం

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

చూడు ! భయపడకు ! ధైర్యంవహించు
ఎదురవుతూన్న మరణాన్ని సందర్శించు !
ఈ లోకంలో ఎన్నో విషమసమస్యా
పరిష్కారకారణంగా కాలగర్భంలో కలిసిన
హృదయవిదారక దృశ్యాలు పరికించు !
ఈ ప్రపంచం అంతటా ఇసుకరేణువుల
మధ్య మరణించినవారి స్థాణువులు !
అంతులేని అజ్ఞానం ఆవహించిన
అశాంత సంతప్త వాతావరణంలో
పంతమాడి నాశనమైన విజ్ఞాన
వంతుల పావనజీవన చరిత్రలు !
ఇదిగో ! ఈసమాధిని చూడు !
జాలిగా వినిపిస్తుంది ఎముకలగోడు !
రక్తమాంసాదులు హరించిపోయిన
చరిత్రహీనుల జీవన్మృతులు !
కనలేని వినలేని దుఃఖగతులు
వీటినిచూసి జాలిపడకు- ఎందుకు?
ఏమిచెపుతుంది? ఈ విషాదపాషాణం-
దానిమధ్య అంతమైపోయినప్రాణం?
నీదృష్టి నిశావ్రాప్తతమిస్ర భరితం
నీజ్ఞానం ఆత్మనాశన కథాప్రచలితం
ఆ మృతశరీరాలకు నశించినదిశక్తి
నీకు కనిపించేది ఒక దీర్ఘసుషుప్తి
మరణించినవారి రక్తమాంసాదులు
ఇంకించుకొన్నవి ఇసుకరేణువులు
రాజులు రణవీరులు కార్చినరక్తం
లోభులు ధనవంతులు దాచిన విత్తం
కాలచక్రగమన మహావేగానికి
మట్టిలోకలిసి మాయమైనాయి.
ఈ శిథిలజీవన ప్రాంతపు ఇసుక-
మన భావి వైభవకాంతికి మసక-
బ్రతుకూ భాగ్యం పాడీ పంటా
విజ్ఞానం విభవం విశేషం—అన్నీ
కాలచక్రంలో మట్టిలో కలిసిన
జీవనలోకపు స్థాణువులు
దాచుకొన్నవి—ఇసుకరేణువులు !

★

[ 35-వ పేజీనుండి ]

ఒకనాడు యధాప్రకారం పొలంలో పని సాగుతూంది. తమ్ముడు పొలం దున్నుతూండగా, అన్నయ్య పరీక్షిస్తున్నాడు కార్యక్రమాన్ని. ఇంతలో ఓ రైతు అలసిసొలసి పరుగెత్తుకుంటూ, ఆవేదనతో పెద్దవాణ్ణి సమీపించి- "బాబూ! పెద్దబాబుగారు! మన పొరుగింట్లో పార్వతమ్మ చనిపోయింది!" అన్నాడు.

"అయ్యో పాపం! పార్వతమ్మ చనిపోయిందా? ఆమె మనకొక్కరికే తల్లికాదు, ఈ గ్రామీణులందరికీ తల్లి! ఈ గ్రామీణులకే గాదు ఈ లోకానికే తల్లి! విశ్వమాత!" అని పెద్దవాడు తన విచారాన్ని వెలిబుచ్చి, దహన సంస్కారాలు దగ్గరుండే చేయించాడు పార్వతమ్మకి.

ఈ మాటలు వింటున్న చిన్నవాడు, త్వరగా జాగ్రత్తగా ఈ వాక్యాల్ని కంఠస్థం వేసాడు. అన్నయ్యకి గౌరవం తెచ్చినవి ఈమాటలేఅయినప్పుడు, తనకిమాత్రం రాదాఅని!

ఒకరోజు చిన్నవాడు, తనకు జ్వరం వచ్చిందని, ఇవాళ పొలంపని చెయ్యలేనందున అన్నయ్యని చెయ్యమని ప్రాధేయపడ్డాడు. అన్నయ్య అంగీకరించగా, తను గట్టుమీద కూర్చున్నాడు. ఇంతలో మరో రైతు గబగబా ఆత్రుతతో చిన్నవాణ్ణి సమీపించి - "మీఅన్నయ్యగారేరి?" అని ప్రశ్నించాడు. "మా అన్నయ్యెందుకులెస్తూ! ఆ చెప్పవలసిందేదో నాతోనే చెప్పు!" అన్నాడు చిన్నవాడు. "చినబాబుగారు! పాపం మన సోమయ్యగారి భార్య చనిపోయింది!" అన్నాడు. వెంటనే చిన్నవాడికి అన్నయ్యమాటలు జ్ఞప్తికొచ్చాయి. వెంటనే -

"అయ్యోపాపం, సోమయ్యభార్య చనిపోయిందా? ఆమె మనకొక్కరికే భార్యకాదు, ఈ గ్రామీణులందరికీ భార్య! ఈ గ్రామీణులకే గాదు, ఈ లోకానికే భార్య! విశ్వభార్య!" అని దహనసంస్కారానికి సహాయపడతానన్నాడు. అంతా బుర్రబద్దలు కొట్టారు!



# ఆంధ్ర బాలానంద సంఘం, మదరాసు

## దసరా పోటీలు.

ది-22-9-1952 న ది 23-9-1952 న సెంట్ మేరీ హాలులో ఆంధ్ర బాలానంద సంఘంవారి పిల్లలకు నృత్య నాటక సంగీతాలలో దసరాపోటీలు జరిగినవి. పెరంబూరు వెంకటరమణ తెలుగు హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాల, కేసరీతెలుగు ఎలిమెంటరీస్కూలు, రావుబహదూర్ కలవలకణ్ణంచెట్టి హైస్కూలు, విల్లువాకం శ్రీ కనకదుర్గ తెలుగు హైస్కూలు, కేసరీ మిడిల్ స్కూలు బాలబాలికలు వీనిలోపాల్గొన్నారు. 'చిట్టిపొట్టి బాలబృందం', 'సుశీలా బృందం', 'ప్రకృతిబాలలు', 'నటన బృదం', 'సిసింద్రీబృందం', బాలానందసంఘం బాలలు, అంతాకలిసి, పాటలుపాడేరు, నాట్యంచేశారు, నాటకాలుప్రదర్శించారు.

వాహినీచిత్ర నిర్మాతలు శ్రీ బి.ఎన్. రెడ్డిగారు మొదటిరోజు, మద్రాసు కలెక్టరు శ్రీ వివేకానందమూర్తిగారు రెండవరోజున యీప్రదర్శన పోటీల సభలకధ్యక్షత వహించారు, శ్రీమతి జి. వరలక్ష్మిగారు బహుమతులను పంచిపెట్టారు.

మదరాసు సలుపూలల్లో ఉన్న ఆంధ్రబాలలందరినూ, యిలాంటిప్రేరేపణలతో ఒకచోటజేరుస్తూ వారిలోని వివిధ కళాప్రదర్శనలకు అవకాశము, ప్రోత్సాహమూ కలిగిస్తూవున్న, ఆంధ్రబాలానందసంఘం నిర్వాహకులైన 'అక్కయ్యన్నయ్యల' కృషి ప్రశంశనీయము.



# ★ సంక్రాంతి ★

డైరెక్షన్ — సి. పుల్లయ్య.
రచన — బలిజేపల్లి లక్ష్మీకాంత కవి.
సంగీతం — అశ్వత్థామ.

నటీనటులు:
శాంతకుమారి, శ్రీరంజని, సదాశివరావు, శివరావు, ఎ. వి. సుబ్బారావు, చంద్రశేఖర్, సావిత్రి మొదలైనవారు.

కథాసంగ్రహం:— ఒక సమిష్టి కుటుంబగాథ. మధ్య తరగతి సమిష్టి కుటుంబంలోని సుఖదుఃఖాలు చిత్ర విచిత్ర వ్యక్తులు, సంఘటనలు ఇందు చిత్రించబడినవి.

అన్నపూర్ణమ్మ సమిష్టి కుటుంబంలో పెద్దకొడుకు విశ్వం చేతకాని, తనంచే భార్యచేతిలో కీలుబొమ్మ కావడం, ప్రయోజకుడైనరెండవకొడుకు బ్రహ్మానందం వైరాగ్యంలో పడివుండుటవల్ల గయ్యాళి అయిన పెద్దకోడలు తన తోడికోడలయిన లక్ష్మిని నానాహింసలు పెట్టి ధనాశచే రెండోమరిది మోహన్ చదువు కూడా మాన్పిస్తుంది, మామగారి ఆబ్దీకానికి డబ్బు యివ్వకుండా ఆఖరికి డబ్బు పోయిందని, ఆమిషతో మోహన్ లక్ష్మిలపై అపవాదు వేస్తుంది. ఈ అవమానం భరించలేక లక్ష్మి ఆత్మహత్య చేసుకుంటుంది.

ధనాశా పిపాసియైన శాంత - దొంగతనంగా కూడ బెట్టిన ధనంతో తన భర్తతో కలిసి పట్నంపోయి అక్కడ ఎఫ్. ఎస్. రావు అనే వింతవ్యక్తితో కోళ్ళ వ్యాపారం సాగించి ఆఖరికి సర్వనాశనం అవుతారు.

ఇక్కడ మోహన్ చిన్నప్పటినుంచీ ప్రేమించిన రాధ తండ్రికీ వీరికీ పగల మూలంగా, రాధ తండ్రి తన బొందెలో ప్రాణం వుండగా మోహన్‌తో తన కుమార్తె రాధ వివాహం జరగదని శపథంచేసి తన అల్లుడైన పాపారావుని పిలిపించడం, పాపారావు ధనాశచే మామను చంపడం, ఆ నేరం మోహన్‌పై మోపి జైలుకి పంపడం చివరకు బ్రహ్మానందం తల్లి బోధపై తిరిగి వకాల్తా పుచ్చుకొని తమ్ముని విడిపించడం జరుగుతుంది. చివరకు రాధా మోహనుల వివాహం జరగడం, సమిష్టి కుటుంబం తిరిగి కలుసుకొని ఒకే యింట్లో వుండడంతో కథ సమాప్తమవుతుంది.

హిందూదేశ సాంప్రదాయానుసారం వీధిలో సంక్రాంతి ముగ్గులతో, పగటి వేషగాళ్ళ నృత్య గానములతో, చిత్రం మొదలుపెట్టి, చివరకూడా అదేవిధంగా అంతమైంది.

బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి కలం చాలా జోరుగా నడిచింది. కొన్ని డైలాగ్సు సామెత రూపంగా చాలా బాగున్నాయి. సి. పుల్లయ్యగారి దర్శకత్వం సామాన్యంగా వుంది. చిత్రం విశ్రాంతి సమయంవరకూ రక్తి కట్టింది. తరువాత ఎక్స్‌ప్రెస్‌లా పరుగెత్తింది. సంగీతంలో విశేషం అంతగాలేదు. ఫొటోగ్రఫీ తృప్తికరంగాలేదు. సౌండు అక్కడక్కడ దెబ్బతింది.

"తల్లి"గా విజయలక్ష్మిగారు చక్కగా ఆమె పాకచక్యాన్ని ప్రకటించేరు. గయ్యాళి శాంత (శాంతకుమారి) పెద్దకోడలి పెత్తనం వహించి, అత్తను, తోటికోడల్ని నానా హింసలూ పెట్టడం, మరిదిని అస్తమానం అప్రయోజకుడని దూషించడం, సాధారణ కుటుంబాలలో ఎప్పుడూ జరుగుచున్న సంఘటనలే యివి. గయ్యాళి పాత్రను మంచి పాకచక్యంగా నిర్వహించింది శాంతకుమారి.

యజమాని తద్దినానికి పెద్దకొడుకు డబ్బు యివ్వనందే నౌకరు శేషయ్య తన ఆవుని అమ్మడం, కొడుకులందరూ తల్లిని విడిచినప్పుడు కష్టంతో బాధపడుతూవుంటే యజమానురాల్ని విడవకుండా ఆమెకు సహాయపడడం, మొదలైన సన్నివేశాలు చాలా బాగున్నాయి.

యఫ్. యస్. రావుగా శివరావు మామూలు పంథాలో ఓవర్ యాక్షన్ ప్రేక్షకులకు చూపి, "రామాయణంలో పిడకలవేటలా" దుఃఖంలో కడుపుబ్బ నవ్వును పుట్టించేడు.

సన్యాసం పుచ్చుకుని, అన్నీ త్యజించి, అడవులంట పట్టిన ఆనందరావు (రమణారావు) మాతృదేవి కోరికపై జైలులో ఉన్న తమ్ముడిని విడిపించడానికి సన్యాసం వదలి వకాల్తా పుచ్చుకొనుట అసందర్భంగావున్నా, తన సుఖాన్ని లెఖ్ఖచేయక పరోపకారానికి తన దీక్షను మాని తమ్ముని రక్షించుట సహజంగానే వుంది. కోర్టులో వాదించేటప్పటి దృశ్యం చెప్పుకోతగ్గది.

మొత్తానికి చిత్రం బాగానే వుందని చెప్పవచ్చు. కాని ప్రత్యేకస్థానం లభించదు. ఇప్పుడు విడుదలయే చిత్రాల మాదిరే యిదికూడా చెల్లుబడి కావచ్చు.

రమ.



# మహిళా లోకం

## ఆంధ్ర మహిళా సభ మాతా శిశు సంరక్షణశాఖ

విజయదశమి ఆదివారం ది 28-9-1952 నుండి ఆంధ్ర మహిళాసభ మాతా శిశు సంరక్షణ శాఖలో పని ప్రారంభమైనది. డాక్టర్ పావనాబాయి ఎం. డి. గారు అక్కడ వైద్యురాలుగా నియమింపబడినారు.

ఇందలి ఉచిత వైద్యశాల, ప్రతిదినమూ, 8 గం॥ నుండి 11 గం॥ వరకు, సాయంకాలము 4 గం॥ నుండి 6 గం॥ వరకు తెరచియుంచబడును.

* * *

## శ్రీమతి దుర్గాబాయిగారి తైలవర్ణ చిత్రం

ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపకురాలు, వర్తమానంలో ప్లానింగ్ కమిషన్ మెంబరునైన, శ్రీమతి దుర్గాబాయి గారి తైలవర్ణ చిత్రమును శ్రీచామకూరి సత్యనారాయణ గారిచే వ్రాయించుటకు ఆంధ్రమహిళాసభ కార్యవర్గం, సభ్యురాండ్రు నిర్ణయించారు. ఈసందర్భములో అభిమానుల నుండి విరాళములు సేకరించుటకు గూడ సభవారు నిర్ణయించారు—

* * *



బొంబాయి రిజర్వు బ్యాంకు ఆఫీసులో, ఆటోమాటిక్ పన్చింగ్ మిషన్ల వద్ద పనిచేస్తున్న యువతులు.

* * *

## స్త్రీల గృహ పరిశ్రమల సంఘం, గూడూరు

ది - 14-9-1952- సాయంకాలం శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారి అధ్యక్షతక్రింద, పైసంఘ 12 వ వార్షికోత్సవము జరిగినది.

సంఘడైరెక్టరు శ్రీమతి యర్రమరెడ్డి లక్ష్మీదేవమ్మగారు జాతీయ పతాకమునావిష్కరించిన యనంతరము సంఘాధ్యక్షురాలు శ్రీమతి తాండమనాటి సుబ్బమ్మగారు శ్రీమతి లక్ష్మీబాయమ్మగార్కి స్వాగతమిచ్చారు. కార్యదర్శిని శ్రీమతి నక్కా రంగనాయకమ్మగారు నివేదికలో 14 గురు సభ్యురాండ్రతో ప్రారంభమైన సంఘం ఇప్పుడు 90 మంది తోవరిల్లుతున్నదని, ఇందుఖద్దరునేత, ఇంకా గృహోపకరణములగు వస్తువుల తయారింపు, జరుగుచున్నవని చెప్పారు.

శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు సంఘం యొక్కకృషిని ప్రశంసిస్తూ, మనంకష్టించి ఆర్జించుకున్న స్వరాజ్యం నిలబడాలంటే, స్త్రీలు ఎక్కువగా కుటీర పరిశ్రమలు, గ్రామపరిశ్రమల అభివృద్ధికి తోడ్పడవలెనని చెప్పారు.

వందన సమర్పణ యనంతరము బాలికలు శ్రీకృష్ణతులాభారనాటకమును ప్రదర్శించిరి.

* * *



ట్రెయిన్డ్ నర్సెస్ ఎస్సోసియేషన్ ఆఫ్ ఇండియావారి, 41-వ వార్షిక సమావేశాన్ని, న్యూఢిల్లీలో లేడి ఇర్విన్ కాలేజీలో, సెప్టెంబరు 24వ తేదీన యూనియన్ ఆరోగ్య మంత్రి, శ్రీమతి రాజకుమారి అమృతకౌర్, ప్రారంభించారు.

చిత్రములో—ఎడమనుండి కుడికి :

శ్రీమతి అమృతకౌరు (ఉపన్యసించుచున్నారు) మిస్. టి. కె. అద్రన్‌వాలా-ఛీఫ్ నర్సింగ్ సూపరింటెండెంటు, డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ హెల్త్ సర్వీసెస్, మిస్. డెయిసీ. సి. బ్రిడ్జెస్, ఎగ్జిక్యూటివ్ సెక్రటరీ, ఇంటర్ నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నర్సెస్, లెఫ్టినెంట్ కల్నల్ సి. కె. లక్ష్మణన్, డైరెక్టర్ జనరల్ ఆఫ్ హెల్త్ సర్వీసెస్, కుమారి లక్ష్మీదేవి-ట్రెయిన్డ్ నర్సెస్ అసోసియేషన్ సెక్రెటరీ.






## చక్కని కథలు

గ్రంథకర్త్రి :- కవితిలక, కవితావిశారద,
శ్రీమతి కాంచనపల్లి కనకాంబ, విద్వాన్.
ప్రచురణ :- కవితిలక గ్రంథమాల, విద్యావిషయక
ప్రచారకులు :
విజయవాడ—2

ఇవి రమారమి 60 కథలు. 3 భాగములలో వెలువడినవి. రచయిత్రి పరిచయ వాక్యములలో చెప్పినట్లు పిల్లలకు కథలు వినడము, కథలు చెప్పడము చాలాయిష్టము. ఈకథల రూపములో, చక్కని భాష, మంచి లోకజ్ఞానము, ఉత్తమ ఆదర్శములు, పిల్లలకు బోధించుట చాలా సుళువైన పద్ధతి.

ఈ చక్కని కథలలో, వానిద్వారా పిల్లలకు రచయిత్రి బోధింపదలచిన విజ్ఞానము, నీతికి, తోడు రెండు ముఖ్యముగా పేర్కొనవలసిన సుగుణములున్నవి. పిల్లల దృక్పథమునుండి యివి ముఖ్యముగా పేర్కొనవలసిన విషయములు.

ఒకటి:— కథలు చాలా చిన్నవి. కొండవీటి చాంతాడు వంటి కథలు ఓపికతో చదివి, అందలి పెక్కు పాత్రలను జ్ఞాపకముంచుకుని, కట్టకడకు అందలి సారాంశమును సంగ్రహించుకునేశక్తి పిల్లలకుండదు. ఎంత పొట్టి కథలైన వారికంత ఉత్సాహము.

రెండవది— కఠినముకాకుండా, సులభమైన గ్రాంథిక భాషలో యీ కథలన్నియు రచించబడినవి. వాడుకభాష యను పేర ఒక గ్రామ్యపదముకూడా ఇందు కానరాదు.

(మిగతా ప్రక్క పేజీలో)

లెక్కలేనన్ని కథలు పత్రికలలో వస్తున్నాయి. వాటిలో సామాన్యంగా యువతీ యువకులు పారిపోయి పెళ్లిచేసుకోవడమో, ఒకరి కొరకు ఒకరు చావడమో యితివృత్తంగా వుంటుంది. వాస్తవిక ప్రపంచంలో అలాంటివి జరగడం ఎక్కువగా కనపడదు. అలావుంటే బాగుండుననే అభిలాషే యిట్టి రచనలకు కారణం.

ఇంకోరకం కథలలో ప్రతిజమీందారు దుర్మార్గుడుగాను, ప్రతి రైతు అమాయకుడుగాను చిత్రిస్తారు. అదీ వాస్తవానికి దూరమే. కానీ ఈవాదన ప్రస్తుతం అమలులో వుందికనుక కథలలో ప్రచారమవుతున్నది. నిజానికి పల్లెటూరి రైతుప్రజలలో మనిషికుండే తికమకలు అన్నీ వున్నాయి. వారు చదువుకొన్న వారినే తబ్బిబ్బుచేస్తారు కానీ, నష్టపోరు.

ఇంక మూడోరకం కథలు చెప్పరానివి, వినరానివిగా వుంటాయి. అర్ధనగ్నం, అశ్లీలాలతో కూడిన ఈకథలపుస్తకాలు ఎక్కువగా రైల్వేస్టేషనులలో అమ్ముతున్నారు. వాటిని మనస్త్రీలు చదవడం శోచనీయం. ఈ మోజు యిటీవల కొంత తగ్గింది. బహుశా వాటిపై విసుగెత్తడమే కారణం కావచ్చు. కవితాభావం కలవారు తరచుగా కథలు వ్రాయడంలేదు. వారికాశక్తి నాలుగైదేండ్లనుండి తరువాత "బారువడ్డీపై" బ్రతకడంవల్ల తగ్గిపోతున్నది.

శరత్‌చంద్రబోసు నవభావాలు కలిగి పతితులతో తిరిగి, వారిబాధలు తెలుసుకొని, చిత్రమయిన ప్రవృత్తులు పట్టుకొని ప్రతివ్యక్తికి అందుబాటులోనున్న పాత్రలను సృష్టించాడు. అవి విద్యావంతునికి. చదువుకొనని వాడికి కూడా నచ్చుతాయి. తెలుగులో అట్టివి వ్రాయగలవాడుంటే అతణ్ణి గౌరవించాలి.

[విల్లువాకం తెలుగుస్కూలులో, శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారుచేసిన ప్రసంగంనుండి]

అయినప్పటికీ పిన్నవయస్కులకందని శైలికాదు. బాల వాఙ్మయము, బాల సాహిత్యము అభివృద్ధి చెందాలనే ఆధునిక ఉత్సాహపరులంతా, బాలలకందే గ్రాంథికభాషను ఇందు చూడవచ్చును.

ముద్రణ విషయంలో ఇంకా ఆకర్షవంతముగా ఉందుటకు, అచ్చుతప్పు లన్నిలేకుండా ఉండుటకు ఇంక కొంచము శ్రద్ధతీసికొనడం అవసరం.

ఇందు మొదటిభాగము 0—6—0 రెండవ భాగము 0—10—0 మూడవ భాగము 0—12—0.

* * *

## వ్యామోహము

రచయిత : వేదము వెంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ.

వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,
4, మల్లికేశ్వర గుడిసందు, లింగిచెట్టివీధి, జి. టి. మద్రాసు
వెల రూ. 0—12—0 లు

ఆధునిక ఆంగ్లనాటకాల పద్ధతిలో యీనాటక రచన సాగింది. నాయకునికి, చదువుకొని, సంఘంలో నాగరీక యువతి గా మసలగల స్త్రీని భార్యగా చేపట్టాలన్న వ్యామోహము. అయితే తనకు చిన్నతనంలోనే సుశీల యనే కన్యతో వివాహమౌతుంది. తనతండ్రికి మామగార్కిగల కలహమువల్ల సుశీల పరిత్యజించ బడుతుంది. నిరపరాధియగు సుశీలను తిరిగి స్వీకరించమని ఎవరు ఎన్ని బోధించినా, సుశీల చదువు కొనని అనాగరీక యువతియనే అనుమానంవల్ల, కుటుంబరావు తన పట్టుదల విడువడు. ఈతని మనస్తత్వం గుర్తించిన సుశీల స్నేహితురాలు మిస్ పారిజాతం, మిత్రుడు రామయ్య, కలసి ఒక నాటకం ఆడించి కుటుంబరావు సుశీలనే ప్రేమించి, రిజిష్టరు వివాహం చేసుకునే సందర్భాలు కలిపిస్తారు. కథావస్తువు వాస్తవికతకు కొంచందూరమైనా, తమాషాగా చదవడానికి నాటకం, శైలి అంతా తేలికగా అక్కడక్కడ చమత్కారం గారూడా, ఉంటుంది.

* * *

## స్వీకారం

### మాతృసేవ
(దసరా సంచిక)
సంపాదకులు :- శ్రీ శ్రీధర్,
ప్రచురణస్థానం :- 25-ఎ తంబుచెట్టివీధి, మదరాసు-1
వెల : రూ. 0—6—0 లు

### కృష్ణాపత్రిక
(దసరా సంచిక)
సంపాదకులు :- శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు,
శ్రీ కమలాకర వెంకట్రావు.
ప్రచురణస్థలం : మచిలీపట్నం.
వెల : రూ 0—4—0 లు





శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి "పేదరైతు" లో ఏరువాక ఉత్సవం.

# ఆంధ్రమహిళ



గృహ పరిశ్రమ

NOVEMBER '52 ANDHRA MAHILA 8 ANNAS

ఆంధ్ర దేశమంతటా
ఈ నెలలో విడుదల!






దక్షిణ దేశమంతటా నెలలతరబడి
ప్రజలు పరవశంగా చూస్తున్న
ప్రమోద భరితమైన చిత్రం...

*Release through*

**THE VAUHINI PICTURES Ltd.,**

MADRAS... VIJAYAWADA... GUNTAKAL

# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: నవంబరు '52 :: సంచిక 7


ఊహాగానము ... సంపాదకీయం

రాజకీయాలు ... శ్రీ గోళ్ళమూడి రామచంద్ర రావు

కవి—గేయనాటిక ... ,, సూరంపూడి భాస్కరరావు

పరిష్కర్త—కథ ... ,, కందుకూరి లింగరాజు

పొదుపుకోసం—కథ ... శ్రీమతి డి. యస్. రాజేశ్వరీ పట్నాయక్

అనుమానం కొంప కూల్చింది—కథ ... ,, శ్రీధర జయలక్ష్మి

చెట్లు-చేమలు ... శ్రీ వేమరాజు భానుమూర్తి

తూర్పుదేశాలలో మహిళాభ్యున్నతి—చైనా ... శ్రీమతి పరిశి సుభద్రమ్మ

పిల్లల తర్ఫీదు ... ,, ఆమర్తి భాస్కరమ్మ

ఇంకా, గేయాలూ, పద్యాలూ, బాలానందం, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష.



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యల్.,

సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.



ది 21—9—'52 న ఇండియా ప్లానింగ్ మంత్రి శ్రీ గుల్జరీలాల్ నందాగారు, ఢిల్లీలో ఆంధ్ర విద్యాసంఘంవారిచే నిర్మింపబడు పాఠశాల భవనానికి శంఖుస్థాపన చేసినప్పటిఛాయాచిత్రం.




సంపుటి 9 :: నవంబరు '52 :: సంచిక 7

# ఊహాగానములు

ప్రధాని నెహ్రూ సామాన్యంగా, వాస్తవానికి అవతలవున్న, ఆదర్శయుతమైన మరియొక ప్రపంచంలో సంచరిస్తూ ఉంటాడు. స్వాతంత్ర్య సిద్ధికిపరువాత తన సహచరులలోనూ, అనుచరులలోనూ, విదితమైన స్వార్థం, కుత్రిమం, మరింత ఆయనను యదార్థానికి వ్యతిరేకమైన ఆదర్శ ప్రపంచానికి తీసుకుపోతున్నాయి. ఇటీవల నెహ్రూ పండితుని మదరాసు రాష్ట్ర పర్యటనలో చేసిన ఉపన్యాసాలలో, యీతీరు ఎప్పటికన్నా ఎక్కువగా విదితమౌతుంది.

యదార్థాన్ని గూర్చి, వర్తమానాన్ని గూర్చిన నిస్పృహ, ఆశాంభగం వారి దృష్టిని ఒక్కమారుగా భావి పౌరులైన బాలబాలికల వైపుకు మరల్చాయి. కుత్రిమము, అవినీతి అనే వ్యాధులకులోనైన పెద్దవారంతా నిష్క్రమిస్తేనేగాని, వర్తమానపు పిల్లలంతా ఆదర్శయుతంగా పెరుగుతునేగాని, భారతదేశపు భవితవ్యం అభివృద్ధిని సాధించలేకపోతుంది అనే ధ్వని ఆయన ఉపన్యాసాలలో వినబడుతూనే వుంది.

పిల్లల దేహమానసిక అభివృద్ధులపై ఎల్లరూ దృష్టిని కేంద్రీకరించాలనీ, ఏ ఒక్క పసివాడూ, తిండి, గుడ్డలులేక, విద్యా సౌకర్యాలులేక, ఆరోగ్యముగా బ్రతికే అవకాశాలులేక, బాధపడగూడదనీ, పెద్దలందఱూ పిల్లలపై తమ దృష్టిని కేంద్రీకరించాలనీ, పలుచోట్ల ప్రధాని దీర్ఘోపన్యాసాలతో చెప్పియున్నారు.

వీరి సలహాలలోని ఆవశ్యకత, ఆదర్శములోని ఔచిత్యం గమనించదగినవే అయినా, యదార్థ పరిస్థితులనుండి, తప్పించుకునేటందుకని ప్రస్తుతంలో చేసే ఊహాగానం కాదా అని నిదానించి పరిశీలించేవారికి తోచకమానదు.

పిల్లలను, ఆదర్శయుతంగా, శాస్త్ర విధ్యుక్తంగా పెంచాలంటే సామాన్యమా? పుష్టిగల ఆహారం, ఆరోగ్యావాసమైన నివాసం, అవసరమైన వస్తువులు, విద్యాభ్యాసనకు అవకాశాలు, ఉచితమైన వైద్య సహాయం— వీనికిమీద అకలుషితమైన, ప్రశాంతమైన వాతావరణం, పిల్లల పెంపకమే పరమోద్దేశముగాగల్గి దానికి తగ్గ తీరిక, విజ్ఞానము, మనోశాంతిగల తల్లిదండ్రులు, వారికి విద్యావిజ్ఞానాలు నూరిపోయడమే ఉపాసనగాగల గురువర్యులు ఇన్నింటిపైన ఆధారపడిన విషయము పిల్లలు ఆదర్శయుతంగా పెరగడం, దరిద్రదేవత తాండవమాడుతూ ఉన్న మన దేశంలో, ఏ అభివృద్ధిని, ఏ మూలనుండి ఎట్లా ప్రారంభించాలో నిర్ణయించుకోలేక తికమక పడుతున్న పరిస్థితులలో, మన పిల్లలకు గల అవకాశా లెంతమాత్రం—యిందు జన్మించే పిల్లలు ఎంతమాత్రపు అదృష్టవంతులా అనే సందేహము కలుగకపోదు. అయితే ఈ తరములో కాకపోయినా, మరుతరములోనైనా, మన ఊహాగానాలు ఫలించి, మన మనుమలు, మునిమనుమలు, ఆదర్శయుతమైన వాతావరణంలో పెరిగి భారతదేశాన్ని ఒక ఉన్నతస్థాయికి తేగలరని మనసు తృప్తిపరచుకుందాం.

# ఆంధ్ర రాష్ట్రం

* శ్రీమతి అ. చన్నఘంటమ్మ *

40 సంవత్సరాల క్రితము మొలకెత్తిన ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం, భాషా ప్రయుక్త రాష్ట్రాలు ప్రజాహిత పరిపాలన రీత్యా అత్యవసరమని కాంగ్రెసు నాయకులు స్వాతంత్ర్యమునకు ముందు వివిధ సమయాల్లో చేసిన తీర్మానాలు, స్వాతంత్ర్య సిద్ధికి అనంతరం రాష్ట్ర సమస్య పట్ల మహా నాయకులు చూపిన ఔదాసీన్యం, స్వార్థమునకు భంగకరమైన రాష్ట్ర విభజనను వేయి విధములుగా వ్యతిరేకిస్తున్న తమిళుల తంతు —ఇవన్నీ చర్విత చర్వణములే.

స్వామి సీతారాం, ఆయన అనుచరులు గలిసి, ఏమాఏమి రెండు సంవత్సరాలుగా రాష్ట్ర ఉద్యమాన్ని సజీవము చేస్తూ, రాష్ట్ర సిద్ధికై చేయుచున్న ప్రచారము, ప్రాయోపవేశములు, నాయకులకు చేసిన విజ్ఞప్తులు కూడా, వెఱ్ఱివాడు వేపకాయ తిన్నట్లు అర్థము లేనివిగా, లక్ష్యము చేయ తగనివిగా, తూష్ణీ భావనతో, అతి చులకనగా చూడబడుతున్నవి. స్వాతంత్ర్య సమరములో తమతో పాటు పోరాటము సలిపి, గాంధీ మహాత్ముని ఉత్తమ సిద్ధాంతాలను తమ జీవితములో అనుసరించి చూపుతూ. ఆశ్రమ జీవితాన్ని గడుపుచున్న శ్రీ స్వామి సీతారాం వంటి సేవా వృద్ధులు, మహా వ్యక్తులు కూడా, కీలక స్థానాల నధిష్ఠించి, పరిపాలనాధికారాలు చేజిక్కించుకోని కారణంవల్ల, అధికార యుక్తమైన నాయకత్వాన్ని చెలాయించే ప్రభుతుల దృష్టిలో, గడ్డిపోచతో సమానముగా పరిగణింప బడుతున్నారు. మహా నాయక వర్గాలవారెవరికీ యీయనతో సంప్రదించడానికి గాని, సలహాలివ్వడానికి గాని, వారి ప్రతిపాదనలను సవిమర్శన దృష్టితో పరిశీలించడానికి గాని. తుదకు వారి కోర్కెపై వారితో ముఖా ముఖిని మర్యాదకైనా ప్రసంగించుటకు గాని తీరిక లేదు. అవసరమని తోచడమూ లేదు.

అయినా మన బంగారము మంచిది కానప్పుడు కంసాలి మాత్రమేమి చేస్తాడన్నట్టు కేంద్రము లోనూ, రాష్ట్రంలోనూ కూడా అధికారస్థానాల నలంకరించిన ఆంధ్ర ప్రముఖులు తమ స్వార్థాన్ని ఒక్క నిముషము విస్మరించి, తమ ఆత్మ గౌరవాన్ని ఒక్క నిముషము స్మరించి, యావదాంధ్ర ప్రజయొక్క భవితవ్యమూ తమ బాధ్యతా యుత ప్రవర్తనపై ఆధారపడి యున్నదని గుర్తించి నట్లయితే, రాష్ట్ర సమస్య యీ నాడు యింత గడ్డుగా, యింత ముడిపడనదిగా పరిణమించదు. తక్కిన ఏభేదాలన్నీ యెట్లాఉన్నా, రాష్ట్రసమస్య యన్నది ఆంధ్రు లందరిదీనీ, ఏ ఒక్క రాజకీయ పక్షానికీ సంబంధించినది మాత్రము ఎన్నటికీకాదు— అందువల్ల, ఆంధ్రులలో నాయకుల మన్నవారందరూ, ఇటు ఇతరత్ర ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నవారూకూడ కలిసి, యీ సమస్యను కేవలం నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించి, ఏకీభావముతో ఒక నిర్ణయానికి రావడం తక్షణం జరుగవలసిన కార్యక్రమం.

ఆంధ్రప్రదేశకాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర విషయం తమ వెనుకటి తీర్మానం కొంచం తొందరపాటువల్ల జరిగినదనీ చెన్నపట్నం విషయంలో ఆంధ్రులకుగల హక్కులను వదలుకొనుట సాధ్యముకాదనీ యిటీవల చెప్పడం. చాలా ముదావహమైన విషయం. పునఃపరిశీలనపై న్యాయబద్ధంగా తమ అభిప్రాయాన్ని మార్చుకోవడానికి ఒప్పుకున్న వీరి ఔదార్యం, ఆంధ్రులకు వారి నాయకత్వంలోని విశ్వాసాన్ని అధికతరం చేయగలదు.

ముఖ్యమంత్రిగా, రాష్ట్రప్రజల నందరనూ సమదృష్టితో పరిపాలించవలసిన రాజగోపాలాచారిగారు, ఇటీవల కర్రైకుడిలో చేసిన ప్రసంగంవల్ల, తమ పక్షపాతమును వెల్లడించడమైనదేగాని, ఆంధ్రులెవ్వరూ అందుకు భయపడి, నిస్పృహ జెందడంగాని, న్యాయబద్ధమైన తమ హక్కులను సాధించుకోవడంలో వెనుకంజ వేయడంగాని ఎన్నటికీ జరుగదు. ఆంధ్ర కేసరిగారన్నట్లు, చెన్నపట్నంలో 16 % మాత్రమే ఆంధ్రులని ముఖ్యమంత్రిగారు చెప్పిన విషయం సత్యదూరమైనది, నిశితపరిశీలనకు గురికావలసినది. శ్రీతెన్నేటి విశ్వనాధంగారు వెలిబుచ్చినట్లు అమ్మన్న రాజాగారివంటి చదువుకున్నవారు, ఇంతో కొంతో అధికారం కలిగి, అచ్చ తెలుగువారని అందరకూ తెలిసినవా

(12-వ పేజీ చూడండి)

# ఆషామాషీ

* అవివేకి *

## మన నాయకులూ — డాక్టర్లూ

ప్రధాని నెహ్రూ చెన్నరాష్ట్రంలో విద్యార్థుల సంఘానికి ఉపన్యసిస్తూ, చీటికీ మాటికీ మందులు మింగే అలవాటు తగదని ఉద్బోధించారు. పైగా అనేక సంవత్సరాలుగా తాము అసలు మందనేదే పుచ్చుకోలేదనికూడా చెప్పారు. వైద్యకళాశాల విద్యార్థులకు బహుమతులు పంచిపెడుతూ, గవర్నరు శ్రీప్రకాశ వీలైనంతవరకు డాక్టర్లకు దూరంగా ఉండడమే మంచిదని, ఆ సూత్రాన్నే ఆయన ఎల్లప్పుడూ పాటిస్తూ ఉంటాననికూడా సెలవిచ్చారు. తథాస్తు. జీవితాంతం వారంతా డాక్టర్లను అమడదూరాన్న ఉంచి, సుఖంగా జీవించాలనే నా కోర్కెకూడా.

అయితే పాపం- అందరూ యీ సూత్రాన్నే అవలంబిస్తే మన డాక్టర్ల భవితవ్యం ఏమికాను అని. కేవలం ముక్కు జలుబుకు మూడు బుడ్ల మందు, ముప్పరక ఇంజక్షన్లు చెప్పి, హాస్పిటలుచుట్టూ రోగిని ముప్పై ప్రదక్షిణాలు చేయించుకునే వైద్యులంతా—

అయినా వాళ్ళనని ఏంలాభం చెప్పండి. ఆధునికవిజ్ఞాన ప్రభావం మానవ మనస్థైర్యాన్ని సడలింపజేస్తూవుంది. కొంచం బుగ్గమీద మొటిమ నాల్గురోజులు మానకపోతే కాన్సరేమోనని, ఇంతమాత్రం. గొంతు నొప్పిగా ఉంటే డిఫ్తీరియాయని, కాస్త కడుపునొప్పి అయితే అప్పెండిసైటీస్ అని, రెండుమార్లు పొడిదగ్గయితే క్షయకాకూడదా అని, అన్నిటికన్నా ముఖ్యమైనది, కొంచం గుండె టపటప మంటే ఏక్షణం ఆగిపోతుందో అనే కలవరంతో అసలు మనిషి కూనీ అయిపోతున్నాడు. రోగవిషయకమైన, అనావశ్యకమైన ప్రచారములవల్ల, వైద్యవిషయక ప్రదర్శనాలు చూచుటవల్ల అబ్బిన తెలిసీ తెలియని సగం విజ్ఞానంయొక్క ఫలితమే ఈ క్షణక్షణ భయం, పిరికితనమూను. కేవలం, జలుబును జలుబేనని స్పష్టంగా చెప్పి, ఏమందూ అక్కరలేదని ఏ వెఱ్ఱి డాక్టరైనా చెప్తే, వాడు ఉత్తచవట అని తేల్చిపారేస్తారు ప్రస్తుత నాగరీకులు. అందువల్ల, రోగులను తృప్తిపరచడానికైనా, కంటిజబ్బుకు అరికాలులో ఒకప్పుడు గుచ్చుకున్న చిన్న ముల్లు కారణమైయుండాలని, అపాదమస్తకమూ అన్ని పరిశోధనలూ చేయించి, చివరకు అంగిట్లో టాన్సిల్సు ఆపరేషను చేయించాలని సలహాయిచ్చి అంతరూ కనిపెట్టలేని జబ్బేమైనా అయితే ఏ ఎలర్జీయనో దానికి పేరుపెట్టి, గాలి పీల్చకూడదనో, భోజనము చేయకూడదనో సలహాయిస్తే దక్క పెద్ద డాక్టరుగా పేరుపొందే అవకాశాలు చాలా తక్కువగా ఉన్నాయి- డాక్టర్లయొక్క సమర్థతను గాని, వారి విశ్వాసపాత్రతనుగాని నేను ఆక్షేపించడంలేదు సుమండి- మానవ మనస్తత్వ రీతులుమాత్రమే చెప్తున్నా. ఈ జాడ్యాల మనస్తత్వం నాగరీక ప్రజలకే కాకుండా వారనంటిపెట్టుకొని ఉన్న పాటకపువర్ణాలకూ, యింకా కుగ్రామాలలో నివసించే అమాయిక పల్లెప్రజలకూ సోకడంవల్ల, పాచి పనిమనిషదగ్గరనుంచి అరదినం పనికి నాగావేసి అరమైలు దూరం అసుపత్రికి నడిచిపోయి, ఆరు గంటలసేపు నెత్తిన గుడ్డవేసుకొని చేతిలో సీసాతో కని పెట్టుకొనివుండి, 'డాకుదొర ఇచ్చిన ఆస్పత్రి అరుకు' గుటకవేస్తే తప్ప ముక్కు పడిశముకూడా పోని ముష్కు దినాలు యివి మరి. అటువంటి డాక్టర్లను ఎలా దూరంగా ఉంచాలో అర్థం కావడంలా.

♦ ♦ ♦

మాటవచ్చిందిగనుకచెప్తున్నా: ఇటీవల భారత ఆరోగ్య మంత్రి శ్రీమతి రాజకుమారిఅమృతకౌర్‌గారు కోయంబత్తూరులో ఉపన్యసిస్తూ, డాక్టర్లకొక హితవు చెప్పారు. రాజకీయ పక్షాలకుగాని, కులమతతత్వాలకుగాని లోనుకాకుండా, వారివృత్తిని సాధించమనిచెప్పారు. ఈ సలహాకు అంతగా అవశ్యకత ఎందుకు వచ్చిందని? కులాలూ, మతాలూ, రాజకీయపక్షాలూ లేకుండా సాగించబడేవృత్తి ఏదైనావుంటే అది వైద్యవృత్తియేనని చెప్పాలి. మరేం భయంలేదు- డబ్బుకు రాజకీయాలు, కులపక్షాలూ అంటనంతవరకు, ఏడాక్టరుకూ యివి అంటవని దృఢంగా, వారి బదులు నేను బల్లగుద్ది చెప్పగలను- కాంగ్రెసు వారి డబ్బుకు ఒక చెలామణీ, ఇతరపార్టీలవారి డబ్బుకు మరొక చెలామణీ ఏర్పడ్డనాడుగాని, ఆరోగ్యమంత్రిగారిక్కి డాక్టర్లను గూర్చిన యీ సందేహము కలుగనక్కరలేదు- కాంగ్రెసు రోగి నాడి ఒక చేతితో, కమ్యూనిస్టు రోగి నాడిని మరొక

చేతికో పట్టిచూస్తూ, హరిజనుని నోటనున్న థర్మామీటరు అమాంతంగా, ఆచ్ఛ బ్రాహ్మణవృద్ధుని నోట అట్టే పెడు తూ, తమ వైద్య సలహాలను అందరికీ సమాన దృష్టితోనే సమకూరుస్తూ ఉంటారు — తను పేర్కొన్న దక్షిణ రోగి చెల్లించినంతకాలం ఏయితర కులంతోనూ లోను కాకుండా.

♦ ♦ ♦

అమృత కౌరుగారు మరొక అమృత సన్నిభమైన సలహానుకూడా డాక్టర్ల కందించారు. ఈ సలహాలను వారెట్లా స్వీకరించి, అమలు జరుపుతారో అన్న సందేహం. ప్రస్తుత పరిస్థితుల పరిశీలనవల్ల కలుగుతుంది. 'ధనమూల మిదమ్ జగత్' అన్నారు పెద్దలు. అన్నిటికీ మూలాధారమై, అపరనారాయణుడుగా ఆరాధించబడే యీ ఐశ్వర్యాన్ని, కుప్పలు కుప్పలుగా ప్రజలనుండి నూర్చుకోవ దానికి, యీ వైద్యవృత్తి ఒక అమూల్య సాధనమని తెలివైన వైద్యుడెవ్వడూ గ్రహించకపోడు. అందులోనూ వ్యాధి నివారణ అనేటటువంటి మానవాభ్యుదయానికి అత్యంతావశ్యకమైన వృత్తిగా పరిగణింపబడే యీ వృత్తికి గాని, యీ వృత్తి ననుసరించే వైద్యుల సలహా సహాయాలకుగాని, విలువ కట్టకలిగిన దెవ్వరు? రు. 500 లు ఆనరేరియమ్ తీసుకున్నా స్వచ్ఛంద సేవా భావించబడుచుండే యీ రోజుల్లో, ప్రముఖ డాక్టర్లు సలహా నిమిత్తం రూ 25 తీసుకున్నంత మాత్రాన వారు చేసేది సేవకాదని ఏ రోగి సాహసించి నోరు తెరచి చెప్పగలడు? ఇది కూడా మానవసేవే అయినప్పటికీ- పెద్ద డాక్టర్లందరూ పట్టణాలలో వాసస్థల మేర్పరచుకొని, స్వంత నర్సింగ్ హోమ్‌లు నిర్మించుకుని, కోట్లు సంపాదించుకోవడం మీదే దృష్టిని కేంద్రీకరించకుండా, గ్రామవాసులగు కోటానుకోట్ల ప్రజలకు ధనాపేక్షలేని వైద్యసహాయం చేయవలసిం దని శ్రీమతి అమృత కౌరుగారి సలహాగానోపు. ఈ సలహా డాక్టర్లేకాదు, మరెవరైనా పురస్కరించుకుని అమలు జరపాలంటే. నాయకులన్నవారు మార్గగాములు కావాలి. వారి దృష్టిలో కేవలం విత్తానికి విలువలేదని ఋజువు చేయాలి. మంత్రివర్గాలనుండి, పై ఆఫీసర్లనుండి కనీస వేతనాలు పుచ్చుకుని, మానవునికి కావలసిన కనీసపు పరిమాణాలలో జీవితాన్ని గడిపి, మార్గదర్శకులైననాడు గాని, వారి సలహాలను గురించి ప్రజలు పాటించలేరు. ఏరోప్లేనులూ, ఎయిర్ కండిషన్ రూములూ, అయిదంతస్థుల భవనాలూ, ఎలక్ట్రిక్ ఫానులూ, ట్రంకు టెలిఫోనులూ, మానవునికి నిత్యజీవితావసరములుగా, మానవ నాగరికతకు ప్రమాణాలుగా, నాయకులన్నవారికి సర్వదా ఉపాసన వస్తువులైనప్పుడు, పల్లెటూరి పర్ణకుటీరం, ఎడ్లబండి వాహనం, ఇతరుల నెట్లాకర్షించగలవు?

♦ ♦ ♦

## భారత్ సేవక్ సమాజ్

అక్టోబరు 10 వతేదీన, ప్రధాని నెహ్రూ, ఆంధ్ర, మైసూరు, కూర్గు, తమిళనాడు, భారత సేవక్ సమాజ్ కార్య కలాపాలకు లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవము జరిపించారు. వివిధప్రాంతాల నిర్వాహకులు, సమావేశానికి హాజరయినారు. ప్రారంభోపన్యాసములో, నెహ్రూగారు ఈ సమాజము యొక్క ఆశయాలను, లక్ష్యశుద్ధిని వివరించారు.

ఎండలో, వానలో, పొలంగట్లలో, పల్లెసీమల్లో, జరుగవలసిన సేవాకార్యక్రమం యీసమాజము యొక్క పరమలక్ష్యము, స్వచ్ఛందమైనకృషివల్ల, స్వయంసమృద్ధి, ఆదాయ అభివృద్ధి, కలిగేటట్టు, బీడుపొలాలు మాగాణిభూములుగా, కుగ్రామాలు చిన్న అపూర్వనీయగ్రామాలుగామారి ఆహారం, ఆరోగ్యం, విద్యమున్నగు వానిని భారతీయులందరుకూ అందుబాటులోనికి తెచ్చుటయే యీసమాజము యొక్క పరమావధియని చెప్పారు. రాచభవనాల్లో, విద్యుత్ కాంతులలో, ఎలెక్ట్రిక్ పంకాల క్రింద, మైక్రోఫోనులలో మాట్లాడ వలసిన కార్యక్రమం యీ సమాజ దృక్పథంలో ఏమూలా లేదని కూడా చెప్పారు.

ఇంక, కేంద్ర కార్య నిర్వాహక వర్గం గాని, ప్రదేశ నిర్వాహక వర్గాలుగాని, వారి కేంద్రాల నుండి సాధించగలిగే వ్యవహారము గాని, నిర్వాహక వర్గములో ఉండుట వల్ల వారు అంటించుకో గల గొప్పదనము గాని, ఈ సమాజ ఆదర్శాలదృష్ట్యా శూన్యమేననీ, వివిధ ప్రాంతాలలో దీని శాఖోప శాఖలు నిర్మాణం చేసి, అక్కడ పరిస్థితుల కనుగుణ్యంగా, అవసరమైన అభ్యుదయ కార్య కలాపము జరిగించ వలసిన సూచనల నిచ్చేటంతవరకే ఈ కేంద్రవర్గాల బాధ్యత, అధికారంకూడా నని స్పష్టంగా వివరించారు. పైకి రాజకీయాల కతీతమైన సమాజమని చెప్పుతున్నా, యీ సమాజం ద్వారా, తమ రాజకీయ లాభాలను వెతుక్కుంటూ, వచ్చే ఎలక్షన్ల నాటికి

(53వ పేజీ చూడండి)



# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

సెప్టంబర్ మొదలుకుని అక్టోబర్ మూడో వారం వరకూ ప్రపంచ రాజకీయ రంగంలో జరిగిన సంఘటనలు పాలిత రాజ్యాల్లో ప్రబలుతున్న స్వాతంత్ర్య కాంక్షనూ, దానిని ఏ విధమయినా అణచివేసి తమ దోపిడి విధానాన్ని శాశ్వతంగా సాగించు కోవాలని సామ్రాజ్య దేశాలు చేసే ప్రయత్నాలనూ ఈ దుష్ప్రయత్నాలలో సామ్రాజ దేశాలు ఒకదాని కొకటి ఇచ్చే మద్దతునూ నిరూపిస్తున్నవి. వీటన్నిటితో పాటుగా సామ్రాజ్య దేశాలు తమ ఆర్థిక వ్యవస్థల్లో ఇమిడి ఉన్న వర్గ వైరుధ్యంవల్ల పడే చిక్కులూ. వ్యాపార పోటీల మూలంగా వాటికి ఏర్పడే సంఘర్షణలూ కూడా, ఈ సంఘటనలవల్ల విశద మవు తున్నవి.

• • •

అయిదు సం॥ ల కిందటి వరకూ దాదాపుగా యావత్తు ప్రపంచమూ యూరపు దేశాల సామ్రాజ్యంగా ఉండేది. సోవియట్ యూనియన్ తప్పితే, మిగిలిన ప్రపంచ మంతటిలోనూ తెల్లజాతుల పెత్తనం సాగుతూ ఉండేది, ఆసియా. ఆఫ్రికాలలో పశ్చిమ యూరపు దేశాలన్నీ, అమెరికా ఖండాలలో అమెరికా యునైటెడ్ స్టేట్సు బ్రిటన్‌లూ రాజకీయాధికారాన్నో, లేక ఆర్థికాధికారాన్నో కలిగి ఉండేవి. నామ మాత్రంగా స్వతంత్ర దేశమయిన చైనాలో ప్రత్యేక రాజకీయ హక్కులు, వ్యాపార సౌకర్యాల పేరుతో సామ్రాజ్య దేశాలన్నీ విచ్చలవిడిగా పెత్తనం చేస్తూ ఉండేవి.

జాగీర్దారీ పద్ధతులనూ, పాదుషాల కాలపు ఆచారాలనూ విడవకుండా ఉన్న మధ్య ప్రాచ్య దేశాల్లో ప్రభువులను కీలుబొమ్మలుగా చేసుకుని ఆ దేశాల సంపదలను తెల్ల జాతులు దోచుకుంటూ ఉండేవి. విషయలోలు రయిన నిరంకుశ ప్రభువులకు వాళ్ళ అవసరాలకు సరిపడే డబ్బును తెల్ల దేశాలు ఇచ్చి ఎంతో విలువగల ఖనిజాలనూ, ఇతర సంపదలనూ దోచుకునేవి. తిండికిలేని ప్రజలవల్ల ప్రభువు లకు ప్రమాదం రాకుండా తెల్లజాతి దోపిడికి స్థానిక ప్రజలు అడ్డు తగలకుండా, వాళ్ల జాతీయ వాంఛలు తీవ్ర రూపం తాల్చకుండా ప్రభువులు చూసేవాళ్లు. ఈ పద్ధతినే మన దేశంలో ఈస్టిండియా కంపెనీ సైన్య సహకార మైత్రి అనే పేరుతో ప్రవేశపెట్టి, 400 మంది సంస్థానాధీశ్వరులను సృష్టించింది. ప్రస్తుత రాజప్రముఖులంతా వాళ్ల వారసులే.

ప్రజలు మరీ అనాగరికులుగా ఉండి, దేశ వైశాల్యం విపరీతంగా ఉండి, స్థానిక ప్రజలు తగినంత మంది లేని ఆఫ్రికన్ దేశాల్లోనూ, మలయా మొదలైన ఇతర ప్రాంతాల్లోనూ సామ్రాజ్య దేశాలు కొరడానూ, తుపాకీనీ ఉపయోగిస్తున్నవి. స్థానిక ప్రజలను కేవలం తమకు పని పాటలు చేసే జంతువులుగా చూస్తున్నవి.

• • •

అయితే శాస్త్ర విజ్ఞానం వ్యాపించటంవల్లనూ, ప్రజా స్వామిక భావం కేవలం స్థితిమంతులయిన మధ్యతరగతుల దగ్గర నిలిచి పోకుండా యావత్తు జనానికి పాకిపోవటం వల్లనూ 'జనత' అన్నది మహాశక్తిగా తయారయింది. అంగబలం అనేది ఆటంబాంబును మించి పోయింది. మధ్య తరగతి ప్రజల అంగ బలంతో నిరంకుశ ప్రభువు లను యూరపియన్ ప్రజా స్వామ్యం (డెమాక్రసీ) మించి పోయినట్లే, కింది తరగతి ప్రజలను కూడగట్టి గలుగు తున్న సోషలిస్టు. కమ్యూనిస్టు ప్రజా స్వామ్యాల జనశక్తి, యూరపియన్ ప్రజా స్వామ్యాల (సామ్రాజ్య వాదుల) బలాన్ని మించి పోతున్నది. అందువల్లనే చైనా అంటే నల్లేరుమీద బండిలాగా వెళ్లటమని భావించిన సామ్రాజ్య

దేశాలకు నవచైనా అనేది సింహ స్వప్న మయింది,

ఆసియా, మధ్య ప్రాచ్యాలలోని జాతీయ వాదం జయ ప్రదంగా సాగి పోతున్న దంటే, అది కింద తరగతుల జనతా శక్తిని మేల్కొలిపి నందు వల్లనే, అయితే తమ బలానికి అసలు కారణ మిదేనని కొందరు జాతీయ నాయకులు గ్రహించలేక పోవటంవల్లనూ, ఏరుదాటి తెప్ప తగల వేసిన పద్ధతిలో కొందరు దానిని నిర్లక్ష్యం చేయటం వల్లనూ, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన బర్మా ఇండోనీషియా మొదలైన దేశాలు నిలకడగా ఉండలేక పోవటం, మధ్య ప్రాచ్య దేశాల్లో క్షణ క్షణం రాజకీయ సైనిక విప్లవాలు రావటం జరుగు తున్నది.

* * *

ఆసియా దేశాల జనతా శక్తికి వెనక్కి తగ్గిన యూరప్ దేశాలు ఆఫ్రికాలోనూ, మలయా, ఇండో చైనాలలోనూ నిలబడ్డవి. తమ పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలను సప్లయి చేసే ఈ ప్రాంతాలను ఏవిధంగా నయినా నరే చేతిలో నిలుపు కోవాలనిప్రయత్నిస్తున్నవి. ఈ ప్రయత్నాల ఫలితాలే మలయాలో గ్రామదహనాలూ, కెన్యాకు బ్రిటిష్ సేనల ఉరికింపూ, మధ్య ఆఫ్రికా ఫెడరేషన్ స్థాపనకు బ్రిటన్ ఆరాటమూ, ట్యునీషియా మొరాకోలలో అశాంతీ, ఈజిప్టు, పర్షియాలతో బ్రిటన్ తగాదాలూ.

* * *

కెన్యా, యూగాండా, టాంగన్యీకాలు తూర్పు ఆఫ్రికాలో బ్రిటిష్ వలసలు. అక్కడ బహు కొద్దిమంది తెల్లవాళ్ళు జేరి ఆఫ్రికన్లకు తిన తిండికూడా లేకుండా చేస్తున్నారు. 60 లక్షల ఎకరాల సుక్షేత్రమయిన భూమి ఉండగా ఆఫ్రికన్లు అందులో అడుగు పెట్టరాదని శాసించారు. ఆఫ్రికన్ నాయకుడు కోయినాంగేని అరెస్టు చేసి రహస్య నిర్బంధంలో ఉంచారు. . ప్రజల అసంతృప్తి—ఇండియాలో బెంగాల్ విప్లవకారుల పద్ధతిలో....దౌర్జన్య వాదానికి దిగింది. తక్షణమే బ్రిటిష్ సేనలు ఉరికించ బడ్డవి. అక్టోబర్ 20 న ప్రమాద పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించ బడ్డవి. తూర్పు ఆఫ్రికాలో 4½ కోట్ల పౌన్లతో పెట్రోలు పరిశుద్ధి కేంద్రాన్ని బిటన్ ఏర్పాటు చేయబోతున్నదన్న వార్తను గమనిస్తే, ఆ ప్రాంతాన్ని బ్రిటన్ వదలి పెట్టేది కల్ల అని తెలుస్తుంది.

ఆఫ్రికా వలసకూ, సుదానుకూ సింహద్వార మయిన సూయజ్ కాలువను కూడా బ్రిటన్ వదులుకోలేదు. అందువల్ల ఈజిప్టులో సేనలను నిలిపి కూర్చున్నది. పర్షియా నూనె గనులను కూడా వదల దలచుకోలేదు కాని, సరిహద్దుల్లో రష్యా ఉన్నందువల్ల సాహసించి ఏమీ చేయలేక పోయింది. అయితే పర్షియా నూనె ఎగుమతులను అడ్డగించటం, బాకీలను చెల్లించక పోవటం మొదలైన మార్గాలలో ఒత్తిడి పెడుతున్నది. చివరకు పర్షియా ప్రధాని మొసాదిక్ ప్రాణం విసిగి, అక్టోబర్ 16 న బ్రిటన్‌లో రాజకీయ సంబంధాలు తెంచి వేసుకుంటున్నట్లు ప్రకటించారు.

జనతాశక్తి తనకు అంతగా ఉన్నదనీ, ఆజనానికి తాను మేలు చేయవలసి ఉన్నదనీ ఈజిప్టు మాజీ ప్రధాని, వఫద్ నాయకుడూ అయిన నహాస్‌పాషా మరచి పోయి నాడు. ప్రజలకు అవసరమయిన ఒక్క సంస్కరణ కూడా చేయకుండా వీటి నినాదాలతో, ఆవేశాలతో సంతృప్తి పరచాలని చూశాడు. ప్రజల సానుభూతిని పోగొట్టుకున్నాడు. తన అశక్తతను గుర్తించటంవల్లనే పార్టీ నాయకత్వం విషయంలో ఈజిప్టు విప్లవ నాయకుడు నజీబ్‌కి దాసోహం అన్నాడు.

* * *

ఆసియా, అరబ్ రాజ్యాలు ఐక్య రాజ్య సమితిలో మొరాకో, ట్యునీషియా, దక్షిణాఫ్రికా జాతివివక్షత విధానాలను చర్చించాలని ప్రతిపాదించినవి. పశ్చిమ రాజ్యాలు ప్రతిఘటించినప్పటికీ వాటిని చర్చించటానికే సమితి సర్వ సభ్యసభ నిషేధించింది, మొరాకో, ట్యునీషియా సమస్యలను చర్చిస్తే, తాను చర్చలను బహిష్కరిస్తానని ఫ్రాన్సు స్పష్టపరచింది. సమితి జోక్యాన్ని ఫ్రాన్స్ సహించదని ప్రధాని పినే స్పష్టం చేశాడు. సమితి లాంచనప్రాయంగా చర్చ జరుపు తుందేమోకాని, దానివల్ల పీసమంత ప్రయోజన మయినా ఉంటుందని తోచదు. దక్షిణాఫ్రికా భారతీయ సమస్య, కాశ్మీర్ సమస్యలలో చేస్తున్నట్లుగా కాలయాపన ఎత్తులను వేయవచ్చు.

* * * *

సమితికి ఫిర్యాదు జరిగి 5 సం॥లవుతున్నా కాశ్మీర్ సమస్యమీద, నాలుగో మధ్యవర్తి గ్రాహం తన నాలుగో

నివేదికను సమర్పించాడు. అయితే ఇండియా మెడలు వంచటానికి చేసిన ప్రయత్నాలన్నీ దెబ్బతిన్నందువల్ల, అసలు విషయాన్ని సమితికి నివేదించాడు. కాశ్మీర్ భవిష్యత్తుమీద జనవాక్యం నిర్ధారణ చేసేసందర్భంలో యుద్ధ విరమణహద్దుకు రెండు వైపులా ఎంతెంత బలం ఉండాలి అన్నదే ఒప్పందం కుదరని సమస్య అని అతడు తేల్చివేశాడు. పాకిస్థాన్‌తో సమాన ఫాయాకు ఇండియా అంగీకరించదనికూడా చెప్పివేశాడు. అయితే సమితి ధోరణి చూస్తే, మరొక విడత సంప్రదింపుల నాటకాన్ని జరపమని గ్రాహంకు చెప్పేటట్లు ఉన్నది.

కాశ్మీర్ వ్యవహారంలో ఇప్పుడు గమనించతగ్గ విషయం ప్రజాపరిషత్ పార్టీ వైఖరి. మహారాజు పాలనలో ఆ నిరంకుశత్వాన్ని ప్రతిఘటించని ఈ పక్షం ఇండియాలోని మితవాదుల సహాయంతో అబ్దుల్లా ప్రభుత్వంమీద ప్రతికూల ప్రచారం చేస్తున్నది. రక్షణ,విదేశాంగ విధానం, రహదారి సౌకర్యాలను మాత్రమే ఢిల్లీ ప్రభుత్వానికి కాశ్మీర్ ప్రభుత్వం అప్పగించగా, ఢిల్లీ కూడా దానికి అంగీకరించి, ఆ ప్రత్యేక హోదాను అంగీకరిస్తూ, ఒక ఒప్పందం చేసుకుని ఉన్నది. కాని ఈ ఒప్పందం అమలునే ప్రజాపరిషత్ ప్రతిఘటిస్తుందని ఆ పార్టీ నాయకుడు ప్రేమనాథ్ దోగ్రా అక్టోబర్ 20 న స్పష్టం చేశాడు. జమ్ము, లదఖ్‌లను కాశ్మీర్‌నుంచి విడదీయాలని ప్రచారం చేస్తున్నాడు.

* * *

కొరియా వ్యవహారం ఏమీ మారలేదు. అయితే అమెరికా అధ్యక్షపదవికి పోటీచేస్తున్న రిపబ్లిక్ పార్టీ అభ్యర్థి ఐసన్‌హోవర్, అతడి అనుచరులు కొరియానుంచి అమెరికన్ సేనలను ఉపసంహరించాలని చెపుతున్నారు. అయితే ఇతడి గెలుపుకి అవకాశం లేనట్లు కనిపిస్తున్నది. ఎన్నిక నవంబరు 2 న అయిన తరవాత రష్యా ఓలియా పరిష్కార పథకం ఒకదాన్ని సమితికి సూచిస్తుందని తెలుస్తున్నది.

* * *

ప్రధాన సమస్యలమీదనే అమెరికన్ రాజకీయ పక్షాలు వివాదపడుతున్నట్లుగా కమ్యూనిస్టు దేశాలతో వ్యాపారం, వలసదేశాల సమస్య మొదలైన అంశాలమీద అమెరికాకూ, యూరప్ రాజ్యాలకూ వివాదాలు వస్తున్నవి. కమ్యూనిస్టు దేశాలతో వ్యాపారం లేకపోతే మూడవలసివున్న బ్రిటన్, వ్యాపారం మానుకునే అమెరికాతో ఘర్షిస్తున్నది. చైనాలో వ్యాపారాన్ని నిషేధించాలని అమెరికా అనుకునికూడ బ్రిటన్ వద్దన్నందువల్ల సంక్షేపించుకోవలసివచ్చింది. వలసల్లో ఉదారత్వం చూపితే ముడిపదార్థాలు దొరక్క తమ పరిశ్రమలు, వ్యాపారం దెబ్బతింటవని బ్రిటన్, ఫ్రాన్సుల వాదం. జాతీయ మితవాదులపట్ల ఉదారత్వం చూపకపోతే కమ్యూనిజం ముంచుకువస్తుందని అమెరికా ప్రతివాదం. ఆ మార్కెట్లను లాక్కునేందుకు అమెరికన్ వ్యాపారస్తులు వేస్తున్న ఎత్తే ఇది అని యూరపియన్ పారిశ్రామికుల భయం మరొకటి. ఈ సంఘర్షణలె బ్రిటిష్ లేబర్‌పార్టీనికూడా చీల్చివేస్తున్నవి.

ఈ సంఘర్షణలను దృష్టిలో పెట్టుకునే సోవియట్ నాయకుడు స్టాలిన్ ఈ నెలలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సమావేశ సందర్భంలో ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు, ధనికవాద దేశాలకూ, కమ్యూనిస్టు దేశాలకూ మూల సిద్ధాంతాల్లో ఎక్కువ భేదమే ఉన్నప్పటికీ, ధనికవాద దేశాల మధ్య ఉన్న వ్యాపార స్పర్ధలు పెరిగిపోయి అంతఃకలహాలకు దారి తీస్తవనీ, ధనికవాదం ఆ విధంగానే నశించి పోతుందనీ అన్నాడు,

* * * *

అమెరికా, రష్యాలతో పాటుగా బ్రిటన్ కూడా సొంతంగా ఆటంబాంబులు చేయటం నేర్చుకున్నది. మొట్టమొదటి బ్రిటిష్ ఆటంబాంబు అక్టోబర్ 3 న ఆస్ట్రేలియాలో పరీక్షించబడ్డది. శాంతికి ఇది శుభసూచన కానప్పటికీ, స్టాలిన్, చర్చిల్ లిద్దరూ—భిన్న కారణాలతోనే అయినప్పటికీ—మూడో యుద్ధం రాదని చెప్పటం ఆశ కలిగిస్తున్నది,

* * * *

భారత ప్రధాని నెహ్రూ ఈ నెలలో రాయల సీమ పర్యటన చేశారు. మద్రాసులో ఉపన్యాసాలు చేశారు. ముందు రాయల సీమకు సాయపడండి, రాష్ట్రం సంగతి ఇప్పుడు కాదని అన్నారు. రాష్ట్రం రానంతవరకూ రాయల సీమ గతి అంతే అన్నారు రాష్ట్రవాదులు. "మీలో మీరు ఒప్పందాలకు రావలసిందే. మీ తగాదాలకు

కేంద్రం మధ్యవర్తిత్వం చేయదు. అందరూ ఒప్పుకోనిదే నేను మొగల్ పాదుషావలె ఫర్మానాలు జారీ చేయలేను" అని ఆయన అన్నారు. ఈ షరతు ప్రతి పక్షానికి వీటో అధికారం ఇస్తున్నదన్నారు రాష్ట్రవాసులు. కరువు చూచివెళ్ళిన ప్రధాని కరువు ప్రాంతాలకు నిజంగా ఉపయోగపడే ప్రాజక్టులను సానుకూలపరచటానికి తోడ్పడతారో లేదో చూడవలసి వున్నది.

విదేశీ ౘవరాలు పోవలసిందే నని అన్న ప్రధాని ఆ విషయమై ఏమిచేస్తారో కూడా చూడవలసి ఉన్నది.



# ఆంధ్ర రాష్ట్రం

[6-వ పేజీ తరువాయి]

రినే, అరవజాబితాలోవేసిన జనాభాలెక్కల అరవ గుమాస్తాలు, ఇంక అంతకన్న తక్కువవారిని, ముఖ్యంగా చదువుకోని మధ్యతరగతి తెలుగువారిని బెట్టించి, ఒకరికి ఇద్దరు తమిళులుగా వేసి ఉండడంలో సందేహం కొంచం కూడా అక్కరలేదు. అధికారులనుండి ఊతం లేనప్పుడు యిట్టి అక్రమ పద్ధతులకు గుమాస్తాలు పాలుపడరేమో ననికూడా చెప్పాలి.

ఇంకొక ముఖ్యవిషయం— విశ్వనాథంగారి ప్రకటనలో చెప్పినట్లు తమిళులువేరు, తమిళం మాట్లాడేవారు వేరు. మదరాసులోని తెలుగువారుకూడా, కారణాంతరాల వల్ల తమిళప్రభుత్వంలో సరియైన అవకాశాలు లేకపోవడం వల్ల, అరవం చదవడం, వ్రాయడం నేర్చుకోవడము జరిగింది. మధ్యతరగతి బీదతరగతికి చెందినవారికి యీ చిక్కు ఎక్కువగా సంభవించింది. అందువల్ల, ఎంతో మందితెలుగువారు అరవంమాట్లాడడం, అరవగుమాస్తాలు వచ్చిప్రశ్నిస్తే అరవంలో బదులుచెప్పడం జరుగుతుంది. నీవుఅరవం మాట్లాడుతావా, తెలుగుమాట్లాడుతావా అని గట్టిగా గుడ్లురిమిప్రశ్నిస్తే, పనిపాటలవారంతా ఎందుకో తెలియక, అరవము మాట్లాడుతామని చెప్పినసందర్భాలు ఎన్నోఉంటాయి. జాపితాదారు అరవంలో వ్రాయడం వల్ల వీరుచెప్పిన దేమైనప్పటికీ, జాపితాలోకెక్కేది వేరుగా నుండడంలో ప్రస్తుత పక్ష తత్వాలనుబట్టి అసంభవంకాదు.

అందువల్ల, జరిగినదేదో జరిగినది. అయినదానిని గూర్చివగవక,ఉత్త ప్రకటనలతో సంతృప్తి జెందక, బాధ్యతవహించిన పెద్దలందరూ,ఒకసంఘంగా తయారై మదరాసు జనాభాలో, భాషాసంబంధమైన లెక్కలను, వెంటనే సిద్ధంచేయడం. చాలా ముఖ్యమైన కర్తవ్యం.

వాటాపంచిపెట్టమన్న కుమారుడెవరైనాసరే, రాజగోపాలాచారిగారన్నంత చులకనగా ఏదోఒకముక్కతీసుకుని, నెత్తిన గుడ్డవేసుకొని వెనుకకు తిరిగి చూడకుండాపోడు. తనకు రావలసిన వాటా న్యాయంగా వచ్చిందో రాలేదో అని లెక్కచూచుకుని మాత్రమే గుమ్మము కదులుతాడు. రాష్ట్రం విభజించమని ఆంధ్రులు కోరుచున్నంతమాత్రాన ఏదో ఒక చిన్నముక్క గిల్లుకొని తృప్తిపడిపోరు. న్యాయబద్ధంగా పంపకము జరిగేటట్టే సాధించగలరు.

పరిపాలనరీత్యా ఆంధ్రప్రాంతములో ప్రభుత్వమునకు వచ్చే వరుంబడికి తగినట్టుగా అక్కడ అభివృద్ధి సాగడం లేదని, రాష్ట్రంలో ఉద్యోగుల నియామకంలో జనాభాకు తగ్గట్టుగా ఆంధ్రుల కవకాశమీయబడడం లేదని, ఇంకా ఇలాంటి కారణాలవల్లగదా ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రము కావలెనని పట్టుపట్టుచున్నది. బ్రిటిష్‌వారి పరిపాలనలో భారతీయులకు కొందరికి ఉన్నతోద్యోగములు, ప్రత్యేక లాభములు సమకూర్చి, వారిని తమపక్షమునకు త్రిప్పుకుని యావద్భారతాన్ని బానిసదేశంలా పరిపాలించినరీతియే, ప్రస్తుతము మదరాసురాష్ట్ర పరిపాలన విధానములో విదితమౌతూవుంది. ఇట్టి పరిపాలననుండి స్వతంత్రముపొందుటకే ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రమును వాంఛించుచున్నారు.

ఆంధ్ర నాయకులు, అధికారస్థానాల నధిష్ఠించిన ఇతర తెనుగు పెద్దలు, తమపైనున్న గురుతర బాధ్యతను గ్రహించి వ్యవహరించడం వారి కనీస ధర్మం.



# తూర్పు దేశాలలో మహిళాభ్యున్నతి

## చైనా

* శ్రీమతి దరిశి సుభద్రమ్మ *

[వెనుకటి సంచికలో నడిచిన చరిత్రను గురించి— ఆర్థిక స్వాతంత్ర్యంలేక, విద్యా విజ్ఞానాలులేక, కేవలం అజ్ఞానాంధకారంలో దాస్యజీవనాలను గడిపిన చైనా మహిళలనుగూర్చి చదివాము— ఇప్పుడు చైనా మహిళలు వర్తమాన సాంఘిక రాచకీయ రంగాలలో ఎట్టి అభ్యున్నతిని పొందినదీ చదువుదాము. ]

అట్టి దారుణస్థితిలో నున్న మహిళలు ఈనాడు అంతటి మహోన్నతస్థితిని పొందుట అత్యంతాశ్చర్యకరమైన విషయమేను. అయితే ఇట్టి అభ్యున్నతి ఎక్కడినుండియో ఊడి వారిఒడిలో పడలేదు. ఎవరూ దానంచేయలేదు. వారు దేశంకోసం, తమకోసం చేసిన స్వయంకృషివల్లనే, దేశానికీ, తమకూ విముక్తి కలిగింది. పూర్వంనుండి మొన్నటిదాక దేశ స్వాతంత్ర్యంకోసం, వారు ప్రదర్శించిన దేశభక్తి, త్యాగములు, ధైర్య స్థైర్యములు, సాహస కృత్యములు, ఫలితంగానే దేశానికీ, సామాన్య ప్రజాకోటికీ, వారితోపాటు తమకూ, స్వాతంత్ర్య సౌభాగ్యములు లభించినవి.

కొన్ని శతాబ్దాలుగా చైనా దేశీయులు, బూజు పట్టి పోయిన పురాతన ప్రభుత్వ విధానానికీ, కొన్ని దశాబ్దాలగా విదేశీయుల సామ్రాజ్య కాంక్షకూ, దేశ విదేశీ పెట్టుబడి దార్ల కుతంత్రములకూ, చివరకు చెంగ్ కే షేక్ నిరంకుశ పరిపాలనకూ గురియై నానాబాధలు పడ్డారు. ఏ కొలది ధనికులు, ప్రభుత్వాధికారులు, ఉన్నతోద్యోగులు, వారి మహిళలు, తప్ప సామాన్య ప్రజాకోటి, వారితోపాటు మహిళలు, దారుణమైన దారిద్ర్య క్లేశములతో క్రుంగి పోయారు. అసలు పొరుగున నున్న జపాన్ దేశమే చైనామీద పెక్కు పర్యాయములు దాడి చేసినది. అట్టి సమయాల్లో, దేశభక్తులు, వీరాగ్రేసరులతోపాటు మహిళలు దేశ విముక్తికొఱకు, పలు విధాలుగా పాటుపడ్డారు. స్వాతంత్ర్య సమరాగ్నికి తమ భర్తలను, పుత్రులను, బంధువర్గమును, ఆహుతిచేశారు. భూమి, పుట్ర, యిల్లు వాకిలి గోలుపోయి, స్థాన భ్రష్టత్వం, దారిద్ర్యములతో అష్టకష్టాలు పడ్డారు. కాని ధైర్య స్థైర్యాలను వదలలే[ద?] సమస్తం త్యజించారు. యుద్ధమునకు కావలసిన ఆయు[ధ] సామగ్రి, వివిధ పరికరములు, సైనికులకు దుస్తు[ల] మొదలైనవి తయారు చేశారు. ధాన్యాదులను స్వయం పండించారు. కుటీర పరిశ్రమలను స్థాపించారు. వం[ద] కొలది మహిళా సంఘాలనుస్థాపించి, దేశ విము[క్తి] కార్యములలో పాల్గొనునట్లు ఉత్తేజ పరచారు. విజ్ఞాన[ము]నకు సౌకర్యములను కల్పించుకొన్నారు. విద్యావం[తు]లగుటకు, వీరరమణులగుటకు తగిన తర్ఫీదును పొందార[ు] ఇంతేకాదు. అనేక సందర్భాలలో రణరంగాల్లో ప్రచ్ఛ[న్న] వేషంతో స్వయంగా సమరం సల్పినారు. పలువిధముల[ై] యుద్ధకార్యములలో పాల్గొన్నారు. చివరకు వారి కృ[షి] ఫలించింది. జయభేరిని మ్రోగించారు. తత్ఫలితం 1949 అక్టోబరు మాసంలో నిజ ప్రజా పరిపాలనతోకూ[డి] నవచైనా అవతరించింది. ప్రజాకోటితోపాటు మహి[ళా] లోకానికి సమస్త స్వాతంత్ర్య సౌభాగ్యములు లభించిన[వి.]

నవ్య ప్రజాప్రభుత్వస్థాపన సమయంలో అధ్యక్ష[ులు] మోజీటుంగ్ ఈవిధంగా ప్రకటించారు:—

"ప్రజాకోటికి చెందిన సమస్త పురుషులతోపా[టు] మహిళామణులు కూడ సర్వవిధాల పాటుపడినందు[న] ఇట్టి నవచైనా అవతరించినది.

"మొన్నటివరకూ, చైనా మహిళ మత సంఘ బంధ కార్యకలాపాల్లో పాల్గొనుటకు అర్హురాలు కా[దు] ఆర్థికంగా పరాధీనురాలు. తండ్రికి, భర్తకు, చివ[రకు] భూస్వామికి బానిసరాలు. ఒక్కమాటలో చెప్పాలం[టే]

నాలుగు విధాలుగా ఆజన్మ దాసిగా వుండినదన్నమాట. అట్టి మహిళ ఈనాడు సర్వస్వతంత్రురాలు, సర్వత్రా పూజితురాలు."

నవ్యరాజ్యాంగ నిర్మాణ ప్రకారం మహిళాభ్యున్నతికి ఈ విధంగా శాసనములు చేయబడినవి:—

ప్రభుత్వ శాఖలలో, విద్యాసంస్థలలో, ఫ్యాక్టరీ మిల్లులలో, వివిధవృత్తి సంస్థలలో అత్యున్నతోద్యోగముల నుండి గుమాస్తాగిరివాక మహిళకు పురుషునితో సమానంగా జీతబత్తెములు ఇవ్వబడుతున్నాయి.

అందరికీ 8 గంటలే. కొన్ని వర్తక సంస్థలలో కొన్ని సందర్భాలలో 10 గంటలు, కాని మహిళలకు మాత్రం 8 గంటలకాలమే.

గర్భిణీస్త్రీకి కాన్పుకుముందు, తరువాత చేర్చి 45 దినములు జీతంతో సెలవు.

మహిళలు విద్యావంతులగుటకు, సంస్థలు, సౌకర్యములు, వారి బిడ్డలకు శిశు సంరక్షణ, శిశు శిక్షణశాలలు ఏర్పరచబడినవి.

వైవాహిక శాసనం ప్రకారం:— (1) బాల్య, నిర్బంధ వివాహాలు, నిర్బంధ వైధవ్యం, బహుభార్యత్వం, పురుష పక్షపాతంగానున్న విడాకులచట్టం, కట్నంకానుకలు పుచ్చుకొను ఆచారం నిషేధింపబడినది.

వివాహవయస్సు యువతికి 18 ఏళ్ళు. యువకునికి 20 ఏళ్లు నిండియుండాలి.

వారి వారి మతాచారం ప్రకారం వివాహము జరిగినప్పటికీ, వధూవరు లిరువురూ స్వయంగావెళ్ళి స్థానిక రిజిస్టర్ ఆఫీసులో తమ వివాహాన్ని రిజిస్టర్ చేయించాలి. లేనిచో అది చట్టసమ్మతమైన వివాహంకాదు.

ఆస్తివిషయంలో : భార్యాభర్త లిరువురికీ సమాన హక్కు బాధ్యతలు, భర్త ఆస్తికి భార్యకు వారసత్వం, భార్య ఆస్థికి భర్తకు వారసత్వమున్నది.

వివాహ విచ్ఛేదవిషయంలో- భార్యాభర్త లిరువురూ అంగీకరిస్తేనే విడాకులకు వీలుండును. వారిలో ఒకరు మాత్రమే కోరినచో, స్థానిక రిజిష్టర్ ఆఫీసర్లు, వూరి పెద్దలు దంపతులమధ్య బయలుదేరిన వివాదాన్ని పరిష్కరించి సఖ్యత చేకూర్చుటకు శతవిధాల ప్రయాసపడుతారు. వీరందరి ప్రయత్నం విఫలమైనప్పుడే స్త్రీకి ఏవిధంగా కాని హాని కలుగకుండ అతి జాగ్రత్తవహించి స్థానికశాఖ విడాకులకు అనుమతి ఇస్తుంది.

భార్యకు పుట్టినింటివారిచ్చిన ఆస్తికీ, స్వయంగా ఆర్జించిన ఆస్తికీ ఆవిడకే స్వరాధికారం. ఇంక కుటుంబ ఆస్తిపాస్తుల విషయంలో భార్యాభర్త లిరువురూ సమానంగా పంచుకోవాలి.

ముఖ్యంగా ఈ వైవాహిక శాసనం బిల్లురూపంలో నున్నప్పుడు మహిళా సంస్థలు, అందులోని ఒక్కొక్క నిబంధనను గురించి తర్జన భర్జనలు జరిపి సవరించినవి. దిన, వార, పత్రికల మూలకంగా, సభలద్వారా సమ్మతించునట్లు ప్రచారం సల్పినవి. తరువాతనే ఇది చట్టరూపం దాల్చినది.

చైనా మహిళలు, ఈవిధంగా సమస్త హక్కుల బాధ్యతలు పొందినారు. పరిపాలనా కార్యకలాపాల్లో, ప్రభుత్వ వివిధ శాఖలలో, పరిశ్రమలలో, విద్యాసంస్థలలో దేశసౌభాగ్యమును పెంపొందు వివిధ కార్యములలో పాల్గొంటూ అతి నైపుణ్యంగా తమకార్యములను నెరవేర్చుతున్నారు.

చైనాదేశానికే జనకుడు, రాజనీతి కోవిదుడు, మహాప్రతిభాశాలియని నుతికెక్కిన సన్‌యట్‌సేను మహాపురుడు, ప్రజారాజ్య స్థాపనకోసం కృషిచేస్తూ 1925 సం॥లో చనిపోయాడు. అతని సహచారిణి మ్యాదరల్ సన్‌యట్‌సేన్ తన భర్తకు సర్వవిధాల తోడ్పడటమేగాక తదనంతరం మీద తన భర్త తలపెట్టిన కృషి ఫలించు వరకు పెక్కువిధాల పాటుపడింది. పాతికేళ్ళగా దేశభక్తులతోపాటు పలువిధములైన బాధలకు గురియైననూ, తుదకు కృతకృత్యురాలయింది. ఈనాడు సన్‌యట్‌సెన్ సతీమణియైన ఈ వీరనారీమణి ఉపాధ్యక్షురాలు.

ఆనాడు సామాన్య రైతుకుటుంబాలనుండీ, కూలినాలి చేసికొని జీవించుచున్న కడుపేదకుటుంబాలనుండీ బయల్దేరి స్వాతంత్ర్య స్థాపనకు కృషిచేసిన మహిళామణులు ఎందరో ఈనాడు అత్యున్నతపదవుల నలంకరించి పరిపాలనా కార్యములను చక్కగా నెరవేర్చుతున్నారు.

అధ్యక్షుడు మోజీటంగ్ నుడివినట్టుగ, ఆనాడు ఆజన్మ దాసిగానున్న మహిళ ఈనాడు సర్వస్వతంత్రురాలు, సర్వత్రా పూజ్యురాలు అయింది.

[ఆలిండియా రేడియో వారి సౌజన్యముతో]





# గే య నా టి క

కథామూలం : మాఘునిగాథ.

శ్రీ సూరంపూడి భాస్కరరావు

## వెనుకటి సంచికలో

కవీ, భార్యా, ఒక బ్రాహ్మణుని ఇంట్లో ఉంటూ ఉంటారు. పాటలలో తన్మయుడై కాలం గడుపుతూన్న కవిని కడుపునింపుకొనే ఉపాయం వెతుక్కోవలసినదిగా ఉద్బోధిస్తాడు బ్రాహ్మణుడు. కవిమాత్రం చిదానందాన్ని కోరుతాడు గాని ఆకలిని ఒప్పుకోడు. కవి మహనీయుడని యెరిగికూడా, అతడికి ఆకలిబాధను తెలియజెప్పే ఉద్దేశ్యంతో, తన యిల్లు విడిచి పొమ్మంటాడు బ్రాహ్మణుడు.

కవి బహిరుద్యానవనంలో ఫలమూలాలుతిని, ఆకలిని దాటి, ఆనందం నిలుపుకుందామని నిశ్చయించుకుంటాడు. భీరురాలైన భార్య ఆ వనవాసపు సౌఖ్యాన్ని శంకిస్తుంది. ఇంతలో ఆ ఫలమూలాలైనా ముట్టరాదని రాజభటు డడ్డుకుంటాడు. కవియొక్క కృతులని మహారాజుకి చూపి ఉదరపోషణకి మార్గం వెతుకుదామని వెడుతుంది కవి పత్ని.

## ఈ సంచికలో

కవి పత్ని తెచ్చిన కావ్యఖండాలని రుచిచూచిన రాజు, పదిబండ్ల ధాన్యాన్నిచ్చి కవిని ఆస్థానానికి తీసుకరమ్మని కోరుతాడు.

పదిబండ్ల ధాన్యంతో భర్తని సంతోషబరచబోతూన్న కవిపత్నిని కోటిమంది క్షుధార్తులు చుట్టుకుంటారు. లోకపుటాకలి పదిబండ్ల ధాన్యంతోనే తీరగలదనుకొని దానాలు చేయడం మొదలు పెడుతుంది. ధాన్యం మాయమైపోయినా ఆకలిమాత్రం మిగిలిపోయే ఉంటుంది. భార్య రిక్త హస్తాలవెనుక భిక్షుకుల ఆకలి ప్రతిధ్వనిస్తుంది. ఆకలికీ, ఆనందానికీ, జీవితానికీ కూడా కవి భరతవాక్యం పలుకుతాడు.

# పరివర్తన

* శ్రీ కందుకూరి లింగరాజు *

డాక్టరు వచ్చి వెళ్లేడు. చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పేడు. నన్ను ఏమీ చెయ్యలేని స్తబ్దత నిశ్శబ్దంగా నిరీక్షించుకుంటోంది. దీపం సన్నదిగాచేసి, వెలుతురు ఉయ్యాల్లో ఉన్న బాబుమీద పడకుండా కాగితం అడ్డు పెట్టా. ఉంగరాల జుట్టు నీడల్లో నాలికల్లా వుంది.

రాజా డాక్టరును పంపి నాదగ్గరకు వచ్చాడు. 'ఎంత బాధ పడుతున్నాడో' రుద్ధ కంఠంతో రాజా అన్నాడు. ఉయ్యాల్లో బాధతో, ఒళ్ళు తెలియని జ్వరంతో ముక్కుతున్న బాబు శబ్దం గుండెల్ని పీక్కుతింటూంది. బాధ! ఆవేదన!! అంతవరకు ఆపుకున్న కన్నీళ్ళు కట్టవులు తెగేయి. పైకి శబ్దం చేస్తే బాబు లేస్తాడేమో అన్న భయంతో దుఃఖాన్ని లోపలమ్రింగా.

రాజా కళ్ళు తుడుస్తూ 'సుందరీ! నేను ఉంటాను. నువ్వు కొద్దిసేపు నడుం వాల్చు.'

నిద్రా! ఎలాపోను? ఎలా కళ్లు మూసుకొని నిద్రపోను. తలవూపే పడుకోనని- భుజంమీద భారంగా చెయ్యి నొక్కుతూ 'సావిట్లో ఉంటా. పన్నెండు అయినతర్వాత లేపు' అంటూ బాబువైపు వంగిచూచి మెట్లు దిగేడు. ఆవేదనతో అవి మూలిగేయి.

గడియారం క్షణాల్ని గడుపుతోంది. అవి ఆత్రుతతో వెదుతున్నాయో, నెమ్మదిగా ఆరాటాన్ని హెచ్చుచేస్తున్నాయో తెలియకుండానే గడుస్తున్నాయో నేను చెప్పలేనేమో! కాలం అనేది లేదేమో! కాలం యంత్రాలతో కొలిచేది.... ఇప్పుడు.... ఈ క్షణాల్లో.... రాత్రిళ్ళు నాకు మాత్రం బాబు ఉచ్ఛ్వాస నిశ్వాసాల్తో ఆ చిన్ని హృదయం యొక్క స్పందనాల్తో నిర్ణయించాలని అనిపిస్తోంది. అదే.... ఆగిపోతే.... కాలం లేదు.... ఆఖరికి నా జీవితం వృథా

ఈ సమయంలో నేను చేసేది, చెయ్యవలసిందీ ఏమీ లేదేమో? అక్కడ ఆనిద్రకో. బాధతో మృత్యువుతో పోట్లాడే బాబుని చూస్తూ కూర్చోడంకన్న ముక్తి, జయం అనేది వుంటుందా?

రేపు అన్నదాన్ని గురించి ఆలోచించలేను. అవి వుండవచ్చు—లేకపోవచ్చు. కాని గతం అన్నది ఎదురు తిరుగుతోంది. ఏ విరుద్ధకాల ప్రవాహంలో, ఈ సన్నివేశంలోకి లాగబడి ఆవృతమయేనో అదేవుంది ఇప్పుడు ఈ నిర్జీవ ఆవేదనా పరిసరాలు జ్ఞాపకం తెస్తున్నాయి.

'సంతానం! ఆయన కథల్లో దాచుకొన్న అమృతపు చిహ్నాలు చదివినపుడల్లా నాకు వెలితి పొందినట్టుగా పుండేది. న్యూనతకల్గేది. ఐదు సంవత్సరాలు దాటినా స్త్రీ హృదయం అర్రులుచాచే అమరత్వం నాకు రాలేదని ఆక్రందించేదాన్ని ఆ మృతస్థానం కోసం.

ఆయనేదో కథ రాసుకుంటున్నారు. సన్నటి వెన్నెల జల్లెడలా పూచల్లోంచి లోపల పడుతోంది. బంతిపూలు ముత్తైదువుల్లా తలలూపు తున్నాయి. 'నిన్నరాత్రి కథ పూర్తిచేస్తున్నారా?' తలూపేరు. కాగితంమీద కలం జరుగుతోంది. బాధతో ముక్కులు కోపం తడుము కుంటూన్నట్టుగా ముఖం ముకిళిస్తోంది.

ఏవిచిత్ర జ్ఞాపకాలు, దేవతల కోర్కెలు నాలో ఆశల్ని రేకెత్తిస్తున్నాయో తెలియదు— 'మనకి ఓ పిల్లాడు వుంటే....' ఇక అనలేకపోయే.

తెల్లబోయి నావైపు చూచేరు. "ఐదేళ్ళయింది.... దేవుడు........" కన్నీళ్లు అడ్డం వచ్చేయి.

దగ్గరసా వచ్చేరు. కన్నీళ్ళు వొత్తుతూ "ఐదేళ్లు అయితేఏం? ఇది అంత నిరాశజెందవలసిన స్థితికాదేమో! ఎంతమంది ఇంకా ఎక్కువ సంవత్సరాలనుండి........" "ఉండవచ్చు, వాళ్లు మనం కాదుగా. మనం మనమే. చాలాకాలంనుండి ఒక్కటుంటే చాలా బావుండునని ఆశించేం, ఎదురు చూసేం, ప్రార్థించేం కాని........"

ఆయన కళ్ళల్లో బాధ స్పష్టంగా తెలుస్తోంది. ముఖం ముడుతలు పడింది. క్షణికంగా స్ఫటికాలయేయి. "నేను ఆశించే వాళ్ళతో ఆడాలని, మాట్లాడాలని కళ్లు కాయలు కాసేయి... .... ..."

నాకు దుఃఖం ఆగలేదు. హృదయవేదన ఎడారిలో చచ్చిపోవలసిందేనా? ముక్తిలేదూ? దేముడు నన్ను

గొర్రెక్రిందే జీవితం అంతం చెయ్యదలచుకొన్నాడా?

భుజంమీద అనుకొని అనునయంచేసేరు. నిరాశలో ఎండిపోయేటట్టు కన్నీళ్ళు ఇంకేయి. "సుందరీ! మనం ఒక పిల్లాడిని దత్తత చేసుకుందాం" అన్నాడు ఉండుండి.

"దత్తత" ఆశ్చర్యపోయా. మాట్లాడలేక చూపులు ఒప్పగించా ఆత్రుతతో. "అవును సుందరీ! ఎందుకుకాదు, దత్తత చేసుకున్నాం అన్నంతలో మన పిల్లలు మనకి ఉండకుండా వుండరుకదా!"

నాలో విప్లవం చెలరేగింది. "ఎలా చేసుకోపున్నారు. నాకు అక్కరలేదు. ఆ మొట్టమొదటలో మీరు ఏమన్నారో జ్ఞాపకంవుందా. అవన్నీ మర్చిపోయేరా...."

"మనకి కలగబోరని కాదు- మారుగా...."

"ఒద్దు.... నాకు ఒద్దు" సావిట్లోంచి వెళ్ళిపోయా. ఏం చెప్పదలచుకున్నారోకూడా వినకుండా పడుకున్నా. ఆమాటలు ద్వేషించేటట్లు చేస్తున్నాయి. పురుషులు ఎప్పుడూ ఇంతే! ఆయన! తన నోటమ్మటగా ఆ మొదటి యౌవనంలో ఏ అమరలోకపు బిడ్డను ఆశించేడో అనోటితోనే యింకో తల్లిదండ్రి కన్న బిడ్డని తీసుకువచ్చి, అది నాన్నా, అమ్మా అని పిలుస్తూంటే, ఎలా ఓర్చుకోడానికి ఎలా సంతోష పడ్డానికి హృదయం ఒప్పుతుందో! వివాహం, భార్య, వత్సరాల స్వప్నం, పవిత్రత, ఆదర్శం ఎంత హీనంగా, క్రూరంగా బలిచేసేరు? దూరంగా పడుకున్నా ....ఆలోచనలు వస్తూనే వున్నై.

రాజా ఎంతలో మారిపోయాడు?

సహజత్వంలోనే రోజులు గడిచేయి. ఎవరో హృదయంలో సుత్తితో కొట్టినట్లనిపించింది. ఈ "దత్తత" అన్నముక్క శూలంలా పొడుస్తోంది. తనహృదయం, తన దగ్గరనుండి వేరే తీసుకొని వెళ్ళిపోయినట్లు వుంది. తన్ని రాజా దగ్గరకు తీసుకొన్నప్పుడు తన హృదయం తిరగబడేది.

ఆ ఆదివారం స్కూలు వార్షికోత్సవానికి వెళ్ళేం. పది పన్నెండు సంవత్సరాల బాలికలు, ఒక విధమైన ఖద్దరు దుస్తులతో స్వాతంత్ర్యాన్ని ఒలికిస్తూంటే, యౌవన భారం వచ్చిన యువతుల్లో సంచరించడం, గౌరవించడం, మర్యాద చెయ్యడం నాలోని ఆనందాన్ని విచ్చలవిడిచేస్తోంది.

అంతవరకూ నాకు రాజా కళా జీవితంలో వయసు పిల్లలకి చెయ్యి మళిపిస్తున్నాడని తెలియనేలేదు. ఇటువంటి సంస్థలో ఉన్నాడా? భావి భారత నారీమణులని త్యాగంచేసి ఆంధ్రత్వం నిలబెడుతున్నాడా?

ఆరాత్రి నృత్యం చూసేం. నేను ఏ అమర ప్రపంచపు అంచులలో ఉన్నానో, ఏ దేవత్వం నన్ను అలుముతోందో తెలియక వాళ్ళతో ఆడుకున్నా, పాడేను, నవ్వాను........

వాళ్ళు సాగనంపేరు. కృతజ్ఞత, ఆరాధన ఆయనయెడ అంతా కనపరిచేరు. వాళ్ళు ప్రేమించారు. నాకు సిగ్గు కల్గుతోంది. రాజా ఆదర్శం యిదా?

ఇంతవరకు ఎవరి బిడ్డనో తెచ్చుకోవాలి అన్న తలంపు అర్థం కాలేదు నాకు, అది హృదయాన్ని పొడిచినట్టుగా వుంది. అందులో ఓ విధమైన జుగుప్స, కోపం, విముఖత ఆయనయెడ కల్గేయి. ఎప్పుడూ చూడని సంకుచితదృష్టితో పర్యవేక్షించేదాన్ని........ఆయన్ని ఆ దృష్టితోనే అర్థం చేసుకోగలిగే ననుకున్నా....

మరి యిప్పుడో. ఆరాత్రంతా నన్ను సింహావలోకనం చేసుకున్నా. తప్పంతా నాదిలా తడుతోంది. రాజాలోని ఈ సరస్వతీ ఝురులు ఎంత గుప్తంగా వున్నాయి. నా చేష్టలు, నా ద్వేషం, నన్ను కుమిలించి సిగ్గుపరచాయి.

ఏదో ఆశించాలి అనిపించేయి........ ఆయన కాఫీ తాగుచున్నప్పుడు ఉదయకాంతుల చల్లదనంలో అన్నా "మనం ఓ పిల్లాణ్ణి పెంచుకుందాము."

ఆయన ఆశ్చర్యపడ్డారు. నోటమాట రానేలేదు. "నిజంగా" నమ్మలేనిస్థితి ఆయన్ని అలా అనిపించింది.

* * *

ఆవేసవిలో వసంత వచ్చింది, మూడున్నర సంవత్సరాలకు. గుండ్రని ముఖం. ఎరుపు ఛాయ. మొదట్లో అంతా సిగ్గుగా జరిగిపోయింది. రోజులు గడిచినకొద్దీ ఆసిగ్గు నెమ్మదిగా విడిపోయింది. వసంత ఎప్పుడు ఆ రుద్రపు రంగు గౌను ఒదిలేదికాదు. వచ్చీరాని మాటల్తో వెనక వెనక తిరుగుతూ, తనకు ఏంకావాలో చెప్పేది.

ఒక్కొక్క సమయంలో వసంతను చూస్తే ఏ పదిహేను సంవత్సరాలదానిలానో మాట్లాడేది. ఇంకో సమ

యంలో ఏమీ తెలియని ఆటబొమ్మలా ఉండేది. కాని అవన్నీ నాకు ఏదో కన్ను నూత్నలోకంలో తెరిపించేవి.

ఆ సాయంత్రం తల దువ్వుతూ "నువ్వు నా పోలికే" అంది. తలూపి నవ్వింది. "మనం యిద్దరం ఒకలాగే వున్నామే" ఆక్షణం హృదయానికి హత్తుకొని బుగ్గమీద చిటికవేస్తూ నవ్వే.

ప్రక్క పిల్లల్ని పిలిచి నన్ను చూపిస్తూనే మా అమ్మ అనేది— ఎన్నో ఈ క్షణంలో ప్రతి చిన్నవిషయంలో నన్ను ఎలా వసంతకు సమర్పించుకొన్నానో, తలుచుకుంటూంటే దుఃఖం పట్టపగ్గాలు లేకుండా అవుతోంది.

ఆరోజు ఆదివారం- వసంత ఆడుకొని దీపాలవేళకు వచ్చింది. అలసినట్టు కూర్చుంది. ఎప్పుడూ మాట్లాడకుండా వుండని వసంత ఎందుకంత నిశ్శబ్దంగా వుందా అని ఆలోచిస్తున్నా. ఒళ్ళు వేడిగా కాగుతోంది. నెమ్మదిగా మంచంమీద పడుకోబెట్టా.

"అమ్మా! బాధగా వుందే" ఏం చెయ్యను. డాక్టరు వచ్చేడు- వెళ్ళేడు. అది చంటిపిల్లల వాతం అని అన్నాడు. పెదవి బిగపెట్టి—ఆవేదన- ఏమవుతుంది?

ఆ ఆఖరు ఘడియలోనే.... నెమ్మదిగా కళ్ళుతెరుస్తూ "అమ్మా నిద్రపోతానే" అంది ............... అంతే!

శాశ్వత సమాధే, దీర్ఘనిద్ర పోయింది. తను వచ్చిన పని చూసుకొని....వెళ్ళిపోయింది.... ఎక్కడకో........? "అమ్మా" అని నోరారగా ఎవరు పిలుస్తారు? ఇక నాకు లోకం.... ప్రపంచం....? నేను దోపిడయ్యాను. వంచింపబడ్డాను, వసంతకు ప్రేమంతా ధారపోసే. అది 'నా'అని అనుకునే ఇచ్చే. లోపం చెయ్యకుండా, నా స్వర్గం........ త్యాగం చేసా. కాని నూత్న జీవితానికి బదులు మృత్యువు యివ్వబడింది.... ఎంత క్రూరంగావుంది.

ఆయన బాధపడుతున్నారని తెలుసు, కాని.... కాలం జరుగుచున్నకొలది ఆయనలో మార్పు వచ్చిందా? పురుషడంతే—

* * *

ఆపండుగులకు రాజా చెల్లెలు పాప వచ్చింది. తల్లి ఒళ్ళో నిద్రపోతున్న పిల్లాడినిచూసి ప్రశ్నలు వేసా. ఆవిదేదో చెప్పింది—నాకు శూన్యంగా కన్పించింది. సంసారం గురించి ఎన్నో మాట్లాడింది. భర్త ఆదరణ, అనురాగం ఎలావుందో సిగ్గు పడుతూనే చెప్పింది.

వెళ్ళేటప్పుడు చీరా, రవికలగుడ్డ పెట్టే. చంటిపిల్లాడిని ఎత్తుకున్నా........ నాలో నాకే న్యూనతగా వుంది. "నువ్వు వయస్సులో ఉన్నావే! నిరాశ ఎందుకు? నువ్వు చేసేదేమిటో ఆలోచించావా? నీ భర్త, నీ గృహం, బిడ్డలు అందర్నీ ఒకరాత్రి పోగొట్టుకోవచ్చు, తర్వాత అవి నీవి కావేమో! ప్రతి జీవి తన పనిని నిర్వర్తించి తను వెళ్ళిపోవాలి...." ఆలోచనలు వచ్చేయి, ఏదో చైతన్యం నులుముతోంది.

సాయంత్రం రాజా వచ్చాడు. ఎదురుగా వెళ్ళి పుస్తకాలు అంది పుచ్చుకొన్నా. ఖండువా తీసి చిలక్కొయ్యకు వేసా. రాజా ఆశ్చర్యపోతున్నా నవ్వే.

కాఫీ తెచ్చాక ఏవో కబుర్లు చెప్పేరు. విన్నా. నవ్వే. ఆరాత్రే దగ్గరకు తీసుకుంటూ "ఆ తొలిరోజులు జ్ఞాపకం తెస్తున్నావ్" ఆనందంతో అన్నారు, హృదయం బిగుసుకుంది, ముఖం త్రిప్పుకున్నా. చాటుగా హృదయం రోదించలేక మా ఖాపి ఏమిటి? మా వివాహ ఫలితంగా ఏమి నిలబడింది? ఈ క్షణంలో అనిపించింది. సంవత్సరాది వచ్చింది. నాలో నేను తగిలించుకొన్న యినపకపచాలు విడిపోయి హృదయం పరవళ్ళు త్రొక్కింది.... ....

ఆరోజుల్లో ఆనందంగా బూజుపట్టిన హృదయాల్ని దులుపుకొని గంతులు వేసేం, పాడేం. దగ్గరగా వచ్చేం. ఆఘడియనుంచి అమరత్వంలోనే ఉన్నాం........ రోజులు గడిచేయా! నెలలు గడిచేయా! అనిపించింది.

ఆరోజు రాత్రి అతని చేతుల్లోనే ఉండి చెప్పా రహస్యంగా- వెయ్యి వసంతాల్తో నృత్యం చేస్తూనే........ ఆనందంలో మాకు కన్నీళ్ళు తిరిగాయి.

* * *

కళ్ళు తెరిచా. అమ్మ ప్రక్కన నుంచుంది. 'అమ్మా' "తెలివి వచ్చిందా తల్లీ!" లేవబోయా. "నాపిల్లాడు" అన్నా వెంటనే. "అంతా నీ పోలికే. ఆరోగ్యంగా, అందంగా వుంటాడు. మొదట్లో నీరసంగా వున్నాడు, ఇప్పుడే కోలుకుంటున్నాడు" అంది ప్రక్కనే వుంచుతూ. 'అంటే' నాకు అర్థం కావడంలేదు. "వారం క్రితం పుట్టాడు

అవుపాలు పోస్తున్నాము" అంది. హృదయం ఆగిపోయింది. వారం రోజులు నేను ఏమయ్యేను. నా బిడ్డ.... డాక్టరు మా అమ్మ చేతుల్లో ........ భరించలేకుండా వున్నా.... "ఒద్దు అమ్మా ! నాదగ్గరనే ఉండనీ..." అన్నా. నా చేతులతో బాబుని ఒడిమా—నల్లని గుడ్లు.... ముఖం. నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది ఆనందం.

ఆతర్వాత నేను త్వరగా కోలుకోవటం అందరికీ ఆశ్చర్యం కల్గించింది. నాలో ఒక్కటే కోరిక.... నా బిడ్డను ఒకళ్ళ చేతుల్లో ఆఖరికి అమ్మ అయినా సరే, అనాధలా పెట్టడం ఇష్టంలేదు- నేనే పెంచాలి. ఇదే భావన నాకు ఆరోగ్యం చేర్చింది.

కాస్త మగతగావున్నా, దగ్గినా, డాక్టరుకు కబురు పంపేదానిని. మందు వచ్చేవరకూ నిరిచేదాన్నికాను. నాకు నా బాబు ఒక్కడే..............

నెలలు జరుగుతున్నాయి, రాజా నా విచిత్ర పంధాని గూర్చి బాధపడుతూనే ఉన్నాడు. నేను విశ్రాంతి తీసుకోవటంలేదు, చచ్చిబ్రతికా.... ఒకటి రెండుసార్లు అన్నారు.

ఆరోజుల్లో ఏదో విషయంలో రాజాకి నాకు చర్చ వస్తూనే వుండేది. నేను పెంకితనం నేర్పుతున్నాననేవాడు. ఎత్తుకోవడం, లాలన పెంకితనం అవుతుందా?....

రాజా ఆరోజుల్లో మారేడు, చిరాకు, కోపం. నా బాబుకి ఓ సంవత్సరం దాటింది, నుంచుంటున్నాడు. ఓరోజు రాజా అన్నాడు "సుందరీ! నువ్వు వాణ్ణి చెడగొడుతున్నావు. అప్పుడే వాడు ప్రపంచంలో ఏంఅడిగితే అది ఏడిస్తే వచ్చేస్తుంది తనకి అన్న భావన పడ్డాడు. ఇలా వుంచితే ఎలా తయారౌతాడో ఊహించావా" అని అడిగేడు.

బాబుమాట ఎత్తుతేనేచాలు నాకు రవులుకునేది. "అందరిలాగే పెద్దవాడవుతాడు....కాని మనకుమల్లే క్రూరహృదయుడు మాత్రం కాడు...." అన్నా.

"క్రూర హృదయంకాదు. నీకు వాడెంతో నాకూ అంతే. ఇలా పెంకితనాల్తో తీసుకువస్తే భావికి మంచిపంటావా?"

"మీకు ప్రేమ, త్యాగం అంటే తెలుసా"

నవ్వేడు. "ప్రతి స్త్రీ ప్రేమిస్తుంది. దానిని సంతానపు ఉన్నతి భావికోసం ఉపయోగపడేటట్లు వినియోగిస్తుంది, నాశనం కోసం కాదు. నువ్వుకూడా?........"

అనుకోకుండానే బాబుకు మొదట్లో కొంచెం జలుబు, తర్వాత జ్వరం, ఒళ్లతెలియని మగత. డాక్టరిని పిరిచేం. పరీక్షచేసి రక్తం తీసుకు వెళ్ళుతూ, రేపు అన్నాడు. రేపు! ఆత్రుత— మాలోవుండే పట్టుదలలు, కోపాలు, విముఖత అన్నీ గాలిలో ఇంకిపోయేయి.

*          *          *

ఇద్దరం వంతులు వారీగా రాత్రి ఆ వుయ్యాల ప్రక్కన కూర్చుందామని నిర్ణయించుకొన్నాం. రాత్రి పన్నెండుకు లేపమన్నాడు, కాని లేపలేదు, లేపకపోవటమే మంచిదని పిస్తోంది. నాబాబు ఉయ్యాల్లో కళ్ళెదుటగా బాధపడుతున్నాడు. ఏమవుతుంది?—

బాబు నావాడు, వాణ్ణి ముట్టుకోడానికి ఎవరికీ హక్కులేదని చాటే. మృత్యుదేవత తన క్రూర దంష్ట్రిలను తెరుచుకొని బాబుని కబళించవచ్చు. నిజమయితే నాకు జీవించడానికి స్థానమేలేదు— నిరాశ! నిజంగా ప్రేమించడం మూర్ఖత్వమేమో అనిపిస్తోంది. ప్రతీ తల్లి ప్రతీ మాతృహృదయం తన బిడ్డణ్ణి అద్దాలలో పెట్టుకొని హృదయానికి హత్తుకోవటం, మూర్ఖత్వమైనట్టే తట్టుతోంది.

ఉయ్యాల మంచం కోడుకు అనుకున్నా. బాబు కళ్ళంమ్మట నీళ్ళు నెమ్మదిగా వస్తున్నాయి. నెమ్మదిగా ఉయ్యాల్లోంచి తీసుకొన్నా. నా హృదయానికి హత్తుకొన్నా. అంతకంటె ఎక్కువ శాంతి లేదేమో? నేను నిజంగా- అన్నం రొట్టి ఇస్తే ఆత్రుతతో తీసుకొని తింటూన్న కాంది శీకినేమో! దాన్ని ఎవరైనా దొంగిలిస్తారేమో అన్నభయంచే! ఆ పతన స్థితికి ఒచ్చేనా?—

వేడిశ్వాసలు బుగ్గలమీద పడుతున్నాయి. ఇకనుంచైనా వాడికి నిజమైన స్థానంలో తల్లి నవుతా. నా స్వార్ధంతో పెంచను. వాణ్ణి వీరుడిగా పెంచుతా. వాని భావి నా ప్రేమ మీద ఆధారపడివుంది. నాభయానికి వడ్డీగా వాడిని బలి పెట్టను అని ఆలోచించగా హృదయం గోడెత్తింది. ఆవేదన— ఇంకో తలపులేదు.

తెల్లవారింది. 'సుందరీ! నన్ను లేపలేదేం. ఎలావున్నాడు' అని ఉలిక్కిపడి లేచిన రాజా అన్నాడు.

# పరివర్తన

డాక్టరు వచ్చేడు—చూచాడు— రాత్రి భయపడ్డాను కాని— గండం దాటింది. రెండురోజుల్లో తిరుగుతాడు అని వెళ్ళేడు.

రాజా నా వైపు చూచేడు. ఇద్దరం బాబు వైపుచూచేం. చూపులు కలుసుకొన్నాయ్. చిరునవ్వు ఆక్రమిస్తోంది. రాజాకి కళ్ళనీళ్ళు తిరుగుతున్నై. వెర్రిదుఃఖం, ఆనందం ముత్యాలు రాలుస్తోంది.

'సుందరీ!" ఆయన వైపుచూచే 'అమరత్వపు అంచు వాళ్ళమీదే భావి, దేశం, ప్రజ ఆధారపడివుంది. ి త్రుల్ని మన తర్వాత వ్రాసేవాళ్ళు వీళ్ళే. మనంకాద అన్నాడు.

నిజమే ! హృదయం ఆందోళన పొందుతోంది. వెల్తుర ఉయ్యాల చువ్వలోంచి బాబుకు కొంత వెలుగునిస్తోంది,



భిన్న దృక్పథాలు

## ఈ జీవితం

• శ్రీమతి జయ •

ఈ జీవితం బహు నీరసం....  
ఈ లోకమొక నాటకం....  
చిత్రనాటకంలో  
మనమంతా పాత్రధారులం....  
పాత్ర ముగిసినంత  
మటుమాయమైపోతాం—  
ఎన్నోకలలను కంటాం....  
ముందుకు పరుగిడి  
నీడల పట్టబోతాం....  
మరి కాలుజారి పడిపోతాం....  
అటుపై అంతా అంధకారం—  
పై మెరుగులచూచి మురిసిపోతాం—  
పై చూపుచూచి మోసపోతాం....  
ఈ పైపూతలన్ని బూటకం....  
మిథ్య నాటకం—  
మరి ఈ జీవితం  
లోతు తెలియని సుడిగుండం....  
దారిలేని ఒక అగాథం—  
బంధుమిత్రులందు వ్యామోహం  
ఘనకార్యాలు జేయవలెనంచు  
వుబలాటం  
ఈ జీవితం క్షణికం....  
మరి ఎందుకీ ఆరాటం?  
నేడుండి రేపు పోతుంటాం....  
అయినా ఎందుకో ఈ పోరాటం—

## జీవితనౌక

" కోనకిశోర్ "

నావికా........ నావికా........  
నడుపవోయి నావను  
నడుపవోయి జీవిత నావను  
నావికా.......  
ప్రేమనగరిలో సంతసమున  
కల వసంతాల కోకిలలై  
నడపవోయి జీవిత నావను,  
నావికా.......  
ప్రేమజీవుల ప్రియభాషణముల  
ప్రియదంపతుల హర్షధ్వనులతో  
నడుపవోయి జీవితనావను,  
నావికా ......  
పండువెన్నెల్లోన  
నవ్వు వెన్నెలలీను  
ప్రేయసీ ప్రియుల  
క్రీగంటి చూపులతో  
నడుపవోయి జీవితనావను.  
నావికా........  
మధురమౌకలవోలె గడిచిపోయెడికాలం  
చుక్కానిగాచేసి త్రోసుకొనిపోవోయి  
ప్రేమనెడు జలనిధిలో  
వలపనెడు సుఖతీరమును  
చేర్చుమో నావికా యీ ప్రేమనౌక  
చేర్చుమో నావికా యీ చిత్రనౌక  
పొందుమో ఆనంద సౌఖ్యానుభూతి నావికా........

సరస్వతీ వరప్రసాదిని—వీణాగాన వినోదిని

# వీణ ధనమ్మాళ్

• శ్రీ ఎమ్. ఆర్. శాస్త్రి •

ప్రపంచ సంగీత వాద్యాలలోకెల్ల ఆద్యమైనది, దేవరా పూజ్యమైనది, కష్టసాధ్యమైనది శ్రోతలనానందాబ్ధిలో ముంచి వేసేది వీణావాద్య మొక్కటే. దీనినే జగన్మాత సరస్వతీ చేతంబూని జగత్సృష్టికర్తయైన బ్రహ్మదేవుని ఆనంద డోలికలలో ఊగించింది. అందుచే దానికింత పూజ్యత వచ్చినది. ఈ పవిత్రవాద్యంలో శ్రీమతి ధనం వైదుష్యం చూపడం ఆంధ్రుల మహాభాగ్యం.

దక్షిణాదిని నివసించుచున్న, ఆంధ్ర కళావంతుల కుటుంబములో ప్రభవించిన దీపె: ఈమె మాతా మహి కామాక్షి. ఆరోజులలో సువిఖ్యాత నర్తకి: తల్లి నాట్య గానాలు రెంటిలోను అందెవేసిన చేయి. సంగీత త్రిమూర్తుల్లో ఒకరైన శ్యామశాస్త్రిజీ కుమారుడు సుబ్బరాయశాస్త్రి వద్దనీపె తల్లి గాన శిక్షను పొందింది. అందుచేత ధనమ్మ కవలీలగా సంగీత సంప్రదాయం అబ్బింది. పన్నెండేండ్లలోపలనే తల్లివద్ద నాట్యాభినయా లభ్యసించి ఆరితేరింది. పిమ్మట పంచనాదయ్యర్ వద్ద శిక్షణను బొందెను.

ఆజన్మ సిద్ధంగా శ్రావ్యకంఠం, సత్సాంప్రదాయపు శిక్ష కలగడంచేత, ఈమె సంగీతం రాణించింది. కిన్నెరనుబోలు గాత్రానికి వీణా సాహచర్యముచే, అళగశింగ రయ్యా ఈమెకు వన్నెదెట్టారు. రెండేండ్లలో వీణావాద్య ప్రవీణతను సంపాదించింది. ఆరోజులలో మైలాపూర్ గౌరి అనే అభినేత్రి గొప్ప వైణికురాలు. అంతటి విద్వాంసురాలితో తన పదునాల్గవ ఏటనే ధనం సరిసమాన ప్రతిభతో వాయించెనట. ఈమెకు, వీణకు బాల్యంలోనే అవినాభావ సంబంధము కుదరడంచే, విద్వాంసురాలనిగణన కెక్కినా, అనవరత సాధనమాత్రం జేసేది. క్రొత్త కృతులు జావళీలు పదాలువల్లెవేస్తూ వుండేది. ధర్మపురి సుబ్బరామయ్యవద్ద అనేక జావళీ లభ్యసించింది. బాల కృష్ణయ్యవద్ద పదాలు నేర్చింది. ఈవిధంగా పిన్న వయస్సునే మంచి సంగీతజ్ఞానం, గొప్ప వాద్యసంపత్తిని అలవర్చుకొన్నది.

'సిద్ధోపదేశా, ముపదేశకాలే, ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః' అన్నట్లు పార్వతికి విద్యలు తమంతట తామే వచ్చినవట. అలాగుననే వరప్రసాదినియైన ధనమ్మకు సంగీతం ఒక వరంగా వచ్చింది.

ఈమె సంగీతం భావ ప్రధానమైనది. త్రికరణశుద్ధిగా వుంటుంది భావం. వాద్యంలో నయం, రంజకం, మాధుర్యం, అపారంగా వుండి, వాద్యంలో గాత్రం మిళితమైతే, ఇదమిత్థమనడానికి వీలుండదు. స్వయంగా అనుభవించి పాడడంచేత ఆరంభంలోనే రక్తిగడుతుంది. శ్రోతలు గానరసాన్ని అనుభవిస్తారు. 'రహిపుట్టజంత్ర గాత్రముల్ రాల్గరగించు విమలగాంధర్వంబు విద్యమాకు' అన్న వాక్యాన్ని స్మరణకు దెచ్చి ఎట్టి కఠినచిత్తునైనా కరిగించి వేసేదట.

స్వరరాగసుధారసయుత భక్తి (శం. భరణం) రాగసుధా రసపానం (ఆందోళిక) శుద్ధమైన మన సుచే సుస్వరం అను కీర్తనలు వాయించేటప్పుడు శ్రోతలా నందాశ్రువులు రాల్చేవారు. తానం వాయించేటప్పుడు, సప్తస్వర సుందరులు నాట్యం చేస్తున్నారా, లేక సరస్వతి బ్రహ్మలోకంనుండి వచ్చిందా అన్నట్లు స్ఫురించేదట. అమృత ప్రవాహమానందసాగరంలో వున్నామనిపించే టంత మాధుర్యం, అంత రంజకత్వం—అంత ఆనందం ఇంకెవరి గానంలోను లేదట.

ఈమె సంగీతం ఒడుదుడుకులు లేక, తాళ కుస్తీలు, స్వర పల్టీలు, రవచెక్కుళ్లు, తలత్రిప్పుళ్ళు లేక సరళధారతో విలంబితకాలంలో నడిచేది. ఈమెది శుద్ధ కర్నాటక బాణీ. ఈమె బాహ్యవేష మెంత నిరాడంబరమో, సంగీతం కూడా అంత నిరాడంబరమే. ద్రుతకాలంలో పాడేవారు, స్వర స్వారస్యాన్ని గమక శుద్ధిని చూపలేరని ఈమె అభిప్రాయం. ఈమెది విలంబిత వాద్యం గనుకనే గానంలో ప్రతి స్వరంయొక్క కళాకాంతులు చూపుచూ ఒక స్వరాన్నుండి ఇంకొక స్వరానికి దుమకకుండా అనురాగం చూపెట్టేది. ఇలాగ స్వరకళను చూపిస్తూ

# వీణ ధనమ్మాళ్

వాయించేది కాబట్టి ఎత్తుగడలోనే కచేరీ రక్తి కట్టేది. ఈమె ఘనరాగాన్ని అయిదు నిముషాలకంటె హెచ్చుసేపునూ, జన్యరాగాన్ని, నిమిషంకంటె హెచ్చుసేపును నిలిపి వాయించి యెరుగదు. ఒక్క సంగతి వేసినా ఆ సంగతిలోనే రాగంయొక్క జీవకళ మెరుపు ప్రకటిస్తుంది. అది అపూర్వమైన సంగతిగావుండును. 'సాగరో సాగరోపమః' అనునట్లీమెకు ఈమెయే సాటి. ఇక కీర్తనల విషయంలో, పెక్కు సంగతులు వేసి విసుగెత్తించకుండా ఒకటి రెంటితో మహదానందాన్ని కలిగించేది. 'రామ నీ సమానమెవరు' గాని 'ఇంకా దయరాలేదా' అని గాని నేటి విద్వాంసులు ప్రారంభించి పల్లవి పూర్తి చేసేసరికి ఏ అరగంటైనా పడుతుంది. అర్థంలేని వ్యర్థ సంగతులతో మొత్తుకోకుండా ఈమె ఇంపైన రెండింటిలో ముగించేది.

ఈమె సాహిత్య శబ్దోచ్చారణ అతి స్పష్టంగా వుండేది. శబ్దాలు విశదీకరించి ఉచ్చరిస్తూ శబ్దార్థం అందరికీ అవగాహన చేసేది. సాహిత్య ప్రవీణులుకూడా ఈమె పద విభజనకు మెచ్చుకొనేవారు. నూతన అర్థములు స్ఫురించేలాగు శబ్దంనుండి భావ విస్ఫురణ చేసేది. ఈమె సాహిత్యంలో ఎట్టి అపభ్రంశములు లేకుండగ పాడేది. అష్టపదులు మహా స్వారస్యంగా పాడేది, శబ్దాలను తరచి తరచి భావాన్ని ప్రకటించేది గాబట్టి శ్రోతలకు బ్రహ్మానందం ప్రాప్తించేది. ఈమె గానంలో అపస్వరమనేది లేనేలేదు. సునాదంతోపాటు శుద్ధసాహిత్య సమ్మేళన ఈమె కచ్చేరికెంతో తరగనివన్నెను బెట్టేది. ఈమె మహా గాయకులైన, మహా వైద్యనాదయ్యర్, తి. కృష్ణయ్యర్, శరభశాస్త్రి, సుబ్రహ్మణ్యయ్యర్, తంజావూర్ నారాయణస్వామప్ప, కరూర్ దేవుడయ్యర్, వీణ శేషన్నగార్ల తరగతికి చేరును. ఈమె సమకాలికులైన, కోనేరి రాజపురం, గోవిందస్వామి (ఫిడిలు) నైనాపిళ్ళె, అలగనంబి, చిదంబర భాగవతులు, సంగమేశ్వరశాస్త్రి, రమణయ్యదాస్, ఆనంద గజపతిరాజా, మైసూర్ రాజావంటి రసిక ప్రభువులీమె నెంతో శ్లాఘించిరి.

ఈమెను సుస్వర దేవతగా భావించారు. భైరవి, కాంభోజి, బేగడ, శంకరాభరణం, సావేరి, హుసేని, నాదనామక్రియ, ఇత్యాది రాగాలీమె సొమ్ము.

జీవితాంతం దాకా ఈమె వీణ నెడబాయలేదు. ముదసలితనంచే (70 ఏటను) నేత్రావరోధం గల్గినా, ప్రతి శుక్రవారం తన ఇంట్లో కొన్ని ఘంటలకాలం వీణ కచ్చేరి చేసేది. పండితులు, పామరులుకూడా గుంపుగా మూగేవారు. ఈమెకు సరస్వతీకటాక్ష మెక్కువగా వుండుటచే లక్ష్మీ ప్రసన్నం కొంచెం తక్కువగానే వుండేది. కాని భగవత్కృపచే ఆమె కెట్టికొరత వుండేదికాదు. శ్రీ త్యాగరాజు భగవత్కైంకర్యానికి తన సంగీతాన్ని అర్పించినట్లీమెకూడా, భగవదర్పణ జేసింది. ఆత్మోజ్జీవనానికే గాన విద్యయని భావించి భగవంతుని గానం చేసేది. ఈమె వంశ గౌరవాన్ని ఈమె కూతుండ్రు మనుమరాండ్రు నిలబెట్టారు. ఈమె మనుమరాలు బాలసరస్వతి నాట్యంలోను, అభిరామసుందరి, ముక్త, బృందలు, గానకళలోను ప్రఖ్యాతినార్జించిరి. సంగీత సారస్వతానికీమె చేసిన సేవ అపారం-అమేయం-అమోఘం. ఈమె కృషి సర్వతోముఖంగా ఫలించింది. జన్మసార్థకమైంది. తానుతరించి ఇతరుల నుతరింప జేసింది. ఇట్టివారే మృతజీవులు. ఈమె ఆత్మకు శాంతి గల్గుగాక!

ఓం తత్సత్!



# పొదుపుకోసం....

* శ్రీమతి డి. యస్. రాజేశ్వరీపట్నాయిక్ *

కొత్తగా వెలువడిన "స్త్రీ హితైషిణి" పత్రిక తిరగేస్తోంది శాంత. స్త్రీ అభ్యుదయంపట్ల దిట్టమయిన రచనలతో, విజ్ఞానయుతమైన సంస్కరణ ప్రసారాలతో విరాజిల్లుతోందాపత్రిక. ఒక్కొక్కపుట తిరగేస్తోంటే శాంత హృదయంలో భావాలు విజ్ఞానశిఖరాల నందుకున్నట్టే అనిపిస్తోందాక్షణంలో. నిజంగా ప్రతీయింట్లో యిట్లాంటి స్త్రీ వుద్యమ ప్రోత్సాహకరములగు పత్రికలద్వారా జీవితంలో చక్కని విజ్ఞానాన్ని సంపాదించుకోవచ్చు. చందా వివరాలను పరికిస్తోంది.... సాలు చందా 12 రూ॥ ప్చ్.... అంతలో నిస్పృహ నిరాశ లామెమనస్సును కృంగదీశాయి. తమ ఆర్థిక దుస్థితి ఆమె మనస్సులో మెర మెర లాడింది. పోనీ లైబ్రరీలోనైనా తెచ్చి చదువుకుందామా అంటే అబ్బే. లాభంలేదు. ఆమాసాన వెలువడే పత్రికలు మరినాల్గు నెలలకైనా తనచేతికి రావడం అనుమానమే. గ్రంథాలయాల్లోకూడ లంచగొండితనమే!! పైగా వున్నట్టుండి ఖరీదైన గ్రంథాలే మధ్య మధ్య మాయమైపోతుంటాయి. "ఇదేమయ్యా?" అని ప్రశ్నించేహక్కు ఏ చందాదారునకూ లేకపోవడం మరీ విచిత్రం! తీరా నిర్వాహకులకు రిపోర్టు ఇచ్చినా అతీ గతీ లేని అరణ్యరోదనం. ఎటుజూచినా పేదవాని పలుకు పెదవులచేటేగా! ఏమిటో, ఏవిషయాన్ని కదిలించినా అందని సమస్యలే! శాంతకు జీవితమే అసహ్యమనిపించింది. చేతిలో పత్రిక ఆమెకు తెలియకుండానే జారి క్రిందపడింది. అన్యమనస్కయై ఆలోచిస్తోంది శాంత.

"తలదాచుకునేందుకు ఈ వున్న కాస్తంత కొంపనుండి కూడా తరిమేసేటట్టున్నయ్ పరిస్థితులు" అంటూ చికాకుపడిన మనస్సుతో ఆఫీసు దుస్తులు మార్చకుండానే వాలుకుర్చీలో కూలబడ్డాడు శాంత భర్త రామారావు. దైనందిన జీవితంలో యెదుర్కొంటున్న ఆర్థిక దుస్థితికీ, ఆహార సమస్యకూ, అతి ఓర్పుతో కాలాన్ని దొర్లించుకుపోతూన్న తమ కుటుంబ జీవితానికి మళ్ళీ ఏమవాంతరం ముట్టడించిందో అని సందేహ భారంతో భర్తను ఏమని పలుకరించటానికి సాహసించలేక చెదిరిన హృదయంతో, బెదురుగా ఫ్లాస్కులోని కాఫీ కప్పులో పోసి, భర్తకందించి, తోచే పనిలేక టేబిల్ సవరిస్తోంది శాంత. "ఇంటి యజమాని ఈనెలనుండే బాడుగ హెచ్చివ్వకపోతే తక్షణం యిల్లు ఖాళీచేయమన్నాడు. ఏంచెయ్యాలో తోచకుండావుంది" అన్నాడు భర్త. ఈమాటతో మిన్నువిరిగి మీద పడినట్టయింది శాంతకు. క్షణం స్థబ్ధురాలై ఏదో ఆలోచనభావంతో "ఏమిటీఅన్యాయం! ఆర్నెల్లక్రితమేగా యింటద్దె హెచ్చుచేయమంటే యిస్తూంటిమి. మళ్ళా ఏమ్ముంచుకొచ్చింది యింటిగలవాడికి? ఈమాటు రెంట్ కంట్రోలర్ కి ఫిర్యాదు చెయ్యండి. యెంతకని తీర్చడం ఈ ధనదాహం!" అన్నది శాంత.

"వెట్టిదానా లంచగొండితనం విజృంభించిన ఈ రోజుల్లో మన మొర వినేవాడెవడు? అన్యాయార్జితంగా లక్షలు గడించి సమాజంలో మొదటితరగతి వారనిపించుకొనే ఈ ధనవంతులూ, అనాయాసంగా జేబులు నింపుకొని, అధికారంచే ప్రజల కష్టనిష్ఠూరాలను గమనింపని ఈ అధికారులూ ఏకమైనప్పుడు మనలాంటి మధ్యతరగతి సంసారుల పొలికేకలు వాళ్ళ చెవికి దూరుతాయా? "ధనం మూలమ్ యిదం జగత్" అన్న వాక్కు నిత్యజీవితంలో నేటికి యథార్థమైంది. అనుభవానికొస్తేగాని ఏవిషయమన్నా అర్థమవదు. ఈ సంసారభారాన్నెలా గీడ్చడమబ్బా! దీర్ఘంగా నిట్టూర్చి ఆలోచనలోపడ్డాడు రామారావు. కలతపడిన హృదయాన్ని కూడదీసుకొని "చూడండీ! అలా అధైర్యపడి విచారిస్తే ఆరోగ్యభంగమే కాని లాభమేమున్నది? ఈ నెలనుండి యింకా జాగ్రత్తగా పొదుపుగా డబ్బు వాడుకుందాం, మరి మీరు అన్యథా భావించక నేచెప్పేమాటలు జాగ్రత్తగా ఆలోచించండి. కాస్త, సినిమాసర్దాలు.... కాఫీహోటళ్ళమర్యాదలు— సిగరెట్ల అవసరాలు మానుకుంటే ఆ మిగుల్లో యింటద్దె సద్దుకుంటుంది," అని ఏదో నిశ్చయాభిప్రాయానికొచ్చినట్టు ఆజ్ఞాపించినట్టే అన్నది శాంత.

"నువ్వనేదేమిటి శాంతా! నిజంగా నువ్వుపేర్కొన్న వాటితో మన సంసారం పొదుపు లేకుండా పోతుందనేనా నీ అభిప్రాయం. సరే నువ్వన్నట్టు పైఅవసరాలన్నీ మానుకుంటాను, వ్యయబాధ్యతకూడ నువ్వేచూచుకో సరేనా? హాయిగా నిర్విచారంగా కాలం గడుపుతాను" అంటూ రాని నవ్వుతెచ్చుకుంటూ శాంత కళ్ళల్లోకి చూచాడు రామారావు..

# పొదుపు కోసం....

ఇంటి బాధ్యత తీసుకున్న శాంత యెన్నో ఆలోచనలతో సతమతమౌతోంది. తనూహించుకున్న పథకంలో ప్రప్రథమంగా పెరట్లో కూరగాయల పెంపకం ప్రాధాన్యత గుర్తించి, తగు ప్రయత్నం చేసింది. అనుక్షణం ఏపని తలపెట్టినా వ్యయభారాన్ని తగ్గించేందుకై తర్జన భర్జనలతో తలమునకలుపడేది.

ఆరోజు ఫస్టు తారీఖు. అందిన జీతంలో ఐదు రూపాయిలు తన పోకెట్ ఖర్చులకుంచుకొని మిగిలిన నోట్లతో పర్సు అర్ధాంగి కందిచ్చాడు రామారావు. తొంభైఐదు కరెన్సీనోట్లు! ఒకటికి రెండుసార్లు లెక్కించి. భద్రపరచి తీరికగ బడ్జెట్ తయారు చేసేందుకు ప్రారంభించింది.

"అమ్మోయ్! ఈనెలనుండి మా బడిజీతాలు హెచ్చించారే! మరేమో— క్లాసు పరీక్షల్లో బాగా మార్కులు రాకుండా వున్నాయని ఈనెలనుంచి తన దగ్గర ప్రయివేటు చెప్పించుకోమంటున్నారే మా మేష్టారు" అంటూ యింటి యెక్కౌంటులో లీనమైన తల్లివగ్గరకొచ్చి హెచ్చరించాడు రెండో కొడుకు బాబు. తీరా శ్రీరామాయని ప్రారంభించే బడ్జెట్‌లో అధికవ్యయం అప్పుడే చిగురులు తొడుగుతోందనుకొని అయినా చేసేగిలేక ఆలోచనల్లో లీనమైంది శాంత. అనుదినం తను చదివే పత్రికల్లో ప్రభుత్వ ప్రణాళికలూ, దేశసేవికల ప్రబోధాలూ. పొదుపునుగూర్చిన ప్రచారాలూ ఆమెలోని నూతనోత్సాహాన్ని ద్విగుణీకృతంజేసి, తన కర్తవ్యాన్ని హెచ్చరిస్తున్నాయి ఎన్నో అవసర వస్తువులు కూడ అనవసరాలైకన్పించి బడ్జెట్‌లోనిషేధింపబడుతున్నాయి. మధ్యలో మళ్ళీ సవరణలు—ఛీ! "ఛీ—బజారుకని యెంతతగలేస్తున్నారు. మగవాళ్ళకు డబ్బంటే ఎంత నిర్లక్ష్యం. కూరలకని ముఫైరూపాయలే— తెచ్చేవన్నీ చప్పుపుచ్చు కూరగాయలే. పైగా తెచ్చేకూరలన్నీ ఒక్కరోజులో తగలేస్తున్నారని యింట్లో చివాట్లేయడం— కూరలబేరం చేతనైతేగదూ— పోనీ యెన్నాళ్ళలే— పెరట్లో హాయిగా కూరగాయలు కాపిస్తాగా, ఈ కొద్ది రోజులూ బజారుపని పిల్లల చేతనే చేయించుకోవచ్చు. అబ్బాయేనయం, కూరలు బేరమాడి తేగలడు". ఇలా కాచివడబోసిన ఆలోచనలతో తూచి తూచి అంకెలు వేస్తోంది బడ్జెట్‌లో........

"అమ్మగోరండీ. ఈ పాలి సంకురేతిరికి కొత్తగుడ్డ ముక్క కొనెట్టేదుకాదు. ఉగాదినాటికైన కొనెట్టకపోతే మరి సంవచ్చరమంతా పనిసేసినందుకు నాకేటి నాభం తల్లీ" అన్నది దాసిది, జీతం అందిస్తున్న శాంతనుజూచి.

"అదేమిటే రామీ, ఈ కరువురోజుల్లో కొత్తచీరెలెలా కొనివ్వగలమే? పనిలో కుదిరిన్నాడు నీకిచ్చే ఐదురూపాయిలు తప్ప యిల్లాంటి షరతులేవీ వొప్పందాల్లేవుగా. అయినా ఉన్నప్పుడు పాతకోకలు యిస్తూంటినే! రేషన్ బియ్యం చాలకపోయినా ఒక్కోపూట అన్నంకూడా పెడుతూంటినే. పైగా మధ్య మధ్య నీవెన్ని శలవులు ఉపయోగించుకున్నా జీతమైనా కొరవచేయకుండా యిస్తూంటినే. మరివేం మాటలే" విస్తుపోయి అన్నది శాంత.

"అదేటండో, అలాగంటారు? అందరూ యిత్తాండారు, మీరుకూడా యియ్యాలండి, నేకపోతే వుంకోడాన్ని సూసుకోండి. మా ఈదికో అయ్యోరొచ్చి యిదిదిలాగని సెప్పినాడండి. మీరు పన్లుసేసే యిళ్ళకాడ పెతిసంవచ్చరం కొత్తకోకలూ, పండుగినాంలు యిస్తేనే పన్లు సెయ్యండి. తిండిగింజలులేని ఈ కరువురోజుల్లో మీకెలా గడుస్తుంది? మీతరపున నేను గొప్ప మెంటోరితో మాట్లాడానికెల్తాను. మరిగంటే మీరందరూ ఏకమై నాకు బోట్లె (ఓట్లు) య్యండి. ఈ గొప్పగొప్పోరంతా మీసేత పన్లు సేయించుకొని నెలకింతని పైని కస్పీలేకుండా పారేత్తే మీకడుపుకేటి సాలుద్ది, అన్నాడండి. నిజమేనండి ఆమారాజుపెభువు సెప్పింది" అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయింది రామి. క్రితంరోజున నూరు బట్టలకు పన్నెండు రూపాయిలని చాకలి ఘర్షణపెడితే తనవీ పిల్లలవీ గుడ్డలు తనే వుతుక్కోవచ్చని సరిపెట్టుకొని భర్తగారి బట్టలు వేసేందుకే నిర్ణయించి చాకలి పేచీ సర్దుపాటుచేసుకున్న శాంతకు నేడు దాసీదానిచే పరాజయంద్వారా "మూలిగే నక్కపై తాటిపండు"లా పరిణమించినా, పొదుపును దృష్టిలోపెట్టుకున్న ఆమెకు బడ్జెట్‌లో మరికొంత మిగులు చూపినందుకు ఒకవిధంగా మనసు సంతృప్తిపడింది....

• • •

"ఒరే బాబ్జీ, ఈవేళ రేషనిచ్చే రోజుకదూ, ఈ నోట్లు మార్చి బియ్యం, పంచదారా తీసుకురా బాబూ, యిదిగో వెచ్చాలపద్దు వేసిపుంచాను- మిగిలిన డబ్బుతో అవికూడా తెచ్చిపడెయ్" అని స్కూలుఫైనల్ స్టూడెంటు 15నేళ్ళ పెద్దబ్బాయినిచూచి చెప్పింది శాంత.

# పొదుపు కోసం....

“పరీక్షలుదగ్గరపడుతున్నాయే. వార్డుకెళ్తే గంటలు నిలవాల్సొస్తుంటెలాగమ్మా, సరేలే, యిలాగే వెళ్ళొస్తాను,” అని సంచీ డబ్బూ అందుకొన్నాడు. తండ్రి చేసే బజారుపన్లు ఏసుకూడా చేయలేనా అనే విజయగర్వంతో—

“అన్నాయ్ బియ్యం తీసుకురానీ. కోమటింటి సామాన్లు నేతెస్తాలేవే అమ్మా. నేనేం బేరమాడలేనేమిటే” అని పదేండ్ల రెండో కొడుకు బాబు తన తెలివిని ప్రస్ఫుటం చేశాడు,

“వీడికేమి చేతకాదే అమ్మా. నే వెళ్ళి మంచివస్తువులవునోకాదోచూచి బెడ్డయా యిసికా లేని వస్తువులుచూచి తెస్తాను” అని కోమటింటి ప్రతివస్తువా చాటలోపోసి తల్లి విసుక్కునే అనుభవాలు తలచుకొని తన యోగ్యతను తెలియబరచింది పన్నెండేళ్ళ కూతురు జయ.

“సరే ఇద్దరూ వెళ్ళరండి. అన్నాయ్ మార్చి డబ్బులిస్తాడు జాగ్రత్తగా పారేయకుండా సామాన్లు భద్రంగా సంచీలో తీసుకురండి” అన్నది శాంత,

• • •

“ఇదేమిటిరా బాబ్జీ, యిన్నిసేర్లు తక్కువొచ్చాయి బియ్యం? సరిగా తూకం వెయ్యలేదూ— లేక తూచేప్పుడు దగ్గిరలేకుండా పోయావా?” అని బియ్యం కొలుస్తూ అన్నది శాంత,

“భలే దానివే అమ్మా, నేనేం లెక్కలు తెలియని దద్దమ్మననుకున్నావా? తూచినప్పుడు గుళ్ళు చేతిలో తిరగా బోర్లా వేసిచూచి తూపించానే. తూచిన బియ్యం ఓమూల పోసే బయటకొచ్చి కూలివాణ్ణి పిల్చుకొని, సంచిల్లో పోయించి తెచ్చాను. నీకొలత తప్పేమో మళ్ళాకొలవ్వే” అన్నాడు బాబ్జీ.

“యింకేం కొలవను తెలుస్తూనేవుంది నీమాటల్లో, బియ్యం యెలాపోయిందో. కూలివాడ్ని పిలవటానికి, వెళ్ళినప్పుడే బియ్యం తీసేసుంటారు. నీ తెలివి వాళ్ళు బాగా గ్రహించారు” అన్నది శాంత.

“మరి సంచిల్లో యెలా పొయ్యమంటావే. వెధవ తీడూ, ధూళీ నాపేంటంతా నాశనమవదూ” అంటూ తనదేమీ తప్పులేనట్లే నిరూపించాడు బాబ్జీ.

“అమ్మోయ్, చూశావా నేనెంత మిగుల్చుకొచ్చానో. ఈ పప్పులు అన్నీ చూడు, యెంత చవగ్గా తెచ్చానో” వగర్చుతూ రెండు చేతులతో సంచీ మోయలేకమోస్తూ దించి అమ్మ పొగడ్తకు యెదురుచూస్తోంది జయ.

“సామాన్ల పొట్లాలన్నీ సవరిస్తూ విప్పిచూచి, ఇదేమిటే వెర్రిపిల్లా ఈ కందిపప్పిలా నల్లగా వుందేమే, ఇంతలో ఈ పువ్వూ, యెర్రమన్నుబెడ్డలేమిటే? యింత ఛండాలంగావున్నాయి సామాన్లు. మళ్ళా ఇచ్చేసిరా” బొమ ముడిపాటుతో కూతుర్నిచూచి అన్నది శాంత. “మళ్ళా అంతదూరమెవరెళ్తారమ్మా, అడుగో తమ్ముడు రానే వచ్చాడు వాడిచేతనే వాపసు పంపు” అని చేతనున్న మిగులు డబ్బులు తల్లిచేతికిచ్చి తన్ను మెచ్చుకోలేదనే అసంతృప్తితో వుసూరంటూ కూర్చుంది జయ.

“చూడవే అమ్మా, మనం వెచ్చాలుతెచ్చే కోమటికి మరీ గర్వం పీనాసి తనం యెక్కువై పోతున్నాయే. అందుకని ఆ ప్రక్కవీధిలో యింకో కొట్టుందిలే. ఆ శెట్టి మా మంచివాడు. వాడి దగ్గరే తెచ్చాను. ఈవంటనూనె వీశ నాల్గు రూ॥ కిచ్చే మన ఖాతావాడికన్న వాడెంతో నయం, వీశ రెండు రూపాయలకే ఇచ్చాడు. “అన్నీ మాకొట్లోనే కొనండబ్బాయిగారూ” అని పిప్పరమెంట్లెన్నిచ్చాడో చూచావే” అని గుప్పిట్లో నోట్లో వున్న పిప్పరమెంట్లు చూపుతూ అమ్మయెంతో మురిసిపోతుందనేభావంతో అమ్మ నడుంచుట్టేశాడు బాబు.

“ఓస్, నీకిచ్చే కోమటివాడే మహామంచివాడేం? వెధవ చచ్చు పిప్పరమెంట్లెవరిక్కావాలి? నేతెచ్చే కొట్టువాడెంత మంచివాడనుకున్నావ్”అని పరికిణీచాటునదాచిన సబ్బుపెట్టె తీసి చూపుతూ “చూశావ్ యిట్లాంటి పెట్టెలెన్నో యిస్తానన్నాడు. మరేం ఈ పెద్ద పెద్ద మిరియాలిస్తూ “అమ్మాగారూ సంగీతాలు నేర్చుకుంటున్నారు గావాల్ను. ఈ మిరియాలు నోట్లో యేసుకోండి కంఠం ఎంతసొగసుగా పలుకుద్దో. రోజూ మా కొట్టుకాడికే రాండమ్మా, పటికిబెల్లం, మిరియాలూ కాసిని పెడుతూంటా” అన్నాడు. ఈసారి స్కూల్లో మ్యూజిక్‌లో మొంచి సంగీతం పుస్తకం ఫస్టు ప్రైజు కొట్టేస్తానం”టూ తమ్ముడు అమ్మపొగడ్త కర్హుడై పోతాడేమో అని ఏదో లోపం కనిపెట్టేందుకు చూస్తూ జయ, తెచ్చిన నూనె కొలిచేందుకు అమ్మ సమక్షంలో పరీక్షకు పెట్టిగిన్నెలో తిరగేసింది. యిద్దరి వాదాలూ వింటూన్న శాంత, గిన్నెలో నూనెచూచి “అరె, ఏమి దుర్ది

సంరా యివ్వాళ, నూనెలో నీళ్ళేమిటిలా తేలుతున్నాయి? హరి భగవంతుడా ఏమిటీ దండగలు?" అని నిశ్చేష్టురాలై పిల్లల తెలివితక్కువతనానికి నిందించుకొంది. తను చేయాలనుకున్న పొదుపునకు రెట్టింపుగా దండగలై పోతు న్నాయి. వ్యాపారస్తుల మోసానికి ఓ ప్రక్క ప్రకోపం, పిల్లల వేలతనానికి జాలీ కలిగి, ఆందోళనా హృదయాన్ని యెలానో సమాధానపరచుకొన్నది చేసేదిలేక.

శాంత వేసుకున్న బడ్జెట్ అప్పులేకుండా మిగులు కన పడకుండా కాయితంమీద అలంకారప్రాయంగా నిలిచి పోయింది. ఆలోచించి సునాయాసంగా యెన్నోపథకాలు సృష్టించేయవచ్చు. గాని ఆచరణలో చూపేసరికి ఎన్నో అనుకోని అవాంతరాలేర్పడి సమస్యలై నిలిచేస్తుంటాయి. శాంతచేతిలో పప్పు ఖాళీ అయిపోయిందేనాడో. భర్త నడగటానికి అభిమానం, మరి తను సరిపెడతానని భర్తలో కనిపించిన అనవసరపు ఖర్చులన్నీ మాన్పించేసిందిగా! మరేవిధంగా భర్తనడగడం? పొదుపునుగూర్చే ఆలోచనల పర్యవసానం శాంత హృదయంలో అశాంతి రేపింది. అయినా, పొదుపునుగూర్చే పట్టుదల ఆమెలో మూర్తీభ వించింది. ప్రతి దినం విధిగా నూలుతీయటం, క్షణం తీరిక కలితే లేసులల్లటం, కుట్టుపని చూచుకోవటం, మళ్ళీ యింటి పనీ వంటపనీ మొదలైన అన్నిబాధ్యతలూ ఆమె నెత్తినే పడడంవల్ల విశ్రాంతి లేక ఆమె శరీరం దినదినానికీ అనా రోగ్యానికి గురియై నీరసించిపోతోంది. గాని సంసార వ్యయం "నానాటికి తీసికట్టు నాగంబొట్టు"లా పరిణమించి పొదుపు తన అదుపులోనికి రాకుండా పోతుంది. యెక్క డుందీరహస్యం! గృహజీవితమే యింతలా అవకతవ కలుగాపుంటే ప్రభుత్వ ప్రణాళికలూ వాటి ఫలితాలు వెర్రి మొర్రి స్వరూపాలై నిల్చిపోతున్నాయంటే ఆశ్చర్యమేము న్నది? వ్యాపారస్తుల నీచత్వం, అధికారుల అవినీతి ప్రతి వ్యక్తిలో స్వార్థాశయాలను ప్రేరేపింపబడుటచే నిరంతరం ప్రజాజీవితాల్ని తరుముకపోతున్నాయ్. వీటి నరికట్టాలంటే ప్రతివ్యక్తిలో పరివర్తన కలిగితేగాని ప్రజాజీవితానికి భవి ష్యత్తు అంధకారమయమే! పొరుగింటి యిల్లాలు దిన దినం కాస్త కొత్తిమిరి కోసం కబుర్లు చేస్తుంది. పోనీ ఏం భాగ్యమని ఒకటి రెండుసార్లు గుప్పెడు కొత్తిమిరి పెట్టింది. గాని అడిగినవాళ్ళకంతా యెంతకనివ్వగలదు. "మా కేచాలదమ్మా" అన్నామా, "ఏం భాగ్యంతల్లీ! ధని యాలచెల్లేగడూ పెట్లో వేసుకున్నారని కాస్తంత చనువుగా అడిగాం. మహిళాసమాజాల్లో అంతంతేసి వుపన్యాసాల ద్వారా పరోపకారానికై బుద్ధులు దిద్దుతూంటారె శాస్త్ర యిటువంటి అవసరాలకు ఆచెప్పే నీతులవైపు మళ్ళదేం మనసు? యిరుగు పొరుగుల్లో యింత పినాసితనమేమి టన్నా" అంటూ బుగ్గని వేలేసుకుంటూ లెక్చెర్ కొట్టేస్తుంది. మరునాడు తెల్లారేసరికల్లా కొత్తిమిరిమడిలో ఒక్కటైనా కనబడకుండా పిల్లలచే మాయం చేయిస్తుంది. యివన్నీ కాచుకొని తిరిగే ఓపికపోతోంది శాంతకు. పొదుపుకన్ని ఎన్ని కష్టనిష్ఠూరాలకోర్చినా యిరుగు పొరుగుల్లో అనవసరమైన ఈర్ష్యలు అల్లుకుపోతున్నాయ్. పైగా గృహబాధ్యత తను తీసుకున్నదిమొదలు భర్తలో తనూహింపలేని మార్పులు గోచరిస్తున్నవి. సాయంకాలం ఆఫీసునుండివచ్చి వీధిలో కని వెళ్ళినమనిషి రాత్రి ఏ పదిగంటలకోగాని యిల్లు చేరక పోవడంచూస్తే శాంత మనస్సు మరీ గందరగోళమెత్తి పోయేది.

రామారావు ఇంటివ్యవహారాల్లో అంటీ ముట్టనట్టు ప్రవ ర్తించేవాడు. యింట్లో అవిలేవు యివిలేవు అనే అర్జీలు తప్పిపోవడంవల్లనేమో నిశ్చింతగా వుండేవాడు. గాని అతని సినీ, సిగరెట్, కాఫీ అఫర్లు మాత్రం సవ్యంగానే జరిగిపోతున్నాయ్. తనవరకూ యింటి బాధ్యతను అతి చాకచక్యంగా నిర్వహించుకపోతూన్న శాంత తెలివితేట లకు రామారావు మనస్సు ఎంతో వుప్పొంగిపోయేది, గాని దినదినానికీ క్షీణించిపోతూన్న శాంతను జూస్తే అతని హృదయం ద్రవించుకుపోయేది.

ఆరోజు రామారావు ఆఫీసునుండి యిల్లు చేరుకునేసరికి శాంత తీవ్రమైన జ్వరంతో స్పృహతప్పి పడియున్నది. చుట్టూ దీనమైన ముఖాలతో తల్లికి తెలిసీ తెలియని వుపచా రాలు చేస్తున్నారు పిల్లలు. అప్రయత్నంగా రామారావు కళ్ళు చెమ్మగిల్లాయి. వెంటనే వీధిలోకిపోయి పదిహేను నిమి షాల్లో డాక్టరుతో జట్కాదిగి లోపలికొచ్చాడు. మరేం భయంలేదని ఏదో మందురాసి ఇంజక్షనిచ్చాడు డాక్టరు. శాంతకు కొద్దిగా స్పృహ కలిగింది. యెదురుగా కుర్చీలో కూర్చున్న డాక్టర్ని, తనప్రక్క నిల్చున్న భర్తనుచూచి ఆందోళనపడిందిశాంత. డాక్టరువెళ్ళిపోయాక "ఎలావున్నది శాంతా?" ప్రేమార్ధకంఠంతో శాంత కపోలాన్ని స్పృ శిస్తూ ప్రశ్నించాడు రామారావు. "అరే, నాకేం? బాగానే వున్నదే. కాస్త జ్వరం కాస్తే డాక్టరెందుకండీ! ఈనెల

యిదో ఖర్చా! ఎంతఫీజిచ్చుకోవాలో'' అని నీరసంగా జవాబిచ్చింది శాంత. ఇంత నీరసంలోకూడా తన ఆరోగ్యాన్ని కప్పిపెట్టి యింటిబాధ్యతలతోనే మధనపడుతూన్న శాంతను చూస్తే రామారావులో ఆమె ఎదుట తనొక అల్పుడిగా, బాధ్యతారహితుడుగా యింతవరకూ జీవితంలో గడిపిన ట్టగుపడింది. శాంత ఎంతటి నిస్వార్ధురాలు! ........ "డాక్టరు ఫీజు గొడవ నీకెందుకు? కాస్త కన్నుమూసి పడుకో'' అన్నాడు భర్త. "మళ్ళా అప్పుచేశారా?" నీరస కంఠంతో ప్రశ్నించింది శాంత. "లేదు శాంతా, నీవంటి ఉత్తమ గృహిణిని బడసిన నాకు అప్పుచేసే అవసరమే మున్నది? ఈమధ్య సినీథియేటర్‌లో మేనేజింగ్ డైరక్టరుగ ఓస్నేహితునిద్వారా పనికి కుదిరాను. మరి రోజూ అయిదుగంటలకల్లా వెళ్ళి పదిగంటలకు యింటికి వస్తూండడమిదేకారణం. గృహబాధ్యత నీవు తీసుకొనుటవల్ల ఎంతో తీరిక కలిగింది. అందువల్ల పైపనిలో ప్రవేశించే అవకాశం నాకు కలిగింది. యిదిగో బ్యాంకి పుస్తకం ఈ మూణ్ణెల్లయి తెచ్చిన జీతం!....యింటిబాధ్యత నీదైతే నీ బాధ్యత నాది కదూ!" అని ఆదరాభిమానాలతో ఆమెచెక్కిలి నిమిరాడు రామారావు. శాంత దృష్టి పిల్లలవైపు పడింది. ఔన్సుగ్లాసులో పోసి మందు నోటికందించాడు బాబీ. నిసురుతున్నాడు బాబు. హార్లిక్సు కలిపినగ్లాసు పట్టుకొని అమ్మదగ్గర నిల్చుంది జయ. నీరసంగా లేవలేని శాంతను తేలికగ తన రెండు చేతులతో లేవనెత్తి తన హృదయాని కానించి కూర్చోబెట్టిన భర్తను, పిల్లలను చూడగానే ఆమె కనులనుండి ఆనందాశ్రులు రాలాయి. ''పొదుపు కోసం యెంతత్యాగం చేశావు శాంతా!" అన్నాడు భర్త.

''పొదుపుద్వారా ఒకర్నొకరు బాగా అర్థంచేసుకొని ఫలితాల్ని జయించాంకదూ!'' అనే శాంత నీరసవదనంలో చిరునవ్వు తొణికిసలాడింది.



# అనుమానం కొంపకూల్చింది

*శ్రీమతి శ్రీధర జయలక్ష్మి*

సుబ్బావధాని బాగా చదువుకున్న గొప్ప విద్వాంసుడు. యితని భార్య పార్వతి కాపురానికి వచ్చి 2 సంవత్సరము లయింది. అవధానికి 32 గుణాలలో 31 గుణాలు చాలా బాగున్నవి, కాని మిగిలిన ఒక్కటి మాత్రం పూర్తిగా పాడైంది. అది ఏమనగా, "అనుమానం ప్రాణ సంకటమన్నట్టు" యీ అనుమానమే యతన్ని సదా సర్వ కాలం వేధిస్తుంది. ముఖ్యంగా అన్ని విషయముల కంటే యితనికి భార్యయందు అనుమానం ప్రబలంగా వుంటుంది. అవధాని 40 సం॥ వయస్సులో, నల్లని శరీరచ్ఛాయ గలిగి, పెద్దతల బుర్రయు, పిలకజుట్టూ క్రూర స్వభావముగల ముఖకాంతియు, సాక్షాత్ యమధర్మరాజు లాగ వుంటాడు. పెద్ద భార్య పోయిన రెండేండ్లకి, సుబ్బావధాని నివసిస్తూవున్న గ్రామానికి 6 మైళ్ళ దూరంలో వున్న క్రొత్తపల్లి గ్రామవాసి కోటయ్యశర్మ కుమార్తె పార్వతిని పెండ్లాడాడు. కోటయ్యగారు సామాన్య వ్యవసాయదారుడు. ఎనమండుగురు పిల్లలు, భార్య, మరియు యింకా కొందరు ముసలి ముతకలు అంతా కలసి పూటకి 15 మంది భోంచేయాలి వీరియింట్లో. పాపం కోటయ్య చాలా శ్రమపడితేగాని సంసారం ఓమోస్తరుగా జరగడం కష్టం.

వీరి పెద్ద కుమారుడు మూర్తి బస్తీలో బి. ఏ. చదువుకుంటున్నాడు. అబ్బాయి చదువు పూర్తికాగానే వుద్యోగంచేసి చేతినిండా సంపాదించి పోస్తాడన్న ఆపేక్ష కొద్దీ, కోటయ్య ఎల్లాగో కష్టపడి కుమారునికి చదువుకు పైకం సర్దుతూ వుంటాడు. అల్లాంటి పరిస్థితులలో, కోటయ్య రెండవ కుమార్తె పార్వతి పెండ్లికి ఎదిగి కూర్చొని వున్నందున సుబ్బావధాని తమ గ్రామానికి దగ్గర వున్నాడనిన్నీ, గొప్ప విద్వాంసుడు గదా అనిన్నీ ఆస్థిపాస్తులుకూడా గట్టిగా 50 వేలకి తక్కువలేదనీ తెలియగా, కొంచెం వయస్సు మళ్ళినవాడైననూ అన్న వస్త్రాలకి లోటులేకుండా, పిల్ల సుఖపడుతుందని కట్నం లేకుండా పెండ్లి అయిపోతుందన్న వుద్దేశంతోటి, పార్వతినిచ్చి సుబ్బావధానికి పెండ్లి చేశాడు. పార్వతి ఎర్రగా, చక్కని అంగసౌష్టంకలిగి పద్మాలలాంటి నేత్రాలతో చూచువారికి ఒక దేవీమూర్తిలాగ వుంటుంది. బ్రహ్మఘటన ఎవరూ తప్పింప జాలరన్నట్లు సుబ్బావధానికీ, పార్వతికీ బొత్తిగా యీడూజోడూలేక కాకి ముక్కుకి దొండపండు కట్టినట్లు వుంటుంది.

అవధాని భార్య విషయములో చాలా దయగలవాడిలా వుంటూవున్నా, ఆ గ్రామవాసులందరికీ అవధాని అంటే సింహస్వప్నం. అతనికి కోపం వచ్చిందంటే త్రినేత్రుడు కూడా రెండవ పక్షమేనని వదంతి.

పార్వతి మంచి తెలివి తేటలు గలదిగనుక, భర్త హావభావములు బాగా గ్రహించి, అతనికి ఏలాటి లోటూ రాకుండా అతి జాగరూకతతో మెలగుచుండెది. ఒకటేమిటి యీ నారీ రత్నముకు యింకా తీరా 18 సం॥లైనా నిండక పోయినా, నడకయందు 30 సం॥ స్త్రీవలె, భర్త మాటయందు అనన్య భక్తి శ్రద్ధలు కలిగినదై ఉండేది.

పార్వతి కాపరానికి వచ్చిన తరువాత వీధి గుమ్మం ఏలాంటిదో యీ రెండు సంవత్సరములుగా ఎరుగదు. పార్వతి పుట్టింటివారు కూడా మూడు నాలుగుమార్లు వచ్చి పిల్లను పంపమని అడుగుతే అవధాని యిప్పుడు వీల్లేదని భార్యని పుట్టింటికి పంపేటందుకు కూడా అనుమానపడి నిరాకరించాడు.

ఒకమారు కోటయ్యగారు వచ్చి అల్లుడైన అవధానితోటి "నాయినా, మీ అత్తగారు జబ్బు స్థితిలో వుంటూవున్నది. పెద్దమనస్సుచేసి పార్వతిని పంపవలసినది. ఒక పర్యాయం తల్లీ పిల్లలూ చూచుకుంటార''ని అతి వినయంగా అల్లుణ్ని ప్రాథేయపడి అడిగేడు. ''మీరు వెళ్ళండి వీలు చూచుకొని భార్యా సహితంగా నేనే వస్తాలెండ''ని అవధాని చెప్పేడు. "మరీ సంతోషం నాయినా. మీరు ఎప్పుడు రాగలరో చెప్పితే యింటికి వెళ్ళి ఫలానా రోజు అల్లుడూ అదబడుచూ వస్తున్నారని, జబ్బు మనిషికి కాస్త వూరట కలిగేలాగు చెపుతా''నన్నాడు కోటయ్య. అవధాని కొంచెం వుగ్రుడై ''మామగారూ! ఫలాని దినం ఫలాని ఘడియ అంటూ, తిథి, వార నక్షత్రములతోసహా చెప్పమంటే నేను చెప్పజాలను. నాకు కొన్ని తొందర కోర్టు

వ్యవహారములు వున్నవి. ఆ పనులు చూసుకొని దరు వాతగాని ఏ సంగతీ చెప్పలే" నన్నాడు.

"నీమాట కాదన్నందుకు అన్యధా భావించక, యీ పూట అమ్మాయిని నాతోటి పంపు. రాత్రి మళ్ళీ తెచ్చి నీ వద్ద దిగబెట్తాను. యింట్లిప్పాటి పార్వతికోసం బెంగ పెట్టుకున్నారు. దాని తల్లికి జబ్బుతో కుమార్తెని చూడా లన్న బెంగతో మరీ కృశించిపోతూ వున్నది" అన్నాడు కోటయ్య.

"సరే మీపిల్లేగా, మీకు కావలసింది. యీ తక్షణం తీసుకెళ్ళండి. శాశ్వతంగా మీ యింట్లో పెట్టుకోండ"ని చె్రుమని లేచి వెళ్ళిపోయాడు అవధాని.

పార్వతి భర్తవైఖరి చూచి, మామా అల్లుడూ యింకా వాదులాడుకొని ఏం ముప్పువాటిల్లునో అన్న భయం కొద్దీ కండ్లనీరు గారుస్తున్న తండ్రి చెంతచేరి, "నాన్నా, ఏనాడు నన్ను వారిచేతుల్లో బెట్టావో, ఆనాటి నుండీ మీకూ నాకూ రుణం తీరిందనుకో. అనవుసరంగా నా కొరకు మీరెవ్వరూ దుఃఖించకండి. ఏనాడో మీ కడుపున పుట్టాను, యీనాడు నశించానని మనస్సు రాయి చేసుకోండి. మనం బ్రతికి వున్నా, గతించినా, కీర్తి నిలుపుకోవడమే మన ముఖ్య కర్తవ్యం. గాని మనం తిన్నది, మనం కొన్నది, మనం అనుభవించునది ఏవీ మనవెంట రావుకదా?

"యీ కోపతాపలలో, మీలో, నాలో వున్న మమత కొద్దీ మీరు నన్ను తీసుకుపోయి మీ యింట్లో పెట్టుకున్న నైన, ముందర నన్నుగురించి మీరు ఎన్ని యిబ్బందులు పడగలరో, ఆలోచించుకోండి" అంటూ హితోక్తులతోటి తండ్రిని సమాధానపరిచింది పార్వతి. కోటయ్య మౌనంగా అల్లునివద్దకు వెళ్ళి "నీదయ ఎప్పుడు రాకలిగితే అప్పుడు నీ భార్యను తీసుకునిరా. నేను వెళ్ళవస్తానని" వెళ్ళి పోయాడు.

సుబ్బావధాని చిన్నభార్య యింటికి వచ్చినప్పటినుండీ ఎంత అవసరమైన పనిపడ్డాకూడా వీధిలోకి వెళ్ళడమే మానుకున్నాడు. రోజల్లా భార్య ఎక్కడ కూర్చున్నది, ఏంచేస్తున్నది, ఏ పరపురుషుడైనా తన భార్యవైపు చూచాడా, అని కావలాకాయడంతోటే సరిపోతూవుంది అవధానికి.

సరదాగా వీరు దంపతులెప్పుడైనా తాంబూలాదులే వేసుకొనుచూ కబుర్లు చెప్పుకోవడం తటస్థిస్తే, "పార్వతీ, నిజంచెప్పు. నేనంటే నీకు యిష్టమేనా? నీవు చూస్తే పచ్చగా రామచిలుకలా వున్నావు. నేను చూస్తే మోటుబాపనిలా వున్నాను కదా. నిజంగా నీకు నేను నచ్చానా?" అని ప్రశ్నిస్తూ, భార్యవద్ద తృప్తికరంగా సమాధానం పొందుతూ సంతోషిస్తూ వుండేవాడు.

అవధాని భార్యవైపు ఒకమారు, తనవైపు ఒకమారు పరికించి చూచుకున్నప్పుడల్లా, అతనికి ఏదో తలవంపులుగా వున్నట్టువుండి. "ఛీ!, పార్వతిముందర నేనెంత అస హ్యముగా వున్నానని", తనను తాను ఏవగించుకునేవాడు.

ఇలా వుంటూ వుండగా, పార్వతి గర్భం దాల్చింది. 4 వ మాసం. ఆవిడ, తీరని కలలుకంటూ వున్నది. స్వప్నమందు తన చిట్టి చెల్లెండ్రు తమ్ములు అందరూ కలసి అమ్మ ఒడ్డిస్తూవుంటే, అందరూ సరదాగా భోజనం చేస్తున్నట్లు, తన్మయం పొందుతూ వుంటే, జాగ్రదావస్థలో ఆలాంటి వాంఛలతోటే క్రుశించి క్రుశించి పడుకుంటే కూడా, పుట్టిల్లు అక్కడి సంభ్రమములే పార్వతికి కనపడు తున్నాయి. ఎప్పుడూ తల్లి జబ్బును గురించిన్నూ, అన్న దమ్ములు అప్ప చెల్లెండ్రనుగురించీ లోలోన బాధపడుచూ వుండేది.

పురిటికికూడా పుట్టింటికి పంపక వాళ్ళఅమ్మ వచ్చి పురుడుపోసి పోవలసినదిగా ఏర్పాట్లు చేయిస్తానన్నాడు అవధాని. అందుకు ఒప్పుకున్నది పార్వతి.

ఇలా రోజులు గడుస్తున్నాయి. యింతలో -అవధాని కోర్టుపనిమీద పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. వారం రోజులు భార్యని ఒంటరిగా వదిలిపెట్టి వెళ్ళాలి. వెళ్ళక పోతే తప్పదు. అవధాని భార్యతోటి "ఏయ్, నేను కోర్టు పనిమీద వారంరోజులు వెళ్ళవలసి వున్నది. రేపు ప్రయా ణం. యింట్లో ఒక్కదానివి వుండగలవా" అని అన్నాడు.

భార్య 'వుండలేకేమౌతాను వెళ్ళండి' అని అంది. యిద్దరు పాలేండ్లను, ముసలి ఎంకిని. భార్యకి కాపలా నియమించాడు. ముసలి ఎంకితోటి అమ్మగారిని జాగ్రత్తగా చూచుకోమని మరీ మరీ చెప్పాడు అవధాని. ఆవిడ అప్పుడు పెనిమిటిని అతి దీనంగా ఒక్క కోర్కె తీర్చ మని వేడుకోగా ఏమిటో చెప్పమన్నాడు అవధాని. అప్పుడు

పార్వతి "మీరు వెళ్ళేటప్పుడు నన్ను మావాళ్ల యింట్లో దిగపెట్టి వెళ్ళండి. తిరిగి మీరు వచ్చేటప్పుడు తీసు కొచ్చెదరు. ఒక్కమారు అందర్నీ కండ్లతోటి చూచి వస్తామని ఎంతో కోర్కెగా వున్నది'' అని అన్నది.

"ఇదా యీ గొడవ ఎప్పుడూ నీకు వున్నదేగా. సరే యీ కోర్టుపని ఏమౌతుందో చూచు కొచ్చి నిన్ను తీసు కెళ్ళుతాలే", అన్నాడు అవధాని. అక్కడక్క నోరుమూసు కున్నది పాపం పార్వతి.

అవధాని వెళ్తూ వంటశాలలో వున్న పార్వతివద్దకు వచ్చి "జాగ్రత్త, వస్తాను. మావంశ మరియాదలూ, నా పరువు ప్రతిష్టలూ బాగా గ్రహించి, మెలకువగా నడుచుకో వాలి'' అనుచూ ఆవేశపూరితుడై, బుద్ధిమతులు పలికాడు భార్యతో.

భర్త పాదాలు పట్టుకొని "దయచేసి నన్ను అంతటి నీచురాలిక్రింద కట్టేసి తాము బాధపడి, నన్ను క్రుంగదీయ కండి—యీ పార్వతి, మీ గౌరవార్థమై, ప్రాణములు కూడ అర్పింపగలదు. యిదుగో మీ పాదాలు సాక్షిగా ప్రమాణం చేయుచున్నాను. ధైర్యంగా వెళ్ళి రండి" అని అన్నది పార్వతి. అక్కడికి అతని మనస్సుకు కొంత నెమ్మది కలుగగా, మెల్లగా యివతలికి వచ్చి, బండి ఎక్కాడు.

అవధాని వెళ్ళి నాలుగు రోజులు అయింది. అతని మనస్సంతా యింటిమీదే వుంది. ఒక రోజు రాత్రి 10 ఘంటలవేళ, నిద్రపోతున్న వాడల్లా పలవరించుకుంటూ లేచాడు. కలగన్నాడు—తన యింట్లో ఎవరో ఒక చక్కని 25 సం॥ వయస్సుగల యువకుడు పార్వతి తోటి ముచ్చట్లాడుచున్నట్లున్నూ, కాస్సేపటికి వారిద్దరూ గాలిలో ఎగురుతూ మేఘాల్లో కలిసిపోయినట్లూ—అగు పడిందతనికి.

మెల్లగా తలుపుతీసుకొని వీధిలోకిపడ్డాడు. క్షణక్షణానికి అతను మానవత్వం గోల్పోయి, రాక్షసత్వం పొందాడు. మెల్లగా, "ఛీః పాడు ముండ అనుకున్నంత పనిచేసింది'' అని సణుగుకొనుచూ, ఆఘమేఘాలలో కాలినడకను బైలుదేరి రాత్రి 1 ఘంట కొట్టేటప్పటికి స్వగ్రామంచేరి, స్వగృహం, పడకగది వద్దకి గబగబా వచ్చి నిలిచాడు.

గదిలోనివారికి యింకా కునుకు పట్టలేదు. సగం నిద్దట్లో వున్నవారిలాగ, మెల్లగా మాట్లాడుకొనుచున్నారు.

శీతాకాలం గనుక తలుపులు అన్నీ దగ్గరగావేసుకొని యింట్లోని వారందరూ చలికి బాగా కప్పుకొని గదులలోనే పడుకొని వున్నారు.

చావిట్లో ఎంకి మంచినిద్ర పోతూవున్నది.

పార్వతి పడుకున్న గది తలుపు అవధాని మెల్లగా నెట్టి చూచాడు. లోపల తలుపుకి ఏలాంటి ఘడియ వేసి వుండనందున, తలుపులు రెండూ కొంచెం సందు వదిలా యి. అవధాని తలుపుసందులోనుండి లోపలికి పరికించాడు. మిన్కు మిన్కుమను దీపం వెలుతురులో మంచముమీద ఒక నవయవ్వనాకారుడు, సుందర విగ్రహుడు, గోడ వైపునకు ముఖంచేసి ఒత్తిగిలి పడుకొని వున్నాడు. యివతలివైపు చాపమీద పార్వతి పండుకొని యిద్దరూ కబుర్లు చెప్పుకొనుచున్నారు.

మంచంమీది వ్యక్తి "యీమాటు ఎలాగైనా ధైర్యం చేసి నాతో వచ్చేసెయ్'' అన్న ముక్కలు అవధాని చెవిని పడ్డాయి.

అవధాని పండ్లు పటపటా, కొరికాడు. "వ్యభిచారీ" అన్నాడు. నరసింహమూర్తిలాగ తలుపు తోసుకొని చాపమీదవున్న పార్వతిమీద పడ్డాడు. అమాంతంగా వుద్రే కపూరితుడై, పార్వతి గొంతుక నొక్కి పట్టుకున్నాడు. హటాత్తుగా మీదకు ఒక బలిష్టమైన కాయం పడగానే పార్వతి హడలిపోయి అన్నయ్యా అంటూ పెద్దగా ఓ చావు కూతకూసింది.

మూర్తి వులిక్కిపడి, ఒక్క దూకు మంచంమీదనుండి దూకి, చెల్లెల్ని చేరదీస్తూ, చేంతనున్న టార్చిలైటు వెలు గున అవధాని ముఖం స్పష్టంగా చూడగలిగాడు. "నరాధ ముడా! నీవు ఒక మనిషివి అని, పిల్లను యిచ్చినందుకు, రత్నంలాంటి భార్యని పలుబాములు పెట్టుట చాలక, ఆఖరికి ఆవిడ ప్రాణాలుకూడ తీయ సాహసించావా?'' అనుచూ అవధానిమీదికి వురికి చేతిలో నున్న టార్చిలైటు తోటి అతని బుర్రమీద ఒక్క దెబ్బకొట్టాడు.

అవధాని మరణావస్థలో వున్న భార్యను ఒక్కమారు. భావమరిది మూర్తిని ఒక్కమారు తిలకించి చూచి

మతి భ్రమనొంది, "పార్వతీ" అని ఒక్క పర్యాయం వెర్రిగా రోదన ధ్వనిచేస్తూ, భార్య చెంతచేర బోయాడు. మూర్తి చెల్లెల్ని, చేరదీస్తూ, "ఛీ, పాపీ, దూరంగా వుండు" అన్నాడు.

"మూర్తి నీవు వచ్చిన సంగతి తెలియక పోయింది. క్షమించు. మీ పార్వతికి నేను అర్హుణ్ణి కాను. ఆమె దేవతా స్వరూపిణి" అంటూ, మూర్తి కాళ్ల వట్టుకొని క్షమాపణ వేడుకొన్నాడు అవధాని.

మూర్తి, మారుమాటాడక చెల్లాయికి శీతలోపచారములు సలిపి, "బావా, ఓ బండీ సిద్ధపరుచు. ఆఖరిదశలోనైనా, తల్లీ పిల్లల్నీ ఒక్కమారు ముఖాలు చూచుకొనేందుటకు, అవకాశం కలుగజేయి" అన్నాడు.

పార్వతి హీనస్వరమున "అన్నయ్యా నేను ఎలాగూ బ్రతుకను. ఒంటరి మనిషి మీ బావగార్ని ఏలాటి చిక్కులు రాకుండా కనిపెట్టుచూ వుండు" అని, "నాకు యీ 'బందీఖానా' లాంటి జీవితంకంటే, వారి చేతులార ముక్తి సామ్రాజ్యము పొందగలందుకు చాలా సంతోషించుచున్నాను" అన్నది పార్వతి.

అవధాని ఖిన్నుడై బండీ సిద్ధపరచాడు. మరియు పొంగి వస్తున్న దుఃఖం ఆపుకో జాలక భార్యవద్దకి వచ్చి, "పార్వతీ, పార్వతీ" నన్ను క్షమించు నా అనుమానం నా కొంపతీసింది అన్నాడు.

పార్వతి భర్త పాదాలు కండ్లనద్దుకొని "మీరేమీ చేయలేదు. నా విధికి ఎవరు అడ్డు రాగలరు ? దయవుంచండి వెళ్ళి వస్తాను" అని అశ్రుబిందువులతోటి, భర్త పాదాలు తడిపివేసింది, యింతలోకి మూర్తి తొందర పడగా బండిలోకి, బావమరదులు యిద్దరూపట్టి పార్వతిని పడుకోబెట్టారు. వెంటనే ఆమెకు స్మృహ తప్పి పోయింది.

కాళ రాత్రియందు భూమ్యాకాశములు విరిగి నెత్తిన పడినట్లు వున్నది. ఆఘమేఘాలలో బండి పరుగెత్తుచున్నది. క్షణాని కొకతూరి మూర్తి పార్వతి ముక్కు దగ్గర చేయివుంచి, శ్వాసనాడులు పరికించుచూ వున్నాడు. పార్వతికి మెల్లగా శ్వాస ఆడుచూ వున్నది.

వేకువఝామున నాలుగు కొట్టేప్పటికి బండి మూర్తి స్వగృహం చెంత ఆగింది. అతను తలుపు తట్టగా తండ్రి వచ్చి తలుపు తీశాడు. జరిగిన ప్రమాదం సంగ్రహంగా కొడుకునుండి విని కోటయ్య దుఃఖాక్రోశములతోటి తత్తరపాటున పార్వతినిచూచి పరితపించాడు. తండ్రీ కొడుకులు యిద్దరూ అద్దాలమీద పార్వతిని తెచ్చి యింట్లో పరుండ బెట్టారు.

పార్వతితల్లి కుమార్తె చెంతచేరి విలపించుచూ "అమ్మా నా కన్న తల్లీ నేనూ, మీఅమ్మని. నాతో పలుకు తల్లీ' అంటే కుమార్తెకుపోయిన ప్రాణములు లేచి వచ్చాయి. కండ్లు తెరచి తల్లిని చూచి, "అమ్మా" అని పెద్దకేక పెట్టి తల్లిని కౌగలించుకున్నది. అలా ఎంతకాలం గడిచిందో యిరువురూ ఒళ్ళుమరచారు.

15 రోజుల తర్వాత పార్వతికి ఒంట్లో కొంచెం స్వస్థత కలిగింది. వేసవికాలం కోటయ్యగారి యింటిడాబామీద చల్లగాలికి పక్కలు వేసుకొని పార్వతి, అవధాని మరియు అవధాని చిన్న మరదలు "లక్ష్మి" పడుకొని కబుర్లు చెప్పుకొనుచున్నారు.

"చేతులార నిన్ను పొట్టను బెట్టుకోబోయ్యాను. ఎంతటి పాపిని ?" అన్నాడు అవధాని.

"దయయుంచి యిక ఆనాటి చెడుకబుర్లు తేకండి. అన్నీ ఒకందులకు మంచికే" అన్నది పార్వతి.

మూర్తి మేడమెట్లు ఎక్కుచూ, "చెల్లాయి, మూర్తి డాబామీదికి వస్తున్నాడు. అన్య పురుషుడెవరోనని బావగారు కంగారుపడగలరు సుమా ?" అన్నాడు. "అవునన్నయ్యా, బావగారికి నిన్ను చూస్తే బలేకోపం" అన్నది పార్వతి అందరూ నవ్వుకున్నారు.



# ఆంధ్ర సర్వోదయ సంఘము

## తిరువూరు : కృష్ణా జిల్లా

* శ్రీ నరసింహదేవర సత్యనారాయణ *

ఆంధ్ర సర్వోదయ సంఘమను పేరుతో కృష్ణాజిల్లాలో తిరువూరు గ్రామమున మహాత్ముడు దలపెట్టిన నూతన విద్యావిధానము (Basic education) అమలులో పెట్ట బడుచున్నది. భారత సేవక సమాజము తరపున కృష్ణా జిల్లాలో ప్రచారము చేయుచు 13-10-52 తెదీని యీ సంస్థను సందర్శించు భాగ్యము నాకు కల్గినది.

బెజవాడ పట్టణమునకు తిరువూరు యేబది మైళ్లదూర మున నున్నది. బెజవాడ నుంచి తిరువూరుకు మంచి రహదారికలదు. రాకపోకలకు బస్సు సౌకర్యమున్నది. 13 వ తేదీ ఉదయమున మదరాసు నుండి బెజవాడ మెయిలులో దిగి సరాసరి కారులో 10 గంటలకు తిరువూరు వెళ్ళి సర్వోదయ సమాజము వారి వివిధ కార్య ప్రణాళికలు పరిశీలించితిని. తిరువూరు గ్రామమునకు సమీపముననే యీ సంఘమువారు మంచి మామిడితోటతో కూడిన చక్కటి భవనమును సంపాదింప గల్గిరి. ఈ భవనమును స్థానిక జమీందారువద్ద కొని వీరు యీ ప్రదేశమును చక్కని ఆశ్రమవాటికగ తయారు చేసిరి. ఇందు 125 మంది స్త్రీలు హయ్యర్‌గ్రేడ్, సెకండరీ గ్రేడు, బేసిక్ విద్యావిధానములో ఉపాధ్యాయినులుగ తరిఫీదగుచున్నారు. ఈ తరిఫీదు కాలము రెండు సంవత్సరములు. ఈ యాశ్రమవాటికలోనే అందరి నివాసమును. వంట అందరును కలసి వంతులు ప్రకారము తయారు చేసుకొని యిక్కడనే భుజించి యిచ్చటనే విశ్రమింతురు.

శ్రీమతి యర్నేని దమయంతి B. Sc., B. Ed., గారు యీ సంస్థ నిర్మాతలు. వీరి ఆధ్వర్యమున యీ పాఠశాల నిర్వహింప బడుచున్నది. ఈ పాఠశాలకు కుమారి ఆర్. లీలావతి.B. A., B. T., గారు ప్రధానోపాధ్యాయిని, శ్రీమతి రుక్మిణమ్మగారు B. A., B. Ed , సహాయోపాధ్యాయిని, మరి యిరువురు ఉపాధ్యాయులు వీరికి స్కూలు వ్యవహారములలో తోడ్పడుచున్నారు.

ప్రాతఃకాలము 5 గంటలతో యీ స్కూలు లోని విద్యార్థినుల కార్యప్రణాళిక ప్రారంభ మగును. ప్రాతః కాలకృత్యములు తీర్చుకొనిన తోడనే ఆరుగంటలకు ప్రార్థన, జాతీయపతాకవందనము ముగించుకొని రెండు గంటలసేపు వీరందరు పొలము పని చేయుదురు. ఏతాము ఎత్తి నీరు కట్టెదరు. భూమి చదును చేసెదరు. గట్టుపుట్ట కట్టెదరు. మంచి ఎరువులువేసి ఆశ్రమ వాసులకు కావలసిన సర్వ విధములైన కూరగాయలు, తోటపైరులు పండించి ఆశ్రమమునకు సరఫరా చేయుదురు. 8,9 గంటల మధ్య ప్రాతఃకాల భోజనము చేసినపిమ్మట రెండు గంటలు వీరు రాట్న పరిశ్రమకు సంబంధించిన వివిధ కార్యకలాపములలో అనగా పత్తిగింజలు తీయుట, దూది యేకుట, యేకులు తయారు చేయుట, రాట్నము మీద వడకుట, నూలు పడుగు చేయుట, బట్టలు నేయుట, అద్దకము వేయుట మొదలగు వస్త్ర పరిశ్రమయందు తరిఫీదు నొందెదరు. పిమ్మట 11 గంటలు మొదలు, వంటచేసికొనుట, భోజనము చేయుట, విశ్రాంతియుండును. మరల మధ్యాహ్నము 2 గంటలకు శాస్త్ర పాఠములు, చర్చలు, వడ్రంగము, కుట్టుపని, యిత్యాది వివిధ కార్య కలాపములందు నిమగ్నులయ్యెదరు. ఆశ్రమ వాసులకు కావలసిన పాలు, పెరుగు, నెయ్యి కొరకు పశుగణమును వీరే పోషించి తమకు కావలసిన, పెరుగు, నెయ్యి మజ్జిగ పరిశుభ్రముగ చేసికొందురు. ఈ కార్యకలాపములో గృహ నిర్వహణమునందు వీరికి మంచి తరిఫీదగుచున్నది. ఈ కార్యాచరణద్వారా, శాస్త్ర బోధనముద్వారా, విజ్ఞానవికాసము కల్గుచున్నది. ప్రతి వ్యక్తియు స్వయంపోషణ చెసి కొను టకు యెట్టితరిఫీదు కావలసియున్నదో, అది ఈపాఠశాలలో ఆ దర్శముగ నేర్ప బడుచున్నది. ఆంధ్రదేశములో నడి గడ్డమీద స్వార్థత్యాగముతో నల్గురు వనితలు ఉన్నత విద్యలో ఉత్తీర్ణులై నిరాడంబరముగ సర్వోదయ విజ్ఞానవ్యాప్తి చేయుట యెంతయో ప్రశంశనీయము,

ఈ సర్వోదయ సంఘమువారు స్త్రీల తరిఫీదు కొరకు యీ శిక్షణ కేంద్రముతో పాటు Basic education వ్యాప్తికొరకు 1 వ తరగతి మొదలు 8 వ తరగతి వరకు పాఠశాల యొకటి నిర్వహింప బడుచున్నది. ఇందు రెండు

వందల మంది బాల, బాలికలు విద్యాభ్యాసము చేయుచున్నారు. మరియు పురుషులకు ప్రత్యేకముగ గ్రామమునకు మైలు దూరములో విశాలమైన ప్రదేశముతో Basic education training centre నిర్వహించుచున్నారు. ఇందులో 40 మంది పురుషులు తరిఫీదు నొందుచున్నారు. వీరికి బసలు, భోజనములు యీ ప్రదేశములోనే యేర్పాటు చేయబడును. పురుషులకు యిదొక యాశ్రమ వాటిక. యిచ్చటనే పిల్లల కింకొక పాఠశాల 5 వ తరగతి వరకు నిర్వహింప బడుచున్నది. తరిఫీదగు విద్యార్థులకు విద్యతో పాటు వ్యవసాయ వృత్తి ఆదర్శకముగ నిర్వహించుటకు 80 ఎకరముల భూమిలో వ్యవసాయము చేయబడుచున్నది. ఇది అంతయు మెరక ప్రదేశము. కాలువ నీటి సరఫరాలేదు. ఈ సంస్థ నిర్వాహకులు నూతులు త్రవ్వించి యీ నీటిద్వారా వ్యవసాయము చేయుచున్నారు. దైవకృపవల్ల రెండు మూడు నిలువుల లోతుననే మంచి నీరు నూతులలో లభ్యమగుచున్నది. ఈ జలాధారము మూలమున ఆశ్రమమునకు కావలసిన పాడి, పంట సమృద్ధిగ నుత్పత్తి చేసుకొనుచున్నారు.

ఆశ్రమము స్వయంపోషకమగుటకు విద్యార్థులందరు కాయ కష్టపడి కృషి సల్పుచున్నారు. ఇట్టి యాదర్శక విద్యాలయములు ఆంధ్రదేశమున కెన్నియో కావలసియున్నవి. ఈ విద్యాలయములలో తరిఫీదు నొందిన స్త్రీ పురుషులకు పరాధీనతలేక, స్వయంపోషకత్వమున కుపాధి యేర్పడుచున్నది.

నేడు పాఠశాలలలో తరిఫీదగు విద్యార్థులు బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలనము క్రింద గుమాస్తాలుగా పనిచేయుటకే యుపయోగ పడుచున్నారు. కాని స్వయంపోషకత్వము కలిగి స్వతంత్ర పౌరులుగా జీవించుట కవకాశము కలుగుట లెదు. దేశాభ్యుదయము గోరు ప్రభుత్వము, ప్రజలకై యిట్టి బేసిక్ విద్యాలయములను దేశమంతట వ్యాప్తి చేసినపుడే, బానిసత్వము వదలి స్వయంపోషకత్వము లభించగలదు.

తిరువూరులో ఆంధ్ర సర్వోదయ సమాజము తరపున నిర్వహింపబడు విద్యాలయములు విజయ వంతమగుటకు ప్రధాన హేతువు స్వార్థత్యాగముతో దేశహితార్థము పాటుబడు ఐచ్ఛిక సేవకుల స్వయంకృషి. ఇందు మూలముననే వీటికి ప్రఖ్యాతి కల్గినది. కేవలము జీతము కొరకే పని చేయు ఉపాధ్యాయులైనచో నిట్టి యభివృద్ధి కల్గుట సాధ్యము కాదు. యీ పాఠశాల నిర్వాహకులగు కుమారి యర్నేని దమయంతిగారు, కుమారి లీలావతిగార్ల సేవ, ప్రశంసనీయము. వీరి యండనుండె సర్వ విధముల తోడ్పడుచున్న శ్రీ బుచ్చిరాజుగారి త్యాగసేవాపరాయణత ప్రశంస నీయము. ఇట్టి సేవాపరాయణులి సంస్థకు లభించుట యీవిద్యార్థుల యదృష్టము.

ఈ పాఠశాల నిర్వహింప బడు ప్రదేశము చాల ఆకర్షణీయ మగుచున్నది. ప్రకృతి రామణీయకమైనది. ప్రాచిన కాలపు ఆశ్రమ వాటికలను మరపించుచున్నది. వీరి యాదర్శక జీవనము, స్వయంకృషి, నిరాడంబర కార్యకలాపములు. గ్రామవీటికలందు ప్రాచీన శాంతి సుఖ జీవనమునకు దోహదమొసగును.

ఈ సర్వోదయ సమాజము వారు అచిరకాలములో వ్యవసాయ పురోభివృద్ధికి నూతులలో యింజనులు పెట్టి, జలాధారము పెంపొందించి యాదర్శక వ్యవసాయ కేంద్రము వృద్ధిపరుప నైయున్నారు. కోళ్లు, తేనేటీగ కుటీర పరిశ్రమల పెంపొందింప దలచియున్నారు. కమలా నెహ్రూ పేరట మాతా శిశుసంరక్షణ కేంద్రము స్థాపించి, గ్రామసేవికలను తయారుచేసి, ఆరోగ్య వ్యాప్తికి సర్వోదయ ఆరోగ్య కేంద్రములను నిర్వహించ దలచుకొన్నారు. పరిసర ప్రాంతములలొ వయోజన విద్యావ్యాప్తికి సంచార గ్రంథాలయములు, పఠనమందిరములు, రేడియో ప్రసారములు చేయదలచు కొన్నారు. ఉపాధ్యాయులకు, విద్యార్థులకు విశ్రాంతి కొరకు, ఉద్యానవనము, ప్రార్థనామందిరము నిర్మాణము చేయదలచి యున్నారు. సహకార పద్ధతులపై గ్రామజీవనము చేయుటకు ఆదర్శక గృహనిర్మాణము చేయదలచి యున్నారు. ఒక సహకార కోలనీ (ఆదర్శక గ్రామ) నిర్మాణము చేయదలచినారు. వీరి కార్యోత్సాహము యెంతయు ప్రశంశనీయము. ఈ ఆశ్రమవాటిక ప్రక్కనే ఒక శెలయేరు ప్రవహించు చున్నది. ఈ చిన్ని నది వీరు నిర్మించ బోయెడు ఆదర్శక గ్రామమునకు క్రొత్త శోభ నీయగలదు.

అచిరకాలములో వీరు సంకల్పించిన కృషి ఫలించి, సర్వోదయ ఆదర్శక గ్రామము వెలయనభిలషించుచున్నాను. ఈ యాశ్రమ వాసులెల్లరు భారత సేవక సమాజములో సభ్యులగుటకు తమ యభీష్టమును వ్యక్తపరచిరి. కుమారి




# అమృతాంజనము

గాని,

" యథాయథా................రాశీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

## ఆంధ్ర సర్వోదయ సంఘము

దమయంతిగారు ఆంధ్రప్రదేశ భారత సేవక సమాజ కార్య నిర్వాహక సభలో సభ్యురాలుగ నియమింపబడిరి. ఉత్తమ భారత సేవక సమాజ ధర్మమును ఆదర్శక పూర్వకముగా, వీరు ఆచరణయందు వివిధకార్య కలాపముల ద్వారా తమ యుత్తమ సేవను ప్రకటించి ధన్యులయ్యెదరు గాక! ఇట్టి ఆదర్శక సేవాపరాయణతయే భారత సేవక సమాజాశయము.



చిత్రసమీక్ష

### పీపుల్స్ ఆర్టు ప్రొడక్షన్స్ వారి ప్రథమ చిత్రం

# "పల్లెటూరు"

ఈ చిత్రం 13-10-52 తే. ఆదివారంనాడు చిత్రా టాకీసులో "ప్రెస్ షో" ప్రదర్శించబడింది.

దర్శకుడు—టి. ప్రకాశ రావు, నిర్మాత—పి. శివ రామయ్య, రచన—సుంకర, వాసిరెడ్డి సంగీతం—ఘంటసాల, నిర్వహణ. ఎం. ఎస్. చౌదరి. ఆర్. డి. ప్రసాద్. తారాగణం—ఎస్. వి. రంగారావు, ఎన్. టి. రామారావు, కోడూరు అచ్చయ్య, నాగభూషణం, రమణారెడ్డి, చదలవాడ కుటుంబరావు, సావిత్రి, టి. జి. కమలాదేవి, శేషమాంబ, కొమ్మూరి పద్మావతి, బేబి కృష్ణవేణి మొదలగువారు.

కథాంశం:—గ్రామంలో పేరు ప్రతిష్ఠలున్న పెద్దమనిషి సాంబయ్య, పేదరయితు బిడ్డ అయిన చంద్రం యిరువురూ యిరుగు పొరుగున నివసించేవారు. ఇరుగు పొరుగు కుటుంబాలు కావటంవల్ల సాంబయ్య కుమార్తె సుగుణకు చంద్రయ్య అంటే అపరిమితమైన యిష్టం. అందుచే యిద్దరూ అన్యోన్యంగా వుండేవారు. చంద్రం నవీన భావాలుగల ఆదర్శ యువకుడు. ఆ వూరి షావుకారు గణపతి ధనమదాంధుడై, ముందు వెనుక గానక అబలలైన స్త్రీలను బలాత్కరించుట, బీదరైతుల కడుపులు కొట్టి ధాన్యం నల్లబజారుల్లో అమ్ముట మొదలు గాగల పనులు చేసేవాడు. వీనికి తోడు పినతల్లి కుమారుడు శంకరం, స్నేహితుడు కొండయ్య. చంద్రయ్య ఆదర్శాలేవీ వీరికి నచ్చేవికావు. చంద్రం ఏపని చేయాలన్నా అతనికి వ్యతిరేకంగా వెళ్లేవాడు గణపతి. ఒక రోజు ఆ వూరికి బాలయోగి వస్తాడు. వూరి అవతల అతనికి బస ఏర్పాటుచేసి, అందరూ వస్తూ పోతూ వుంటారు. గణపతి అక్కగారైన పిచ్చమ్మతో కొండయ్య భార్య శాంత కూడా వస్తుంది. ఆమెను ఏలాగైనా చెర పట్టాలని చూస్తాడు గణపతి. మరునాడు శాంత తన యింటికి రాగా ఆమెను గదిలో బంధించి బలవంతం చేస్తాడు. శాంత ఏలాగో విడిపించుకుని ప్రాణాలతో బయట పడుతుంది. ఈలోగా కొండయ్య తన భార్య శాంత రాలేదని పిల్చుకొస్తానని చెప్పి గణపతి యింటి మీదుగా వస్తూండగా శంకరం అడ్డగించి, శాంతకు చంద్రానికీ సంబంధం వున్నదని చెపుతాడు. ఆ వుద్రేకంతో ఇంటికి వచ్చి శాంతను చితకదన్ని యింటి నుంచి తరుముతాడు కొండయ్య. శాంత చంద్రంకు మేనమామ కూతురు. దిక్కు లేక మేనత్త యింటికి చేరుకుంటుంది.

ఇంతలో తాతలు చేసిన అప్పు తీర్చమని, దానికి బదులు గొడ్లను తోలుకొని పోడానికి వచ్చిన శంకరం సుగుణను చూచి గణపతికి పురి ఎక్కిస్తాడు. ఏలాగైనా పాచికవేసి సుగుణను పెళ్లాడాలని, సాంబయ్యను పిలిపించి మంచి మాటలాడి, సుగుణను గణపతికి చేయడానికి సాంబయ్య దగ్గిర మాట తీసుకుంటారు. కాని సుగుణ ఒప్పుకోదు. విధిలేదంటాడు తండ్రి. శాంతతో వుంటూ, ఆమెను తెచ్చి యింట్లో పెట్టుకున్న పశువు మాలినవానికి తన కూతుర్ని యివ్వనని పెద్దగా అరుస్తాడు.

(44-వ పేజీ చూడండి)

# శీలము పెంపొందించుట — పిల్లల తర్ఫీదు

* శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ *

నేటి బిడ్డలే రేపు దేశమును పాలించే పరిపాలకు లగుచున్నారు. ఒక పెద్ద దేశముయొక్క బాధ్యతనంతను వహించి పాలించబోయే ప్రభువులు ప్రజల క్షేమమును, దేశక్షేమమును కాపాడవలసిన పాలకులు ఉత్తమోత్తమమైన గుణములను, యోగ్యతలను గలిగియుండుటత్యావశ్యకము. ఒక దేశముయొక్క గౌరవోన్నతులు, ఆదేశ ప్రజలయొక్క నడవడి, యోగ్యతలమీదనే ఆధారపడి ఉంటుంది. పరదేశ ప్రభుత్వముక్రింద బానిసలుగానుండి బాధ్యతలు, విధ్యుక్త ధర్మములు నెరుగకుండ దీనులై జీవచ్ఛవములవలె పడియుండే ప్రజలేలాయున్నా నష్టములేదు, కాని, తమ దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించుకొని ఆ స్వాతంత్ర్యమును శాశ్వతముగా నిలుపుకొనుచు, తమ దేశ గౌరవమును కాపాడు కొనుటతో మాత్రమే తృప్తిపడక, తమదేశమును, జాతిని ప్రపంచమంతటికి ఆదర్శప్రాయముగా నుంచదలచిన జాతి, సామాన్యులుగా హీనగుణములు కలిగి, స్వార్థపరులై యుండిన నది దేశ ప్రజలకూ దేశమునకూ చాలా నసర్థదాయకము. కష్టపడి సంపాదించుకున్న స్వాతంత్ర్యమునిలుచుటకూడ దుర్ఘటము

ఈ సంగతిని గుర్తెరిగి ప్రతివారు తమ బిడ్డల శిక్షణ విషయములో నెక్కువ జాగ్రత వహించుటత్యవసరము. బిడ్డయొక్క శారీరిక, మానసిక, నైతికాభివృద్ధి తల్లి గర్భములో నున్నప్పుడే ప్రారంభమగును. ఈ విషయమై మన కనేక పౌరాణిక కథలేగాక శాస్త్రములుగూడ దృష్టాంతరముల నిచ్చుచున్నవి. తండ్రి యెంత దుర్మార్గుడు, క్రూరుడు, భగవద్విరోధియైనా గర్భవతిగా నున్నప్పుడు లీలావతి నారద మహామునివలన భగవంతుఁడు, భక్తి, నీతి మొదలగు సత్కథలు సద్బోధలు వినుటవలననే భగవద్భక్తుడు, శాంతమూర్తి, పరమయోగ్యుడు నగు ప్రహ్లాదుడు కలుగుటకు కారణమైనది. అభిమన్యుఁడు తల్లిగర్భములో నున్నప్పుడే తండ్రియైన యర్జునుడు భార్యకు చెప్పిన పద్మవ్యూహ రహస్యములను వినినట్లును, పుట్టి పెరిగి పెద్దవాడైన తరువాత తండ్రివలన దాని పూర్తిరహస్యములను తెలిసికొనుటకవకాశములు లేకపోయినను ఎవరికీ సాధ్యముకాని యా పద్మవ్యూహములో నతఁడు ప్రవేశించి శత్రువుల చండాడినట్లును కథలు దెల్పుచున్నవి. శాస్త్రములు కూడ, శిశువు గర్భములో నున్నప్పుడు తల్లులెట్టి యాలోచనలతో, నెట్టి స్వభావములతో నుందురో అట్టి బిడ్డలే పుడుదురని తెల్పుచున్నవి. అందుకనే గర్భిణీస్త్రీలు భయంకరమైనట్టియు, నసహ్యాకరమైనట్టియు, విచారకరమైనట్టియు దృశ్యములను చూడకూడదనియు, నట్టిమాటలను వినకూడదనియు, వారెప్పుడూ ఆరోగ్యముగను, దారుఢ్యముగను, ఎప్పుడూ సంతోషముగను మంచి యున్నతమైన యాలోచనలు, కోరికలు కలిగి యుండవలయుననియు మన పెద్దవాళ్ళు చెప్పుదురు.

దేశమున కుత్తమోత్తమ నాయకులను సమర్పించి దేశౌన్నత్యమును కోరెడి తల్లులు, మంచి విద్యావతులు, విజ్ఞానవంతులుగను, దేహారోగ్య దారుఢ్యములుగలవారుగను, ఉన్నతాశయములు, భావములు కలవారుగను నుండుటత్యావశ్యకము. విద్యావిహీనులు, మూర్ఖులు, దీనురాండ్రు స్వేచ్ఛయననేమో, స్వాతంత్ర్యమననేమో కొంచమైన నెరుగనివారు, అర్భకులు, అనారోగ్యులు నగు తల్లుల గర్భమునుండి వీరులు, శూరులు, యోగ్యులు నగు బిడ్డలు జన్మించుటసంభవము.

బిడ్డ పుట్టిన తర్వాత ఆ బిడ్డకు తలిదండ్రులు, పాఠశాలలో ఉపాధ్యాయులు ఇచ్చే శిక్షణ ననుసరించి, వారి వారి పరిసర వాతావరణముననుసరించి వారి జీవిత పథ మేర్పడుతుంది.

బిడ్డయొక్క జీవిత సౌధ నిర్మాణమునకు పునాది వేయువారు తలిదండ్రులు. ముఖ్యముగా కట్టడము యొక్క బలము పునాది మీదనే యాధారపడియుంటుంది. కట్టడము మంచి బలము కలిగి చాలాకాలముండవలయునని కోరువారు పునాది విషయములో కడు జాగ్రత్త తీసికొందురు. మానవునియొక్క యభివృద్ధి శారీరిక మానసిక నైతికాభివృద్ధులపై నాధారపడి యుండును. ఇందేది లోపించినను అది పూర్తియైన యభివృద్ధి కానేరదు. "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" అన్నారు పెద్దలు. మొదటిది శరీరము. శరీరమారోగ్యవంతముగను, దృఢముగను నున్ననే తప్ప అందున్నతాశయములు, యోగ్యతలు ఉండుటకవకాశముండదు.

# శీలము పెంపొందించుట — పిల్లల తర్ఫీదు

మన దేశములో పరిశుభ్రత చాల తక్కువ. చాల మంది ప్రజలు పరిశుభ్రత యను మాటయే యెరుగనివారి వలె నుందురు. అపరిశుభ్రత నానాటికీ చాలా అసహ్యంగా పెరిగిపోతోంది. దానిని రూపుమాపాలంటే పసితనము నుండియు బిడ్డలకు పరిశుభ్రమైన అలవాట్లను నేర్పాలి. అపరిశుభ్రమనునది చూచుట కసహ్యకరముగా నుండు టయేగాక, ఆరోగ్యమునకు భంగకరము. తల, గోళ్ళు, పళ్ళు వగైరా శుభ్రముగా నుంచుకొనుట, ఎక్కడి వస్తువుల నక్కడ చక్కగా పెట్టుట, మొదలైనవాని కభ్యాస పడునట్లు చూడాలి. పరిశుభ్రమైన నీటినేగాని యేమాత్ర మపరిశుభ్రముగానున్నను ఆ నీటిని త్రాగకుండుట, వీధులలో అమ్మే కానీ కానీ షోడానీళ్ళు, సైడు కాలవలప్రక్క తయారుచేసే కాఫీ, టీ మొదలైనవి త్రాగకుండునట్లును, పరిశుభ్రముగా మంచి వస్తువులతో తయారుచేసిన పదార్థములనే తప్ప ఏ చెత్త పడితే ఆ చెత్తతినకుండునట్లును చూడాలి. పిల్లలకు పిల్లలే యననేల పెద్దలకు కూడా యింటినీ, ఆవరణను ఎట్లు శుభ్రముగా నుంచుకోవాలో తెలియదు. ఎక్కడ పడితే అక్కడ కాగితపు ముక్కలను చింపిపోయుట, చెత్తను వేయుట, ఉమ్మి వేయుట అలవాటు. ఆ దురభ్యాసములు లేకుండ వాటిని శుభ్రముగా నుంచునట్లు చూడాలి. బిడ్డలు తాము బలముగా, ఆరోగ్యముగా నున్ననే తప్ప ఎందుకూ పనికిరామనియు, ఏ ఘనకార్యమూ చేయలేమనియు వారే గ్రహించి బాగా శరీర మలసిపోవునట్లు ఆటలాడుచుండవలయును. ఆరోగ్యవంతులై దృఢకాయలుగానున్న బిడ్డలెప్పుడూ చిద్విలాస స్వరూపులై యుందురు, అధైర్యముండదు. సాహసకృత్యములను చేయుచుందురు. వారినడ్డుపెట్టి కొప్పడి నిరుత్సాహవంతులను చేయకూడదు, సాహసకార్యములను చేయునప్పుడును, అల్లరిచేయునప్పుడును, వారికి హాని కలుగకుండునట్లును, వస్తువులను వేటినీ పాడుచేయకుండునట్లును చూచుచు వారికి ప్రోత్సాహ మొసంగు చుండవలయును. బిడ్డలు ప్రతి పని తాము స్వతంత్రముగా చేసికొనవలెనని కోరుదురు. సాధ్యమైనంతవరకు వారి స్వాతంత్ర్యమునకును, స్వేచ్ఛకును అడ్డు రాకూడదు. అలా అడ్డు వచ్చిన యెడల పెద్దవారైన తరువాత వారేపనియు స్వతంత్రముగా చేసుకొనలేని అసమర్థులుగా తయారగుదురు.

బిడ్డ లెప్పుడునూ విచారము, దీనత్వము, నిరుత్సాహము, అసంతృప్తిలేనివారై యుత్సాహ పూరితులు, చిదానందస్వరూపులు తృప్తిగలవారుగా ఉండునట్లుచూడవలెను.

బిడ్డలకు గొప్ప గొప్ప వ్యక్తులు, దేశభక్తులు, స్వార్థత్యాగులు, సత్యసంధులు, మహాకవులు మొదలగు వారి యొక్క కథలను, భారత రామాయణముల నుండి మహాపురుషుల యొక్క గాథలను చెప్పుచు బిడ్డలలో స్వయం సహాయము, ఆత్మగౌరవము, నిజమైన దేశభక్తి, స్వార్థత్యాగము, గుణగ్రహణ పారీణత, ఇది మంచి యిది చెడ్డ అని స్వానుభవము వలననే తెలిసికొనుట, పట్టుదల, కార్యదీక్ష, ఏకాగ్రత, ఆడినమాట తప్పకుండుట, ఆత్మవిశ్వాసము, ఉదారాశయాలు మొదలగు గుణములు బిడ్డల కలవడునట్లు చూడాలి.

పిల్లలు ఏదైన తప్పుపనులు చెడ్డపనులు చేసినప్పుడు వెంటనే వారా పనిని చేయుటవలన కలిగే నష్టమును వారికి ఉదాహరణముల మూలకముగా నేర్పుతో చెప్పి మాన్పవలయునుగాని, పిల్లలే కదాయని నిర్లక్ష్యముగా నూరుకొనరాదు. అలా ఊరుకొనిన యెడల పెద్దవారైన తరువాత వాటిని మాన్పుట కష్టము. బిడ్డలు చేసే స్నేహములు, వారాడే ఆటలు జాగ్రత్తగా కనిపెట్టి చూచుచుండవలయును.

పరదేశ ప్రభుత్వము క్రింద కొన్ని వందల సంవత్సరములు బానిసలుగా పడియున్న మన దేశీయులకు ఒక స్వతంత్ర దేశములోని స్వతంత్రులైన ప్రజలకు తమ దేశమును, జాతిని రక్షించు కొనుటలో, వాని నుచ్ఛస్థితికి గొని వచ్చుటలో తమకు గల బాధ్యతల నెట్లు నిర్వహింపవలయునో తెలియక తమ విధ్యుక్త ధర్మముల నెట్లు నెరవేర్పవలయునో తెలియక తామవస్థ పడుటయేగాక దేశమునకు తీరని కష్టనష్టములను తెచ్చిపెట్టి పరిహాస పాత్రులగుచున్నారు. ఈ విషయములో నెక్కుడు శ్రద్ధ తీసికొని బిడ్డలకు చిన్నతనమునుండియు ఖచ్చితమైన శిక్షణ నిచ్చుటత్యావశ్యకము.

గృహములో తలిదండ్రులు, పాఠశాలలలో గురువులు, బయట సంఘము కొంచెమేనియు పొలుమాలిక లేక భావి పౌరులు, దేశనాయకులు, పాలకులు ప్రభువులు కాబోయే నేటి బిడ్డలను తగిన సుశిక్షణలో జాగ్రత్తగా పెంచిన యెడల కొలది కాలములో రామరాజ్య మేర్పడుట కెంత మాత్రము సందేహముండదు.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో]



# పల్లెటూరు

(41-వ పేజీ తరువాయి)

ఆ మాటలు విన్న శాంత తనవల్ల చంద్రానికి కష్టం కలుగుతుందని గ్రహించి అర్ధరాత్రి యిల్లు వదలి పోతుంది. దాంతో బెంగ పెట్టుకొని చంద్రం తల్లి సీతమ్మ మంచాన పడుతుంది.

గ్రామంలో ప్రజలు తిండిలేక మలమల్లాడుతూ వుంటే ధాన్యం పాతరవేసి, వాటిని దొంగ వ్యాపారాని కమ్మి కొండయ్య పేర హామీ వ్రాయిస్తాడు గణపతి. ఏ పాపం ఎరుగని కొండయ్య పట్టుబడి జైలుకి పంప బడుతాడు.

శాంత జాడ తెలియదు, కొండయ్య జైలులో పడ్డాడని, సుగుణ పెళ్లి గణపతితో నిశ్చయ మయిందనీ విని మంచం పైనున్న సీతమ్మ బెంగతో అసువులు బాస్తుంది. ఆ సమయంలో సీతమ్మను చూచుటకు వస్తూన్న సుగుణను పెళ్ళి పనులు చేయించడాని కొచ్చిన పిచ్చమ్మ అడ్డగించి చేయి చేసుకుంటుంది. అది సహించలేక సాంబయ్య పిచ్చమ్మ సంబంధం అంతటితో తెంపుకుంటాడు. ఈ సంగతి తెలిసిన గణపతి మండిపడి ఏ విధంగా నైనా సుగుణను తన దానిగా చేసుకోవాలని, కుట్రపన్ని వూరవతల అడవిలో శాంత వున్నట్లు, అర్ధరాత్రి సుగుణను వూరవతలి అడవికి పిలిపించి బలవంతం చేయబోతాడు. ఈ సంగతి తెలిసిన చంద్రం సుగుణను రక్షించాలన్న ఆత్రంతో ఆ ప్రదేశానికి వస్తాడు. అతను వచ్చేటప్పటికే సుగుణ రక్షించ బడుతుంది, గణపతి తల పగిలి పడి వుంటాడు. ఆ దృశ్యం అర్ధంకాక ఆయోమయంగా చూస్తున్న చంద్రం పోలీసుల చేతులలో చిక్కుతాడు. కోర్టులో తీర్పు చెప్పే సమయానికి కొండయ్య వచ్చి నిజం చెపుతాడు. గణపతికీ, శంకరానికీ కఠిన శిక్ష విధించ బడుతుంది, చంద్రం విడుదల అవుతాడు. కథ సుఖాంతం.

ఈ చిత్రంలో ప్రాధాన్యము—పల్లెసీమలు, వారి ఆనందదాయక మగు నిత్య జీవనం యథాతథంగా ప్రతి బింబింప చేస్తూ, పల్లెలకు ప్రాధాన్య మిస్తూ, పల్లె ప్రజల అమాయకత్వం, ఐక్యతా భావం కండ్లకు కట్టినట్లు అత్యద్భుతంగా ప్రదర్శించ బడ్డాయి

"పల్లెటూరు" లోని కొన్ని ముఖ్యమైన పాత్రల సృష్టికి మెచ్చుకోవాలి—నూతనాదర్శాలతో పల్లె ప్రజలలో వుద్రేకాన్ని కలిగించాలని, వారికి విజ్ఞానాన్ని అలవరచాలని వుద్దేశాలు గల బీదరైతు కుమారుడు చంద్రం పాత్రను ఎన్. టి. రామారావు మంచి నిపుణతతో నటించాడని చెప్పవచ్చు. నల్లమార్కెట్టు వ్యాపారంతో వచ్చిన ధనమదాంధత కల్గి, స్త్రీలోలుడై కనపడిన సుందరినల్లా చెరచుటకు నీచుడైన సావుకారు గణపతిగా ఎస్. వి. రంగారావుగారు చాలా నైపుణ్యంగా తమ పాత్రను నిర్వహించారు. ఇంక శాంతగా టి. జి. కమలాదేవి, సుగుణగా సావిత్రి పిచ్చమ్మగా శేషమాంబ, సీతమ్మగా పద్మావతి, అచ్చయ్య, నాగభూషణం, మొదలగువారు, వారి వారి పాత్రలను అర్ధంచేసుకొని కొంతవరకు భావయుక్తంగా మనోవికారాలు చూపగలిగేరు. చంద్రం చెల్లెలుగా బేబీ కృష్ణవేణి ఈ చిత్రంలో చక్కగా తన సామర్థ్యం చూప గలిగింది.

సంభాషణలు, ఉద్రిక్తంగాను, సజీవంగాను వున్నవి. దర్శకులు చాలా చక్కగా కథను నడిపించారు. సంగీతం శ్రవణానందకరంగా వుంది. ఛాయా గ్రహణం శబ్ద గ్రహణం చక్కగా వున్నాయని చెప్పవచ్చు. మన తెలుగు చలన చిత్రకళా పరిశ్రమలో నూతనంగా వెలసినది, పీపుల్స్ ఆర్టు ప్రొడక్సన్సు. వారి పల్లెటూరు, ప్రజాదరణ పొంది, విజయాన్ని సాధిస్తుం దనడానికి సందేహం లేదు. ప్రయత్నం ప్రప్రథమ మైనా చిత్రం ఎక్కడా దెబ్బ తినలేదు.

లక్ష్మి.





విజ్ఞానము

# చెట్లు — చేమలు

* శ్రీ వేమరాజు భానుమూర్తి *

పుట్టడం, పెరగడం, జాతిని అభివృద్ధి చేసుకోవడం, చివరకు చావడం ఇవి నాలుగూ ప్రాణికోటి లక్షణాలు. ఈ నాలుగు లక్షణాలూ ఎక్కడ ఉంటే అక్కడల్లా ప్రాణముందన్నమాట. ఎందులో ఉంటే అందులో ప్రాణ ముందన్నమాట. ఈ లెక్కను మానవుడు, జంతువులు మాత్రమే కాకుండా తరులతా పాదపాది వృక్షజాలమంతా ప్రాణికోటికి చెందినవే అవుతాయి.

తనజాతిని ఎలాగైనా అభివృద్ధి చేసుకోవాలనే తపన ప్రాణికోటికంతకీ సహజం. తన వంశాంకురం దిన దిన ప్రవర్ధమానం కావాలని ప్రాణం వున్న ప్రతీదీ ప్రగాఢంగా వాంఛిస్తూనే ఉంటుంది. మామిడిచెట్టు మధురచోద్యమైన ఫలాలను మనకు అర్పిస్తున్నదంటే అందుకు కారణం మొక్కవేసి పెంచిన వాడిమీద ప్రేమ చేతకాదు. పాదులన్నీ కాయలు కాస్తున్నాయంటే తోట యజమానిమీద మమకారంచేతకాదు. ఆవు తువ్వాయిని పెట్టడం రైతుకు పాలివ్వాలనికాదు. అడవిలో టేకుమొక్క పెరగడం మనం ఎప్పుడో ఎక్కడో ఇళ్ళు కట్టుకుంటామనీకాదు. ఇవన్నీ ఇలాగ జరుగుతున్నాయంటే అందుకు కారణం తమ జాతిని ఎట్లాగైనా అభివృద్ధి చేసుకోవాలనే సహజమైన తపన మాత్రమే.

ఈవిధమైన కృషిలో చెట్లు కనిపెట్టిన ఒక ఉపాయం విత్తనాలను సృష్టించడం, ఆతరువాత అవి ఏదో విధంగా సుదూరప్రాంతాలకు సైతం వ్యాప్తి అయ్యేటట్టు చూడడం, ఇందులో వీటిని వ్యాపింపచేసే పద్ధతులు అనేకం, వాహనాలు, సాధనాలు అనేకం ఉంటాయి. ఆహారపదార్థాలుగా పనికివస్తాయనో, ఆర్థికంగా లాభసాటి అయినవో, లేక ఓషధులుగా ఆరోగ్యభిక్ష పెట్టుతాయనో లేక ఇతరత్రా ఎంతో ఉపకారంగా ఉంటాయనో మానవుడు అనేకరకాల మొక్కలను పెంచుతున్నాడు. పెంచినవాడు ఊరుకోకుండా స్వార్థంకోసం వాటిని నిర్దాక్షిణ్యంగా నరికివేస్తున్నాడుకూడా.

ఈ సందర్భంలో నాకు ఒక కథ జ్ఞాపకం వస్తోంది. వెనక ఒకసారి రకరకాల ఫలవృక్షాలు, కాయగూరల మొక్కలు అన్నీకలిసి బ్రహ్మదేవుడి దగ్గరకు రాయబారం వెళ్ళాయట. ఇవి చెప్పినదంతా సావకాశంగా వినడానికి బ్రహ్మ ఒప్పుకున్నాడు. ఇంతలో బచ్చలిమొక్క ముందుకు వచ్చి తన కులగోత్రాలు చెప్పుకొంది. మానవుడు సర్వభక్షకుడు అయిపోతున్నాడని ఫిర్యాదు చేసింది. బ్రహ్మ విని వూరుకున్నాడు. ఇంతలో ముల్లంగి వచ్చింది. 'నావేళ్ళు తినేస్తున్నారు, స్వామీ, అని మనవి చేసుకుంది. ఇంతలో తోసుకుంటూ అరటి ముందుకు వచ్చింది. "ప్రభూ! నాకాయలనేకాక తొండాన్నీ, పువ్వుల్నీ కూడా ఈ కర్కటకపు మానవుడు తినేస్తున్నాడు" అని మొరపెట్టుకొంది. ఇంతలో సువాసన గుమ్మని కొట్టింది. దాల్చిన ప్రతినిధిలేచి నిలబడింది. "నా బెరడు వల్చుకు తినేస్తున్నారు నా గతేమిటి?" అని విన్నవించుకుంది. ఆవెనుక జీడిమామిడి వయ్యారముగా లేచి నిలబడింది. "దేవా! నా విత్తనములనేకాకుండా తొడిమలనుకూడా తినేస్తున్నారు" అంది. ఇంతలో లవంగలత తొంగిచూచి ముందరకువచ్చి "ఓ దేవా! నా మొగ్గల్ని పెరగనివ్వకుండా, చిదిమి తినేస్తున్నారు" అని అందరికంటె ఆఖరున తోటకూర వచ్చి "ఓయి దైవమా నామాటేమిచెప్పను? నా అసలు పేరునే తుడిచిపారవేశారు" అని గొల్లుమంది.

ఇది అంతా విని విని బ్రహ్మదేవుడు కూరలపేరుతో వేళ్ళనీ, తొండాన్నీ, బెరడుల్నీ, మొగ్గల్నీ, పువ్వుల్నీ తినేస్తూ మీజాతులకు, మానవుడు అపకారం చేస్తున్నాడనేకదూ! మీ ఫిర్యాదు సారాంశం. ఇందుకు ప్రతిక్రియగా మానవజాతిని సృష్టించడమే మానివెయ్యమంటారా? సరే ఒప్పుకుంటాను. ఆతరువాత మళ్ళావచ్చి పశువులు పొట్టను బెట్టుకుంటున్నాయి, మా వంశాలు నాశనమైపోతున్నాయని ఏడవరుకదా!" అన్నాడు.

ఇవి అన్నీ మళ్ళా ఆలోచించుకున్నాయి. ఏకాడికైనా

# చెట్లు—చేమలు

మానవుడే మేలు. తను తినడానికైనా కావాలనే స్వార్థంతో సమైన విత్తనాలు దాచి, మళ్ళు చేసి, పళ్ళుకట్టి, బోదెలు చేసి తమజాతి మొత్తంమీద నశించకుండా కాపాడుతున్నాడు అని సద్దుకొన్నాయి. ఇదీ కథ.

ఇది నిజమే అయినా అబద్ధమైనా ఒక్క సంగతి మాత్రం నిజం. స్వార్థంకోసమే అవనీయండి మానవుడు విత్తనాలు దాచిపెట్టి అనేక రకాల మొక్కలనువేసతో నాటి వంశాభివృద్ధికి దోహదం చేస్తున్నాడన్నది.

అయితే ఇప్పుడు ఒక ప్రశ్న. ఈవిధంగా ఎవరో ఒకరు జాగ్రత్తగా దాచి పాతిపెట్టి దోహదం చెయ్యడంవల్ల మాత్రమే వృక్షజాలం పెరిగేటట్టయితే, మనకు ఈ ప్రపంచంలో మామిడి మొక్కలు, కూరల పాదులు, తప్ప ఇంకేమీ ఉండేవేకాదేమో! అప్పుడు ఈ ప్రపంచ విస్తీర్ణంలో ఏకాంతమేగలోనో ఈ మొక్కలు పెరుగుతూవుండివుండేవి.

కాని మొక్కలు మనకంటే ఎంతో తెలివైనవి. వాటికి తెలిసింది పకృతి సిద్ధమైన నియమాలను పాటించడం. పరిస్థితులకు అనుకూలంగామారి, ఒకవేళ అనుకూల పరిస్థితులు లేకపోతే వచ్చేవరకు ఎన్నోవేల సంవత్సరాలు అయినాసరే వేచివుండి, వంశాంకురం చెడిపోకుండా వృద్ధిచెంది, తన వంశం వ్యాపించేటట్టు చేసుకుంటూ వుంటాయి. ఇందుకు మంచి వుదాహరణ, ఆమధ్యన చైనాలో రెండువేల సంవత్సరాలక్రితం నారుగాపడివున్న రెండు తామరగింజలు నిరుడు అమెరికాలో అనుకూలమైన పరిస్థితులలో మొలకెత్తిన సంగతి. ఈ కృషిలో ఇతరులెవ్వరు మోసుకు తీసుకువెళ్ళి పాతిపెట్టి పెంచేవరకు కాసుకుకూర్చోవడంలేదు. తమ విత్తనాలను సాధ్యమైనంత దూరంగా పంపించడానికి అవి రకరకాల పద్ధతులను అవలంబిస్తూవుంటాయి. ఈ కళ వాటిని మించిన ఉపాయశాలి సృష్టిలోమరొకటిలేదు. వాటిస్వార్థానికి అదే సాటి. మాటవరసకు పాలముల్లంగి మొక్కను తీసుకోండి. దాని విస్తీర్ణం ఎంతో చిన్నది. మామూలుగా అయితే అది ఎక్కడికీ కదలలేదు. దానిని ఎవ్వరూ దాచరు కూడా. అలాంటి పరిస్థితులలో అది యెండిపోయేవరకూ చెట్టునే అంటిపెట్టుకుని వుంటుంది. ఆతరువాతైనా మహా పడితే అవి ఆచుట్టుపక్కలే పడ్తాయి. కానీ ఈ కొంటె మొక్క తన విత్తనాలకు తెల్లని రెక్కలు అమర్చింది. కాస్త గాలివీస్తే దాని పాటుకు అది మైళ్ళకు మైళ్ళు కొట్టుకుపోతుంది. అక్కడెక్కడో ఆగింజ పడుతుంది. వర్షాలు పడ్డప్పుడు సహజక్రమంగా మొలకెత్తుతుంది.

ఇంకా కొన్నిరకాల ముళ్ళమొక్క విత్తనాలకు చుట్టూ సన్నని సిల్కు ధారంవంటి దూది పింజ వుంటుంది. మన జిల్లేడు వగైరా మొక్కలు ఇందుకు మంచి ఉదాహరణ. పండు కాయ ఎండవేడికి పగలగానే ఇవి రాలి పాటుకు చాలా దూరం ఎగిరిపోతాయి. రెల్లుపూలు ఈ బాపతుకు చెందినవే. గంగరేణి, తులసిచెట్లవంటివి వాటి విత్తనాలను పండడానికి ఇంకో ఏర్పాటు చేసుకున్నాయి. వాటి కాయలకే దొప్పలవంటి రెక్కలుంటాయి. ఇవి చూడడానికి మన ఆవుదూడ చెవులవలె వుంటాయి. ఇవికూడ గాలి పాటుకు విత్తనం చాలా దూరం ఎగిరి వెళ్ళడానికి తోడ్పడేవే.

మైదాన ప్రదేశంలో వుండే వారికి అనుభవంలో ఉండే ఇంకో సంగతి చెపుతాను. కొన్నిరకాల మొక్కల కాయలు ఎండకు ఎండి చుట్టుకుపోతాయి. పైగా డొల్ల అయిపోతాయి. గాలికి ఈ డొల్లలు పుచ్చకాయలా అలా అలా దొర్లుకుంటూ పోతాయి. చివరకు ఏదొడ్డి కంచెకో, తగులుకొని ఆ తరువాత ఎప్పుడో వర్షం పడ్డప్పుడు ఈ ఉండ పగిలి దానిలో విత్తనాలు నలుముగాలకు చిమ్మబడతాయి. అక్కడ వాటి వంశం వద్దన్నా అలముకుపోతుంది.

ఇంక కొన్నిరకాల మొక్కలలో విత్తనాలు కాయలు పండిపోయినప్పటికీ వెంటనే రాలి పడవు. చెట్టును అలాగే అంటిపెట్టుకుని వుంటాయి. గాలిపాటుకు ఈ చెట్టు కొట్టుకుపోతూన్నప్పుడు దోవలో ఒక్కొక్కగింజే క్రిందకు రాలి పడుతుంది. వర్షాలు పడగానే అవి మొలకెత్తుతాయి. వీటిలో గ్రాస్ వగైరా మొక్కలు ఇందుకు నిదర్శనం. ఇది చేలో కలుపుక్రింద మొలవడం ప్రారంభమైతే, తామరతంపరలాగ అల్లుకుపోతుంది. రైతుకు ప్రాణం విసిగిపోతుంది.

ఇక గురుకు అనే మొక్క వుంది. దానిముళ్ళు అంట్రటింతలలో ఉంటాయి. ఇవి మనుష్యులకు జంతువులకు అంటు

కుంటాయి. ఆవిధంగా అవి హాయిగా దమ్మిడీ ఖర్చు లేకుండా ఒక చోటునుంచి ఇంకొక చోటికి ప్రయాణం చేస్తాయి. మన బ్రహ్మచెముడు కాయలు ఈ తరగతికి చెందినవే. మార్నింగ్ గ్లోరీ అనే మొక్కను తీసుకోండి. సరిగ్గా ఆరోగ్యంగా పెరిగిన ప్రతి మొక్కకును దాదాపు మూడువేల విత్తనాలుంటాయి. ఇవన్నీ మొక్కలైతే వచ్చే ఏటికి వాటిలోనుంచి 90 లక్షల విత్తనాలుంటాయి. ఆ లెక్కని పై సంవత్సరం 27000 కోట్ల విత్తనాలుంటాయి. ఆమీదటికి అవి 8 శంఖాలు అవుతాయి. శంఖం అంటే ఒకటి తరువాత పధ్ధెనిమిది సున్నాలు చుట్టితే వచ్చే అంకె. ఈ ప్రకారం మన ప్రపంచంఅంతా ఈ మొక్కల మయమై పోవడానికి ఆట్టేకాలం పట్టకపోవచ్చు.

నదుల పడ్డున లేదా సరస్సుల పడ్డున పెరిగే తుంగ, జమ్ము జాతిమొక్కలు తమ విత్తనాలకు కొంచెంగా గాలి నింపిన బెలూన్లవంటి తొడుగులను ఏర్పాటుచేసుకుంటాయి. వీటికి అవి చల్లగా గట్టుమీదకుగాని నీళ్ళలోకిగాని వదిలి వేస్తాయి. అవి ప్రవాహ వేగానికి లేదా గాలిపాటుకు ఇతర ప్రాంతాలకు చక్కాపోతాయి. అక్కడ ఏమూలకో చేరుకుంటాయి. వెంటనే ఈ బెలూన్ పగులుతుంది. విత్తనాలు బురదలోపడి మొలకెత్తుతాయి.

ఇంక గట్లమీద, మళ్ళలోను, బురదలోను తిరిగే నీటి కాకులు బాతులు వంటి పక్షులు తమ కాళ్ళకు అంటుకునే బురదలో అనేక రకాల విత్తనాలకు ఆశ్రయమిచ్చి తమతో బాటు తమకు తెలియకుండానే తీసుకుపోతూవుంటాయి. ఎక్కడెక్కడో వదలి వస్తూవుంటాయి. అక్కడ అవి మొలుస్తూ వుంటాయి. ఇందుకు నిదర్శనం మన రావిపళ్ళు మర్రిపళ్ళు, వేపపళ్ళు అవన్నీ వాటిని పక్షులు ఒక్కసారి మింగివేసి ఎక్కడో రెట్ట వేస్తాయి. ఆరెట్టలో ఈ గింజలు పదిలంగావుండి అనుకూలమైన పరిస్థితి ఏర్పడగానే అంకురిస్తుంది. అలాకాకపోతే ఎత్తయిన మేడల మీద, దేవాలయములమీద, కోటగోడలమీద మనకు మర్రి మొక్కలు, వేపమొక్కలు, రావి మొక్కలు కనపడవలసిన అవసరమేలేదు. అంతేకాదు. ఇంకొక చెట్టుమీదకూడా ఇవి మొలకెత్తి దాని సారాన్ని ఇవి పీల్చుకొని వర్ధిల్లుతూ వుంటాయి.

చిన్న చిన్న గుండుసూదులవంటి బొచ్చుగల గరికపండ్లు లేదా పల్లేరు, గడ్డగోరు కాయలు వగైరా గొర్రెల ఉన్నికి పశువుల డెక్కలకు, మనుష్యుల కాళ్లలోను గుచ్చుకుంటాయి. పిల్లల బట్టలకు పట్టుకుంటాయి. ఇవి మరెక్కడో ఊడిపోతాయి. మరి అత్తి, పత్తిచెట్టుజాతికిచెందిన మొక్కలు తమ విత్తనాలను అనుకూల తరుణంలో వాటి పగిలేటట్టు జాగ్రత్తపడతాయి. అపగిలినప్పుడు విత్తనాలు సాధ్యమైనంత దూరంగా విసిరి వేయబడతాయి. మన కనకాంబరం మొక్క ఈ జాతిదే.

మనకందరికీ అరటిపళ్ళు అంటే మహా ఇష్టంకదా! మనలో వానకి తడవనివాడు అరటి పండు తిననివాడు సర్వసాధారణంగా ఉండరుకదా! పాపం అలాంటి అరటికి అసలు విత్తనమేలేదు. పండులో విత్తనాలనబడే నల్లటి మచ్చలు మాత్రమే వుంటాయి. ఎవ్వరో వకరు వచ్చి దుంప త్రవ్వి ఇంకోచోట పాతితేనే వానికి వంశవ్యాప్తి.

తమ విత్తనాలు దూరదూరాలకి దొర్లి వంశవ్యాప్తి చెయ్యాలనే కోరికతో కొబ్బరి, తాటి, వెలగ, మారేడుచెట్లు పండ్లను గుండ్రంగా తయారు చేసుకుంటాయి. పొరపాటున నీట్లోపడిన తేలిపోవాలని కొబ్బరి, మారేడు చెట్లు పళ్లను తేలికగా తయారు చేస్తాయి కూడాను. ఈ ఉపాయము ఫలించడం వల్లనే పసిఫిక్ దీవులనంతటా కొబ్బరిచెట్లే కనపడతాయి. గురివింద చెట్టు మహాటక్కరిది. విత్తనాలని ఎర్రగా పళ్ళలాగ తయారు చేసుకుంటాయి. పక్షులు వాటిని కరచుకొనిపోయి తమ గూళ్ళలో పెట్టుకొని అవి పళ్ళుకాదని తెలుసుకొని అవతలపారేస్తాయి. ఆగింజలు అక్కడ మొలకెత్తుతాయి. ఆముదము చెట్టు తన గింజల్ని పురుగుల్లాగ తయారుచేసి పిట్టల్ని ఇలాగే మోసగిస్తోంది.

రేగు, బంకనక్కరి, కుంకుడుచెట్లు తమ గింజలు జీవజంతువుల శరీరాలకంటుకొని ఖర్చులేని ప్రయాణం చెయ్యడానికి వాటి చుట్టూ జిగురుపూత పెట్టాయి. ఇలా ఎంతైనా చెప్పవచ్చు, దీనిని గురించి, విత్తనాలద్వారా వంశవ్యాప్తికి అవి అనుసరించే చిత్ర విచిత్రోపాయాల నుగురించి.



# హాస్యానందం

## మీ సంగతి నాకు తెలుసు లెండి

* శ్రీ ముప్పవరపు లక్ష్మణరావు *

పూర్వం చింతవలస అనే పల్లెలో ఒక బీదమంగలి ఉండెను. అతనికి ఒక కుమారుడు కలడు. కుమారునికి రాముడు అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచు చుండెను. కొద్దికాలమునకు రాముడు పెద్దవాడయ్యెను. కాని రాముడు చిన్నప్పటి నుండియు ముద్దుగా పెరుగుట వలన పని పాటలు గాని, చదువు సంధ్యలు గాని రాక త్రాగుడు, జూదము మొదలగు దురలవాట్లు, దుష్ట స్నేహము లభించినవి.

ఇలా ఉండగా కొంత కాలమునకు వాని తల్లిదండ్రులు మరణించిరి. అప్పటికి తండ్రి గడించిన సొమ్మంతయు రాముడు జూదము క్రింద త్రాగుడు క్రింద వ్యయపరచెను. ఇంక చేతిలో సొమ్ములేదు. అందుచే రాముడు తిండికి కూడా చాలా కష్టపడుచుండెను. ఒక రోజున రాముడు యేమి ఆలోచించెనో గాని శుభ్రముగా గుండు చేయించుకొని, యజ్ఞోపవీతమును ధరించి, పిండి కట్లు పెట్టుకొని ఆ పల్లెను వదలి బయలుదేరెను. ఇట్లు నడచి నడచి చివరకు సాయంత్రమగుసరికి ఒక వూరు చేరుకొనెను. ఇక నడచుటకు బలము లేనందున, ఆకలిబాధకు ఓర్వజాలక అక్కడ ఒక యింటి అరుగుపై పండుకొనెను.

ఆ మరునటి ఉదయమున ఆ యింటి యజమాని వెలుపలకు వచ్చుసరికి వీధి యరుగుపై ఒక వ్యక్తి పరుండుట చూచెను. తక్షణమే ఆ వ్యక్తి యెవరో కనుగొనుటకై అతనిని లేపెను. రాముడు తత్తరబాటుతో లేచి కూర్చొనెను. రాముని వేషమునుబట్టి చూడ ఒక బ్రాహ్మణ యువకునివలె గాన్పించుట వలన గృహ యజమాని వినయముగా తన గ్రామము, తన రాకకు కారణము మొదలగు అన్ని విషయములను ప్రశ్నించెను. అంతట రాముడు తానొక గొప్ప బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన వాడననియు, తనకు ఆప్రాంతములందు కొన్ని భూములున్నవనియు, ఆ భూములను తాను చూచుటకు, శిస్తు వసూలు చేయుటకు వచ్చితిననియు చెప్పెను. అంతట యజమాని రాముని యింటిపేరు యేమని అడుగగా తన పేరు రామశాస్త్రి అనియు, యింటిపేరు మంత్రాల వారనియు చెప్పెను.

యజమాని తానాగ్రామమునకు యజమానిననియు, తనది కూడా వారి శాఖయేననియు చెప్పి రాముని మర్యాదచేసి ఆ పూట వారి యింటియందు భోజనమున కుండుటకు ఒప్పించి, తగిన సదుపాయములు చేసి వానిని అక్కడే యుండమని చెప్పి తాను లోనికి పోయెను. లోపలికి పోయిన తరువాత భార్యను పిలచి పై గ్రామమునుండి ఒక యువకుడు వచ్చెననియు. అతడు తమ శాఖ వాడేననియు, చాలా డబ్బున్న వాడనియు. ఆ దినమున భోజనమునకు ఉండుననియు, త్వరగా వంట చేయమనియు చెప్పెను.

అప్పుడు అతని భార్య చాలా సంతోషించి ఏమండీ! "మన శాఖేకదా! మరి ఆ అబ్బాయికి వివాహమయినదా లేదా? లేనిపక్షమున మన కమలను యిస్తే చాలా బాగుంటుంది. ఇంతకన్నా గొప్ప సంబంధం దొరుకుతుందా యేమిటి. కావున అన్నిసంగతులు భోజన సమయమున భోగట్టా చేయండి" అని భర్తతో పలుకగా భర్తకూడా సరే అనెను. వంట అయిన తరువాత యజమాని రాముని కడకువచ్చి స్నానము వగైరాలు చేసిన పిదప భోజనమునకు కూర్చుండిరి. భోజన సమయమునందు యజమాని రామునితో "బాబూ! నీకు పెండ్లి అయినదా! నీ తల్లి దండ్రులు నీకు యింకా పెండ్లి చేయలేదా!" అని ప్రశ్నించెను. అందులకు రాముడు "నేను ఒంటరిగాడిని, నాకు పెండ్లియన్న యిష్టములేదు." అని పైకి డాబుగా పలికెను. వెంటనే యజమాని "అట్లుకాదు బాబూ, పెండ్లి చేసుకోవాలి, నీకు యిష్టమయితే మా పిల్లను యిస్తాము. చూసుకో నాయనా" అని తమ పిల్లను చూపించి అతని మాటకొరకు యెదురు చూచుచుండిరి. రాముడు తనలో తాను వేసిన యెత్తు బాగుగా పారినదని, లోలోన సంతోషించుచు పైకి మాత్రము సమ్మతము లేనట్లు నటించుచు ఎట్టకేలకు ఒప్పుకొనెను.

తరువాత ఒక శుభదినమున అతివైభవముగా రాముని పెండ్లి దమ్మిడీ ఖర్చులేకుండా జరిగి పోయెను. రాముడు తన గుట్టు బయట పడకుండా అతి జాగ్రత్తగా మామగారి యింట మెలగు చుండెను. కాని రామునకు త్రాగుడు, మాంసము తినుట, మొదలగు అలవాట్లు ఉండుట వలన ఒక దినమున కొంత డబ్బు తీసుకొని బజారునకు పోయి మాంసము, కట్టెలు, అగ్గిపెట్టె, సారాయి మొదలగునవి కొని వూరి వెలుపల చెరువు గట్టున నున్న తుప్పలలో జాగ్రత్తగా దాచి యింటికి వచ్చెను.

రాత్రి పండుకొను సమయమున భార్యతో "ఒసే, తెల్లవారు ఝామున 3 గంటలకు లేపు. నేను చెరువునకు పోయి స్నానము సంధ్యా వందనము మొదలగునవి చేసుకొనవలెను" అని చెప్పెను. పాపము భార్య నిజమేనకొని మూడు గంటలకు లేపెను.

రాముడు లేచి చెరువు గట్టునకు పోయి, పొయ్యి రగిలించి, మాంసమును వండి దానిని అచ్చటనే తిని సారాయిని త్రాగి మరల పని ముట్లను జాగ్రత్త పరచి తెల్లవారు సరికి యింటికి వచ్చెను.

ఉదయమున, సాయంత్రమున యీ విధముగానే చేయుచు త్రాగుడు మైకమున భార్యను కొట్టుచుండెను. భార్యకు తన భర్త చర్యలు ఆశ్చర్యముగా కాన్పించుచుండెను. కాని తల్లిదండ్రులకు యేమియు చెప్పక విచారించుచుండెను. ఒక దినమున సాయంకాలమునరాముడు బజారునకు పోవుచుండగా రాముడి వూరితాలూకు చాకలి సోముడు ఎదురుపడి "ఏమిరా రాముడూ! యీ వూరిలో యేమి చేస్తున్నావురా?" అని ప్రశ్నించగా రాముడు జరిగినదంతా పూస గుచ్చినట్టు చెప్పి, యీ విషయమును యెవ్వరితో చెప్పవద్దని, తనకు ఆ పూటకు భోజనము ఖర్చు యిచ్చుకుంటానని బ్రతిమిలాడి యింటికి తీసుకుని పోయెను.

యింటికి వెళ్ళిన తక్షణమే మామగారు అతడెవరని ప్రశ్నించెను. "మామగారూ! యితడు మా రైతు, నేను రాలేదని నా కొరకు వచ్చినాడ"ని బొంకెను.

ఇట్లుండ ఒక దినమున తన భర్తలేని సమయమున సోమునితో కమల తన భర్తచర్యలు అన్నియు చెప్పెను. అప్పుడు సోముడు 'అమ్మా నే నొక ఉపాయమును చెప్పెదను. మిమ్మల్ని మీ భర్త కొట్టుటకు వచ్చినప్పుడు మీ కుడిచేతి వ్రేలితో, ఎడమ అరచేతిలో కత్తిని నూరినట్లు "మీ సంగతి నాకు తెలుసు లెండి." అని అనండి. మరి అతడు మీ జోలికి రాడ"ని చెప్పి సోముడు అచ్చటనుండి ఉడాయించెను.

రాత్రి తన భర్త బాగుగా త్రాగి, తనని కొట్టుటకు వచ్చుచుండగా సోముడు చెప్పినట్లుగా కుడిచేతి వ్రేలితో ఎడమ అరచేతిలో కత్తిని నూరునట్లు నూరుచు "మీ సంగతి నాకు తెలుసులెండి" అని పాటను పాడు

నట్లుగా పాడుచుండెను. అది చూచి రాముడు ఆశ్చర్య పడిపోయెను. భార్యతో "యేమే! నేను మంగలివనని నోముడు చెప్పెనా యేమి?" అని తన గుట్టును తానే బయట పెట్టుకొనెను. వెంటనే తన భర్త మంగలివాడని గ్రహించి ఏడ్చుచు యీ సంగతిని తన తల్లిదండ్రులకు తెలియజేసెను.

వారందరు చాలా విచారించి చేయునదిలేక రామునికి బుద్ధిచెప్పి జరిగిందేదో జరిగిపోయింది గాని నీవు మాత్రము త్రాగుట మొదలగునవి మానుకొని జాగ్రత్తగా యుండమని బోధపరచి, వానికి కొన్ని యెకరముల భూమిని వ్రాసియిచ్చి, కొన్ని లక్షల పైకముతో దూరముగానున్న యింకొక గ్రామమునకు కూతురుతో సహా పంపివేసెను.

రాముడు త్రాగుడు మానుకొనెను. మామగారిచ్చిన పైకముతో ఒక పెద్దమేడను కట్టించి అతి జాగరూకతతో సంసార నౌకను నడుపు చుండెను.

(అందువలన పెండ్లి మాటలయందు తొందర పడ కూడదు.)



# పరనింద తగదు

ధవళ నాగేశ్వర్

అనగనగ ఒక బ్రాహ్మణుడు
ఎక్కడికో యెందులకో గానీ
పడవనెక్కి పోతున్నాడు
ఒంటరిగా పోతున్నాడతడు.
పడవవాడు చుక్కాని బట్టి
చక్కగ పడవను నడుపంగా
సగందూరము పోయేసరికి
నీరు నిర్మలంగా వుంది.
బ్రాహ్మణుడాపడవవానితో
"నీవేమైనా చదువుకొంటివా?"
"లేదండి! ఓ శాస్తుల్లుగారు...."
"అయితే నీబ్రతుకంతా దండగే."
అంటూ మళ్ళీ వర్ణించేడు
"నీవేమైనా పుణ్యము చేశావా?"
"లేదండీ....బాబూ...." అన్నాడు.
"అయితే నీబ్రతుకిక వృథా" యనె.
ఇంకా లోతుకి పోతుండెను
వరదలు జోరుగ వస్తుండెను
పడవవాడు బ్రాహ్మణునిచూసి
"ఈదడమొచ్చా? మీక"న్నాడు.
విప్రుడు తడబడుతుంటే
పడవకొంచము మునుగుతువుంటే
"మీజీవితంకూడ దండగే."
అన్నాడతడు పడవనడుపుతూ.
పడవ బోల్తాకొట్టింది
బ్రాహ్మణుడీదుచుపోలేక
నీళ్ళు మ్రింగుతుంటుంటే
పడవవాడు రక్షించేడు.
"యిదేబాబు నాజీవితంలో
చేసినపుణ్యమ"న్నాడు.
తొల్లిపలికిన తుంటరితనముకు
విప్రుడు సిగ్గునొందేడు.



# శంకరశాస్త్రి

"జోం డా"

అనగనగా ఓ వూరిలో శంకరశాస్త్రి అనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయనికి ఆవూళ్లోనే ఓ రెండెకరాల భూమి ఉండేది. ఏదో వాళ్ళనీ, వీళ్ళనీ బ్రతిమాలుకొని దాని నెలాగో సేద్యం చేయించుకొని కాలక్షేపం చేసేవాడు. ఓనాడు తన పొలం చూడ్డానికని వెళ్ళాడు. అక్కడ ఓ చెఱువుంది. ఆ చెఱువుకి ఓవైపున ఓచక్కని యెద్దు ఒకటి తన కొమ్ములతో గండి వేయడం ప్రారంభించింది. ఇది చూసి బ్రాహ్మణుడికి ఒళ్ళు మండింది. ఏమీతోచక వెళ్ళి దానితోక పట్టుకున్నాడు. వెంటనే అది కైలాసానికి తీసి కొనిపోయింది. అక్కడ తనకు కావలసినవన్నీ తిని మళ్ళీ హాయిగా నంది తోక పుచ్చుకుని భూలోకంలోకి వచ్చిపడ్డాడు. అక్కడ తాను తిన్న పెద్ద పెద్ద మిఠాయి ఉండలు, లడ్లు మొదలయినవన్నీ జ్ఞాపకం వచ్చాయి. తానొక్కడేతింటే బాగులేదని ఊళ్ళోఉన్న బ్రాహ్మలంద రికీ తన ప్రజ్ఞ చాటించాడు. "మమ్మల్ని తీసికెళ్ళమంటే మమ్మల్ని తీసికెళ్ళ''మని బ్రతిమాలారు బ్రాహ్మలంతా. సరే! తీసికెళతానన్నాడు శంకరశాస్త్రి. తాను వెళ్ళి నందితోక పట్టుకున్నాడు. ఆయనకాళ్ళు మరొకరు. మరొకరికాళ్ళు మరొకరు ఇలా వరుసగా పట్టుకొన్నారు. నంది ఎగిరి పోయింది కైలాసానికి. ఇంతలో ఓ బ్రాహ్మడికి పెద్ద అనుమానం వేసింది, ఆలడ్లు, మిఠాయిఉండలు ఎంతంత ఉంటాయాయని? ఉండబట్టలేక ఎంతంతుంటాయి? సుమా రుగా ! అని అడిగాడు శంకరశాస్త్రిని ఆ బ్రాహ్మణుడు. అంతంతవుంటాయి అని శాస్త్రి చేతులు చూపించడమేమిటి! వాళ్ళంతా క్రిందపడి పచ్చడవడ మేమిటి రెండూ ఒక్క సారి జరిగినయ్. కధ కంచికి, మనం యింటికి.



# శాస్త్రి

* శ్రీమతి ఎస్. రాజేశ్వరీ రాణి *

నేరెడుచెట్టుపై కొంటెబాలుడొకడు
కోరినపండ్లు తింటూ కూర్చుని వున్నాడు.
దారినబోయెడు నొకఅవ్వ దప్పికిమగ్గి
''ఓరిమనవడ ఒకపండేస్తూ" అనిఅడిగింది.
పండ్లుతింటున్నబాలుడు అవ్వని గమనించి
కండ్లు చిట్లించుకొని ఎందుకో సంతసించాడు.
ఆ అవ్వ ఆవూరి వారల సరస్వతి
ఏజాబువచ్చినా అవ్వ చదువగలదు.
అందుకే అవ్వకు అహంభావం జాస్తి.
ఇందుకే చేసాడు మనవాడొక శాస్తి.
"అవ్వా:అవ్వా: వేడిపండ్లుకావాలా?చల్లటిపండ్లు
కావాలా?"

అవ్వాదిరిపడ్డది అబ్బురపుమాటవిని.
అట్టెచూస్తోకాసేపు ఆలోచించి,మనసు
దిట్టపరుచుకొని ఇలాగుచెప్పింది.
వేడిపండెక్కడుంది బాబు?
వాడిచూస్తా వేయవోయ్ వేడిపండ్లు.
కొమ్మను ఆడించాడు తిమ్మన్నకుమల్లె
జమ్మనిరాలాయి బాగామాగినపండ్లు
అవ్వేరుకుని మట్టిని వూదసాగింది.
"అవ్వా! అవ్వా! అంత వేడిగావున్నాయాపండ్లు?
వహావ్వా"అని నవ్వాడా కొంటె.
తల గీరుక అవ్వ తలెత్తిచూచి దించి
అహభావం విడిచి అవతలకు పోయింది.

## ఆ షా మా షీ

(8-వ పేజీ తరువాయి)

కొంత భూమిక తయారు చేసుకో లేకపోతామా అన్న ఆశతో యిందు చొరవగా నాయకత్వం వహించడానికి దుమికిన ప్రముఖ వనులకిది యెంకెంత ఆశాభంగము కలిగించిన దనుటలో సందేహము లేదు.

కేంద్ర కార్య వర్గమునుండి అప్పట్లో మదరాసు వచ్చిన హార్డికర్, భారత సేవక సమాజపు ప్రదేశ్ కార్య నిర్వాహకులను, సమాజపు ఇతర సభ్యులనూ, ఆంధ్ర మహిళా సభ ఆవరణలో కలుసుకొని, యీ సమాజ కార్య కలాప నిర్వహణను గూర్చిన వివరాలను పరిశీలించారు. ఆయన చెప్పిన ముక్కలలో సారాంశము: యీ కార్య కలాప నిర్వహణ ప్రారంభానికి, ప్రారంభ నిధి యనేది ఏమీలేదు. ప్రభుత్వము దీని నిర్వహణకై ధనసహాయం చేయగలిగిన సూచన లేవీ వర్తమానంలో కానరావు. భవిష్యత్తును గూర్చి తాము హామీ అసలే ఈయలేరు. కేంద్ర సంఘం ఇందు నిమిత్తమై కొంత నిధిని సేకరించి నప్పటకీ అది మొత్తము మీద ప్రచారణకు, ఆఫీసు ఖర్చుల నిమిత్తమే ఉపయోగించ బడునుగాని, సమాజము యొక్క అసలు, కార్య క్రమానికి వినియోగింప బడే అవకాశములేదు. కనుక, ఎక్కడ పని చేసేవారు ఆక్కడే తమ కవసర మైన మొత్తాన్ని సేకరించు కోవాలి. వేతనాలిచ్చి యిందు సేవకులను నియమించే ఏర్పాట్లు ఉండకపోవు కనుక, ఒక ప్రాంతంలో ఉన్న స్వచ్ఛంద సేవకులు, ఆ ప్రాంతీయ ప్రజల అవసరాన్ని బట్టి కొనసాగించ దలచిన కార్య క్రమానికి ఆ ప్రాంతంలోనే ఏదో విధంగా విత్తము స్రేకరించు కోవాలి అని స్పష్టంగా చెప్పారు, ఈ ధ్వనితో మరి కొందఱి ఉత్సాహం కొంత సడలింది.

ధనవంతులు దాతలుకావాలని కొందరూ, స్వచ్ఛంద విరాళాలను ప్రజలనుండి సేకరించాలని మరికొందరూ, ప్రజలు సినిమాలకు వెళ్లిడబ్బు తగలవేయకుండా యీ సమాజము వారు ప్రచారము చేయాలని మరికొందరూ అధికాహారోత్పత్తికి బావులు తవ్వించుటకు సబ్సిడీలు ఏర్పాటుచేసినప్పుడు తాసిల్దార్లు లంచాలు పుచ్చుకున్న వైనాలు, ప్రతిఆఫీసులోనూ బీదవారు, అనుభవము లేనివారు, ఏ పవినైనా చేయించు కోవాలంటే, ముడుపులు చెల్లించనిదే వారికి సాధ్యంకావడం లేదన్న సత్యాలూ,పల్లెవాసులై ప్రజలలోకూడా, ఇంకొకరు చేయించినప్పుడు అనుభవించడం దక్క స్వయం కృషిలో తగిన ఉత్సాహము చూపించక పోవడంవల్ల, స్థాపించబడిన అనేక కుటీర పరిశ్రమలు, గ్రామపరిశ్రమలు, నిలువ దొక్కుకొని ఉండ లేక పోయిన వన్న ఋజువులను మఱి కొందఱూ, ఇట్లా అనేకులు అనేక అభిప్రాయాలను సూచించారు, అనుభవాలను వెల్లడించారు.

అయితే సారాంశము—అరంభింప బడ్డ కార్య కలాపం ఎలా సాగించడ మంటే—ఇంకా అది సామాన్యుల కెవరకీ అవగాహన కాలేదు.

ఇక ప్రదేశ వర్గాలను గురించి ఒక మాట: భారత్ సేవక్ సమాజ్ కాన్స్టిట్యూషన్‌లో, ఒక్కొక్క భాషా ప్రాంతము ఒక్కొక్క ప్రదేశముగా నిర్ణయించ బడినది అంతా కాంగ్రెసు పద్ధతులలోనే. ఆ సూచనల పైననె ప్రదేశ కమిటీలు ఏర్పాటైనవి, జిల్లా కమిటీలు, ఏర్పాటు కానున్నవి కూడా. ఈ పద్ధతి ప్రకారము మదరాసు నగరంలో, తమిళనాడు జిల్లా కమిటీ, ఆంధ్ర ప్రదేశ్ జిల్లా కమిటీ అని రెండు ఉండవలసిన అవసరము ఉన్నది. అందు వల్లనే కాబోలు భక్తవత్సలంగారు తెనుగు గాలి అయినా సోకకుండా, పంజాబీలు, పార్సీలు, మలయాళీలు, అరవలు కలిసిన ఒక మదరాసు కమిటీని నియమించారు. ఈ పాతాన్ని గుర్తించి అయినా, ఆంధ్ర ప్రదేశ్‌వారు వెంటనే మదరాసులో ఆంధ్ర జిల్లా సంఘాన్ని నియమిస్తారని ఆంధ్రులు ఆశించడంలో తప్పు లేదనుకుంటాను. అట్టి నియామకంకాని నాడు, సమాజపు మదరాసు కార్య కలాపాలలో, ధనమూలంగా గాని, మరి యే యితర విధంగా గాని తోడ్పడడానికి ఆంధ్రులకు ఉత్సాహం కలుగక పోతే క్షమార్హమే అవుతుంది. నాయకులన్న వారు తమ అనుచరులలో ఇట్టి శంకలకు, సందేహాలకూ తావీయని విధానాలలో, చమత్కారముతోనూ, జాగరూకతతోనూ వ్యవహరించినప్పుడు గాని, ప్రజల మనస్సులలో యీ విబేధాలు పొడసూపుట మానదు; పక్షరహిత సమాజ స్థాపన జరుగనేరదు.



# గ్రంథ స్వీకారం

ఈ దిగువ పుస్తకాలు మా కార్యాలయమునకు చేరాయి,

## మాతృసేవ

దీపావళి సంచిక, సంపాదకులు_ శ్రీ...

వెల : 10 అణాలు.

* * *

## విశ్వశ్రీ

మాసపత్రిక, ఎడిటర్ _ పురాణపండ రామమూర్తి, కార్యాలయం_ ఆలమూరు_ తూర్పుగోదావరి.

వెల : 4 అణాలు.

* * * *

## ఆంధ్ర జ్యోతి

దీపావళి సంచిక, సంపాదకులు _ బి. నాగిరెడ్డి, దొరుకు చోటు: B. N. K. ప్రెస్, మద్రాసు_26

వెల : 8 అణాలు.

* * *

## ఢంకా

జన్మదిన ప్రత్యేక సంచిక, సంపాదకులు_ వి. టి. నరసింహాచార్య, దొరుకుచోటు _ 6, సుంకురామచెట్టి వీధి,

వెల : 10 అణాలు.

* * *

## తెలుగు సినిమా

వార పత్రిక, సంపాదకుడు_ కొమ్మూరి సాంబశివరావు, ప్రకాశకులు _ కొమ్మూరి వెంకట్రామయ్య, దొరుకుచోటు_ 6, మోతీలాల్ వీధి, త్యాగరాయనగరు, మద్రాసు_17

* * * *

## జై భారత్

దీపావళి సంచిక, సంపాదకుడు_న్యాయపతి రాఘవేంద్రరావు, దొరకుచోటు _ 38, మౌంట్ రోడ్డు, మద్రాసు_6.

వెల : 4 అణాలు

* * * *

## సూర్య ప్రభ

దీపావళి సంచిక, సంపాదకుడు_ డా. డి. అప్పారావు దొరకుచోటు_53, గోవిందప్ప నాయకన్ వీధి, మద్రాసు

వెల : 8 అణాలు

* * *

## స్వతంత్ర

" ఇంగ్లీషు " దీపావళి ప్రత్యేక సంచిక, సంపాదకుడు_ ఖాసా సుబ్బారావు, దొరుకుచోటు : బ్రాడీసు రోడ్డు, మైలాపూర్, మద్రాసు_4.

వెల : 1-8-0

* * *

## గృహలక్ష్మి

దీపావళి సంచిక, సంపాదకుడు _ కె. ఎన్. కేసరి, దొరుకుచోటు : గృహలక్ష్మి కార్యాలయము, ...పేట.

వెల : 6 అణాలు

* * *

## రూపవాణి

దీపావళి సంచిక, సంపాదకుడు: పి. సీతారామయ్య. దొరుకుచోటు: 16, సుంకురామచెట్టి వీధి. మద్రాసు_1

వెల : రు 1 రూపాయి.



# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో
భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2–0–0
సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6–0–0 .... సీనియర్ తరగతికి రూ. 9–0–0

నృత్యోపాధ్యాయిని:
శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2–0–0
సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8–0–0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13–0–0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7–0–0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11–0–0

సంగీతోపాధ్యాయిని:
శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras-4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. నృత్యము, గానము.

**పారిశ్రామిక విద్యాలయము** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

**వస్త్రములపై అద్దకపుపని** : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

**టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్** : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము** : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము** : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్** : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

**ముద్రణశాఖ** : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.




శోభనాచల వారి,

# ప్రజాసేవ

డైరెక్షన్.....ప్రభాకరరావు..

[illegible] రిలీజ్...

# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: డిశంబరు '52 :: సంచిక 8

ముఖచిత్రము : తారాశశాంకులు. చిత్రకారుడు : శ్రీ ఎల్. ఎమ్. బాబు.

కుటుంబపథకం : నిర్ణీతసంతానం .... సంపాదకీయము.
రాజకీయాలు .... శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.
ప్రస్తుతపరిస్థితులు .... శ్రీమతి అ. గిరిజ.
స్థిరసంకల్పం (నాటిక) .... శ్రీమతి సులోచన.
పత్రికా పుత్రిక (చిన్నకథ) .... శ్రీ ఏకుమళ్ళ కామేశ్వరరావు.
సుభ (అనువాద కథ) .... శ్రీ వైకుంఠరావు.
కర్తవ్యం (కథ) .... శ్రీమతి బి. అన్నపూర్ణాదేవి.
పిల్లల పెంపకం : ఆత్మవిశ్వాసమును పెంపొందించుట. .... శ్రీమతి ఆ. భాస్కరమ్మ.
లైలా మజ్నూ గాథ .... శ్రీమతి డా. వారణాశి యశోదాదేవి.

ఇంకా, గద్యాలు, పద్యాలు, బాలానందం, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష.

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 9 :: డిశంబరు '52 :: సంచిక 8

# కుటుంబపథకము : నిర్ణీతసంతానము

మార్పుఅనేది మానవుడు సహజంగా కోరుతుంటాడు. నిత్యజీవితంలో యంత్రసన్నిభంగా తన పరిశ్రమను, ఆహార విహారాలను కొనసాగిస్తున్నప్పటికీ, ఒక కాలనిర్ణయ ప్రకారం, ఒకదానివెనుక మరి యొకటి ఏర్పాటు చేసుకుంటూ, ఆకొలది భిన్నత్వములోనే విశ్రాంతి పొందుతూ ఉంటాడు. సాధ్యమైనంత వరకు తన కార్యకలాపాల్లో ఎప్పటి కప్పుడు ఏదోకొంచము క్రొత్తదనాన్ని కల్పించుకుంటూ, విసుగులేకుండా చూచుకుంటుంటాడు,

ఇకమానవుని సృజించిన సృష్టికర్తకో — అన్నింటా భిన్నత్వమూ, నిత్యనూతనత్వమూ ఉండితీరవలసినదే ఆయన సృష్టిక్రమంలో.

ఈ అనంతసృష్టిలోని భిన్నత్వాన్ని వర్ణించాలంటే, ఆ సృష్టికర్తయైన బ్రహ్మదేవునకైనా సాధ్యపడుతుందో పడదో! ఎండ, చలి, అతివృష్టి, అనావృష్టి, తెలుపు, నలుపు, పొడుగు, పొట్టి, ఆకారం, అనాకారం — ఈ భిన్నత్వాల నట్లాఉంచండి — తినేటందుకు జనంలేక, పండిన బంగారు ధాన్యాన్ని అగ్నిదేవునికి కొందఱర్పిస్తూవుంటే, తినటానికి గింజలులేక అన్నమో రామచంద్రాయని అల్లాడుతున్నారు మరికొందఱు — అష్టయిశ్వర్యాలున్న మహాతల్లి, తిన్న పున్నామనరకాన్నుండి తరింపజేసే ఒకనిశువు తన గర్భవాసాన్న జనించాలని తల్లక్రిందుల తపస్సుచేస్తూ, కనపడ్డరాతికంతా మ్రొక్కి ఫలించని జీవితం దుఃఖమయమని నిస్పృహ జెందుతూవుంటే, రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవికి కడుపుడు బిడ్డలు.

300 సంవత్సరాల బానిసత్వము — అటుపైని వరుసగా అతివృష్టి, అనావృష్టి, వరదలు, భూకంపాలతో, దరిద్రదేవత పిడికిట చిక్కుకున్న భారతప్రజలకు అధికసంతానమొక పెద్దసమస్య అయింది. ఒకవంక దారిద్ర్యము, ఒకవంక జనాభా, చెట్టపట్టాలు వేసుకుని పెరిగిపోవడంవల్ల, అధికోత్పత్తికి ఒకవంక, సంతానానికి మరిఒకవంక, అధికారరీత్యానూ, అనధికారరీత్యాకూడా ప్రభుత్వము, ప్రజానాయకులూ, సంఘసేవాతత్పరులు, వివిధపథకాలను వేయవలసి వస్తూవుంది.

మొన్న 24 వ తేదీన బొంబాయినగరములో అంతర్జాతీయ పితృత్వమహాసభ జరిగినది. నానాదేశాలనుండి

( తరువాయి 10-వ పేజీలో )

ఆంధ్రరాష్ట్ర సాధనకై

# శ్రీ పొట్టి శ్రీరాములుగారి నిరాహారదీక్ష

శ్రీ పొట్టి శ్రీరాములుగారు, 1901-వ సం॥మున 163 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసులో వైశ్యకులమందు జన్మించిరి. 1920 వరకు మద్రాసులో విద్యనభ్యసించి, బొంబాయిలో శానిటరీ ఇంజనీరింగును చదివి ఉత్తీర్ణులైరి. జి. ఐ. పి. రైల్వేలో ఇంజనీరుగా పనిచేసి 1930 లో రాజీనామా ఇచ్చి సబర్మతి ఆశ్రమములో 1936 వరకు మహాత్మగాంధీగారి సహచారిగాయుండిరి.

1933 లో వ్యక్తిసత్యాగ్రహంలోను, రాజకోటలోని, రాష్ట్రీయశాలలో $1\frac{1}{2}$ సం॥లును, యరవాడా గ్రామసేవా సంఘములో $2\frac{1}{2}$సం॥లును, 1938 నుండి 4సం॥లు కోమరవోలు గాంధీఆశ్రమములోను, 1942 ఆగష్టు ఉద్యమంలోను 1943-44లో నెల్లూరు రాట్న ప్రచారములోను, 1944-46 లో హరిజనమందిర ప్రవేశ కార్యక్రమంలోను పాల్గొనుచు విశుద్ధసేవామయ జీవితమును గడుపుచు, 1933లోను, 42 లోను, ఆరేసినెలలు జైలుశిక్ష ననుభవించిరి.

1946లో నెల్లూరులో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం లోనికి హరిజన ప్రవేశమునకై 9 రోజులును, ఆసం॥లోనే హరిజన దేవాలయ ప్రవేశచట్టముకొఱకు 20 రోజులు వుపవాసముచేసిరి, 1949లో హరిజన దినోత్సవమును గవర్నమెంటు జరిపించుటకు మద్రాసులో అప్పటి ప్రధానిగానైన ఓమండూరు రామస్వామిరెడ్డిగారి యింటివద్ద వుపవాసము చేయగా న్యూసెన్సు కేసుక్రింద 1 నెల శిక్షవేసిరి. అతర్వాత అదేవిషయమై వార్ధా ఆశ్రమంలో 28రోజులు వుపవాసముచేసి, కృతకృత్యులైరి.

1950లో గాంధి స్మారకనిధికి ఆంధ్రదేశ ప్రతినిధిగా పనిచేసి 16-10-1952న ఆపదవినుండి విరమించుకొని 19-10-1952 నుండి శ్రీ బులుసు సాంబమూర్తిగారింట ఆమరణ ప్రాయోపవేశమునకు పూనుకొనిరి.

వారిధ్యేయాలు :

1. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సత్వరం జరగాలి.

2. పరిసర ప్రాంతములతో కలసిన మద్రాసు నగరమును ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యాలి.

3. మద్రాసునగర భవిష్యత్తును ఆంధ్రులు, తమిళులు తదితరులు కలసి సహృదయంతో నిర్ణయించుకోవాలి.

నిరాహారదీక్ష ప్రారంభించడానికి ముందు శ్రీ శ్రీరాములుగారు మదరాసు వాస్తవ్యులకు, తదితరులకూ ఒక విజ్ఞప్తి చేశారు. అందులో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని తామెందుకు కోరుతున్నదీ యీవిధంగా విశదపరిచినారు.

"పూజ్యబాపూజీ సిద్ధాంతాలు ఆధారముగా 1910 సం॥ నుండి నేను నిర్మాణ కార్యక్రమములో పాల్గొంటూ ఉన్నాను. గత రెండుసంవత్సరాలుగా గాంధీ స్మారకనిధికి ఆంధ్రప్రదేశ సంచాలక్‌గాను, 1948 నుండి ఆంధ్రదేశములో నిర్మాణకార్యక్రమ నిర్వాహకుడనుగాను, వ్యవహరిస్తున్నాను. ప్రత్యేకరాష్ట్రములేని కారణమువల్ల నా కార్యక్రమమునకు అనేక ఆటంకములు కలుగుచున్నవని స్వానుభవమువల్ల నేను తెలుసుకున్నాను. పరిచయస్తులు తమకార్యక్రమమందు సానుభూతిగలవారునైన ప్రభుత్వోద్యోగులు లేని కారణమువల్ల, ముఖ్యముగా ఆంధ్రదేశములో నిర్మాణకార్యక్రమము కుంటుపడి అందునిమగ్నులయినవారు నిస్సహాయు లగుచున్నారు. ప్రత్యేకరాష్ట్రము ఏర్పాటు జరుగువరకు ఏవిధమైన అభివృద్ధి కార్యక్రమము ఆంధ్రదేశములో జరుపుట సాధ్యముకానేరదని నాకు దృఢమైన నమ్మకము కల్గినది."

ఇందువల్ల రాష్ట్రనిర్మాణము శీఘ్రముగా జరుగాలనీ, ఆంధ్రనాయకులందఱూ యీ సమస్యపై ఏకాభిప్రాయము నకువచ్చి, త్వరలో యిది పరిష్కారమయ్యే విధానాన్ని ఆలోచించాలనీ, యీ ఐక్యభావాన్ని పురికొల్పి సఫలమయ్యేటందుకు ఆయన ఆమరణాంతప్రాయోపవేశదీక్షను 19-10-1952 నుండి పూనుచున్నారనీ వెల్లడించారు.

ఇంకా తెగని గడ్డుసమస్యగా రాష్ట్రవిభజన కడ్డుతగులుచున్న మదరాసు నగరాన్నిగూర్చి 1916 సం॥ నుండి జరిగిన అనేక అధికార ప్రకటనలను విజ్ఞప్తి మూలంగా ఆయన మనగుర్తుకు తెస్తున్నారు. అందులో ముఖ్యమైనవి:

1. 1916 సం॥ ఆనిబెసెంటుగారి అధ్యక్షతక్రింద

[తరువాయి 12-వ పేజీలో]



# రాజకీయాలు

• శ్రీ గోవ్వమూడి రామచంద్రరావు •

అక్టోబర్ నాలుగోవారంనుంచి నవంబర్ మూడో వారం వరకూ జరిగిన రాజకీయ సంఘటనలలో ప్రధానమైన వాటిని ఈవిధంగా చెప్పవచ్చును: కొరియా సమస్య పరిష్కారానికి ఇండియా ప్రతిపాదించిన తీర్మానాన్ని అమెరికా అనుచరదేశాలు ఆమోదించడం, దక్షిణాఫ్రికా జాతిసమస్యల పరిశీలనకు ఒక విచారణ సంఘాన్ని పంపాలని సమితి రాజకీయ సంఘం నిశ్చయించటం, సమితి కార్యదర్శి ట్రిగ్వీలీ రాజీనామా, అమెరికా అధ్యక్షుడుగా ఐసెన్‌హోవర్ ఎన్నిక, ఆహారధాన్యాలపై మొత్తానికి కంట్రోలు ఉంచాలనే భారత పార్లమెంటు నిర్ణయించడం, ఆంధ్ర రాష్ట్ర సాధనకు ప్రధానాటంకంగా ఉన్న మద్రాసు విషయమై వివిధపక్షాలకూ ఏకాభిప్రాయం ఏర్పడటం.

*　　*　　*

ఇంతవరకూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికిప్రధాన ఆటంకం మద్రాసు నగరపు సమస్యేనని చెప్పబడుతున్నది. మద్రాసు ద్విభాషాప్రాంతమేననీ, అక్కడ తమిళ జిల్లాకాంగ్రెసుతో పాటు ఆంధ్రజిల్లా కాంగ్రెసుకూడా సమానంగా ఉండాలనీ అఖిలభారత కాంగ్రెసు, మళ్లా రాజకీయాలలోకి దిగటానికి ముందుగా నిర్ణయించింది. కాని ఆకాంగ్రెస్ సంస్థ నాయకులే రాష్ట్రం కావలసి వుంటే మద్రాసుమీద హక్కులు వదులుకోవాలని షరతును విధించారు. దీనిఫలితంగా ఆంధ్రనాయకుల్లో తగాదాలు బయలుదేరినవి. కాని మద్రాసు ప్రభుత్వపు పుణ్యమా అని ఇప్పుడు ఆంధ్రనాయకుల్లో తిరిగి ఏకాభిప్రాయం ఏర్పడుతున్నది.

*　　*　　*

ఇంతవరకూ రాష్ట్రోద్యమం అనేది ముఖ్యంగా మధ్య తరగతులనూ, విద్యావంతులనూ మాత్రమే ఆకర్షించ గలిగింది. రాష్ట్రం రానందువల్ల తమకు కలుగుతున్న నష్టాలను కానీ, చేయిజారి పోతున్న లాభాలను కానీ జనసామాన్యం గ్రహించలేక పోయింది. రాష్ట్రప్రభుత్వపు పక్షపాత విధానంవల్ల ఆంధ్రప్రాంతం అభివృద్ధి లేకుండా ఉన్నదని విద్యావంతులు చెప్పినప్పటికీ అది జనసామాన్యాన్ని కదిలించలేక పోయింది. రాష్ట్రంవస్తే వచ్చే అభివృద్ధి ఏమిటో, అది తమకు ఏవిధంగా లాభిస్తుందో వారికి సరిగా అంతుపట్టలేదు. అందువల్ల ఇంతవరకూ రాష్ట్రోద్యమం వారిలో వ్యాపించకుండా కేవలం మధ్యతరగతి రాజకీయ నాయకులకు ప్రచారాయుధంవలె మాత్రమే ఉపయోగపడ్డది.

*　　*　　*

జనసామాన్యానికి ఏవోలాభాలు రాగలవనే సంగతి అర్థమయినా, కాకపోయినా, తమకు తక్షణం కలుగుతున్న నష్టాలను మాత్రం గుర్తించగలదు. ఉమ్మడి రాష్ట్రంవల్ల తమకు నిజంగా అన్యాయాలు జరుగుతున్నవని వారు గ్రహిస్తేమటుకు సహించరు. ఈవిషయాన్ని మద్రాసుప్రభుత్వం తెలుగు ప్రజలకు అర్థమయేట్లు చేసింది.

తెలుగుదేశపు పరిశ్రమలనూ, మైనర్ ఇరిగేషన్ ప్రాజక్టులనూ, మరమ్మత్తులనూ ప్రభుత్వం ఉపేక్షించి నందువల్ల కరువులు, కాటకాలతాకిడి మరింత ఎక్కువయింది. ఎన్నో సం॥ల నుంచీ రాయలసీమలో వాడుక అయిపోయిన కాటకం గుంటూరు, నెల్లూరు మెట్టప్రాంతాలకు కూడా వ్యాపించింది. రాయలసీమ కరువుకు వానలు లేకపోవటం కారణమని చెపుతారు కాని కురిసిన వాన నీటిని నిలవజేసే ఏర్పాట్లు కనిపించవు. ఆఖరికి కృష్ణ ఆనకట్ట దెబ్బతిన్నదని అనధికారులు, పత్రికలు మొరపెట్టుకున్నప్పటికీ అధికారులు అతిశయోక్తులని కొట్టివేశారు. ఈఅంశాన్ని కృష్ణ ఆనకట్ట ప్రమాద విచారణ సంఘం

సూచించింది. ఈకారణంమీదనే ప్రభుత్వ చీఫ్ఇంజనీరు రాజీనామా చెయ్యవలసి వచ్చింది.

*   *   *

మద్రాసు ప్రభుత్వం డబ్బువిషయంలో ఆంధ్రప్రాంతాన్ని ఉపేక్షించటంతో తృప్తిపడక, కృష్ణానీటిని దక్షిణాదికి తరలించుకుని పోవాలని ప్రయత్నించింది. ఇది తెలుగు దేశపు జన సామాన్యాన్ని పూర్తిగా కదిలించి వేసింది. తెలుగు దేశంలో ప్రధాన రాజకీయ పక్షాలన్నీ ఏకమై దీనిని ప్రతిఘటిస్తున్నవి. హైదరాబాద్ ప్రభుత్వంకూడా ఆంధ్ర ప్రజలతోపాటు నందికొండను కోరుతున్నది వీటన్నిటినీ కేంద్రప్రభుత్వం కాదంటుందేమో చూడవలసి ఉన్నది.

నందికొండ ఉద్యమంవల్ల జనంలో కలిగిన కదలికను ఉపయోగించి రాష్ట్రసాధనకు ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈకారణంవల్లనే ఆంధ్రప్రదేశ కాంగ్రెసు కూడా మద్రాసు విషయమై తన వైఖరిని మార్చుకుని దానిని కేంద్రపాలిత ప్రాంతంగా చేయాలని కోరింది. దానికి ప్రకాశంగారు కూడా ఆమోదించారు.

*   *   *

భారతప్రభుత్వం నవంబర్ మూడోవారంలో నూతన ఆహార విధానాన్ని ప్రకటించింది. దీనితో కంట్రోళ్ళను తొలగించాలనే ఉద్యమానికి ఒక విధంగా ఫుల్‌స్టాప్ పెట్టబడిందని చెప్పవచ్చు. కేంద్రఆహారమంత్రి కిద్వాయ్, మద్రాసు ముఖ్యమంత్రి రాజాజీ, బొంబై కాంగ్రెస్ నాయకుడు ఎస్. కె. పాటిల్ మొదలైనవారంతా కంట్రోళ్ళను తొలగించాలని వాదించారు. కిద్వాయ్ దీనికోసం దేశమంతా తిరిగిప్రచారం చేశారు.

కాని ప్లానింగ్ కమిషన్ సలహాసంఘంలో ఉన్నఆర్థిక నిపుణులు యావన్మందీ కంట్రోళ్లులేకపోతే ఆర్థికవ్యవస్థ ఒకపద్ధతిని దేనిని అనుసరించలేవనీ, పంచవర్ష కార్యక్రమం కూడా సాగదనీ హెచ్చరించారు. ఆర్థికమంత్రి దేశముఖ్, మాజీనిర్మాణమంత్రి గాడ్గిల్ మొదలైనవారు పార్లమెంటులోనే గట్టిగా ప్రతిఘటించారు. తత్ఫలితంగా ప్రధానినెహ్రూ ఆర్థికనిపుణుల సలహానుపాటించి కంట్రోళ్ల రద్దుఉద్యమాన్ని నిలిపివేశారు. ధాన్యసేకరణ, ధరల అదుపు మొదలైనవి ఉండగలవని తెలియజేశారు.

ఆహారకంట్రోళ్ల రద్దు మద్రాసులో ఎంతవరకు నెరవేరిందంటే, సాధారణ ప్రజలకు సంబంధించినంత వరకూ నెగ్గలేదని చెప్పవలసి ఉంటుంది. ధరస్థాయి పెరిగిపోయిందని కేంద్ర ప్రభుత్వపు అంచనాలే అంగీకరించినవి. కంట్రోళ్లరద్దు ధరలతగ్గింపుకుకానీ, ఉత్పత్తిని ప్రోత్సహించటానికికానీ ఉపయోగించలేదని వెన్నెలకంటి రాఘవయ్యగారు కిద్వాయ్‌కి ఒకలేఖలో స్పష్టపరిచినట్లు మెయిల్ పత్రికి వెల్లడించింది.

ఏవో ఆశలమీద ఆధారపడి విధానాలను నిర్ణయించలేమనీ, ముఖ్యంగా ఆహారవిధానాలను నిర్ణయించలేమనీ, ప్రధానినెహ్రూ పార్లమెంటులో ప్రకటించి ఉన్నారు. మద్రాసు ముఖ్యమంత్రి రాజాజీ మటుకు వర్షాలు కురుస్తవనీ, వర్తకులు న్యాయంగా ప్రవర్తిస్తారనీ, జనం చౌకడిపోలను వదిలిపెట్టి ఎక్కువధరలకు ఇతరచోట్ల కొనుక్కుంటారనీ ఆశలు పెట్టుకుని కంట్రోళ్ళను రద్దుచేశారు. పరిస్థితి చేయిజారిపోకుండా అధికారాలు చేతిలో పెట్టుకోవచ్చును కాని, ఆపరిస్థితి ఏర్పడే వరకూ ప్రజలు ఎంతో బాధపడవలసి వుంటుంది.

మద్రాసులో కంట్రోళ్ళరద్దువల్ల రేషన్‌శాఖ సిబ్బంది జీతాలరూపంలో కోటిరూపాయల మిగులు ప్రజలకు వచ్చినట్లు చెప్పబడుతున్నది. కాని ప్రజలుతినే ప్రతిఒక్కగింజకూ ఎక్కువధరనుపెట్టి ఎంతనష్టపడుతున్నారో లెక్కవేయటం అవసరం. మద్రాసు సేకరణను రద్దుచేయటంవల్ల దానిలోటు భర్తీ భారం కేంద్రంమీద పడ్డదని ఆర్థికమంత్రి దేశముఖ్ పార్లమెంటులో స్పష్టపరిచారు. మద్రాసులో ప్రజలు పూర్తిరేషనులనుకూడా కొనలేకపోయినట్లు పార్లమెంటులోనే అంగీకరించబడ్డది.

*   *   *

కొరియాయుద్ధ విరమణ ఒప్పందానికి యుద్ధఖైదీల పరటా ఒక్కటరకే ఆటంకంగా ఉన్నది. ఖైదీల నందరినీ పూర్తిగా మార్చుకోవాలని కమ్యూనిస్టులు అంటే ఇష్టంలేని ఖైదీలను బలవంతాన స్వదేశాలకు అప్పగించేది లేదని అమెరికా అంటున్నది. ఈ సమస్యను పరిష్కరించటానికి ఇండియా నవంబర్ మూడవవారంలో సమితిలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించింది. దీనినిబట్టి యుద్ధఖైదీలు తిరిగీ యుద్ధంలో పాల్గొనకుండా చేయటానికి స్వీడన్, స్విట్జర్లాండ్, పోలెండ్, జెకోస్లేవేకియాలతో ఒకతటస్థ

సంఘాన్ని నెలకొల్పాలి. ఖైదీలను ఎవ్వరూ బలవంతాన నిలిపివేయటంకానీ, పంపివేయటంకానీ ఉండదు. 3 నెలల లోపుగా విషయం తేలని ఖైదీల సమస్యను వివిధ సమస్యల పరిష్కారానికి ఏర్పాటుచేసే రాజకీయ సమావేశంలో పరిశీలించాలి.

ఈ తీర్మానం రాగానే అమెరికా ప్రతిఘటించింది. కాని అమెరికా అనుచరులయిన బ్రిటన్, ఫ్రాన్స్ మొదలయిన దేశాలు బలపరచినవి. సోవియట్ వర్గదేశాలు సుముఖంగానే ఉన్నవి. అమెరికాకూడా లొంగివస్తున్నట్లు తెలుస్తున్నది. ఇది యుద్ధాన్ని ఆపగలదన్న నమ్మకాన్ని ప్రముఖులు వెల్లడించారు.

* * *

నవంబర్ 13 వ తేదీన ఐక్యరాజ్యసమితి న్యాయ శాఖాధికారి అబ్రహం ఫెల్లర్ మేడమీదనుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. సమితి ఉద్యోగుల్లో కమ్యూనిస్టు అభిమానులు ఉన్నారని చెప్పి అమెరికా ప్రభుత్వం సాగిస్తున్న చర్యలను ఈయన చాలా నిరసించి ఉన్నట్లు సమితి కార్యదర్శి లీ వెల్లడించారు. ఈ కారణాలవల్లనే ఆయన ఆత్మహత్య చేసుకున్నట్లు సమితివర్గాలంతా భావిస్తున్నారు. ఇది జరిగిన కొద్దిరోజులకే సమితికార్యదర్శి లీ కూడా తనపదవికి రాజీనామా ఇచ్చాడు. సమితి ఉద్యోగులపట్ల అమెరికా ప్రభుత్వపై ఖరి, ఫెల్లర్ ఆత్మహత్య. కమ్యూనిస్టు వర్గాలకు తన పట్లగల విముఖత. దీనికి కారణాలని చెప్పబడుతున్నవి. కమ్యూనిస్టు వ్యతిరేక విచారణల్లో సాక్షిగా లీని పిలవాలని అమెరికా ఆలోచిస్తున్నది. కాని ఆయన అంగీకరించరని తెలుస్తున్నది.

ఈ సంఘటనలు ఐక్యరాజ్యసమితి లక్షణాలను చాలా వరకు తెలియజేస్తున్నవి. సమితికి ఆతిథ్యం ఇచ్చినదేశం అమెరికా సమితిసిబ్బందిలో ఒక్కరుకూడా తనకు ప్రతికూలురు లేకుండా తొలగిస్తుండగా కార్యదర్శికూడా అసమర్థుడయిపోయినాడు. అయితే ఇది సమితికి కొత్తకాదు. ఆఫ్రికా ఆసియా వలసదేశాల ప్రజలు సాక్ష్యమివ్వటానికి వీలులేకుండా సమావేశం జరిగిన దేశప్రభుత్వాలు (ఫ్రాన్స్ మొ॥) నిషేధించినప్పుడు ఆమోదించిన లీ ఇప్పుడు తానే ఆ పరిస్థితిని ఎదుర్కొంటున్నాడు.

* * *

కమ్యూనిస్టు బెదురు చూపించి తమ పీడన విధానాలను సాగించుకొనటమనే సూత్రాన్ని సామ్రాజ్యదేశాలు బాగా ఉపయోగించుకుంటున్నవి. అయితే దానికి కూడా ఒక మితం ఉన్నది. అందువల్లనే అట్లాంటిక్ ఒప్పందాన్ని కమ్యూనిస్టు దేశాలు నిరసించనప్పుడు లెక్కచేయని ఆసియా దేశాలు (ఇండియాతోసహా) తరవాత ఆ ఒప్పందాన్ని సామ్రాజ్యరక్షణ ఒప్పందంగా నిరసించినవి.

ఇట్లాగే యూరపియన్ దేశాలన్నీ బలపరచినప్పటికీ మలాన్ వివక్షత విధానాన్ని సమితి నిరసించి పరిస్థితుల పరిశీలనకు ఒకసంఘాన్ని నియమించింది.

* * *

నవంబర్ 4 న అమెరికా అధ్యక్షపదవికి ఎన్నిక జరిగి రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి ఐసెన్ హోవర్ పెద్ద మెజారిటీతో గెలిచాడు. కాంగ్రెసులో కూడా ఆ పార్టీకే మెజారిటీ వచ్చింది. ఈ మార్పువల్ల అమెరికా విదేశాంగ విధానంలో చెప్పుకోదగ్గమార్పులేవీ ఉండవనీ. శాంతికి అనుకూల పరిస్థితి ఏప్పడే ఆశ లేదనీ చెప్పవలసి వుంటుంది. పసిఫిక్ ఒప్పందాన్ని తయారుచేసిన జాన్‌ఫాస్టర్‌డాలెస్ ఐసెన్ హోవర్ విదేశాంగమంత్రిగా ఉండబోతున్నాడన్న సంగతి ఈ విషయాన్ని నిరూపిస్తున్నది.

* * *

కెన్యా, మలయా, మొరాకో, ట్యునీషియాలలో సామ్రాజ్యవాదాల దురాగతాలు సాగుతూనే ఉన్నవి. సుడాన్ స్వతంత్రంగా ఉండాలనే పక్షాలతో ఈజిప్టు ప్రధాని నజీబ్ ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఆ సమస్యను పరిష్కరించటానికి ఇది తోడ్పడవచ్చును. అయితే స్వదేశవ్యవహారాల్లోమటుకు నజీబ్ ప్రజాస్వామ్యాన్ని తోసి రాజని పూర్తిగా నియంతఅయే సూచనలు మాత్రం బాగా కనిపిస్తున్నవి.



# ప్రస్తుత పరిస్థితులు

• శ్రీమతి అచ్యుతుని గిరిజ •

## కవినిధి కర్తవ్యం.

నాగపూరుజిల్లాలో రామటేక్ అని ఒక కొండఉన్నదిట. కాళిదాసుమహాకవి "రామగిరి ఆశ్రమం చూసి వచ్చావా ఓమేఘమాలా" అని పలికిన పలుకు యీరామటేక్‌ను గురించేనని పండిత ప్రకాండులంతా నిగ్గుతీశారు. ఇటువంటి ఘనతకెక్కిన పర్వతంపైన, ప్రపంచమంతటా ఘనతకెక్కిన కాళిదాస మహాకవి స్మృతి చిహ్నంగా ఒక సంస్కృత విశ్వవిద్యాలయము స్థాపించాలని చాలా తీవ్రమైన కృషిజరుగుతున్నది. ఇంచుమించుగా యీమాదిరిగానే, విఖ్యాతరచయిత జార్జిబెర్నార్డుషా స్మారక సంఘం అంటూ ఒకటి స్థాపించి, ఒకనిధికూడా వసూలుచేయటం జరిగింది. ఇటు కాళిదాసు, అటు షా — యిద్దరు కూడా తమ జీవితకాలంలో పొందవలసిన గౌరవ సత్కారాలన్నీ పొందినవాళ్ళే. ఆర్థికంగా కొరతలేకపోగా — కాళిదాసు విషయంనాకు తెలియదుగాని, షా అయితే తినేవాళ్ళులేక తన సంపదనంతా దేశానికే వదలి వెళ్లాడు. కాగా - వాళ్ళ రచనలు తమ తమ దేశానికేకాక, ప్రపంచమంతకీ చెందిన సాహిత్యంగా ఎంచబడుతున్నవి. అందువల్ల కాళిదాస, బెర్నార్డుషాల వంటి విఖ్యాత రచయితలకు, కవులకు యీ స్మారక సంఘాలు,నిధులు, సంపాదించి పెట్టగల, నిలబెట్టగల ఘనత అంటూ యేమీవుండదు. అయితే పూజనీయులయిన పెద్దలపేరు తల్చుకుని అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం యిటువంటి సత్కార్యాలు చేయటం మనకు పరిపాటి. అందువల్ల ప్రశాంతమైన రామగిరి ఆశ్రమాలలో సంస్కృత సాహిత్యం చదివిచూస్తు రిసెర్చిచేస్తు వుంటే నిజంగా యెంతో చక్కగానే వుంటుంది. కాని —

మూడేళ్ళ పిల్లలను చదివించటానికి నర్సరీ స్కూళ్ళు వుంటున్నవి. ఊరూర వాడవాడన హైస్కూళ్ళు యిట్టే లేచినవి. ప్రతి సంవత్సరం కొత్త కొత్త కాలేజీలు స్థాపించబడుతున్నవి. ప్రతి విషయాన్ని గురించి రిసెర్చి చేయటానికి సరికొత్తరిసెర్చి సెంటర్లు పుడుతున్నవి. అటువంటి సందర్భంలో మనదేశాని కంతకీ మూలభాషగా, దేవభాషగా పూజింప బడుతున్న సంస్కృతభాషను నేర్చుకోవటానికి గాని, రిసెర్చి చేయటానికి గాని ఒక కేంద్రం లేకపోతుందా? ప్రభుత్వమే ఒకటి స్థాపించి తీరుతుంది. అందులోను యిప్పుడు ప్రతిమంత్రి, ప్రతినాయకుడు సంస్కృతం చదువుకోమనే ప్రజలకు చెపుతున్నారు. కాబట్టి ఆశుభముహూర్తం దగ్గరలోనే వచ్చిందని కూడ నమ్మవచ్చు. ప్రభుత్వం పూనుకుని నిర్వహించ వలసిన, నిర్వహించగల పనికిగాను ప్రత్యేక సంస్థలు పూనుకోవటం, కష్టపడి సంపాదించిన నిధులు ఖర్చుచేయటం అట్టే అపురూపంకాదు. ప్రభుత్యం పూనుకోదని గట్టిగా తెలిసిన విషయాలు కొన్నివున్నవి. అటువంటి సందర్భాలలో ప్రత్యేక సంస్థలే కొంత వరకు పూనుకుని నిర్వహించ వలసిన అవసరం వున్నది. మచ్చుకి —

నూనూగుమీసాల నూత్నయౌవనంలో కవిత నల్లిన బాలకవులు, నాయికానాయకులను చందమామలను వర్ణించే శృంగార కవులు, భాషనే అధిగమించే భావాల స్పీడు వల్ల చుక్కలతో గీతలతో గీతాలల్లే భావకవులు, కొత్తగా దిగుమతి అయిన ప్రజాకవులు, జటిలమైన విషయాలను జటిలతమమైనభాషలో వర్ణించే ప్రౌఢకవులు, జాతీయ కవులు, విశ్వకవులు మొదలయిన అన్ని తరగతులకు చెందిన కవులు మనదేశంలో వున్నారు. మనదేశమేమిటి? అన్నిదేశాలలోను వున్నారు. అయితే వీళ్ళందరు కాళిదాసషాల మాదిరి తమజీవిత కాలంలోనే సిరిసంపదలను ఖ్యాతిని కూడాపొంది సంతోషించుతున్నారా? "పద్యం అల్లటమంటే వూరికేవున్నదా, దానికెంత హంగుకావాలో విన"మంటు వెనక రాయలవారి ఆసరాచూసుకుని అల్లసాని పెద్దనగారు ఒకచక్కని జాబితాయిచ్చారు. మరియీనాడు అటువంటి ప్రభువుల ఆసరాలులేవు. అందుచేత ఆజాబితాలన్నింటిని మనస్సులోనే వూహించుకుంటూ రచనలుసాగించేకాలం యిది. ప్రేమ్‌చంద్ ఒకచోట 'నారచనలన్నీ శ్లాఘించేవాళ్ళే గాని కొనేవాళ్ళు కనపడర'ని అన్నాడు. ఆమాటలు వర్తించే కవులు మరికొంతమంది మనదేశంలోనేకాదు విదేశాలలో కూడా లేకపోలేదు. ఈసమస్య కవులలోనే ప్రత్యేకించి వున్నారని చెప్పబోవటంలేదు. అయితే యిది ఆసందర్భం గనక వాళ్ళను మాత్రం చెప్పవలసివచ్చింది. పోతనామాత్యుడి మాదిరి అభిమానంవల్ల గాని, ప్రేమచందు చెప్పినట్లు కలిసిరాక గాని ఆర్థికంగా

బాధపడేవాళ్ళు కొంత మంది తప్పక వుండితీరుతారు. అటువంటి వారి రచనలకు అయ్యే ప్రచురణ యేర్పాట్లు చేయటం, తిండికి కొరతలేకుండ కొంత సహాయం చేయుటం మనవిధి. మహాభోగులు, అదృష్టశాలులు అయిన కాళిదాస, షేల వంటి కవుల పేరుగా సేకరించిన నిధులను, వాళ్ళమాదిరి సాహిత్య సేవచేయటానికి పూను కుని, లేమివల్ల అణగారి పోతున్న రచయితలకు వెచ్చిం చడం చాలాసమంజసమని తోస్తుంది. అది పెద్దలపేరు తల్చుకుని వాళ్ళ స్మృతి చిహ్నంగా చేయతగిన సత్కార్య మనే అనిపిస్తుంది. ప్రస్తుతపరిస్థితులలో ప్రభుత్వం ఈపనికి యెంతమాత్రం పూనుకోలేరు. కాబట్టియిటువంటిసంస్థలు, సంఘాలు పూనుకుని దానిని నిర్వహించడం అవసరం.

*　　　*　　　*

## వార్తాలహరి :

ఏనిమిది తొమ్మిది సంవత్సరాల పిల్లవాడు 'సంసారం' సినిమాలో 'అమ్మా ఆకలీ' పాటను అతి ముద్దుగా పాడుతూ ముష్టికి వచ్చాడు. ''నేనడిగేదొక కానేనండీ'' అనికూడ ఆపాటకు జోడించాడు. మట్టిమరకల ముఖంతో చింకి చొక్కాతో యీ పాట పాడుతూ వచ్చిన ఆ పసి వాడికి, వాడి కోరిక ప్రకారం కానిడబ్బు విసరని సరాధ ములు యెవరు వుంటారు! తప్పక విసురుతాము. అదే వచ్చిన చిక్కు. ముష్టివాళ్ళ బెడద యెక్కువగావున్నదని వాళ్ళకు ప్రోత్సాహ మివ్వక, తగిన బందోబస్తుచేసి, వాళ్ళకు తిండి, గుడ్డ యిచ్చి, ఒక చోట వుంచాలని పత్రి కలనిండా చూస్తాము. మళ్ళీ వాళ్లు కాని అడిగితే జాలిపడి కానీతోపాటు అరటి పండు కూడా యిచ్చి పంపుతాం. ఇట్లా ఒక తీవ్రసమస్య తయారయింది. వాళ్ళకు సంతాన నిరోధం బోధించితే ఆ జనసంఖ్య పెరగకుండా వుంటుం దని కొంతమంది వ్రాస్తున్నారు. సేద్యం చేసుకోమని తలా కొంతభూమి ఇస్తే వాళ్ళు బాగుపడతారు, మనబాధ తీరుతుందని మరికొందరంటారు. మద్రాసు కార్పొరేషన్ వారు ''మేము చేయగల పనులన్నీ చేసి చూశాము. పడ గల పాట్లన్నీ పడ్డాము. కాని ప్రతీరోజు కొత్తగావచ్చి పడుతున్న ముష్టివాళ్ళ ప్రవాహాన్ని కార్పొరేషనుగాని, మదరాసు పౌరులుగాని యెంతవరకు భరించగలరు. ప్రభు త్వమే పూనుకోవాలి'' అని అన్నారు. ఈ సమీక్షలన్ని చదువుతుంటే నిజమేననిపించింది. దేశమంతట ఒకపద్ధతి పెట్టి దేశమంతట ఒకేసారిగా అమలు జరిపితేతప్ప లాభం లేదనిపించుచున్నది. ఇట్లాఅనుకుంటు పత్రిక తిరగవేస్తు వుంటే ఒకవార్తకనిపించింది. కెనడా దేశంలో పిల్లలను ఆరోగ్యంగా చదువుసంధ్యలు చెప్పిస్తూ పెంచటానికిగాను ప్రభుత్వం ఒక్కొక్కపిల్లకు నెలకు 5 నుంచి 8 డాలర్ల వరకు తలిదండ్రులకు సహాయంగా యిస్తుందిట. అదయినా ఒకసంవత్సరమో రెండుసంవత్సరాల వరకో కాదు, బిడ్డలకు 16 సంవత్సరాల వయసు వచ్చేవరకు యిస్తారుట. నిజంగా ఆశ్చర్యం వేసింది. మనదేశములో తాగటానికి గుక్కెడు పాలులేక యెంతమంది నిర్భాగ్యశిశువులు అల్లాడి పోతు న్నారో! వాళ్ళకు కొంతవయసు వచ్చేవరకయినా వుచితంగా పాలుపోయించ గలిగితే యెంతబాగుండును! అయినా తినతిండిలేని జనాభా నశించాలని కోరుకునే ఆధునిక ఆర్థిక వేత్తలు వుండగా వాళ్ళకు పాలుపోసి పెంచడం యెందుకు? వృధాగా బాధపెట్టటం. ఇన్నిఆలోచనలతో ఆఘట్టంముగించి ఆ తరువాతవార్త ఆరంభించాను. ఏమనిచెప్పుదు కురునాధా అని జ్ఞాపకం వచ్చింది. అంటే గాంధారి, కౌరవులు వగైరా వగైరా అంతా. మధ్యప్రదేశ్‌లోని జనాభా ప్రకారం 56 గురు తల్లులు ఒక్కొక్కరు 22 గాని అంతకుపైగా గాని బిడ్డలను కన్నవాళ్ళు వున్నారుట. ఇంక ఆరువేలమంది స్త్రీలు 15 నుంచి 19 గురు వరకు బిడ్డలను కన్నారుట. ఇదీవార్త. ఒక్క మధ్యప్రదేశ్‌లో మాటనుమండి యిది. మరి శ్రద్ధ, శ్రమ తీసుకుని మన దేశమంతట అలాతీస్తే యిటువంటి అదృష్టశాలినులయిన తల్లులు ఎన్ని లక్షలమంది వుంటారో! ఇటువంటి పరిస్థితు లలో కెనడాలో యిచ్చిన విధంగా బిడ్డకు నెలకు యింత అని డబ్బుసహాయం చేయమని ప్రభుత్వాన్ని అడగటమా, వూరుకోటమా? నిజానికి ఏప్రభుత్వంమాత్రం భరించగలదు యీ లెక్కన?

ఇంచుమించు ప్రపంచమంతట ఆహారం కొరతగా వున్నట్లే కనిపిస్తున్నది. చైనానుంచి సిలోనుకు, అమెరికా నుంచి బర్మాకు, రష్యానుంచి యిండియాకు యెంతో కొంతధాన్యం రవాణా అవుతున్నట్లే తెలుస్తున్నది. నిజం గానే కొరతగా వున్నదో, లేకపోతే పరస్పర స్నేహం నెరుపుకున్నట్లు ప్రపంచానికి తెలియడంకోసం యిదొక మార్గమే అయిందోమరి. అంతుపట్టని ఈ సమస్యలు బుర్రకు యెక్కించుకోలేక పక్కపేజీకి తప్పుకోవలసి వచ్చింది. అక్కడొక వింతవార్త కనిపించింది. దనలక్ష్మి

## ప్రస్తుత పరిస్థితులు

అనే 17 సంవత్సరాల కూర్గు అమ్మాయి ఆరు నెలలనుంచి భోజనం సరిగదా, నీళ్ళుకూడా తాగటం లేదుట- అయినా ఎంతో చలాకీగా చురుకుగా ఆరోగ్యంగా వుంటు, రెండు బిందెలతో నీళ్లుతేవటానికి పోతున్నట్లు ఫోటోకూడా వేశారు. ఆమె యెట్లా వుండగలుగు తున్నది కనుక్కోవాలని పెద్దలంతా కలిసి ఆస్పత్రిలో 19 రోజులు వుంచి పరీక్షించారు. హాయిగా తిరిగే పిల్లను ఆస్పత్రిలో వుంచితే విసుగువేసి ఆమెముఖం వాడినదేగాని, డాక్టర్లకు అంతు పట్టిన అంశం మాత్రం యేమీలేదుట. ఇంతకు చెప్ప వచ్చేది యేమిటంటే కోటివిద్యలు కూటికొరకేనని పెద్దలు సూక్ష్మంలో చెప్పేశారు. ఆ బాధకు ఆగలేకనే బిచ్చమైనా ఎత్తటం. ఆ బాధనుంచి ప్రజలను కాపాడటానికే మాయబియ్యం, మరిపాలు వుత్పత్తిచేయటానికి పూను కోవటం. ఆ ఆకలిబాధతో ప్రజలు నిస్పృహ చెందకుండా వుండటానికే మంత్రులు దేశం పర్యటించి రావటం. ఆకలివల్ల యిటువంటి కష్టనష్టాల నెన్నింటినో యెదుర్కోవలసి వస్తున్నది- ఇంతకన్న ప్రపంచ ఆరోగ్యసమితి సహాయంతో, ధనికసంస్థల సహాయంతో ప్రభుత్వం పూను కుని మనకు తెలియకుండానే ఆకలిని జయించగల మార్గం కనుక్కుంటే ప్రయోజనం చాలా వుంటుంది. క్రమ క్రమంగా వుపవాసాలు, పత్రభక్షణలు వాయుభక్షణలు మొదలయిన మార్గాలు చెపుతారేమోనని భయపడే మనకు అసలు ఆకలే తెలియని మార్గం అని చెప్పవలసి వచ్చింది. ఈ సహాయం చేసిపెడితే ప్రభుత్వోద్యోగులేకాక అందరూ నూటికి 20 చొప్పున అయినా జీతం తగ్గించుకోవటానికి సంతోషంగా వప్పుకుంటారు. రోజుకు కనీసం నాలుగు గంటలచాకిరి, యాభై చివాట్లు తప్పించినందుకు భారత మహిళలు యావన్మంది ప్రభుత్వానికి కృతజ్ఞులై వుంటూ యెంతో సహకరిస్తారు. నిజంగా అటువంటి ఆకలిలేకుండా చేసే (కత్తీ ఆహారంతో కాదు) వుపాయం కనిపెట్టినట్లు యేనాడు వార్తవస్తుందోనని యెదురుచూతాం.



## కుటుంబపథకము నిర్ణీతసంతానము

(3-వ పేజీ తరువాయి)

400 మంది ప్రతినిధులు ఇక్కడ సమావేశమయ్యారు. జనాభా అభివృద్ధిని అరికట్టి ప్రపంచ దారిద్ర్యాన్ని పోగొట్టాలన్న ఔత్సుక్యం, ఆతృత యీ సభకు కారణభూతాలు—భారత ఉపాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు యీ సభను ప్రారంభిస్తూ, సరియైన విరామముతో తగుమాత్రము సంతానము బడయుటయే తమ దృష్టిలో కుటుంబపథకము కాగలదనియు, సంసారము సుఖమయముగా జేసుకొనదలచిన కుటుంబీకులు యీ కుటుంబ పథకాన్ని అనుసరిస్తూ, సంతానాన్ని నియమించుకోవడం అత్యంతావశ్యకమనియూ ఉపన్యసించారు. జనాభావృద్ధిని అరికట్టడంచాలా ముఖ్యమైన అంశమని, యీ జనాభా సమస్య తీరనిదే యింక తక్కిన సమస్యలు పరిష్కరించడం అసంభవముగా తోస్తున్నదనీ, దీనిని గూర్చిన చర్చలు జరపడం, అన్నివిధాలైన ప్రయోగాలను పరిశీలించి దానివల్ల లాభముపొందడం, భారత ప్రభుత్వానికి సమ్మతమేననీ, భారతప్రధాని నెహ్రూగారు సందేశము పంపినారు.

ఈ నియమిత సంతానం, అసహజమైన కృత్రిమగర్భనిరోధక విధానాలవల్లగాక, ఆధ్యాత్మికమైన సంయమనం, ఆత్మనిగ్రహంద్వారా జరగాలని. వేదాంతవిద్యావేత్తలైన శ్రీ రాధాకృష్ణన్‌గారు ఉపన్యసించడం చాలా సహజంగా వున్నది. విజ్ఞులైన వారికి సమంజసముగానూ ఉన్నది.

ప్రస్తుత ఆర్థిక వ్యవస్థలో కుటుంబపథకాల ఆవశ్యకతను కాదని ఎవరూ సాహసించి అనలేరు. అయితే పాశ్చాత్యదేశాలలో ప్రస్తుతం అమలులోఉన్న కృత్రిమవిధానాలు మనదేశ ఆర్థిక పరిస్థితిలో ఎంతవరకూ సాధ్యమౌతాయి, శాస్త్రవిద్యాశూన్యులైన మనదేశపు అశేషజన బాహుళ్యానికి ఎంతవరకూ అమలు జరుప వీలైనవిగా ఉంటాయి, దీనియందలి నైతిక విలువ ఎంతమాత్రం, నెమ్మదిమీదనైనాగాని ఆత్మనిగ్రహవిధానాన్ని అవలంబించే విజ్ఞానాన్ని ప్రజాసామాన్యానికి అందేటట్టు ప్రచారం చేయడం, ప్రభుత్వానికీ, ప్రజానాయకులకూ, సంఘసేవకులకూ, మోయలేని భారమూ, పూనలేని బాధ్యతా ఔతుందా? ఈ విషయాలన్నీ ప్రాజ్ఞులందరూ పరిశీలించి విర్ణయించ

# ★ మహిళాలోకం ★

## విజయనగరంలో మహిళా సంగీత సభ

విజయనగరంలో 5-వ తేదీ బుధవారంనాడు, మహారాజావారి సంగీత కళాశాలలో, శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి అధ్యక్షతను, మహిళా సంగీతసభ ప్రారంభోత్సవం జరిగింది. శ్రీ విస్సాఅప్పారావుగారు సభను ప్రారంభించినారు. ఇందుచాలామంది పాల్గొనిరి. మహిళా సంగీత సభాధ్యక్షురాలు కుమారి ద్వారం అలివేలుమంగ తాయారు ఆహూతులకు, అధ్యక్షప్రారంభకులకు సుస్వాగతంచెప్పేరు. అధ్యక్షులు, తమప్రసంగంలో "నేతిబీర కాయవంటి ఉన్మాదసంగీతంపైని మోజువదలి, శాస్త్రీయ సంగీతంపై ప్రజలు అభిరుచి పెంచుకోవాల"ని హెచ్చరించారు. శ్రీ విస్సాఅప్పారావుగారు తమప్రసంగములో సంగీత విద్వాంసుల పోషణకు ప్రభుత్వం పూనుకోవాలని అన్నారు. కార్యదర్శిని కుమారి చాగంటిఅమ్మాజీ సభ ఆశయాలనుతెలుపుతూ శాస్త్రీయసంగీతం ఏకారణం వల్ల నైతేనేమి ఆంధ్రదేశంలో అనాదరింప బడుతుందని, శాస్త్రీయసంగీతంపై మోజులేనివారికి మోజుకల్పించడం, వున్నవారికి వర్ధిల్లచేయడం తమసంస్థ ఆశయమని అన్నారు. తరువాత శ్రీమతి కొత్తపల్లిలలితగారు లలిత కళలను గురించి ఆంగ్లంలో వుపన్యసించేరు. శ్రీ టి. నరసింహాచారిగారు తదితరులు సంగీతకళయొక్క స్థానాన్ని గురించి మాట్లాడేరు. మహిళాసభసభ్యులచేబృందగానము, శ్రీ ఓరుగంటి ఆదిలక్ష్మమ్మగారిచే వీణాగానం చేయబడినది. కుమారి మునుకుట్ల మహాలక్ష్మి వందనములతో సభముగిసినది.

*　　*　　*

## విడాకుల చట్టం

పార్లమెంటు ప్రజాసభ తాలూకు 11 మంది స్త్రీ సభ్యులు, ఆడవాళ్ళకు సంబంధించిన పెళ్ళి విడాకుల బిల్లును శాసనం చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరవలసిందని ప్రజలకు విజ్ఞప్తి చేసారు.

ఈ విజ్ఞప్తిమీద శ్రీమతి సుచేతా కృపలానీ, శ్రీమతి ఉమానెహ్రూ, శ్రీమతి తారకేశ్వరిసిన్హా, శ్రీమతి బి. కే. కాంగ్మన్, శ్రీమతి గంగాదేవి, శ్రీమతి ఇందిరా మాయాదేవి, శ్రీమతి అమ్ముస్వామి నాథన్, శ్రీమతి కమలేందు మోతిషా, శ్రీమతి అన్నమాస్కారేగ్, శ్రీమతి రేణుకా చక్రవర్తి మొదలగు స్త్రీ సభ్యులు సంతకాలు చేసారు.

*　　*　　*

## అఖిల భారత మహిళామహాసభ హైదరాబాదు శాఖ

పై శాఖ 22-వ వార్షికోత్సవ సందర్భములో సంస్థానములో అంతటా నిర్బంధోచిత ప్రాథమికవిద్య అమలు జరపాలన్న తీర్మానము చేయబడ్డది. ఇంకా, విద్యార్థులు, ఉపాధ్యాయులుకూడా ఎక్కువ సంఘసేవలో తోడ్పడు అవకాశము కలిగేటట్టు వారానికి రెండు రోజులు సెలవు యివ్వాలనికూడా యీ శాఖవారు తీర్మానించారు. కుటీర పరిశ్రమల అభివృద్ధికీ, భిక్షకవృత్తి నిషేధానికీ ప్రభుత్వము పూనుకోవాలని వీరు తీర్మానించారు. సాంఘికాది రంగాలలో, స్త్రీలు ఎక్కువగా సహకరించకపోయినట్లయిన, దేశనాయకులు తలపెట్టిన కార్యక్రమం శీఘ్రఫలితాలను బొందలేదని అధ్యక్షురాలు తమ ఉపన్యాసములో స్త్రీలను హెచ్చరించినారు.

*　　*　　*

## ప్లానింగ్ కమిషన్‌తో సంఘసేవికలచర్చలు

నవంబరు 6– తేదీన, భారతదేశపు వివిధప్రాంతాల నుండి ప్లానింగ్‌కమిషన్‌చే ఆహ్వానింపబడిన సంఘసేవికలు రమారమి 80-మంది ఢిల్లీలో సమావేశమై, కమిషను వారితో సాంఘిక సేవనుగూర్చిన చర్చలు సాగించారు. సాంఘికసేవకు స్త్రీలు పునాదులు వేశారు. వారికార్యరంగం దినదినము విస్తృతమౌతూవుంది; ఇంకమీద నిర్మాణము జరుపడానికి వారుకృషి చేయాలి; సాంఘిక వ్యవస్థలో స్త్రీకి ప్రత్యేక పౌరసత్వపు హోదాను కలిగించాలి; సంఘసేవా కార్యక్రమము సక్రమంగా కొనసాగేందుకు కేంద్ర ఆర్థికశాఖలో సోషల్ సర్వీసెస్ డైరెక్టరేట్ నెలకొల్పాలి; సేవింగ్సుస్కీమ్ విజయానికి స్త్రీలు ఇతోధికంగా కృషి చేయాలి: అనే అంశాలపైన చర్చలు జరిపారు. ప్లానింగ్ కమిషన్ తుదినివేదికలో వీరిసలహాలు జేర్చునిమిత్తము ఈసమావేశము జరిగింది.

# శ్రీ పొట్టి శ్రీరాములుగారి నిరాహారదీక్ష

[ 4-వ పేజీ తరువాయి ]

జరిగిన కలకత్తాకాంగ్రెసులో అప్పటి ఆంధ్రోద్యమ ఫలితంగా ఆంధ్రప్రదేశానికి ఒక ప్రత్యేకమైన కాంగ్రెసు సంఘము ఏర్పాటు చేయడానికి, మిగతా మదరాసురాష్ట్ర కాంగ్రెసు సంఘముతోపాటు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘముకూడా వ్యవహారరీత్యా మదరాసు నగరముపై సమానమైన హక్కు బాధ్యతలు కలిగియుండడానికి తీర్మానించ బడినది.

2. మహాత్ముని ఆదేశానుసారం, భాషాప్రయుక్తంగా రాష్ట్రవిభజన కావలెనన్న సిద్ధాంతరీత్యా, ఆంధ్ర. తమిళ, కేరళ, కర్ణాటక ప్రాంతాలలో వేర్వేరు ప్రదేశ కాంగ్రెసు సంఘాలు నిర్మాణము కావలెనని, ఆంధ్ర. తమిళ సంఘాలు మదరాసు నగరంలో సమాన అధికారముతో వ్యవహరించవచ్చుననీ, 1920 సం॥ నాగ్‌పూర్ కాంగ్రెస్‌లో తీర్మానించ బడ్డది.

3. 1926 సం॥ లో సర్ శంకర్ నాయిర్ ప్రప్రథమంగా ప్రత్యేక తమిళరాష్ట్ర నిర్మాణమునుగూర్చి ప్రస్తావించినప్పుడు చెన్ననగరములో తెలుగువారు, అరవవారు సరి సమానంగా ఉన్నారు కాబట్టి. తమిళరాష్ట్రములో ఈ నగరాన్ని చేర్చవీలులేదనే తీర్మానాన్ని చేసినారు, (కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు డిబేట్సు, పేజీ 560—1926 సం॥)

ఇవిగాక శ్రీయుతులు పానుగల్ రాజా, రామదాసు పంతులు, కొండా వెంకటప్పయ్య మున్నగువారు వేర్వేరు సమయాల్లో చేసిన ప్రతిపాదనలు. జె. వి. పి. నివేదిక పార్టిషన్ కమిటీ జరిపిన వ్యవహారం అంతాకూడా విజ్ఞప్తిలో జతపరిచినారు.

ఇంక ఈ విధంగా విజ్ఞప్తిని ముగించారు!

“ఇటీవల జరిగిన అనేక సమావేశాలలో సర్కారు ఆంధ్రులు, రాయలసీమ ఆంధ్రులుకూడ, ఆంధ్రరాష్ట్రము మదరాసు రాజధానిగా తక్షణం ఏర్పాటు చేయాలని అనేక మార్లు తీర్మానము చేశారు. ఇంతజరుగుచున్నప్పటికీ ఆంధ్రులు, తమిళులు, ఒక అభిప్రాయానికివచ్చి మదరాసు నగర భవితవ్యముపై సమాధానపడ్తే దక్క, తానీ సమస్యా పరిష్కారానికి ఏవిధంగానూ పూనుకో బోనని ప్రధాని నెహ్రూ చెప్తున్నారు. అహింసా సిద్ధాంతాలలో నమ్మికగలవారు, యీ సమస్యను అహింసాయుతంగా పరిష్కరించడానికి పూనుకొననిచో, హింసావాదులు హింసాయుత పరిష్కారానికి పూనుకొనే ప్రమాదము సంభవిస్తుంది. అందువల్ల ఆలోచనాపరులైన ఆంధ్రులు, తమిళులు సంప్రదించుకుని, మదరాసు నగరములో ఇరువురికిగల సమానహక్కులపై సమాధానపడి. యిటు నగరవాసులకు నగర పరిసరప్రాంతవాసులకు, అటుతమిళులకు, ఆంధ్రులకు అందరకు శ్రేయస్కరము కాగల న్యాయబద్ధమైన విభజనకు పూనుకొన ప్రోత్సహించుటకే నేను యీ ఆమరణ ప్రాయోపవేశమునకు గడంగుచున్నాను.”

ఈయన దీక్షపూని ఒక మండలమైనది. అతి నీరస స్థితిలోనున్న వీరి ఆరోగ్యము ఏ నిమిషము ప్రమాదము కలుగునో అన్నట్లుగా ఉన్నది. ఆంధ్రనాయకులంతా ఒక ఏకాభిప్రాయానికి వచ్చినట్టు వినికిడేగాని, క్రియాపూర్వకముగ తీర్మానముపై నాయకులందరూ సంతకము పెట్టలేదన్న కారణముచే వీరు నిరాహారదీక్షనుండి విరమించుటకంగీకరించుటలేదు. ఏకాభిప్రాయానికి వచ్చిన తరువాత సమావేశములో జరిపిన తీర్మానముపై నాయకుల సంతకానికి యింత కాలయాపన ఎందుకో సామాన్యులకు బోధపడుటలేదు.

ఇక రాష్ట్రసాధనకు జరిగే ఉపవాసాలతో ప్రభుత్వానికేమి ప్రమేయము లేదని మన ముఖ్యమంత్రిగారు ఒక్కమాటతో తమభాధ్యతను విదిలించివేసినారు. మరి వీరి ఉపేక్షకు పర్యవసానంగా సంక్రమించబోయే ప్రమాదాలకు కష్టనష్టాలకు కూడా వీరు బాధ్యులు కారని ప్రజలకు చెప్తారేమో!

అ. చన్నఘంటమ్మ.

★





# స్థిరసంకల్పం

నాటిక

శ్రీమతి సులోచన

పాత్రలు :

| | | |
|---|---|---|
| జగన్నాథం. | | |
| రాజేశ్వరి. | — | అతని భార్య. |
| శంకరం. | — | అతని మిత్రుడు, |
| రామబ్రహ్మం. | — | ఆఫీసు మేనేజరు. |

జగ : (నిట్టూర్పుగా) ఉఫ్...అబ్బా ! మనస్సంతా అదోలా ఉంది ! ప్రాణం శోషకొస్తూన్నది.

రా : ఊం ! ఆఫీసునుంచి వచ్చి నిముషంకూడా కాలేదు. అప్పుడే వొళ్ళు విరుచుకోవడాలూ, ఆపసోపాలు పడటాలూ. ఆఫీసునుంచి అంత విసుగునీ, రోతనీ ఎందుకు మూటకట్టుకు వస్తారో అర్థంకాదు. రోజూ చూస్తున్నాను, నిజం చెప్పండి. ఒక్కరోజైనా మీరు ఆనందంగా, నవ్వుతూ ఇంటికి వచ్చారా !

జ : నిత్యమూ నీచాత ఈ ఉపన్యాసం చెప్పుకోవడం అలవాటైంది. నాలుక ఎండి పోతూన్నది. కరుణించి ఒక గ్లాసు చల్లని పానీయం ఇచ్చి పుణ్యం కట్టుకో!

(రాజేశ్వరి వంటగదిలోకి వెళ్ళి వెండిగ్లాసుతో మంచి నీళ్ళు తెచ్చి ఇస్తుంది)

జ : నీకేం మహా ! ఇంటిదగ్గర వొళ్ళుకదలకుండా తినికూచోడమనుకున్నావా ? ఆఫీసులో అడుగుపెట్టినదగ్గర్నుంచీ, మళ్ళీ సాయంత్రం కుర్చీలోంచి లేచేవరకూ— తల పైకెత్తేందుకు వీల్లేదు. క్షణంసేపు ఊపిరి సలుపుకోవటానికి తీరిక ఉండదు.

(మంచినీళ్ళు త్రాగి, సిగరెట్టు ముట్టించుతాడు).

రా : పాపాయికి టేబ్లెట్స్ తీసుకువచ్చారా ?

జ: (వినిపించుకోడు. సిగరెట్టుపొగ రాజేశ్వరి ముఖం మీదకు వదులుతాడు)

రా : చాల్లెండి ఈ సరసం ! పాపాయికి టేబ్లెట్స్ ఏవీ ? డాక్టరు ఇవ్వాళకూడా అడిగారు.

జ : (సిగరెట్టు పీలుస్తూంటాడు.)

రా : (ముఖం చిట్లించుకొని) తేలేదు. అంతేగా! మీరెందుకు తెస్తారులెండి.

జ : అదునుకు జేబులో డబ్బుల్లేవు. రేపు తప్పకుండా తీసుకువచ్చేదనుగా.

రా : నమ్మాను. 'రేపు' అని గోడమీద రాసుకుంటాను. ఎందుకండీ ఈబులి బుచ్చపు కబుర్లు ? రోజూ మూడు పావులాలు ఆరిక్కిమాలిన సిగరెట్లకు తగలబెట్టగాలేనిదీ అర్థరూపాయి పెట్టి పాపాయికి బిళ్ళలు తేవటంలో గొంతు పట్టుకుంది. ఏం మనుషులండీ ?

జ : (నవ్వాడు)

రా : సిగరెట్లు అట్లా విరివిగా తగలేస్తారెందుకు ? ఎన్ని డబ్బులు ఖర్చయిపోతున్నాయి. పైగా ఒకసారి హేగాయిల్ కొన్నందుకు నా మీదకేక వేశారు. నేనేదో ఎక్కువగా, అనవసరంగా డబ్బుతగలేస్తూన్నట్టు. గురిగింజ సామెతగా మీఖర్చులు మీకు తెలీదు.

జ : (ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు).

# స్థిర సంకల్పం.

రా : ఏముందండీ సిగరెట్లలో. డబ్బు అధికంగా ఖర్చు కావటమే కాకుండా పైగా జబ్బుకూడానట. నామాట విని మానండి. నేనిదవరకెన్నోసార్లు చెప్పాను. జీతంలో సిగరెట్లు మానుకుంటే ఎంతో వెనకవేయవచ్చు, గమనించండి. చివరకు ఏనెల కానెల గడవడం కొంచెం యిబ్బందిగా ఉంది. అప్పులు పెట్టవలసివస్తోంది. మీరు సిగరెట్లు మానుకుంటే సంసారం నిశ్చింతగా గడిచిపోతుంది. నామాట ఆలకించి ఈ క్షణంనుంచి సిగరెట్లు మానుకోండి.

జ : (జేబులోంచి సిగరెట్ పెట్టి, అగ్గిపెట్టి, విసిరి నేలకేసి కొడతాడు) రాజీ! నువ్వు చెప్పింది బాగుంది. వెధవ సిగరెట్లు నేటితో మానివేస్తున్నాను. ఇది నా స్థిర సంకల్పం. వృధాగా ఎందుకు డబ్బు తగలవేయడం! ఇన్నాళ్లుగా నేను తెలుసుకోలేక పోయాను. ఇక ఒక్క సిగరెట్ కాలిస్తే అప్పుడను.

గా : (నవ్వి) చూద్దాముగా.

జ : నా స్నేహితుడొకడు ఇల్లాగే రోజుకు రూపాయి సిగరెట్లు కాల్చేవాడు. వాడి భార్య రోజూ పోరు పెట్టేది : ఖర్చులు పెరిగిపోతూన్నవి—నెల చివర కటకటగా ఉంటూన్నదని. ఒకనెల చివరలో ఎసట్లోకి బియ్యం లేకపోయేప్పటికి వాడికి తలకెక్కింది. జేబులో ఉన్న సిగరెట్లు మురుగుగుంటలో వేశాడు. ఈమధ్యనే కనపడి నెలకు ముప్పైఅయిదు రూపాయలు మిగులుస్తున్నానని చెప్పాడు. సిగరెట్లు మానివేయడంతోటే—దానిని అంటుకుని ఉన్న అలవాట్లుకూడా వాటంతటవే విడిచి పోయినాయట. పక్కవాడి, కిళ్ళీలు మొదలైనవి. నేనుకూడా అట్లా ఎందుకు చెయ్యకూడదు? వాడికి మల్లే డబ్బెందుకు కూడబెట్టకూడదు?

రా : ఇట్లా తననుతాను పరీక్షించుకొని, తాత్కాలికంగా ఒకటీ రెండురోజులు మానుకొని—మూడోరోజు మళ్ళీ మొదలెట్టినవాళ్ళు చాలామంది ఉన్నారు. మీ స్థిర సంకల్పంమీద నాకు నమ్మకం లేదు. మీకు మనసు నిలకడ తక్కువ.

జ : ఊరికే నే మాటలనగా సరిగాదు. చూడు, ముందు. నా మనోనిగ్రహం ఎంత బలీయమైందో!

రా : ఈ మాటలు రేపు ప్రొద్దు పొడిచేవరకే! మరి రేపు బజారుకెళ్లి కూల్‌గాఉందని కాలిస్తే—నేను చూడబోయేనా!

జ : ఇహ అంత నమ్మకం లేకపోతే నేనేం చేసేది! ఇదిగో ...ఒట్టువేసి చెబుతున్నాను. ఈక్షణంనుంచి నేను సిగరెట్టు కాలిస్తే—బుద్ధి గడ్డి తిన్నదని నీకు క్షమాపణ చెప్పుకొని, అపరాధంక్రింద పాతిక రూపాయల చీరె కొని పెడతాను—నీకు వచ్చే నెలలో.

రా : (ఆత్రంగా) కొనిపెట్టకపోతే!—

జ : నేనసలు సిగరెట్టు కాలిస్తేగా నీకు కొనిపెట్టేది!

రా : సరే! ఈ సంకల్పంమీద ఉండండి. నాకు చీరె కొని పెట్టాల్సి వొస్తుందేమోనన్నా సిగరెట్లు కాల్చటం మానుకుంటారేమో! ఎట్లాఐతేనేం—మీరు సిగరెట్లు మానటం ముఖ్యం.

జ : నేను ఎంత ఖచ్చితమైన మనిషినో చూస్తావుగా. సిగరెట్టుకాల్చి నీకు చీరకొని పెట్టేంత అసమర్థుడ్ని కాను. ఈ స్థిరసంకల్పంలో ఓడిపోతే జీవితంలో ఓడిపోయినట్టే!

రా : సరే బాగానే ఉంది. స్నానానికి లేవండి. ప్రొద్దు పోతోంది.

* * *

గా : (కసి ఊడుస్తూ) ఎన్నడూలేంది, ఇవాళ ఆదివారం ఆఫీసుకు శెలవైనా బజారుముఖం చూడలేదేం!

జ : మన ప్రతిజ్ఞ అటువంటిది. మనం స్థిరసంకల్పం చేసుకోవటమూనూ—అక్షరాలా ఆచరించక పోవటమూనా? చూస్తున్నావుగా. దాదాపు ఒకరోజు గడిచినది. ఒక్క సిగరెట్ కూడా కాల్చేనా? నువ్వేదో అనుకుంటున్నావు. అంత తేలికైనవాడు కాడు—ఈ జగన్నాథం. మనిషి వైఖరి బయటపడటానికి ఒకరోజు చాలు.

# స్థిర సంకల్పం

రా: సంతోషించాను. సాయంత్రమైంది. అటు పార్కు కన్నా వెళ్ళి కొంచెంసేపు తిరిగిరాండి. ఎన్నడూ లేంది ఇవ్వాళ యింట్లో తిష్ఠవేసుకొని కూర్చున్నారేం?

జ: బజారుకెళితే ఒకవేళ సిగరెట్ త్రాగి వచ్చానని అనుమానపడతావని ఇవ్వేళ ఇంట్లోనే ఉండి నీకు నా స్థిర సంకల్పం చూపెడదామనుకుంటున్నా.

రా: (నవ్వి) బావుంది మీ ప్రతిజ్ఞ. నేను నమ్మానుగా. బజారుకెళ్ళి రండి.

జ: ఆహాఁ! అట్లా వీలుపడదు. బజారుకెళ్లితే—సిగరెట్ త్రాగేవాళ్ళను చూస్తే సిగరెట్ త్రాగబుద్ధి వేస్తుందేమో! సిగరెట్ త్రాగితే—చీర వస్తుందేమో అనుకుంటున్నావా? ఏమైనా నేను ఇవాళ గుమ్మందాటను.

రా: మంచిది. సరే అయితే ఇవాళ నాకు కొంచం తలనాదుగా ఉంది. వంట చేయండి.

జ: అట్లా వీలుపడదు. నిప్పును చూస్తే సిగరెట్ గుర్తుకు వస్తుందనుకున్నావా?

రా: అబ్బా! ఎక్కడికక్కడకు అర్థాలు లాగటానికి ఎంత నేర్పరులండీ?

జ: (గుర్తు తెచ్చుకున్నట్లుగా) మర్చిపోయాను. వంట మాటంటే జ్ఞప్తికి వచ్చింది. రేపు సాయంత్రం ఆఫీసు మేనేజర్ను, శంకరాన్ని టీకి పిలిచాను. ఏం ఫలహారాలు చేస్తావ్ చెప్పు.

రా: మేనేజర్ను దేనికి?

జ: అక్కడే వుంది మన తెలివితేటల చాకచక్యం. రేపు నెలలో ఇంక్రిమెంటు ఇస్తారు. మనపట్ల వాడ్ని సుముఖంగా చేసుకుంటే—ఇంకా నాలుగు రూపాయలు ప్రొప్రైటర్‌తో చెప్పి ఇప్పించడానికి అవకాశం ఉంటుంది. ఈ కిటుకులన్నీ నీకు తెలీవులే. ఏం చేస్తావు ఫలహారం? ఒక స్వీటూ ఒక హాటూ. స్వీట్ మైసూర్‌పాకం. హాట్ పకోడీకాని, జంతికలు కాని—లేకపోతే, బూందీ కాని.

రా: మీ ఇష్టం ఏదో ఒకటి చేస్తాను లెండి. రేపు ఆఫీసు లేదా?

జ: పండగ కాదూ!

రా: సరే—మతిమరపు తొలగిపోయింది లేండి. ఎన్ని గంటలకు తీసుకువచ్చేది.

జ: నాలుగు లేక నాలుగున్నర అవుతుందేమో!

* * *

రామ: (నవ్వుతూ) ఇవ్వాళ పండగన్నమాటే కాని, చాలా పనులున్నాయి. ఇహ, ఏదో జగన్నాథంగారి మనస్సు చివుక్కుమంటుందేమోనని రావటం జరిగింది.

శం: బాగా చెప్పారు. అయినా ఇదొక కాలక్షేపం లెండి. మీబోటి వారికి ఇటువంటివి కొత్తవికావు సుమండీ!

(సిగరెట్ వెలిగించుతాడు. ఒక సిగరెట్ తీసి మేనేజరుకిస్తూ)

శం: కాల్చుకోండి.

(మేనేజరు వెలిగించుతాడు. ఇద్దరూ రెండు నిముషాల పాటు సిగరెట్ కాల్చటంలో నిమగ్నులౌతారు).

రామ: శంకరంగారూ, మీ ఆఫీసు మేనేజర్ను ఈమధ్య తొలగించారటగా.

శం: అవునండీ.

రామ: ఏవో కారణాలుండి ఉంటాయి.

శం: (పరధ్యానంగా) అవునండీ!

(జగన్నాథం ప్రవేశం. రాజేశ్వరి మూడు ప్లేట్లలో ఫలహారం తీసుకొచ్చి డ్రాయరుమీద పెడుతుంది. తరువాత మంచినీళ్లుకూడా).

జ: ఏదో ఇదో సరదా! తరుచూ పెద్దవాళ్ళనింటికి పిలిపించాలని కుతూహలం. మేనేజరుగారు అవసరమైన పనులు మానుకొని రావటం—నాయందు కొంచెం అభిమానం కలిగే!

రామ: దానికేముంది లెండి.

(ముగ్గురూ ఫలహారం తినడం ఆరంభించి—కొంచెం సేపట్లో ముగించుతారు. మరికొంత సేపటికి టీ సేవిం

# స్థిరసంకల్పం

చటుంకూడా అవుతుంది).

శం: (సిగరెట్టు వెలిగించి) మేనేజరుకు ఒక సిగరెట్టు ఇచ్చి) ఇదిగోరా బ్రదర్ సిగరెట్టు.

జ: (బిక్క ముఖం వేసేడు).

శం: తీసుకో రా సిగరెట్టు.

జ: (ముఖంతో వద్దనే మార్పులుసూచించుతాడు)

శం: ఏం! ఎందుకని? నీదగ్గర ఉన్నాయా ఉంటేయేం— ఫర్వాలేదు. తీసుకోరా!

జ: మానివేశాను.

శం: (అత్యాశ్చర్యంతో) ఏమిటీ! సిగరెట్ మానివేయటమే అసంభవం. ముందు ఇవాళ కాల్చు. రేపట్నుంచీ మానవచ్చులే.

జ: (తన స్థిరసంకల్పం గుర్తుకు వచ్చింది) వద్దురా శంకరం. మళ్ళీ ఎందుకు రేపెడతావు?

శం: వీల్లేదు. ఇవాళ కాల్చవలసిందే? మమ్మల్ని టీకి పిల్చి మాచేత సిగరెట్ కాల్పించుతూ, నువ్వు త్రాగకుండానా! ఇన్సల్ట్- త్రాగవలసిందే.

జ: స్థిరసంకల్పం చేసుకున్నారా, బా- బూ!

శం: ఇంతకన్నా గట్టిగా స్థిరసంకల్పం చేసుకొని మరుసటి రోజు మర్చిపోయి కాల్చినవాళ్ళు చాలా మంది ఉన్నారు.

జ: నన్ను ఒత్తిడి పెట్టవాకు, నేను కాల్చను. ఏదో అనుకున్నాను, అంతే!

శం: మర్యాదగా లేదు.

రామ: పోనీ కాల్చండి. సిగరెట్ భాగ్యానికేముంది. నేను కూడా ఇట్లా సంకల్పాలు చేసుకుని—ఓడిపోయినవాడ్నే. అలవాటైన ఈ జబ్బును వొదిలించుకోవటం కష్టతరం.

శం: మేనేజరుగారికి కూడా తక్కువతనం—నువ్వు ఈ పూట సిగరెట్ కాల్చకపోతే!

(సిగరెట్ చేతిలో బలవంతాన పెడతాడు)

జ: (డ్రాయరుమీద యెడంగా పెడతాడు) ఇవాళ సిగరెట్ కాలిస్తే జీవితంలో ఓడిపోయినట్టే.

గాను: ఇంకా మీకా పిచ్చి వదలలేదు. ఫర్వాలేదు కాల్చండి.

శం: మమ్మల్ని టీకి పిల్చిన గౌరవం లేకుండా ఎందుకు చేసుకుంటూవు.

జ: (మెల్లగా సిగరెట్ చేతిలోనికి తీసుకుంటాడు. శంకరం నిప్పుపుల్లగీచి వెలిగించుతాడు) పరిస్థితులవారసుడ్ని సంకల్పానికి తిలోదకాలిచ్చి ఓటమికి అంగీకరిస్తున్నాను.

(రామబ్రహ్మమూ, శంకరమూ నవ్వుతారు. కొంచెం సేపు గడిచాక)

రామ: వెళదాం (టైం చూసుకొని) అయిదున్నర కావొచ్చింది.

(ముగ్గురూ లేచారు.)

* *

జ: రాజీ!

రా: (వంట ఇంట్లోంచి వస్తూ) ఏమిటండీ!

(కౌగలించుకుంటాడు.)

జ: నేను ఓటమిని అంగీకరించాను. నువ్వు అన్నట్లే అయింది.

గా: (అనునయంగా) పోనీలెండి. మీరు త్రాగాలని త్రాగలేదు గా.

జ: లేదు. నాలో ఏమూలో త్రాగాలనే ఉండి ఉంటుంది. లేకపోతే బలవంతం చేస్తేమటుకు త్రాగుతానా?

గా: ఏమిటండీ ఆ పొట్లం?

జ: చీర.

గా: చీరా? దేనికి?

జ: స్థిరసంకల్పాన్ని నిల్పుకోలేకపోయాను గా. మాట ప్రకారం పాతిక రూపాయలు కొట్లో బాకీ ఉంచి తీసుకువచ్చాను. అపరాధానికి పరిహారం.

★

# పత్రికా పుత్రిక



నా ఆదర్శ మేమిటంటే మంచి వాఙ్మయ పత్రిక స్థాపించి దేశసేవ చెయ్యాలని. దేశసేవ చెయ్యాలన్నది పరమావధి అయినా దానికి సాధనం పత్రిక. కాబట్టి పత్రిక ఎంతో ఆకర్షకంగా ఉండాలి. దానిపేరు దగ్గిరనుంచి తీపిగా ఉండాలి. ఈకాలపు స్త్రీల పేర్లు చూడండి! పుల్లమ్మ, ఎల్లమ్మ అన్నవి మానివేసి మాధురీదేవి, వసంతాబాయి, పంకజం అని ఎంతరమ్యంగా పెట్టుకొంటున్నారో! మనిషిలో పస లేకపోయినా పేరులోనేనా ఉండాలన్న సిద్ధాంతం. ఆ ఇల్లాలు అందవికారే అనుకోండి, అంత మాత్రంచేత నిగనిగలాడే పట్టుచీరకొనుక్కోడం మాని వేస్తుందా? అది మానవుల స్వభావమనండి, లేక ఘనత అనండి, లేక దౌర్భాగ్యమనండి! ఏమనండి! ఏమన్నా అది అదే! కాబట్టి మనం సంకుచితమైన చూపు విడిచి పెట్టి విశాలమైన దృష్టిని అలవరుచుకోవాలి. ఇక్కడొక సంగతి చెప్పుకోకతప్పదు. అది మనవాళ్ళకుండే లోపము అనుకోవద్దు. అదొక లక్షణమని మాత్రమే చెప్పి ఊరు కొంటాను. లక్షణమనగానే మళ్ళీ మంచి లక్షణమా, చెడ్డలక్షణమా అని అడిగేరు. అందుకనే ముందరి కాళ్ళకి బంధంగా 'చెప్పి ఊరుకొంటాను' అని ముందే మనవి చేశాను.

**శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు.**

ఈ ఉపోద్ఘాతమంతా దేనికంటే పత్రికకు పేరొకటి సృష్టించవలసుంది బెంగాలీ పేర్లను, హిందీ పేర్లను తెలుగులోకి దింపే ఆచారం మన కిదివరకే ఉంది కాబట్టి ఒక పేరును ఏలాగయినా లాగడానికి ప్రయత్నం చేస్తాను. అది 'తస్కరించడం' అని ఎవరేనా అంటారేమో? అది కానేకాదు. ఎందుచేతంటే అది జనసామాన్యానికి తెలియనే తెలియదుకాబట్టి. కాని ఆలోచించి చూడగా ఇప్పుడు ఆ పేర్లమీద మోజు ఉన్నట్టు కనపడదు. అందుచేత ఆ పంథా విడిచిపెట్టేస్తాను.

ఇప్పుడు మన భాషలో ఉండే పత్రికల పేర్లకే ముందో వెనకో ఏదో ఒకటి చేర్చి రిజిస్ట్రేషన్ అల్లరి లేకుండా చేసుకొంటున్నారు పెద్దలు. ఇదీ నవీన పద్ధతి........ నా పత్రికకుకూడ పేరొకటి కనిపెట్టేను. అదేమిటంటే "సుప్రభ''

మన భాషలో ఇన్ని లక్షల పదాలుండగా నీకు కొత్త పేరు ఒక్కటి దొరకకపోయిందా అని మీరు అడుగు తారేమో? ఇది నవీన సాంప్రదాయమని తెలిసినవాళ్లెవరూ అటువంటి అవక తవక ప్రశ్న వెయ్యరు. నేను మన సాంప్రదాయాన్ని విడిచిపెట్టి ముందుకు ఒక్క అడుగేనా వెయ్యను.

మా పత్రికకు సంపాదకుడెవరు అన్నది ఒక సమస్య. సంచీకట్టు చంకని పెట్టుకోగానె మనిషి వైద్యుడవు తాడా? కాదని అనుకోడానికీలేదు. ఏ డాక్టరుదగ్గిరో కంపౌండరుగాచేరి ఎర్రనీళ్ళు పచ్చనీళ్ళు కలపడం నేర్చు కొని "ఓస్! వైద్యమంటే ఇంతేనా, ఎవడు చెయ్యలేడు ఈపని.'' అంటూ బోర్డు కట్టినవాళ్లు ఎంతమందిలేరు? కనుక మనకు ఆ సందేహము అక్కరలేదు. నేను ఆట్టే చదువుకోనిమాట వాస్తవమే. కాని దానికీ దీనికీ సంబంధం లేనేలేదని నొక్కి చెప్పడం. ఏ చదువూ అక్కరలేకుండా జిల్లాబోర్డు ప్రసిడెంటుపని, అసెంబ్లీ మెంబరుపని చెయ్య డంలేదూ? అలాగే దీనికీ చదువుతో నిమిత్తంలేదు. ఇంతకీ నేను పత్రికకు డబ్బుఖర్చుపెట్టుకోవడ మేమిటి, మరొకడి పేరు సంపాదకు డని పెట్టడమేమిటి? బాగాలేదు.

లోకంలో డబ్బుగాని, హోదాగాని, లేక, రెండూగాని ఉన్నవాడు ఏపనికైనా సమర్థుడే. జిల్లాకలెక్టర్లు, పెద్ద పెద్ద జడ్జీలు సాహిత్యోపన్యాసాలు బల్లగుద్ది చెప్పడంలేదూ? వారి నెవరేనా కాదన్నారా? కాబట్టి సంపాదకుడి పనికి నేను తప్పక అర్హుణ్ణి! లేకపోతే ఒక పని చెయ్యనా ఏమిటి! చదువుకొన్న వాణ్ణి ఒకణ్ణి సబ్ ఎడిటర్‌గా వేసుకొంటే నాపేరు మీదుగా పని జరిగి పోతూంటుంది. కాని ఒక నూరు రూపాయలేనా ఇచ్చుకొంటేగాని ఈకాలంలో ఏ సబ్ ఎడిటరూ దొరకడు. కాబట్టి నేనే సంపాదకుణ్ణి. అయితే నేను కలం కాగితం మీదపెట్టి ఎరగను కదా ప్రాలుబ్ధం! అదేమీ అక్కరలేదు. ఎప్పుడైతే సంపాదకు డనని పేరు పెట్టుకొన్నానో అప్పుడే నేను నిజంగా సంపాదకుణ్ణే! వ్రాయసమర్థుణ్ణే! ఇక్కడొక పిల్ల సమ్మేరీ

బయలు దేరుతూంది. రేపటినుంచి అందరూ నన్ను 'ఏమండీ!' 'తమరు! అని పిలవగరుకదా. అటువంటప్పుడు పత్రికమీద వట్టి పొడిపేరు వేసుకొంటే ఎంత నామర్దాగా ఉంటుందో ఆలోచించండి. కాబట్టి నేను 'సంపాదకులు శ్రీ పండిత జ్ఞానేశ్వరంగారు' అని అచ్చు వేయించుకొంటాను. దానితో అందరికీ అదే అలవాటయి చక్కాపోతుంది.

ఈచచ్చులో పడిపోయి ముఖ్యమైన సంగతొకటి మరచిపోయేను. సంపాదకుడవడానికి మొదట సిగరెట్టు నోటిలో పెట్టుకొని మాట్లాడే నేర్పుండాలి! అది ఈరోజే అభ్యసించెదను గాక!

రచన గ్రాంథికంలో ఉండాలా, వాడుక భాషలో ఉండాలా అనే సమస్య పూర్వముండేది. రామమూర్తిగారి దయవల్ల అది పరిష్కారమై పోయింది. గ్రాంథికం వదలిందంటే మనవాళ్లు మరొక పీడతెచ్చి పెడుతున్నారు. వాడుక భాషలో రాయడానికి కొన్ని నియమాలుండాలిట! అడ్డమైన వాళ్లూ రాసేస్తున్నారని ఓర్వలేక పన్నిన కుట్ర ఇది! మళ్లీ కట్టుబాట్లనగానే ఎంత కష్టమో చూడండి! కట్టుబాట్లన్ని ధ్వంసం చెయ్యడమే కాదుటయ్యా మనం చెయ్యవలసినపని! అటువంటప్పుడు మళ్లీ ఈ నియమాలేమిటి! నా మొహం. ఎవడిచేతి కొచ్చినట్లు వాడు రాసుకోవాలిగాని నియమాలేమిటో చెప్పండి. మనం రాసింది అర్థమయినవాడు చదువుకొంటాడు. లేనివాడు లేదు. వాడి ఖర్మ అంతే?........కాని ఇక్కడ ఎవ్వరి ముందు చెప్పకోకూడని చిన్న చిక్కొకటి వచ్చిపడింది. నేను రాసిందే మళ్లీ నేను చదువు కొందామను కొంటా ననుకోండి, మాట వరసకి చెప్పుతున్నాను—అది తెలియక పోతే ఎట్లాగు అని? అదీ ఫర్వాలేదు లెండి. ఈసమస్యను భావకవులు నాడే పరిష్కారం చేశారు. 'అప్పుడు ఆ తిక్క (mood)లో ఆలాగు రాసి పారేశాను. ఇప్పుడు నన్నడిగితే నాకేం తెలుసు!' అంటారుట. నాసంగతీ అంతే, ఆచిక్కూ వదలిపోయింది.

దీనికంటె ముందాలోచించ వలసిన విషయమొకటి అట్టే ఉండిపోయింది. అయినా ఫర్వాలేదు. చారు తర్వాత పప్పు కలుపుకొంటేమట్టుకు గొంతుక దిగదా ఏమిటి? అందుచేత ఇప్పుడయినా ఫర్వాలేదు. మన సుప్రభ పత్రికలో పద్యాలు వెయ్యడమా, మానడమా? ఇదొక సమస్య. ఇప్పుడు కందపద్యాలు చదివితే తల దురదపెడుతుందన్న మాట అందరికీ తెలుసు. మత్తేభ శార్దూలాదుల పేరు చెప్పితే రాత్రి నిద్రేనా పట్టకుండా ఉంది. సీసపద్యం కొరుకబడదు కదా? ఆటవెలదిపేరు చెప్పితే గవర్నమెంటువారు నిషేధిస్తారు. కాబట్టి పద్యాలను దూరంగాపెట్టి మాట్లాడవచ్చు.

ఈమధ్య **గేయాలంటూ** ఒకటి బయలుదేరేయి. ఈ సుళ్ళపుట్టలాగు వీటి పుట్టుపూర్వోత్తరాలు అట్లాగుంచి, వీటిలో వరసవాతి కనబడదు. సరిగా లెక్కకి పది, పన్నెండక్షరాలుండేటట్లా చూసి ఒక వాక్యాన్ని విరిచి రాస్తే గేయమై ఊరుకొంటుంది. విరవకుండా రాస్తే వచనమయిపోతుంది. ఈమాత్రానికి ఒకళ్ళని ప్రాధేయ పడేదేమిటి? వాటిని దడదడ నేనే రాసి పారేస్తాను. అయితే ఒక సంగతి. అదీ ఏమంత కఠినమైనది కాదులెండి. గేయం అనేటప్పటికల్లా కాపిటలిస్టులను దుమ్మెత్తి పొయ్యాలి. ఆకలి ఆకలి అంటూ కడుపుచేతితో పట్టుకోవాలి. కాబట్టి గేయాలు రాయడానికి మంచి సమయమేదంటే. పరగడుపు. పొద్దున్న కాఫీ తాగే ముందు కనక కూర్చుంటే దడదడ ఒక అరడజను గేయాలు సాగిపోతాయి. రసం చిప్పిలుతూ ఉంటుంది. అందుచేత పద్యాలు వెయ్యడం మానివేసి ఫక్తుగేయాలు వేయాలి. అవైనా నేను రాసినవే. చస్తే మరొకడివి వెయ్యను. కారణం మరేంలేదు, నేను రాసినంత చక్కగా వాళ్లు రాయలేరు.

అమెరికావాళ్లు, రష్యావాళ్లు పోటీలు పడడంలో మన పత్రికలకు కొన్ని చిక్కులు వదిలి పోయేయి. అమెరికన్, రష్యన్ ఇన్ఫర్మేషన్‌వాళ్లు తమ పత్రికలను మనకు ఉచితంగా పంపడమే కాకుండా, వాటిలో రచనలను తిరిగి నిరభ్యంతరంగా ప్రకటించుకోవచ్చని హామీ ఇచ్చేరు. కాబట్టి వాటిలోవి కొన్నికొన్ని ఎత్తి సుప్రభలో వేసేస్తాను. దానితో ఒక ఫీచరు కలిసివస్తుంది. అయితే ఈఫీచరుకి పేరేమిపెట్టను?....'సంజీవి' అని పెడతాను. దీనికి మించిన ఉపకారం కూడ ఒకటుందండోయి, వాళ్లు అంటే పైన చెప్పిన ఇన్ఫర్మేషన్ వాళ్లు, బ్లాకులను తయారుచేసి ఉచితంగా, పోస్టుఖర్చులేనా మనం భరించ నక్కరలేకుండ, మనకు పంపిస్తారు. మనం చెయ్యవలసిన పనల్లా ఒక్కటే. వాటిని అచ్చువేసికోవడం. కాబట్టి నేను సుప్రభ పత్రికలో వాటిని పూర్తిగా వాడేస్తాను, అప్పుడే బోలెడంత

'మేటరు' కలిసివచ్చింది.

మరొకవిషయం. మన తెలుగుపత్రికలలోనే కొన్ని కొన్ని ఎత్తి సుప్రభలో వేసుకోవచ్చు, పత్రికపేరు ఉదహరిస్తూ. దానివల్ల మనపత్రికకు కొంచెం పుష్టికలుగుతుంది. దానినిచూసి మీరు నా పత్రిక పరాశ్రయజీవి అని భావించుతారేమో? అదెంత మాత్రమున్నూకాదు. నాపత్రికకు అదొక ఫీచరు. అయితే దానికేమి పేరు పెట్టాలి? వాళ్లింత ఉపకారం చేస్తున్నారు? కాబట్టి 'రత్నాలగని' అని పేరు పెడతాను. అబ్బో, అబ్బో, ఎంతమేటరో! ఎంతమేటరో! కానీ ఖర్చుక్కరలేకుండా బోలెడంత మేటరు వచ్చేసింది.

దీని తర్వాత సంగతి—పత్రికకు సంపాదకీయం. ఇది తెలుగులో చెప్పితే నలుగురికీ తెలిసేటట్లా లేదు.—సంపాదకీయమంటే ఎడిటోరియల్—అది తప్పదు. సంపాదకీయంలో కొన్ని తరహాలున్నాయి. ఒకే వ్యాసం రాయడం కొందరి మతం—జెర్రి ఒకటే పిల్లను పెడుతుందన్న సామెతగా. కాని కొన్ని కొన్ని పెద్ద ఆంగ్ల వార్తాపత్రికలు ముచ్చటగా లీడరు, రెండు సబ్‌లీడర్లు—మొత్తం మూడు—సంపాదకీయంలోనే గుదిగుచ్చుతాయి. కాబట్టి ఇది ఇచ్ఛాపథ్యంలో జమ. మనలో మన మాట అది సత్తానుబట్టి పోతుంది. ఎందుకు వచ్చిన బాధ-ఒక వ్యాసంతో సరిపుచ్చక?

ప్రతి పత్రికకు కొన్ని ఫీచర్లుంటాయి. సుప్రభకి అసలు ఏయే ఫీచర్లుండాలి? ఇది కఠినాతి కఠినమైన సమస్య.

ఇంతకీ మన తెలుగువార్ల గతి తెలుగు భారతకాలం నాడె నిర్ణయమయి పోయింది. బ్రహ్మ, మూడు పంక్తులా కనబడని అక్షరాలలో 'అనువాదాలు అనువాదాలు, అనువాదాలు' అని ముమ్మారు నొసట రాసి పారేశాడు. తెలుగులో మొదటి గ్రంథం పేరు చెప్పండి? శ్రీమదాంధ్ర మహాభారతం—అంటే. సంస్కృత భారతానికి తెలుగు అనువాదమన్న మాట. ఆదోవ శతాబ్దాలకిందటే, సముద్ర మార్గం లాగు ఏర్పడిపోయింది. కాబట్టి ఆనాటినుంచి ఒకటికాదు, రెండుకాదు, వందలకొద్దీ సంస్కృత గ్రంథాలను తెలుగులోకి తెచ్చుకొన్నాము. చివరికి నాటకాలను కూడ పద్యకావ్యాలుగానే రాసి పారేశాము. తెలుగులో స్వతంత్ర గ్రంథం పేరుకేనా ఉండకూడదంటే నమ్మండి. తిక్కనరాసిన ఉపజ్ఞాగ్రంథం(original book) అయిన విజయసేనం ఏమయిందో చెప్పండి? అంత ఎందుకు. ఆదికవి అయిన నన్నయభట్టుగారి ఇంద్రవిజయం ఎక్కడేనా మిగిలిందేమో చూడండి. వీటివల్లే రుజువై పోతూంది, తెలుగుభాష అనువాదాలకే కాని మరిదేనికీ తగదు, దిగదు, లొంగదు అని. ఆ సాంప్రదాయం నేటికీ అవిచ్ఛన్నంగా సాగుతూన్నందుకు మనమంతా సంతోషించాలి. ఆదేవుడి దయవల్ల ఈకాలంలో ఆంగ్లభాషదొరికినది. ఆంగ్లదాతా సుఖీభవ! కాని మన రోజులు మంచివి గాక ఆంగ్లభాష రోజురోజుకీ దూరమై పోతూంది. ముందేమి గతో. కాని నేను శాస్త్రోక్తంగా జ్యోతిషంలో వేలుపెట్టిన వాణ్ణి కాబట్టి మనకి ముందు కాలాలలో ఏది ఏమగదో ఇప్పుడే చెప్పేస్తాను. ముందు కాలంలో మనం దూర భాషలకోసం పరుగెత్త నక్కరలేదు. మన నెత్తిమీదఉన్న హిందీ నుంచే మనం నూటికి నూరు అనువదించు కొంటాము. జైహిందీభాషకి జై. జైహిందీ మాతాకి జై.

ఆంగ్లభాషనుంచి అనువాదాలసంగతి కదా మనం ప్రస్తుతం చర్చించు కొంటున్నది. ఇప్పుడు పేరెన్నికగన్న తెలుగు పత్రికలు చేసే ఉత్తమకార్యం అదే. అన్నంలాగు, పప్పుముద్దలాగు అధమం రెండు, తప్పితేమూడు. అదీ తప్పితే నాలుగు ఆంగ్లనవలలను అనువదించి పత్రికను నింపి వెయ్యాలి.

చిన్నపిల్లలను ఇప్పటినుంచి మంచి మార్గంలో పెడితేగాని పాడైపోతారు కాబట్టి వాళ్ళకి ఒకటో, రెండో, మూడో, వాళ్ళ స్టాండర్డుకి తగ్గ ఆంగ్లనవలలను తర్జుమా చేసి వాళ్ల మెదళ్ళకి పుష్టిని కలిగించాలి. అబ్బబ్బ. ఈపత్రిక బాధ ఇంతంత కాదోలు దేవుడా. అప్పుడే అయిందీ కాశీయాత్ర. ఇంకా గడపముందే ఉన్నాం.

ఏపత్రికకైనా చిన్నకథలు తప్పవు. అనువాదాలకుండే ఖ్యాతి తెలుగులో మరి దేనికీలేదు కాబట్టి నాపత్రికలో వేసే చిన్న కథలన్నీకూడ ఆంగ్లకథలకు తర్జుమాలుగా ఉంటాయి. ఇంత తెలుసుకొన్న నేను మరొక మెట్టుపైకి వెళ్ళక మానను. వ్యాసాలు, నాటికలు, ఆఖరికి పద్యాలు కూడా ఆంగ్లంవాటికి తర్జుమాలుగా ఉంటేనే వేస్తాను. లేకపోతే బుట్టదాఖలా చేస్తానోయ్ చేస్తాను.—ఒక్క నేను రాసే గేయాలుతప్ప. అదైనా ఎందుచేతంటే మళ్ళీ మనవిచేస్తాను. నేను రాసినంత బాగా ఇతరులు రాయలేరు కనుక. ఇతరులవి చాలా చదివిచూశాను. వట్టి పేలపిండిలాగున్నాయి. నావాటి ముందు అవి ఎందుకూ పనికిరావు.

ఈమె సిఫారసు



లోధ్ర

నారీమణులకు

దివ్యౌషధము

ఋతుబాధల తొలగించును.

వరుస తప్పుట సరిచేయును.

గర్భస్రావముల నరికట్టును

వంధ్యత్వము రూపుమాపును



దొరకు చోట్లు: ఏ బజారుషాపైనా, లేదా,

కేసరికుటీరం లిమిటెడ్.,
మద్రాసు 14

ఒరిస్సా, నైజాము, ఆంధ్ర, తమిళ,

మైసూరు జిల్లాల

ఏజంట్లు:

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు

బరంపురం, సికింద్రాబాద్, బెజవాడ,

మధుర, బెంగుళూరు.

---

విజయా రత్న త్రయము




అనేక హేరాయిల్సు

రావచ్చును — పోవచ్చును.

గాని

శాశ్వతముగా వుండునది

అశోకా అమ్లా, వేపా, బ్రహ్మి

హేరాయిల్సు.

అనాదిగా భారతీయులచే పైమూడు (అమ్లా, వేప, బ్రహ్మి) వృక్షములు పూజింపబడుచున్నవి. యేలననగా వీటియందుగల అమూల్యమైన ఔషధగుణమే కారణము. ఈ అమూల్య గుణములను కోరువారు ఈ ఓషధులతో తయారుచేయబడిన పై హేరాయిల్సును ఉపయోగించిన, పైగుణమేకాక, యింపగు పరిమళమును పొందగలరు. శిరోజ పోషణలకు— మెదడుకు— కన్నులకు— చల్లని గుణము నిచ్చుటలో సాటిలేనిది.

★

విజయ కెమికల్ అండ్ టాయిలెట్ వర్క్సు

మిక్కిలి శ్రేష్ఠమైన రసాయనములు - పరిమళ ద్రవ్యాల

తయారీదారులు:

15, క్లెమెన్సు రోడ్, పురశవాకం, మద్రాసు-7.

ఇప్పుడు ఫీచర్లనుగురించి చెప్పుతాను. ఈకాలంలో అన్నిటికంటె చిన్న కథలు ముఖ్యం కాబట్టి ఆఫీచరు నిర్ణయమయిపోయింది రెండోఫీచరు. వ్యాసాలు, ఒకటో రెండో ఉండాలి; అవీ బాధలేని రాజకీయమో, లేక సాంఘికమో లేకపోతే మరేదో మరేదో. మూడోఫీచరు నాగేయాలు. నాలుగోఫీచరు నవలలు, ముఖ్యంగా మూడు ఆంగ్లానువాదిత నవలలు. తర్వాత ఫీచరు స్త్రీల సెక్షన్ ఒక టుండాలి. దీనికి 'స్త్రీమందిరం' అని మొత్తం నామ ధేయం పెట్టి మళ్ళీ దానిలో ఒక ఉపనామం 'వంటిల్లు' అని పెడతాను. దీనిలో పచ్చళ్ళు. ఊరగాయలు వగైరాలు రాసుకోవచ్చు. ఇదియేగాక పిల్లలకోసం ఒక ఫీచరుండాలని ఇది వరకే స్థిరమైపోయింది. దీనికి 'పిచికల గూడు' అని పేరు పెడతాను. ఏవి వచ్చినా దానిలో పడవేస్తాను. ఇప్పు డన్నిటికంటెసినిమాలు బహుముఖ్యం. వాటికోసం ప్రత్యేక పత్రికలే నడిపిస్తున్నారు. పైగా ఆఫీచరు ఏపత్రికలోకూడ తప్పదు. కాబట్టి ఈఫీచరుకి నాపత్రికలో 'మా సినిమా పుట' అని పేరుపెడతాను. దీనిలో సినిమాలను, తారలను ఏకవలసినచోట ఏకి, జోహార్లు చెయ్యవలసినచోట జోహార్లు చేయాలి. తర్వాత 'రత్నాలగని' ఫీచరు ఇదివరకె నిర్ణయమయిపోయింది. పత్రికకు 'తికమక'- అంటే తెలియదుకాబోలు. పజిల్, ఒకటుంటే అందం. అది మనుష్యులను తారల బొమ్మలలాగు ఆకర్షిస్తుంది. పైగా మనకి బోలెడంత లాభం. కాబట్టి తికమక ఒకటి తప్పదు. నాది మాసపత్రిక కాబట్టి నక్షత్రఫలితాలు నెలకొకమాటు వెయ్యక తప్పదు. ఎవరు చూసినా పత్రికలో మొదట చూసే పుట ఇదే!

స్త్రీ తన మొహం అందంగా ఉండడం కోసం ఎంత తంటాలు పడుతుందో చూశారా? ఆలాగె పత్రికపై అట ఆకర్షంగా ఉండడం కోసం పత్రికాధిపతులు శ్రమపడిపోతారు. రేపరు అంటే పై అటమీద సినిమాతార్ల బొమ్మలు—అవైనా ఆడవాళ్ళవే--.వేస్తే పుస్తకం జనత (popular)గా ఉంటుందని కొందరి అభిప్రాయం; కాదు పత్రిక గౌరవమే ఏష్యమై పోతుందని మరి కొందరం టారు. కాబట్టి అదిచాల గడ్డు సమస్య. ఇంత త్వరలో తేలదు. కాబట్టి రేపరుమీద అజంతా బొమ్మలు మాత్రమే వేస్తూపోతాను. దీని మూలాన ఎప్పటికైనా నిజం అజంతా వెళ్ళిచూసి రావడమేనా కలిసిరావచ్చు.

"సుప్రభ"ను ఎక్కడ అచ్చువెయ్యడం అన్నది ఒక ప్రశ్న. ఈకాలంలో ముద్రాశాలలకి కరువులేదు. అవి నానాటికీ పెరుగుతున్నాయి, నాకు ఇదివరకు నుంచి పరిచయమున్న 'నిదానం' ప్రెస్సులో పత్రికను ముద్రించితేసరి. మొదటే వెయ్యి ప్రతులు వేసుకు కూర్చోక నెమ్మది నెమ్మదిగా వడి ఎక్కించాలి. కాబట్టి ఆదిలో అయిదువందలే వేయించాలి. అట్లా వేస్తే కాగితం రెండు సంచికలకు కలిసి వస్తుంది. అయిదు వందలే అచ్చు గుద్దించడంవల్ల స్ట్రయికింగ్ ఛార్జీలు కొస్త తగ్గించమని ప్రొప్రయిటరును బతిమాలుకోవచ్చును. దయగలవాడైతే తగ్గిస్తాడు, లేకపోతేలేదు. అబ్బబ్బ. పత్రికాపుత్రికతో ఎన్ని అవస్థలోయ్‌బాబూ.

వట్టి ఆలోచనతో కూర్చుంటే లాభంలేదు. పత్రిక రిజిస్ట్రేషన్, ప్రెస్ డిక్లరేషన్ కోసం దరఖాస్తులు వీలైనంతకు నేడే పడవేయాలిను. అవి ఎప్రటేపుతో సంబంధించిన పనులు కాబటి ఒకంతట తేలవు. ఇంకెందుకు? లేచి. 'నిదానం' ప్రొప్రయిటర్‌ని కలుసుకొని మాట్లాడతాను. వెళుతూ, వెళుతూ, దారిలోనే గుక్కెడు కాఫీ నీళ్లు గొంతుకలో పోసుకొంటాను. జై సుప్రభా. జై జై సుప్రభా!



"జపాను ప్రజలు చాలా శ్రమ జీవులు. ముఖ్యంగా అచటి స్త్రీలు ఒక నిముషమైనా వృధా పుచ్చరు. వీరి పరిశ్రమ ఫలితంగా యుద్ధానంతరం కల్గిన ఆర్థిక దుస్థితినుండి జపానుదేశము ఇంత శీఘ్రగతిలో తేరుకోగలిగినది."

—శ్రీమతి కె. కె. చెట్టూరు.



# ★ అత్తవారిల్లు ★

• శ్రీమతి టి. వరలక్ష్మి •

"ఇక్కడి నాబాధ ఉన్నదున్నట్టు రాస్తే నువ్వు నమ్మవేమో. నాకేమంటే నీకు నమ్మకంలేదు. కాని నాకోసం, దయచేసి నాకేమంటూ ఒకటివుందనీ, అది శేషుమామయ్య యిల్లేనని నమ్ము. ఎంత మేనమామగార్లే అయినా, ఎంత అందరూ తెలిసిన వాళ్ళే అయినా, ఇంత దరిద్రపు మూగ బతుకు గడపడం మానవ మాత్రునికి సాధ్యంకాదు.

నీకు తెలియందా అక్కా ఈ యింటి సంగతి? ఒక చిన్న—ఎనమండుగురు కూర్చునే థర్డు క్లాసు పెట్టె నయం. కొద్దిగా కూర్చోడానికీ పడుకోడానికీ విశాలంగానే వుంటుంది, కాని ఇదెక్కడి ప్రారబ్ధమమ్మా, ఓ గాలీలేదు—ఓ వెలుతురూలేదు; కాస్త అటూ ఇటూ మెదలడానికి జాగాలేదు. ఈయిల్లు చాలకనే గద, అన్నయ్యా పెళ్ళికి శేషు మామయ్య ఇంకోయిల్లు పుచ్చుకున్నాడు!

ఇహ అన్నయ్యా సంగతి చెప్పమంటావా; ఎమ్మెస్సీ పాసయి పియస్సీ చదువుతున్నాడు గదా, వాడికేంపని చెప్పూ, ఈఖర్మ! లేకవాడికిది స్వర్గభోగంగానూ ఇంద్ర భవనంగానూ కనిపించిందో మరి! పొగలస్తమానం ఆగుడ్డి గదిలో మంచం వేసుకు కూచుంటాడు. మాటాడేందుకు ఇంత వేగిరం వొదినెతో వాడికన్ని కబుర్లెలావొస్తాయి అనూ రాధా, తెలియకడుగుతాను! వొదిన్ని ఎవరయినా పిల్చేరనుకో—వాడూ ఊడిపడతాడు. ఎంచక్కా చిలకలాంటి పట్నంపెట్టుకుని ఏమిటి చెప్పూ, ఆ గూళ్యంలో గుడ్లగూబలా గుడిపాం వాటం వేసుకు కూర్చోవడం, వాడిఖర్మగాక! పోతే పోగోటా? తిరిగి ఆడది చెడ్డాది, తిరక్క మగాడు చెడ్డాడన్నట్టుగా వాడు చెడ్డాడు సుమా, చెప్పలేం! ఎంత, వాడికి వొదినంటే యిష్టమైనా నాతో మాటలు మానుకు కూచున్నాడంటే ఏమనుకోవాలో నువ్వే ఆలోచించు. నాకు మతి పోతోంది.

ఇంట్లో మిగిలిన వాళ్ళసంగతి చూద్దామా అంటే తల్చుకోడానికి కూడా భయం అసహ్యం వేస్తోంది. పెద్దబావ వాడిపెళ్ళాంతో సహా పన్నెండో తారీఖున వొచ్చారు. సరి—పదమూడు లేదు; పద్నాలుగుని వాళ్ళమామగారు ఈసంగతి పసికట్టి టెలిగ్రామిచ్చేసరికి వెళ్ళిపోయినాడు. టెలిగ్రాం యిచ్చేసరికి వాడు వెళ్ళిపోవడం ఎలావుందో, అత్త అనుకోవడమూ అలాగేవుంది. వీళ్లనే అమ్మ మనతో పోలుస్తుంది. ఏం, బెంగుళూర్నుంచి ఇంటికేనా రాకుండా తిన్నగా వాడు ఏకాఏకి కాకినాడ రాడంచూసి నాన్న టెలిగ్రాం యివ్వలేక పోయినారూ? అన్నయ్యా మనింటికి రాకపోయాడా? కొంచెంతసమర్యాదా అన్నయ్యా మర్యాదా ఆలోచించి నాన్న వూరుకోబట్టి మనం వీధికెక్కలేదు.

సరి—వీళ్లలో కాస్త బుర్రంటూ వున్నవాడు పెద్దబావ. వాడు పండుగకైనా లక్ష్యపెట్టక వెళ్లిపోయినాడా! ఇహ నాకు చచ్చినా ఊసుపోకుండావుంది. వాడు వెళ్ళాక మిగిలిన వాళ్లు ఈ రాముడూ శేఖరంగాడున్నూ. మనలాంటి వాళ్లం ఏదైనా భరించగలంగాని ఆరాముంగాడి కోతిచేష్టలు, మొద్దుమాటలూ సహించలేం. వాడిమోటు సరసాలు చూడ లేకా వినలేకా నాతల బద్దలైపోతోంది.

ఇహమరి అట్టేరాయలేను. చాలారాశాను. అయితేనేం. నీదగ్గిర కూచుని అంతా చెప్పినట్టుంది గాని ఉత్తరంరాసినట్టు లేనేలేదు—ఇలాటి వాళ్లింట్లో అన్నయ్యా ఆరేసి నెల్లు ఎలావుండి పోతాడూ అని! పోనీ ఉంటే ఉన్నాడు గాక! బెంగుళూర్నుంచి రాగానే వీళ్లింట్లో దిగుదామన్నంత కోర్కెలాపుడుతుందో! నాన్న చెప్పినట్టు వీడు మనింట్లో తప్పబుట్టాడా?... నాకది బుర్రబాదుకున్నా అర్థంకాలేదు.

ఈవుత్తరం నీకు రేపుమధ్యాన్నానికి అందుతుంది. వెళ్ళిపోదాం అంటున్నాడుగాని అన్నయ్యా వొచ్చేట్టు నమ్మకం కలిగితే రేపురాత్రిదాకా ఉంటాను. లేదా రేపు పొద్దుటే బయల్దేరి వచ్చేస్తాను. చాలు! వాణ్ణి చూద్దామని ఎంత వుబలాటపడ్డానో అంతా అయింది. ఈయేడు నాకు పండగే లేకుండాపోయింది. ఇంతకన్నా వేరేశాస్తివుందా?

అమ్మ అడుగుతే ఇక్కడి నాటుసరుకంతా కులాసాగా వుందని చెప్పు. పాపాయికి ముద్దులు.

కిష్టుడు."

కిష్టుడు అవస్త చూసి అక్క జాలిపడ్డాది. 'పాపం!' అనుకుంటూ ఉత్తరం మడుస్తోంది; పైట జోళ్ళు చప్పుడై

నాయి. తలెత్తి చూడగానే కిష్టుడు కనబడ్డాడు. వెనకా ఎల యింకెవరూ లేరు. అక్కకంతా బోధపడ్డది.

"ఇదుగోరా కిష్టూ నీవుత్తరం. యిప్పుడే అందింది."

"చదివేవా?"

"ఆఁ."

"అమ్మయ్య!" అంటూ కిష్టుడు చెప్పులు విడిచి అక్కడే సోఫాలో కూలబడ్డాడు. "మెల్లిగా బైటపడ్డాను. అదే చాలు. మెత్తటి సోఫా కరువై పోయింది"

"నిజంగా నే నేమిట్రా?" అంది అక్క.

"ఆఁ. నీకింకా అర్థమవలేదులా వుంది. వాళ్ళింట్లో సోఫాలుకూడా నా? నేలమీద చాప పరుచుకుని కూచుంటే బావుణ్ణని పిస్తుంది తెలుసా?—కుర్చీలున్నాయి. కాని వాట్లో నల్లులు శేషుమామయ్యకన్నా ముందే కాపరం పెట్టుకుని వున్నాయి!"

"అవి కాదురా. నువ్వు ఉత్తరంలో రాసినవి!"

"బాగుంది. నిజం కాకపోతే అబద్ధాలు రాసుకుంటా రాయేమిటి? అన్నయ్యాతంతు పరమ భండారంగావుంది. నేను రాయలేక మానీసినివి కొన్ని."

"అప్పుడే అనుకున్నానులే, వాడిలా తయారవుతాడని!— రామం బావ పెళ్ళాం యిక్కడే వుందా?"

"లేకపోతే ఇంకో చోట ఉండనిస్తుందిటే మహాతల్లి! అత్త అలావుంది గాని అమ్మ నాయినో, తక్కువదేమీ కాదుసుమా!"

"పాపం! యింటి చాకిరీ అంతా ఆ అమ్మాయే కాబోలు!"

"రామరామా! యిహ చెప్పించకు. వాళ్ళ నాన్న శేషు మామయ్యకి ఉత్తరం రాశాట్ట. పంపలేదు. పదో తారీఖునో ఎప్పుడో స్వయంగా వొచ్చి అల్లుణ్ణీ కూతుర్నీ తీసికెళతా నన్నాట్ట. అయినా పంపలేదు. మామయ్య పంపుదామనే అనుకున్నాట్ట. అత్తుందిగా మరి! పరమ దుర్మార్గురాలు. పంపను పొమ్మనేసింది. పెద్దబావ, పెళ్ళాం, అన్నయ్యా, నేను అందరం వస్తామనీ, సందడిగా ఉండాలనీ నెపం పెట్టి ఉంచేసిందట. అందరికీ తనలా వుండదనుకుంది కాబోలు— ఎంచక్కా పండుక్కి కూతురూ అల్లుడూ ఇంట్లో వుండా లని!—పాపం ఆ అమ్మాయి నాతో చెప్పుకొని చాలా బాధ పడ్డాది."

"పాపం!"

"పెద్దబావ వెళ్ళాడా, ఒక వ్యాఖ్యానం కాదు చంపేసింది. 'వాళ్ళూ వీళ్ళూ టెలిగ్రామివ్వగానే వెళ్ళి పోయేటంత వెర్రివాడు కాడు మావాడు; అది ఏదో మందు పెట్టివుంటుంది' అంటుంది!—ఒదినె మందు పెడితేనే కాబోలు, అన్నయ్య అక్కడుండి పోయాడు!"

"ఆమాటన లేకపోయి నావ్రా?"

"అన్నాను. అర్థమై ఏడవలేదు. అర్థమైతే ఏడుచు కుంటుంది!"

"మామయ్య చెల్లెలెక్కడుంది?"

"ఆవిడా యిక్కడే, ఏం జెప్పమంటావనూరాధా! గంతడు కొంపలో సంతడు జనం. ఇంకా నయం! పెద్దపండుగ నాటికి నగకూ పెద్దబావా పెళ్ళామూ వున్నారు. మొత్తం మూడు జోడిలు. అందరికంటే అధికారమున్న జోడీ మన రావణా జోడీయే!"

"అయితే భోగీనాడు నువ్వు పడుకొని ఉండవు!" అంది అక్క నవ్వి

"అంతపనీ అయింది."

"ఒకనాడైనా బీచికి వెళ్ళారా?"

"అన్నయ్యొస్తే వెళదామనుకున్నాను. వాడొస్తాడా?— చివరికి నిన్న ప్రాణంపోయినంత విసిగెత్తి శేఖరంగాణ్ణి బతిమాలుకుని తీసికెళ్ళాను."

అమ్మ ఇంట్లోంచి వచ్చింది. "ఏమిటీ అది?—ఎవర్రా? కిష్టుడా?—ఏమిరా? ఇంట్లోకి రాకుండా వాకిట్లో ఉండి పోయినావూ?" అంది.

"ఏంలేదు. కాళ్ళు పీకుతుంటే కూచున్నాను."

"అంతా బాగున్నారా?"

"ఆఁ. వాళ్ళకేం? పందికొక్కుల్లా వున్నారు!"

"బాగున్నాయిగా మాటలూ! వాడేడీ?"

"వాడొస్తాడనే అనుకున్నావా యేమిటి? అయ్యో తెలివితక్కువా!" అంటూ కిష్టుడు నుదుటిమీద చూపుటి వేల్తో గీత గీసుకున్నాడు. ఆ సంజ్ఞ అక్కకీ వాడిదీను.

"మానభిక్ష!" అని దాని అర్థం.

అక్కనవ్వింది. "ఏమన్నావురా? లేక నువ్వు అడగలేదా?" అంది.

"బాగుందే. అడగమా?—సూటు లాండ్రీలో ఉండి పోయిందట్రా, మళ్ళా దానికోసం అక్కడ దిగడం బావుండదుట్రా, రేపు వెళదాం, అన్నాడు. బోగపడ్డాడా?" అన్నాడు కిష్టుడు.

"ఏం? కారణం బాగానే వుందే! నమ్మలేక పోయినావా?" అంది అక్క ఎగతాళీగా. అమ్మకి అర్థమైంది. అందుకనే అక్కవేపు అదోలా చూసింది.

"అమ్మబాబోయి! పగవాళ్ళకేనా వొద్దు యిలాంటి అత్తవార్లు!" అన్నాడు కిష్టుడు.

ఏం కబుర్లురా?" అంది అమ్మ.

* * *

అక్క ఈయేడు పండక్కి రావడం బావగారికి యిష్టం లేదు. వాళ్ళ తాలూకాలో సరిగ్గా ఎలక్షన్లూ పండుగలూ దగ్గరదగ్గరగా వున్నాయి. ఆయన్ని ఎలక్షన్లలో పనికి వేశారుట. ఆగొడవలోఆయన కాలునిలవక తిరగాలట. అక్క యిక్కడి కొచ్చేస్తే ఇహాయిల్లేంగానని అన్నారట. అయినా పాపం అక్క ఆనవాయితీ తప్పకుండా పండక్కి వొచ్చింది. పిల్లల్ని చంకనెట్టుకుని.

భోగిరేపనగా ఎప్పట్లాగ అక్క వొస్తూనే కిష్టుడేడీ అని అడిగింది. కిష్టణ్ణీ పెద్దక్కయ్య కొడుకు జగ్గప్పనీ అంతకి ముందు రోజునే వాడి మామగారు తీసుకుపోయిన్నారు. తనొచ్చేవరకూ ఉంటాగని ఉత్తరం రాసి కూడా కిష్టుడిలా చేశాడని అక్క చాలా నొచ్చుకుంది. పదిహేను సాయింత్రానికిగాని పదహారు పొద్దుటికిగాని తప్పకుండా వస్తాననీ, అక్కని వెళ్ళనియ్యొద్దనీ కిష్టుడు అమ్మతో చెప్పాడు. అది విని కాస్త సంతోషించింది. అయినా లోపల భయం మాత్రం పోలేదు. పదిహేను సాయింత్రానికిగాని పదహారు పొద్దుటికిగాని వొచ్చెయ్యమని బావగారు తనకి నిక్కచ్చిగా చెప్పారుట. చివరికి ఎలాగో ఒకలాగ ధైర్యంచేసి తను పదహారు సాయింకాలానికి వెళ్ళదల్చుకుని కిష్టుడికి పదిహేను నాటికి అందేటట్టు ఓ ఉత్తరం రాసింది.

కిష్టుడికి అక్క చాలాగట్టిగా రాసింది. ఇంట్లో అందరికంటే కిష్టుడికే తనమీద అభిమానం ఎక్కువట. చిన్నన్నయ్యకి తనని చూడాలనీ తనకి కనపడాలనీ అంతయిది లేక పోయినా కిష్టుడికీ తనకీ చిన్నతనంనించీ ఆపొత్తు కుదిరింది. ఎలామరచి పోదామనుకున్నా పక్కని పెద్దక్క కొడుకు జగ్గప్ప వున్నాడుగా! మరచిపోక వెంటనే బయల్దేరమంటాడు—అక్కకి తను వెళ్ళిపోక ముందే కిష్టుడొస్తాడని గట్టి నమ్మకం కుదిరింది.

కాని పదిహేడునాటి సాయింకాలానికి జగ్గప్ప ఒక్కడూ వొచ్చాడు; వాడొక్కడూ రావడం చూస్తే అక్కకి అధైర్యం కలిగింది.

"నువ్వెప్పుడొచ్చేవక్కా? రావన్నాడు కిష్టుడు." అన్నాడు జగ్గప్ప వొచ్చీ రావడంతోనే. అనూరాధనీ చిన్నక్కనీ వాడు అక్కా అని పిలుస్తాడు.

"భోగిరేపనగానే వొచ్చాను. వొద్దామనుకోలేదులే. కిష్టుడేడీ?"

"వొస్తాడు రేపొద్దుట బండిలో."

"నువ్వూ రేపేరాలేకపోయావూ?"

"నాకు నిన్ను చూడాలనుంది. పైగా అక్కడ రోజుకో యుగం గడప వలిసొచ్చింది. అసలు నువ్వు వెళిపోయావేమో అనుకున్నాను. కిష్టుడికి ఉత్తరంరాశావుట గదూ?"

"ఒకటికాదు రెండు రాశాను. మొన్నటి కందేటట్టు ఒకటీ ఇవాళ్టికి అందేటట్టు ఒకటీనూ."

"ఏమో. ఇవాళదే నేను చూశాను. నువ్వు వెంటనేరా, నేను పద్దెనిమిది పొద్దుట బయల్దేరివెళ్తూన్నా"నని రాశావు. వెళ్ళిపోతావేమో అనుకుని వొచ్చేశాను, కిష్టణ్ణి రమ్మంటే రాలేదు. రేపొద్దుటే వెళదాం అన్నాడు."

అక్కకి భయం పట్టుకుంది. అయినా బైటికి రానియ్యలేదు. "కిష్టుడి అత్తారిల్లూ అదీచూశావా? ఎలావుందేమిటి, నీమట్టుకి?" అంది.

"ఎందుకక్కా, అవన్నీ అడుగతావ్?" అన్నాడు

జగ్గప్ప నిరుత్సాహంగా.

"ఏం?"

"ఏంబాగులేదు. కిష్టుడక్కడ ఎలావుంటాడో భగంతుడికే తెలియాలి".

" అసలు సంగతేమిటి చెప్పూ?"

"తగిన కంపెనీలేదు. పైగా యిల్లొకటి చాలా కంజెస్టెడ్ గావుంది. డైనింగ్ హాల్లోనే పడుకోవాలి. అదే పగలు కిష్టుడి మామగారి డ్రాయింగురూం. కిష్టుడూ నేనూ ఎక్కడున్నా ఊసుపోతుంది. కలకల్లాడే కంపెనీ అనుకున్నామూ, అక్కడికెళ్ళేక వాడు బొత్తిగా మారిపోయినాడు. నేనూ మారిపోయానని నావుద్దేశం."

"ఇల్లు కంజెస్టెడ్ గా ఎందుకుందీ? పెద్దదేనే!"

" ఏమో బాబూ. అన్నిటికీ తాళాలువేశారు సామాన్లున్నాయిట. మేడమీద వాడిగది. ఎప్పుడూ తలుపేసి వుండడమే."

అక్క నవ్వింది. "సరే." అనిమాత్రం అంది.

"ఓమారు అన్నాడుగదా,-శారద తను అనుకున్నకంటే చాలా బావుందిట!-ఆమాత్రం ఎవడికి తెలీదు?-నాకు మాత్రం అలా అస్తమానం ఆగదిలో నే కూచోడం చూస్తే అసహ్యం వేసింది సుమా, చెప్పకేం?"

"అస్తమానం గదిలోనే కూచునే వాడా?" అన్నది అక్క మీమాంసగా. అక్కకి చిన్నన్నయ్య జ్ఞాపకమొచ్చేడు.

"ఆఁ. అస్తమానం అంటే రోజుకి ఇరవైమూడు గంటలు. ఎక్కడికీ వెళ్ళకపోవడం, పైగా ఆవిడిని కూడా కదలనివ్వడు. వాళ్లత్తగారు ఏమందో తెలుసా? ఓసారి నేను సాయింకాలం షికారెళ్ళొచ్చి కిష్టుడెక్కడ, అని అడుగుతే, 'ఎక్కడేమిటి? మేడమీదగదిలో వుంటాడు.' అంది. నేను కాస్త అలావెళ్లనిచ్చి 'ఒట్టికుక్కలా తయారైనాడు మా అల్లుడు,' అంది అదెవరితోనో. ఇంత వేగమే అంత చులకనై పోవడం నాకెంతో చిన్నతనం వేసిందక్కా. కిష్టుడితో చెప్దామనుకున్నాను. ఫీలవుతాడని మానీశాను."

కిష్టుడిసంగతి తెలియదుగాని అక్కమాత్రం బాధపడింది.

"పాపం నీకు ఊసుపోలేదుకాబోలూ?" అంది.

"ఏంవూసుపోతుందీ? పుస్తకాలుంటే చూడమని కిష్టుడితో చెప్పాను. అంటే ఒక అలమారుతాళం తెప్పించి యిచ్చాడు. అందులో ఏమున్నాయి? శతాశ్వపంచవాశతి కథలూ, ఎడిసనూ, గోల్డుస్మిత్తూనూ. శరత్ బాబూ ఆగాథాక్రిష్టీ-చదివి కొనుగోలైన నాకసి ఎలా సాయించుతాయి?"

" కొనుక్కోక పోయినావూ?"

ఎక్కడ కొనమంటావు? పుస్తకాల డిపో అంటూ లేదావూళ్ళో. ఉందంటాడు కిష్టుడు. పద వెళ్దాం అంటేరాడు. బద్ధకంట. సినిమాలంటే పెదమోజు పడతాడా, ఊళ్ళో షావుకారు సినిమా ఆడుతోంది రమ్మంటే రాలేదు. నిద్రట.-అదేంనిద్రా, పగలూ రాత్రీ ఒకటే పడుకుంటూ మళ్ళా నిద్దరంటాడూ!-రామరామా! ఇహ అడక్కు."

"కిష్టుడు రావడానికి ప్రయత్నమేనా చెయ్యలేదా?" అంది అక్క నిరాశగా-

"ఏమో. ఇవాళ మంచిది కాదుట. రేపొద్దుటే వస్తానన్నాడు."

"సరే." అంటూ అక్క లేచింది. అమ్మదగ్గిరకెళ్ళి మరునాడు ప్రొద్దుట ప్రయాణమంది.

"అదేమిటక్కా, నీకేం మతిపోయిందా ఏమిటి? కిష్టుడు రేపొద్దుట వస్తాడు. ఆగగాదూ?" అన్నాడు జగ్గప్ప.

"గాడురా, రాడు. ఆయిల్లు వాడికి మహా తియ్యగా వుంటుంది. నాకు తెలుసు." అంది అక్క కఠినంగా. "వొచ్చేవాడయ్యీ, ఆయిల్లు వినుగే ఎత్తినట్టయితే. ఈ పాటికే వొచ్చేవాడు. ఈనాటికి వీడూ యింతేనని తేలింది. చాలు. తెలిసింది. ప్రత్యేకించి వాణ్ణి చూడాలని నేను రావడం ఎలావుందో వాడు రాకపోడం అలావుంది.-ఆయన ఎంత వొద్దంటున్నా ఈయేడు వేరె, కిష్టుడొక్కడి కోసమే వొచ్చాను. లేకపోతే ఆయన మాట తోసి పారేశే వరకూ నాకేమొచ్చింది? ఆయన పదిహేను సాయింత్రాని కల్లా వొచ్చెయ్యమంటే పోనీ యింతదూరం వొచ్చి వాణ్ణి చూడకుండా వెళ్ళడం దేనికని మరో ఉత్తరం రాసి

ఆగేను. వాడికది అర్థమయిందిగాదు. రేపటికయినా నేనక్కడ వుండకపోతే ఆయన టెలిగ్రాం యిస్తారు. ఇక్కడ వీడికోసం ఇంకా ఎన్నాళ్లు కాసుక్కూచోడం?"

"పోనీ రేప్పొద్దుట చూడ కూడదుటే?" అంది అమ్మ.

"చూడకూడదు. జగ్గప్ప చెబుతున్నాడుగా, వీడు పెద్ద తమ్ముడికేం తీసిపోడు. ఎవరిదాకానో ఎందుకు? సొంత అత్తగారే అందిట- వాడు కుక్కలా తయారైనాడని. అలాటివాడికి శారద యింకా, యింకా అందంగా కనిపించక మానదు; వాడక్కడ మరోవారం రోజులకి తక్కువ ఉండడు." అంది తీవ్రంగా.

మాసిన బట్టతీసి వాళ్లబట్టలుతీసి పద్దువేసి పెట్టింది. సామానంతా సర్దేసుకుంది. తెల్లారకముందే బండీసిద్ధంగా వుంచమని కబురు పంపించేసింది.

రాత్రికిరాత్రి ఉత్తరాలకట్ట తీసి మూడేళ్లకిందట కిష్టుడు శేషుమామయ్య యింటినించి రాసినవుత్తరం పీకింది. ఆకాయితాల్లో కొంచెం జాగావుంటే రాసిపెట్టింది. జగ్గప్పకిచ్చి రేపు కిష్టుడికి పోష్టులో పంపమంది.

అక్కా పిల్లలూ వెళ్ళంగానే జగ్గప్ప ఉత్తరం విప్పాడు.

కిష్టూ, తుని, 17-1-52.

అన్నకి తగిన తమ్ముడివి అవును. వాడు ఎం. ఎస్సీ. అయితే నువ్వు బి. యస్సీ చదివినావు. వాడికి వాళ్ళఅత్తవారిల్లు ఎందుకు తీపో నీకు యీనాటికి తెలిసినందుకు సంతోషము. నేను పన్నెండున వచ్చినాను. ఇది మూడవ ఉత్తరము. పద్దెనిమిదిన వెళుతున్నాను. నువ్వు నాకోసము శ్రమపడి తొందరగా రావద్దు.

ఇట్లు,

అక్క. అనూరాధ



# ఆంధ్ర కవయిత్రులు-

—: సమీక్ష :—

[తెలుగుభాషా సమితివారి పరిముఖంగా జరిగిన 1951-52 సం॥ గ్రంధరచన పోటీలలో సాహిత్య విమర్శనాత్మక గ్రంధమైన ఆంధ్ర కవయిత్రులు అను గ్రంధం ఉత్తమమైనదిగా ప్రభుత్వ స్వర్ణపతక బహుమానము ను పొందినది. ఇంకొక 15- దినములలో దానిముద్రణ ప్రారంభము జరుగనున్నది. కవయిత్రులందరూ, వారికితెలిసిన పూర్వ కవయిత్రుల విషయములను వెంటనే తమకు అందజేసి, వారికృషికి తోడ్పడవలసినదిగా గ్రంధకర్త్రి శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు కోరుచున్నారు.

ఆంధ్ర కవయిత్రులచరిత్ర నుండి, గ్రంధకర్త్రిచే పునరుద్ధరింప బడినవ్యాసభాగము ఈదిగువ ప్రకటించు చున్నాము. —॥సం॥]

విశాలమైన ఆంధ్రవాఙ్మయాంబరమున కవయిత్రులైన మహిళామతల్లులు జ్యోతిర్మయతారలట్లు శోభిల్లుచున్నారు. సర్వంవిధాయియైన భగవానుని పరిపాలనా తంత్రమున వాణీమహాదేవి విద్యాశాఖామంత్రిణియయ్యె వనితాలోకము వాఙ్మయ కర్తృతా ప్రచాలనమున సంఖ్యాప్రాతినిధ్యమున మగవారితోబాటు దీటుగాకున్నది. సంఘజీవనమునకు స్త్రీ ఆత్మ, పురుషుడు శరీరము. ఆత్మ యెపుడును నిగూఢ పదార్థము. బహిర్వ్యాపారమంతయు పౌరుషరూపమగు శారీరక కర్మయే; కాని, ఆత్మశుద్ధి. అంతర్ముఖత్వములేని కర్మ అగ్నిశుద్ధిబడయని అపరంజి యట్టిది. "కన్నున్ననే కదా కాటుక దివురుట?" ఇంతకు కోమలకరపల్లవ స్పర్శ మును నందిననాడే సాహిత్యసృష్టి మృదులమును, గంభీరమును, మనోహరమునునై సత్యప్రకృతికి సన్నిహితత్వ మునొంది సర్వాంగీణమగునని వీరేశలింగ ధీమహితుడె గుర్తించి వాకొనినాడు.

కాని మహిళలకట్టి యవకాశమేది? అసూర్యంపశ్యలై అంతఃపురమేలు అంగనల బుద్ధిప్రాభవములును యవని కాభ్యంతరములనే యణగిపోయినవి. కావుననే తెలుగు సరస్వతి రమణీయగీతికా వితానమను చిరుగంటలు దిక్తట ముల కలస్వనములునింప కవికుమారులు స్వస్తివాచకముల బలుకుచు నడువ సారస్వతమను స్వర్ణరథమెక్కి నాడు నాడుల విజయోత్సవము వెడలినను తెలుగువారికి నీరాజన మెత్తుటకును దీరిక లేకపోయినది,

వాగనుశాసనునకు పిమ్మట రెండుశతాబ్దములు గడచిన వెనుకకాని తెలుగు కవయిత్రి ముస్తాబు ముచ్చట పూర్తి యైనదికాదు. ఆ బంగారుకాలము పదుమూడవ శతాబ్ది మనియు మహిళావాఙ్మయ చరిత్రమున ప్రథమవంద్య చానయనియు ముందే పేర్కొంటిమి. అట్లని అంతకు ముందు స్త్రీల సారస్వతము లేదని యెవరు సిద్ధాంతీకరింప గలరు?

ఈ స్త్రీ వాఙ్మయము మూడు తెరగులు. స్త్రీలనుద్దేసించి మనవారు వ్రాసినవి, స్త్రీలకొరకై స్త్రీలు వ్రాసినవి, సర్వ విషయముల నుద్దేశించి స్త్రీలువ్రాసినవి: అని. ఇందు ప్రప్రథమమున స్త్రీలనుద్దేశించి వ్రాయబడిన సాహిత్యమంతయు గేయరూపమున నున్నది. లక్ష్మణదేవర నవ్వులో స్త్రీ హృదయవికాసము పువ్వులు దొడిగి నవ్వులు చిందినది. ఊర్మిళనిద్రలో భారతీయవనిత గూఢమగు గాఢహృదయానుభూతి సహానుభూతినంది, మెల్లగా నవ్వుకొని, చల్లగా నిదురించినది. సామాన్య స్త్రీ జనతా బంధుర శోకమేకదా సీతమ్మశోకమున గూడుకట్టుకొన్నది! ఈ గేయప్రబంధములు కింకర్తృకములో, ఇందేమైన స్త్రీ కర్తృకము లున్నవో, లేవో యను విషయములిప్పటికినీ అపరిష్కృత ములగు సమస్యలుగానే మిగిలిపోయినవి.

పదమూడవ శతాబ్ది పూర్వార్థమున చానమ ప్రోలమలచే నట్లు ఆరంభపూజ కావింపబడగా ఉత్తరార్థమున గంగాదేవి సంస్కృతోక్తులతో పూతమొనర్చినది. అది మొదలు తరికుండ వెంకమాంబవరకు- అనగా ఇంచుమించు- అయిదారు శతాబ్దాలు మొదటి తరముగా నెన్నుకొన వచ్చును. ఇందు ప్రసక్తలైన ధీమహితలు వీరు: గంగాదేవి, తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, తిరుమలాంబ, రామభద్రాంబ, మధురవాణి, రంగాజి, ముద్దుపళని. తరికుండ వేంకమాంబలు. వీరిని వీరి కావ్యములను ప్రధానముగా ప్రసక్తము

సేయుచు సుమారు పాతికమంది కవయిత్రులు ఉదాహృతలైరి.

ఇంక రెండవతరమున స్త్రీలకొఱకై స్త్రీలుకావించిన చింతన కావ్యసృష్టికాన నగును. కొటికలపూడి సీతమ్మ, భండారు అచ్చమాంబ, వింజమూరి వేంకటరత్నమ్మ, జూలూరి తులసమ్మ, పులుగుర్తి లక్ష్మీనరసమాంబ, బుర్రా సూరమాంబ, సీరము సుభద్రమాంబ, జ్ఞానమాంబ, వేమూరి శారదాంబ మున్నగాగల ముప్పదిమంది కవయిత్రులీ యుగమున భద్రాసనములుగొనిన మహనీయలై యున్నారు. సాంఘిక సంస్కరణములతోను, భాషావాదములతోను, స్త్రీ జన ప్రబోధములతోడను వింతయైన యీ యుగము క్రొత్తపాతల మేలుకలయికల క్రొమ్మెఱుంగులు జిమ్మునదిగా భాసించినది. సుమారొక యుగమునుండి ఉక్కుదక్కుపడియున్న సరస్వతి నుద్ధరించి లాలించిన కొటికలపూడి సీతమ్మగారు మొదలుకొని ముందుకాలము నాటి విపుల కావ్యకవితకు విఘ్నేశ్వరపూజ యొనర్చిన యిది సంధియుగ మనదగినది.

మూడవతరమునకు ఆధునిక వాఙ్మయమని నామకరణ మొనర్చి యుగప్రారంభకురాలుగా శ్రీమతి కంచనపల్లి కనకాంబ గారిని గణనము సేసితిని. చిల్కపాటి సీతాంబ, గుడిపూడి ఇందుమతీదేవి, చేబ్రోలు సరస్వతి, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, గంటికృష్ణవేణమ్మ, దేశరాజు భారతీదేవి, భువనగిరి లక్ష్మీకాంతమ్మ, దావూరి సుబ్బమ్మ, బొణ్ణా కనకమ్మ, సీమకుర్తి సత్యవతమ్మ, ఆత్మూరి అన్నపూర్ణమ్మ మొదలుగా సుమారు ఇరువదిమంది కవయిత్రు లీ యుగ సారథ్యము వహించినందు కభినందించి యుంటిమి.

సోదరి స్థానాపతి రుక్మిణమ్మతోను ప్రారంభమైన నాలుగవయుగమున మదమంచి అనంతమ్మ, బుర్రా కమలాంబ ఓలేటి నిత్యకల్యాణమ్మ, పుట్టపర్తి కనకమ్మ, వేదవల్లి తాయారమ్మ, చుండూరి రమాదేవి, అయితం ఇందిరా భారతులు, మున్నగువారు కొందఱీ యద్యతనాంధ్రకవితా వాహిని నవగాహితలై శుచిస్మితమున కావ్యాంబుజ పాణులై వాణీమహాదేవి హజారమున కొలువు దీర్చినవారే.

నవ్యాంధ్రమని పేరిడి నేను విభాగమొనర్చిన ఐదవ తరమునకు ప్రతినిధిగ నేను క్రొత్తపల్లి లలితను పేర్కొంటిని. తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మి, చావలి బంగారమ్మ, లవణసాగరమును మథించిన రాజేశ్వరి, బొబ్బిలి బెబ్బులిని స్ఫురణకు దెచ్చిన ఆడుపులి చర్ల నగరాజకుమారి, వట్టికొండ విశాలాక్షి, ఇంకను పెక్కురీ యుగమున కర్తవ్యభారమును సమముగ పంచుకొనిన ధీమహితలే.

ఇంతియెకాక తెలంగాణమునందలి సుప్రసిద్ధకవయిత్రీమతల్లులు సోమరాజు ఇందుమతీదేవి, పర్సాజానకీదేవి, నేమాని భారతీ రత్నాకరాంబ, మున్నగు వారెందరో జన్మసాఫల్యము సాధించిన వారెందఱో అటనట ప్రస్తుతిపాత్రలై యగపడుచున్నారు.

ఇట్లు సుమారు నూటయేబదిమంది కవయిత్రులను గూర్చి నాకు దోచినవిధమున విశ్రుతపరచి యీ కచ్చమును ముగించితిని.

స్త్రీల కవిత్వములనగా విస్మృతవాఙ్మయ మన్నమాట. చరిత్రకారులేమి, సామాన్యజనమేమి ఉపేక్షతో ఉజ్జగించిన యీ రచనను అపేక్షతో రచియించి యెంతవరకు సోదరీ లోకము ఋణమునీగితినో సహృదయులొప్పరికింతురుగాక.



## ఆరోగ్యాభివృద్ధికై హైదరాబాదు కృషి

గ్రామసీమల ఆరోగ్యాభివృద్ధికని హైదరాబాదు ప్రభుత్వం డిసెంబరు మొదటి వారమునుండి ఒక ప్రత్యేక ప్రణాళికను అమలు జరుపబోతూవుంది. దీని ననుసరించి, జిల్లాలలో 22 ప్రసూతి చికిత్సాకేంద్రాలు నిర్మించబడుతాయి. ఇది వరలో ఆయుర్వేద వైద్యశాలలుగాని, అల్లోపతి, యూనానీ వైద్యశాలలువున్న స్థలాలలోగాని యీ ప్రసూతిశాలలు నెలకొల్పబడుతాయి. గ్రామపరిశుభ్రతకు ఈ ప్రణాళికద్వారా కొన్ని సౌకర్యాలు చేయబడతాయి.



మూలం: రవీంద్రనాథ్ ఠాకూరు

అనువాదం: శ్రీ వైకుంఠరావు.

# ★ సుభ ★

బిడ్డకి సుభాషిణి అని పేరు పెట్టిననాడు ఆమె మూగి పిల్ల అవుతుందని ఎవరనుకోగలరు? ఆ అమ్మాయికి ఇద్దరు అక్కలు. అందులో ఒక అమ్మాయిపేరు సుకేశిని, మరిఒక అమ్మాయి పేరు సుహాసిని. ఆపేర్లతో కలిసే టట్టుగా ఆఖరి అమ్మాయికి సుభాషిణి అని పేరు పెట్టారు. పిలవడము మాత్రము "సుభ" అని.

యథారీతిని ప్రయత్నము, ధనవ్యయము చేయగా పెద్దఅమ్మాయిలిద్దరికీ వివాహమైపోయింది. చిన్నమ్మాయి ఇప్పుడు తల్లిదండ్రులకి హృదయభారమై ఇంట విరాజిల్లు చున్నది.

అమ్మాయి మాటలాడలేదు. కాని అందరివలె ఆమెకూ అనుభవానికి లోటు ఉండదన్నమాట ఎవరికీ గురుతు ఉండేదికాదు. కనుక ఆమె భవిష్యత్తును గురించి తమకు గల చింతా, భయమూ ఆమె ఎదుటనే వ్యక్తపరుస్తుండే వారు. భగవంతుని శాపరూపముగా తాను తండ్రి ఇంట పుట్టిందని ఆమె చిన్ననాడే గ్రహించింది. దీని ఫలితము ఏమిటి అంటే, సాధ్యమైనంతవరకు ఎవరికంటా పడకుండా ఆమె అందరినీ తప్పించుకు తిరుగుతుండేది. "తనను గురించి అంతా మరిచిపోతే బ్రతుకుతాను" అని ఆమె తనలో తాననుకొనేది. కాని మనోవేదనను ఎవరైనా ఎన్నడైనా మరువగలరూ? తలిదండ్రులకు ఈమె మాట ఒక్కక్షణమైనా మరుపుకు వచ్చేదికాదు.

బిడ్డలలో కనబడే లోపాలు తల్లికి ముఖ్యంగా తన అపరాధాలనే తోస్తుంటవి. కూతురిలో ఎటువంటి లోపము కనబడినా తల్లి ముఖ్యంగా సిగ్గుపడుతూంటుంది. అమ్మాయి తండ్రి వాణీకంఠుడు, సుభను మిగతా ఇద్దరమ్మాయిల కంటె ముద్దుగా చూచేవాడు, కాని తల్లి మాత్రం ఆపిల్ల తన గర్భానికి కళంకమని అనుకుంటుంది. పిల్లమీద చీకాకు పడుతుండేది.

సుభకు మాటలు రావుకాని పొడవైన రెప్పలుగల నల్లని పెద్ద పెద్ద కళ్ళుండెను. భావము వ్యక్తము చేయవలసినప్పుడు సందర్భానుసారముగా పెదవులు లేత చిగుళ్ళవలె కదులుతుండెవి. మనము భావాలను వ్యక్తము చేయవలసివస్తే ఎంతో ప్రయత్నము చేసి సరిఅయిన మాటలు కుదర్చాలి. మనము చేసేది ఒక విధమైన తర్జుమా పని అన్నమాట. చెప్పకోరేది సరిగా చెప్పలేము. సాధారణముగా సామర్థ్యములేక తరుచుగా తప్పు చెపుతాము కూడాను. కాని నల్లనికళ్ళు తర్జుమా చేయవు. వాటికి తర్జుమాచేసే అవసరమేలేదు. మనస్సులో ఉండేభావము దానంతట అదే కళ్ళపై తనకనుగుణ్యమైన ఛాయను వేస్తుంది. భావము ఒకప్పుడు స్పష్టముగా వ్యక్తమవుతుంది. ఒకప్పుడు సంకోచించి వెనుకకు పోతుంది. ఒకప్పుడు ఉజ్వలముగా బయటికి వస్తుంది. ఒకప్పుడు వాడి మూసుకుపోతుంది. ఒకప్పుడు అస్తమిస్తున్న చంద్రునిమాదిరి నిర్నిమేషముగా చూస్తుంటుంది. ఒకప్పుడు మెరుపువలె అమితవేగముతో నలుదిక్కులా పరుగెత్తుతుంది. పుట్టుకనుండి ముఖభాష తప్ప వేరేభాష ఎరగని వాళ్ళకు అద్భుతమైన నేత్రభాషాశక్తి ఉంటుంది. ఆభాష బహు ఉదారతగలది. ఏట్టి అడ్డంకులూ లేనిది. మితిలేనిది. అడుగంటని లోతుగలది. చాలావరకు నిర్మలాకాశము వంటిది. ఉదయాస్తమయాలకూ, ఎండా నీడలకూ నిస్తబ్ధరంగభూమివంటిది. అట్టి వాక్యహీన మానవునిలో బృహత్తర ప్రకృతివంటి గొప్ప మహత్వము ఉంటుంది. కనుక సాధారణ బాలబాలికలు సుభను చూచి జడిసేవారు. ఆమెతో కలసి ఆటపాటలు జరిపేవారుకారు. ఆమె నిర్జన మధ్యాహ్నమువలె శబ్దహీనమైనది, జట్టులేని ఏకాకిని.

## 2

గ్రామముపేరు చండీపూర్. దగ్గరగా మనదేశములో ఉండే చిన్న ఏరులలో ఒక ఏరు గ్రామానికి దగ్గిరగా ఉన్నది. గృహస్థుల ఇంట్లోని బాలికవలె విసుగు విరామములేక తన పని తాను చేసుకుంటూ గట్లమధ్యనే పారుతూ పోతున్నది. రెండుపక్కలనుఉండే ప్రతిగ్రామముతో ఏదో సంపర్కము ఉన్నది. రెండు పక్కలా మనుష్యులతో

నిండి ఉన్న గ్రామాలు. వృక్షచ్ఛాయలతో నిండిన ఎత్తైన తీరాలు. కిందను గ్రామలక్ష్మి అయిన స్రోతస్సు తనమాట ఆలోచించక, ప్రఫుల్ల హృదయముతో తాను చేయగల లెక్కలేని శుభకార్యాలకై వడిగా ప్రవహించుకుపోతున్నది.

వాణీకంఠుని ఇల్లు సరీగా నది ఒడ్డునే. పెద్ద గడ్డి ఇల్లు. చుట్టూ వెదురు దడి. ఇల్లూ, ఇంటి పశువులశాలా, ఢెంకీసాలా. గడ్డికుప్పా, చింతచెట్లూ, మామిడి, పనస, అరటిచెట్లతోటా అన్నీ పడవ లాగేవాళ్ళ దృష్టిని మాత్రమే ఆకర్షిస్తుంటవి. ఆ నిర్మల గృహస్థ కుటుంబములో ఉన్న మూగి అమ్మాయి ఎవరికంటనైనా పడుతుందేదో లేదో చెప్పడము కష్టము. కాని పనిపాట్లమధ్య తీరిక అయినప్పుడల్లా అమ్మాయి వచ్చి నది ఒడ్డున కూర్చుండేది.

అమ్మాయికి భాషరాని లోటును ప్రకృతి నింపేది. అది ఆమె తరపున మాట్లాడేది. నదీ కలకలము, మనుష్యుల కోలాహలము, పడవవాళ్ళ పాటలు, పక్షుల కూతలు, చెట్ల మర్మరశబ్దము- ఇవన్నీ నలుదిక్కులనుండే మనుష్యుల అలికిడితో కలిసివచ్చి ఆబాలికయొక్క నిశ్శబ్ద హృదయతీరముమీద సముద్రతరంగాలవలె విరిగి పడుతుండేవి. ప్రకృతియొక్క ఈ నానారకాల శబ్దాలూ, దాని విచిత్రమైన నడకా- ఇవి కూడా మూగి దాని మాటలే- పెద్ద పెద్ద కళ్ళతో చూస్తుండే సుభయొక్క విశ్వవ్యాప్త రూపమే ప్రకృతి. ఝిల్లీరవముతో నిండిఉన్న తృణభూమితో ప్రారంభించి శబ్దాతీతమైన నక్షత్రలోకమువరకు ఉన్నవి. కేవలము సంజ్ఞ, భంగిమ, సంగీతము, క్రందనము, దీర్ఘనిశ్వాసము మాత్రమే కదా!

మధ్యాహ్నమప్పుడు పడవసరంగులు, జాలారి వాళ్ళు భోజనానికి వెళ్ళిపోయేవారు. గృహస్థులు నిద్రపోయేవారు. పక్షులు కూతలు మాని నిశ్శబ్దముగా ఉండేవి. రేవు దాటించే పడవవాడు బల్లకట్టును కట్టివేసేవాడు. సజన జగత్తు పనిపాట్లను ఆకస్మాత్తుగా నిలిపి, భయంకరనిశ్శబ్ద స్వరూపము ధరిస్తుండేది. అప్పుడు రుద్రతాపముతో నిండి ఉన్న ఆకాశముక్రింద కేవలము ఒక మూగ ప్రకృతి. ఒక మూగ బాలికా మాత్రమే ఒకరి ఎదుట ఒకరు కూర్చొని ఉండేవారు. ఒకటి సువిస్తీర్ణమైన ప్రఖర కాంతిలోను ఉండేది. రెండో ఆమె చెట్లనీడను కూర్చొని ఉండేది.

సుభకు కొందరు అంతరంగ మిత్రులు లేకపోలేదు. ఆవుల సాలలో రెండు ఆవులు ఉండేవి. ఒకదాని పేరు 'సర్వశి' మరి ఒక దాని పేరు 'పాంగులి'. ఈ పేర్లు ఆమె నోటివెంట రావడము అవి ఎన్నడూ వినలేదు కాని అవి ఆమె అడుగుల చప్పుడు పోల్చుకొనేవి. అందులో మాటలులేని కరుణస్వరమొకటి ఉండేది. దాని మర్మము అవి మాటలకంటె చక్కగా తెలుసుకునేవి. సుభ ఎప్పుడు తమను ఆదరించేదో, ఎప్పుడు చీవాట్లు పెట్టేదో ఎప్పుడు వేడుకొనేదో మనుష్యులకంటె స్పష్టముగా అవి పోల్చుకోగలిగేవి.

సుభ ఆవులసాలలోకి వచ్చి రెండు చేతులతో సర్వశి మెడను పట్టుకొని తన బుగ్గను దాని చెవిదగర పెట్టి రాసేది. పక్కనున్న పాంగులి ఆమితాదరముతో చూస్తూ నాలుకతో ఆమెను నాకేది. రోజూ సాలలోకి నియమము ప్రకారము తప్పక మూడుసార్లయినా వచ్చేది. అదికాక ఏనాడైనా ఎవరైనా ఆమె మనస్సుకు కష్టముకలిగించే మాట అనినట్టయితే, నియమముకాని వేళనుకూడా తన మూగి మిత్రులదగ్గరికి వచ్చేది. బాలికచూపులో ఓర్మి, విచారము, శాంతి ఉండేవి. తమలో ఉండే అంధ అనుమానశక్తి ద్వారా ఆవులు సుభ హృదయవేదనను పోల్చుకొనేవి. తమ దేహాలతో ఆమెను రాసేవి. దగ్గిరికివచ్చి అతి మృదువుగా కొమ్ములను ఆమె చేతిమీద రాసేవి. ఈవిధముగా వాక్యహీన వ్యాకులతమూలముగా ఆమె మనస్సును శాంతపరచాలని ప్రయత్నించేవి.

ఇవికాక మేక ఒకటి, ఒక పిల్లి పిల్లా ఉండేవి. కాని వీటితో సుభకు అంత ఘనిష్ఠత లేదు. కాని అవికూడా సుభయెడల అనురాగము సదా కనబరిచేవి. పిల్లిపిల్ల రాత్రిలేదు పగలులేదు ఎప్పుడు పడితే అప్పుడు వెచ్చని సుభ ఒడిలోకి వచ్చి కూర్చొనేది. ఆమె మెత్తని వేళ్ళతో తన మెడను, తోకను దువ్వినట్టయితే త్వరగా తనకు నిద్ర వస్తుంది అని చెప్తున్నట్లుగా సుభ ముఖంవంక చూస్తుండేది.

## 3

ఉన్నతశ్రేణి జీవులలో సుభకు జట్టుగాడొకడు దొరికాడు. అతనికి బాలికతో ఎటువంటి సంబంధమో సరీగా నిర్ణయించడం కష్టం. ఎందుచేతనంటే భాష ఎరిగిన జీవుడతను- అనగా యిద్దరిదీ ఒక్క తరహా భాష

రాదు. గోస్వామిగారి ఆఖరికొడుకు అతను- పేరు ప్రతాప్. అతను కేవలము అకర్మణ్యుడు. అతనిని ఏదైనా మంచి పనిలోప్రవేశపెట్టి వృద్ధిలోకి తెప్పించవలెనని తండ్రి ప్రయత్నముచేసి చేసి ఆశవములుకుకూర్చున్నాడు. పనిపాట్లులేని వాడికి కొన్ని సదుపాయాలున్నవి. తనవాళ్ళందరూ అతనిని చూచి చీకాకు పడుతూంటారు. నిజమే. కాని తనతో ఎట్టిసంబంధమూలేనివాళ్ళందరికీ అతడు ప్రియపాత్రుడౌతాడు. విధిగా చేయవలసినపని ఏదీ లేకపోవడముచేత అట్లాంటివాళ్ళు సర్కార్ ఆస్తివలె ఉంటారు. ఆ ఆస్తిపైని అందరూ అధికారులేకదా! ఏ ఇంటికీ చెందని పార్కువంటి జాగాలు, ఒకటీ అరా ప్రతి గ్రామానికీ ఆవశ్యకము. అదే విధముగా సర్కార్ సొమ్ము అనదగిన అకర్మణ్యులు ఇద్దరు ముగ్గురు ప్రతి గ్రామానికి అత్యంత లాభకరము. ఊళ్ళో ఉత్సవాలు జరిగేటప్పుడు, ఎవరింట్లోనైనా ఏదైనా కార్యము జరిగేటప్పుడు, పనిచేసే వాళ్ళు దొరకనప్పుడు వీళ్ళు ఉపయోగపడతారు.

ప్రతాప్‌కి గేలాపు రువ్వుతో చేపలు పట్టడమంటే చాలా సరదా. ఈపనిలో సులభముగా రోజంతా గడపవచ్చు. సాధారణముగా ప్రతిరోజూ మధ్యాహ్నపువేళ ప్రతాప్ చాపలు పట్టుతూ నది ఒడ్డున కనబడేవాడు. కనుకనే సుభ ఇతనికి రోజూ కనపడేది. ఏపని చేస్తున్నా జట్టుకి ఎవరైనా దొరికితే ప్రతాప్‌కి ఆనందముగా ఉండేది. చేపలు పట్టుతున్నప్పుడు మాట్లాడకుండా ఉండేవాళ్ళు జట్టుకి దొరికితే మరీ మంచిది. ఆ విలువ ఎరిగి ప్రతాప్ సుభను ఆదరించేవాడు. అందరూ ఆమెను "సుభ" అని పిలుస్తుంటే తన ఆదరము అధికమని తెలియచేస్తూ "సు" అని పిలిచేవాడు ప్రతాప్.

సుభ చింతచెట్టు నీడను కూర్చొని ఉండేది. ఆ దగ్గరే నీటిలో గేలము వేసి నీటివైపుచూస్తూ గట్టు ఒడ్డున కూర్చుండేవాడు ప్రతాప్. ప్రతాప్ కోరిబోయే తమలపాకుల బీడాలు సుభ తానే కట్టి తెచ్చి ఒక్కొక్కటి అతనికి ఇస్తూండేది. చాలాసేపు అటువేపుచూస్తూ కూర్చొని కూర్చొని బహూశా అతనికి ఏమైనా సాయము చేదామని అనుకొనేదేమో! ప్రపంచములో తానుకూడా ఇతరులకంటె తక్కువ ఉపయోగకరమైనది కాదని ప్రతాప్‌కు తెలిసేటట్టు ఏదో ఒక పని చేయవలెనని ఆమె కోరిక కాబోలు. కాని చేయవలసినది ఏమీ ఉండేదికాదు. కూర్చొని తనలోతాను ప్రార్థించేది బహూశా- భగవంతుడు తనకొక లోకాతీతమైన శక్తి ఇవ్వవలెనని. భగవంతుడు తనకొక మంత్రశక్తి ప్రసాదిస్తే, ఆ శక్తివల్ల అత్యద్భుతమైన కార్యమేదైనా చెయ్యవలెననీ, అదిచూచి ప్రతాప్ "ఆహా! మన సుభ ఇంత చేతనైన బాలిక అని నాకు ఇంతకుముందు తెలియదే!" అని తనను మెచ్చుకుంటాడని ఆమె ఆశ కాబోలు!

సుభ ఒక జలకుమారి అయింది అనుకుందాము. మెల్లిగా నీళ్ళలోనుంచి వచ్చి, పాము పడగమీదనుండే మణిని తెచ్చి నీటి ఒడ్డున ఉంచేసి పారిపోయేద. ప్రతాప్ ఆ తుచ్ఛమైన పని- ఆ చేపలు పట్టడము- విడిచిపెట్టి నీటిలో మునిగి ఉండేవాడు. పాతాళలోకములోకి వెళ్ళి చూచేసరికి వెండి మేడలో బంగారు మంచముపైద- ఎవరది? మన వాణీకంఠుని మూగి కూతురు- మన 'సు' మణిదీపాలతో ఉజ్వలము చేయబడ్డ ఆ నిస్తబ్ధ పాతాళపురికి ఏకమాత్ర రాజకన్య..........!

అటువంటిది జరగకూడదా? అది అంత అసంభవమా? వాస్తవముగాచూస్తే ఏదీ అసంభవముకాదు. కాని 'సు' ప్రజాసూన్య పాతాళ రాజవంశములో పుట్టడానికి మారుగా వాణీకంఠుని ఇంట్లో పుట్టింది. గోస్వామిగారి అబ్బాయి ప్రతాపునికి ఆశ్చర్యము కలిగించేపని ఏదీ చేయలేకపోయింది.

సుభ వయస్సు పెరుగుతూవచ్చింది. ఆ సంగతి క్రమక్రమంగా తనమట్టుకు తనకే తెలుస్తున్నది. ఏదో ఒక పౌర్ణమినాడు సముద్రపు పోటువచ్చి. ఆ స్రోతస్సు తన అంతరాత్మను నింపడమువల్ల తనలో ఒక నూతన చైతన్యము పుట్టిందని ఆమెకు తోచింది. తనను తాను చూసుకొంటున్నది. ప్రశ్నించుకొంటున్నది. కాని బోధపరుచుకోలేకుండా ఉన్నది.

పౌర్ణమి అర్ధరాత్రివేళ ఒకనాడు ఆమె లేచి భయపడుతూ భయపడుతూ తలుపు తెరిచి బయటికి తొంగిచూచింది. పూర్ణిమ ప్రకృతికూడా సుభ ప్రకృతి వంటిదే. అదీ ఏకాకినే. నిద్రిస్తూన్న జగత్తుపైని నిద్రలేక కూర్చొని ఉన్నది. యౌవన రహస్యముతో పులకితమై, విషాదముతోనిండి అసీమ, నిర్జనతయొక్క అంతమువరకు- అంతమువరకేకాదు అంతాన్ని దాటికూడా- బరువెక్కి కూర్చొని ఉన్నది- ఒక్కమాటలేదు. ఈ నిశ్శబ్ద వ్యాకు

లతలో నిండి ఉన్న ప్రకృతి ఎదుటను నిశ్శబ్ద వ్యాకులతతో నిండి ఉన్న బాలిక ఒకతె నిలబడి ఉన్నది. ఇవతల కన్యాభారగ్రస్తులైన తల్లిదండ్రులు దిగులు పడుతున్నారు. లోకులుకూడా నిందించడము మొదలు పెట్టారు. ఆ ఇంటి వాళ్ళను వెలి వెయ్యాలని చూస్తున్నట్టుకూడా గుసగుసలు వినబడుతున్నవి. వాణీకంఠుని అవస్థ మంచిది- రెండు పూట్లా కడుపునిండా మంచి భోజనము చేయగలుగుతున్నాడు కనుక అతనికి శత్రువులకు లోటులేదు.

భార్యాభర్తలు ఆలోచించుకున్నారు. వాణి ఊరువిడిచి కొన్నాళ్ళపాటు విదేశానికి వెళ్ళాడు. కొన్నాళ్ళయిన తరువాత ఇంటికి తిరిగివచ్చి "కలకత్తా వెళ్ళుదాము పదండి" అని అన్నాడు.

ప్రయాణానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. మంచు కమ్మి ఉన్న ప్రాతఃకాలమువలె సుభ హృదయము కన్నీటి ఆవిరితో నిండిపోయింది. అస్పష్టమైన భయముతో నిండి సుభ ఈ నాలుగు రోజులూ మాట ఎరుగని జంతువువలె తల్లి వెంబడీ, తండ్రి వెంబడీ తిరుగుతున్నది. తన పెద్ద పెద్ద కళ్ళను విప్పి వాళ్ళవైపు చూస్తున్నది. కాని వాళ్ళు ఆమెకేమీ బోధపడచడములేదు.

అంతలో ఒకనాడు రెండోపూట ప్రతాప్ నది ఒడ్డున గేలాపురువ్వను నీటిలో వేసుకొని కూర్చొని నవ్వుతూ సుభను అడిగాడు: "ఏమే సూ! నీకు మొగుడు కుదిరాడట కదూ, పెళ్ళి చేసుకుంటావా? చూడు, మమ్మల్ని మరిచి పోకేం?" ఇట్లాగు అని తిరిగి నీటివైపు ముఖము తిప్పాడు.

దెబ్బ తిని చావ సిద్ధముగా ఉన్న లేడి వేటగాణ్ణి చూస్తూ "నేను నీకేమి చేశాను?" అని తన చూపులతో ప్రశ్నిస్తుంటుంది. సుభ ఆదేమాదిరి ప్రతాప్ వైపు చూచింది. ఆవాళ చెట్టుకింద మరి కూర్చోలేదు. వాణి నిద్రలేచి పడకగదిలో గుడుగుడు పీలుస్తున్నాడు. సుభ తండ్రి పాదాలదగ్గిరకూర్చొని అతని ముఖము వైపుచూస్తూ ఏడవడము ప్రారంభించింది. ఆమెను ఓదార్చబోయేసరికి వాణీకంఠుని వాడిన బుగ్గలవెంబడి బొటబొటా కన్నీటి ధారలు పడ్డవి.

రేపే కలకత్తా వెళ్ళడానికి నిశ్చయించారు. సుభ తన బాల్యమిత్రులదగ్గిర సెలవు పుచ్చుకుందామని ఆవుల సాల లోకి వచ్చింది. వాటికి తన చేతులతోనే మేపించింది. వాటి మెడలను తట్టుతూ కళ్ళను మాటలతో నింపుకొని చాలాసేపు వాటివంక చూచింది. ఆమె కళ్ళవెంట బొట బొటా నీళ్ళు కారినవి.

అది శుక్ల ద్వాదశి రాత్రి. సుభ పడకగదిలోనుంచి వచ్చి, రోజూ తాను వెళ్లుతూండే నదీతీరానికి వెళ్ళి పచ్చిక పరుపుమీద కూలిపడ్డది- ఈ ధరణిని- ఈ బ్రహ్మాండమైన మూగిమానవ మాతను తన రెండు చేతులతో పట్టుకొని "నీవు నన్ను వెళ్ళనియ్యకు- అమ్మా నావలె నీవుకూడా ని రెండు చేతులతో నన్ను పట్టుకొని ఉంచు" అని వేడుకుంటున్నట్టు కనపడ్డది.

కలకత్తా వెళ్ళాక ఒకనాడు సుభను తల్లి చక్కగా ముస్తాబుచేసింది. జరీ రిబ్బనుతో జుట్టు గట్టిగా బిగించి కట్టి ఒంటినిండా నగలుపెట్టి వాటితో ఆమె సహజసౌందర్యాన్ని చేతనైనంతవరకు కప్పింది. సుభ కళ్ళవెంట నీటిధారలు కారుతున్నవి. ఆట్టేఏడిస్తే అమ్మాయికళ్లు ఉబ్బిపోతవని తల్లి సుభకు జోరుగా చీవాట్లు పెట్టింది. కాని కన్నీరు తల్లి చీవాట్లను లక్ష్యపెట్టలేదు.

ఒక మిత్రునితో కలిసి వరుడు వధువును చూడడాని! వచ్చాడు. తల్లీ తండ్రీ భయపడ్డారు- గాబరాపడ్డారు. దేవత స్వయముగా తానే బలిపశువును పరీక్షచేయడానికి వచ్చిం దనుకున్నారు. తెరవెనుకనుండి తల్లి బోధపరచి, చీవాట్లు పెట్టి, జడిపించి అమ్మాయి కన్నీటిని నాలుగింతలుచేసి పరీక్షకుడి ఎదుటికి పంపింది.

పరీక్షకుడు చాలాసేపు తనికీచేసి "నాకు అయిష్టము లేదు" అన్నాడు. అమ్మాయి ఏడుపు ముఖ్యముగా అతనిని ఆకర్షించింది. ఆమె కన్నీరు చూచి ఆమెకు హృదయము ఉన్నదని పోల్చుకొని లెక్కవేసి చూచాడు. తల్లిని తండ్రిని విడిచిపెట్టబోతున్నానని అమ్మాయి నేడు ఇంత దుఃఖిస్తున్నది. ఇవాళ గడిచిపోయాక రేపు ఆ స్వభావము తనకు వినియోగ పడుతుంది అని అనుకున్నాడు. ముత్యపుచిప్పలవెల, వాటిలోపలనుండే ముత్యాలవల్ల అధికమైనట్టుగా- సుభ కన్నీరు ఆమె వెలను పెంచింది- అంతే. సుభను గురించి ఆ కన్నీరు మరేమీ తెలియచేయలేకపోయింది. పంచాంగము చూచి గట్టిశుభదినమొకటి నిర్ణయించి పెళ్ళి చేసేశారు.

మూగి అమ్మాయిని వరులచేతికి అప్పచెప్పి తలిదండ్రులు హాయిగా స్వగ్రామానికి వెళ్ళిపోయినారు. వారి జాతికీ పరలోకానికీ హానికలుగలేదు.

వరుడు పశ్చిమ ప్రాంతములో ఉద్యోగము చేస్తుండేవాడు. పెళ్ళి అవగానే వధువుని తీసుకొని అక్కడికి వెళ్ళిపోయినాడు. వారము రోజులలో అందరికీ తెలిసిపోయింది అమ్మాయికి మూగి అని. కాని అది ఆమె తప్పు కాదని ఎవరూ బోధపరుచుకోలేదు. ఆమె ఎవ్వరినీ మోసపుచ్చలేదు. తన రెండు కళ్ళముఖంగా సంగతి అంతా ఆమె అందరికీ బోధపరచబోయింది. కాని అది ఎవరికీ బోధపడలేదు. ఆమె నలుదిక్కులా చూచేది కాని మాటలు రాలేదు. పుట్టుకనుండి తానెరిగిన ముఖాలలో ఒక్కటైనా ఆమెకు ఇప్పుడు కనబడలేదు. బాలికయొక్క చిరునీరవ హృదయము మధ్యను అసీమ, అవ్యక్త క్రందన మొకటి పుట్టుతుండెను. అది అంతర్యామికి తప్ప వేరెవ్వరికీ వినబడలేదు.

ఈమారు ఆమె భర్త తన దృష్టి, కర్ణేంద్రియాలతో బాగా పరీక్షచేసి భాష ఎరిగిన వధువును వివాహమాడాడు.



# కర్తవ్యము

• శ్రీమతి బి. అన్నపూర్ణాదేవి •

రూపుదాల్చిన శోకంలా అరుణ ఆ ఆశ్రమప్రాంగణములో ప్రవేశించినది. కల్లోలపూరితమైన ఆమె మనస్సునయాశ్రమ వాతావరణ మేదో శాంతి అనుభూతిని కలుగజేసింది. చిన్న చిన్న కుటీరాలెన్నో దట్టంగాపెరిగిన ఆ చెట్లలోనుంచి అక్కడక్కడా కనుపిస్తున్నాయి. ఆ చెట్లమధ్య హారములోని మణిపూసలా ఓ పెద్ద మట్టిచెట్టున్నది. అస్తమిస్తూన్న సూర్యుడు అరుణారుణ కాంతులను విరజిమ్ముచున్న వేళ, ఆశ్రమ వాసులందరూ ఆ మట్టిక్రింద ధ్యానము చేయుచున్నారు. అరుణ కాదృశ్యము అనిర్వచనీయానందము కలిగించినది. ఆమె గట్టిగా కాలు కదపను గూడ సంశయిస్తూ మెల్ల మెల్లగ వారిని సమీపించి వారివలె ధ్యాననిమగ్నురాలైనది. కాని ఆ ప్రశాంత గంభీర వాతావరణంలో ఆమె మనస్సు లీనం కాలేక పోతున్నది.

అంతరంగంలో రేగే ప్రజ్వలాగ్నిజ్వాలలకు, బాహ్యంగా కనుపించే ప్రశాంతతకు ఎంత భేదము ! ప్రళయ గర్జనలతో ఫెళ్ళు ఫెళ్ళు మని ఒక్కమారు బ్రద్దలు కానున్న అగ్ని పర్వతంలా ఉన్నదామె మనస్సు- సలసల కాగే ఆ హృదయానికి స్వామియొక్క దయారసము తప్ప వేరే శాంతి కలిగించే వస్తువు లేదు. అందుకే ఆమె అంత దూరాన్నుంచి వచ్చింది............ ఎంతసేపని ఆమె అలా కూర్చొనగలదు? తలెత్తి ఆ ధ్యాననిష్ఠా గరిష్ఠులను చూచింది. కొందరి ముఖములలో ప్రశాంత మధురహాస చంద్రికలు నాట్యమాడుచున్నవి. "వారు భగవంతుని లీలా నాటకము గన్నులార జూస్తున్నారు కాబోలు ! గురుదేవుని కృపాకటాక్షములకు పాత్రులైన ఆ స్త్రీ, పురుష లెంత అదృష్టవంతులో! ఆమెకు గురుదర్శన మెప్పుడుగల్గునో!" ఇలాంటి భావాలతో వ్యాకులురాలై పోతున్న అరుణ వారందరు లేచిపోవడము చూచి ఒకసన్యాసిని జూచి గురుదేవుని దర్శనము జేసికొను సమయమేదని అడిగెను.

"సోదరీ, గురుదేవుని నీవు స్వయముగా వెళ్ళి దర్శనము చేయనవసరములేదు"

"మరి వారితో నా కష్టముల నెట్లు చెప్పుకోవాలి?"

"గురుదేవులే వచ్చి చూస్తారు"

"ఎప్పుడు?"

"అది మనయొక్క మనస్థితినిబట్టి యుంటుందమ్మా. ఆశ్రమములో కొన్నిరోజులు గడిపి వెళ్ళాలంటే మా ఆతిథ్యము బొంది సాయంకాలము మట్టినీడన స్వామిని

చూడవచ్చు. అలాగాక దీక్ష పొందాలంటే స్వామే వచ్చి మీతో మాట్లాడుతారు. అంతవరకు నా కుటీరములో నుండవచ్చును"

అరుణ ఆశ్రమములో చేరి అప్పటి కప్పుడే ఒక మాసము గడిచినది. ఆ ప్రకాశమందున్న ప్రతి వస్తువు ఆమెకు నేడు చిరపరిచితములు. కాని గురుదేవుని కామెపై దయకలుగలేదెందుచేతనో? అరుణ ఆ సాయంకాలము మట్టినీడన చేరలేదు. ఆశ్రమవనములో తిరుగుచున్న అరుణ తల ఆలోచనలతో వేగిపోతున్నది. దుఃఖ సముద్రములో కొట్టుకుపోతున్న ఆమెకు స్వామి ఆశ్రయమొక దీవి యనిచేరినది కాని........

"గురుదేవులు నిజముగ మనస్సుల నెరుగగలవారైతే తన దీనస్థితి దెలిసియే యూరుకున్నారా? భర్తే సర్వస్వ మనుకొని, తల్లిదండ్రులను గూడ విడిచి వారి కోపాన్ని లెక్కచేయక సేవచేస్తున్న తనను నిర్దాక్షిణ్యంగా వదలివేసి, వేరొక యువతిని వివాహమాడి, మర్మాంతకమగు బాధకు గురిజేసిరే! తల దాచుకొన్న అత్తమామల ఇల్లు అప్పులవారి పాలైపోయెనే. కంటికి రెప్పలా కాపాడుచున్న ఆయిద్దరు తనను వదలిపోయారు. ఇంత బాధ తన కుమారుని చూచుకొని మరచి పోతుంటే వానిని గూడ ఆ భగవంతుడు.......................ఈ జీవితాన్ని భరించేదెలా? ఇంకా యెందుకు బ్రతకాలి? తను కాలు పెట్టినప్రదేశమే స్మశానమైపోతుందట ............ ఎవరి కొరకు తానీ అవమానాన్ని భరించాలి? ఏమిజూచుకొని కన్నీటికాల్వల నరికట్టాలి? తనకిక యోగినీ జీవితమే మేలు—దయారహితుడైన ఆ దేవునికే యీ జీవితమును నైవేద్యంగా అర్పించాలి.........చల్లని సంసారాలు వర్ధిల్లుచోట చిన నీడగూడ తగుల గూడదు అనిగదా గురుదేవునివద్ద కామెవచ్చినది ...............
కాని గురుదేవునికి దయరాదు. నిర్భాగ్య జీవుల యెడ భగవంతునికే పక్షపాతమున్నప్పుడు మానవ మాత్రుడైన గురుదేవుని కుండుట వింతా యేమి?" నిస్పృహ ఆమెను ముంచివేయు నట్లున్నది. బలవంతంగా ఆ ఆలోచనలను నెట్టివేయాలని, ఆమె ఒక్కొక్క మొక్క వద్దకూ వెళ్ళి, విశ్వవిద్యాలయములో నేర్చిన వృక్షశాస్త్రాన్నంతా యేకరవు బెట్టుచూ, వాటి పేర్లనూ, వంశనామాలను, జాతి లక్షణాలను తెలుసు కొనేది.

ఒక పెద్ద గులాబిపుష్పమును చూస్తూ ఆలోచిస్తున్న అరుణ స్వామి రాకను గమనించలేదు. ఒకసారు తలెత్తి చూసేసరికి గురుదేవులు దగ్గరలో నున్న ఒకచెట్టువేరుపై కూర్చొని యుండిరి. అరుణ గూడ సమీపించి వారి పాదాలవద్ద కూర్చొనెను. గురుదేవులు మందహాసముతో.

"అరుణా! యీరోజు నీదీక్ష దినమమ్మా. నీకు యీ ప్రపంచాన్ని చూపుతాను. భయములేకుండా జూస్తావా?"

"బాబాజీ, మీరు మహాత్ములు. అజ్ఞాని నగు నాకు మార్గము జూపండి"

"నీకీరోజు ఆ మార్గము జూపాలనే వచ్చానమ్మా. కాని నీకున్న ఈ కన్నులతో ఆ మార్గము చూడలేవు. ఈ అంజనము నీ కన్నులకు బూస్తాను. అప్పుడు నీవు ఏమి చూచుచున్నావో నాకు తెలిపెదవా?" అంటూ యేదో భరిణి నుంచి కొంచెము అంజనము దీసి స్వామి అరుణ కళ్ళపై రుద్దెను. ఆనాడు అర్జునునికి పరమాత్మ విశ్వరూపము గనిపించినది. ఈనాడు అరుణకు దేశదౌర్భాగ్యము, ప్రళయరూపము గనుపించినది. అరుణ ఆశ్చర్యముతో "బాబాజీ! యిదేమిటి? అయ్యో యీ హతభాగ్యులెవరు? అన్నములేక అలా అలమటించిపోతున్నారు? బాబాజీ, అలా చూడండి. కుంటి గ్రుడ్డివారు ఆ వీధులలో యెలా దిక్కులేక బడియున్నారో! వారిపై బళ్ళు, సైకిళ్ళు, కార్లు దొర్లుతాయేమో!! వారి కింత తలదాచుకొను స్థలము లేదా? అదేమి బాబా! ఆ పాపలలా యేడ్చి యేడ్చి చచ్చిపోతున్నారు? బాబాజీ చూడండి, చూడండి. ఒకామె ఒక చక్కని పాపాయిని ఆవీధి అరుగుపై విడిచి పారిపోతున్నది. చూడండి బాబాజీ, ఆ మనిషి యెవరో రోగంతో ఉన్న భార్యను, బిడ్డను వదిలి దొంగలా తప్పించుకొని పోతున్నాడు........ ... అదో ఆ యువకుడు ఏదో అత్యాచారానికి మొదలెట్టాడు. పాపం ఆ అమ్మాయి యెలా ఏడుస్తుంది! ఓ గురుదేవా, నేను యీ దృశ్యాలను చూడలేకున్నాను. నా కళ్ళ మీదనుంచి ఈ అంజనం తీసి వేయండి. నేను భరించలేకున్నాను" అంటూ అరుణ గురుదేవుని పాదములమీద పడెను. గురుదేవులు ఆమెకు స్వస్థత గూర్చెను.

"బాబాజీ, నేను జూచిన ఈ వికార రూపాలేమిటి? ప్రపంచములోనున్న కష్టాలు, దుఃఖాలు ఒక్కచోట పోతపోసినట్లుండి ఎంత కష్టపెట్టాయండి! అబ్బా!"

## కర్తవ్యము

"అమ్మా ! చూచేదానివే అంత కష్టంగా వున్నావు. భరించేవారి గతేమిగాను? నీవు విద్యావతివి, స్వతంత్ర భావాలు గలదానివి, శక్తిసామర్థ్యాలు గల యువతివి. నీకు గలిగిన కొన్ని చిక్కులను భరించలేక, నీకన్న వేయిరెట్లు బాధపడే ప్రజానీకాన్నుంచి పరుగెత్తుకువచ్చి, ఈ ఆశ్రమంలో దాగిపోవాలనుకుంటివే? వీరితో ఒక్కమారు నీ జీవితాన్ని పోల్చుకో ! వీరి గతి ఎంతదుఃఖకరముగా నున్నదో చూడు. నీవు ఉపాసించాల్సిన నారాయణుడు ఈఆశ్రమ ప్రాంగణములో నున్న ఆ గుడిలోలేడు. దుఃఖించువారి దుఃఖములో, కూలినాలి జేయుచూ మండు టెండలో మలమల లాడిపోవు వారిలో, వీధుల వెంట "అన్నమో రామచంద్రా" అని ఆర్తనాదము జేయు అభాగ్యులలో నీ దరిద్రనారాయణుడున్నాడు. అవిద్య, అనారోగ్యము, పేదరికము, సోమరితనము, ప్రళయతాండవముజేస్తు, ఇన్నికోట్ల ప్రజలను బాధపెట్టుచున్న సమయమున, మంత్రములు వల్లించాల్సిన సమయమా యిది? నీవు సన్యసించాల్సిన సమయము సమీపించినది. కాషాయంబరములు, తులసిపూసలు, కమండలము సంసారత్యాగము— సన్యాసులకు గుర్తులు మాత్రమే. నిజమైన త్యాగము మనస్సునందు జరగాలి. కృష్ణభగవానుడు యేమి కాషాయవస్త్రాలు ధరించాడు? ఆ మహానుభావుని మించిన త్యాగి యెవరు?

"దేశమాత దుఃఖాన్ని పోగొట్టుటే నీయొక్కదీక్ష. ఇది అసిధారావ్రతము. ఏ దరిద్రనారాయణులకు సేవ జేయుచున్నావో వారే నిన్ను హింసించెదరు. పరిహాసము జేయుదురు. నీపై అపవాదులు గూడ వేయుదురు. కాని వారి యందున్న అజ్ఞానము వల్లనే అలా చేస్తున్నారనే బ్రహ్మజ్ఞానము అలవర్చుకోవాలి. త్రికరణశుద్ధి, బ్రహ్మజ్ఞానము నీకు చేదోడువాదోడైతే ఆనాడు నీకు ఈ చిన్న చిన్న కష్టాలు ఒక లెక్కలోనికిరావు. నీవప్పుడు అచంచలవు, నిష్కామినివి,నిగ్రహమూర్తివి, శాంతస్వరూపిణివి. దానవులను దునుమాడ బుట్టిన శర్వాణివి. ఇంతటి మహత్తరకార్యము నీపై యున్నప్పుడు నిన్ను స్వార్థమున దాచుకొనుట యెంత తప్పు! నీవు బహుశా అడుగవచ్చు "యింతమంది శిష్యులున్నారే, వారికి, నాకిచ్చిన వుపదేశ మేలయివ్వలేదని" వారి మనస్థితివేరు. వారి శక్తిసామర్థ్యాలువేరు. వారి జ్ఞానము యొక్క పోకడవేరు. మీవిద్యావంతుల స్థితివేరు. కురుక్షేత్ర యుద్ధానికి, సవ్యసాచిని పురికొల్పి భగవానుడు బంపినాడు గాని, తదితరులమాట తలచలేదు—ఎందుకంటావమ్మా—మీలాంటి విద్యావంతులైన యువతీ యువకులు వేలాదివేలు సన్యసించాలి.... బాహ్యవేషాలలోగాదు. ఆంతరంగిక లంపటత్వము నుంచి దూరమై జ్ఞానులు గావాలి. సంఘదురాచారాల్ని, అజ్ఞానాన్ని దూరంచేయాలి. మన స్వంత కష్టాలు మనకర్తవ్యానికి, అడ్డురాకూడదమ్మా."

అరుణ మనస్సు తేలిక బడినది. రవీంద్రకవి, మహాత్ముడు, వివేకానందుల వచనామృత సారాంశమిదే. స్వామిజీ సెలవిచ్చిన దిదే. ఈ అనంతవిశ్వంలో—ఒక ఖండమైన ఈ భూమండలములో.... యీ మానవకోటిలో ఏకైక జీవియగు తను యెంత? తన కష్టాలెంత?........ కర్తవ్య మామెయెదుట ప్రచండ భానుమూర్తిలా మెరిసినది.......స్వామి చిరునవ్వుతో దీవెనలిచ్చారు— దరిద్ర నారాయణ సేవలో అరుణ అనుభవాలు ఎంతో బాధకరమైనవి, కాని సహనము స్త్రీకి పెట్టిన భూషము— ఆమె సన్యాసిని—అహంకారము త్యజించిన యోగిని—

—...—



ఒకామె మరియొకామెతో— "నీ భర్త నీతో రోజూ తగువులాడుతున్నాడా?

రెండవ ఆమె : లేదు.

మొదటి ఆమె : ఎంత అదృష్టం?

రెండవ ఆమె : నా భర్త స్వర్గంలో ఉన్నారు.

ఉపాధ్యాయుడు. అరే, అబ్బాయి, ఋతువులెన్నిరా?

విద్యార్థి : రెండు సార్.

ఉపాధ్యాయుడు : అవేవో చెప్పు చూదాం.

విద్యార్థి : ఒకటి బిజీ, ఇంకోటి డల్.

ఇన్స్పెక్షన్ అప్పుడు బిజీ— ఉట్టిరోజుల్లో డల్.

# రీటా హెయిర్ టానిక్
## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొంది యున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశ మంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.




**RITA**
**HAIR TONIC**

---

**జమ్మివారి లివర్‌క్యూర్**

**బిడ్డల లివర్ & స్ప్లీను వ్యాధులకు**

**ఇప్పుడు టాబ్లెట్లుగా ఈయబడుచున్నది**




మోతాదు ఒకేసరిగా ఉండుటకు, ఉపయోగించుట అతిసులభముగా నుండుట కొరకు వ్యర్థముగా మందు పోకుండుటకు, అతిశుభ్రముగా మందునుంచుటకు జమ్మివారి 'లివర్ క్యూర్' 'సింపుల్', 'కాంప్లెక్సు' లను టాబ్లెట్లుగా గాజు ట్యూబులలో ప్యాకుచేయబడి ఇప్పుడు ఈయబడుచున్నది

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్

రాయపేట హై రోడ్డు :: మైలాపూరు, మద్రాసు.

బాలల భావిజీవిత బాట :

# ఆత్మవిశ్వాసమును పెంపొందించుట

• శ్రీమతి ఆ. భాస్కరమ్మ •

ఎవరైనా ఒక వ్యక్తి ఏదేని యొక విషయములో గొప్ప వాడయాడంటే, పరిపూర్ణత నొందాడంటే, ఏదేని యొక ఘనకార్యమును చేశాడంటే, ఏదేని యొక దేశము ఉచ్ఛస్థితిలో నుండి ప్రపంచమంతటికి మార్గదర్శియై ఆదర్శనీయమై వెలయుచున్నదంటే, అది హఠాత్తుగా ఒకే రోజులో కొన్ని నెలలలో అయే విషయము కాదు. ఆవ్యక్తి యొక్క వంశము, పుట్టిన నక్షత్రబలము. పరిసర ప్రభావము, పెంపకముయొక్క నేర్పరితనము వలన వ్యక్తి యొక్క వయస్సుతోబాటు వానియొక్క ఘనతకు, పరిపూర్ణత్వమునకు తగిన యోగ్యతలు కూడా క్రమంగా అభివృద్ధి నొంది వాని నట్టి మహనీయునిగా నొనర్చినవి; అట్టి వ్యక్తులనేకులతో నిండినదేశము జగత్తునకంతటికిని ఆదర్శప్రాయము, మార్గదర్శి యగుచున్నది.

ఏ మహనీయుని జీవిత చరిత్ర మనము తీసికొన్నా, ఏ దేశము యొక్క చరిత్రను మనము చదివినా ఈ విషయమే తేలుచున్నది. కాని భగవంతుడు ఒకేసారి ఆ వ్యక్తులనుగాని, దేశమునుగాని ఆ విధంగా సృజించి యుండలేదు. మానవుల యొక్క ఉచ్ఛనీచస్థితులు వారి వారి మనస్సు, బుద్ధి, కర్మల ననుసరించే యుంటాయి. ఇది పెరిగి పెద్దవారైన తరువాత విషయము. వారి బాల్య దశలో వారజ్ఞానులు. వారికి మంచి చెడ్డలు తెలియవు. గొప్ప కొలదులు తెలియవు. గృహములో తలిదండ్రులు, పెద్దలు, పాఠశాలలో గురువులు, పరిసర ప్రాంత ప్రజలు ఉండె విధానము, వారిచ్చే శిక్షణల మీదనే ఆధారపడి యుంటుంది మానవుని జీవితము.

కాబట్టి బిడ్డలను పెంచుట, వారికి విద్యగరపుట అనేవి అందరు అను కొనునట్లు సామాన్య విషయములు కావు. బిడ్డలను పెంచుట ఒక ఘనమైన విషయమా? పక్షులు జంతువులు సరీసృపములు కూడా పెంచుతున్నాయి వాటి వాటి బిడ్డల్ని, మానవులు పెంచలేరా అని అనుకొంటారు. ఆలాగే పెంచటంలో విశేషము లేదు. జీవులన్నిటిలో నుత్తమోత్తమ జీవియైన మానవుడు వాని యౌన్నత్య మునకు తగినట్లు పరిపూర్ణత నొంది, లోకములో తాను సుఖముగా జీవించుటయేగాక, తన తోడివారి నౌన్నత్యస్థితికి తేగల శక్తివంతుడగునట్లు శిక్షణ నిచ్చుటలో నున్నది తలిదండ్రుల యొక్క, గురువుల యొక్క నేర్పరితనము. పరిపూర్ణుఁడగు, ఉత్తముఁడగు, ఆదర్శమూర్తియగు మాన వునిలో నుండదగినవనుకొనే యోగ్యతలలో నొకటి ఆత్మవిశ్వాసము. ఏ మానవునిలో ఈ ఆత్మవిశ్వాసము బలీయముగా, దృఢముగా నుండునో ఆ మానవుడే ఏ విష యములోనైనా ఉన్నతపథ మందుకొనగలఁడు. కాని తక్కిన యెన్ని సుగుణములున్నా ఈ యాత్మవిశ్వాసము లేకపోయిన యెడల తాను సుగుణవంతుఁడు కావచ్చును, లోకములో మంచివాడనిపించు కొనవచ్చును కాని ఏదేని యొక ఘనకార్యము చేయుటకుగాని, నాయకుడగుటకుగాని, ప్రజల నొక సరియైన మార్గములో నడిపించుటకుగాని శక్తివంతుఁడు కాజాలడు. కాబట్టి యోగ్యతలన్నిటిలోకి నుత్తమోత్తమమైనది, ఒక వ్యక్తినిగాని, సంఘమును గాని, దేశమునుగాని ఔన్నత్యస్థితికి తేగల శక్తివంత మైనది ఆత్మవిశ్వాసము.

బాలల భావి జీవితములో ఈ ఆత్మవిశ్వాసమును పెంపొందించుట యెట్లు అనునది నేటి మన సమస్య. ఆత్మవిశ్వాసమనగా ఆత్మనమ్మకము. మనోధైర్యము అనగా ఒకరు ఏదేని ఒక పనిని చేయవలయునని యను కొన్నప్పుడు అది చిన్నదికానీయండి పెద్దదికానీయండి ఆ పనిలో అనేక విఘ్నములు, ఆటంకములు. నష్టములు, కష్టములు రానీయండి ఈ పనిని నేను చేయగలనా, నాకు సాధ్యమా అను సందేహముగాని, అధైర్యముగాని, నిరుత్సాహముగాని లేకుండా నేనాపనిని తప్పక చేయ గలను, చేసేతీరెదను అనే ధైర్యమును కలిగి యుండుటే ఆత్మవిశ్వాసము. ఇది ప్రతివ్యక్తిలోను సహజంగా అంతర్లీ నమైయుంటుంది. ఈశక్తే లేకపోయినట్లయితే పెద్దల సహా యము, శిక్షణ గ్రహింపలేని పసిపాపలకు ప్రాకుట, విద్దెములు చేయుట, నడచుట మొదలగు విద్యలే వచ్చి యుండవు. వారిలో అంతర్లీనమైయున్న యాశక్తి

(53-వ పేజీ చూడండి)

విజ్ఞానము :

# మానవోదయము

* శ్రీ వేమరాజు భానుమూర్తి *

మన ప్రపంచంలో సృష్టిఅంతకీ మకుటాయ మానమైంది, స్వోపయోగం కోసం జంతువులను మచ్చిక చేసుకొని వాటి చేత చాకిరీచేయించు కోవడం, ఋతువెరిగి పంట పండించు కోవడం, ఒక్క మానవులకే తెలుసు. గడగడ లాడించే ధృవప్రాంతపు శీతల ప్రాంతాలలోను, కుతకుత ఉడికించే ఉష్ణ మండలపు అరణ్య సీమలలోను చెక్కుచెదరకుండా జీవనం సాగించ గలిగిన ప్రతిభాశాలి మానవు డొక్కడే. అంతే కాదు తన మేధను ఉపయోగించి పరికరాలను నిర్మించుకొని వాటిసాయంతో నదులకు ఆనకట్టలను, ఆకాశమెత్తు భవనా లను నిర్మించ గలిగింది కూడా మానవుడే. శాస్త్రవిజ్ఞానం ద్వారా మానవుడు తాను నివసిస్తున్న ప్రపంచ రహస్యా లను చాలావరకు తెలుసుకో గలిగాడు. కళలద్వారా మహోజ్జ్వల సౌందర్యాన్ని సృష్టి చేసాడు. నేటిమానవులు విమానాలలో ప్రపంచ ప్రదక్షిణ చేస్తున్నారు. రేడియో యంత్రాన్ని సృష్టించుకుని తమశబ్దాన్ని సకల ప్రపంచ పర్యా ప్తం చేయగలుగుతున్నారు. అంతేకాదు, యుద్ధాలపేరుతో తనజాతిని సమూలంగా నాశనంచేసివేసే ప్రాణి ఈసృష్టి అంతలోను మానవు డొక్కడే కనబడుతున్నాడు.

మానవశరీరం ఇతర జంతువుల కంటె ఎంతో విశిష్టమైనది. ముందుచూపుగల గుండ్రనికళ్ల, నిలువుగా నిలబడి వుండే వెన్నెముక, నేలమీదనిలవడానికి అనువైన వెనుక కాళ్ళు, విశాలఫాలం, పెద్ద మెదడు, కరచరణాద్యవయవాలు, ఆలోచనాశక్తి పనిముట్టుగా ఉపయోగించ గలనేర్పు మానవుని ప్రత్యేకలక్షణాలు. వాటిని కొంచెంగా వివరించ డానికి ప్రయత్నిస్తాను ఈవ్యాసంలో.

అయితే మానవుని భౌతిక లక్షణాలను మనం జాగ్రత్తగా పరిశీలించితే, మిగతా జంతుకోటికి మానవులకు అతిసన్నిహిత సంబధం వున్నట్టు తేలుతోంది. మానవశరీర నిర్మాణం అనేకవిధాల ఇతర జంతువుల శరీరనిర్మాణంతో పోలివుంది. అంతేకాదు ఇతరజంతువుల జీవనం ఏసూత్రాలకు అనుగుణం గా వికసిస్తూవచ్చిందో ఆసూత్రాలే, ఆక్రమమే మానవజాతి వికాసానికి, విధానానికికూడా సరిగ్గా అన్వయిస్తున్నాయి.

ప్రాచీన కాలంలోని గచ్ఛన్నర వానరుల దానికంటె నేటి మానవశరీర నిర్మాణం అనేక విధాల భిన్నమైనప్పటికి యితర జంతువులతో మన మానవ శరీరానికిగల తేడాలకంటె పోలికలే ఎక్కువగా వుంటాయన్న సంగతిని మనం మరచి పోరాదు.

మానవుడు సర్వసాధారణంగా సగటున డబ్బై సంవత్సరా లు బ్రతుకుతాడని వైజ్ఞానికులు నిర్ధారణచేసారు. అయితే కొన్నిరకాల కోతులు 35 సంవత్సరాలవరకు బ్రతుకుతు న్నాయి. జంతుజాలం అంతలోకి వయస్సులో ఎక్కువభాగం చిన్నతనంలో గడచిపోయేదిమానవులకే. దాదాపు జీవితంలో అయిపోసంతు ఎదగడానికే పట్టుతుంది. ఇతర జంతువుల జీవితంలో అవి ఎదగడానికి ఇరవైఅయిదోవంతు కాలం కూ డాపట్టదు. పైగా ఎదిగే కాలంలో మానవుడు అనేక వస్తువులను నేర్చుకోవడానికి అనేక అవకాశాలు కలవు. అందుకనే మానవులు సహజసిద్ధంగా కాక అనుభవంద్వారా అనేక సంగతులను నేర్చుకుంటున్నాడు.

మానవుని మెదడు ఇతర జంతువుల మెదడు కన్న ఎంతో బరువైనది. గొరిల్లాకోతి మెదడు కన్న ఇది దాదాపు మూడురెట్లు బరువైనది. ఇతర జంతువుల కంటె మానవుని ఫాలతలం ఎంతో విశాలమైంది. ఇందువల్లనే కాబోలు మానవునికి ఆలోచనాపటిమ, భావనాబలం, జ్ఞాపకశక్తి, నిర్మాణ సామర్థ్యం లభించి వుండవచ్చు.

నడకపని చేతులకు తప్పడంతో వాటికి బోలెడంత స్వేచ్ఛ వచ్చింది. పైగా ఈచేతులలో నాలుగు వేళ్ళకు బొటనవేలు అమరింది. అందువల్ల ఏపనిచేయడానికైనా సౌలభ్యం కలిగింది. పిడికిలి పట్టుగల కౌశలం కలిగింది.

మానవునిదృష్టి ఇతర జంతువుల దానికన్న, ఎంతోపటుత్వ మైనది, నిశ్చితమైనది. అయితే వసికట్టేశక్తిమాత్రం ఇతర జంతు జాలం కంటె తక్కువ.

ఇతర జంతువులకీ, మానవులకీ ముఖ్యమైన తేడా పరిసర లకు అనుకూలంగా తమ జీవితవిధానాలను మార్చుకొని,శీతవ

శీతోష్ణాలు తాకిడికి తట్టుకొని బ్రతుకగలగడం సృష్టిలో మరే ఇతర జంతువూ ఇంత ప్రావీణ్యాన్ని సంపాదించ లేదు. ప్రకృతి పరిసరాలకు అనుగుణంగా తన బ్రతుకును తీర్చిదిద్దుకోవడమే కాకుండా, ప్రకృతే తనకు అనుగుణంగా చేసుకున్నాడు. అందుకనే ఇతర జంతువుల మనుగడలో ప్రధాన పాత్రవహించిన శీతవాతాతపాలను ధిక్కరించి మానవ జాతి పరిఘ్లగలిగింది. అంతేకాదు, తరతరాలుగా పూర్వులు సేకరించి పెట్టిన విజ్ఞానాన్ని స్వీయశ్రేయస్సు కోసం వినియోగించుకోగల సామర్థ్యం కూడా మానవ జాతికుంది.

ఇన్ని విధాల ఈసృష్టిలో విశిష్టమైన మానవజాతి చరిత్ర ఏమిటో కాస్త తెలుసుకుందాము.

మనసృష్టిలో ఇతర ప్రాణికోటి అంతావలె మానవుడుకూడా జీవపరిణామనియమాలకు లోబడినవాడే. మనభూమి వయస్సు యిప్పటికి రెండువందల కోట్లసంవత్సరాలుంటుందని భూతత్వవేత్తలు లెక్క పెట్టారు. అయితే మానవులను పోలిన జీవజంతువులు దాదాపు పదిలక్షల సంవత్సరాలకు పూర్వమే అవతరించినట్లు కొందరు అభిప్రాయపడుతున్నారు ఈవాదం సరియైనదికాదు. ఆదిమానవుడు అవతరించి రెండు లక్షలసంవత్సరాలు మాత్రమే అయిందని వాదించేవారు కూడావున్నారు.

ఏమయినప్పటికి శుద్ధనరుల మొదటి చిహ్నం పశ్చిమ యూరప్‌లో ముఖ్యంగా స్పెయినులో దొరికింది. 30 వేల సంవత్సరాల క్రిందట నరుల ఎముకలు, ఆయుధాలు, రేఖలు చెక్కి తయారుచేసిన ఎముకలు, శిలాచిత్రాలు కనబడ్డాయి. అయితే ప్రపంచంలో ఇంకా అనేక ప్రాంతాలలో మానవ పరిణామగాథకు సంబంధించిన పరిశోధనలు జరుగవలసివుంది. ఆసియా, ఆఫ్రికా ఖండాలలో ఇంకా అనేక ప్రాంతాలను పరిశోధించవలసివుంది. అందుచేత నరజాతి కేవలం పశ్చిమ యూరప్‌లోనే ఆరంభించినదని నిర్ణయించడం పొరపాటు కాగలదు. అన్నింటికన్న అతి ప్రాచీనమైన నర చిహ్నాలు ఆసియా, ఆఫ్రికాలలో ఇప్పుడు సముద్రగర్భంలో మునిగిపోయిన ప్రాంతాలలో దొరకవచ్చు. లెమూరులు, నియాండర్తల్ మానవులు, ప్రథమ నరులు, అమెరికాలో వున్నారనడానికి ఆధారాలేవీ దొరకలేదు. అందుచేత పూర్వార్ధగోళమందే యీ నరజాతి ఆవిర్భవించినట్లు చెప్పవచ్చు. పూర్వం ఆసియాఖండంలో ఆగ్నేయమూల బెహరింగ్ జలసంధిదగ్గర భూభాగం వుండేది. దానిమీదుగా నడిచి పూర్వ శిలాయుగాంతపు నరులు అమెరికా ఖండంలోకి ప్రవేశించి వుంటారని ఊహించవచ్చు. యూరప్‌లో ఈ ప్రథమ నరజాతిలో ఆనాటికే ... రెండు ముఖ్య శాఖలున్నాయి. వారిలో ఒక శాఖవారు ఉన్నత కాయులు. వారి నొసలు పెద్దది. వారిలో ఒక స్త్రీ పుర్రె ఇప్పటి మన కపాలంకంటె చాలా పెద్దది. ఒక పురుషుని కంకాళం ఎత్తు ఆరడుగుల పైగావుంది. ఇది రెడ్ యిండియనుల శరీరాన్ని పోలినది. 'క్రోమగ్నన్' అనుచోట ఈ నరదేహ విశేషాలు దొరికినందున వారు క్రోమగ్నర్డులని వ్యవహరించబడుతున్నారు. వారు అనాగరికులైనప్పటికీ ఊర్ధ్వకాయులు. "గ్రిమాల్ట్" గుహలోనివారు రెండవజాతివారు. ఈ ప్రారంభదశలోనే ఆదిమ మానవులు ఈ విధంగా రెండు భిన్నజాతులుగా ఉండడం అతి విచిత్రం. వారిలో మొదటిశాఖ ప్రపంచపు తూర్పు ఉత్తర భాగములనుంచి వచ్చినారని, గోధుమవన్నెవారని, రెండవజాతివారు దక్షిణమధ్య ప్రాంతాలవారు, నల్లనివారని, కొందరు వైజ్ఞానికులు ఊహించారు. కాని ఇందుకు సరియైన ఆధారాలు లేవు. సుమారు 40 వేల సంవత్సరాల క్రితంవున్న ఈ ప్రజల నాగరికత ప్రత్యేకమైనది. నత్తగుల్లలతో కంఠహారాలు వేసుకున్నారు. పళ్ళంతా పచ్చబొట్లు పొడిపించుకున్నారు. వారికి శిల్పం కొంచెం తెలుసునుగాని వారు చెక్కిన బొమ్మలు ఎంతో వికృతంగా వుండేవి. అయితే పనితనం లేకపోలేదు. వారు ఉపయోగించిన పనిముట్లు నియాండర్తలులకంటె చిన్నవి. వాటిల్లో రకాలుఎక్కువ. వారు అప్పటి పచ్చిక మైదానాలలో గడ్డంకలగుఱ్ఱాలను అడవి దున్నలను వేటాడి పొట్ట పోసుకుంటూ వుండేవారు. 'మామత్తు'లనబడే రోమావృతములైన ఏనుగుల బొమ్మలను వారు అందంగా చిత్రించారు. వాటిని ఈనరులు చంపివేశారని చెప్పడానికి నిదర్శనాలున్నాయి.

వారు ఈటెలతోనూ రాళ్ళతోనూ వేటాడేవారు. కాని విలువిద్య తెలియదు. బహుశా వారికి జంతువులను

మచ్చిక చేయడం తెలియదేమో! అయితే గుఱ్ఱాలని మచ్చిక చేసేవారని చెప్పడానికి కొన్ని నిదర్శనాలున్నాయి. కాని వాటిని వాహనాలుగా వుపయోగించినట్లేమీ లేదు. జంతువులపాలు త్రాగే అలవాటుకూడా వారికి అప్పటికి పట్టుబడివుండదు. వారు ఇళ్ళు కట్టుకోక చర్మపు డేరాలు నిర్మించుకునేవారు. మట్టిబొమ్మలు చేసినా కుండలు చెయ్యడం తెలియదు. వారితాలూకు వంటపాత్రలు ఏమీ దొరకనందున వంట తెలియదనుకోవాలి. బహుశా ఆ కోరాన్ని నిప్పులో వేపుకుంటూ వుండేవారేమో. చర్మపు దుస్తులే ధరిస్తూ వుండేవారు.

ఈ జాతివారు యూరప్ మైదానంలో ఈవిధంగా రమారమి నూరు శతాబ్దాలుండి ఇంతలో శీతోష్ణస్థితి మారగా ఆచోటు విడిచారు. శతాబ్దాలు గడచినకొలది ఎండ, వాన హెచ్చుతూ వుండేది. తెల్లదుప్పులు వాటితోబాటు కారెనుములు, గుఱ్ఱాలు ఈశాన్య ప్రాంతాలకే పారిపోయాయి. మైదానాలలో మహారణ్యాలు ఏర్పడ్డాయి. వాటికి బదులు ఎర్రదుప్పులు వచ్చాయి. కొత్త పరిస్థితులు, కొత్త పనిముట్లు వాడుకలోకి వచ్చాయి. నదులలో, సరస్సులలో చేపలవేట సాగుతూవుండేది. ఎముకలతో మంచి మంచి పనిముట్లు తయారు చేయబడ్డాయి. ఆకాలములో ఎముక సూదులు ఎంతో సున్నితంగా, ప్రశస్తంగా వుండేవట.

దాదాపు 15-20 వేల సంవత్సరాల క్రిందట దక్షిణ స్పెయిన్‌లోకి కొత్త శాఖ మనుష్యులు ప్రవేశించారు. వీరు చిత్రించిన చమత్కారగ చిత్రాలు 'మాసెస్ అజిల్' అనే గుహలో కనబడ్డాయి. అందుచేత వీరిని 'అజిలిమను' లన్నారు. వీరు ధనస్సులు ధరించారు. తలలో ఈకలు అలంకరించుకునేవారు. వారు మామూలు బొమ్మలేకాక సంకేతపు బొమ్మలుకూడా వ్రాసేవారు. మనిషికి చిహ్నంగా ఒక పెద్ద నిలువుగీత రెండు మూడు నిలువుగీతలు లిఖించేవారు. బహుశా సంజ్ఞలు ఈవిధంగా ప్రారంభమై వుండవచ్చు. వారి పనిముట్లు చెక్కిన రాతివి. అందుచేత వారు పూర్వ శిలాయుగానికి చెందినవారు. సుమారు పదిపన్నెండు వేల సంవత్సరాలకు పూర్వం యూరప్‌నుంచి కొత్త జాతి వచ్చింది. పనిముట్లను చెక్కి వాటిని బాగా నునుపు చేసేవారు. వారు వ్యవసాయం మొదలుపెట్టారు. వారిది నవీన శిలాయుగం.

ఆస్ట్రేలియాకు దక్షిణంగా ఉన్న టాస్మేనియాద్వీపంలో మనుష్యులందరికంటె హీనమైన శరీరముకల ఒక అనాగరిక జాతివారు మొన్నమొన్నటి వరకు అంటే దాదాపు నూరేళ్ళవరకు వుండేవారు. ఈజాతివారు ఎన్నడూ యూరప్‌లో లేరు. భూతలపు మార్పులచేత ఇతరులతో ఈ 'టాస్మానియను' లకు రాకపోకలు లేక వీరి ఆచారాదులు ఆదిమస్థితిలోనే నిలిచిపోయాయి. వారు క్రమంగా వృద్ధి అవడానికి బదులు క్రమంగా క్షీణించిపోయారు. వీరుకూడా మనవంటి మనుష్యులే. యూరోపియన్ పరిశోధకుల కంటబడే వేళకు వీరు నత్తలను, నీటిజంతువులను ఒట్టి తింటూ, ఇళ్ళూ వాకిళ్ళూ లేక చెట్లక్రింద, తిప్పల మీద నివసిస్తూ ఎంతో హీనస్థితిలో వుండేవారు. వీరికి తొలిమానవులకున్నంత హస్తనైపుణ్యంలేదు.

నరజాతి మొదట ఏప్రాంతంలో నివసించిందో తెలియనట్లే, మొదటి నరజాతి రూపురేఖలు ఎలావుండేవోకూడా నిర్ణయించడం కష్టమే. మనదేశంలో పశ్చిమపంజాబు ప్రాంతంలో మనుష్యజాతివున్నట్టు కొన్ని నిదర్శనములు దొరికాయి. నరజాతి ఆరంభకాలంవరకు ఆఫ్రికాకు, మన దక్షిణ భారతదేశానికి భూసంబంధం వుండేది. ఆకాలాన మరుగుజ్జులు ఆఫ్రికాలోవున్న చిహ్నములు కొన్ని కనబడ్డాయి. ఆఫ్రికాలోని ప్రాణులను పోలినవి మనదేశంలో కూడా వుండేవని కొందరు వాదిస్తున్నారు.

ఏమైనప్పటికీ వామనయుగమనదగిన ఈ ఆదిమనరకాలములోనే మానవపరిణామం ప్రారంభమైందని నిస్సంశయంగా చెప్పవచ్చు. నల్లని నీగ్రోలు, అమెరికాలో రెడ్ ఇండియనులు, మంగోలియాలో పసుపుపచ్చనివారు, చామనచాయగా వుండే భారతీయులు వగైరా శాఖలన్నీ ఈ యుగంలోనే ఏర్పడ్డాయి. హిమానీనదాలు కారణంగా ఈ ప్రపంచంలో అనేక ప్రాంతాలకు చీలిపోయారు. మానవజాతుల సంస్కృతి పరస్పరప్రేమ ఈ యుగంలోనే వర్ధిల్లినట్లు చెప్పడానికి నిదర్శనాలున్నాయి.



# పుట్టింటికి....

• కొటూరి విజయసారథి, మానికొండ రాఘవరావ్ •

ఎనిమిదేళ్ళ చిన్నపిల్ల కమల. ఆమె చిన్నతనంలో యెన్ని పెళ్ళిళ్ళు చేసిందో. ఆమె బొమ్మల పెళ్ళిళ్లలో యెన్ని మార్లు మాతృశ్రీగా మారిందో. యెంతమందికి యెన్ని పురుళ్లుపోసిందో-ఆమె జీవితం యెంత ఆనందంగా గడిచిపోయిందో. ఒకొక్కసారి ఆటల్లో ఆమెపట్టపు రాణి అయ్యేది. దాసదాసీజనాలు ఆమె అడుగులకు మడుగులొత్తేవారు.

ప్రతివారికి చిన్నతనం ఆనందాన్నిస్తుంది. కల్లకపటం లేకుండా ప్రవర్తిస్తారు. అలాంటి కమలకు పదవయేటనే పెండ్లిచేశారు. ఆమె అప్పటికే ఫస్టుఫారం చదివింది. పెండ్లికాగానే అత్తవారుచదువు మాన్పించమన్నారు. చేసేది లేక గంగాధరరావ్ తనకూతురు చదువుమాన్పించాడు. కమల భర్తపేరు పంతులు. పంతులు థర్డ్‌ఫారం పాసయ్యే సరికి కమల పెద్దమనిషైంది. కొద్దికాలంలోనే ఆమె అత్తవారింటికి వెళ్ళింది. అత్తవారియిల్లు క్రొత్తదికాదు మేనమామగారిల్లే. కమలకు తండ్రేఅన్నీను. పంతులికి తల్లే అన్నీను. కమల కాపురానికివచ్చినా పంతులు అతికష్టంగా స్కూల్‌ఫైనల్ పూర్తిచేశాడు.

ఇప్పుడు పంతులికి యిరువది సంవత్సరాలు. కమలకు పదునార్రప్రాయం. పంతులు తాలూకాఫీస్‌లో గుమాస్తా చేస్తున్నాడు. పగలు తొమ్మిదిగంటలకువెళ్ళి సాయంత్రం ఐదుగంటలకు వస్తాడు.

ప్రపంచంలో అత్తాకోడండ్ల సంబంధం కష్టతరమైనది. ఒకరూ యిద్దరూ తప్పితే అత్తలందరికీ కోడలురాగానే గీర్వాణం విషమవుతుంది. అత్తక్రింద కోడలు బానిసను కొంటారు. చెప్పుక్రింద తేలులా చూస్తారు. కమల యేమంత పెద్దదికాదు. అందులోనూ తల్లిలేనిబిడ్డ. గారాబంగా పెరిగిందాయెను. ఇల్లూడవడం దగ్గరనుంచి పక్కలు వేయడంవరకు కమల చచ్చినట్లు చేయాల్సిందే. వారిననే పనేముంది బాల్యవివాహంచేసిన గంగాధరుని అనాలి.

అత్త నెదిరించడం కమల యింకానేర్చుకోలేదు. అత్తచేసిన అత్యాచారాలు భర్తతోచెప్పుకోవడమసలే తెలియదు యింక ఆమెకు. తెలిసిందల్లా ఒక్కటే. చెప్పినపని చేయడం చేయలేనిపని చేస్తూయేడ్వడం అంతే. అప్పుడప్పుడు పుట్టింటిని తలుచుకొనేది. కన్నీరు కార్చేది. తనతోటి వారు ఇంకా అన్నాలాట లాడుతున్నారే, యింకావాళ్ళు అట్లతద్దికి ఉయ్యాలలూగుతున్నారే. తనకేనా ఆకారాగార రాణివాసం, అనుకొనేది. ఇంట్లో కమల యేంబాధ పడుతోందో తెలుసుకోలేడు పంతులు. అతను అస్వతంత్రుడు వ్యక్తిత్వాన్ని చంపుకొన్న....కాదు వ్యక్తిత్వంలేనివాడు తనజీతం అమ్మకిస్తాడు. కాఫీకిడబ్బులు ఆమెనే అడిగితీసుకొనేవాడు. భార్య మల్లెపూలు కొనుక్కొంటాను, ఒకబేడ యివ్వండంటే, తనదగ్గర డబ్బుల్లేవనేవాడు. అత్తనడగటానికి చచ్చేభయం ఆమెకు. యెప్పుడైనా అత్తకొంచెపరి లేక పోతేలేదు. కమలకు పసిమిబుగ్గల పచ్చదనం యింకా పోలేదు. ఆమె యింకా పరికిణీలే కడుతుంది. యింకా బొమ్మలాట ఆడుకోవాలనే అనుకొంటుంది. కాని ఆ ఆలోచన కలిగినప్పుడు అత్తగారిపాత్ర నిర్వహించడానికి ఆమెకు ధైర్యముంటేనా? తనుకూడా తనఅత్తలాగ కటువుగా నడవాలనుకోవడం, అధైర్యపడి కూర్చోవడం.

కమలకు ..పెళ్ళిచేసుకోకుండాఉంటే బాగుండేదనిపించింది. తనపుట్టింటికిపోయి తనవాళ్లను కలుసుకోవాలనుకొంది. ఆరాత్రి గదిలో "యేమండీ నన్ను మావాళ్ళయింటికి ఒకసారితీసుకువెళ్లరూ" అని దీనంగా అడిగింది పంతుల్ని. అతనిలేతగుండె ఆమెమాటలు వినగానే కరిగిపోయి "అలాగే! అమ్మనడుగుతారేపు" అన్నాడు. ఆమెకు సంతోషం పట్టపగ్గాలులేకుండాకల్గింది. ఆమెలో నీరసించిన జీవఋవులొక్కసారి ప్రాణంపోసుకున్నై.

మరునాడు పంతులు భోంచేస్తూ "అమ్మా! రేపు కమలను పుట్టింటికి తీసుకువెడతానే" అన్నాడు. 'అప్పుడేపంపుట్టిల్లిర

పట్టుమని పదినెల్లైనా దాటలేదు. రేప్పండక్కి తీసికెళ్ళచ్చులే' అంది తల్లి. ఆ గాంభీర్యప్పలుకులు వినిఅతను మాట్లాడలేక పోయాడు. రేపుపండగందేగాని పండగ యింకా నెలరోజులపైన ఉంది. అంతవరకూ చిన్నపిల్ల ఆగగలదా! కమలకు రోజురోజుకీ పుట్టింటికెళ్ళాలన్న తృష్ణయెక్కువైంది. కాని నిరుత్సాహియై పనిచేయలేకపోయేది. అత్త అందుకని కేకలేసేది. ఆమె పరీక్షంగిపోయేది. ఆ నిరుత్సాహంతో తోటివారితో కలిసిమెలిసి ఉండేదిగాదు. అందుకని వారు గూడా కమలని హేళనచేసేవారు. ఆ హేళన ఆమెను రోకటిపోటుగా బాధించేవి. ఆషికోరిక చెల్లనప్పటి నుంచీ కమలకు చిరాకు, పరాకు, యెక్కువైనై. మద్రాసులోని శక్తటములరొద ఆమెకు తలనొప్పి కల్గించేది. అప్పుడప్పుడు సాయంవేళ అంటే నూటికొక్కసారి ఏదోపార్కులో కొంచెం హాయిగా కాలంవెళ్ళబుచ్చేది. అక్కడ వినిపించే సంగీత, వీణానిక్వణాలామె మనస్సుకు హాయిగొల్పేవి. విరులపైనుండి తేలివచ్చే అనువాసనాఘ్రాణముచే కమల హృదయం పరిమళించేవి. కానిఅత్తగారి కఠోర వాక్కులకు ఆసుఖానుభూతి తాళలేక తెలియని యేసీమలకో సారి పోయి వెనుదిరిగి చూచేది.

పుట్టింటికి పోవాలన్న కోరికయెక్కువైంది ఆమెకు, ఆకాంక్షవల్ల తను చేసున్నదీ, చేయబోతున్నదీ తప్పో ఒప్పో తెలుసుకోలేక పోయేది. అత్తగారిచర్యలు ఆమెలో చనాజ్ఞానాన్నికూడా నశింపచేసేవి. చివరకు కమల వెళ్ళడానికే నిచ్చయించుకొన్నది. ఆమెకు తలనొప్పిగా వుంది. కొంచెం జ్వరంకూడా తగిలింది. కళ్ళుయెఱ్ఱబడ్డయ్. వాతావరణం గంభీరంగాఉంది. ఆకాశం మెరుపులతో దేదీప్యమానంగా వెలుగుతోంది. ఉరుములతో ప్రతిధ్వనిస్తోంది. అడపా తడపా చినుకులుకూడా పడుతున్నై. పంతులు ఆఫీసునుండి యింకారాలేదు. తనపోకనెరిగించుతూ భర్తకు ఉత్తరంవ్రాసి బల్లమీదపెట్టి పోదామన్న నవలాజ్ఞానం ఆమెకులేదు. అత్తగారు స్నానంచేస్తోంది. దొడ్లో కమల కాళ్ళుతేలిపోతున్నై. ఆమె ఇల్లుదాటివెళ్ళి పోయింది.

అత్తగారు స్నానంచేసి "కమలా! కమలా! ఓసినీమంప చెగ. ఎక్కడున్నావే? ఆదణ్ణెంమీదతెల్లచీర యిలా తెచ్చిపడై"అనికేకలు వేసివేసి విసిగి చివరకు ఆమేవచ్చి చీరకట్టుకొని యిల్లంతా నాలుగుమూలలా వెదికింది. కమలజాడ తెలిస్తేనా: "యింటికి రానీ దీసపని చెబుతా" ననుకొంది. యింతలోనే పంతులువచ్చి "కమలా! కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు"అనికేకేసి కుర్చీలో కూలబడ్డాడు. "యేదీ.... పెత్తనాల కెళ్ళిందికాబోలు", అంటూ గ్లాసుతో నీళ్ళుతెచ్చి అక్కడపెట్టి పోయింది. ఆరాత్రి యేడుగంటలవరకు కమలకోసం చూచి చింతాకులాత్ముడై గొడుగూ బ్యాటరీ లైటూ పుచ్చుకొని ఆమెను వెదకడానికి వెళ్ళేడు పంతులు. ఎక్కడికి వెళ్ళినా తను వచ్చేసరికి కమల యింటికి వస్తుందని అతనికి తెలుసు గనుక అలాబయలుదేరేడు. ప్రళయఘోషచేస్తూంది వాతావరణం. కుంభవృష్టి. పంతులు వెదికి వెదికి నిరాశచెంది, పోలీసులకుతెల్పి తడిసి ముప్పందుమై యింటికివచ్చాడు. అతనికి మనస్సులో ఆందోళనగా ఉంది. మరోగంటసేపట్లో పోలీసులామెను పట్టుకొని తెచ్చి వప్పజెప్పి వెళ్ళేరు.

కమల బట్టలు బురదకొట్టుకొని తడిసిపోయినై. వళ్ళు సలసలకాగిన వేడినీళ్లకు మల్లేఉంది. కళ్లుచింతనిప్పులైనై, ఆమె స్మృహతప్పి పడిఉంది. బట్టలుమార్చి గదిలో మంచంమీద పడుకోబెట్టేరు ఆమెను. పంతులు కళ్లు చెమ్మగిల్లినై. కమల తనలోతానే మైమరచి మాట్లాడుకొంటున్నది. ఒకసారి యేడుస్తుంది మరోసారి నవ్వుతుంది.

నేను మగపెళ్ళివారితరఫునమ్మా.... లెండి లెండిభోజనాలకి.... భజంత్రీలు మేళాలుచేయండి.... యేమండీ నన్ను పుట్టింటికి పంపరూ.... నన్ను కొట్టకండి అత్తయ్యా.... నేను చిన్నదాన్ని.... అంటూ యేవేవోమాట్లాడుతుంది. మలేరియాలో సంధిపుట్టింది అన్నాడు డాక్టరు. పంతులు వెంటనే మామగారిని రమ్మని టెలిగ్రాం యిచ్చాడు. రాత్రితొమ్మిది గంటలకు గంగాధర్రావేవచ్చాడు. అతను నిశ్చేష్టుడైనాడు. అత్తగారివంక మిరమిరచూచేడు. గాలికిలైటు రెపరెపలాడుతోంది. "యేమండీ నేను పుట్టింటికి వెడతానండీ.... నాన్నా నన్నుతీసుకువెళ్ళవూ...." అని వేడినిటూర్పుగాడ్పు విడిచేది కమల.

"నేను పుట్టింటికి వెడుతున్నా గౌరీ త్వరలోనేవస్తా! అత్తయ్యాగారూ వెళ్ళొస్తా.... యేమండీ ఉత్తరాలువ్రాస్తారు గదూ-మళ్ళాత్వరలో తిరిగొస్తానంటూ కమల దీర్ఘనిద్ర పోయింది: అంతా బావురుమన్నారు. పంతులికి యిప్పుడర్థమైంది కమల పుట్టింటికెళ్ళిందని. గాలితీవ్రతతగ్గింది. వాతావరణంప్రశాంతంగాఉంది. కానిపంతులుకిమనోశాంతిలేదు.



# బాలానందం

## భోజరాజు—కాళిదాసు

"నిన్ని"

భోజ మహారాజు తన ఆస్థానంలో కవులను బాగా సన్మానించే వాడు. సన్మానించడమే గాక వారి స్థితిగతులను తెలిసికొని ధన సహాయం గూడ చేసేవాడు.

ఒక మాటు నలుగురు బీద బ్రాహ్మణులు వొక చోట జేరి, తాము గూడ కవిత్వంచెప్పి భోజరాజువల్ల ధన సహాయం పొంది, కొంత దారిద్ర్యం మాన్పు కుందాం అని తమలోతాము ఆలోచించుకుని భోజ మహారాజు వద్దకు ప్రయాణం సాగించారు.

దారిలో విశ్రాంతి కొఱకు వొక నదివొడ్డున కూర్చు న్నారు. ఇదే సమయంలో పద్యంకూడ వ్రాద్దామని నలుగురు నిశ్చయించు కున్నారు. కాని పద్యం దేనిని గురించి వ్రాస్తారు? వారికేదైనా విషయం తోస్తేనా! నలుగురు పరి పరి విధాల ఆలోచించ సాగారు.

ఆ నది వొడ్డున వొక నేరేడు చెట్టు వుంది. దాని నిండా పండిన నేరేడు పండ్లు వున్నాయి. గాలి వీచినప్పుడల్లా కొమ్మలు కదిలి ఆ పండ్లు నదిలోని నీటిలో "డుబుకు" "డుబుకు" అను శబ్ధము చేస్తూ పడుతున్నాయి.

చెట్టువైపు తదేక దృష్టితో చూస్తున్న మొదటిబ్రాహ్మ ణుడు ఉత్సాహంతో పుప్పొంగుతూ, నేను మొదటి పాదాన్ని ఆలోచించాను వినండి అంటూ యీ విధంగా చెప్పాడు:—

"జమ్ము ఫలాని పక్వాని"
(పండిన నేరేడు పండ్లు)

రెండవ వాడు తను మాత్రం తక్కువా అన్నట్లు ఆవే శంతో ఆదిపోతూ—

"పతన్తి విమలే జలే"—అన్నాడు
(నిర్మలమైన జలములో పడుచున్నవి)

మూడువ వాడు ముచ్చటగా—

"తానిమత్స్యాః న ఖదన్తి" అని పలికాడు.
(కానీ చేపలు వానిని తినుటలేదు)

పండ్లుపడే శబ్దాన్ని దీక్షతో వింటున్న నాల్గవవాడు నమరూ బెదురూ లేకుండా—

"కుర్వంతి డుబకం డుబకం"—అని పద్యాన్ని ముగించాడు.

(డుబుకు డుబుకు అను శబ్దము చేయుచున్నవి)

ఈ విధంగా పద్యాన్ని ముగించిన ఆ నలుగురి సంతో షానికి మేరలేక పోయింది. వారు అతి సంతోషంతో భోజ మహారాజు సభకు బయలు దేరారు. రాజ భవనం దగ్గిర వీరు "కాళిదాసు" మహా కవిని కలుసు కున్నారు. అతనూ తమ వలనే రాజ సభకు వెళ్ళి, బహుమతి పొంది వస్తున్న వాడని తలచి, అతనికి నమస్కారము చేసి

"అయ్యా! మేము భోజ మహారాజుకు విని పించుట కని వొక పద్యమును వ్రాసినాము. దీనిని విని మీ అభిప్రాయ మును తెలుప గోరెదము"—అని అడిగారు.

కాళిదాసు ఆ పద్యమును విని నాల్గవ పాదము మాత్రము తీసివేసి దానికి బదులు

"జాల గోటక శంకితాః"—అని వ్రాయమని చెప్పి వెళ్ళి పోయినాడు.

(తమను పట్టుకొనుటకు వేసిన యెర యేమోనను సందేహముచే)

వీరు నలుగురూ రాజ సభచేరి తమ పద్యమును ఈ విధముగా వినిపించారు.

జంబు ఫలాని పక్వాని
పత న్తి విమలే జలే
తాని మత్స్యాః న ఖద న్తి
జాల గోటక శంకితాః

కాని భోజరాజు క్షణంలో నాల్గవ పాదములోని కవిత్వ ధోరణిని బట్టి అది వీరి బుద్ధి కందని వూహ అని గ్రహించాడు. వెంటనే పరీక్షించి నిజా నిజము నెరుగుట కని వారితో మొదటి మూడు పాదములు సరిగా నున్నవి కాని నాల్గవ పాదములో కొంత భిన్నత గన్పించు చున్నదని—అన్నాడు.

వెంటనే నాల్గవ పాదమును వ్రాసిన బ్రాహ్మణుడు లేచి, "మహారాజ! నేను దాని నెంతో చక్కగా "కుర్వంతి డుబకం డుబకం" అని పూర్తి చేస్తే, తమ దర్బారు నుంచి పోవుచూ మా కెదురైన ఒక మూర్ఖుడు దానికి బదులు దీనిని వ్రాయమని చెప్పెను''—అని ఉక్రోషంతో పలికాడు.

భోజ మహారాజు వారి మూర్ఖతకు నవ్వుకొని ఇది పూరించినది కాళిదాసేనని గ్రహించాడు. కాని వారి దారిద్ర్యానికి కనికరించి వారికి కొంత ధనమిచ్చి పంపి వేశాడు.

మరునాడు నిండు సభలో, కాళిదాసు గనుక ఆ పాదమును వ్రాయకుండి నట్లయితే వారి పద్యమునకు అర్థమే వుండి యుండదని, వారెట్టి సహాయము తన చేత పొంది యుండరని చెప్పి అతని కవిత్వమును, వుదారత్వమును శ్లాఘించినాడు.



# యెత్తుకి పై యెత్తు

"రా జేం ద్ర"

ఒకప్పుడు ఉజ్జయనీ నగరములో ధనగుప్తుడు, వర్ధమానుడు అని ఇద్దరు గొప్ప ధనికులుండేవారు. జీనపు దీవిలో ఒక ఓడ ఇనుముకు రెండు ఓడల బంగారం ఇస్తున్నారని ఇద్దరూ తెలుసుకున్నారు. ఆ దీవి చేరడం చాలా కష్టం. ప్రమాదముతో కూడుకున్నది. ధనగుప్తుడు, వర్ధమానుడు ఆ దీవికి ప్రయాణం అవటానికి సాహసించారు. ఒకనాడు ఇద్దరూ చెరి ఒక ఓడ నిండా ఇనుము నింపి చెరియొక కాళీ ఓడ తీసుకొని బయలు దేరారు.

మార్గమధ్యంలో వర్ధమానుడికి జ్వరంవచ్చింది.సముద్రపు గాలులకు ఆగలేకుండా యున్నాడు. అప్పుడు ధనగుప్తుడు "వర్ధమానా, నీవీజ్వరముతో ప్రయాణం చేయటం మంచిది కాదు. ఇంటికి మరలి పోవడమే మంచిది. నీ తరఫున నేను వ్యాపారము చేసి నీ ధనం పువ్వుల్లో పెట్టి యిస్తాను." అన్నాడు. అందుకు వర్ధమానుడు సరే అని ఇంటికి మరలి పోయాడు. యెన్నో తుపానులకు గురియై ధనగుప్తుడు రెండు నెలలకు జీనపు దీవి చేరుకున్నాడు. అచ్చటొక నెల వ్యాపారము చేసి నాలుగుఓడల నిండా బంగారం నింపు కొని స్వదేశం చేరుకున్నాడు.

## యెత్తుకి పైయెత్తు

ధనగుప్తుని రాకచూసి వర్ధమానుడు సంతసించి "ధనగుప్తా ఆరు నెలలనుండి నీరాకకెదురు చూస్తున్నాను. రోగము వలన నాసొమ్మంతా ఖర్చయింది. వ్యాపారి మెట్లు సాగింది. కులాసాగా ఆపదలు లేకుండా ఇల్లు చేరగలిగి తివా?" అన్నాడు. అందుకు దనగుప్తుడు "వర్ధమానా! నేనేమి చేస్తాను. జీనపుదీవి చేరిన వెంటనే ఒక పూట కూటి యింట్లో బసచేసాను. అక్కడ రెండు గదులు అద్దెకు తీసుకొని, అందులో ఒకదాంట్లో నీ ఇనుము నిలవ చేసాను. చెప్తే నమ్మరు గాని ప్రొద్దున్న లేచేసరికి ఇనుము నంతా యెలుకలు తినేశాయి. ముచ్చుకి తులమైనా మిగల్చ లేదు. అచ్చటి వింతలు చెప్పనలవికాదు. రోగాలకి తెంపు లేదు. నీతోపాటు ఇంటికి యెందుకు తిరిగాను కానా అని అప్పుడనుకున్నాను. ఎట్లో బ్రతికి ఇల్లు చేరుకోగలిగాను," అన్నాడు.

ఇదంతా విని వర్ధమానుడు ఏదోకపటం వుందని గ్రహించాడు. సమయంకోసం వేచి యుండాలి అని అప్పటి మట్టుకి యేమీ అనకుండ ఊరుకున్నాడు. అసలు సంగతిధన గుప్తుడు మార్గమధ్యములో వర్ధమానుని ఓడలోని వారి నందరిని సముద్రములోనికి త్రోసి బంగారం కాజేసి ఒక రహస్యస్థలము నందు పాతి పెట్టేశాడు.

జీనపు దీవి నుండి తిరిగి వచ్చిన తరువాత ధనగుప్తుడు రెండు నెలలలో తన కొడుకు పెండ్లి చేశాడు. ఆ విందుకు వర్ధమానుడు కూడ ఆహ్వానింప బడ్డాడు. ఆఖరి రోజున వర్ధమానుడు ధనగుప్తుని కుమార్తెను యెత్తుకొని ముద్దు లాడుచు తీసుకొని పోయి దాచేసాడు. "నాపిల్లే'' దని ధనగుప్తుడడిగాడు. "ముద్దులాడుచుండగా గ్రద్దొకటి యెత్తు కొని పోయింద"ని వర్ధమానుఁడు బదులు చెప్పాడు. పిల్లలని గ్రద్దయెత్తుకొని పోవటం నమ్మదగినది కాదని ధనగుప్తుడు ఉజ్జయినీనగరపు రాజుగారివద్ద ఫిర్యాదుచేశాడు. రాజు వర్ధమానుని ప్రశ్నింపగా" ముద్దులాడు చుండగా గ్రద్ద తన్నుకొని పోయిన నేనేంచేదు''నని ఊరుకొన్నాడు. అందుకు ధనగుప్తుడు '' పిల్లల్ని గ్రద్ద యెత్తుకుని పోవుట చాలా వింతగా యుంది. దాచిఇలా చెప్తున్నాడ"న్నాడు.

అప్పుడు వర్ధమానుడు చేతులు జోడించి "ప్రభూ అన్నీ ఇట్లే తెలుసుకోవాలి. రెండు ఓడల ఇనుము ఎలుకలు తినగా లేనిది ఒక గ్రద్ద పిల్లనుయెత్తుకొని పోవుట వింతా?" అన్నాడు.రాజు ధనగుప్తుని అసలుసంగతి ఏమని అడిగాడు. ధనగుప్తుడు ఇదివరకు వర్ధమానునికి చెప్పిన సంగతి చెప్పాడు. రాజు వర్ధమానుని యెత్తుకి పై యెత్తు చూసి సంతసించి ధనగుప్తుని బంగారం ఇచ్చేయ మన్నాడు. బల వంతముపైన ఇనుమునకు ఇనుమేగాని బంగారం యీయ నన్నాడు ధనగుప్తుడు. ఇంకా దండించగా ఒక్కఓడ బంగారమే యిస్తానన్నాడు. రాజదిగ్రహించి అనుమానం లేకుండ ధనగుప్తుని ఆస్తినంతా జప్తుచేసి, రహస్యస్థల మును కనుక్కొని, వర్ధమానునికి ధనం యిచ్చేసాడు. ధనగుప్తుడు తన ఆస్తికూడ లేకుండ దేశాటనకు పోతాడు.



## చక్కటి ప్రశ్న

* వేటూరి భామతి *

మా బడిలోని పిల్లలందరు
చాలా చెడ్డవారని పేరు
ఎంత చదివినా
ఎంత చేసినా
పేరు మాత్రం పోలేదు.
ఆ యేటికి పాఠాలన్నీ
అయిపోయి నప్పటికీ

లెక్కల మాష్టరు మాత్రం
మమ్మల్ని వదల్లేదు.
దాంతోమా కందరికీ
కోపం చాలా వచ్చింది.
చేసేది లేక
అవకాశం కోసం
చూస్తూ కూర్చున్నాము.

## చక్కటి ప్రశ్న

ఇష్టంలేని ఆ పాఠం నాకు
జోలపాట లాగుంది.

క్లాసన్న మాటమరచి
గట్టిగ ఆవళించేశా!
చేసింది తెలిసి
నాలిక కరుచు కున్నా.

ఇది విన్న మాష్టరు నిల్చుని
చేతిలో బెత్తంతో
"దీని చివర ఉన్నాడు
ఓ మొద్దు వెధవ"
అన్నారీ రీతిగా
దానితో నన్ను చూపుతూ.

నా వైపు చూస్తూ పిల్లలు
పకపకా నవ్వారు.
దాంతో నాకు పట్టొచ్చి
నిలచాను వెంటనే లేచి.
"ఏ చివరండీ మాష్టారు?"
అంటూ చక్కటి ప్రశ్నొకటి
చురుకుగా పారేశా!
పిల్లలు బాదుతూ
మేష్టార్ని చూస్తూ
నవ్వారంతా గోలగా.
మేష్టారు దానికి
తట్టుకోలేక
తేలేశాడు కళ్లు.



# పరోపకారము

* శివస్వామి *

గుఱ్ఱంపై పోతున్నాడొకరైతు
బిఱ్ఱబిగిసిన ధాన్యపు సంచుల్తో
మిల్లుకి పోయీ వడ్లాడించుటకు
మెల్లగ ఒకనాటి మధ్యాహ్నం.

మార్గమధ్యంలో గుఱ్ఱంకాస్తా
మనుష్యు లెవ్వరూ లేనిచోటా
కాలు జారిందే మోగానీ
కూలపడ్డా డంతలోనే.

అకస్మాత్తుగా ఆ దారివెంబడి
అరుగుదెంచెను ఒక పెద్దమనిషి
తిలకించె నీ పేదరైతును
గమనించె నాతనిమస్థితిని.

"ఇంతగొప్ప ధనికునెట్లు,
ఈసంచుల నెత్తమనుట
అనుచురైతు మిన్నకుండి
చూచుచుండె ధనికునివైపు.

ధనికుడల్లన దరిజేరి, రైతుతో చేఁ
సంచులన్నిటి చక్కఁగ నొక్కటొకట
చేర్చి గుఱ్ఱముపైన కూర్చెసరిగ,

అంత ధనికుడు నగుచు నిట్టులనియె
"ఆపదలో నెవ్వరైన అరసినప్పుడు
అతనికి నీశక్తికొలది సాయపడుము ;
అదియే నీ ప్రత్యుపకారము
పరోపకారార్థమె మన శరీరమ్."



విషాదాంత ప్రణయ గాథలు :

# లైలా మజ్నూ

* డాక్టర్ వారణాశి యశోదాదేవి, డి. లిట్. *

ప్రేమ అనంతము, నిరంతరము, నిర్మలము, నిష్కల్మషము, శాశ్వతము ; దేశ కాలపాత్రతలను, జాతి మత భేదములను, కలిమిలేములను పాటింపదు. కావుననే విశ్వ సాహిత్యములో ప్రేమకు అంగత్వము ఆపాదింపబడినది.

మన దేశంలోకంటె విదేశములలో విషాద సాహిత్యము మెండు; సుఖాంతములు గాని ప్రణయగాథలు మిక్కుటము. పారశీక సారస్వతములో లైలామజ్నూ కథ అత్యుత్తమ స్థానమాక్రమించినది. కథా మూలమొక పురాతన అరబి యను గాథ. రచయిత సుప్రసిద్ధ పారశీక కవి నిజామి 12 వ శతాబ్దమువాడు. తర్వాత గొప్ప కవులైన సాది, హాఫీజ్ లు నిజామిని పొగడియున్నారు. జన్మస్థానమైన గంజాలో నెక్కువకాలము నివసించుటచే నిజామి గంజావి అనియు బిల్వబడెను. నిజామి రచనల మెచ్చుకొనుటకంటె మనం చేయదగ్గది లేదన్నాడు హాఫీజ్. నిజామి కవితా ప్రతిభ అతని ప్రప్రథమ రచనయైన మఖ్జాన్ అస్రర్ లేక నిగూఢముల నిక్షేపములో వెల్లడియైనది. అప్పటికి తానేరాజును ఆశ్రయింపనందున కవితను సువర్ణముకై అమ్మ కవులు నిర్దయులనియు, వారి తలలపై నేడు కిరీటము లున్నను, రేపు యినుప గొలుసులుండవచ్చుననియు, పోత నామాత్యునివలె ఆస్థాన కవులను దెగడెను. ఈ రచనా ఫలితముగ అజెర్‌బైజను ప్రభువైన కిజిల్ అర్స్లాన్‌చే గౌరవింపబడి రెండు గ్రామములను యినాముగ పొందెను. తదనంతరము షెర్వాన్ రాకుమారుడైన అఖిస్తాన్ కోరికపై లైలామజ్నూను పద్యకావ్యముగ రచించెను. తన ప్రతిభను జూపుటకు తగినంత అవకాశము యీ కథా రచనలోనుండ దేమోనని సంకోచించియు యువరాజును తృప్తిపరచుటకై నాల్గు మాసములలో కథను ముగించి క్రీ. శ. 118౮ లో తన పదునాలుగేండ్ల పుత్రునిచే అఖిస్తానుకు పంపించెను.

ఈ కథ వేర్వేరు తెగలకు జెందిన యిద్దరు ప్రేమికుల యెడబాటు, దుఃఖములు చెప్పును. దైవస్తుతి, కృతిపతి స్తోత్రములతో రచన ప్రారంభమై తర్వాత కథ యారంభమగును. కెయస్ అను అరబ్ యువకుడు, అమర్ తెగకు ప్రభువు కుమార్తె లైలాయు చిన్నతనంలో పాఠశాలలోను, యిసుక తిన్నెలమీద ఆడుకొనువారు. సమీపంలో వున్న బావిదగ్గర నీడలో ఒకరినొకరు చూస్తూ మాట్లాడుతూ అనేక వూహలగన్నారు. విడ్డూరమైన ఆనందప్రదమైన కథల జెప్పుకొంటూ సాయంత్రం కాగానే యెడబాయ వలసివచ్చిందని నిట్టూర్పులు విడుచువారు. వారికి యవ్వనంతోపాటు విచారం కల్గింది. భయము ఆశ యిను మడించాయి. హృదయాలు బరువెక్కాను. లజ్జ తెలిసి ఒండోరులు తలలు వొంచువారు. ఈ సంతోషం కొలది దినములే నిల్చింది.

లైలా మేలిముసుగు వేసికొన ప్రారంభించెను. బయటకు వచ్చుట లేదు. పెదవులు పాలిపోయి కళ్ళు చెమ్మగిల్లినవి. ఏ శబ్దం విన్నా తన ప్రియుడేమోనని వులిక్కిపడేది. కిటికీలోనుండి చంద్రుని జూచి పలవరించింది. స్వప్నములలో తన కోర్కెల దీర్చు చిత్రముల జిత్రించింది. తన ప్రియుని జూచినటుల భ్రమించింది. ఒకొక్కసారి తన కెయస్ ఒంటెలు, నగలు, ముత్యాలు, బంగారము తెచ్చి తన్నిమ్మని అడిగినట్లు, తల్లి యీసడించినట్లు తలంచేది. తన తలంపు ప్రకారమే వెలలేని కానుకల దెచ్చి తన కొడుకుకు పిల్లనిమ్మన్నాడు కెయస్ తండ్రి. లైలా తండ్రి గద్దించి యేమి సాహసమన్నాడు. మజ్నూ-పిచ్చివాడను మిషపై కన్య నీయ నిరాకరించాడు.

కెయస్ ఆశాభంగముతో నిజముగా పిచ్చివాడై అడవులకేగెను. శిలలు ద్రవించునట్లు తన ప్రేయసిని గూర్చి వాపోయాడు. ఆకాశమును, భూమిని సాక్ష్యమడిగాడు. ప్రేమ పాశములగూర్చి అమితంగా ఆలాపించాడు. స్వప్న జగత్తులో తన కోర్కెల దీర్చికొన్నాడు. తండ్రి హృదయం చాల పరితపించింది. కొడుకును వెంబడించాడు. కాని వెనుకకు తీసికొని రాజాలక పోయెను. దుర్భేద్యమైన ప్రేమ బంధములచే కట్టుబడియున్నానన్నాడు మజ్నూ.

# లైలా మజ్నూ

లైలా ప్రణయబాధ అనుభవిస్తోంది. తల్లి తనతో పాటు విచారగ్రస్తయయ్యి నేమియు జేయజాలకుండెను. తోటలో ఒకనాడు ఏకాంతమున నుండ ఐబుసెలమ్ అను అరబ్ ప్రభువు లైలాను చూచి మోహించి తనకిచ్చి పెండ్లిసేయమని లైలా తలితండ్రుల నడిగెను. ఇంతలో మజ్నూ నౌఫల్ అను అరబ్ ప్రభువుతో స్నేహం చేసి అతనిచే లైలా తెగను యోడింప జేసెను. కాని ఆ యుద్ధ కారణమువలన వారి సమాగమ ఆశ మరింత దూరమయ్యెను. లైలా మజ్నూను వివాహమాడుట అసంభవమనియు, అంతకంటె ఆమె మృతి జెందుట వుత్తమమన్నాడు తండ్రి. మజ్నూ మిక్కిలి విచారముతో యింకను మూలమూల కానలబోయి ద్రిమ్మరుచుండెను.

ఒకనాడు వేటగాడు లేళ్ళను వేటాడుచుండ తాను గుఱ్ఱము పై వెళ్ళి అతని చేయిపట్టి అతడు నిర్ఘాంతపోగా, యీవిధంగా చెప్పాడు. "లేళ్ళ రక్తము స్రవింపజేయుట మహాపాపము; అపశకునము. జంతువులకు స్వాతంత్ర్యము సుమధురము. లైలాను మరుగుపర్చు హృదయము పాలరాతి వలె కఠినము; దయలేనిది" అని వేటగానికి డబ్బిచ్చి ఖైదు జంతువుల విడిపించాడు.

లైలా వివాహము ఐబూతో జరిగింది. ఆమెను చక్కగ అలంకరించారు. అందము యినుమడించింది. గాని ఆమె మనోదుఃఖిత; ఏకాంతమును వాంఛించింది. ఆమెలో కోరిక నశించింది; హృదయంలో జ్యోతి ఆరిపోయింది. భర్త తన్ను కోరివచ్చినపుడు ఆమె విచారపడలేదు. ఈ వివాహ వార్త మజ్నూకు ఒక బాటసారి చెప్పాడు. మజ్నూ మరింత దుఃఖితుడయ్యాడు. ఆశ నిరాశయైనది వెలుగు చీకటిగ మారింది. యవ్వనం వృధాయైంది. చావుకు, సమాధికి యెదురు చూస్తున్నారు ప్రణయవేదన ననుభవిస్తున్న లైలా మజ్నూలు.

మజ్నూ తండ్రి అతనియొద్దకు వచ్చి ఓదార్చ ప్రయత్నించాడు. కాని లాభము లేకపోయింది. ఆ వృద్ధుడు పుత్రుని కడసారి జూచి తిరిగి తన వూరికి వచ్చి చనిపోయాడు.

వివాహితయయ్యు లైలాకు మజ్నూపై కాంక్ష యపారము గదా! ప్రియునకు ప్రేమలేఖ రచించి మరి కొంతకాలమునకు సహచారావాండ్రను యేమర్చి దుఃఖితుడైన ప్రియునిగలయ వచ్చింది. ఆమె తన చిన్నతనంలో వసంత ఋతువులో మజ్నూతో తాను వినోదించుటను తలచుచు చిన్ననాటి బావిలోనికి తొంగి చూడగా, అతని ప్రతిబింబము అందులో కన్పడినవనియు అంతట "ఆహా! ఎంత పాలిపోయాడు" అని తలయెత్తి చూడగా యెదుట మజ్నూ ప్రత్యక్షమైనట్లును ఒక రచన గలదు.

లైలా మజ్నూల పరస్పర ప్రేమ, ఆమె ప్రియునికొరకేగిన నేమి, అతడు ప్రేయసికై వచ్చిన నేమి, అడవుల్లో నేమి, భావినీడల్లో నేమి, వారి కలయికను సంభవింపజేసింది. లైలా ప్రియుని జూచి ఒణికింది; నోటమాట రాలేదు. మజ్నూ ముఖంలో చిరునవ్వు కన్పడింది. "నీవు లైలావా?" అన్నాడు. లైలా అతని ముఖంలోనికి చూచి, బాధ సహింపలేక అతని హస్తములలో మూర్ఛిల్లింది. ఆమెకు తిరిగి స్పృహవచ్చునప్పటికి మజ్నూ కన్నీరు కార్చుచున్నాడు. "నీవు ఎంత మారిపోయావు. నాల్గు సంవత్సరములలో యవ్వనము పోయి వృద్ధాప్యము దాపురించింది" అన్నాడు. వున్మాదునివలె వికవిక నవ్వి కాలమును దూషించెను. తలితండ్రులు మరణించిరనియు, తాను యేకాకిగనుంటి ననియు, మృతుడగుటకుముందు ప్రియురాలి జూచు కాంక్షతో ప్రేమపాశములు యీడ్చుకొనిరాగా ఆ చిన్ననాటి పొదరింట్లోకి వచ్చితి నన్నాడు మజ్నూ.

మరొక రచనలో ముమ్మరమైన భావము వారి సమాగమములో యిర్వురను మాట్లాడ నివ్వలేదనియు, ప్రేమబంధ బద్ధులై వారు యెండొరుల వీక్షించుచు రోజంత నిలబడి యుండిరనియు, ప్రేమంపు చూపులతో, పొంగి పొరలివచ్చు దుఃఖముతో లైలా తన భావముల నతనికి దెల్పి అతని కౌగిలిలో "ఆహా! నోటికి తాళము వేయు యీ దుఃఖము ఆశ్చర్య జనకము. బుల్ బుల్ పక్షి సువాసనల వెదజల్లు పొదలలో గులాబిని జూడగనే తన యానందమును సుమధురముగ ఆలాపించును. అదేవిధముగ నేను లేనప్పుడు నా స్వరము స్వర్గముదాకా వ్యాపించింది. నీ ప్రేమ గీతములు గాయకులు పాడుచున్నారు. మన కలయికతో నీ ప్రేమ యదృశ్యమైనది. నాకంఠము రుద్ధమైనది" అన్నది. తన ప్రభువు మృతిజెందుటవలన కలిగిన ద్వివిధ వైధవ్యమువలన

యొంటరిగ నుంటినే నేను. "ఏదైన కోరికగలదా" అన్నాడు మజ్నూ, "లేదు, మన ఆశ మరో ప్రపంచంలోనే," అన్నది లైలా దుఃఖిస్తూ. అంటు మానవత్వము అంతరించి శాశ్వతానందము పుష్పించుచున్నది.

కన్నీటి కాల్వలు గట్టు ప్రేమికులు విడిపోయారు. లైలా యిల్లు చేరింది. తర్వాత కొలదికాలమునకే స్వర్గస్థురాలైనది. ప్రేమ గీతికలు ఆలాపించుచు ఆమె శవాన్ని ఆ వెన్నెల బాట దగ్గరకు తీసికొని వెళ్లారు. అచట మల్లెలు వాడిపోయాయి, సైప్రెస్ పెరిగింది. తర్వాత కొద్ది కాలమునకే మజ్నూ మరణించాడు. మిత్రులు వచ్చి కళేబరమును లైలా సమాధిలో చేర్చునపుడు అతడు ప్రేమించిన పక్షులు కావలియుండెను.

మృత్యువు లైలా మజ్నూలను ఐక్యము చేసింది. విచారగ్రస్తుడైన జెయద్ అను గాయకునికి స్వప్నములో మజ్నూ పెండ్లి కుమార్తెతో కూర్చుని యున్నట్లు కనబడెను. ధ్యానములో నుండగా అతనికి ఒక రాత్రి స్వర్గము గోచరించింది. అక్కడ సువర్ణ ఫలములు వికసితపుష్పములతో కూడిన మనోహరమైన పొదరిండ్లు గానమైనవి. బుల్ బుల్ పక్షి అతని గానము విన్నది. గుర్రు అతని వీణను ఆలకించింది. ఒక వున్నత తాళవృక్షము చెంత పెద్ద రత్నఖచిత సువర్ణ సింహాసనము గన్పడింది. దాని యెదురుగ పెద్ద తివాసి పరచబడియున్నది. సమీపమున చిన్న కాలువ ప్రవహించుచున్నది. ఆ సింహాసనముపై చిరకాలము విడివడిన కాముకులు—లైలామజ్నూ—ఆనందముతో ఆసీనులై యున్నారు. ధగధగలాడు దీపకాంతిలో ప్రతిబింబించుచున్న రత్నఖచిత పాత్రను వారు చేతిలో పట్టుకొన్నారు. అమృతము తపియైన యధరములతో చుంబించుచున్నారు. స్వప్నావస్థయందున్న జెయద్ వారి పేర్లు యేమన యొకవాణి "ఆ ప్రకాశించుచున్న చంద్రుడు లైలా, ఆమె ప్రియుడు మజ్నూ. అశాశ్వత ఐహిక జగత్తులో నెడబాటు ననుభవించి యచట శాశ్వతానందము పొందుచున్నారు" అని పలికింది. అంతటితో కథ ముగింపుకు వచ్చింది. ఈ ప్రపంచంలో తీరని యాశలను మరో ప్రపంచములో శాశ్వతముగ పొందుదురని యీ గాథచాటుచున్నది.



# ఆత్మవిశ్వాసమును పెంపొందించుట

(37-వ పేజీ తరువాయి)

కొందరిలో యితరుల యొక్క దోహద మక్కరలేక దానంతట అదియే వృద్ధినొంది, వారిచేత కొన్ని ఘన కార్యములు చేయించును. ఇందుకు మన గాంధీమహాత్ముడే మనకు ప్రత్యక్ష నిదర్శనము.

రామమోహనరాయలు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, వీరేశలింగంపంతులుగారు మొదలగువారీతెగకు చెందిన వారు. కొందరిలో నీ యాత్మవిశ్వాసము ఇతరుల యొక్క ప్రోత్సాహమువలన నభివృద్ధిచెందును. హిందూమతద్వేషి, హైందవుల ననేక విధముల క్రూరముగా బాధించునట్టి భారత సామ్రాజ్య చక్రవర్తి ఔరంగజేబు బాదుషాను ప్రతి ఘటించి, మహారాష్ట్ర రాజ్యమును నెలకొల్పి శాశ్వతకీర్తిని గాంచిన శివాజీ మహారాజు అంతటి వాడగుటకు అతని తల్లి జిజీ బాయి, గురువు రామదాసు అతనిలో పెంపొం దించిన యాత్మవిశ్వాసమే. అదే అతని నంతటి సాహస వంతమైన కార్యములు చేయుటకు పురికొల్పినది.

శివాజీకి యెక్కువగా ధనమూలేదు, బలగమంతకన్న లేదు, పలుకుబడిలేదు. తనకు తండ్రియొక్క ఆదరణ కూడాలేదు. సామాన్యజీవితము. మూర్తియైనా బలమైనది గంభీరమైనదికాదు. పొట్టిగా పీలగా నుండే మనిషి. ఆలాటివాడు భరతఖండము నంతను నేకచ్ఛత్రాధిపత్య ముతో పరిపాలించుచున్న ప్రబల పరాక్రమశాలియైన ఔరంగజేబు నోడించి, మహారాష్ట్ర రాజ్యమును స్థాపింప గలిగాడంటే అతనిలో పసితనమునుండి వృద్ధియగుచు వచ్చిన ఆత్మవిశ్వాసమే.

బిడ్డల మనస్తత్వమును వారి స్వభావమును గ్రహించ లేని కొందరు తల్లులు, పెద్దవారు, ఉపాధ్యాయులు తమకు కోపమువచ్చినప్పుడు వారిని చాలా నిరసనగాను, అవమాన కరముగను, నిరుత్సాహముకలుగునట్లు తిట్టుచుందురు. ఆ మాటలు వారి మనస్సులమీద నెంతపనిచేయునో వారికి తెలియదు. బిడ్డలేమయినా స్వతంత్రముగా చేయబోయిన, వారిని చేయనీయరు, వారి ననవసరముగా తిట్టికొట్టి బెదిరించి భయపెట్టుచుందురు, కొందరు బిడ్డల నతిగారా బముచేసి వారిని స్వయముగా నేమీ చేయనీయక ఏమీచేత కాని వారినిగా తయారుచేయుదురు. అట్టి బిడ్డలు పిరికి వారు, ఏమీ చేతకానివారు, ఏపని చేయుటకు తప్పక చేయ గలమనే ధైర్యములేక వెనుదీయువారుగా తయారగుదురు.

బిడ్డలకు తగినంత స్వేచ్ఛ స్వాతంత్ర్యముల నొసగ వలయును, వారుచేసే పనులలో, ఆడే ఆటలలో, అనవ సరముగా జోక్యము కలిగించుకొనక వారికి హాని కలుగ నంతవరకు వారినలా వదిలి వేయవలయును. ప్రతి పనికీ ఒకరిమీద ఆధారపడకుండా స్వయంగా చేసికొను నట్లు చూడవలయును. బిడ్డలకు ప్రతివిషయములోను ప్రోత్సాహమొసగుచుండవలయును. ఏవిధమైన స్వేచ్ఛ స్వాతంత్ర్యములేక వ్యక్తిగతి ఆలోచనలు కార్యములు చేయుట కవకాశములేక అతి భయభక్తులతోగాని లేదా అతి గారాబముతోగాని పెరిగే బిడ్డలకు ఆత్మవిశ్వాసము మనోధైర్యము ఉండుట కవకాశములేక లోకములో స్వతంత్రముగా, సుఖముగా ఏలా జీవించాలో తెలియక పిరికివారై ఎప్పుడూ ఒకరిమీద ఆధారపడి వారికి దాసులై యుందురు. అట్టివారు ఒక స్వతంత్ర దేశమునకు కావల సిన ఉత్తమ పౌరులగుట అసంభవము. పాఠశాలలలో ఉపాధ్యాయులుకూడ బిడ్డల మనస్సులను విషయములతో నింపక వారే స్వయముగా ఆలోచించుటకు కనిపెట్టుటకు కార్యకారణ సంబంధములను స్వయంగా పరిశీలించి తెలిసి కొనుటకు తగిన యవకాశము స్వేచ్ఛ నొసగి, ప్రతి విష యము మనమే తెలిసికొనగలము కనిపెట్టగలము చేయ గలము అనే ఆత్మవిశ్వాసమును వారిలో పెంపొందించాలి. అలా తమ ఆత్మవిశ్వాసమువలన గొప్పవారైన వీరుల చరిత్రలను చెప్పి వారి కుత్సాహము కలిగించాలి. మనము, మనదేశము పరిశుభ్రమైనది, న్యాయధర్మముల కునికిపట్టు యినది, శాంతియుతమైనది, ఇతరదేశములయొక్క సహాయమక్కరలేకుండ అన్నివిషయములలోను స్వతం త్రంగా తనకాళ్ళమీద తాను నిలబడగల శక్తివంతమైనది కావలయునంటే మన బిడ్డలను పరిశుభ్రమైనవారినిగను, న్యాయమూర్తులు, ధైర్యశాలురు, దృఢమైన ఆత్మవిశ్వా సముగలవారిగునట్లు శిక్షణ నిచ్చిన తప్ప మన కలలు నిజము కావు. ప్రస్తుతపు ప్రజలు చేయలేని పనులు భవి ష్యత్తులో వారి బిడ్డలు చేయసమర్థులు కావాలి.

బిడ్డల శిక్షణను కేవలము తలిదండ్రులకు వదలి వేయుటకన్న అమెరికా, రష్యా, యింగ్లండు, జపాను మొదలగు దేశములలోవలె ప్రభుత్వము వారి శిక్షణ బాధ్య తను వహించి, శిశువిహారముల దేశమంతటా విరివిగా నెలకొల్పి, సమర్థులైన శిక్షకుల నేర్పరచి బిడ్డలను మంచి శిక్షణలో పెంచుటలో తగిన శ్రద్ధ తీసుకొనినయెడల జన సామాన్యమందరూ దృఢమైన ఆత్మవిశ్వాసము, మనో ధైర్యము, క్రమశిక్షణ మొదలగు సుత్తమ గుణములు కలిగి స్వతంత్రదేశముయొక్క స్వాతంత్ర్యమును స్థిర స్థాయిగా నిలుపగల సుత్తమ పౌరులుగా తయారుకాగలరు.

(ఆలిండియా రేడియో వారి సౌజన్యముతో)

చిత్ర సమీక్ష:

## శ్రీ రాజరాజేశ్వరీ ఫిలుమ్స్ వారి

# ★ పేద రైతు ★

నిర్మాత, దర్శకుడు: శ్రీ కడారు నాగభూషణం.
సంగీతం: పద్మనాభశాస్త్రి.
మాటలు, పాటలు: కొప్పరపు సుబ్బారావు.
స్టుడియో: జెమినీ.

నటీనటులు:— అంజలీదేవి, కన్నాంబ, ముత్తులక్ష్మి, కుమారి తులసి, శ్రీరామమూర్తి, లింగమూర్తి, రేలంగి, వెంకట్ మున్నగువారు.

★

కథాసారాంశము:—'దున్నేవానిదే భూమి' అనే సిద్ధాంతం ఈ చిత్రానికి కథావస్తువు. ప్రసాద్ భువనగిరి జమీందారు కుమారుడు. అభ్యుదయ ఆదర్శాలు కలవాడు. తల్లిదండ్రుల ఇష్టప్రకారం మేనమామ కుమార్తె అయిన లీలను వివాహం చేసుకొని ఎస్టేటు మేనేజ్ చేసి ఎస్టేటును ఋణ బాధనుండి విముక్తి చేయడానికి ఒప్పుకోనక, గిరీశం దుండగాలకు బలిఅయిన పేదరైతు యొక్క కుమార్తె సీతను ప్రేమించి చివరకు ఎస్టేటును పరిత్యజించి తను వివాహ మాడుతాడు.

ఎస్టేటు మేనేజరు చాలా దుర్మార్గుడు, వ్యభిచారి. పయోముఖ విషకుంభం వంటివాడు. తీయని మాటలతో దుర్గాదేవికి విశ్వాస పాత్రుడౌతూ రైతులను పీడించుతాడు. ఎస్టేటు ధనాన్ని అపహరించి అప్పులపాలు గావించుతాడు. ఎస్టేటును పరిత్యజించి మద్రాసు వెళ్ళిన ప్రసాద్, 'పేదరైతు' అనే పత్రికమూలంగా గిరీశం దుండగాలను వెల్లడి పరుచుతుంటాడు. అందువలన ప్రసాద్‌ని, సీతను విడదీయాలని పట్టుబట్టి, మద్రాసుకువెళ్ళి, పత్రిక నడుపుటకుగాను కావలసిన ధనమును సంపాదించుటకై సీత చేరిన డ్రామా ట్రూప్ మేనేజర్‌ను కలిసికొని అతనితో కుట్ర పన్ని ప్రసాద్‌ను జైలుపాలు కావించుతాడు. అనాథ, గర్భిణి అయిన సీత అప్పుల బాధను సహించలేక ఇల్లు విడిచి వెళ్ళి పోతూన్న సమయంలో కారు ప్రమాదానికి గురి అవుతుంది. కారు యజమాని, ఆయన కుమార్తె, సీతను తమ యింటికి తీసుకొనివెళ్తారు. అక్కడే సీత ఒక మగ బిడ్డను కంటుంది. కాని కారు యజమాని ప్రసాద్ మేనమామ. సీత ప్రసాద్ భార్యయని తెలిసిన వెంటనే లీల సీతను ఇంటినుంచి పంపించి వేస్తుంది. తరువాత సీత తన వూరు జేరుకొంటుంది.

గిరీశం పెట్టేబాధలు పడలేక రైతులంతా జమీందారిణి దుర్గాదేవిని రెండు కోరికలు కోరుతారు. ఆసంవత్సరం కరువువలన పంటలు పండనందువలన శిస్తు ఇచ్చుకోలేమనీ, గిరీశంగారిని బర్తరఫ్ చేయవలసిందనీ కోరుతారు. కాని దుర్గాదేవి మూర్ఖపు పట్టుదలతో వాటికి ఒప్పుకోనదు. భువనగిరి వెళ్ళిన సీత దుర్గాదేవిని రైతుల కోర్కెలు మన్నించమని ఎంతోదూరం బతిమాలుతుంది. కాని లాభం వుండదు. సీత నాయకత్వం క్రింద బయలుదేరిన కర్షక, కార్మిక సమ్మెమూలంగా దుర్గాదేవి అహంకారం కొంత వఱకు తగ్గుతుంది. జ్ఞానోదయ మవుతుంది. గిరీశం తిన్న యింటి వాసాలు లెక్క పెడుతున్నాడన్న విషయం గ్రహించి అతనిని బర్తరఫ్ చేయ ప్రయత్నిస్తుంది. ఈసంగతి తెలిసిన గిరీశం దుర్గాదేవిని చంప ప్రయత్నించుతాడు. అదే సమయంలో జైలునుండి విడుదలైన ప్రసాద్ అక్కడికి వెస్తాడు. ఇంతలోరైతులుకూడావచ్చి దుర్గాదేవిని రక్షించేరు.

ప్రసాద్ జమీకి అధిపతి కాగానే రైతులకు భూములను పంచిపెట్టి ప్రజలకు ఆదర్శ ప్రాయుడౌతాడు.

చిత్రంలో 'దున్నేవానిదేభూమి' అనే నినాదం విని పిస్తుంది గాని, దాని ననుసరించి కథ సూటిగా నడవలేదు. గిరీశం దుండగాలకు, వ్యభిచారానికి, సేవకుని ప్రేమ కలాపానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం సాధారణ పంథాలోనే వున్నాయి. సంగీతం సుమారుగావుంది. పాటలలో 'శ్రీ రాజరాజేశ్వరి' అనే రాగమాలిక, బహిష్కరణోద్యమ సందర్భంలో పాడిన

# చిత్ర సమీక్ష

ప్రబోధగీతం, బాగావున్నాయి.

చిత్రంలోని దృశ్యాలలో క్షామదృశ్యాలు కళ్లకుకట్టినట్లే వున్నాయి. ఆదృశ్యాలకు ప్రేక్షకుల హృదయాలను కలవరింప జేసే శక్తివుంది. "రాణీసంయుక్త" నాటకంలో స్వయంవర సందర్భమున రాజ పుత్రులందరిముందు సంయుక్త నృత్యం అసభ్యంగా వుంది. ప్రతి సినిమాలోను ఒక జైలు సీను చూపించడం అలవాటయినది. జైలుసీను లేనిదే తమ చిత్రం చెల్లుబడి కాదని కాబోలు దర్శకుల భావన. ప్రసాద్ సెలులోకి తుపాకి ఎలావచ్చిందో ప్రేక్షక లోకానికి తెలియదు. పైగా డ్యాన్సు ట్రూపు మేనేజర్ జైలుకి వెళ్లడానికి కారణమేమిటో! అసలు అతను జైలుకు వెళ్ళినట్టు చూపించడం అనవసరం. గిరీశం తన వుంపుడుకత్తెను వెనకటకు వెళ్ళి వేరొక తగాదాలో దిగడం అసంభవముగా వుంది.

ఈచిత్రంలోని సన్నివేశాలు చాలాపఅకు నాటక పద్ధతులలో నడిచాయి. ఇటువంటి వాటిలో దుర్గాదేవిని హత్య చేసే సన్నివేశం ఒకటి.

కన్నాంబ జమీందారిణి పాత్రను చక్కగా పోషించింది. గాంభీర్యాన్ని, అధికారాన్ని చక్కగా ప్రకటించింది. కైతుకమాత్రగా అంజలి ప్రతిభాపూర్వకంగా నటించింది. ఆమె ముందు శ్రీరామమూర్తి అంతగా రాణించకపోయినా ముందు ముందు నాయక పాత్రను చక్కగా నిర్వహించగల సూచనలు కనిపిస్తున్నాయి. లింగమూర్తి విలన్ పాత్రకు తగియున్నాడు. రేలంగి హాస్యం చెప్పుకో దగ్గదిగా వుంది; నటించిన విధంగా నటించకుండా ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించి తన నటనాచాతుర్యాన్ని వెల్లడి జేశాడు.

చిత్రంలో లోపములు లేకపోలేదు. కాని కాలానుగుణ్యమైన అభ్యుదయ ఆదర్శాలతో కూడుకొన్న చిత్రం అవడంవల్ల ప్రేక్షకులను ఆకర్షించగలదు.

*　　*　　*

సొసైటీ పిక్చర్సువారి 'The World' అన్న చిత్రం, 'ఉలఘుం' అని తమిళంలోను, 'ప్రపంచం' అని తెలుగులోనూ తయారగవుతూ వున్నాయి. రెండూకూడా త్వరలోనే విడుదల కాగలవని వినికిడి.

మామిడిపూడి పార్వతి.



గ్రంథ సమీక్ష.

## బ్రహ్మానంద బోధనలు

చక్కటిబైండు- 344పుటలు వెల రు. 3-8-0 • శ్రీ చిరంత నానందస్వామి • కంటికి శ్రమలేని అచ్చు.

ఈ పుస్తకము రెండు భాగములుగా విభజింపబడినది. మొదటి భాగమందు శ్రీ బ్రహ్మానందస్వామి జీవిత చరిత్రయు, రెండవభాగమందు ఆతని సందేశములు చర్చించబడినవి.

శ్రీ బ్రహ్మానందస్వామి బాల్యనామము రాఖాల్ చంద్ర ఘోష్. ఈయనను తన పూర్వజన్మలలో ఒక దానియందు శ్రీకృష్ణునితోడి గోపబాలురిలో ఒకనిగా శ్రీ రామకృష్ణ పరమహంస ఒక దివ్యదర్శనములో గాంచెను. శ్రీ బ్రహ్మానందస్వామి చిన్ననాటినుండియు లౌకిక విషయములందు అశ్రద్ధ కలిగి భగవత్ సంబంధమైన విషయములందు తన కాలము గడుపుచుండిరి. కొంతకాలము ఈయన బ్రహ్మసమాజములో సభ్యులుగానుండి తరువాత శ్రీరామకృష్ణ పరమహంస సాన్నిధ్యమును చేరి. ఆతని శుశ్రూషయందు తమ జీవనము గడిపిరి. శ్రీరామకృష్ణ పరమహంస పరమపదించిన తరువాత బ్రహ్మానందస్వామి తోడి శిష్యులైన స్వామి వివేకానందులతో పాటు శ్రీరామకృష్ణుల యొక్క ఆదర్శములను, ఉపదేశములను ప్రపంచమంతట వ్యాపింపజేసిరి.

శ్రీ బ్రహ్మానందస్వామి బోధనల సారాంశములివి :- "దేవుడు కలడనియు, పరమ సత్య స్వరూపుండనియు దృఢ నమ్మిక గలిగియుండవలయును. ఆతనిని సాక్షాత్కరించుకొనుటయే మానవ జీవితముయొక్క పరమావధి. జప ధ్యానాది సాధనలచే ఆయనను పొందవచ్చును."

ఆధ్యాత్మిక జీవనమవలంబించు సాధకులకు ఎన్నియో ఉపయోగకరములగు విషయములీ పుస్తకమందు గలవు. ఈ పుస్తకపు భాష భావముతోనిండి, చదువరులకు శీఘ్రముగ అర్థమయినట్లు వ్రాయబడినది. భగవంతునియందు నమ్మిక, అనురక్తి గలవారు ఈ పుస్తమును తప్పక చదువుదురని మా అభిప్రాయము.

పార్థసారథి.

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో

భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2-0-0

సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 .... సీనియర్ తరగతికి రూ. 9-0-0

నృత్యోపాధ్యాయిని:

శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2-0-0

సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని:

శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras 4




సంపుటి 9 :: ఫిబ్రవరి '53 :: సంచిక 10

# ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

ఈనాడు, ఆంధ్రులన్నవారికి గర్వకారణమైన నిర్మాణము ఆంధ్రప్రాంతములో ఏదైనా ఉన్నదీ అంటే అది ఆంధ్ర విశ్వకళాపరిషత్తేనని ఒప్పుకుని తీరాలి. పది పన్నెండు కళాశాలలతో ప్రారంభమైన యీ పరిషత్తుక్రింద, ఇరువై అయిదు సంవత్సరముల అత్యల్పకాలంలో, తను స్వయముగా నిర్వహిస్తున్న కళాశాలలుగాక, 37 అనుబంధ కళాశాలలు సాగుతున్నవీ అంటే, ఆంధ్రులలోగల కార్యదక్షత, నిర్మాణశక్తి, విశదమగుచున్నవి. అయితే, ప్రపంచ ప్రఖ్యాతిగడించిన ప్రచండమేధాసంపన్నులు, తత్వవేత్తలు నైన ప్రత్యేక ఆంధ్ర విద్వత్ప్రముఖుల సారథ్యము, సహకారములవల్లనే యీ నిర్మాణము యింత శీఘ్రపురోగతిని బడయగలిగిందనుట నిర్వివాదాంశము.

ఆంధ్రరాష్ట్రో ఉద్యమముతోపాటుగానే, ఇంచుమించు యీ ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఉద్యమముకూడా ప్రారంభమైనదని చెప్పాలి. రమారమి 40 ఏండ్ల క్రితము, ఆంధ్ర మహాసభవారు, తెలుగు జిల్లాలలోని తెలుగువారి విద్యావిజ్ఞానాభివృద్ధికై తెలుగు ప్రాంతంలో ఒక విశ్వవిద్యాలయాన్ని నిర్మించవలెనని ప్రభుత్వానికి చేసిన అభ్యర్థన, 1926 సం॥న వెలసిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తుగా రూపొందినది. ఆనాటినుండి, పరిషత్తు ఉపాధ్యక్షులుగా సారథ్యము వహించిన కీ॥ శే॥ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ధైర్యస్థైర్యాలవల్ల, చాకచక్యంవల్ల, యీ పరిషత్తు, బాలారిష్టాలను కొంతవరకు తట్టుకొని, బయటపడ్డది. అటుపైన 1936 వరకు ఉపాధ్యక్ష పీఠాన్ని అలంకరించిన డాక్టరు రాధాకృష్ణన్‌గారు,విశ్వకళాపరిషత్తు కేవలం ఒక గురుకులంగా అభివృద్ధిజెందాలన్న పరమాశయముతో, ఆర్ట్సుకళాశాల, విక్రమదేవవర్మ సైన్సు కళాశాల, వసతిగృహములు, మున్నగునవి నిర్మించుటయేగాక, ప్రపంచ విఖ్యాతి గడించిన శాస్త్ర నిష్ణాతులను, ఆచార్యబృందాన్ని యీ విద్యాపీఠానికి ఆకర్షించి, అన్నిశాఖలలో పోస్టు గ్రాడ్యుయేటు తరగతులను ప్రారంభించిరి. 1936 నుండి 1949 వరకు తిరిగి ఉపాధ్యక్షులుగా వ్యవహరించిన శ్రీ రామలింగారెడ్డిగారు సాగించిన కృషి బహు ముఖ్యమైనది. అనేక జిల్లాలలో కళాశాలలు నిర్మిచడం, కేంద్రములో అనేక శాస్త్రములలో పరిశోధన శాఖలు నిర్మించడం యిందు ముఖ్యముగా పేర్కొనదగినవి. విదేశీయ ప్రఖ్యాత విశ్వకళాశాలలతో తులతూగగల పరిషత్తును నిర్మించడం వీరి కృషి లక్ష్యం. యుద్ధం, తత్కారణంగా గలిగిన ఆర్థికమాంద్యం, గ్రాంటులలోపం, విరాళముల అభావము, కళాశాలల స్థలాలు మార్పులు, ఇన్నికారణాలు అడుగడుగుకూ పురోగతిని అడ్డగించినా, చలించని పట్టుదలతో జరిపించిన నిర్మాణము ఆయన లక్ష్యశుద్ధిని, పట్టుదలను శ్లాఘింపజేస్తున్నాయి. వర్తమాన ఉపాధ్యక్షులు డాక్టరు కృష్ణగారు ఆగురుకులములో పుట్టిన వటవృక్షం. విశ్వవిద్యాలయపు ఉపన్యాసకులుగా, ఆచార్యులుగా, కార్యనిర్వాహకులుగా, అనేక హోదాలలో, 20 సం॥గా అందలి కార్యకలాపాలలో అతి సన్నిహితంగా పాల్గొన్న వ్యక్తి. ఈ పాతికేళ్ళలో ఈ విశ్వవిద్యా లయాన్ని సోదర పరిషత్తులతో సమానస్థానానికి తెచ్చిన

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

ఈ మూర్తిత్రయానికి, వీరికృషిలో అత్యంతము తోడ్పడ్డ జయపూరు మహారాజా విక్రమ దేవవర్మగారికీ, ఇతర ఆంధ్ర జమీందారులకు, విరాళములిచ్చి ప్రోత్సాహించిన యితర ధనికవర్గాలకు, ఆంధ్రప్రజ ఋణపడియున్నారనుట వాస్తవము. రజతోత్సవ సందర్భములో వీరందఱకూ వారు హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములర్పించడం సహజం.

అయితే, ఇంతవరకూ జరిగిన నిర్మాణమెంతదైననూ, యికమీద జరుగవలసిన నిర్మాణము ఇంకా అంతకు మించినదని చెప్పాలి. వైద్య, ఇంజనీరింగు శాఖలలో జరుగవలసిన అభివృద్ధి చాలా ఉన్నదని, ప్రాచ్యభాషలకూ, అందు ముఖ్యంగా సంస్కృతిభాష అభివృద్ధికీ, యీ విశ్వవిద్యాలయములో ప్రధానస్థానాన్ని యీయవలెనని, బోధనభాష తెలుగుభాషగామార్చి, దీనిని అచ్చమైన ఆంధ్రజాతీయ కళాశాలగా మార్చవలెననీ, విజ్ఞులందఱూ తమ తమ అభిప్రాయాలను, రజతోత్సవసందర్భములోనూ, స్నాతకోత్సవసందర్భములోనూ సూచించారు. ఈ సూచనలన్నీ నిర్మాణాత్మకమైనవనీ, సమర్థించవలసినవనీ, సిద్ధించవలసినవనీ వేరుగా చెప్పనక్కఱలేదు.

అయితే, ఒక విషయము మాత్రము అందఱూ విస్మరించారని చెప్పాలి. వర్తమాన సాంఘిక, రాజకీయ వ్యవస్థలలో, స్త్రీలుకూడ పురుషులతోపాటు ఉన్నతవిద్య నభ్యసించవలసిన అవసరము ఏర్పడుతూఉంది. అందుకు తగిన శాఖలు యీ విశ్వాకళాపరిషత్తులో పూర్తిగా లోపించడం ఆంధ్ర స్త్రీలోకమంతా ఒక దురదృష్టంగా భావిస్తూవున్నారు. మిషనరీల ధర్మమా అంటూ ప్రారంభించిన ట్రయినింగ్ కాలేజీ, వారి చేతిలోనుండి అందుకుని ప్రభుత్వము అధికారం చెలాయిస్తూవున్న లేడీహోప్ కాలేజీ తక్క, ఆంధ్రయూనివర్సిటీకి అనుబంధించి స్త్రీలకు ప్రత్యేక కళాశాలలే లేవు సరిగదా, యీ లేడీహోప్ కాలేజీలోకూడ స్త్రీలకు ప్రత్యేకంగా ఉపయోగించే లలితకళలు, గృహశాస్త్రము ఇత్యాది విద్యలు నేర్పకుండా, తిరిగి గణితశాస్త్రపు బి. ఏ. తరగతులను ప్రారంభించడం చాలా హాస్యాస్పదంగా ఉన్నది. పోస్టు గ్రాడ్యుయేటు తరగతులలోనూ, సాంకేతికవిద్యలలోనూ తర్ఫీదు కోరిన మహిళలకు ప్రత్యేక కళాశాలలు అక్కఱలేదు గాని, మహిళాసామాన్యానికి తగిన కళలు, గృహశాస్త్రము, నర్సింగ్ యిత్యాది విద్యలను నేర్పుటకు స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు ఉండవలెననుటలో సబబు లేకపోలేదు. అందులోనూ పరిషత్కేంద్రములో స్త్రీలకని ఒక ప్రత్యేక కళాశాలయైనా లేకపోవడం అతిశోచనీయమైన విషయం. నిర్వాహకులు ఈవిషయాన్ని సమదృష్టితో పరిశీలించి ఈ లోపాన్ని శీఘ్రకాలంలోనే సవరిస్తారని ఆశిస్తున్నాము.

మరియొకమాట— ఆంధ్రరాష్ట్రం అతిత్వరలోనే అవతరించే సూచనలు ఎప్పటికన్నా ఇప్పుడు ఎక్కువ సూటిగా కనపడుతూ ఉన్నాయి. తల, తోక లేని ఒక మొండెముగా, పరిశ్రమలలో, ప్రాజెక్టులలో సర్వవిధములా వెనుకబడ్డ ప్రాంతములతో, మురుగుకాలువలు; మట్టిరోడ్డులు, మలేరియాదోమల ప్రాబల్యముతో రూపముదాల్చనున్న యీ నవ్యాంధ్రరాష్ట్రానికి, అభ్యున్నతిని గూర్చగలిగినది యీ విశ్వకళాపరిషత్తొకటేనని ఆశించడంలో పొరపాటు ఉండదు. నూటికి 95 పాళ్లు సముద్రగతమగుచున్న జీవనదీ జలాలను, భూగర్భములో దాగియున్న లోహసంపదను, ప్రజాశ్రేయస్సున కుపయోగించగల సాంకేతిక నిపుణులు, పారిశ్రామికులు, బుద్ధిమంతులు యీ విద్యాపీఠంనుండియే వెలువడాలి. సంస్కారమూ, సాహసమూ, ఆలోచనాస్వాతంత్ర్యమూ కలిగి, జాతియొక్క గొప్పతనాన్ని, సంస్కృతినీ, ఔత్కృష్ట్యాన్నీ సంరక్షించగల ధీమంతులు, దీక్షాపరులూ, ఈ పీఠాన్నుండే ఆవిర్భవించాలి. ఆంధ్రజాతియొక్క ఉజ్జ్వల భవిష్యత్తు నిర్మించే అపురూప యువక సంపదను పోతపోయవలసిన గురుతర కర్తవ్యభారం యీ విశ్వకళాపరిషత్తుపైనున్నది. చీలిపోయిన రాయలసీమ సోదరులను కూడగట్టుకుని, అవతరించనున్న నవ్యాంధ్రరాష్ట్రములో, తనకర్తవ్యాన్ని మహోధ్వజాయమానంగా యీ పరిషత్తు నిర్వహించగలదని ఆశిస్తూ, మాశుభాకాంక్షలు నందిస్తున్నాము.





# పిల్లల పండుగ

నా టి క

శ్రీ కర్రా ప్రభాకర్

## 1 వ రంగం

సుభద్రమ్మ :- ఏం పిన్నీ! అలా గుమ్మంలోంచే వెళ్లిపోతున్నావ్?

రామమ్మ :- అబ్బే! సంజపడింది; ఇంట్లో పిల్లాణ్ణి ఒక్కణ్ణే వదిలొచ్చాను.

సు :- ఆ, పోనిస్తూ! కాస్త పిల్లలు ఏడుస్తూనూ వుంటారు. ఎక్కణ్ణుంచి వస్తూంట?

రా :- వాళ్ల లక్షిందేవమ్మగారింటికెళ్లా; వాళ్లబ్బాయిని ఓసారి చూద్దామనీ.

సు :- ఏం, వాళ్లబ్బాయి కులాసాగా ఉన్నాడా?

రా :- ఆ, అబ్బాయికేం? పనసపండులాగున్నాడు!

సు :- పోనీలే; బ్రతికి బాగుంటే అదే పదివేలు.

రా :- క్రింతం పుట్టినరోజునాటికి చీమిరపకాయంత వున్నాడు. ఆవేళ ముత్తైదులందరికీ పనసపళ్లు వాయినా లిచ్చింది.

సు :- అందుకనే మరి ఈ పుట్టినరోజునాటికి పనసపండులా తయారయాడు.

రా :- పనసపళ్లకేంగాని, వాడి పుట్టినరోజు దగ్గరికొస్తూంటే జ్ఞాపకం వస్తూంది....

సు :- క్రితం ఏడాడి సంగతేనా? ఎంత సంబరంగా జరిపారో కదూ!

రా :- మరే! తన వీధివారినందర్నీ ఆవేళ భోజనానికి పిలిపించింది. అనేకరకాల పిండివంటలు చేయించింది. మరి....

సు :- ఆఁ! పిండివంటల మాటెత్తితే జ్ఞాపకం వచ్చింది. నలుగురికి భోజనం పెట్టడం అంటే అల్లాపుండాలి. భోజనం పెట్టడంకూడా చేతన వాలంటానూ!

రా :- ఏమిటమ్మా, అంత విశేషం కనిపెట్టావు, ఆవిడ పెట్టిన భోజనంలో!

సు :- చూడు పిన్నీ! మన ఇళ్లలో ఎప్పుడైనా పెళ్లిళ్ల సంతర్పణలు జరిగినప్పుడు—ఆవేళ నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్లు, పప్పు, దప్పళం, ఆ పైన అరడజను పిండివంటలూనూ! పిండివంటలు రోజూ వుండవుకాబట్టి ఆపూట కాస్త వాటిని ఓ రెండు దరువులు ఎక్కువ పట్టిద్దామనిపిస్తుందికదా ప్రతివారికీను! ఈ పప్పు-దప్పళాలతోటే కడుపు నిండిపోయింతర్వాత 'వద్దు, వద్దు' అనిపిస్తూ పిండివంటలు విస్తట్లో దొర్లిస్తేనూత్రం ఏంలాభం చెప్పు!

రా :- ముత్యాలు ఒలకపోసేవే సుభద్రా! సన్నిపాతే లక్షిందేవమ్మగారింట చేసినట్లు—ఒక కూర, పచ్చడి, పులుసు అంతే. అవైనా కొంచం కొంచం గా వడ్డించడం. ఆ తరవాత పట్టించు పిండి వంటలు—పొట్టనిండేట్లా! ఏడాది పొడుగునా జ్ఞాపకంవచ్చేట్లా!

సు :- ఆ పిండివంటలయినా మామూలు లడ్డులూ, బెల్లం జిలేబీలూ, పూరీలూనా ! అంచక్కా 'దూధ్ పేడా' ట ! 'చీనీ బర్ఫీ' ట.

రా :- అదేమిటమ్మా—మసాలా, బంగాళా దుంపలూ కూరిన 'సోమాసా' లు ట—కొత్త కొత్తవీ, వింత వింతవీనూ !

సు :- ఒక్క పిండివంటల్లోనేనా ! వచ్చిన పేరంటాళ్లం దరికీ రవికల గుడ్డలూ, కొబ్బరి బొండాలూ ఇచ్చింది కనకనా !....

రా :- ఆ ! అదిగో నాపెట్లో పడేడుస్తున్నాయి, పొరుగిళ్ల వాయినాల్లో వచ్చిన రవికల గుడ్డలు—రవిక్కీ సరిపోవు, బాడీకీ పనికిరావు.

సు :- చక్కా ! అద్దం, కుంకం డబ్బీ అమర్చిన మఖమలు పెట్టెలు, నిత్యం వాడుకునే, దారం, లేసు, కుట్టుపని ముట్లు అమర్చిన సెట్లు....

రా :- ఏవేమిటో ఎన్నో ముచ్చటైనవీ, ముద్దయినవీను-

సు :- అన్నిటినీమించి ఆవేళ నాకు నచ్చినది చెప్పనా పిన్నీ ! ఆ పేరంటాళ్లు—వాయినాలు తంతు అంతా ఎంతో సరదాగా, సాఫీగా జరగడం. ఓ పిల్లల ఏడుపులు, చెలగాటాలూగానీ, కేకలూ కేరింతాలూగాని, సామాన్లూ చీరలూ పాడిచెయ్యడాలుగాని ఏమీ జరగలేదు. నాకు గొడవచేసే పిల్లలంటే మహా చీకాకుసుమా ! ఆవిడకూడా నాలాంటిదే అనుకుంటాను.ఆవేళ "పిల్లల్ని మాత్రం చస్తేదగ్గిరికి చేరనిచ్చిందికాదు !"

రా :- ఏమోనమ్మా ! మీ ఇద్దరూ అదృష్టవంతులు ! వెళ్లొస్తా.

## 2 వ రంగం

గోపాలం :- (అధికారంగా) ఏం, సుబ్బా ! ఇంకా ముసుగుతన్నే ముక్కుతున్నావ్? చూడు ఎంత పొద్దెక్కిందో ?

సుభద్ర :- (లేచి, చీదరించుకుంటూ) ఏమండోయ్ ! ఏ కొంపలోనైనా అందరికంటె ముందు లేచేది ఆయింటి ఆడది ! పొద్దు పొడవకముందే లేవా లనే బాధ్యతలు ఎరిగయినా వుంటే, అది ఆయింటి ఆడదానికే ! ఆమాత్రం నాకు పొద్దున్నే లేపి చెప్పాలేం ? సాధింపు మొదలుకిగాని....

గో : (లొంగుబాటుగా) అది నిజమేనోయి ! కాని ఇంత సర్వ సామాన్యమైన జ్ఞానం ఇవాళ ఎందుకు ముసుగులో మణిగిపోయిందీ అనుకుంటున్నాను !

సు : అల్లా అనుకుంటూంటే నాకేం భరవాలేదు. అనడం ఎందు కంటాను !

గో : (వెటకారంగా) మహాబాగా అన్నావు ! కాఫీకి వేళయిందనుకుంటున్నాను !

సు : (ఈసడింపుగా) ఆఫీసుక్కూడా వేళయిందను కోండి !

గో : (అనునయంగా) ఇదిగో, సుభద్రాదేవీ !....

సు : (నెమ్మదిగా) ఆం ! అల్లా మొదట్లోనే పిలిస్తే ఇంత రభస ఉండేదికాదుగా ! 'సుబ్బా, దిబ్బా' అనకపోతేనూ ?

గో : (ధీమాగా) ఓ, అదా ! ఏం ఇవాళ, దేవీ అవతారం తాల్చబోతున్నావా ?

సు : (మామూలు ధోరణిలో) నిన్న సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చేప్పుడు చూశ్శేదూ, వాళ్ల లక్షిందేవిగారింట ?

గో : ఆం, అవును. ఏదో హడావిడి జరుగుతూంది. ఎవరో చాలామంది పిల్లలు మహా పెత్తనాలు చేస్తున్నారేమిటో ! వాళ్లబ్బాయికి ఒడుగా ?

సు : అహాం, వాళ్ల చిట్టి పుట్టినరోజు పండగ ఇవాళ. జ్ఞాపకం ఉందా క్రితం ఏడాది....

గో : పరే మరే ! మొన్న మొన్న అయినట్టుంది సుమా !

సు : ఏదైనా కొత్తగా వింతగా జరుగుతే ఎప్పుడూ కళ్లముందరే వుంటుంది !

గో : అవునే! వచ్చేనెల మన అబ్బాయి పుట్టినరోజు పండుగకూడా కొత్తగా వింతగాచేద్దాం, ఏమంటావ్ ?

సు : మీరు వేళాకోళం క్రింద కట్టకుండావుంటే-మనబ్బాయి పుట్టినరోజు పండుక్కి ఒక కొత్త ప్లాను తయారు చేశానండీ! (కాఫీ అందిస్తూ) ఊఁ! తీసుకోండి.

గో : (ఉల్లాసంగా) అదిగదీ! అల్లా తాజాతాజా ప్లానులు గరంగరం కాఫీతో అందించావంటే చిటకాలమీద చీటీలమీద అమలు జరిపిస్తాం మరి!
(కాఫీ నాలుగు గుటకలు వేసి)
ఏదీ చూద్దాం అయితే, విప్పు నీ ప్లాను.

సు : ఆ రోజు అందరికంటె ముందుగా మన పాపాయి అయిదు గంటలకే లేస్తాట!

గో : ఆ వెధవ తొమ్మిది గంటలకిగాని లేవడు!

సు : మాటలు తిన్నగావదలండి! శుభమా అని వాడి పుట్టినరోజు పండుగ సంగతి మాట్లాడుతుంటే 'వెధవ, వెధవ' అంటారేమిటీ ?

గో : (లెంపలు వాయించుకుంటూ) తప్పు, తప్పు. "అమంగళమప్రతిహతమ"గు గాక! అందరికంటె ముందు వాడెట్లా లేస్తాడంటాను ?

సు : అల్లా అడక్కూడదూ ? అయిదు గంటలకి అల్లారం త్రిప్పి గడియారం వాడిదగ్గర పెడతాను.

గో : ఫెడేలున తన్నుతాడు!

సు : అల్లా తప్పుడుమాటలే వస్తాయేమండీ, శుభం తలుచుకుంటూంటేనూ ?

గో : (మళ్లీ లెంపలు వాయించుకుంటూ) "శుభమస్తు, శుభమస్తు"! వాడిదగ్గరి పెడితే నిద్రలో తన్నుతాడేమో ఆలోచించావూ అంటాను.

సు : అయ్యో! అమాత్రం బుర్ర లేకుండానే ఇన్నాళ్లూ కాపురం చేశానంటారా మీతో ?

గో : ఏమో! నేనుమాత్రం ఆ సంగతి తెలుసుకోకుండానే ఇన్నాళ్లూ కాపురం చేశానుస్మా నీతో!

సు : (కోపంగా) తీసికెళ్లి వాడి పీక్కి దిగేస్తాననుకున్నారా, గడియారాన్ని ?

గో : మరేమనుకొన్నావ్ ?

సు : వాడికి దూరంగానే పెడతాను.

గో : ఆ వెధవ గడియారం ఒక్కొక్కప్పుడు అల్లారం కొట్టదు!

సు : కొట్టకపోతే ప్రక్కింటివాళ్ల గడియారం తెచ్చి పెడతాను.

గో : ఏడిసినట్టేవుంది మొదటే ఎరువుసొమ్మా ?

సు : (కోపంగా లేవబోతూ) ఈ ఏడాదికి వాడి పుట్టిన రోజు పండుగ చెయ్యనండీ ?

గో : ఫోస్! నీ ప్లానుకంటె దివ్యంగా జరిపిస్తాను! నువ్వు కాదంటే ఆగుతుందా ?

సు : (లొంగుబాటుగా) మరేమిటండీ; మాటిమాటికీ అడ్డు ప్రశ్నలు వేస్తూ ఖండిస్తూనూ ?

గో : బాగుంది 'కష్టాకష్టం, వీలావీలు' చూడద్దంటావా ? నీ ప్లానేమిటో విప్పవుగా!

సు : ఇంకేం చెప్పాలేం! పాపాయిని ప్రొద్దున్నే అయిదు గంటలకి లేపడం....

గో : అంటే కోపంగాని సుభద్రా! వాడి పుట్టినరోజు పండుగేమిటీ; వాణ్ణి అయిదు గంటలకులేపి ఏడిపించడం ఏమిటి చెప్పు!

సు : (తీవ్రంగా) ఏమండీ! అంతా వేళాకోళమేనా ? మీరేమైనా నిజంగా శ్రద్ధతో వింటారా ?

గో : (అదేతీవ్రతతో) సుభద్రా! నువ్వు చేస్తానన్నదానికి ఏనాడైనా తిరుగుచెప్పానా చెప్పు!

సు : (నిక్కచ్చిగా) మరయితే వినండి. ఆవేళ చీకటితోటే అబ్బాయిని లేపడం....

గో : నీ యిష్టం!

సు : లేచీలేవడంతోటే తలంటిపొయ్యడం....

గో : కానీ, ఒకటి....

సు : కానీ లేదు, ఒకటీ లేదు!

గో : కాస్త వింటే ఏంపోయిందీ! "వినదగు నెవ్వరు చెప్పిన" అన్నాడు సుమతీశతకకారుడు!

సు : ఆ వాడిమూలంగానే దేశంఅంతా 'నీతి' పారిపోయి 'నాచు' పట్టిపోయింది. ఇంతకీ ఏమిటీ మీ ఆ 'ఒకటీ' ?

గో : నా వుద్దేశంలో పిల్లాడి పుట్టినరోజు పండుగ అంటే—ఆ రోజల్లా వాణ్ణి పిసరంత ఏడిపించకుండా, ఎంత సేపూ నవ్విస్తూ, కిలకిల్లాడిస్తూ వుంచాలం టాను !

సు : నేనుమాత్రం మరోలా అంటానేం !

గో : మరేమిటీ ! తెల్లారకట్ల లేపుతూనే ఏడిపించడం మొదలా ! వెంటనే వాడికి తలనీళ్లంటూ వాడి జుట్టు పీకి, వాడి కళ్లల్లో కుంకుడుకాయ పులుసుపోసి, ఆ రోజల్లా వాణ్ణి ఏడిపించడమా ! ఇదేనా వాడికి పండగ. గొప్ప ప్లాను వేశావు. నడు ! నడు ! !

## 3-వ రంగం

(తలుపుకొట్టిన శబ్దం)

సీతమ్మ : సుభద్రమ్మా !

(తలుపు ఘడియ తీసిన శబ్దం)

సు : సీతమ్మ పిన్ని, దా లోపలికి.

సీ : మీ చంటిపిల్లాడేడీ ?

సు : ఇప్పుడే అమ్మాయి అలా ఎత్తుకు వెళ్లింది. ఏమిటీ కుంకంబరిణ తీస్తున్నావ్.

సీ : ఇవాళ అమ్మాయి నందికేశ్వరుడి నోము నోచుకుంది. పిల్లల్ని తీసుకుని భోజనానికి రా.

సు : అల్లానే.

సీ : వస్తా : ఆ వీధికెళ్లి పిలవాలీ !

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

సు : ఏం ఏమైన మరచిపోయావా పిన్నీ !

సీ : అబ్బే. ఓ సంగతి చెప్పడం మరిచా. మాతోటి కోడలు పెందరాడే భోజనంచేసి రైలుకెడతా నంటోంది.

సు : అరే ! ఇంకా ఎప్పుడోవచ్చి చూద్దామనుకుంటు న్నానే !

సీ : అందుకనే నువ్వు వస్తే, ఇవాళికి ఆపుచేయిద్దామను కుంటున్నాను.

సు : ఊఁ.... (సంశయిస్తూంటుంది)

సీ : ఏం. అనుమానంలో పడ్డావు మళ్లీ :

సు : పిన్నీ : నీ తోటికోడలు అనవసరంగా నాకోసం ప్రయాణం మానుకుంటుందేమో అని ఉన్న విషయం చెప్తున్నానూ : మరేమీ అనుకోకేం !

సీ : దానికేముందే !

సు : ఆ వీధిచివర, లక్షిందేవమ్మగార్ని ఎరుగుదువు కాదూ !

సీ : ఏదో విన్నాలే. ఏమిటీ విశేషం ?

సు : వాళ్లబ్బాయి పుట్టినరోజు పండుగివేళ. ఎంతో గొప్పగా జరుపుకుంటున్నారు. ఆవిడ కొంచెం చే తోడుకి రమ్మంటే, గభీలున మాట ఇచ్చా. తీరా వెళ్లకపోతే....

సీ : కాదుమరీ ! మనలోమనం ఎల్లాగయినా సర్దుకోవచ్చు! నీకు తీరుపడి అయినప్పుడే, సాయంత్రమైనా సరే, కాస్త వచ్చి ప్రసాదమైనా తీసుకువెళ్లు.

సు : తప్పకుండానూ !

(సీతమ్మ వెళ్లిపోతుంది)

సు : ఒసేయి,.... అమ్మాయి.... కమలా !

కమల : ఏం, అమ్మా ! (దూరాన్నుంచి)

సు : కాస్త ఇలా వద్దూ, చీర మడతపెడదాం.

క : (వచ్చి) అమ్మా ! ఎందుకే బనారసుచీర తీసావు ఇవాళ ?

సు : వాళ్ల లక్షిందేవమ్మగారింటికి భోజనానికీ, పేరం టానికి వెళ్లొద్దూ ! వాళ్ల చిట్టి పుట్టినరోజు పండుగా !

క : మరి నన్ను పిలవలేదేమే ?

సు : నన్నుమాత్రం పిలిచారేమిటీ ఇంకా : వస్తారు బహూశః.... ఇంకో అరగంటలో.... ఊఁ అల్లా అడ్డం మడతెయ్యి.... ఇప్పుడు నిలువునా.... ఇది తీసుకెళ్లి పరుపుమీద పెట్టిరా.... ఏమిటి చెప్మా : అప్పుడేపద వస్తూంది, ఇంకా పిలుపు రాలేదూ ?

క : పిలిచేవాళ్లు ఇంత ప్రొద్దెక్కేదాకా వుంటారా అమ్మా?

సు : అంత దూరాన్నుంచి సీతమ్మ పిన్ని పిలిచి వెళ్లి పోయిందే అప్పుడే !

క : మన్ని పిలవరేమోనే !

# పిల్లల పండుగ

సు : ఏం వీధంతా పిలిచి, మన్ని పిలవకపోవడమేం ?

క : అసలు ఎవర్ని పిలవటం లేదేమో !

సు : ఏం. అంత హడావిడీ చేస్తున్నారు ; వంటవాళ్లని కూడా పెట్టారు....

క : మరే ! పిండివంటల ఘుమ, ఘుమ ఇక్కడిదాకా కొడుతూందికూడాను !

సు : ఏదో హడావిడిలో వున్నట్టున్నారులే....అయినా భోజనాలకి పిలవదలచుకున్నప్పుడు ఉదయాన్నే చెప్పుకోరూ....అనవసరంగా వంటలూ అవీ చేసుకోకుండానూ....

క : లేకపోతే అమ్మా ! ఇందాకా మనం గుళ్లోకి వెళ్లినప్పుడూ వచ్చి వెళ్లిపోయారేమో !

సు : (కసరుతూ) లేదే తర్కం చెయ్యకు. పోయి పిల్లలతో ఆడుకో. వాళ్లు పిలిస్తే, కేకేస్తానూ.

(కమల, 8 ఏళ్ల అమ్మాయి, దిగాలు మొహంతో వెళ్లిపోతుంది)

బాగానేవుంది. పిలిచేవాళ్లు కాస్త ముందు పిలుచుకుంటే....ఈ చికాకు ఉండేది కాదుగా....పండుగ చెయ్యడం తోటే సంబరం అయిందా ! ఏదైనా చెయ్యడం చేత నవాలి !

(దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చుంటుంది)

దాసీది : (వచ్చి) సుబ్బమ్మగారూ,....సుబ్బమ్మగారూ....

సు : ఎందుకే లచ్చీ, అల్లా అరుస్తావు ?

లచ్చి : అదేందమ్మా ! కోపంసేత్తన్నావ్ ?

సు : కోపంలేదూ, నీ మొహంలేదూ, ఏం కావాలేం ?

ల : కాస్త మజ్జిగ సుక్కంటే పొయ్యమ్మా !

సు : ఆఁ, కూచుంది, మజ్జిగా, పెరుగూను !

ల : కోపం ఎందుకొచ్చిందమ్మా ? ప్రొద్దున్నే ఆవిడెవరో అమ్మగారొచ్చింది ; ఆవిడేమైనా తగువేసిందేం ?

సు : (ఆత్రంగా) ఎవరెవరేవస్తా ?

ల : ఆవిడెవరోనమ్మా ! బాపనావిడ, కొత్తచీర కట్టుకుంది....

సు : (తృప్తిగా) ఆఁ ! ఆఁ ! వచ్చిందీ ! ఇల్లా దగ్గరికి రా. కొత్తచీర కట్టుకుందికాదూ !

ల : మరేనమ్మా ! సేతిలో కుంకంబరిణకూడా వుంది.

సు : (నవ్వుతూ) ఆఁ ! అవిడే ! గిన్నెపట్టు. (దాని గిన్నెలో మజ్జిగ పోస్తూ) మేం లేమని ఏమైనా చెప్పమందా ?

ల : మీరు లేకపోడం ఏందమ్మా ?

సు : (విసుగ్గా) లక్ష్మిందేవమ్మగారొచ్చినప్పుడు నేనెక్కడున్నానే ?

ల : అదేందమ్మా అల్లా అవుతున్నావ్, ఇయ్యాల ! లచ్చిందేవమ్మగార్ని నే నెరగనంటమ్మా !

సు : (చికాకుగా) మరెవరేవస్తా ?

ల : పొద్దున్న నీతో కబుర్లు సెప్పింది గందమ్మా !

సు : నీ మొహంమండిరిగదలే ! ఆవిడ మా సీతమ్మ పిన్ని ! చాల్లే ఇక దయచెయ్యి ! మజ్జిగ పోసేనేమిటీ ?

ల : చాల్చాలమ్మా ! పోసేరుగా !

సు : (ఉరుముతూ) ఊఁ ! సరే, అయితే ఇక సాగు. (లచ్చి బిక్కమొహం వేసుకుని వెళ్లిపోతుంది.)
ఇదేం పండుగ బాబూ ! అదిగో గడియారం ఎక్కడో పదకొండు కొడుతూంది కూడాను. తీరా వంట మానేసి కూచున్నా ! ఆయనొచ్చి ఆఖరికి నాకు పండుగ చేసేట్లున్నారు !

(దూరాన్నుంచి కమల 'అమ్మా !' 'అమ్మా !' అని ఆనందంతో కేకలు వేసుకుంటూ పరుగెత్తుకు వస్తుంది.)

సు : ఏమిటే కమలా, ఈ సిల్కు పరికిణీ, గౌనూ ఎవరివీ ?

క : (ఊరిస్తూ) చెప్పుకో ?

సు : ఈ జడగంటలూ, గాజులూ, ఆ పొట్లాలూ—మిఠాయిలాగుంది—ఎవరిచ్చారేమిటే ?

క : (ఊరిస్తూ) అమ్మోయి ! ఇవన్నీ నే ఆ లక్షిందేవమ్మ గారింట్లో ఇచ్చారే !

సు : ఎంచక్కా వున్నాయే ! వస్తున్నారా పిలవడానికీ ?

క : ఉఁ, హూఁ ! నిన్ను పిలవరట !

(తరువాయి 16-వ పేజీలో)



# రాజకీయాలు

శ్రీ గోళ్లమూడి రామచంద్రరావు

డిసెంబర్ చివరి వారం మొదలుకుని జనవరి నాలుగో వారంవరకూ జాతీయ, అంతర్జాతీయ రంగాలలో ఈ కింద చెప్పబడ్డ సంఘటనలు ముఖ్యమైనవని చెప్పవచ్చు. గోల్కొండ కాంగ్రెసు సమావేశం, మద్రాసుకు వాంచూ రాక, రంగూన్‌లో ఆసియా సోషలిష్టుల సమావేశం, ఈజిప్టులో జనరల్ నజీబ్ నిరంకుశవిధానం, చైనాతో వ్యాపార ఒప్పందం చేసుకున్నందుకు సింహళానికి అమెరికా బెదిరింపు.

* * *

జనవరి 17, 18 తేదీలలో గోల్కొండలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు 58 వ మహాసభ సంజీవరెడ్డి గారన్నట్లు ఆంధ్రదేశంలో ఆంధ్రులకొరకు జరిగిన సమావేశమేనని చెప్పవచ్చు. అప్పటివరకూ కూడా, ఏదో ఒక సాకుమీద ఆంధ్రరాష్ట్రం వాయిదా పడుతుందేమో నని అందరికీ ఉన్న సందేహాలు ఆ సభలో పూర్తిగా తొలగిపోయినవి. వివిధ ప్రాంతాలవాళ్లంతా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడక తప్పదని సరిపెట్టుకున్నట్లు అందులో స్పష్టపడిపోయింది. మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు భాషారాష్ట్ర నిర్మాణం దేశైక్యతకు ప్రమాదకరమని వితండవాదము చేసినప్పటికీ, ఆంధ్రరాష్ట్ర స్థాపనకు చర్యలు చురుగ్గా జరుగుతున్నవనీ, తన సహకారంతోనే (హయాంలోనే) అది జరగ్గలదనీ అన్నారు.

అయితే ఆంధ్రరాజధాని విషయంలో మట్టుకు అంతా అయోమయంగానే ప్రవర్తిస్తున్నారు. మద్రాసు తాత్కాలిక రాజధానిగా ఉండాలని కాంగ్రెసు, ప్రజాసోషలిష్టులు కోరుతుండగా, కమ్యూనిష్టులు, కృషిక్‌లోక్ పార్టీ అది ఆంధ్రప్రాంతములోనే ఉండాలని అంటున్నారు. కమ్యూనిష్టులు విజయవాడలో ఉండాలంటే, రెండవవాళ్లు తిరుపతి ప్రాంతంలో ఉండాలంటునారు. ఏది ఎట్లా ఉన్నప్పటికీ, ఆంధ్రరాష్ట్రాన్ని సాధ్యమైనంత తక్కువ ఖర్చులో ప్రారంభించటం ప్రస్తుత పరిస్థితులలో చాలా అవసరం. అందువల్ల తాత్కాలిక రాజధాని మద్రాసులో ఉంటే, మొదట్లోనే డబ్బుకు బాధపడే దుస్థితి కొంతవరకయినా తప్పుతుంది.

అయితే దీనికి తమిళులు అంగీకరించరని గోల్కొండ సభలో తమిళ ప్రతినిధులు వాదించారు. రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి వాంచూగారు జనవరి మొదటివారంనుంచీ దీనికి సంబంధించిన వివిధ సమస్యల మీదనూ పరిశీలనలు, దర్యాప్తులు జరుపుతున్నారు. ఆంధ్ర ప్రాంత పర్యటన కూడా చేస్తున్నారు. తాత్కాలిక రాజధానికన్నా ఎక్కువ భిన్నాభిప్రాయాలు శాశ్వత రాజధాని విషయంలో ప్రకటించ బడుతున్నవి. ఏవూరువాళ్లు ఆ వూరు కావాలని కోరటం సహేతుకం గాకపోయినప్పటికీ సహజం మాత్రమని చెప్పాలి. ఇదికాక నిశ్చితంగా విజయవాడే రాజధాని కావాలని కమ్యూనిష్టులు ఒక్కరే చెపుతున్నారు. కాంగ్రెసువారు తలా ఒక విధంగా చెపుతున్నారు. అధికార రీత్యా ఆ విషయమై ఏమీ నిర్ణయం చేయలేదు. కాని, వ్యక్తిగతంగ భిన్న ప్రకటనలు చేస్తున్నారు. సంజీవరెడ్డిగారు ఆంధ్ర ప్రాంతమని చెప్పిన హైదరాబాదునగరాన్ని, కేంద్రపాలిత ప్రాంతంగా చేయటానికి శ్రీ కళా వెంకట్రావుగారికి అభ్యంతరములేదట. కేంద్రసూచనమీద మద్రాసుపై హక్కులు వదలిన వెంకట్రావుగారు హైదరాబాదుకు నీళ్లు వదలటానికి సిద్ధపడటం కేవలం వ్యక్తిగతోత్సాహంవల్లనో, లేక కేంద్రం తాలూకు

పెద్ద మనుష్యులు ఆ వరకుకూడా రాబోతున్నట్లు సూచించటంవల్లనో అనేది తెలియకుండా ఉన్నది.

*　　　*　　　*

ఇతర ప్రాంతాల్లో గదుముకోబడ్డ ఆంధ్ర ప్రాంతాలను ఆంధ్ర రాష్ట్రములో జేర్చాలన్న ఉద్యమం హోసూరు, చెంగల్పట్టు మొదలైన స్థానికాంధ్రులలోనే బయలుదేరటం సంతోషించదగ్గ విషయం. ఈ విషయమై సరిహద్దు సంఘం విచారించటం అత్యవసరమని వారు కోరుతున్నారు. అయితే సరిహద్దుల విషయమై తమిళ నాయకులతో సంజీవ రెడ్డిగారు ఒక ఒప్పందానికి వచ్చారనీ, అందువల్ల సరిహద్దు సంఘపు అవసరమే లేదని అన్నారనీ ప్రకటించ బడ్డది. అయితే ఈ ఒప్పందం ఏమిటో, దాని ఫలితాలేమిటో తెలియవు. ఈ లోపాయికారీ ఒప్పందాలే ఎప్పుడూ చిక్కులు కలిగించేవి. ఈ ఒప్పందంవల్ల వివాదగ్రస్త ప్రాంతాలను అగ్రనాయకులు ఏవిధంగా 'పంపిణీ' చేసుకున్నారో, ఇటువంటి ఒప్పందంవల్ల రెడ్డిగారిక్కానీ, కాంగ్రెసు పార్టీకిగానీ కలిగే రాజకీయ ప్రయోజనాలేమిటో బయటపడలేదు. విజయవాడలో రాజధాని ఉండాలని కమ్యూనిష్టులు చెప్పినందుకు రాజకీయ కారణాలున్నవని చెప్పిన సంజీవరెడ్డిగారికి, సరిహద్దు సంఘం వద్దన్నందుకు ఏవో కారణాలు ఉండవచ్చును. త్వరగా రాష్ట్ర స్థాపన జరగటానికి ఆ ఒప్పందం చేసుకున్నానని ఆయన అనవచ్చును కాని, కమ్యూనిష్టులు అదే మాట ఎప్పుడో అన్నారు.

మద్రాసును కేంద్రపాలితరాష్ట్రంగా చేయడానికి ఆంధ్రులలో అధిక సంఖ్యాకులు అంగీకరిస్తున్నట్లు ప్రచారం జరుగుతున్నది. కాని, దీని ఫలితంగా—వెంకట్రావుగారు ప్రతిపాదించినట్లు—హైదరాబాదును కూడా కేంద్రపాలిత ప్రాంతంగా చేయవలసివస్తుందేమో, ఆంధ్రులంతా గట్టిగా ఆలోచించవలసిన విషయం. విశాలాంధ్ర రాజధానిగా యావన్మంది ఆంధ్రులూ అంగీకరించిన హైదరాబాదును, సర్వ సమృద్ధిగల రాజధాని నగరం అయిన హైదరాబాదును, ఎటూ మనకు కాకుండాపోయే మద్రాసు కోసం విడవటానికి ఎంతమంది ఆంధ్రులు సిద్ధంగా ఉన్నారు?

*　　　*　　　*

గోల్కొండ కాంగ్రెసులో భాషారాష్ట్రాలన్నిటికీ, ఆంధ్ర మినహా-పంచవర్ష నిర్మాణపథకం పూర్తయ్యేవరకూ స్వస్తిచెప్పటం తప్పదని కేంద్రమంత్రి మౌలానా అజాద్ స్పష్ట పరిచారు. ఈ విషయమై భాషారాష్ట్రాభిమాని అయిన గాడ్గిల్‌గారు చేసిన వాదనకూడా కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి నచ్చక, అజాద్‌గారి ఈ మాటలు చెప్పించారు. దానికి భాషారాష్ట్రవాదు లందరూ, ముఖ్యంగా కర్నాటకులూ, ఎంతో నిరసన వెల్లడించారు. మైసూరు రాజధానిగా సంయుక్త కర్నాటక రాష్ట్రాన్ని నిర్మించాలనీ, దీనికి ఆంధ్రరాష్ట్ర స్థాపనలో ఉన్న చిక్కులు లేవనీ వారు కోరారు. యథార్థం తెలుసుకున్న వారెవ్వరూ ఈ మాటలను కాదనలేరు.

భాషారాష్ట్రాల విభజన పంచవర్ష పథకపు అంచనాలను తలకిందులు చేస్తవని అధిష్ఠాన వర్గంవారు అన్నారు. కాని, ఆ పథకాలు నిజంగా న్యాయమయిన పద్ధతిలో, అధిక సంఖ్యాకుల మేలుకోరకు, తయారయినవయితే వాటిని భాషారాష్ట్రాల ప్రజలు ఇనుమడించిన ఉత్సాహంతో పూర్తి చేస్తారు. అట్లా కాకుండా కృష్ణా పెన్నారు ప్రాజెక్టువంటి 'కుంభకోణ' పథకాలయితేనే చిక్కు వస్తుంది. వాటిని ఆమోదించినందుకు అధిష్ఠాన వర్గమే నిందను భరించవలసి వుంటుంది.

భాషారాష్ట్రాలు జాతీయైక్యతను భగ్నపరుస్తున్నవనటం అర్థంలేనిమాట. విప్లవకారుల బెంగాలీ రాష్ట్రీయాభిమానం తిలక్‌నాటి మహారాష్ట్ర రాష్ట్రీయాభిమానాలే ఈనాటి భారత జాతీయభావానికి పునాదులన్నమాట ఎవరికి తెలియదు?

*　　　*　　　*

గోల్కొండ కాంగ్రెసులో ప్రధాని నెహ్రూ విదేశాంగ విధానం ఆమోదించబడటం సంతోషించదగ్గ విషయం. నెహ్రూ పశ్చిమ రాజ్యాలతోటి ఎంత సఖ్యంగా ఉండదలచినా, వలసదేశాల పీడనమీదనే ఆధారపడిఉన్న ఆ దేశాల ప్రవర్తన, ఆయనకు అంతకంతకూ అనుమానం కలిగిస్తూనే ఉన్నది. వలసదేశాలతో అవి సాగిస్తున్న హింసాకాండ, దోపిడీ, వలస ప్రజల జాతీయోద్యమాలను

అణచటానికి అట్లాంటిక్ ఒప్పందం పేరుతో అవి సాగిస్తున్న గూడుపుఠానీలనూ, కాశ్మీర్ సమస్యలో అవి అనుసరిస్తున్న పక్షపాతవిధానాన్ని నెహ్రూ ఇంతకుముందు అనేకసార్లు అతితీవ్రంగా నిరసించారు. పశ్చిమరాజ్యాలు ఇప్పుడు మధ్యప్రాచ్య రక్షణ కూటమిలో పాకీస్థాన్‌ను కూడా జేర్చాలని ప్రయత్నిస్తున్నవి. ఇది నెరవేరితే ఇండియా సరిహద్దులోనే ప్రపంచ యుద్ధరంగం ఒకటి ఏర్పడుతుంది. అందుకని పండిత నెహ్రూ గోల్కొండ సభలో తమ ఆందోళనను వెల్లడించారు.

పశ్చిమ రాజ్యాల దురాక్రమణ విధాన వ్యాప్తినిగురించి మొదటినుంచీ నెహ్రూ చేస్తున్న హెచ్చరికలను ప్రాచ్య దేశాల ప్రజలు యావన్మందీ గమనించక తప్పదు. దేశీయం పార్టీ రాజకీయాలవల్ల పశ్చిమ రాజ్యాలతో చేయి కలవాలనుకునే కాంగ్రెసు వాదులు దీనిని మరీ ముఖ్యంగా గమనించాలి.

పశ్చిమ రాజ్యాల సైనిక ప్రతినిధులు పాకీస్థాన్‌తో మంతనాలాడుతున్నట్లు వార్తలు వస్తున్నవి. పాక్ ప్రభుత్వం వీటిని కాదనలేదు. అక్కడ కొత్తగా ఏర్పడ్డ గణతంత్ర మండల్ అనే పార్టీ ఈ వార్తలను ధృవపరిచింది.

* * *

పశ్చిమ రాజ్యాలవల్ల ఇండియాకు యుద్ధభయం ఒక్క పడమరనుంచే కాదు. తూర్పునకూడ మనకు పాకీస్థాన్ ప్రాంతం ఉన్నది. అదీకాక, బర్మాతో బ్రిటన్ మరొక సైనిక ఒప్పందం చేసుకుంటున్నది. దీని ఫలితం ఎట్లా ఉంటుందో ఒక్క సంఘటన సూచిస్తున్నది. బర్మా రాజధానికే తరచు శత్రువులవల్ల ముప్పు వస్తుండగా, ఉత్తర సరిహద్దుల్లోని కొమింటాంగ్ సేనలు అట్లాగే ఉండగా, విప్లవకారుల చేతుల్లోనుంచి బ్రిటిష్ కంపెనీకి చెందిన టంగ్‌స్టన్ గనులను విడిపించటానికి బర్మాసేనలు బయలుదేరినవి.

* * *

రంగూన్‌లో జనవరిలో ఆసియా సోషలిస్టు మహాసభ జరిగినది. ఈ సభ యూరపు సోషలిస్టులతో, ఎంత ప్రయత్నించినప్పటికీ ఏకం కాలేకపోయింది. సాక్షాత్తు బ్రిటిష్ సోషలిస్టు నాయకుడు అట్లీ వచ్చి ప్రయత్నించినప్పటికీ, ఆసియా సోషలిస్టులు యూరపియన్ సోషలిజాన్ని ఆమోదించలేక, ప్రాంతీయ సోషలిస్టు కేంద్రాన్ని ఏర్పాటు చేసుకున్నారు. వలసదేశాలను దోచుకుని, ఆ డబ్బుతో సోషలిస్టు పథకాలను వేయాలనుకునే యూరపియన్ల వింత ధోరణితో సరయిన సోషలిస్టులు ఎవరు ఏకీభవిస్తారు? వలసదేశాల డబ్బుతో తమ ప్రజల ఆర్థికస్తోమతను పెంచి, కమ్యూనిస్టు దేశాలకన్నా తామే మెరుగనీ, అందువల్ల కమ్యూనిజంకన్నా సోషలిజం మెరుగనీ యూరపియన్ సోషలిస్టులు ప్రగల్భాలు పలుకుతారు. యూరపుదేశాల్లో కమ్యూనిజాన్ని అరికడుతున్నది వలసదేశాల డబ్బూ అమెరికన్ల బిచ్చమూ కాని యూరప్ బ్రాండ్ సోషలిజమూ కాదు, వారంత గొప్పగా చెప్పుకునే వ్యక్తి స్వాతంత్ర్యమూ కాదు.

* * *

ఆసియా సోషలిస్టు సభ సోషలిస్టుల్లో అంతః కలహాలను బయలుపెట్టింది. లేబర్ పార్టీ పరిపాలనలో ఉన్న ఇస్రేల్‌ను సోషలిస్టుగా గుర్తించటానికి ఈజిప్టు, లెబనాన్‌లు అంగీకరించక సమావేశంలోనుంచి వెళ్లిపోయినవి. అరబ్ రాజ్యాలకు—ఇవి సోషలిస్టు దేశాలు కాదు—సోషలిస్టు బ్రిటన్ ఆయుధాలు సప్లయిచేస్తుంటే, ఇవి తమమీదనే ఉపయోగించబడతవని సోషలిస్టు ఇస్రేల్ ఆక్రోశిస్తున్నది.

మధ్యప్రాచ్య రక్షణ వ్యవస్థలో వీటి రెంటినీ జేర్చాలని పశ్చిమ రాజ్యాలు మహా తాపత్రయ పడుతున్నవి.

సుడాన్‌ను తమకు అప్పగించేట్లయితే మధ్య ప్రాచ్య రక్షణలో జేరటానికి ఈజిప్టు సైనిక నియంత జనరల్ నజీబ్ సిద్ధంగా ఉన్నాడు. ఆయన అంతకంతకూ పూర్తి నియంతగా మారిపోతున్నాడు. జనవరి రెండోవారంలో ఆయన ఒక శాసనం చేస్తూ దేశంలో యావత్తు రాజకీయ పక్షాలను రద్దుచేసి కొత్తవాటిని స్థాపించకూడదని నిషేధించాడు. మితవాద జాతీయ పక్షమయిన లీవద్‌పార్టీని మొదట నిర్మూలించి, ఇప్పుడు కమ్యూనిస్టులమీదికీ ముస్లిం సంస్థలమీదికీ తిరిగాడు.

* * *

## రాజకీయాలు

అమెరికా ప్రజాస్వామ్యాన్ని తన వ్యాపారాభివృద్ధికి ఒక నినాదంగా ఉపయోగించుకుంటున్నదని నిరూపించే మరొక సంఘటన మనకు పక్కనే ఉన్న సింహళంలో జరిగింది. సింహళానికి బియ్యం కావాలి—వాటిని సప్లయిచేసేవారు కనిపించలేదు. సింహళందగ్గర రబ్బరును ప్రపంచధరలకన్నా ఎక్కువ ధరకు కొని, సింహళానికి అవసరమయిన బియ్యాన్ని ఇవ్వటానికి చైనా అంగీకరించింది. దీనికి అమెరికా అక్కసు వెళ్లగక్కింది. తాను ప్రపంచధరలకు రబ్బరును కొంటానంటే సింహళం అమ్మనన్నదని అమెరికన్ విదేశ సహాయ నిర్వాహకుడు ఎవెరెల్ హారిమన్ విమర్శించారు. ఎక్కువ ధరను అవతలవాళ్లు ఇస్తానంటే చౌకగా తను కెందుకు అమ్మాలో ఆయన చెప్పరు. రవాణా నౌకలుమీద నిర్బంధం విధిస్తామని ఆయన బెదిరించారు. కాని ఈ రవాణా నౌకలు వాళ్ల మిత్రులయిన బ్రిటిష్‌వాళ్లవే పాపం!

సింహళం విషయంలోనేకాదు. యూరప్ దేశాలను కూడా వ్యాపారంలో అమెరికా ఈ విధంగా పీడిపిస్తునే ఉన్నది. తను వాళ్ల సరుకులు కొనదు. కమ్యూనిస్టులకు అమ్ముకోనివ్వదు. తను పెట్టే బిచ్చం తీసుకుని, తనకు లొంగిఉండాలని చెపుతుంది. సముద్ర రాణి అని గప్పాలు కొట్టే బ్రిటన్ ఇప్పుడు నౌకా బలాధిపత్యాన్ని కూడా అమెరికాకు అప్పజెప్పవలసి వచ్చిందంటే ఈ లొంగుబాటు ఎంతవరకు పోయిందో తెలుస్తుంది. అందుకనే అమెరికా తన వ్యాపారపు వైఖరిని మార్చుకోక తప్పదనీ, దిగుమతి నిబంధనలు పోతేనేగాని ప్రపంచ ఆర్థిక వ్యవస్థ బాగుపడ దనీ ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు యూజీన్ బ్లాక్ ఇటీవల హెచ్చరికచేసి, దానికోసం అమెరికాలో ఒక ఉద్యమాన్నే నడపాలని సూచించారు.



# ఆషామాషీ

• అవివేకి •

### "దైవభక్తి, పాపభీతి, దయయు సత్యమూ...."

మధ్యకాలంలో మరిచిపోయిన యీ రాగం (కూన రాగమే ననుకోండి) ముఖ్యమంత్రి రాజాజీగారి ధర్మమా అంటూ ముక్కు చివరకు పదేపదే వస్తూవుంది. అయితే, ఆయనకున్న అధికార ప్రాభవముగాని, అసమానసాహసంగాని, అతిఘనమైన గడుసుదనంగాని, అమాయక ప్రజలను మభ్యపెట్టగల అవకాశాలుగాని అంతగా లేని కారణంవల్ల, బయటపడని తుమ్మువలె మెదడు సందుల్లో మరీమరీ మారు మ్రోగుతూవుంది.

అయినా, ఆ ముక్కు పచ్చలారని పసితనంలో, బడి పంతులు ఎదుట నిలుచునివుండగా, ఆ గుంపులో గోవిందా యంటూ గొల్లునచేసే ఆ ప్రార్థన—భక్తిమాట దేవు డెరుగు—ఎంత అహంభావాన్ని ఆ అమాయక హృదయాల్లో రేకెత్తించుతుంది? గట్టిగా చేతులుజోడించి, యింకా గట్టిగా కళ్లుమూసుకుని, బొడ్డును తాకేటట్లు తల వంచుకుని, ఆ రాగాన్ని ఆలాపిస్తే, ఆ నమ్రతా, ఆ వినయం, ఆ తీవ్రమైన భక్తినిచూచి, ఆహా, మూర్తీభవించిన భక్తియే యీ పిల్లవాడుగదా అని అందరూ అనుకోవాలనే అత్యా సతో పాపం ఎంత నటిస్తారు ఆ బాలలు? ఆ నటనమీద గల ఏకాగ్రతవల్ల అసలు ముక్కలు మరచిపోవడం, ఉచ్చారణదోషాన్ని సవరించుకోమని ప్రక్కనున్న సహాధ్యాయులు సన్నగా గిల్లడం, యీ కర్మకాండలో, దేవునియందు భక్తి, కోరుకునే వరములయందనురక్తి లేకపోగా 'అహం'నందు ఆ శక్తి అభివృద్ధిజెంది, నరంలేని నాలుక చివరనుండి, రక్తిలేని రాగతరంగాలు రకరకాలుగా వెలువడుతూ, వాతావరణంలోని ధూళిదుమారంలోకి దూసుకొని పోతుంటాయి.

లోకజ్ఞానంలేని అమాయక హృదయాల్లోనే అంత అవలీలగా పీఠం వేసుకున్న యీ అహం, అరవైఏళ్లు పైబడి, అన్నింటా ఆరితేరి, తమను పుట్టించిన బ్రహ్మదేవునికే జోలపాడి, కొండకు తాళాలువేయగల మేధస్సు, బోడి తలకు బొటనవేలుకు ముడిపెట్టగల చమత్కారము, దండనాథుండైన యమధర్మరాజంతటి వాడినికూడా మభ్యపెట్టి, తప్పు ఒప్పుగా కనపర్చగల నేర్పరితనం, అలవరచుకున్న వారి హృదయాల్లో చిరస్థాయిత్వాన్ని ఏర్పరచుకోవడంలో ఆశ్చర్యముండరాదు. అదేమంటే "అహం బ్రహ్మోస్మి" అని అందటినోరూ అట్టే కట్టివేయగల సామర్థ్యం వారిది.

## మన విదేశాంగ విధానం

గోల్కొండ కాంగ్రెసు మహాసభలో భారత విదేశాంగ విధానంపై తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ, రాజాజీగారు భారత ప్రభుత్వము బలవంతమైన ఏ పక్షములోనూ యుద్ధనిమిత్తమై జేరకుండా అవలంబిస్తున్న తాటస్థ్య విధానం భగవద్గీతా బోధల ననుసరించినదేనని సెలవిచ్చారు. సకల శాస్త్ర పురాణ పారంగతుడైన ముఖ్యమంత్రిగారి రాష్ట్రపరిపాలనో పాఖ్యానంలో, అన్ని ఉపన్యాస వేదికలనుండీ, ప్రస్తుతా ప్రస్తుతాల వివేచనలేకుండా, వారు వర్ణించిన ధర్మచింతన, దైవభక్తి, సత్యనిరతి, పాపభీతి, సేవానురక్తి, యిత్యాది ధర్మసూత్రాలు అందఱకూ సువిదితములే. అందువల్ల అంతర్జాతీయ రంగంలోనికి గూడా, వారి దైవభక్తిని అమాంతంగా జొప్పించి, వారు అనుసరించే పంథా గీతాసూత్రబద్ధమైనదని బల్లగుద్ది అదిరించడంలో ఆశ్చర్యమేమీలేదు. అయితే భగవంతుఁడు, భక్తి అని ఉచ్చరించినంతమాత్రానే, సెక్యులరు విధానానికి ఎక్కడ హానికలుగుతుందోనని ఉలిక్కిపడే పండిత నెహ్రూ, తన హృదయానికి అతి సన్నిహితము, ప్రత్యేక ప్రేమాస్పదమునైన విదేశాంగ విధానములో, భగవద్గీతను చొప్పించిన మాటలకు త్రుల్లిపడలేదెందుకో— రాజాజీగారు నిర్వచించే సూత్రాలకూ, నిర్వహించే క్రియాకాండకు సంబంధముండదుగదా అని సమాధానపడి యుండాలి.

## దేవుని స్థానం ఆక్రమించిన ఏటమ్ బాంబు

ఈ పరమ భాగవతుఁడు మరొక అమూల్యమైన మాట అన్నారు. వర్తమానంలో ఏటమ్ బాంబు భగవంతుని స్థానాన్ని ఆక్రమించిందని, ఏటంబాంబుకుగల వినాశశక్తి భయంవల్ల, దేవుని మీదకన్నా కూడా దానియందు ప్రజలకుగల భీతివల్ల, యుద్ధం వెనుకకు పోతూ ఉందని వారన్నారు.

ఏటమ్ బాంబు ధర్మమా అంటూ (దేవుని ధర్మమువల్ల గాకపోయినా) యీ ఎనిమిదేండ్లగా ప్రపంచయుద్ధం అలా ఆగియుండడం యీ బాంబు ఒక విధంగా మేలు కలిగించినదని కూడా వారన్నారు. అణుశక్తిలో అగ్రస్థానం వహిస్తున్న అమెరికా, రష్యాలు రెండూకూడా, ఒక వంక శాంతి సమావేశాలు, శాంతి ప్రణాళికలు, శాంతి దూతలకు బహూకరణలు సాగిస్తూనే, మరియొక వంక అణుశక్తిని వృద్ధిచేసుకోవడం చూస్తే, క్రియారూపంగా పాశవ బలానికి వారిచ్చే ప్రాధాన్యత స్పష్టపడకపోదు. ప్రసంగాలకూ, ప్రవర్తనకూ, మాటలకూ, చేతలకూ, యీలాంటి పరస్పర వైరుధ్యం ఎక్కడ ప్రత్యక్షమో, అక్కడ అసలైన దైవభీతి లోపించినదని ఒప్పుకు తీరాలి. ధర్మపరులము, ఆస్తిక శిఖామణులమని డమకవేసుకొనేవారి నడవడికలోనే యీ దైవభీతి లోపించినప్పుడు, సామాన్య ప్రజలలో అది లోపించడంలో గాని, ఏటమ్ బాంబు వారికి ఉపాసన దేవత కావడంలో గాని, వైపరీత్యము ఉండబోదు.



(11-వ పేజీ తరువాయి)

సు : అబ్బ! ఏమిటే, అల్లా పొంగిపోతున్నావ్ ; అసలు సంగతేమిటీ, చెప్పవే?

క : (ధీమాగా) సంగతిదమ్మా! ఇవాళ వాళ్ల చిట్టి పుట్టిన పండుగట! వాళ్ల నాన్న ఈ మధ్యనే అమెరికా వెళ్లొచ్చాడులే! అందుచేత 'కొత్తగా, వింతగా' చేస్తున్నారు పుట్టినరోజు పండుగ!

సు : ఏమిటా, 'కొత్తా, వింతనూ?'

క : వాళ్లమ్మ పెద్ద పిల్లలు కిష్టిగాడిదీ, రాజ్యందీను పెత్తనం అంతా! పేరంటాళ్లు అంతా 10 ఏళ్లలోపు అబ్బాయిలూ, అమ్మాయిలే! పెద్దవాళ్లకి అక్కడ చోటు లేదట! అసలు వాళ్ల అమ్మా, నాన్నే రాలేదు. పిల్లలందరికీ పరికిణీలు, గౌనులు, చొక్కాలు, లాగులూ, జడగంటలూ, పుస్తకాలు, పెన్నులూ, ఓహ్! ఎన్నో పంచిపెట్టారు. వాళ్ల చిట్టిని మేం అందరం ఒక్కొక్కళ్లు, ఎత్తుకుని ఆడించామే!! దాని నెత్తిమీద పూలు వానకురిపించేశాం. అమ్మోయి! వాళ్ల చిట్టి అంచక్కా (నవ్వుతూ) "ఎవరెత్తుకున్నా వస్తుందే!"

సు : (ఉరుముతూ) ఊఁ సరే, ఇంకా?

క : (కోపంతో, ఒక్కొక్కక్షరం నొక్కి నొక్కి, దీర్ఘం తీస్తూ) ఇంకేముంది? ఇవాళ చిట్టి పుట్టినరోజు పండగట! పిల్లల పండగ!!

సు : (పళ్లు పటపటలాడిస్తూ) ఏం, మరీ బిరుసెక్కిపోతున్నావ్! (రెండు చరుపులు వీపుమీద చరుస్తుంది, కమల ఏడుస్తూ లోపలికి వెళ్లిపోతూంటే) ఊఁ! అలా, మూల కూర్చుని, దీర్ఘాలుతియ్యి! (ప్రక్కన ఉయ్యాల్లో పిల్లాడు లేచి ఏడుస్తూంటే) నువ్వొక్కడికోయి తయారయావ్? పృడుఖో! (వీపుమీద ఛళ్లున చరుస్తుంది. పాపాయి చివాలున బొబ్బరింత పెడుతాడు!)



మూలం : రవీంద్రుడు

# శుభదృష్టి.

అనువాదం : కె. వైకుంఠరావు

కాంతిచంద్రుని వయస్సు స్వల్పము. అయినా భార్య మరణానంతరము రెండో వివాహముమాట తలచక పక్షుల షికారు, జంతువుల వేటలో పడ్డాడు. మంచి గురి కాడు. పొడవుగా సన్నముగా ఉండేవాడు. తెల్లికైన గట్టి శరీరము. కుస్తీ అభ్యాసము చేసేవాళ్ళూ, గాన వాద్యాలు చేసేవాళ్ళూ అతనితో సరదాగా ఉండేవాళ్ళు. పనిలేని అనుచరులకూ పరిచరులకూ మరి లెక్క లేనేలేదు. అతని ముస్తాబూ దుస్తులూ పశ్చిమప్రాంతాలవాళ్ళమాదిరి.

వేట ఎరిగిన స్నేహితులను నలుగురిని తోడ్కుకొని మార్గశిర మాసము నడుమను నైదిఘీ వైపు వేటకు బయలుదేరాడు. తనకోసము రెండు పెద్ద బోట్లూ, నౌకర్లు అనుచరులకోసము మరి మూడు నాలుగు చిన్న నావలు. వీటినన్నిటినీతెచ్చి గ్రామము రేవుచుట్టూ కట్టారు. వీళ్ళు వచ్చినప్పటినుంచీ గ్రామ వధువుల స్నానాలూ, నీళ్ళ మోతా మొదలైన నిత్యకృత్యాలు నిలిచిపోయినవనే చెప్పవచ్చు. తుపాకుల శబ్దముతో జలస్థలప్రదేశాలన్నీ రోజంతా కంపిస్తున్నవి. సాయంకాలము కాగానే సంగీత వాద్యాలు ప్రారంభమయేవి. ఊళ్ళోవాళ్ళ కెవ్వరికీ నిద్ర లుండేవి కావు.

ఒకనాడు ఉదయం కాంతిచంద్రుడు తన తుపాకీ నాళాను స్వయముగా తానే తుడుస్తున్నాడు. ఆసమయములో బాతుల అరుపు వినబడి ముఖమెత్తి చూచేసరికి బాలిక ఒకతె రెండు బాతు పిల్లలను పట్టుకొని రేవుకు వస్తున్నది. ఏరు పెద్దదికాదు. నీరు బాగా ఎండిపోయింది. ప్రవాహము లేనేలేదు. నీటినిండా నానారకాల నాచు. అమ్మాయి బాతులను నీటిలోవదిలిందిగాని దూరము వెళ్ళిపోతే చేతికందవేమో అని భయపడుతున్నట్టుగా జాగ్రత్తగా వాటిని ఆపుతున్నది. ఆబాతులను రోజూ నీటిలో వదిలిపొయ్యేది కాని ఇవాళ వేటగాళ్ళ భయము వల్ల రోజూ మాదిరి చేయలేకున్నట్టుగా కనబడ్డది.

అమ్మాయి అపురూప సుందరి, నవయౌవ్వనములో ఉన్నది. సృష్టికర్త ఆమెను నిర్మించి అప్పుడే అక్కడ విడిచిపెట్టి వేళ్లాడని అనిపిస్తున్నది చూచేవాళ్ళకు, ఆమె వయస్సు నిర్ణయించడం కష్టము. శరీర వికాసము ఉన్నదికాని, ఆమె ముఖము చూడగానే ప్రపంచం ఆమెను ఇంకా ఎక్కడా స్పర్శించలేదని తట్టుతుంది. తాను యౌవ్వనములో అడుగు పెట్టానన్నసంగతి తనకింకా తెలియ లేదు.

కాంతిచంద్రుడు ఆమెను చూడగానే చకితుడై, తుపాకీ తుడవడం ఆపాడు. ఇటువంటి స్థలములో ఇంత రూపవతి కనబడవచ్చునని అతనెన్నడూ ఆశించలేదు. కాని రాజాంతఃపురముకంటె ఇదే అపురూపు అనుగుణ్యమైన స్థలమని అతనికి తోచింది. బంగారు పూలదోనిలో కంటె చెట్టున ఉంటేనే పువ్వుకు అందము. ఆనాడు శరత్కాలపు శిశిరములో ప్రాతఃసూర్య కిరణాలలో నదీ తీరాన వికసించిఉన్న కుశవనరాసి తళతళ్లాడుతున్న వాటి మధ్యను ఆ సరళ బాలికా ముఖము కనబడగానే కాంతిచంద్రుడు ముగ్ధుడైనాడు. మందాకినీ తీరముమీద పార్వతి బాలికగా ఉన్నప్పుడు హంస పిల్లలను పట్టుకొని ఈవిధముగానే వస్తుండి ఉండవలెను. కాళిదాసు ఆసంగతి వర్ణించడము మరిచిపోయి ఉంటాడు.

ఆ అమ్మాయి జడిసి ఏడుపు ముఖముతో ఆ బాతు పిల్లలను పట్టుకొని తొందర తొందరగా రేవు విడిచి వెళ్ళిపోయింది. అమ్మాయి భయానికి కారణమేమిటో కనుక్కుందామని కాంతిచంద్రుడు బయటికివచ్చి చూచాడు. అతని అనుచరులలో రసికుడొకడు ఆమెను భయపెట్టాలని ఖాలీ తుపాకిని ఆ బాతుపిల్లలవైపు చూపిస్తున్నాడు. కాంతిచంద్రుడు వెనుకనుంచి వచ్చి ఆ తుపాకిని వాడిచేతులో నుంచి లాక్కొని వాడి దవడమీద గట్టిగా ఒకటి చరిచాడు. రసభంగమయి నౌకరు అక్కడే కూలపడ్డాడు. కాంతిచంద్రుడు తిరిగి తనగదిలోకి వచ్చి తుపాకి తుడుచుకోవడము మొదలుపెట్టాడు.

మరికొంతసేపైన తరువాత అతను కుతూహలము కొలదీ ఆ పక్షులు ఎక్కడికి పోయినవో చూదామని

బయలుదేరాడు. తుప్పలూ, మొక్కలూ ఎడముచేసుకొని కొంతదూరము వెళ్ళేసరికి అక్కడ అతి పరిశుభ్రమైన గృహస్థుని ఇల్లు ఒకటి కనబడ్డది. ఇంటి ఎదుట ధాన్యపు జాతీలవరసలున్నవి. ప్రక్కను శుభ్రముగా తుడిచి ఉన్న ఆవులసాల ఉన్నది. సాల ఎదుట రేగి చెట్టుక్రింద ప్రొద్దున అతను చూచిన అమ్మాయి కూర్చొని ఉన్నది. దెబ్బ తగిలిన పావురము ఒకటి ఆమె చేతిలో ఉన్నది. బహు జాలిగా దానిని గుండెదగ్గర పెట్టి నొక్కుకుంటూ, పైట చెంగును నీళ్ళలోముంచి ఆనీళ్ళను పక్షినోటిలో మెల్లిగా పిండుతున్నది. పెంపుడు పిల్లి మధ్య మధ్య వచ్చి ముందు కాళ్ళను ఆమె ఒడిలో వేసి పక్షి దగ్గిర మూతి పెట్టుతు న్నది. పిల్లి అంత ఆత్రతగా ఉండడముచూచి దాని ఉత్సాహాన్ని తగ్గించకోరి బాలిక దాని మూతిమీద నెమ్మ దిగా వేలితో కొట్టింది.

ఆనిష్ఠుర మధ్యాహ్నపువేళను హాయిగా కాలము గడుపుతున్న ఆ గృహస్థుల అంగణములో మనస్సును కరిగించే ఆ దృశ్యము కాంతిచంద్రుని హృదయములో అంకితమైపోయింది. పలచగా ఉన్న చెట్టు ఆకులనీడా, ఎండా కలిసి ఆ బాలిక ఒడిలో పడుతున్నది. ఆ దగ్గరనే పుష్టిగానున్న ఆవొకటి కడుపార తిని, తృప్తిగా కొమ్ము లాడిస్తూ కూర్చొని తోకతో వీపుమీదనుండి ఈగలు తోలు కుంటున్నది. ఉండి ఉండి ఎవరో గుసగుసలాడుకుంటు న్నట్టుగా పుస్ పుస్ మని వెదురుపొదలోనుంచి ఉత్తరపు గాలిశబ్దము వస్తున్నది. ఉదయము నదీతీరాన చెట్లనడుమ వనశ్రీవలె కనబడిన బాలిక మధ్యాహ్నమువేళ ఆవులసాల ఎదుట అంగణములో ప్రేమను శ్రవిస్తున్న గృహలక్ష్మి వలె కనబడ్డది.

చేతిలో తుపాకీతో ఈ విధముగా హఠాత్తుగా ఆమె కంట పడిపోయి కాంతిచంద్రుడు చోరీమాల్‌తో దొరికిన దొంగమాదిరి తడబడుతుండెను. తన తుపాకీగుండువల్ల ఆపక్షికి దెబ్బ తగిలలేదని చెప్పవలెనని కోరిక కలిగింది. ఆ సమాధానము ఎలాగు ఆమెకు తెలియజేయడము అని ఆలోచిస్తున్నాడు. అంతలో ఎవరో "సుధా" అని పిలి చారు. అమ్మాయి ఉలికి పడ్డట్టయింది. మరి ఒకమారు "సుధా" అని పిలుపు వినబడ్డది. అమ్మాయి ఆ పక్షిని పట్టుకొని తొందర తొందరగా ఇంటిలోపలికి వెళ్ళిపో యింది. "సుధ" బహుచక్కని పేరు అని కాంతి చంద్రుడు అనుకున్నాడు,

కాంతి తుపాకీని తన మనుష్యులకు అప్పచెప్పి ఇంటి ముందరి ద్వారము దగ్గిరికి వచ్చి నిల్చున్నాడు. మధ్యవయ స్సులో నున్న బ్రాహ్మణుడొకడు అరుగుమీద కూర్చొని ఉన్నాడు. క్షవరముచేయించుకున్న బోడితల, శాంతమూర్తి. హరిభక్తివిలాసము చదువుతున్నాడు. భక్తి ఆవరించి ఉన్న అతని ముఖములో ప్రశాంతమైన ప్రేమ వ్యక్తమౌ తున్నది. ఇతని ముఖానికీ ఆ బాలికయొక్క దయార్ద్ర ముఖానికీ సాదృశ్యము ఉన్నదని కాంతికి తోచింది.

కాంతి అతనికి నమస్కారముచేసి దాహము వేస్తు న్నది కొంచెము మంచినీళ్లు ఇప్పించగలరూ? అని అడిగాడు. బ్రాహ్మణుడు తొందర తొందరగాలేచి, మర్యాద చేసి అతిథిని కూర్చోపెట్టి లోపలికివెళ్లి కంచుచెంబుతో నీళ్లూ గ్లాసూ తెచ్చి అతని ముందర ఉంచాడు. కాంతి దాహము తీర్చుకున్న తరువాత బ్రాహ్మణుడు అతిథిని గురించి తెలుసుకో గోరాడు. కాంతి తానెవరో చెప్పి, "మీకు నేనేదైనా ఉపకారము చేయగలిగితే కృతార్థుడ నౌతా"నని అన్నాడు.

నవన్ బానర్జీ జవాబు చెప్పాడు. "నీవు చేయగల ఉప కారము ఒక్కటే నాయనా. నాకు ఈడువచ్చిన కూతురు ఒకతె ఉన్నది. సుధ ఆమె పేరు. ఆమెకొక మంచి పెళ్ళి సంబంధము చూచి పెట్టగలిగావంటే ఋణ విముక్తుణ్ణి అవుతాను. ఈ ప్రాంతాలలో మంచి సంబంధాలేవీ లేవు. దూరమువెళ్ళి చూచే సామర్థ్యము నాకు లేదు. ఇంట్లో గోపీనాథునిపూజ నిత్యమూ జరుగుతుండాలి విధాయకంగా కనుక నేను ఇల్లు విడిచి ఎక్కడికీ వెళ్ళలేను."

"పడవలో నాబసకు మీరు ఒకసారి రండి. వరుని గురించి మాట్లాడుదాము" అని కాంతి అన్నాడు.

ఈలోగా కాంతి పంపిన చరులు నాలుగుచోట్లా కను క్కొని తిరిగి వచ్చి, బేనర్జీగారి అమ్మాయి సుధవంటి సాధుస్వభావముగల పిల్ల ఇంకొకరు ఈ ప్రాంతాలలో లేరని చెప్పారు.

మర్నాడు నవీన్ బోట్లోకి వచ్చాడు. అతన్ని చూడ గానే కాంతి సాష్టాంగ ప్రణామముచేసి, "నేను మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను, మీకు అభ్యంతరం లేకపోతే" అని అన్నాడు. ఆమాట విని సంతోషము కొలదీ నవీన్‌నోటివెంట మాట రాలేదు కొంతసేపటివరకు.

తరువాత అందులో ఏదో పొరపాటు ఉన్నదని అను మానించి "మా అమ్మాయిని నీవు పెళ్లాడుతావా?" అని నవీన్ అడిగాడు.

''మీకు అభ్యంతరం లేకపోతే నేను సిద్ధమే'' అని కాంతి అన్నాడు.

''మా సుధనా?''

"ఔను.''

''అయితే చూడడానికి ఎప్పుడు—?''

నవీన్ మాట పూర్తి కాకుండా కాంతిచంద్రుడు ఆ అమ్మాయిని ఇంతవరకు చూడనట్టు నటించి "శుభదృష్టి సమయములో చూస్తాను. అది చాలును" అని అన్నాడు.

నవీన్ గద్గదకంఠంతో అన్నాడు- ''మా సుధది అతి మధుర స్వభావము. వంటలోను, ఇంటి పనులలోను ఆమెతో చాలినవాళ్లు లేరు. ఆమెను చూడకుండానే పెళ్లా డుతానని నిశ్చయించుకున్నావు కనుక చెపుతున్నాను విను బాబూ. మా సుధ పరమ పతివ్రత అయి నీకు చిరకాలము సుఖసంపదలను ఇచ్చుగాక అని ఆశీర్వదిస్తున్నాను. నీవు ఎన్నడూ ఒక్క నిమిషమైనా అనుతపించవలసిన అవసర ముండదని నా నమ్మకము.

ఆలస్యము చేయడం మంచిదికాదని ఉభయపక్షాల వాళ్లకూ తోచింది. ఆ గ్రామములో ఉన్న మజుమ్‌దారి గారి పాత భవంతి విడిదిగా ఏర్పాటు చేశారు. బాజాభజం త్రీలు, మషార్చీలతో వరుడు సుముహూర్తము వేళకు ఏనుగెక్కి వచ్చాడు.

వధువుకి చందనమురాసి (బంగాళా దేశస్థులు వధూ వరులకు జీలుగుతో చేసిన కిరీటాలతో ముస్తాబుచేస్తారు) కిరీటము పెట్టి ఉండడముచేత శుభదృషిసమయములో వరునికి ఆమె ముఖము సరిగా కనపడలేదు. అదీ కాక ఆనందోఛ్వాసముచే వరుని కళ్ళు మసగలు కమ్మి ఉండెను.

రాత్రి శోభనపుగదిలో ఆపేట నాయనమ్మలు వచ్చి వరునిచేత వధువు ముసుగును లాగించారు. కాంతిచం ద్రుడు వధువు ముఖముచూచి హఠాత్తుగా ఉలికి పడ్డాడు.

ఈమె ఆ అమ్మాయి కాదే! కాంతికి తలమీద పిడుగు పడ్డట్టు అనిపించింది. శోభనపు గదలోని దీపాలన్నీ హఠా త్తుగా ఆరిపోయినవి. వధువు ముఖానికి నలుపురంగు పులిమింది.

కాంతిచంద్రుడు రెండో వివాహము చేసుకోనని ప్రతిజ్ఞ చేసిఉండెను. ఆ ప్రతిజ్ఞ ఇతనిని ఈవిధముగా పరిహాసము చేయదలచింది కాబోలు! ఎన్నో మంచి మంచి సంబంధాలు అక్కరలేదని వదిలేశాడు. ఎందరో బంధువులు, మిత్రులు బ్రతిమాలారు. వాళ్ళ ప్రార్థనలు మన్నించాడుకాడు. ధనవంతుల ఇళ్లనుంచి సంబంధాలు వచ్చాయి. డబ్బుకు ఆశపడలేదు. అందముచే ఆకర్షింప బడలేదు. చివరకు ఎవరూ ఎరగని మారు మూలను పొలాల నడుమను కాపురముచేస్తున్న ఈ దరిద్ర బ్రాహ్మ ణుని కుమార్తెను పెళ్లాడి మోసపోయినాడు. బంధుమిత్రు లకు ఇప్పుడు ముఖమెట్లా చూపించగలడు!

మొట్టమొదట మామగారిమీద బాగా కోపమువచ్చింది. ''మోసగాడు! ఒక అమ్మాయిని చూపించి ఇంకొక అమ్మాయికి పుస్తి కట్టించాడు'' అని అనుకున్నాడు. కాని కొంతసేపటికి జ్ఞాపకము వచ్చింది. నవీన్ పెళ్లికి పూర్వం వధువును చూపించనేలేదు- పైగా అతను చూపిస్తానంటే తానే అక్కరలేదన్నాడు. ఆబుద్ధి హీనత తనదే. తన తెలివితక్కువే ఇంత మోసానికి కారణమని, ఎవరికీ తెలియకుండా ఉండడమే ఉత్తమమని చివరకు నిశ్చయిం చుకున్నాడు.

మందు మింగేశాడుకాని నోటి రుచి పోయింది. శోభ నపు గదిలో జరుగుతున్న హాసపరిహాసాలు అతనికి మరి రుచించలేదు. తనపైని, ఇతరులపైని భరించరానికోపము వస్తున్నది. అంతలో అతని ప్రక్కను కూర్చొని ఉన్న వధువు అవ్యక్త భయముతో హఠాత్తుగా ఉలికిపడి చూచింది- ఆమె ప్రక్కనుంచి చెవులపిల్లి పిల్ల ఒకటి ఆమె పక్కనుండి గంతులు వేసుకుంటూ పరుగెత్తింది. కాంతికి ఆనాడు రేవులో కనబడ్డ బాలిక ఆవెనుకనే పరు గెత్తుకువచ్చి చెవులపిల్లిపిల్లను పట్టుకొని, తన బుగ్గను దాని మీద పెట్టి మిక్కిలి ప్రీతితో ఆదరిస్తున్నది. ఆగదిలో ఉన్న స్త్రీలందరూ "అదిగో పిచ్చిపిల్ల వచ్చిందమ్మా'' అని కేకలు వేస్తూ ఆమెను బయటికి పొమ్మని సౌజ్ఞ చేశారు. ఆమె అటువైపు చూడనైనా చూడలేదు- ఆచెవుల పిల్లి పిల్లను పట్టుకొని పసిపిల్లవలె కుతూహలముతో, గదిలో జరుగుతున్న వినోదము చూస్తూ వధూవరుల ఎదుట కూర్చున్నది. ఇంటి దాసి ఆమెను బయటికి తీసుకు

పోవోయేటప్పటికి కాంతి చంద్రుడు- ''ఎందుకామెను తీసుకుపోతారు? ప పము, కూర్చోనీ," అని అన్నాడు.

''నీ పేరేమిటి అమ్మాయి?'' అని కాంతి అడిగాడు ఆ అమ్మాయిని.

అమ్మాయి జవాబు చెప్పక ఇటూ అటూ జోగుతూ కూర్చున్నది.

ఇంట్లోని ఆడవాళ్ళందరూ పకపక నవ్వసాగారు.

"నీ బాతుపిల్లలు ఎంత పెద్దవి అయినాయి అమ్మాయి?'' అని కాంతి మళ్ళీ ప్రశ్నించాడు.

అమ్మాయి జబాబు చెప్పలేదు. ఎటువంటి బెదురూ సంకోచమూ లేకుండా మొదటి మాదిరిగానే అతనివేపు చూస్తూ కూర్చున్నధి.

కాంతికి ఏమీ బోధపడలేదు, సాహసించి మళ్ళా—

''నీ పావురము ఎలాగున్నది అమ్మాయి, దాని దెబ్బ మానిపోయిందా?" అని అడిగాడు.

ప్రశ్నలవల్ల ప్రయోజనం లేకపోయింది. దగ్గిర ఉన్న స్త్రీలందరూ అతను మోసపోయినాడని పోల్చుకున్నట్టుగా నవ్వడము మొదలు పెట్టారు.

కాంతి తరువాత ప్రశ్నించి తెలుసుకున్నాడు- అమ్మాయికి మూగి, చెవుడు అని. ఆపేటలోని పశువులూ, పక్షులూ అన్నింటికీ ఆమె మిత్రురాలట. ఆనాడు 'సుధ' అన్న పిలుపు రాగానే ఆమె ఇంట్లోకి వెళ్ళడము ఆమెకా పిలుపు వినబడికాదు, కేవలము ఊహవల్లనే.

కాంతి లోలోపల కలత చెందాడు. "ఆ అమ్మాయి నాకు లభించకపోతే జీవితములో నాకేసుఖమూ లేదని మొదటిలో అనుకున్నాడు. ఇప్పుడు ఆ అమ్మాయిని వదిలించుకొని నేను ధన్యుడనైనాను" అని అనుకుంటున్నాడు. తాను ఆ అమ్మాయి తండ్రి వద్దకు వెళ్ళి 'మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేయండి' అని అడిగి ఉంటే అతను తన ప్రార్థనానుసారము ఆ అమ్మాయిని తనకు కట్టబెటి, బాధనుండి నివృత్తి పొంది ఉండేవాడే అని తనలో తాననుకున్నాడు కాంతిచంద్ర.

అబాలిక తనకు అందని దూరములో ఉన్నంతసేపు యింది పక్కను తాను పుస్తికట్టిన భార్య ఉన్నదని అతనికి గుర్తే లేదు. మనస్సును సమాధాన పరుచుకుందామనిగాని, తృప్తిపరుచుకుందామనిగాని అతనికి కోరిక పుట్టనేలేదు. అప్పటివరకు అటువంటి అవస్థలో ఉండెను కాంతి చంద్రుని మనస్సు.

అమ్మాయికి చెవుడు, మూగి అని తెలియగానే ఆ క్షణమువరకు ప్రపంచాన్ని కప్పి ఉన్న నల్లని బురఖా చిరిగి పడిపోయింది. దూరాన ఉండే ఆశ మరింత దూరమైంది. దగ్గిర ఉన్న వస్తువు కంటికి స్పష్టముగా కనబడసాగింది. మోక్షము పొందిన వాడిలాగు పెద్ద నిట్టూర్పు విడిచి, మెల్లిగా సిగ్గుతో తల వాల్చుకొని పక్కను కూర్చొని ఉన్న వధువు ముఖమువైపు చూచాడు. ఇప్పుడు నిజమైన శుభదృష్టి జరిగింది. చర్మచక్షువు లోపల ఉన్న మనోనేత్రముపైన ఉండే మూత జారి పడిపోయింది. తన హృదయములోనుంచి బయటికి వస్తున్న వెలుతురు దీపపు కాంతిలో కలిసి ఒక కోమల సుకుమార ముఖముమీద పడి ప్రతిఫలించసాగింది. కోమలమైన లావణ్యమూ, మనోహరమైన రూప సంపదా ఆమె ముఖాన్ని ఆవరించి ఉండినట్టు కాంతిచంద్రుడికి స్పష్టముగా కనపడ్డది- నవీనుని ఆశీర్వాదము సార్థక మవుతుందని కాంతికి ఆశ కలిగింది.★

ఆంధ్ర రాష్ట్ర సమస్య

# చెన్నపురి ఆంధ్ర మహిళల అభిప్రాయం

[ఆంధ్రరాష్ట్రంలోని నిర్వివాదప్రాంతాలేగాక హైదరాబాదు మైసూరులందుగల తెలుగు ప్రాంతాలుకూడా చేర్చాలనీ, వివాదగ్రస్తమైన ద్విభాషాప్రాంతాలవిషయము నిర్ణయించడం ఒక నిష్పాక్షికమైన విచారణసంఘానికి అప్పగించవలెననీ, ఆంధ్రరాజధాని మదరాసులోనే ఉండులాగున ఏర్పాటుచేయాలనీ కేంద్రప్రభుత్వమునుకోరుతూ, ది 20—1—1953 న సుభోదయాభవనములో సమావేశమైన చెన్నపురి ఆంధ్ర మహిళలు తీర్మానించారు.]

ది 20—1—1953 సాయంకాలం 4 గం॥ చెన్నపురి ఆంధ్ర మహిళలు సుభోదయా భవనంలో శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మ ఎమ్. ఎల్.సి.గారి అధ్యక్షతన సమావేశమైరి.

శ్రీమతులు యస్. సుభద్రమ్మగారు, న్యాపతి కామేశ్వరమ్మగారు, చంద్రమతీదేవిగారు, పప్పుల లక్ష్మమ్మగారు, రాష్ట్రసమస్యనుగూర్చి ద్విభాషాప్రాంతమైన చెన్నపురిని ఛీఫ్‌కమీషనర్ రాష్ట్రముగా చేయవలసిన ఆవశ్యకతను గూర్చి, లేనిపక్షంలో ఆంధ్రులకు మదరాసులో కలుగగల అన్యాయాన్నిగూర్చి విపులంగా ఉపన్యసించారు.

అధ్యక్షురాలు తమ ఉపన్యాసములో, ఏరాష్ట్ర విభజనయైనా ఒక నిర్ణీతమైన దృక్పథంతో జరగాలి, ఏకభాషాప్రాంతాలనన్నింటినీ జేర్చే అభిప్రాయంతోనైనా జరగాలి, లేక పరిపాలనా సౌలభ్యం, సౌష్టవం కొరకైనా జరగాలి, ఇప్పట్లో కేంద్రం నిర్మించనున్న ఆంధ్రరాష్ట్రం ఇందులో ఏదృక్పథంతోచూచినా అసమగ్రముగానే ఉండబోతూ వుంది, హైదరాబాదు, మైసూరునందలి ఆంధ్రజిల్లాలన్నింటినీ ఆంధ్రరాష్ట్రంలో జేర్చిననాడుగాని, ఆంధ్రరాష్ట్రము సమగ్రమైనదై, ఆర్థికముగా పటిష్టమైనది కానేరదు, ఈ సమగ్రరాష్ట్ర నిర్మాణము జరుగువరకూ, ఆంధ్రరాజధాని మదరాసులో ఉండితీరవలసినదే, అందువల్ల కేంద్రం న్యాయబద్ధమైన నిర్ణయాలుచేసి, ఇతఃపూర్వము ఆంధ్రులు ఆంధ్రేతరులు ఎలాంటి స్నేహసౌహార్ద్రభావాలతో వ్యవహరిస్తున్నారో, అట్టి భావాలే చిరస్థాయిగా నుండుటకు సహకరించేరీతిని విభజన కొనసాగించాలనీ చెప్పారు.

ఉపన్యాసాలు ముగిసిన యనంతరము యీ దిగువ తీర్మానాలు ఏకగ్రీవంగా నామోదించబడినవి.

## తీర్మానాలు

1. ఆంధ్రరాష్ట్రమును వెంటనే స్థాపిస్తూ, మదరాసు నగరమును పరిసర ప్రాంతములతోచేర్చి ప్రత్యేక రాష్ట్రముగా నిర్మించవలెననియు, ఆంధ్ర రాజధానిని మదరాసులోనే ఉంచవలెననియు సూచిస్తూ, ఆకృషి సాఫల్యమునకుగాను ఆమరణ వుపవాస దీక్షవహించి, విలువయగు తమ ప్రాణములను ఆంధ్రమాత పాదములయొద్ద బలిదానమొనర్చిన అమర జీవి పొట్టి శ్రీరాములుగారి మరణమునకు చెన్నపురి ఆంధ్రమహిళా మహాసభవారు సంతాపమును తెలియజేయుచున్నారు.

వారు తలపెట్టిన ఆశయసిద్ధికి దీక్షతో ప్రయత్నించుటయే వారి ఆత్మకు శాంతిని సమకూర్చగలుగునని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు.

2. మద్రాసు నగరం న్యాయసమ్మతముగ ఆంధ్రులదే. ఈ పట్టణముమీద ఆంధ్రులకు సంపూర్ణ హక్కులుఉన్నవి, హక్కులు వదులుకోమని చెప్పుటలోనే ఆంధ్రులకు హక్కులున్నట్టుగా భారత ప్రభుత్వము అంగీకరించింది. రాష్ట్ర స్థాపనకు ఆంధ్రులు ఆతృతచెందుటయే మద్రాసులేని ఆంధ్రరాష్ట్రమును భారత ప్రభుత్వమువారు ఏర్పాటుచేయనున్నట్లు ప్రకటించుటకు కారణము.

ప్రస్తుతము మద్రాసు నగరములో. తెలుగువారు, తమిళులేగాక, మలయాళీలు, కర్ణాటకులు, గుజరాతీలు, మహమ్మదీయులు, మార్వారీలు, అనేకులు తమ స్వస్థానముగా చేసుకుని కాపురముచేయుచు, దాని సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడినవారు. అందుచేత, మనస్వార్థమును వదలి, అందరకు అనువగుసట్లుగా, దీనిని తెలుగు

# చెన్నపురి ఆంధ్ర మహిళల అభిప్రాయం

రాష్ట్రములోగాని, తమిళ రాష్ట్రములోగాని చేర్చకుండా, ప్రత్యేక **Chief Commissioner** రాష్ట్రముగా చేయుట న్యాయబద్ధమైనదని బహుళ ప్రజాభిప్రాయం.

కావున, యీ ప్రజాభిప్రాయమును మన్నిస్తూ, మద్రాసు నగరమును దాని పరిసర ప్రాంతములలోనుండే ద్విభా ప్రాంతములతోసహా ప్రత్యేక రాష్ట్రమును చేయవలె ననియు, ఆంధ్రరాష్ట్ర రాజధాని మద్రాసులోనే ఉంచే ఏర్పాట్లు చేయవలెననియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

3. ఆంధ్రరాష్ట్రము స్వయం సమృద్ధికలిగి, సర్వతో ముఖాభివృద్ధిని బొందవలెనంటే, ఎక్కడెక్కడ ఉన్న ఆంధ్ర ప్రాంతాలను. ఈ క్రొత్తగా నిర్మాణమగుచున్న రాష్ట్రములో జేర్చడం అత్యవసరము. గనుక, హైదరా బాదు, మైసూరు మున్నగు ప్రదేశములలోని ఆంధ్ర జిల్లాలను, ఆంధ్రరాష్ట్రముతో వెంటనే జేర్చే ప్రయత్నాలు జరుగాలనికూడా యీ సభవారు తీర్మానించుచున్నారు.

1. ఆంధ్రరాష్ట్రసిద్ధికి, విశాలాంధ్ర నిర్మాణమునకు, ఆంధ్ర అభివృద్ధిసాధన యనే ఏకఫలాకాంక్షతో సర్వ పక్షాంధ్రనాయకులు సామరస్యంతో సంప్రదించి. అన్నివిధముల వెనుకబడియున్న ఆంధ్రజాతి ఉన్నతిని సాధించి, ఆంధ్రమాత ఋణమును తీర్చుకొనవలసినదని, నాయకుల కందఱకూ యీ సభవారు విజ్ఞప్తి చేయుచున్నారు.

5. ఆంధ్రరాష్ట్రము, మదరాసు నగరమునుగురించి, ఒక మెమొరాండమును, వాంఛూగారికి సమర్పించుటకు, నలుగురు సభ్యులుగల, ఒక సబ్ కమిటీని. ఏర్పాటు చేయుటకు, యీ సభవారు తీర్మానించుచున్నారు.

శ్రీమతులు జాస్తి సీతామహాలక్ష్మమ్మగారు, సుభద్రమ్మగారు, న్యాపతి కామేశ్వరమ్మగారు, సతీతులసి గార్లతో, చెన్నపురి ఆంధ్రస్త్రీల తరఫున, శ్రీ వాంఛూ గార్కి సమర్పింపదలిచిన మెమోరాండం తయారుచేయుటకుగాను ఒక ఉపసంఘము నిర్ణయింపబడినది.



# సంక్రాంతి శుభసందేశము

ముక్కోటి ఆంధ్రుల చిరగాఢవాంఛితాన్ని తీర్చడానికి ఆత్మబలిదానం చేసిన శ్రీ పొట్టిశ్రీరాములు గారి నిర్యాణమే మన తెలుగుజాతికి ఈ సంక్రాన్తి పర్వానికి ఒక శుభసందేశం.

ఆంధ్రులలో పేరవేసికొనియుండి ఆంధ్రరాష్ట్రప్రాప్తికే ఆటంకమౌతూఉన్న అనైకమత్యదోషంమూలాన్ని ముట్టుగా నశించాలని ఆమహాతపస్వి పరితపించియున్నాడు. ఆ అనైకమత్యాన్ని బాపుకొని అందఱూ ఆంధ్రరాష్ట్రానికి దీక్షతో కృషిచేస్తే సర్వాంగసుందరమైన రాష్ట్రం ఏర్పడుతుందని ఆమహాతపస్వి పరిదేవనం చేసిచేసి కరుణావిహీనతచే కరుడుగట్టుకొనిపోయి, రాజకీయ దుస్తంత్రములలో ఆరితేరిన అస్వార్థపరుల సలహాలనే నమ్మి బిగుసుకుపోయిన నాయకుల దమననీతికి ఆహుతి అయిపోయినాడు. అఖిలాంధ్రప్రజకు ఇది తరతరాలకు తీరనిలోటు.

ఏ ఆశయసిద్ధికోసం ఆమహానుభావుడు తనప్రాణాలనుసైతం అర్పణచేసివేసినాడో. ఆయైకమత్య సిద్ధికోసమూ, ఆ సమగ్రాంధ్ర రాష్ట్రసాధనకోసమూ ఆంధ్రులంతా నిరంతరకృషితో అస్తమిస్తూ, అస్తమిస్తూ సూర్యభగవానుడు తమ యందప్పగించి వెళ్ళిన కర్తవ్యాన్ని నిర్వహించిన సందె దీపములవలె ఇప్పటికైనా మేల్కొని శ్రీ శ్రీరాములు గారు వదిలి వెళ్ళిన కర్తవ్యభారాన్ని సక్రమంగానిర్వహించడానికీసంక్రాంతి శుభసమయంలో ఆంధ్రులంతా దీక్షబూనాలి.

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

[లోగుట్టు 48-వ పేజీ తరువాత చదవండి]

అందులో ఇలావుంది "సరలక్ష్మీ, నేనూ ఇక్కడ హాయిగా ఉన్నాము. చిన్న అత్తయ్యను మరీ మరీ అడిగానని వ్రాయమన్నది. వాళ్ళ ఇంటిదగ్గరా వేరే యెవరూ లేకపోవడంవల్ల పురిటికి మనవూరే తీసుకురావాలనుకుంటున్నాను- మరో ఆరునెల్లకిలే! నువు ఏమంటావ్ పిన్నీ?" ఇదీ అతగాడు పిన్నికి వ్రాసిన ఉత్తరం.

బాబాయి చదువుకుని ప్రక్కనేపిల్లను జడవేసుకుంటున్న పిన్ని ఒళ్ళో వేసికొట్టాడు. పిన్ని ఉత్తరం చదువుకున్నది... తనకళ్ళు తానే నమ్మలేకపోయింది. "పురిటికి తీసుకవస్తా" అనేమాట చదువుకునే సరికి ఆవిడ ఒళ్ళు జలదరించింది. ఆలోచించి అంతా అర్థం చేసుకుంది ...... నవ్వొకుంది... "అందుకే ఇంత హడావుడి చేశాడు. లోగుట్టు ఎవరికి తెలుస్తుంది మరి? చూశారా ఎంతకొంటె పని చేశాడో కొడుకు?" అన్నది బాబాయితో.

జనవరి 29న విడుదల!

వస్తూంది! అశోకా పిక్చర్స్ వారి

# నాచెల్లెలు

జి. వరలక్ష్మి.. సూర్యకళ..
అనసూయ.. కోటిరత్నం..
బలిజేపల్లి. అమర్‌నాధ్..
రామశర్మ. చలం
పండితరావు.
గణపతిభట్.

నటించినది





మాటలు... పరశురామ్.
పాటలు. ప్రయాగ.. కొమ్మూరి.. బి.వి.ఎస్. రంగా..
సంగీతం.. సి.యస్. పాండురంగన్...
స్టూడియో.. రేవతి...



KRISH

దర్శకుడు... చిత్రపు నారాయణమూర్తి. బి.ఏ.

# ★ ముందుమార్గం ★

శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావు.

గాంధీమహాత్ముని సత్యాగ్రహయుద్ధంలో పాల్గొన్న ఒక సైనికుడు మాత్రమే సత్యనాధరావు. అతను పేరు ప్రతిష్ఠలకోసం ఆ ఉద్యమంలో చేరలేదు. ధర్మచింతన వల్లా, ధర్మమే జయించాలన్న పట్టుదలవల్లా ఆ ఉద్యమంలో చేరేడు. 1942 లో 'భారతదేశం విడిచిపొండి' సంక్షోభంలో జైలు శిక్షను పొందేడు. జైలునుంచి వచ్చినప్పుడైనా అతని మెడను పూలదండలు అలంకరించలేదు. ఆఖరికి పత్రికలలో పేరేనా పడలేదు.

సత్యనాధరావు స్థితిమంతుడుకాడు, పెద్దచదువు చదివినవాడు కాదు. ప్రాపకంలేదు. పైగా ధ్యానము, తపస్సు అంటాడు. పొలంమీద వచ్చే గింజలు తిండికే చాలవు. నిత్యజీవనం ఇబ్బందిగాఉంది. అది రోజురోజుకు భారమవుతూంది.

అతని భార్య సుగుణవతి బుద్ధిమంతురాలనే చెప్పాలి. కాని భర్త యొక్క అభిప్రాయాలన్నింటికీ బుర్ర ఆడించదు. ఉన్నపరిస్థితులలో వీలైనంతమట్టుకు గడుపుకొనిపోతుంది. అంతగా మినుమిక్కిలయితే మనస్సులో మాటను మాత్రం దాచిపెట్టదు. ఇంటిలో ఫలానా వస్తువు లేదని ఆమె భర్తతో అనగా, అతను 'మన మొక్కళ్ళమేకాదు. కోట్లకొలదిమంది లేమిని అనుభవిస్తున్నారు! మనమెంత : మనబతుకెంత !' అంటాడు. కార్యక్రమంలేని ఉపవాసాలు తప్పవు :

ఇరుగు పొరుగు అమ్మలక్కలు తమ ఆధిక్యతను వెల్లడించుకొని ఆనందించుకోక మానరు. 'సుగుణవతికి ముక్కుపుడకేనా లేదమ్మా !' అని ఒకర్తె, 'చెవులకు గుడ్డిదుద్దుల జతేగాని మరొకటి లేదని' ఇంకొకరు 'మెడలో ఒక్క నానుపేటేనా లేద'ని మరొక ఇల్లాలు, 'ఇప్పుడిన్నిన్ని రకాల మంచి మంచి చీరెలు, రవికెల గుడ్డలు వస్తూంటే చక్కగా కొనుక్కోరాదా?' అని వేరొకసుందరి, ఈ మోస్తరుగా ఎవరో ఒకరు, ఏదో ఒకటి అనక మానరు. కాని సుగుణవతి ఏ జవాబూ చెప్పదు. కడుపులోనె దాచుకొంటుంది. కాని అవి ఇమడక భర్తముందు ఎప్పుడో ఒకప్పుడు భళ్లున ఇవతలపడతాయి.

ఆరోజున తగినంత కారణంలేదు, అగ్నిపర్వతం బద్దలయింది.

"మీచేతితోటి మీరు ఆఖరికి, ఇదిగో నీకు ముక్కుపుడక అనేనా చేయించిన పాపాన్ని పోయేరా?" అంది సుగుణమ్మ.

"సరే ! ఇప్పుడామాట ఎందుకు వచ్చింది?" అని తెలియగోరేడు భర్త.

"ఉన్నపాటివాళ్ళు చూడండి, ఎలాగు దిగవేసుకొని, చాతీవిరుచుకొని తిరుగుతున్నారో?" అంది సుగుణవతి.

"స్త్రీకి పాతివ్రత్యమొక్కటే భూషణమని చాలాకాలం క్రిందటే మహాభారతంలో చెప్పేడు. సరే ! అదట్లాగుంచు ! ఎక్కడేనా పాతొక్కటి ఉందనుకొన్నావా పెల్లగించుకొని రావటానికి !" అన్నాడు భర్త.

"ఏమీ ! చక్కగా ఏదో కోమటికొట్టుమీద గుమాస్తాపని చేసుకోరాదూ?"

ఇప్పుడు రోజులు తినో తినకుండానో గడిచిపోతున్నాయా లేదా?

"ఆదా ఏమిటి బతుకిక్క ! కడుపుకి ఇంత లగ్గు తినగానె సరా : గౌరవముండాలి! మూసివాయనం ముత్తయిదువులాగు చేసిపెడితే ఏమిగౌరవముంటుంది!"

"నగలు నగలో అంటావుకాని నగలవల్ల ఉండే ప్రమాదాలు నువ్వు గ్రహించినట్లు కనబడదు. ఒకరోజు వేషానికి గడ్డాలు, మీసాలు తెగగొరుక్కున్నాడని సామెత. రోజులు బాగుండకపోతే బుర్రబద్దలవడం ఒకటి, నగ లెత్తుకుపోవడం రెండు, ఒకేసారి రెండు శిక్షలు :"

"మీలాటివాడే ఎవడో పరుగెత్తలేక బలాదూరన్నాట్ట!"

"నేనొక మాటడుగుతాను చెప్పుమా. ఇంతకీ నగలు నాణేలు ఎవరుచూసి సంతోషించడానికి ?"

"అదంతా నాకు తెలియదు. వాళ్ళు వీళ్ళు చూసి సంతోషించడానికా లేక ఇంటిలోవాళ్లు చూసి సంతోషించడానికా? ఇంటిలోవాళ్ళు చూసి సంతోషించడానికే అనేమాటుంటె,

అవి లేకపోయినా కూడ నాకు సంతోషమే!" అన్నాడు సత్యనాథరావు నవ్వుతూ.

''సిగ్గులేని మొహానికి నవ్వే సింగారమంట!'' ''ఈమాత్రం ఎరగరుకాబోలు వేసుకొనేవారంతా'' అంది సుగుణవతి.

అది తెగని వాదం.

సుగుణవతి తన వాదనలోని న్యాయాన్ని బలపరచ డానికి ''ఆడపిల్లలు, వాళ్ళు ఆ పట్టు పరికిణీలు కొనుక్కున్నారు. వీళ్ళు ఈ పట్టు జాకెట్లు తొడుక్కున్నారు అని ఒకటేపోరు పెడుతున్నారు. ఆఖరికి వాళ్ళకి శాటిన్‌వేనా కుట్టించి పారెయ్యడానికి గతిలేకపోయిందా?" అని ప్రశ్నించింది.

"ఎందుకు? వాళ్ళకి గౌనులున్నాయికదా?''

''ఇప్పుడు గౌనులు తొడగడం ఫాషన్‌కాదు. పరికిణీ, జాకెట్టు కట్టుకుంటున్నారు ఎవరుపట్టినా!''

ఫాషన్లు అన్నవి డబ్బున్నవాళ్ళకిగాని నీబోటివాళ్ళకి నాబోటివాళ్ళకికావు. నాకేమేనా ఫాషన్లు ఏడిచేయేమో చూడు! బట్టలువేసుకోవడం అందంకోసంకాదు. మానం కాపాడుకోడం కోసం'' అన్నాడు భర్త.

భార్య ఆమాటలు పెడచెవినిపెట్టింది. ఎవరి ఓపిక కొద్దీ వారు వాదించుకొని ఆరిపోయిన చిచ్చుబుడ్లలాగు ఊరుకొన్నారు.

సత్యనాథరావుకి అదొక పెద్ద సమస్య అయింది. "నా ఆదర్శాలకోసం భార్యాపుత్రులను బలిదానం చెయ్యడం మంచిదా కాదా? నిజంగా ఆమె నా ఆదర్శాలతో నూటికి నూరుపాళ్ళు ఏకీభవించదు. ఆమాటకివస్తే లోకంలో ఏ ఇల్లాలూ నూటికి నూరుపాళ్ళు భర్తతో ఏకీభవించదు. కాబట్టి అది ప్రశ్నేకాదు. నేను సంపాదించలేదు, సంపాదించలేదు అని కదా అంటుంది. నాకు సాధ్యమైనంత మట్టుకు కుటుంబపోషణ చేస్తూనే ఉన్నాను. అంతకంటె చెయ్యలేను. నాకు దేశసేవ అతి ముఖ్యం. అటువంట ప్పుడు భార్యా పుత్రులు, నేను, రెండో పక్షమే! కాని తెలుగుదేశంలో ఎవ్వరికీ అక్కరలేని దేశసేవ నీకు మాత్రం ఎందుకయ్యా అంటే, నేను నా అంతరాత్మ ప్రబోధాన్ని విడిచిపెట్టను. స్వలాభ పరాయణత్వంలో మునిగిపోను. నాకు సంఘక్షేమం ప్రధానం. ఎవరు నన్ను చెయ్యవద్దంటారు? ఇప్పుడు నేను ఆఖరికి నా భార్యమాట లైనాచెవినిపెట్టను!'' అనిఅనుకొన్నాడు. ఇంతటిలోఅతనికి వెనక తన జాతకంచూసి, జ్యోతిష్కుడు చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చేయి. 'నా జాతకంలో కంచుకాగడా పెట్టి వెతికినా ధనసంపాదన లేదట! ఏ మనిషి జాతకంలోని ముఖ్యాంశమైనా ధనసంపాదనయేనట! నాది దుష్టగ్రహాలు పట్టి పీడిస్తున్న జాతకమట! ఆఖరికి వట్టి దరిద్రగొట్టు జాతకమని స్థిరపరిచేడు. డబ్బుసంపాదన ఒక్కటే జీవి తాదర్శమని తేల్చేడు. సంఘం ఎంత అధోగతిలో ఉన్నా, దేశం ఎంత అధోగతిలో ఉన్నా మనం చెయ్యవలసిన పని ఆత్మలాభమే అన్నమాట! దేశసేవ, సంఘసేవ, త్యాగం, సత్యవాక్పరిపాలనం, తపస్సు వీటి అన్నింటిమాట ఏమిటి? ఈమనుష్యులకు వ్యష్టి దృష్టేకాని సమిష్టి దృష్టిలేదు. తాను ముఖ్యం కాని సంఘం ముఖ్యంకాదు. ఇటువంటి సంకుచిత దృష్టిగల మానవులున్న సంఘానికి అభివృద్ధి ఎక్కడిది? అజ్ఞానపు ఆశయాలవల్ల దేశం అధోగతికి పోతూంది'' అంటూ సత్యనాథరావు గోండ్రించేడు.

పెరుగు మనిషి, కూరల మనిషి బాకీ డబ్బులిమ్మంటూ గుమ్మందగ్గిర నిల్చున్నారు. అతను త్వరలోనే బాకీలు తీరుస్తానని సమాధానం చెప్పి పంపించేశాడు.

అప్పులవాళ్ళు రాకవల్ల నిత్యజీవితంలోని బాధలు మూర్తీభవించినట్లుగా కనిపించేయి. ''ఈ బాధలు భరించ రానివి! ఇవి లేకుండా గడిచే మార్గం కనబడదు. బతుకు తీరినప్పుడే ఇవి తీరేటట్లు కనబడుతుంది. నిత్యజీవితం లోని బాధలు తీరడం కోసం ఏదేనా ఉద్యోగంలో చేరదా మంటే, దేశసేవ ఉదరపూజగా రూపొందుతుంది. వీటి బాధచూస్తే తట్టుకోడానికి సాధ్యం కావడంలేదు! హే పరమేశ్వరా!" అని విచారించేడు.

కిందటివారం స్వపట్టణమైన విజయవాడకి పొరుగు గ్రామంమీద కమ్యూనిస్టులు జరిపిన దాడి సంగతి జ్ఞాపకా నికి వచ్చింది. 'ఆ దాడిలో అయిదుగురు అమాయకపు గ్రామస్థులను తుపాకులతో కాల్చి చంపేరు, పదివేల రూపాయల సొత్తును దోచుకుపోయేరు. మనుష్యుడు! సోదర మానవుల ఎడల ఎంత దారుణంగా ప్రవర్తించేడు. కొందరి రాజకీయాదర్శాలు ఎంత వికార రూపం దాల్చేయి!'' అని విచారించేడు.

# ముందు మార్గం

సత్యనాధరావు స్నేహితులైన పరమేశ్వరం, వాక్పతి వీధి గుమ్మందగ్గరకి వచ్చి కేక వేసేరు. సత్యనాధరావు దుస్తులు వేసుకొని బయటికి వచ్చేడు. అందరూ కలిసి ఊరిబైటికి షికారు పోయేరు. అక్కడ పచ్చని చేలగట్ల మీద కూర్చున్నారు.

"రాజకీయ బాధితుణ్ణి అంటూ ఒక దరఖాస్తేనా పారేశావుకాదోయ్ నువ్వు!" అన్నాడు వాక్పతి సత్యనాధ రావుని చూసి.

"నన్ను దరఖాస్తు పెట్టనిచ్చి తీరా వాళ్లు కాదని తోసి వేస్తే! 'ధనమూ పాయెను, మానమూ చెడెను' అనే తిరుపతికవుల పద్యం జ్ఞాపకానికి వస్తుంది. నేను సహాయానికి తగిన వాణ్ణని తోచితే వాళ్ళకి, ఏ ప్రార్ధనా అక్కర లేకుండానె పని జరుగుతుంది!" అన్నాడు సత్యనాధరావు.

"అడిగితేగాని అమ్మేనా పెట్టదని శాస్త్రం!" అన్నాడు వాక్పతి.

"పోనీ అని శాసనసభల ఎన్నికలకేనా అభ్యర్థిగా నిలబడ్డావుకాదు?" అన్నాడు పరమేశ్వరం బాధగల మనస్సుతో.

"ఏమీ? అభ్యర్థులు లేక దేశం గొడ్డుపోయిందనా? డిపాజిట్లుకూడ ధారవోసుకోడానికి సిద్ధపడినవాళ్ళుండగా మధ్యని నేనుకూడ ఎందుకు? దండగ! ఎవ్వరూ పోటీ చెయ్యని సత్కారమేదేనా చేసుకోరాదూ?" అన్నాడు సత్యనాధరావు.

"ఈకాలంలో ఎవ్వడూ పోటీ చెయ్యనిపని ఒక్క తపస్సే!" అన్నాడు వాక్పతి.

"నీ ఉద్దేశం, ఇటు సంసారం, తప్పితే అటు ముక్కు మూసుకు కూర్చోడం. అంతేగాని మరొక దారి లేదనా?" అని అడిగేడు సత్యనాధరావు.

"ఔను!" అన్నాడు వాక్పతి.

"సాంఘిక సేవ అనే ఉత్తమమార్గమొకటుంది. ప్రతిఫలాపేక్ష లేకుండా దేశాన్ని బాగుచేయవోయ్ ప్రబుద్ధుడా!" అన్నాడు సత్యనాధరావు.

"అది చెప్పినంత సులభసాధ్యం కాదు నాయనా!" అన్నాడు వాక్పతి.

"ఆమాట నిజమే! బహు కష్టసాధ్యమైనది. దానికి తగినట్లుగానె సంఘం మీద ఫలితాలుకూడ అమోఘం! అంతకంటె మంచిపనేముందోయ్!" అన్నాడు సత్యనాధరావు.

"కాకపోయినా అధర్మం మహా ప్రబలంగా ఉందంటే నమ్ము. పైగా నీలాగు సంఘసేవ చేస్తాననేవాణ్ణి వట్టి పిచ్చివాడిగాకట్టేస్తారు నలుగురూ!" అన్నాడు పరమేశ్వరం

"దానినిబట్టి చూసుకో మనుష్యుల ఆలోచనలు ఎంత అపసవ్యంగా ఉంటున్నాయో? అజ్ఞానం ఎంత ఆవరించి ఉందో? నారాయణ అంటే బూతుమాటగా ఉంది! ఇటువంటి దుర్దశలో ధర్మప్రచారంకంటె మరొక ఉత్తమమైన పనిలేదు బాబూ!" అన్నాడు సత్యనాధరావు.

"మధ్యని మనకి ఈ హిందీ గడబిడ ఒకటి వచ్చి పడింది కదా!" అన్నాడు వాక్పతి.

"మనకి అన్నీ ఒకలాగే దాపురించేయి, పతితజాతికి ఉండవలసిన అవలక్షణాలన్నీ పూర్తిగా పట్టేయి. హిందీ మనదేశభాషలను కబళించడానికి సిద్ధంగా ఉంది. సంస్కృత భాషను తొలగించి తాను ఆస్థలం ఆక్రమించుకోవాలని చూస్తూంది. హిందీ కనక గెలుపొందితే, హిందీ ఇతర దేశభాషలను దిగమింగినట్లే. హిందీయులు మనని అన్నివిధాల అణగద్రొక్కక మానరు. అది మానవలక్షణం, దానిని 'కాదు, పోదు' అంటే అయేదేమీలేదు కాబట్టి మనం ఆత్మరక్షణ చేసుకోవాలి. హిందీని అవతలకు తరిమి వెయ్యాలి. సంస్కృతాన్ని రాజభాషగా స్థిరపరుచుకోవాలి" అన్నాడు సత్యనాధరావు.

"నీ అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను" అన్నాడు పరమేశ్వరం.

"ఔను!" అన్నాడు వాక్పతి.

"నీ ప్రచారం దిగ్విజయంగా జరుగుగాక అని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను" అన్నాడు పరమేశ్వరం.

"తథాస్తు!" అన్నాడు వాక్పతి.

సంధ్య చీకట్లను చీల్చుకొంటూ తూర్పువైపున చంద్రబింబం ఆకాశం మీదికి పాకుతూంది. చల్లని గాలికి చెట్లు ఆనందించి గలగలమని చిరునవ్వు నవ్వుతున్నాయి. చీకట్లు వదలి వెన్నెల వ్యాపిస్తూన్నందుకు పక్షులు కలకలిస్తున్నాయి. మిత్రులు ఇంటికిపోదామని లేచారు.





# రెండవ పెళ్లి



• శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవి •

అందరి బలవంతాన ఆ పెళ్ళికి ఒప్పుకున్నాడు శర్మ. పెళ్ళి అయాక అంతా తలా ఒక మాటా అన్నారు. ఇద్దరూ రెండవ పెళ్ళికి తగ్గట్టుగానే ఉన్నారనీ, శర్మకంటె సత్యవతి పెద్దదిగానే ఉందనీ, నెరిసిన తలా, ముడతలు పడిన ముఖం, ఈదుతున్నట్టు నడిచే శరీరం 40 ఏళ్ళు నిండినదేగాని చిన్నది కాదని అందరూ అనే మాటలు శర్మ చెవిని పడుతూనే ఉన్నాయి.

"నీ కొత్త పెళ్ళాం పదేళ్ళు కాపరం చేసినదే అంటూంది రత్తమ్మ" అన్నాడు శర్మకి చాలా దగ్గిర స్నేహితుడు. మాట్లాడకుండా జరిగినది తల్లికి చెప్పి ''ఎంత ధైర్యం! నాముందే అంటున్నారు'' అన్నాడు కలవర పడుతూను.

శర్మ ఇంట్లో ముగ్గురూ మూడు రకాలు. శర్మ తల్లికి 70 ఏళ్ళు నిండినా చాదస్తం మనిషిగా కాక కొడుకు సుఖాన్నే కోరే ఓర్పుగల తల్లి. ఆమెలో ఏ సమయంలో కోపంగాని నోటివెంట యెటువంటి దుర్భాషలుగాని రావు. అంత ఉత్తమురాలు ఉండబోదంటారు అందరూను. శర్మకి తల్లిపోలికలు ఉన్నా ఇతరుల మాటలు పట్టించుకుని బాధపడి ఇంట్లో కాస్త చర్రు బుర్రుమంటూ ఉంటాడు. సత్యవతి చాల చిత్రమయింది. ఏవిషయంలోగాని తనే ఆదర్శ మహిళనని ఆత్మస్తుతి చేసుకుంటూ ఉంటుంది. చిన్నపిల్లలా చలాకీగా ఉండాలని చింపిగా పీచులాగా వేళ్ళాడే జట్టుకి పెద్ద సవరంతో ముడివేసి ముఖంనిండా ఇంత స్నో, పౌడరు మర్దించి వింతగా తయారవుతుంది. ఆమె వేసిన వేషం శరీరానికి అతక్కుండా ఏదో పగటి వేషంలా పట్టిస్తుంది. లేసు పావడా, ఉలిపిరి చీరె, ముఖానికి బొట్టు ఉన్నా లేనట్టుగా కనపడే ఆ ముఖం విచిత్రంగా ఉంటుంది. సత్యవతిని చూట్టానికని ఇరుగూ పొరుగూ తరుచు ఇంటికి రావటం చూసి శర్మ విసుక్కునేవాడు. అందరూ నవ్వుకోటం చూసి అత్తగారు కించపడేది.

ఉదయం లేచింది మొదలు సత్యవతికి అందర్నీ వంకలు పెట్టడంతో సరిపోతుంది. ఏపనిచేసినా తనకు తానే సరి అంటుంది. అన్నీ వింటూన్న అత్తగారు ఏం మాట్లాడదు.

''అదేమిటి అత్తయ్యా పేడిమూతి వేసుకుని అలా ఉన్నాడు అతను?"

"తప్పు తప్పు అలా తీసిపారెయ్యకు. ఆయన గొప్ప కవి. ఎంత మంచి పుస్తకాలు వ్రాశాడో తెలుసా?"

''ఏం వ్రాశాడోగాని ఆముఖం ఘోరం"

"అతనెలా ఉంటే నీకేం? ఇందాకటినించీ వింటున్నాను ఏవిటా వాగుడు. దవడపళ్ళు రాలుతాయి జాగ్రత్త!" అంటూ శర్మ బయటికి వెళ్ళిపోయాడు.

ప్రతీరోజూ ఉదయం లేచింది మొదలు ఆ ఇంట్లో అన్నీ ఇలాటి గొడవలే. శర్మ ఎన్నిమాటలు అన్నా ఎవరు ఎంత నవ్వినా ఏమయినా సత్యవతికి ఏవీ అంటవు.

"వద్దు వద్దు అంటే నామెడకి ఈ బండని అంట కట్టావు. తల ఎత్తుకు తిరగలేక చస్తున్నాను" అన్నాడు అమ్మతో.

"అంతా నీకు కావలసినట్లు ఎలాఉంటారురా, మతి పోయిందా ఏం? అయినా నువ్వు సరేఅన్నాకనే పెళ్ళి చేశానుగాని........ పోనీగానీ అన్నం పెడతారా, ఆఫీసుకి వేళయిందే మోను...."

''అదే నేనూ అనేది 70 ఏళ్ళు నిండిన నీకు వంట ఇల్లు తప్పలేదు. దాన్ని చెయ్యమను. నువ్వు సుఖపడేది ఇంకెప్పుడమ్మా! నామాట విను. నువ్వలా కూచుని చేయించు"

"దానికేం చాతనవును? నీకూ సుఖంలేదు. నాకూ సుఖంలేదు. ఇద్దరికీ దీన్నించి బాధలే. ఏరి తెచ్చుకున్నావు. నాకు అన్నం వద్దు, తంటాలుపడకు. హోటల్లో తింటాను'' అంటూ శర్మ కాగితాలకట్ట చేత్తోపట్టుకుని తల్లి పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

అంతా వింటూన్న సత్యవతి కూనిరాగం తీస్తూ అక్కడక్కడ నెరిసిన తలవెంట్రుకలకి కాటుక పూస్తూ అద్దంలో ముఖం చూసుకోడం ముసిలావిడచూసి వంట ఇంట్లోకి వెళ్ళి దేవుడిముందు కూచుని దణ్ణం పెట్టుకుంది.

*　　　*　　　*

"ఒరేయి, భోగీ పండుగనాడు ఇంటిపట్టున లేనేలేవు. ఇవాళన్నా ఉండరా. నీ పెళ్లాం చాలా పిండివంటలు చేస్తూంది. ఇవాళ సంక్రాంతి అన్నమాట మరిచేపోయావా" అన్న తల్లి మాటలకు శర్మ జవాబు చెప్పకుండా బయటికి వెళ్ళి పోయి, రాత్రి 9 గం|| రావటంచూసి తల్లి చివాట్లు పెట్టింది.

"రోజూ నాకు పండగే" అంటూ శర్మ గదిలోకి వెళుతుండగా పళ్ళెంనిండా పిండివంటలతో సత్యవతికూడా కొడుకు వెనకాలే వెళ్ళి తలుపు వెయ్యటంచూసి ముసిలావిడ ఖంగారు పడింది.

*　　　*　　　*

శర్మ మారిపోయాడు. సత్యవతి కొంగుపట్టుకొని కూడా కూడా తిరుగుతూ ఉండడం తల్లి కనిపెట్టింది. తెల్లారి లేచింది మొదలు సత్యవతి ముస్తాబయి పౌడరు వాసనలతో అటూ ఇటూ విసురుగా తిరుగుతూ ఉండడం శర్మ "సత్యా" అంటూ వెనకాలే తిరగడం చూసి తల్లి తెల్లబోయింది.

ఆరోజు ఉదయం శర్మ వంటింట్లోకి వచ్చి మండుతూన్న పొయ్యిని చూస్తూ,

"సత్యకి జ్వరంగా ఉంది, కాఫీ చేసి తీసుకురా" అంటూ వెళ్ళిపోయాడు. ఏపని చేయడానికీ చేతులు ఆడక, కూచున్న చోటునించి కదలడానికి శక్తిలేని తల్లి దగ్గిరిగా వచ్చి, "నిన్నే అమ్మా వినపడిందా, గొంతుక ఆరిపోతూంటే ఇంకా లేవేం?" అన్నాడు.

నీరసించి ముడతలుపడిన ఆ ముసలితల్లి అమ్మా అన్న పిలుపుకి తన్మయురాలయి కొడుక్కీ కోడలికీ కాఫీ గ్లాసులు పట్టుకొని, గదిలోపలికి వెళ్ళింది. కోడలి కాళ్ళు పిసుకుతూన్న శర్మని చూడగానే కళ్లు చెదిరి, కాళ్లు తడబడి వణుకుతూన్న చేతుల్లోని గ్లాసు కిందపడవేసింది. శర్మ తల ఎత్తి "ఇప్పుడే కన్ను మూసింది, రాత్రంతా నిద్రన్న మాటలేదు. ఏం తెలియదుకదా నీకు" అంటూ ఉండగా, సత్యవతి కళ్ళు తెరచి అత్తగారిని చూసి మండిపడుతూ ఈవిడతో పడలేను మీరే తీసుకురాకూడదూ!" అంది.

"ఏం అందమే తల్లీ! మహామారి. నా కొడుకుని బలి తీసుకున్నావా! అదేంపనిరా. కాళ్లు పిసుకుతున్నావు? నిన్నలా చూడలేను. లేచి రారా నాయనా!" అంటూ వణికిపోతూన్న శరీరాన్ని మెల్లిగా కదిలిస్తూ బయటికి వచ్చేసింది.

రోజులు గడుస్తున్నకొద్దీ శర్మ ఇంట్లో చాల మార్పులు వచ్చాయి. శర్మ ఆఫీసుకి శెలవుపెట్టి, పురిటి రోజులికి దగ్గిరే ఉండాలనే ఆముద్రాతో సత్యవతి దగ్గరే ఉంటున్నాడు.

తల్లిమాత్రం పుట్టెడు దిగులుతో రోజులు లెఖ్ఖపెడుతూ మంచంమీదే ఉంటూంది. ముసిలి తల్లిని పలకరించే తీరిక కూడా లేకపోయింది శర్మకి. సత్యవతికి ఏనిమిషాన్న ఏంకావాలో చూసుకుంటూ, కోపం రాకుండా వెయ్యికళ్లతో కనిపెడుతూ, భార్యచుట్టూ తిరగడటమే శర్మకి నిత్యజీవనం అయింది.

"అదేమిటిరా! పప్పు రుబ్బుతున్నావు? చివరికి ఈ ఆడారి పనికూడా నువ్వు చేయవలసివచ్చిందా! ముందర అక్కడ్నించి లేచిపో, రత్తమ్మ పిన్నిని పిలుస్తాను" అంది అమ్మ.

"సత్యకి గారెలు తినాలని ఉందిటమ్మా, ఎవరు చేస్తే వాళ్ళు! నువ్వు ఉండీ లేనట్లే, దమ్మిడీ సహాయం నీవల్ల నాకు లేదు" అన్నాడు శర్మ.

"అవునులే, నేనుండీ లేనట్లే, నువ్వు ముందు ఆరోటి దగ్గిరనుంచి లేచి వెళ్లు. అయ్యో! అయ్యో! నేను చూడ లేనురా" అంటూ కన్నీళ్ళతో కొడుకుని లేవతీస్తూ ఉండగా "చూడలేకపోతే పొండి, మా తిప్పలు మేం పడతాం. ఎవ్వరూ మాజోలికి రాకండి. అంతే" అంటూలేచింది సత్యవతి.

"పాపిష్టిదానా! వాడిచేత పాడుపనులన్నీ చేయిస్తావా, ఆడతనం ఎక్కడా కనిపించని నీముఖం ఎంత అందంగా వెలిగిపోతోందే!" అక్కసు పట్టలేక అన్నది శర్మ తల్లి.

"ముందు బయటికిపోవే ముసిలిదానా పో" అంటూ సత్యవతి తల్లిని తోస్తూ ఉంటే శర్మ మాట్లాడకుండా ఊరు

కోడంచూసి తల్లి గొల్లున ఏడ్చింది. రత్తమ్మ ఒక్కపరుగున వచ్చి ముసిలావిడని లాక్కుని తీసుకువెళ్ళింది.

పక్కఇంట్లో ఉన్న తల్లి సంగతి కాస్తన్నా విచారించకుండా శర్మ పూర్తిగా సత్యవతి సేవలో పడిపోయాడు, ఊరు ఊరంతా ఆశ్చర్యపడిపోయారు. ఇష్టంవచ్చినట్టుగా డబ్బు ఖర్చుపెట్టి ఇల్లంతా నౌఖర్లతో నింపి సత్యవతిని అందలంలోపెట్టి పూజిస్తున్నాడు.

*　　*　　*

ఆరోజు అమావాస్య. శర్మకి కొడుకుపుట్టేడు అన్నారు. రత్తమ్మని చూసి రమ్మంది తల్లి. రత్తమ్మ సరేనని అన్నదేగాని ఆ ఇంటివైపు వెళ్ళలేదు. శర్మ వచ్చి పిలుస్తాడని గుంటలుపడిన కళ్ళని పెద్దవి చేసుకుని ఎటు ఎవరువచ్చినా కొడుకే అనుకొని ఆతురతగా చూసింది ఆ తల్లి.

పుట్టిన పిల్లవాడికి నామకరణ మహోత్సవం వైభవంగా చేశాడు శర్మ. తల్లిని పిలుస్తానని అంటే సత్యవతి వద్దన్నదని వెళ్ళినవాళ్ళు చెప్పుకున్నారు,

"ఇంతకీ పిల్లవాడు ఎలా ఉంటాడమ్మా?" అన్నది శర్మ తల్లి పొరుగావిడతో.

"అమ్మా ! ఎంత ఆశ ! వెళ్ళి చూసిరామ్మా. కొడుకు నిన్ను పిలవాలా ఏమిటి?" ముసిలావిడ మరి మాట్లాడకండా పక్కమీద ముడుచుకుని మూలుగుతూ పడుకుంది.

*　　*　　*

ఆరోజున సంక్రాంతి. అందరూ పండగ ఆనందంలో ఉన్నారు. ముసిలావిడ మాత్రం ఏవో జ్ఞాపకాలతో కన్నీళ్లు పెట్టుకుంటూ కూచుంది,

''చూడు శర్మా ! అమ్మకి కొత్తగా చీరెలు లేవు. పదిరూపాయలు యిస్తేచాలు. ఏవన్నా తెస్తాను. అన్నం పెట్టకపోయినా గుడ్డన్నా ఇవ్వటం నీధర్మం'' అన్నది రత్తమ్మ.

''ఏం ! రాసులు పోసుకుని కూచున్నామా ! మాకు తగ్గ ఖర్చు మాకూ ఉంది. వెళ్ళు వెళ్లు''అన్నది సత్యవతి.

''నిన్ను అడగందే ;''

"ఏం ! నేనూ ఆయనా వేరు అనుకున్నావా నడూ అవతలకి.''

''మాట్లాడవేం శర్మా ! ఇదేనా నీ మర్యాద?''

"వెళ్ళవమ్మా వెళ్ళు, ఎవరుచెబితేనేం. ఆముసిలిదానితో నువ్వూ ఊరేగు" అంటూ శర్మ భార్య అందించిన గిన్నె అందుకుని బియ్యం కడుగుతూంటే, రత్తమ్మ నోటిమాట రాక కొయ్యబారి నిలబడిపోయింది. కడిగిన బియ్యం గిన్నె సత్యవతికి అందిస్తూ 'నాదగ్గిర దమ్మిడీలేదమ్మా ! వెళ్ళు' అన్నాడు శర్మ.

'ఏమే సరసూ ! కొత్తచీరె కట్టుకునిరా' అంటూ దాసీదానివైపు చూసి నవ్వుతూ రత్తమ్మ వైపుచూసి గర్వంగా విసురుగా లోపలికి వెళ్ళిపోయింది సత్యవతి. రత్తమ్మ కాళ్లు తడబడుతూ తొందరగా వెళ్ళింది.

ఆసాయంత్రం జనంఅంతా శర్మ ఇంటి ముందర చేరారు. ఎవరిచేతిలో ఏపనులున్నా అన్నీ అలా పారేసి పరుగెత్తుకువస్తున్నారు. ఆ జనంమధ్యన మీసాలు మెలివేస్తూ గర్వంగా అందర్నీచూస్తూ,

'నేను వాళ్ళింటి ఎదురుగాఉండే సోమయాజులుగారి కారు డ్రయివర్ని. మొగుడు సరిగ్గాలేడని నాతో సరసాలు ప్రారంభించి అందరికళ్ళూ కప్పి, నన్ను ఇంటికే రప్పించుకునేది. నెల తప్పగానే ఏదేశమన్నా వెళ్ళిపోదాం అన్నది. వాళ్ళవాళ్ళు ఇంట్లోంచి పొమ్మంటున్నారని ఏడ్చింది. నిజం అనుకుని నాకున్న పొలం కాస్తా అమ్మి డబ్బు తేవటానికి వెళ్ళి వచ్చాను. నాకళ్ళలో ఖారంకొట్టి ఇక్కడికి వచ్చి కాపరం పెట్టింది. జాడతెలిసేసరికి నాపని అయిపోయింది. పోతే పోయింది గాని ఆ పిల్లవాడిని నాకిప్పించండి. వాడు నా కొడుకు, ఇదిగో దాని ఉత్తరం'' అంటూ అందరికీ చెప్పిందే చెబుతూ మీసాలు తిప్పుతూన్న అతన్ని చూసి వేసిన తలుపులు తియ్యమన్నాడు ఒకాయన. దాసీది తలుపు తియ్యగానే,

''ఇచ్చెయ్యవమ్మా పిల్లవాణ్ణి, అవమానం ! చూస్తావేం శర్మా ! ఇచ్చెయ్యి'' అన్నాడు ఇంకొకాయన.

శర్మకి తలతీసినట్లయింది. జనంమధ్యనించి తోసుకుని పిచ్చివాడిలా రత్తమ్మ ఇంట్లో దూరాడు. తల్లిని వెతుక్కుంటూవెళ్ళి ఆమె మంచంమీద పడి పసివాడిలా గొంతెత్తి ఏడ్చాడు. తల్లి కొడుకును లాలిస్తూ ''మన ఖర్మ, కళ్ళ నీళ్ళు పెట్టకు, రత్తమ్మా శంభుశాస్త్రికి చెప్పి ఏదో

ఏర్పాటు చేసెయ్యమను. అగొౌతవ వినపడకుండా తలుపు వేసెయ్యి" అన్నది.

అలజడి జరిగి అల్లరి అయి అంతా తలాదారిని వెళ్లాక అర్ధరాత్రి వేళ శర్మని తీసుకుని ఇంట్లోకి వెళ్ళింది ముసిలావిడ. రత్తమ్మ సామాన్లన్నీ సర్దింది.

తెల్లారగట్ల బండీ ఆగగానే తల్లిని ఎక్కించి శర్మ కూడా బండీ ఎక్కాడు. సామాన్లన్నీ రత్తమ్మ అందించింది.

తెల్లవారగానే ఊరు ఊరంతా శర్మని అవమానం చెయ్యాలని వచ్చారు. ఖాళీగా ఉన్న ఇల్లుచూసి ఎక్కడి వాళ్ళు అక్కడ నిలబడిపోవటంతో "ఎక్కడికి పోయారో నాతోనన్నా చెప్పారుకాదూ! కాని కాలం కాకపోతే పున్నమ్మ పిన్నికి ఇన్ని కష్టాలా?" అన్నది రత్తమ్మ. చేజేతులా చేసింది కొడుక్కి రెండవపెళ్ళి. అన్నారు అందరూ ఒక్కసారిగా.

★

# ★ గతమంతా ★

శ్రీ వసంతరావు రామకృష్ణరావు

గతమంతా కన్నీరోడ్చిన
బాధామయ మానవజీవన
మార్గంలో చెలరేగిన వికృత
విషమ విషాద విషాగ్నులు !
హాలాహల దావానల జ్వాలలలో
బడబానల కీలలలో
మానవుల మహాశయాలు
ఎన్నో శిధిల మైపోయినవి !

గతియించిన కాలపుగనిలో
కదలించిన చీకటి గడిలో
ప్రతి నిత్యము చెలరేగిన
కార్చిచ్చుల ఆహుతిలో
బలియై పోయిన మానవ
జీవులు వినిపించిన విషాద గానం
కవి హృదయంలో లేచినవిప్లవ
లేఖిని రచియించిన వికృతరూపం !

లోకానికి చాటేసత్యం
కలకాలం నిలిచేవిషయం !
" గతమంతా రక్తప్లావిత
రచనలతో నిండినగ్రంథం "
జీవితమంతా విషమాస్పద
కఠిన సమస్యలతో నిండినగ్రంథం
గతమంతా మానవగాథలు
రచియించిన రక్తాక్షర రూపం !

చెడిపోయిన మానవ సమాజపు
భవితవ్యము నిలిపినతేజం !
రణసంఘర్షణ భీభత్సంలో
నశించిపోయిన వీరులకథనం !
గతమంతా కన్నీటి చరిత్రల
స్మృతిరేఖలలో పొడచూపిన
విదళిత వ్యథా హృదయాల
వింత వికృత చిత్రరూపాలు !

గతమంతా భగ్నజీవుల
అగ్ని పర్వతములలో
లావాచెలరేగిన ఘట్టాలు !
విశ్వాంతర వీధులలో ఎండిన
మానవుల ఎముకల ప్రోగులు !
యుద్ధ పిశాచపు కబంధహస్తంలో
ఇప్పటికీ వినిపిస్తుందొక
కన్నీటి కెరటాల కఠినగీతం !

ధనవంతులు బలవంతులు
ఘనమైన సమాజంలో
అన్యాయం ఆపద దుఃఖం
సంఘర్షణ—చావులు—తప్పవు !
స్వర్గానికి నిచ్చెనవేసే
స్వర్ణయుగపు తొలి ఉషస్సుకై
పులకించిన మానవులంతా
సమరాంగణ సంఘట్టనలో
ఉష్ణరక్తపు మహాకాసారంలో
పడిపోయి బలియైపోయిన
విప్లవాత్మక చరిత్ర చెపుతూంది !
"గతమంతా మానవమేధస్సు,
సాగించిన కర్మతపస్సు
జీవితాన్ని కప్పిన అంధతమస్సు"

శతాబ్దాల జగతీవలయంలో
శ్రమజీవుల సంఘాలెన్నో
చిందించిన రక్తబిందువులు
భావిజీవిత వైభవాకృతిలో
కనుపించినవి సంకెలలెన్నో !
పిడికిళ్లెత్తిన దోపిడీలకు
తలలొగ్గిన మన పీడితప్రజ !
ఆపివేసినది మన పురోగతి !
గతమంతా విషాదపూరితం !
జీవితమంతా కన్నీటికెరటాల ఉద్ధృతం !

కథానిక :

# అనుకోని.... సంఘటన

రచన : ధవళ నాగేశ్వర్

సముద్రంనుండి గాలి ప్రశాంతంగా వీస్తూంది. ఒడ్డున కూచుకుని పైకి లేస్తూన్న కెరటాలవైపు చూస్తున్నా. నా హృదయంలో యేవో తెలియని కెరటాలు బయలు దేరేయి. ఆరునెల్ల క్రిందట యీ స్థలంలోనే జరిగిన సంఘటనను నా అంతరాత్మ ప్రభోధిస్తూంది. బరువైన హృదయంతో నడుస్తున్నా. నా నీడలో యేవో జాడలు.

అవి నేను క్రిందటి సంవత్సరం యీ వూర్లోనే బి. ఇ. డి. ట్రయినింగ్ అయ్యే రోజులు. నా లాడ్జి కెదురింటిలో నున్న పదహారు సంవత్సరాల శారద నన్ను చూచి అర్థంకాని నవ్వులు నవ్వితే వాటికి నా హృదయంలో పువ్వులు వికసించేవి. నవయౌవనంలోఉన్న నాలో ఆ చిఋనవ్వులు యెంతగానో ప్రతిబింబించేవి.... యేవేవో పిచ్చి పిచ్చి ఊహలు నాలో రేకెత్తి క్షణిక మాత్రం తన్మయుణ్ని చేసేవి.

ఆమె హైస్కూల్లో స్కూలుఫైనలు చదివేది. ఆమె నాతో తఋచు చనువుగా మాట్లాడుతూ, తనకు తెలియని సమస్యలు నన్నడిగి తెలుసుకుంటుండేది. నా ట్రైనింగ్ పూర్తవడం, ఆమె పరీక్షలు గడచిపోవడం ఒకేసారి జరిగేయి. నాతో తఋచు మాట్లాడినంత మాత్రాన నన్నామె ప్రేమిస్తోందని యెలా అనుకోగలను?

సముద్రపుటొడ్డున కూర్చుని నా భావిజీవితాన్ని ఊహించుకుంటూ గాలిలో మేడలు కడుతున్నా. జాలారులు చేపలు పట్టుకున్న సంతోషంతో తిరిగి వస్తున్నారు. ఒక జాలారి పెద్దచేపను పట్టాడని కొంతమంది వింతగా చూసున్నారు. కాని యేకాంతంగా ఉన్న నేను మాత్రం చలించలేదు. ఆ సముద్రపు టిసుకలో వయ్యారంగా, గాలికి జారిపోతున్న తన పమిటను సర్దుకుంటూ నడుస్తూంది శారద వంటరిగా. ఆమెను చూడగానే నాలో యేవో మధురభావాలు........

నాతో తఋచు మాట్లాడినంత మాత్రాన నా హృదయాన్ని యెలా విప్పి చెప్పడం? నడుస్తున్నా. జోరుగా నడుస్తున్నా. శారదను సమీపించాను. ఆమె చిరునవ్వు విసరింది. ఆ నవ్వే ...

ఆనాడు నాకంత ధైర్యం ఎలా వచ్చిందో నాకే తెలీదు. ఆమె మృదువైన....హస్తాలు !!

కాని....ఫలితం....వెలవెలబోతూన్న వెన్నెల్లో అర్థం కాని బాధతో నిండిన శారద ముఖం చూడలేకపోయా.... బరువైన హృదయాలతో మౌనంగా పదిగంటలకు ఇళ్లకు చేరుకున్నాం. కాని నాకు నిద్రపట్టితే ఒట్టు.

"రాత్రి పదిగంటలవరకూ యేం చేస్తున్నావ్?" అని శారద యింట్లోంచి ఒక గొంతుక వినబడగానే నా శరీరం కంపించింది. "మా క్లాసుమేటు నిర్మల నన్ను సినీమాకు రమ్మని బలవంతం చేసింది. నీతో చెప్పడానికి టైములేక అలా వెళ్ళిపోయాం" అని సమాధానం.... మిగిలిన మాటలు స్పష్టంగా వినిపించలేదు.

తెల్లవారింది. నాలో యేదో అర్థంకాని బాధ. శారద నన్ను కనీసం తలెత్తిఅయినా చూడలేదు. నేను కనపడగానే తలదించుకొని యింట్లోకి వెళ్లేది. ఆమెలోకలిగిన మార్పు నాకర్థం కాలేదు. నాలుగు రోజులు గడిచాయి. మా వూరికి బయలుదేరాను. సామాన్లు బండీలో వేసి ఎదురింటి వైపుచూశాను. శారద నావైపు దిగులుగా చూస్తోంది గుడ్లలోనీళ్లు నింపుకుంటూ. "వెళ్తున్నా" అన్నట్లు ఆమె వైపుదీనంగా చూశా. "నాలో వలపు తలపుల్ని రేకెత్తించి నా శీలాన్ని చెఋచి వెళుతున్నావుకదూ ! వెళ్ళు" అన్నట్లుగా ఆమె చెక్కిళ్ళమీద నుంచి జారుతున్నాయి అశ్రువులు.

నా స్మృతి పథంలోంచి శారదను తప్పిద్దామనుకున్నా. కాని ఫలితం శూన్యం. నేను పరీక్షల్లో కృతార్థుడనయ్యేను. దసరావరకు మా పల్లెలో గడిపిన తర్వాత నేను బి.ఇ.డి. చదివిన విశాఖపట్నంలోనే ఉద్యోగంలో ప్రవేశించా. మరల నేను బీచికి రాగానే నా హృదయంలో యేవో

తెలియని కెరటాలు బయలుదేరేయి. శారదా వాళ్ళు మూడు నెలల క్రిందటె యీ ఊరు విడచిపోయారని తేలింది, ఆనాటినుంచీ శారదని మఱచిపోడానికి ప్రయత్నిస్తున్నా.

పండగ శలవలకి మా పల్లె చేరాను. పండగ నాలుగు రోజులు హాయిగా దొర్లిపోయాయ్. ఇంట్లో నా పెండ్లి విషయమై గుసగుస లాడుకుంటున్నారు. శారద నన్ను మఱచి ఉంటుంది. ఆమె యెవరికో అంకితమై యుంటుంది కూడా, నేను మాత్రం మఱవలేను. ''పిల్లని చూడ్డానికి వెళ్ళమంటే నేను వెళ్ళనని మంకుపట్టి కూర్చున్నావు. వాళ్లే పిల్లని తీసుకుని మనింటికొచ్చారు. త్వరగా తయారయి వీధి గదిలోకి రా;'' అన్న మా అమ్మమాటలకి త్రుళ్ళిపడి లేచాను. ఆమె యెలాగ ఉంటుందో? చదువుకుందో ... లేదో.... ?? అని యేవేవో పిచ్చిఊహలతో పావుగంట మొహం రుద్దుకుని .... మంచి బట్టలు కట్టుకుని అద్దం దగ్గర కెళ్ళాను.

అద్దంలో కనిపించేది నాప్రతిబింబంకాదు. అమాయకపు శారద కన్నీటి వదనం. ఆనాటి సంఘటన నాకళ్ళకుకడుతోంది. దుప్పెన నావైపు వింతగా చూస్తూంది. "ఇక సింగారం చాలు త్వరగా దయచేయండి;" అన్న మా చెల్లి మాటలు విన్నాక యీప్రపంచంలోకి వచ్చా.

వీధి గదిలో చాలా మంది పెద్దలు కూర్చున్నారు" పెండ్లి కొడుకొచ్చేడు" అని ఎవరో అన్నారు. అంతా నావైపు ఓరగా చూస్తున్నారు. మధ్య నున్న పెండ్లి కుమార్తె నన్ను చూసింది.

ఆశ్చర్యం....!! .. ఆశ్చర్యం!! ... నాకళ్ళమీద నాకే నమ్మకం లేకపోయింది. "శారదా"....అన్నా పిచ్చిగా.... ఆమె సిగ్గు తో తల దించుకుంది. అంతా నోరావలించుకు చూస్తున్నారు.

★



ఋతు, కాల, భావానుగుణంగా రాగాల సృష్టియే భారతీయ గానకళావైశిష్ట్యం. ప్రతి రాగం ఒకభావాన్ని, ఒకకాలాన్ని స్ఫురింపజేస్తుంది. రాగాలకాలం భావస్ఫురణలకు అనుగుణంగా రూపొందించబడిన చిత్రాలు యుగయుగాలనుంచి ప్రచారంలోవున్నవి. అకాల రాగాలాపన గానమాధుర్యాన్ని నశింపజేస్తుంది.

## తేనీరు

రాత్రింబగళ్లలో ఎప్పుడైనా, ఎలాంటి స్థితిలో వున్నా, తేనీరు ఉత్తేజం కలిగిస్తుంది.

## భైరవి

పై చిత్రం సాంప్రదాయసిద్ధమగు భైరవి రాగ భావ ప్రకటన. తన నాథుడగు శివుని సమాగమమునకు తపించుచున్న పార్వతి స్థితిననుసరించి నిర్మించిన ఉషస్సమయ శ్రావ్య సంగీతమది. కాని, సమాగమము నిశ్చితమని తెలిసి, అణచి యుంచిన ఉత్సాహమే ఈ రాగంలో స్ఫురించే భావం.

# మిత్రుని కోసం

• శ్రీ గులపల గోపాలరావు •

సుశీల ఎప్పుడూ ఏదో ఒకటి చదువుతూంటుంది. ఆమె అన్ని సుగుణాల్లోనూ, అన్నిటికన్నా అందంలో తక్కువన జనాభాకంటె తను ఎక్కువ అని అనుకుంటుంది. కాని ఆవిషయాన్ని బయటకి తెలిపించక పోవడమే ఆమెలోని గొప్పతనం. సుశీల పుస్తకాల గది విడిచిపెట్టిన దినము లేదు. ఆమె పినతండ్రి యీవిషయానికి లోలోన ఆనందాబ్ధిలో మునిగి తేలుతూ సుశీల భవిష్యత్తులో గొప్ప కవయిత్రి అవుతుందనుకుంటాడు. నిజానికి సుశీల అతని అభిప్రాయంతో ఏకీభవిస్తుంది.

సుశీల ఒక వికసించిన గులాబిపువ్వు. ఆపువ్వులోని పరిమళం, అందరినీ తనవయిపుకు ఆకర్షిస్తుంది. కాని, ఆపువ్వు వున్నది ముండ్లచెట్టులోనని, దానిని కోయాలంటే అంత సులభమైనపనికాదనీ పువ్వును చూచేప్పుడు సాధారణంగా ఎవ్వరికీ మనసుకురాదు.

సుశీల పుట్టినప్పటినుండి తన పిన్నిగారింటిలో వుండేందుకు కారణం లేకపోలేదు. ఆవిడకు సంతానం లేకపోవడం ఒకకారణమైనప్పటికీ, సుశీలలోని ఓ ప్రత్యేకత సుందరమ్మను ఆకర్షించింది.

అప్పటినుండి సుశీల సుందరమ్మ దగ్గిర పెరిగి పెద్దదయింది. ఆయింట్లో సుశీల ఆడినదే ఆట. పాడినదేపాట. సుశీల మాటకు ఆయింట్లో ఎవ్వరూ అడ్డుచెప్పరు. ఈ అధికారం చిన్నప్పటినుండీ వున్నది. దీపములేని ఆఇంట్లో సుశీల ఓశాణ విఘృష్టరత్నము.

ఉదయం ఎనిమిది గంటలయింది. సుశీల పుస్తకాల గదిలో కూర్చొని చదువుకుంటోంది. అప్పుడు సుశీల చెల్లెలు పద్మ ఆగదిలోకొచ్చి "అక్కాయ్! నిన్ను అమ్మ పిలుస్తోంది. రావే"అంది.

"ఎందుకే? ఇప్పుడేగా అక్కడనుంచి ఒస్తూంట? "

"ఏమిటో అక్కాయ్, నిన్ను రమ్మంటుంటేను...." అంటూ పద్మ ఇంకో పుస్తకాన్నితీసి తిప్పుతూ అక్కడ నిలుచుంది, ఇంతలో సుందరమ్మ అక్కడకు వచ్చింది.

"ఇదిగో ఒచ్చేస్తున్నానమ్మా" అంటూ సుశీల లేచి సుందరమ్మతో గూడ వంటింట్లోకెళ్లింది.

"ఏమిటమ్మాయ్, ఉదయాన్నుండి ఎన్ని పుస్తకాలు చదివావ్ " అని నవ్వుతూ పినతండ్రి హరినారాయణ వంటింట్లోకొచ్చాడు.

"సుశీల ముందుపిల్ల కాదండోయ్. దగ్గరకెళ్లేందుకే భయమేస్తోంది మరీయిప్పుడయితే" అన్నది సుందరమ్మ నవ్వుతూ.

వాస్తవంగా సుశీల అంటే సుందరమ్మకు గాని హరినారాయణకి గాని చెప్పలేని గౌరవం. ఆగౌరవాన్ని సుశీల తగుమైన నడవడికలచేత అధికపరచు కుంది.

"పిలుపు ఒచ్చేంతవరకూ నీకు ఆకలనేది వెయ్యదా అమ్మాయ్"అన్నది సుందరమ్మ సుశీలని వుద్దేసిస్తూ.

"ఇప్పుడే ఏంటయిమయిందనమ్మా.! ఇంకా ఎనిమిది దాటలేదు గూడాను"అన్నది సుశీల.

ఫలహారము పూర్తిచేసుకొని సుశీల పుస్తకాల గదిలో కొచ్చింది. మధ్యాహ్న మయింది. పద్మ సుశీల గదిలో కెళ్లింది. పుస్తకపఠనంలో నిమగ్నురాలైయున్న సుశీల పద్మను చూచి ప్రేమపూర్వకంగా చిన్ననవ్వు నవ్వింది. సుశీలకు పద్మఅంటె అమితమైన ప్రేమ. సుందరమ్మకు, హరినారాయణకు సుశీలంటే ఎలాగో, పద్మఅంటే సుశీలకు ఆలాగు. అందువల్లనే పద్మగూడ సుశీలతో వుంటుంది. పద్మ సహజంగా మాట్లాడుతూంటే ముద్దులొలుకుతూంటుంది. పద్మపలుకుల కోసరం సుశీలఎప్పుడూ ఎదురు చూస్తుంటుంది. కాని పద్మను అనవసరంగా మాట్లాడించదు. పద్మ ఎదురుగా కుర్చీలో కూర్చుని సుశీల వైపుచూస్తూ, "అక్కాయ్, నిన్ను అమ్మ పిలుస్తోందే" అన్నది.

"ఎందుకు పద్మా ? "

"ఎవరోవస్తే సూటువేసుకుని, అమ్మా, నాన్న ఏవేవో మాట్లాడారు. మర్లా రేపొస్తామని వెళ్లిపొయ్యారక్కాయ్. అమ్మ అన్నది, అతను మనబావఅని. అవునా అక్కాయ్?" అంటూ పద్మ సుశీల ముఖంలోకి అమాయకంగా చూస్తూ అడిగింది. సుశీలయేమీ జవాబు చెప్పకుండా పద్మ ముఖంలోకి చూస్తూ వూరుకుంది. సుశీలకు పద్మ మాటల్లోని

నిజం అర్థమయింది. "అక్కాయ్, మనబావ ఎంతబావున్నా డనుకున్నావ్ ? సిల్కుచొక్కా వేసుకుని .... అక్కాయ్, బావ నడిగి నాకూ అలాంటి సిల్కుగౌను కుట్టించవే" అంటూ పద్మ కుర్చీలోంచి లేచి సుశీలవళ్ళో కూర్చుంది.

సుశీల సిగ్గుతో కాస్సేపు తలవంచుకుని, "పద్మా నువ్వు వెళ్ళి ఆడుకో, తర్వాత వస్తువుగాని'' అంటూ పద్మను బయటికి పంపించి తను ఊహాప్రపంచంలో మునిగి పోయింది.

సుశీలకు యీడు వచ్చినప్పటి నుండి హరినారాయణ తగుమైన భర్త కోసం వెదికాడు గాని కుదరలేదు. ఇప్పుడు ఒకమనువు వచ్చింది. వెంకట్రావు బి. ఏ. ప్యాసయ్యాడు. బాగా అందంగా వుంటాడు కూడాను. ఆస్తిపాస్తులకూ తక్కువలేదు. ఈసంబంధం హరినారాయణకూ, సుందర మ్మకూ నచ్చినప్పటికీ సుశీల తల్లిదండ్రుల యిష్టంలేనిదే వారుమాట యివ్వలేక పోయారు. అంచేత వారితో "ఇప్పుడు ఏసంగతీ చెప్పను వీలుకాదండీ, ఎందుకైనా పిల్ల తల్లీ,తండ్రీ వున్నారుకదా. ఓమాటు మేం అక్కడ వున్నప్పుడు ఒచ్చారంటే ఏసంగతీ యిముడ్చుకోవచ్చు, మీరు ఇక్కడేగా వుంట, రేపొక్కసారి రండి అబ్బాయి గారితో గూడ''అని చెప్పి పంపించారు.

సుశీలకు యీవిషయం తెలిసింది. మనస్సులో యేదో ఆరాటం బయలుదేరింది. ఇన్నిరోజులు బ్రతికినందువల్ల తనకేమీ అనుభవము కలగలేదు. ఇకమీద జీవితంలో పట్ట బోయే కుస్తీలోనే తనకనుభవం కలగాలి. ఆకుస్తీ తనకను కూలముగా వుండెనా సరి, లేదా ఆనాటితో ఆమె అంత్యాను భవమును పొందాల్సిందే. అప్పటినుండి సుశీల రేపుకొరకు ఎదురు చూస్తూండింది.

మరునాడు వెంకట్రావు తండ్రితోసహా వచ్చాడు. సుశీల పుస్తకాల గదిలోనుండి వెంకట్రావును తదేక దీక్షతో పరిశీలిస్తూవచ్చింది. అతని సంభాషణల వల్ల అతని లోతు కనుక్కుంది.

తనకు సరైన భర్త యీతడే అనుకుంది. తనకు అదృష్టంలేనిదే యిటువంటివాడు చిక్కడనుకుంది. మనసులో నిన్న కలిగిన ఆరాటం తగ్గింది. తలుపుమూసి పుస్తకాన్ని తెరిచింది. కాని పుటలు తిరగలేదు. చదివిన పంక్తే చదువుతుంది కాని అది చదివిన పంక్తేనని గాని, తను ఎక్కడ చదువుతున్నదని గాని సుశీలకు తెలియలేదు.

ఇంతలో పద్మ తలుపు తెరచుకుని గబగబ లోనికి వచ్చి "అక్కాయ్. చూడవే మనబావ యీరోజు పచ్చ సిల్కు చొక్కా వేసుకువచ్చాడు. ఎంత బావుందనుకు న్నావ్! నాకూ అలాంటిదే ఓగౌను కుట్టించ మనిచెప్పవే" అంటూ మారాంచేసింది.

"అరవమాకు. అక్కడ మాట్లాడుతుంటేను'' అంటూ సుశీల పద్మను బెదిరించింది.

"కాస్సేపటికి బావ వెళ్ళిపోతాడే, నువ్వు యిప్పుడేవచ్చి చెప్పవే నాకలాంటి గౌను కుట్టించమని''

"ఇదిగో పద్మా, రేపు కొట్టుకెళ్ళి అంతకంటే మంచి పచ్చసిల్కు గౌను కొనిపెడతా. ఇప్పుడువెళ్ళి ఆడుకో" అంటూ పద్మను సమాధానపరచి పంపించింది.

కాస్సేపటికి వెంకట్రావు తండ్రితోసహా లేచాడు. ఇంతలో ఎక్కడో ఆడుకుంటున్న పద్మ గబ గబా వచ్చి వెంకట్రావు లాగు పట్టుకుని గట్టిగా ''అక్కాయ్, సరీగ్గా యిలాంటిదే కుట్టించిపెట్టాలి. బావా, రేపు నువ్వూ వస్తావ్ కొట్టుకు'' అంటూ పద్మ వెంకట్రావ్ ముఖంకేసి చూస్తూ నిలుచుంది. వెంకట్రావు కిదేమీ అర్థంకాక ప్రశ్నార్థకంగా చూస్తూ నిలుచుండిపోయాడు. చేతిలో వాచీ ఎంత సేపటికీ టిక్కుటిక్కుమని సెకండులనే చూపిస్తోంది. అక్కడ పుస్తకాల గదిలోనుండి యీదృశ్యాన్ని చూచిన సుశీల ముఖం సిగ్గుతో పాలిపోయింది,

"అదికాదు బావ, అక్కయ్యతో సరీగ్గా యీలాంటిగౌనే కుట్టించి పెట్టమంటే సరేనన్నది. రేపుకొట్టుకు నేనూ అక్కయ్యా వెడతాం. బావా, రేపువెడితే పచ్చ గౌన్లుంటాయా? "

"ఓ. గౌన్లు వుంటాయి. నేను కొనిపెట్టనా?"

''అయితే నాకు రెండు పచ్చగౌన్లు కొనిపెట్టాలి"

"సరేలే"

"ఒసేవ్, దానికప్పుడే బావంట, పచ్చగౌన్లు కావాలంట ఈడ్చుకెళ్ళవే" అంటూ హరినారాయణ నవ్వుతూ సుంద రమ్మ కేసిచూచాడు. అప్పుడంతా పకపకా నవ్వుతూంటే పద్మకు యేమీ అర్థంకాక వారితో కలిసి పకపకా నవ్వింది. వెంకట్రావు సెలవుపుచ్చుకుని తండ్రితోసహా వెళ్ళి పోయాడు.

# మిత్రుని కోసం

హరినారాయణ రైల్వేస్టేషనుకెళ్ళి ఒకబొక్సు రిజర్వు చేసివచ్చాడు. సుశీలకు తెలుసు ఇప్పుడు తండ్రిదగ్గరకు వెడుతున్నది ఎందుకని. సామానుల్తోసహా స్టేషను చేరుకున్నారు, రైలు కూతవేసింది. దానితోపాటు సుశీల హృదయమూ మెల్లగా కూసింది. ఆశబ్దం లోపలనే ప్రతిధ్వనించింది. సుశీల హృదయంలో ఏదోఒక ఆశాబీజము మొలకెత్తినటులున్నది. అది పెరిగి మహావృక్షమయేందుకు కావలసిన ఆహారసదుపాయాలను సమకూర్చుకునే భాధ్యత సుశీలపైనున్నది.

"ఏమేవ్! ఇంతకూ మనఅమ్మాయిని అడిగి కనుక్కున్నావా? "

"ఏమిటీ? "

"ఆవిషయం "

"ఆఁ, ఇహప్రత్యేకంగా అడిగేదేంటిలెండి. మనిషిని చూడగానే తెలుస్తుంటేను " అంటూ సుందరమ్మ సుశీల వైపు చూస్తూ జవాబిచ్చింది.

"పోండి పిన్నిగారు. మీరుమరీ వేళాకోళం చేస్తున్నారు నాకిప్పుడే పెళ్ళి అక్కర్లా "

"అదేంమాటే. ఇంత వయస్సయి పెళ్ళి ఒద్దంటున్నావ్. ఇంకఎప్పుడు చేసుకుందామని నీఅభిప్రాయం?" అన్నది సుందరమ్మ కండ్లు సగంమూసుకొని సుశీల వైపు చూస్తూ.

"ఒసేవ్, మొదట్లో నువ్వూ ఇలాగేలేవే. పెళ్ళి వొద్దు వొద్దనిఅంటూ. తీరా ముడిపడింతరవాత గప్‌చిప్‌గా చేసుకోలా ? అప్పుడు చెప్పావ్ నువ్వు నాకు పెళ్ళిచేయ్ పెళ్ళిచేయ్ అని" అన్నాడు హరినారాయణ భార్యవైపు చూచి నవ్వుతూ.

ఈమాటకు సుశీల, సుందరమ్మ పకపకా నవ్వారు. రైలువెళ్ళి వేరేస్టేషనులో ఆగింది. పద్మ కిటికీవంక చూస్తూంటే ఏదో జ్ఞాపకం వచ్చింది.

"అక్కాయ్, ఇంకాఎప్పుడే కొట్టుకెళ్ళడం? బావ కూడ వస్తానన్నారుగా"

"ఛీ. ఇదెక్కడి పిల్లమ్మా, ఎవరినోపోయి బావ బావ అని ఉడికించిపోస్తోంది"అన్నది సుశీల పద్మ వీపుమీద మెల్లగా తట్టి.

"చిన్నపిల్లకేంతెల్సుననీ నువ్వు మరీను. ఇదిగో పద్మా అక్కయ్యగాని పెళ్ళి చేసుకుంటే అప్పుడనాలి బావ అని. లేదంటే తప్పుసుమా ! ఏం ? "

"మన అక్కయ్య ఎవరిని చేసుకుంటుందేం ?"

"ఎవర్నేంటి చేసుకునేది. పెళ్ళిలోచూడు నీకే తెలుస్తుంది." అన్నది సుందరమ్మ.

"అయితే అమ్మా, మనఅక్కకి ఎప్పుడే పెళ్ళి?"

"రేపు"

"అప్పుడు బావ ఒస్తాడా ? నాకురెండు పచ్చగొన్లు కొనిపెడతానన్నాడే. అక్కాయ్. ఆపచ్చగొను ఏట్లామెరుస్తుందనుకున్నావ్! నాబొమ్మకికూడ ఒకటి కొనుక్కుంటా"

"సరేలే, ఊరుకో-అదనంగా ప్రేలమాకు."అంటూ కాస్త కోపంవచ్చినట్టు మాట్లాడింది సుందరమ్మ. దాంతో పద్మ గప్‌చిప్‌గా అణిగిపోయింది. రైలు గాలిని చీల్చుకొని పొగలుగ్రక్కుతూ పోయింది,

శ్రీనివాసరావంటే ఆవూళ్లో అందరికీ గౌరవం, అతని జమీందారీలోనే చాలామంది బ్రతుకుతున్నారు. సుశీల పిన్నమ్మ దగ్గరనే పెరుగుతున్నప్పటికీ అప్పుడప్పుడూ తండ్రిదగ్గరకు వచ్చిపోతుంటుంది. ఆవూళ్ళో ఆడవారందరికీ సుశీలంటే అంత గౌరవమూ, ప్రేమాను. అందుచేత యీనాడు సుశీలను చూడ్డానికీ వచ్చారు, ఇల్లంతా ఒకేకలకలంతో నిండిపోయింది. సుశీలను గూర్చి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా అభినందించి ఎవళ్ళయిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

వారువచ్చి యిప్పటికి ఒకవారం రోజులయింది. సుందరమ్మకు ఎదిరింటి కామాక్షమ్మతో స్నేహము కలిసింది. ఇద్దరూ ఎప్పుడూ ఏదో పిచ్చాపాటి మాట్లాడుతుంటారు.

ఆరోజుకూడా సుందరమ్మ ఎప్పటికిమల్లే కామాక్షమ్మ దగ్గరికెళ్ళింది.

"సుందరమ్మ గారూ, మీసుశీలదేవికి ఎన్నేండ్లుంటాయేమిటి?" అని అడిగింది కామాక్షమ్మగారు.

# మిత్రునికోసం

"అదేమిటండీ ఆలా అడుగు తున్నారు. అయిదో జాతరకి ఆరునెల్లుందనగా పుట్టింది. ఇహజాతరకి ఆరునెల్లుందనుకో వరసకి. ఎంతయింది? అయిదుమూళ్ళపదిహేను పైన ఓరెండు. పదిహేడేళ్ళేకదండీ.''

"మరేంలేదులెండి. అడిగానంతే. సరేగాని ఆ పెళ్ళి విషయమేమిటో అన్నారు. మరిఆవూసే ఎత్తేరుకారు. ఇంతకూ ఏమయినట్టు?"

''అందుకనేగా మేమూ యిక్కడకొస్త. మా అక్కయ్యతోనూ, బావతోనూ మాట్టాడాం. ఇంకనూ విషయం తేల్చుకోలేదులెండి. ఇదోఇదో అంటే ఎలాగైనా ఇంకో ఏడాదన్నా పడుతుంది గదండీ"

''అవున్లెండి. ఇదేమన్నా తమషా ఆటన్నా కాదుమరి అవసరపడి చేసేందుకు. అందరూ పదికాలాలపాటు క్షేమంగా వుండాలికదా!"

''అందుకనే కదండీ మెల్లగా యోచిస్తూంట''

"సరేలెండి"

''ఇదిగో కామాక్షమ్మగారూ, ఇప్పుడువచ్చిన సంబధం చూశారూ ఎటుచూచినా మనకు బాగానేవుంది. పిల్లాడా ఏదో పెద్దచదువు చదివినవాడాయెను. ఆస్తిపాస్తులకంటే తక్కువా లేదు. ఆ కుటుంబానికంతా మగనలుసంటూ వుండేది వాడొక్కడాయెను. అందరికీ వాడంటే మహాప్రీతి. ఇకమన అమ్మాయికి అలాంటి చోట్లయిస్తే ఏంకొదవచెప్పండి''

''అవున్లెండి. ఇదంతా చూసిగాని మరీయివ్వాలి. అసలే ఆడబిడ్డాయెను."

"అందుకేగదమ్మా నేనూ యింతదూరం చెపుతూంట. ఇంతకూ అసలు మనుషులు వారు కదా వారు యిష్టపడితేనేకదా''

"ఆఁ, ఎందుకిష్టపడర్లెండి' అంటూ ఆవేపుతిరిగి ''ఇంతకూ అదృష్టమనేది వుండొద్దూ'' అంటూ కామాక్షమ్మ నిట్టూర్చింది.

కాస్సేపు యిద్దరూ వూరుకున్నారు. ఇంతలో సత్యనారాయణ పెయింటు బాక్సు ఒకచేత్తో చిత్రాన్ని, ఒకచేత్తో పట్టుకుని యింట్లో ప్రవేశించాడు. సుందరమ్మ సత్యనారాయణ్ణి పదేళ్ళముందు చూచింది. అంతటితో యిప్పుడు చూడ్డంచాత గుర్తించలేక పోయింది.

''కామాక్షమ్మగారూ ఆ అబ్బాయిగారెవరండీ?'' అని మెల్లగా అడిగింది సుందరమ్మ.

"ఇదేంవిడ్డూరమమ్మా, అప్పుడే మరిచిపోయారా? మా అబ్బాయిగారండి"

''ఆ, ఆ, ఎంతమాటండి, పదేళ్ళప్పుడు చూచితినాయెను. మరి మీ అబ్బాయిగారు ఆనవాలు లేకండా మారిపోతే ఎలాగ చెప్పండి'

''అవున్లెండి. ఎప్పుడూ ఒకేలాగుంటారా ఎవ్వరైనా?''

"అందుకే గదండీ యీఅవస్థవచ్చి పడింది. ఇంతకూ కామాక్షమ్మగారూ, మీఅబ్బాయిగారేమి చేస్తున్నట్టు?"

"మాఅబ్బాయి చిత్రాలుగియ్యడం నేర్చుకున్నాడండి''

"అదీ మంచిపనేలెండి. కామాక్షమ్మగారూ, మరినే వెళ్ళొస్తా" అంటూ సుందరమ్మలేచి యింటికొచ్చేసింది.

[సశేషం]

**కథానిక:**

# లోగుట్టు.

• శ్రీ ఘట్టి కృష్ణమూర్తి •

నాన్న చెప్పినమాట నిస్పృహ కలిగించింది; బాబాయ్‌తో సంప్రదిద్దామని బయటకువచ్చేశాడు ప్రభాకర్. బాబాయ్ దగ్గిరవున్న చనువు నాన్నదగ్గిరలేదు. బాబాయ్‌తో తను ఏవిధంగానైనా వాదించగలడు. నాన్నమాట వినడం తప్ప ఆయనకు ఎదటబడి సమాధానంచెప్పి యెరగడు.

అన్నయ్య దగ్గిర అసలే చనువులేదు. మొదణ్ణించీ—చదువుకుంటున్న నాటినుంచీ—అన్నయ్య అంటే భయమే. మనస్సువిప్పి అంతగా మాట్లాడడు. నిజానికి అది భయమూ కాదు. మరి, మనసులోని యీ మూకీభావానికి అర్థం ఏమిటో అతనూ చెప్పలేడు.

తను ఇంటిదగ్గిరవుండి నాన్న, అన్నయ్యల అదుపులోనే చదువుకున్నా, ఎటొచ్చీ ఉద్యోగంవచ్చి ఆరునెల్లయింది. పెళ్లయి నాలుగు నెలలు మాత్రమే.

బాబాయ్‌కూడా ఇందుకు ససేమిరా అంటే తరువాత సంగతి తనే ఆలోచించుకుని భావినిగురించి ఒక నిర్ణయం చేసుకుంటాడు. అందుకు ఆమె కూడా అంగీకరిస్తుందా అని సంశయించేందుకు హేతువులేదు.

అతనికంటె ఆలోచనలే పందెంవేసుకుని పరుగులెత్తుతున్నయ్. సైకలుకు వేగం హెచ్చించి రివ్వునవచ్చివాలాడు, బాబాయ్‌గారి ఇంటిదగ్గిర.

బాబాయ్ అరుగుమీద కూచుని తాపీగా, "భారతం" కాబోలు చదువుకుంటున్నాడు. సైకిలుకు స్టాండు వేసి చకచకా ఇంట్లోకి వచ్చేస్తున్నాడు ప్రభాకర్. పుస్తకంలోనించి తలెత్తిచూశాడు బాబాయ్. "ఆఁ. నువ్వేనా? ఎప్పుడువచ్చావురా ప్రభాకరం?" అన్నాడు, కళ్లజోడు ముక్కుచివరికి లాక్కుంటూ.

"పొద్దున పదిగంటలబండీకే వచ్చాను బాబాయ్. పిన్నేది సావిత్రీవాళ్లూ ఎక్కడకు వెళ్ళారు? అక్కయ్య దగ్గిర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయా? గిరిజ ఆడుకుంటూందా?" అన్నీ ఒక్కగుక్కలో అడిగేశాడు ప్రభాకర్ పక్కనేవున్న బల్లమీద కూచుని బూట్లు విప్పుకుంటూ.

చదువుతూన్న పుస్తకంలో చిన్న కాయితంముక్క ఆనవాలుపెట్టి కళ్ళజోడు పెట్టెలోపెడుతూ, "ఏమేవ్, ప్రభాకరం వచ్చాడు" అని కేకవేశాడు బాబాయ్, పిన్నికి వినబడినట్లులేదు.

"ఇప్పుడే వస్తాను బాబాయ్" అంటూ ప్రభాకరం లోనికి వెళ్ళిపోయాడు. బాబాయ్ కూడా అతని వెనకాలే ఇంట్లోకి వెల్లాడు పుస్తకం చేతపట్టుకొని.

ప్రభాకరానికి స్వంతయింట్లోకంటే ఇక్కడే చనువు ఎక్కువ. బాబాయ్‌కి మొగపిల్లలు లేకపోవడంవల్ల చిన్నప్పణ్ణించీ ఇతడంటే మిక్కిలి మక్కువగా చూస్తూండేవాళ్లు, కొన్నాళ్ళవరకూ ఇక్కడే ఉండిపోతూ వుండేవాడు కూడా.

ఇహ చదువుతున్నాళ్ళూ మధ్యాహ్నం అన్నానికి ఇంటికి వెళ్ళేవాడుకాదు, రాత్రిళ్లు అన్నంతినొచ్చి ఇక్కడే పడుకొనేవాడు. అతగాడికి ఈ యింట్లో ప్రత్యేకం వోగది. పిన్ని ఎక్కడకువెళ్ళినా తనూ తయారు.

పిన్ని దొడ్డివసారాలో కూచుని అప్పడాలు వొత్తుకుంటూంది. ఇంకా యెవరో కూడావున్నారు. చూసీచూడడంతోనే "ఏరా ప్రభాకరం, ఇదేరావడమా?" అనడిగింది ఆప్యాయంగా నవ్వుమొగంతో. "లేదుపిన్నీ! మధ్యాహ్నమే వచ్చాగానీ, కాస్త నాకూ కూడా పెడుదూ!" అంటూ చెయ్యిచాచాడు ప్రభాకర్. నిమ్మకాయంత ఉండ చేతిలోవేస్తూ "అక్కడ ఎట్లావుంటుంది? భోజనం అదీ బాగుంటుందా?" అనడిగింది పిన్ని. ఆమె గొంతులో వాత్సల్యం తొణికిసలాడింది. ఇంతలో బాబాయి పిలుపువిని ఇవతలకు వచ్చేశాడు.

...కొంతసేపు పిచ్చాపాటీ మాటాడుకున్న తర్వాత తాను వచ్చిన అసలు సంగతి బయలుపెట్టాడు ప్రభాకరం.

బాబాయ్ విని ఊరుకున్నాడు. ఏదో ఆలోచిస్తున్నట్టు పరధ్యానంగా మరోవైపుకు చూస్తూ ఉండి పోయాడు.

ఆయన్ను తిరిగీ సంభాషణలోకి దింపే ఉద్దేశంతో "అవును బాబాయ్ నేనూ విచారించాను. నచ్చేదశమినాడు చాలా బాగుందన్నారు. ఏమంటావ్?" అన్నాడు ప్రభాకరం. అతని గొంతులో తొందర వినబడింది బాబాయికి.

"లేడికి లేంచిందే ప్రయాణమట్రా?" అన్నాడు గొంతు తగ్గించి, కాస్త మందలింపుగా.

"మీకేం అలాగే అంటారు. ఉద్యోగం వచ్చేదాకా రాలేదనుకుంటాం. వచ్చింతర్వాత ఒక్కడూ వుండి అక్కడ నిభాయించుకోడం ఎంత కష్టమనుకున్నావ్? ఆ హోటలు భోజనం నా ఒంటికి సరిపడక నానా అవస్థా అయిపోతోం దనుకో! అన్నింటిలోనూ డాల్డా తగలేస్తాడు బాబాయి. దగ్గుతో చచ్చిపోతున్నాను. పగలూ, రాత్రీ పేగులు తెగి పోతున్నాయి. ఆఫీసులో పనికూడా తెమలడంలేదు దీని మూలంగా."

వోసారి చిన్న దగ్గుదగ్గి తిరిగి చెప్పుకపోతున్నాడు. "ఇంకా కొంతకాలం ఇలాగే గడిపితే కడుపులో పెద్ద వ్యాధి ఏదో బయల్దేరేట్టుంది. మనం యెక్కడున్నా ఒంట రిగావుండి ఇలాటితిళ్లకు అలవాటు పడ్డామా యేమన్నానా, ఏమంటావ్ బాబాయ్?" బాబాయ్ పంక చూశాడు. "వ్యాధి" మాటవినేసరికి ఆయన గుండెల్లో గతుక్కుమన్నట్టయింది. పిన్నికూడా పక్కన వున్నదేమో అని సావిట్లోకి చూశాడు. ఆమె నిజంగా ఈమాటవింటే ఎంతో నొచ్చుకుంటుందని బాబాయికి తెలుసు. ప్రభాకరాన్ని కడుపులోపెట్టి పెంచుకున్నట్టు చూసుకుంటుందనీ తెలుసు. అందకనే సమాధాన ధోరణిలో ఇలా అన్నాడు—

"అదీ నిజమేరా అబ్బాయ్. నేనుమటుకు ఏలా కాదంటాను? ఆరోగ్యం సంగతిముందుగా ఆలోచించుకోవలసిందే అనుకో! అయినా మీనాయనతో చెప్పిచూడు. నేనైనా అంతేగా చేసేది?" అని తనకేమీ పట్టనట్టు ఊరుకున్నాడు.

ఆయన ముద్రతో వ్యవహారమంతా నడిపేది తనే అయినా ఇలా పెద్దరికంచూపి మాటాడడం ప్రభాకరానికి కష్టంవేసింది. కాని తమాయించుకుని అన్నాడు. "చెప్పాను బాబాయి, ఆయన అప్పుడే తెమలనిచ్చేలాలేడు. ఇంకా మూణ్ణెల్లు—జ్యేష్ఠమాసందాకా—ఆగితే గాని అన్నీ సక్రమంగా వనగూడి రావంటాడు. ఇంకా యెన్నాళ్లని ఇలా బాధపడమంటావ్?"

"అవును గ్రహశాంతవం కుదరడమంటే అదీ వోపట్టాన అయేదికాదు!"

"ఏదో సరిపెట్టుకు పోవాలి గాని, మనకు గ్రహాలేమిటి బాబాయ్?"

"అలా అనకు. అన్నిటితోపాటు అదీ అవసరమేమరి!"

"అయితే అంతవరకూ మీ నమేషాలు లెక్కపెట్టు కుంటూ కూచుంటామా? నాన్న ఎప్పుడూ ఆలాగే అంటాడు. నేడు ఈ గడపకదిత్తే గ్రహబలంకోసం పంచాంగాలు తిరగవేస్తాడు. ఏమీలేదు బాబాయ్, నువ్వుపట్టుపట్టి 'ఇది ఇలా జరిగితీరాలి' అంటే ఆయన అభ్యంతరంచెప్పడు"

"అలా యెన్నడైనా అన్నానురా నేను? నీకు తెలీదూ? మొదణ్ణించీ ఆయన అదుపులో వున్నట్టుగానే పెరిగాంగానీ, ఏ విషయంలోనైనా ఆయన్ను మెడలు విరిచి ఒప్పించామా?"

ఇదంతా ఒకటే మచ్చురా బాబూ అనుకున్నాడు ప్రభాకర్. అయినా మరికొంతసేపు ప్రయత్నించి చూదామనుకున్నాడు. "అదీకాక, అన్నప్పుడూ మనకు సెలవు కావాలంటే దొరుకుతుందా చెప్పు బాబాయ్. ఉద్యోగం చేస్తున్నవాడికి నీకు తెలుసుగా దానిలో కష్టసుఖాలు..." అని అన్నాడు.

"సరే—అంతవరకూవస్తే నాలుగు రోజులు సెలవు. పుట్టించలేక పోతామా?" అన్నాడు బాబాయ్ మాటకు అడ్డువచ్చి. ఇంక ఏమనాలో తోచలేదు, ఆలోచిస్తున్నాడు ప్రభాకర్. బాబాయే అంటున్నాడు—

"చూడు. నీకూ... చిన్నతనం-ఇలాటి విషయాలేవీ తెలియవు. ఎటొచ్చీ, పెళ్లిఅయి నాలుగునెలలే కదా అయింది! అయినా వాళ్లకులేని తొందర మనకెందుకు చెప్పరా!" ఇదొక పెద్దయుక్తిగానే కనబడింది బాబాయ్‌కి ప్రభాకర్‌కో కొంచెం నస్పాగం అంటుకుంది.

"ఎవరికివారు అలాగే వూరుకుంటే మధ్య బాధపడేది నేనుగా కనుపిస్తున్నాను. ఇందులో ఒకళ్ళొకళ్ళు బిర్ర బిగిసి కూచోడానికి తగిన కారణం కనబడదు. మనం అడిగితే వాళ్ళుమటుకు కాదంటారా బాబాయ్?" అని అన్నాడు.

"మనం నోరుచేసుకు అడిగితే బయటపడ్డామన్నమాటే!"

"నువ్వుచెప్పేది మరీ విచిత్రంగావుంది. 'ఎవడి పెళ్ళాన్ని వాడు పంపమని అడగటంలో బయటపడి పరువుచెడాల్సినంత అగత్యం ఏ మొచ్చిందంట?"

"నువ్వొక్కడవు కాదనుకుంటేసరా? లోకులు ఏమంటారు? అదిమాత్రం అలోచించుకోవద్దు?"

"ఇందులో లోకుల ప్రసక్తి ఏముంది?"

"ఏమివున్నా లేకపోయినా మనంచేసే ప్రతిపనికీ ఒక వంక లోకులకు వెఱుస్తూనే వుండాలి. లేకపోతే మనిషికి విలువ ఉండదురా అబ్బాయీ! ఇప్పుడయినా ఆలోచించుకో, మీ నాయన ఎంత దూరాలోచనతో అన్నాడో ఆమాట!"

"ఆయన మనస్సులో మొనణించీ ఒకటే ఆలోచన– వాళ్ళు ఇస్తామన్న మూడువేలూ ఏలాగైనా గోళ్ళూడగొట్టి వసూలు చెయ్యాలని. అంతేనా?"

"అవును—అందులో అపసవ్యమైనపని ఏమున్నదంట? వాళ్ళు ఇస్తామన్నమాటకు కట్టుబడి ఉండొద్దూ?"

"ఇస్తే ఇస్తారు లేకపోతేలేదు. వాళ్ళు ఇస్తేగాని మనకు గడవదా ఏమిటి? అంత బలవంతాన పీకమీద కూచుని గుంజుకోకపోతే ఉన్నకాస్త పరువు తీసేసుకోవడమేనా మరేమైనా ఉందా?"

"అదేమన్నమాటరా! వ్యవహారానికి వ్యవహారమే, మంచికి మంచే–దేని అదను వచ్చినప్పుడు దాన్ని కటిక్కిన నొక్కక పోతే ఎప్పరూ దేనినీ నెరవేర్చలేరనుకో! నీకూ కుర్రతనం గాని...అన్నయ్యను అడిగిచూడు! చెవులు మెలేసి మరీ పుచ్చుకున్నారు. వదిలిపెట్టారనుకున్నావా?"

"మూడువేలూ కట్నం ఇచ్చాడుగా! ఇంకా యెందుకు ఈగలాగ పీక్కుతినడం?"

"తక్కింది ఇచ్చుకుంటానని నలుగురియెదటా సభలో వప్పుకున్నాడు"

"కావొచ్చు-మనం చదువు మానేశాంగా బాబాయ్!"

"ఆసంగతి తనకెందుకు? ఇస్తానన్నది ఇచ్చెయ్యాల్సిందే! మనం నోరు మూసుకుంటే లోకం నోరుమూయగలమట్రా అబ్బాయ్?"

"మనం వద్దంటే లోకమైనా వసూలుచేసి తీరుతుందా బాబాయి?" ఆవేశాన్ని అణచుకున్నట్టు అదోలా ప్రశ్నించింది. అతనిగొంతు బాబాయి మొహంలోకి పరకాయించి చూశాడు.

"మనం వద్దనడమేమిటో అసలు? ఇదెంత తెలివితక్కువ మాటా?" అని బాబాయి మొహం చెప్పకనే చెప్తోంది. తననుగురించి తనకు తెలియకుండా తెరవెనుక ఎంత భాగోతం జరుగుతోందో, అట్టే ఊహించుకోలేకపోయాడు ప్రభాకర్. ఏదో జ్ఞాపకం చేసుకొంటున్నవాడిలా తలపట్టుకుని గిజాటుగా అలోచించుకుంటున్నాడు. బాబాయి తనను హెచ్చరించే ధోరణిలో ఇలా చెప్పుకు పోతున్నాడు.

"నువ్వు మధ్యమధ్య శని, ఆదివారాలల్లో వాళ్ళఇంటికి వెడుతున్నట్టు తెలిసింది. అదెంత పరువు తక్కువపనో గ్రహించావా? చివరికి మనల్ని గడ్డిపోచకింద కడతారు సుమా! నీకు తెలియదు చిన్నతనం. వ్యవహారరీత్యా అన్నీ సక్రమంగా ఫైసలయితేగాని అలాటివన్నీ మనకు పనికిరావు. అంతవరకూ మనం మన తాహతుకు భంగం కలగకుండా చూచుకోవాలి" గ్రహించావా అన్నట్టు అతనివంక గంభీరంగా చూచి ఊరకున్నాడు బాబాయి.

"ఎన్నాళ్ళకు ఫైసలవుతుందంటావ్?" ప్రభాకర్ మాటకుమాట అడిగాడేగాని, అతనిమనసు మనసులోలేదు.

"అదంతా మీనాయన వ్యవహారం నడుపుకుగాపడంలో ఉంది. ఆయన మాత్రం సామాన్యుడా? ఒకమాట—ఇస్తారులెమ్మని ఇలాగే సాచివేతగా వూరుకుంటే ఏళ్లూపూళ్లూ గడిచిపోతై. వ్యవహారంలోకిదిగి దానికి తగిన పద్ధతిలో నడుపుకొస్తే మర్నాటికల్లా గవ్వలు రాలినట్టు రాలి పడవూ?"




# అమృతాంజనము

గాని,

“ యథాయథా......................కాళీధవళత్వ శంకయా.”

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

బాబాయి మాటలు వింటూంటే నిజంగా అంతపనీ చేసేట్టే అగుపిస్తున్నాడు. తనకు ఏదో ముళ్ళకిరీటం నెత్తినపెట్టి తప్పితప్పి బాధుతున్నట్టున్నది. "సరే—నేను వెడతాను బాబాయ్" అంటూ చివాల్న లేచి కాళ్ళకు బూట్లు తొడుక్కుంటున్నాడు.

"రేపు ఉంటావా?" అనడిగాడు బాబాయి, గొంతు సవరించుకొంటూ.

"ఊహూ—రేపు సోమవారంకదూ. ఆఫీసుకు వెళ్ళిపోవాలి. మొదటిరైలుకే వెడతాను" అంటూ సైకిలెక్క సరీన మూసుకున్నాడు. బాబాయి వెనకనించి చూస్తూ "పట్టికుర్రకుంకలు, వీళ్ళకేం తెలుసు?" అన్నట్టు తనలో తనే, తలపంకించి వోచిన్నినవ్వు నవ్వుకున్నాడు.

*　　　*

"...సరే. అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసివచ్చాను, రేపు ఉదయమే మన ప్రయాణం ఏమంటావ్?" అన్నట్టు ఆమె కళ్ళల్లోకి చూశాడు ప్రభాకర్ ప్రశ్నార్థకంగా.

వరలక్ష్మి వయ్యారంగా ముద్దుగా మునివేళ్ళతో పుచ్చుకుని కాఫీగ్లాసు అందివ్వబోయిందతనికి. అందుకుంటున్నవాడల్లా చెయిసగం వెనక్కులాక్కుని "ఆఁ,ఆఁ...వదిలిపెట్టకు, గ్లాసుకింద పడిపోతుంది" అంటూ రెక్కలు తెరచివున్న అల్మరాలోకి అదేలా తేరిపారజూశాడు. అక్కడ పడివున్న కవరుమీద వ్రాసిన దస్తూరీ అతణ్ణి విచిత్రంగా ఆకర్షించింది. చటాల్న లేచివెళ్లి ఆకవరు తీసుకున్నాడు. అది చింపివున్నది.

ఆదస్తూరీ తను ఎక్కడో చూచినట్టున్నది. ఆదస్తూరీతో వ్రాసిన ఉత్తరాలు తను చాలాచదివినట్టున్నాడు. ఉత్తరాలేకాదు, ఆదస్తూరీ తనకు పాఠాలు నేర్పినట్టుంది. తను ఎరిగున్నంతలో ఇలాంటి వ్రాత బాబాయి వ్రాయగానే చూశాడు. ఇది ముమ్మూర్తులా ఆయన వ్రాత అనుమానంలేదు.

అతని చూపులు ఆ కవరుమీదనే అతుక్కుపోయినై. ఆతనికళ్లు కనబడని అక్షరాలకోసం, అంకెలకోసం ఆదుర్దాగా వెతుక్కుంటున్నయ్. తన చేష్టలు ఏమిటో అర్థంకాక తన్నుకులాడుకుంటున్న వరలక్ష్మి చేతికందించబోతూన్న కాఫీగ్లాసుతో భరతనాట్యంలో భంగిమంలా అలాగే చలనంలేకుండా నిలబడి చూస్తున్నది.

టిక్కుటిక్కుమనే గడియారం కదలికలుతప్ప ఆగది అంతా నిశ్శబ్దం కమ్ముకున్నది వోక్షణంపాటు.

"అమ్మాయీ, వరలక్ష్మీ!" అనే వంటావిడ పిలుపు గడియారం గంటకు వంతపలికింది. ఆనిశ్శబ్దాన్ని భంగిస్తూ,

"వస్తున్నా" అన్నది వరలక్ష్మి, అతను తలెత్తిచూశాడు.

"కాఫీ బొత్తుగా చల్లారిపోయిందండీ! ఇప్పుడే వెచ్చబెట్టుకొస్తాను" అంటూ అక్కణ్ణించి కదలివెళ్లింది వరలక్ష్మి వెనుకనించి వాలుజడ ఈవెర్రి ప్రపంచాన్ని వెక్కిరిస్తున్నట్టున్నది.

అంకెలు, అక్షరాలకోసం ఆరాటమేకాని అవి స్పష్టంగా కనుపించనేలేదు. కనుపించిన వాటిని కూడబలుక్కుంటూ కూడికలు వేసుకుంటూ ఏవేవో ఆలోచనలు అల్లుకుంటున్నాడు ప్రభాకర్.

ఆ కవరుమీద అలికేసినట్టు కనుపించే అంకె 25 అయివుంటుందని నిశ్చయించుకొని 'డైరీ'లో వ్రాసుకుంటున్నాడు. నిన్నటి తారీఖు 25 ఇది బాబాయి వ్రాసినట్టు నిర్ధారణ అవుతోంది.

ఇంతలో కాఫీగ్లాసుతో వరలక్ష్మి తిరిగి ప్రత్యక్షమయింది. వేడివేడి కాఫీ పొగలుకక్కుతూ గ్లాసులో కనుపించగానే అతనికీ ప్రాణం లేచివచ్చినట్లయింది. ఘ్రాణేంద్రియం అంతకుముందే ఉవ్విళ్లూరింది. చేతులోవున్న కవరు అల్మరాలోకి గిరవాట్టేసి గ్లాసు అందుకుని వెంట వెంటనే రెండు గుక్కలు పీల్చాడు.

"అమ్మయ్యా, ఇప్పటికి ప్రాణం కుదటబడింది" అన్నట్లు తృప్తిగా వరలక్ష్మి మొహంలోకి చూశాడు. "పొద్దుణ్ణించీ గుక్కెడు కాఫీ అయినా యెరగనుగదా!" అన్నాడు మరోగుక్కెడు చప్పరించుతూ. "అయితే ఏమంటావ్ మన ప్రయాణం ఖాయమేగా?" ఖాళీగ్లాసు చేతికందిస్తూ అడిగాడు ప్రభాకర్.

గ్లాసు బల్లమీదుంచి దగ్గిరగావచ్చి కూచున్నది వరలక్ష్మి. 'ప్రయాణం ఖాయమేనా? అని నన్నడుగుతారేం. నాన్నగారి నడగండి!" అని అన్నది.

“ఇది మరీబాగుంది, పైవారంనించీ ఇక్కడికి వచ్చేది లేదు ఏమనుకుంటున్నావో, ఆలోచించుకో!”

“మీరూ ఆలోచించుకోండి, ఎలా రాకుండా ఉండగలరో?” తనమీద నెపం ఏమాత్రమూ లేదని చెప్తున్న గొంతులా ఉన్నది.

“అవును అదీనిజమే ఏమిటిగతి?...సరే-నేనే అడుగుతాను నాన్నగారిని ఏమంటావ్?”

“అడగండి, ఎవరికోసం?” జెడముందుకు వేసుకుని రిబ్బనుముడి సవరించుకుంటూ తలవంచు పని మనస్సులో వ్యథపడుతున్నట్లు అన్నది వరలక్ష్మి.

“నాకోసము, నీకోసమూ-అవునా?” అని గడ్డంపుచ్చుకుని ఆమె మొహంలోకి చూశాడు ప్రభాకర్. రెండు గుడ్లలోనీళ్ళు తిరగడం చూశాక అతనికి జాలేసింది. చేతిరుమాలుతో కళ్ళు అద్దబోయాడు. వరలక్ష్మి అతని చేయి పట్టుకుని ఇలాఅన్నది.

“మీ ఉత్తరంచూసుకుని నాన్నమరీ దిగులుపడ్డాడు. మీరు అలా ఎందుకుగాయాలి? నాన్నమీద మీకంత కసి ఎందుకు?”

“నాకు కసేమిటి?” అతను వెలవెలబోయాడు.

“మరి యీ వుత్తరం రాసింది మీరేగా!” రవికలో వున్న ఉత్తరంతీసి అతని ఒళ్ళో పడేసింది.

“అవును, ఇది నేనే వ్రాశాను”

“దీనితోనే అసలు ఆయన కడుపు కోసుకుపోయేలా కుమిలిపోతుంటే, నిన్న.. నే...” చటుక్కున ఏదోజ్ఞాపకం వచ్చినట్లు నాలుక కరుచుకుంది వరలక్ష్మి.

“ఊ. చెప్పెయ్యి! ఇంకా దాచడమెందుకు? నిన్ననే బాబాయ్ ఉత్తరంకూడా వచ్చిందికదూ? ఇదిగో కవరు!” చివాల్నలేచి అల్మరాలో కవరుతీసి వరలక్ష్మి చేతికిచ్చాడు. ఆకవరు చూసుకుని వరలక్ష్మి ఏమీమాటాడలేక పోయింది.

నిజంగా బాబాయి అలాగే వ్రాసి ఉంటాడు. అక్కగారిలా తనతో అన్నట్లుగానే —అప్పుడు అతనిలో చిన్న తుపాను రేగింది. గుండెల్లో ఉరిమినట్టయింది, వెంటనే వోసగంతి మెఱుపులా మెరిసింది.—మొదటగా తానిక్కడికి వచ్చినప్పుడు వరలక్ష్మిని పిల్చి వాళ్ళనాన్న ఏదో చిన్న హెచ్చరిక చేశాడు. “ఆసంగతి అతనితో అనవొకు” అన్న మాటమాత్రమే తనకు వినపడింది. అది ఏమిటో ఆమెను అడిగి తెల్సుకోవాలనుకున్నాడు. ఆమె చెప్పలేదు. బ్రతిమాలాడు. ఒట్టుపెట్టుకున్నాడు. ఎలాగో ఆమెచేత పలికించాడు. ఆనాడు వరలక్ష్మి చాలా బాధపడుతూనే చెప్పింది బాబాయి వ్రాసిన ఉత్తరం సంగతి. నాన్నగారి మనసు కూడా కష్టంకలిగినదని ఆమె మాటల్లోనే అర్థమయింది.

కొన్నాళ్లకు ఈసంగతి తను మర్చిపోయాడు ఇంతవరకూ తనకు తెలీకుండానే వియ్యన్నగారికి (మామగారికి) ఉత్తరాలు రాస్తున్నారు, నాన్నా బాబాయికలిసి. వరలక్ష్మి కూడా ఇన్నాళ్ళనించీ దాచిపెట్టింది. బాబాయి యీ డబ్బు సంగతి తనతో ప్రస్తావించగానే మనసులో ఏదో గుప్పుమన్నది ఈమాటే. అప్పుడే జరిగిందంతా జ్ఞాపకంరాగా గిజాటుపడ్డాడు.

వరలక్ష్మి కన్నీరు కుమ్మరిస్తూ చెప్పినమాటలు ములుకుల్లా గుండెల్లో గుచ్చుకుని తనలో ఏపాటి మానవత్వమైనా మాటుమణిగి ఉన్నదేమో అని మూలమూలలా గాలించి వేస్తున్నయ్. ఎదోభరించరాని వ్యథ-

మానవత్వాన్నిగురించి పాఠాలు నేర్చుకుని ఉంటే తనకు కలిగిన యీవ్యథకు అర్థం, తాత్పర్యం చెప్పుకోకలిగేవాడు. ప్రస్తుతం తాను అనుభవిస్తున్నది వట్టిమూగబాధ-

తానువ్రాసిన ఉత్తరమే వరలక్ష్మిని ఇంతగా కలచివేసిందేమో...ఏదో...తొందరలో అలావ్రాశాడు. బాబాయి చెప్పిన సమాధానం తనలో రేకెత్తించిన తీవ్రధోరణి నంతా యీ ఉత్తరంలో కలకబోసి వుంటాడు. ఆనాటి ఉదయమే రైలులో కూచుని వ్రాసింద్ వ్రాసిందిగా తిరిగి చూడకుండా స్టేషనులో దిగగానే పోస్టుచేశాడు.

“ఎంత తొందరపాటు!!...”

తిరిగి వరలక్ష్మి ఇలా చెప్పుకుపోతోంది “పోనియ్యండి, మీకూ అంత తొందరెందుకు? మీఉత్తరం చూసుకుని నాన్న నిలువునా నీరైపోయారు. ఇప్పుడు ఈస్థితిలో నేను ఇక్కణ్ణుంచి రావడం ఆయనకు మరింత గుండెకోత. కాని ఇందుకు మీతోబాటు నేనూ బాధ్యురాలనే. అందుకే

ఆయన కళ్ళనిండా నీరునిండినా నాగుండె రాయిచేసుకుని రోజులు లెక్కపెట్టుకుంటున్నాను. నేనూ మీతోపాటు వచ్చెయ్యడానికే సిద్ధమౌతున్నాను. రేపు ఉదయమేకదూ మన ప్రయాణం?"

నిజంగా గుండె రాయిచేసుకునే అన్నట్టున్నవి వరలక్ష్మి మాటలు. బ్రతుకు బరువంతా వ్యధితహృదయం మీదకునెట్టి వేసి లోనున్న విషాదతరంగాలను అణచుకుంటే అవి ఇమడక ఊటలు ఊరుకుంటూ పైకి ఉబికి వెల్లువలుగా పారుతున్నప్పటి సజీవ వాదాలు...

వరలక్ష్మి అతనివంక చూసింది. ప్రాథమిక దశను గడిచి గట్టెక్కని కళాకారుని చిత్రంలోలాగ అస్పష్టంగాను, అనభివ్యక్తంగాను అలుముకున్న ఆవేదనా సూచకమైన కొన్ని రేఖలు అతని మొహంలో ప్రాకులాడుతున్నట్టున్నయ్. చిత్తరువు యెదటనే సన్న చేసి నప్పటికంటె ఆమెకు మరెట్టి సమాధానమూ కనిపించలేదు. సంపుటంలో కడిగిపెట్టిన సాలగ్రామంలా నల్లగా నిగనిగలాడుతూ నీరు నిండిన అతని నల్లగుడ్లు నిశ్చలంగా నిలఒడి చూస్తోంది.

వరలక్ష్మి మొహం వానకు తడిసిన అద్దంలోలా అలికి వేసినట్టు అతనికళ్లల్లో ప్రతిబింబించింది.

అతనూ తనమొహం చూసుకున్నాడు ఆమె కళ్లల్లో. వాళ్ళయిద్దరికళ్ళూ వర్ణాలులేని విలక్షణమైన భాషలో పరస్పరం పలకరించుకున్నయ్.

మొహాలలోని భావాలు హృదయాల అంతరాంతరాల వరకూ చొచ్చుకునిపోయి రొదపెట్టినయ్, వారి ఏకాంత జీవితానికి సాక్ష్యం పలుకుతున్నట్టు.

ఓ క్రమాలకి కిటికీలోనించిచూసి నాన్నవచ్చే వేళయింది, అంటూ చివాల్న లేచివెళ్ళింది వరలక్ష్మి.

తానూ సావిట్లోకివచ్చి కుర్చీలో కూలబడ్డాడు ప్రభాకర్.

## 3

వియ్యన్నగారిది నేటి మధ్యతరకం సంసారాల్లో కాస్త మెరుగైనదనే చెప్పాలి. ఇద్దరే అన్నదమ్ములు, వియ్యన్నగారు రెండోవాడు. ఆయన వంతు పదిహేనెకరాల ఆస్తివచ్చింది. తల్లి ఇహాన్ని వీడగానే తనవంతు అట్టేపెట్టుకున్న నాలుగెకరాలూ అమ్మేసుకుని తీర్థయాత్రలు సేవించి తుదకు కాశీకి వెళ్ళి సన్యసించాడు తండ్రి.

వియ్యన్నగారికి వరలక్ష్మి ఒకర్తే ఆడపిల్ల, ఇద్దరు మొగపిల్లలు. పెద్దకూతురి పెళ్ళిమురిపెం చూసుకోకుండానే ఆయనభార్య లక్ష్మీకాంతమ్మగారు ఏణర్థంక్రితం ఇహలోకం నించి దాటుకున్నారు. పండంటి సంసారం బుగ్గిపాలైంది.

వియన్నగార్కి విరక్తికలిగి ఉద్యోగం మానివేసి పిల్లల్ని కనిపెట్టుకుని ఇంటిదగ్గిరే ఉంటున్నారు.

సంవత్సరన్నర తరువాత వరలక్ష్మికి పెళ్ళిచేయ తలపెట్టాడు. గుడ్డువిప్పితే కుంచెడు నీళ్ళుగా లక్ష్మీకాంతమ్మగారి రవిక బొడ్డులో పెట్టుకుని కన్యాదానం చేశారు.

ఆయన మనస్సుకు ఇప్పటికీ శాంతిలేదు.

ఇరవై వత్సరాల సుదీర్ఘ సాంసారిక జీవితోదంతాన్ని స్మృతిపథకంనించి ఇట్టేతుడిచివేసుకోలేక కొట్టుమిట్టాడుతున్నాడు. వివాహంపేరు చెబితే విరియబూచిన మల్లెపొదలాంటి యెవరో మనిషి ఆయనచెంత నిల్చున్నట్టవుతుంది. ఏదో మైకం కమ్మినట్లు తలపట్టుకు గిజాటుపడతాడు.

ఇంట్లో వంటా-పెట్టా అన్నిటికీ ఒక మనిషిని నియమించాడు.

ఇంతవరకూ ఆయన పునర్వివాహం మాటతలపడు. ఇక ముందు చేసుకుంటాడేమో తెలీదు. ఇప్పటికి ఆయన వయస్సు 42 సంవత్సరాలు-

మగపిల్లల్నిద్దర్నీ బజారుకు తీసుకువెళ్ళి ఏవేవో కొనిపెట్టి అప్పుడే వెంటబెట్టుకు తిరిగివచ్చాడు.

ప్రభాకరాన్ని చూడ్డంతోనే ఆయనకు అంతా అర్థమయింది. తనూ ఓ కుర్చీలో కూర్చుంటూ పలకరించాడు. "ఉదయం బండీకే వచ్చావా?" అని.

"అవును - మెయిల్లో వచ్చాను", అన్నాడు ప్రభాకర్ లేనినవ్వు తెచ్చుకుంటూ.

వియ్యన్నగారు ముక్కుకు సూటిగా మాట్లాడుకుపోయే మనిషి: ఇతర ప్రసంగం ఏమీ చెయ్యకుండానే అసలు

విషయంలోకివెళ్ళి ఇలా అన్నాడు....“సరే ఉత్తరంచూసుకుని నేనూ తగిన ఏర్పాట్లన్నీ చేస్తున్నాను. నువ్వు వ్రాసిన దానికి ఏలాటి అభ్యంతరమూ చెప్పేహక్కు నాకులేదు. ఇవాళ కాకపోతే రేపైనా వరలక్ష్మిని పంపక తప్పదుగా! ఒకమాట-ఇంతవరకూ నాలుగు ఉత్తరాలు గుప్పించినా నీకు తెలియనీలేదు. నిన్న మీబాబాయిగారు వ్రాసినదానికి నేనెట్టి సమాధానమూ యీాయిదల్చలేదు. మూడువేలూ రేపే బ్యాంకునించి తీసుకుని టెలిగ్రాం మనియార్డరుద్వారా పంపెయ్యాలనుకుంటున్నాను.

“ఇన్నాళ్ళూ ఇవ్వకుండా జాగుచేయడంలో నా స్వార్థం ఏమీ లేదని నీకు తెలిసే ఉంటుందేమో......

“వివాహం కాకపూర్వమే నీ చదువుకని నిర్ణయించిన ఈ ధనం ఇప్పుడు ఊరికే యిచ్చెయ్యమనడంలో మీవాళ్ళ ఉద్దేశం నాకు అర్థం కావడంలేదు. నిన్ను ఇంతటితో చదువుమాన్పించడంలో అర్థం ఏమిటో నాకెవరూ ఎప్పుడూ చెప్పలేదు.

“నలుగురి యెదుటా ఇస్తానని వాగ్దానం చేసిన ఈ సొత్తు ఆనాడే మీ అధీనమైంది. ఇప్పుడు ఇవ్వననడానికి నైతికంగా నాకెలాంటి అధికారమూ లేదు. అది ఎలాగైనా నీ పురోభివృద్ధికి పనికివచ్చేలాగున చూడాలనే నా కోరిక. అన్నిసంగతులూ మీరె స్వతంత్రంగా ఆలోచించుకోగలరు.

“ప్రస్తుతం నీవైఖరికి- ఎలాంటిలాంఛనాలూ జరక్కుండానే వరలక్ష్మిని తీసుకువెడతానని బలవంతపెట్టడానికి- కారణం ఏమిటో అడగాలనుకోవడంలేదు. ఎలాగైనా ఎక్కడైనా మీరు సుఖంగా ఉండడమే నాకు కావాలి.”

వియ్యన్నగారు ఇక మాటాడలేదు. కుర్చీలో చేరగిలబడ్డాడు.

ఆయన మాటలు నాలుక చివర్నించి వచ్చినట్టివిగాలేవు. గుండెల్లోని ఆవేదనకు కాగి కాగి బలవంతాన చల్లార్చుకోబడి ప్రతి పలుకూ బయటకు వచ్చినటున్నది. కొలిమిలో కాలిన కొడవలి కాగులో ముంచినా కొంతసేపటివరకూ కాలుతూనే వుంటున్నట్టు అయన మాటల్లోవేడి తగ్గలేదు.

ప్రభాకర్ ఆసంగతి గుర్తించాడు కాని, ప్రస్తుతం తన ప్రయత్నం మానుకోలేదు. వరలక్ష్మిని తీసుకువెళ్ళితీరాలి, అందుకు ఆమెకూడా సిద్ధమయే వుంది.

ఇక నాన్న అంత కఠినవైఖరి అవలంబించడం, అందులో వియ్యన్నగారి మెత్తని మనస్సు గుర్తించకుండా, అది ఘోరమైనదని అతను మొదణ్ణించీ అనుకుంటూనేవున్నాడు. ఇలాంటి విధానాలద్వారా అసలే వ్యాకులం చెందివున్న ఆయనమనస్సును మరింత కలవరపెట్టడం తన అభిమతంకాదు. ఇప్పుడు వరలక్ష్మినికూడా తీసుకువెళ్ళటంలో ఆయనకు తను మహా అపచారమే చేస్తున్నాడు. ఈ మొగపిల్లల్నిద్దరితో యీ యింట్లో ఆయన ఉండలేడు. గుండె చెరువయేలా కుమిలిపోతాడు. అయినా తన ప్రయత్నం మానుకోలేక అన్నాడు, “మా బాబాయి వ్రాసినదానికి అర్థంలేదు. అయినా అది నాకోసం ప్రత్యేకించిన డబ్బుకదూ”

“న్యాయతః అంతే కావచ్చు. ఇప్పుడు వారితో వ్యవహారం నడిపే స్థిమితంలేదు నా మనస్సుకు. రేపే పంపెయ్యాలనుకుంటున్నాను”

“అయితే నేనే తీసుకువెళ్ళానని వ్రాయండి !”

“ఎలాగైనా నాకు సమ్మతమే. మీ వాళ్ళు అందుకు అంగీకరిస్తే”

వరలక్ష్మి ఎందుకో గదిలో ఇటూ అటూ తచ్చాడుతూండగా చూశాడు వియ్యన్నగారు. “అమ్మాయీ !” అని పిల్చాడు. గుమ్మంలోకి వచ్చి దరవాజా ఆనుకు నుంచున్నది వరలక్ష్మి- “కావలసిన సామాన్లన్నీ జాగ్రత్తగా సర్దుకో అమ్మా !” అన్నాడు. “అమ్మలేదుకదా !” అని లోపల గొణుక్కున్నాడు వినపడీ వినపడకుండా. వరలక్ష్మి ఏమీ సమాధానం యివ్వకుండా గుమ్మాన్నానుకుని అలాగే నిల్చునుంది. ప్రభాకర్ పెదవి కదల్చలేని స్థితిలో అలాగే ఉండిపోయాడు.

## 4

సుఖంగా చేరుకున్నటు ఆనాడే వియ్యన్నగారికి టెలిగ్రాం ఇచ్చాడు ప్రభాకర్.

నాలుగు రోజులకి బాబాయికి వో ఉత్తరం రాశాడు. ప్రత్యేకంగా పిన్నికో చిన్న ఉత్తరం వ్రాసి ఉంచాడు

# బాలానందం

## ★ గర్వభంగము ★

వై. ఆర్. వి. జగన్నాధరావు

పూర్వము వింధ్యసాత్పూరా పర్వతముల దగ్గర ఒక మహా రణ్యము ఉండేది. అందుచేత దానిని వింధ్యచల పార్శ్వకాననము అనికూడ అందురు.

అందుగల జంతువులు తమకు ఒకనాయకుడు కావలెనని, మృగరాజైన ఒక సింహమును రాజు గా నియమించుకొని విచ్చలవిడిగా తిరుగుచుండెడివి.

ఒకనాడురాత్రి మృగరాజు వేటకు బయలుదేరి, అక్కడగల యితర అడవులలోని జంతువునుచంపి, దానిని మాత్రము తినుచుండెను. తెల్లవారు చున్నదని తొందరబడి. ఆసింహము, ఈ శవముయొక్క యెముకలతో కూడా మాంసం తినెను. ఆ ఎముక సింహముయొక్క దంతములందు చిక్కుకొని గాయమై, యిటునటు నోరు కదల్చలేక మిక్కిలిబాధ పడుచుండెను.

ఇదంతయు దూరమునుండి ఒక వడ్రంగిపిట్ట చూచి మిక్కిలి జాలిపడి, తను మృగరాజునకు సహాయముచేతునని, మృగరాజుతో పలికెను. మరియు ‘‘నీవేమినాకు బహుమానంబిత్తువు?’’ అని అడిగెను.

అప్పుడు సింహము ‘‘పిట్టా! నీవేమి కావలెనన్న అది యిచ్చెదను. నేను మృగరాజును నాకు మేలు చేసినవారు బాగుపడకమానరు. కాన బాగుచేయుమ’’ నికోరెను.

వెంటనే పిట్ట మిక్కిలిచాతుర్యముతో సింహము నోరునందు ప్రవేశించి, తనపాదములతో వాని (సింహము) యొక్కదంతములు అణగద్రొక్కి వాటిమధ్యనున్న ఎముకను తనపొడుగు ముక్కుతోతీసి బయటికివచ్చి పారవేసి. పలికెను.

‘‘మృగరాజా! నేను మిక్కిలిగా కోరను. నాకు అడిగిన వెంటనే కొంచము మాంసంమాత్రము యివ్వవలయును’’

సింహముకూడ వప్పుకొని తన అరణ్యమునకు వెడలిపోయెను. కొన్నినెలలు తరువాత సింహము మరల ఒకజంతువును చంపి తినుచున్న సమయమున పిట్టవచ్చి:-

‘‘రాజా నా సహాయమునకు ఫలముకోర వచ్చితిని. ఈ నిమిత్తమునకు కొంచము ఆహారమిమ్ము’’ అనెను.

అప్పుడు సింహము తనకు పిట్టను తెలియనటుల నటించి ‘‘నీవుఎవరవు? నీకునేను (మృగరాజును) మాంసంబేల యియ్యవలెను?’’ అనెను.

అప్పుడు పిట్ట తనుచేసినమేలు, కడచిన దినములు జ్ఞాపకముచేసెను, కాని, సింహము నవ్వుచు పలికెను.

‘‘పిట్టా! నరులకు కూడ భయపడని, మృగరాజునైన నేను, నీవు (అల్పజంతువు) కూడ నానోటియందు ప్రవేశించినను చంపక విడిచిపుచ్చితిని. యింతకంటే వేరు

సహాయంబెద్ది? తెలుపుము" అన పిట్ట దానిమాయను తెలుసు కొని, మరల అవకాశము కలిగినయెడల నీపని పట్టించెద ననిపలికి వెడలిపోయెను.

కొన్నాళ్ళ తరువాత (ఈవిషయము మరచినతరువాత) సింహము వేటకై పొదలలో తిరుగుచుండగా, వడ్రంగిపిట్ట సింహముయొక్క, ఒక కన్నుపొడిచి చెట్టుపైకెక్కి-పలికెను.

''మూర్ఖుడా, మేలుచేసినవానిని మరచి, తిరిగి పెద్ద మాటలు ఆడుచున్నావు. నీకుతగిన గర్వభంగము అయి నది. యింకానయము రెండవ కన్ను మిగిల్చితిని. సంత సింపుము. యికశలవు'' అనివెడలి పోయెను.

సింహముకూడ కంటిబాధతో అరచి, అరచి, అలసి పోయెను.



## ఓ పీనయ్య ఓ

కొన్నాళ్లక్రిందట ఒక దశకోటీశ్వరుడికి చాలా జబ్బు చేసింది. దేశంలో వున్న ఘన వైద్యులందరూ వచ్చి చూచేరు. వాళ్ళంతా ఒకే ఒక నిర్ణయానికి వచ్చేరు. అతడికి నరరక్తం నరాలద్వారా ఎక్కించాలి అలా కాక పోతే ప్రాణాలు పోతాయి. ఈ నిర్ణయం పిసినారి పీనయ్య విన్నాడు.

పీనయ్య డాక్టర్ల ఎదురుగా వచ్చి "నారక్తంయిచ్చెదను" అన్నాడు. పీనయ్య రక్తంతో కోటీశ్వరుడు బాగుపడ్డాడు. కోటీశ్వరుడు కోలుకున్నాక పీనయ్యని పిలిపించి వక లక్ష వరహాలు బహుకరించేడు. పీనయ్య మహదానందంతో శలవు పుచ్చుకున్నాడు.

ఖర్మ వశాత్తూ మరొక రెండేళ్లు గడిచేక కోటీశ్వరుడికి మళ్ళీ జబ్బుచేసింది. మునపటిలాగే డాక్టర్లు నర రక్తం కావాలన్నారు. పీనయ్యే మళ్లీ యిస్తానన్నాడు.

కోటీశ్వరుడు యీమారు కోలుకున్నాక పీనయ్యని పిలిచి ఏదో అనూనయ వాక్యాలు పలుకుతూ ఒకవేయి వరహాలే యిచ్చి పంపేడు. పీనయ్య కొంచం ఆశ్చర్య పోయినా సంతోషంగానే వెళ్ళి పోయాడు.

అయిదేళ్ళ తరువాత కోటీశ్వరుడు మళ్ళీ జబ్బుపడ్డాడు. పీనయ్య అవుసరం మళ్ళీ కలిగింది.

అయితే ఈసారి పీనయ్యకి పారితోషికం వక్క రూపాయే యిచ్చి వెళ్లమన్నాడు కోటీశ్వరుడు. పీనయ్యకి కోపమొచ్చింది. "ఇది ధర్మమేనా ? నారక్తం ధారపోసి నీప్రాణం కాపాడేను" అన్నాడు పీనయ్య.

"ఆమాట నిజమే. కాదనలేదు. అందుకు చాలా కృతజ్ఞుడ్ని. తొలిసారి నాలో చాలా ఉదారమైన రక్తం స్రవించేది. అందుచేత పారితోషికం అధికంగా యివ్వా లన్న ఉదారత ఉండేది. ఇప్పుడు నాలో స్రవిస్తున్నది ఉత్త పిసినారి రక్తం. నన్నేం జేయమంటావు?" అన్నాడు కోటీశ్వరుడు.

[ఇది, స్కాచ్ వారిగురించి అమెరికన్లు చెప్పుకునే కథల్లో ఒకటి]

ని॥ శశిరేఖ.

## పసిపాప

* గొడవర్తి భాస్కరరావు *

వెన్నెలవలె నవ్వులను
జాజులవలె నవ్వులను
జల్లులవలె కురియునుగా
పసిపాపల హృదయాలు—.

పువ్వులవలె కోమలమై
పరుపులవలె మెత్తనయి
పిందెలవలె చిన్నవీ
పసిపాపల హృదయాలు—.

మొగ్గలవలె నిప్పుడే
కనువిచ్చిన పువ్వులే
కంటిలోని పాపలే
పసిపాపల హృదయాలు—.

అడుగగానె అణాయిస్తే
పెద్దవి రెండబ్బులనీ
పెదిపులను విరిచేటి
పసిపాపల హృదయాలు—.

పాములు కనబడితే
ఆటల సరదాలో
పరుగిడి ఆడేటి
పసిపాపల హృదయాలు—.

బొమ్మని మనమంటే
పరుగున వాడిలోకి
పరుగిడి వొచ్చేటి
పసిపాపల హృదయాలు—.



## అల్లరి బాలం

గంటిరాజేశ్వరిదేవి

పిల్లల్లారా....విన్నారా!
పాపల్లారా....విన్నారా!
అమ్మ మాటకు ఎదురు తిరిగి
చెడిపోయిన బాలంకథను—

అనగా అనగా ఒకవూరు
ఆవూరిలో ఉన్నాడోబాలం
బాలం చాలా అల్లరివాడు
పిల్లలజోలికి పోయేవాడు—

పలకాబలపం చేతనుబట్టి
సీటుగబట్టలు మేనుకువైచి
గలగలడబ్బులు జేబునవైచి
వెళ్లేవాడు పాఠశాలకు—

అల్లరిపిల్లలతో చేరీ
చిల్లరవేషా లేసేవాడు
ఆటలనన్నీ ఆడేవాడు
పేకాటల్లో మేటైనాడు.—

పిల్లలుచేసే అల్లరిపనులు
అమ్మకుతెలియనె తెలియవుకాదా!
పేకాటల్లో పోటీలొచ్చి
పేచీలెన్నో తెచ్చేవాడు.—

"తప్పబ్బాయీ అల్లరిమాను
తల్లిమాటలు చెవిలోఉంచి
విద్యాబుద్ధులు చక్కగనేర్చి
ఉద్యోగాలు చేయాలి"—

అమ్మచెప్పిన పలుకులు వినక
రోజూఆటను ఆడేవాడు
బాలం ఓటమి పొందేవాడు
వెలవెలమొఖముతో పోయేవాడు—

## అల్లరి బాలం

బాలంపెరిగి పెద్దైనాడు
చదువు ఒంటను బట్టాలేదు
షోకులు జాస్తీ పెంచేసాడు
సేకాటల్లో దూరేవాడు.—

"ఒద్దురా, ఒద్దుర కూడదురా
నామాటలు చెవిని పెట్టుమురా
పోలీసోళ్లు పట్టేస్తారు
జైలులో నిన్ను కట్టేస్తారు"—

తల్లిచెప్పిన మాటలు వినక
తగాదాలలో దిగబడ్డాడు
తగవులవరకూ వచ్చాడు
పోలీసోళ్లు వచ్చారు.—

బాలంపరుగిడి పోయాడు.
అమ్మప్రక్కనే దాగాడు
జవానులింటికి వచ్చారు
బాబును గట్టిగ పట్టారు—

కుయ్యో ! మొఱ్ఱో ! అన్నాబాలంను
గొలగొల యీడ్చుకుపోయారు
కోర్టులో తీర్పు చెప్పారు.
ఆరుమాసములు వేసేశారు.—

అమ్మమాటలు పెడచెవిబెట్టి
గురువుల మాటలు అసలేవినక
విద్యాబుద్ధులు ఒంటిని పట్టక
ఊన్నానిప్పుడు కటకటాలలో
బాలం రోజూ ఏడ్చేవాడు.—

అమ్మమాటలను ఆలకించక
అస్తమానము అల్లరిచేసిన
ఇట్లేవస్తాయ్ తిప్పలు బాలలూ
చదువుసంధ్యా చక్కగనేర్చి
స్వాతంత్ర్యాన్ని నిలపండీ.—



## నెల్లూరు బాలల మహాసభ

నెల్లూరులో బాలల మహాసభ డిశంబరు 31 ,జనవరి 1 తేదీలలో పురమందిరావరణంలో విజయవంతంగాజరిగింది

అధ్యక్షులు శ్రీ పట్టాభి రామారావుగారు ఉపన్యాసంలో భావిభాగ్యోదృమ మంతా నేటి చిన్నపిల్లలపై ఆధారపడి వుందని,అందువల్ల వారిపట్ల శ్రద్ధ వహించడం అవుసరమనీ,ఆ విషయంలో ఎంతోకృషి చేస్తూన్న రేడియో అన్నయ్య, అక్కయ్యలను అభినందించారు.

ప్రారంభకులు శ్రీ గోపాలరెడ్డిగారు,ప్రసంగిస్తూ పిల్లలు ఎప్పుడూ వాస్తవిక జగత్తులో వుండరని, కల్పిత జగత్తులో విహరిస్తారని, వారివూహంతా ఒక తెలియని విషయం మీద పోతూవుంటుందని, అందువల్ల వారి కుతూహలాన్ని అరికట్ట కుండా వుత్సాహాన్ని పెంపొందింస్తూ వుండాలని, పిల్లలకు చిన్నప్పుడుచెప్పింది శాశ్వతంగా నాటుకొంటుదని, అందు వల్లనే చిన్న వయస్సులో అన్ని విద్యలు, కళలు నేర్పాలని, ఉద్ఘాటించారు.

రేడియో అక్కయ్య, అన్నయ్యలు చేసేదానికంటే పుణ్యమైన, పవిత్రమైన కార్యం మరి ఒకటి వుండదని, ఆంధ్రదేశం వీరికి ఎంతో ఋణపడి వుంటుందని, కూడా చెప్పేరు.

తరువాత చాలామంది పిల్లలు పెద్దలు,వుపన్య సించేరు. సాయంకాలం నెల్లూరు బాల బాలికల ప్రదర్శనాలు, 1 వ తేదీ ఉదయం శ్రీ ఏ.సి, సుబ్బారెడ్డిగారి అధ్యక్షతన సంగీత వినోద ప్రదర్శనాలలో పోటీ, సాయంకాలం మద్రాసు శ్రీ న్యాయపతి రాఘవరావు గారు, కామేశ్వరమ్మగారలచే నిర్వహింపబడుతున్న ఆంధ్ర బాలానంద సంఘం వారి వినోద, విజ్ఞాన ప్రదర్శనలు విజయంతంగా జరిగినవి.

అవరిండియా ఫిల్మ్స్ వారి

# "నా యిల్లు"

అవరిండియా వారి మొట్ట మొదటి సాంఘిక చిత్రం "నాయిల్లు" పత్రికా ప్రతినిధులకు ప్రత్యేకంగా వాహినీ స్టూడియోలో 9వ తేదీ "ప్రెస్‌షో" చూపేరు. ఈ చిత్రం ప్రేక్షకుల హృదయాల్ని వూపి వదలే వాస్తవిక సంఘటనలతో నిండివుంది.

నిర్వాహకులు:

స్క్రీన్‌ప్లే & డైరెక్షన్ : వి. నాగయ్య, రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి, యడవల్లి లక్ష్మీనారాయణ, కెమేరా: రహమాన్, సంగీతం: నాగయ్య, ఎ. రామారావు ఎడిటింగ్: యస్. సూర్యం, స్టూడియోస్: వాహిని, రేవతి.

తారాగణం :

నాగయ్య, లింగమూర్తి, దొరస్వామి, రామ శర్మ, కనకయ్య, బి. వి. కుటుంబరావు, బాబ్జీ, ఎ. వి. సుబ్బారావు, గోపీనాథ్, రాజకుమారి, విద్యావతి, గిరిజ, ఛాయాదేవి, కాంత, మొదలగువారు.

ఒక సాధారణ కుటుంబీకుడు శివరాం. అతనిలో మంచీ, మర్యాద, నిజాయితీలు వున్నాయి. ఇతని భార్య శారద. ఉత్తమ యిల్లాలు. వీరికి గోపీ, హరి, అని యిద్దరు కొడుకులు, లక్ష్మి ఒక కూతురు. తన బిడ్డలను సంగీత [illegible]ను చేయాలని కలలు కంటూంటాడు శివరాం.

శివరాం తన మంచితనం, న్యాయం వల్ల సుందరంచెట్టి అనే బ్యాంకి యజమాని కింద మేనేజరు పదవిని సంపాదించగలిగేడు. యజమాని తన బావమరది ధనరాజు కన్న శివరాంను ఎక్కువగా ఆదరించేవాడు. ధనరాజు చాలా దుర్మార్గుడు. శివరాంను చూస్తే మండి పడేవాడు. అతని మీద ఏలాగైనా కుట్రలు పన్ని ఆ మేనేజరు గిరి తను పొందాలని చూస్తాడు. ధనరాజుకు లీల అనేపంపుడు కత్తె ఒకతుంది. ఆమె ఇతని చేతిలో కీలుబొమ్మ.

ఒక రోజు హటాత్తుగా బొంబాయిలో బంగారం ధర పెరిగిందనితెలిసి చెట్టి అయిదు లక్షల రూపాయల చెక్కు శివరాంకి యిచ్చి బంగారాన్ని తీసుకు రమ్మని బొంబాయి పంపుతాడు. ఇదంతా కనిపెడుతున్న ధనరాజు శివరాంను వంచించడానికి యిదే మంచిఅదునని ఈసంగతంతా లీలకు చెప్పి ఏలాగైనా అడబ్బును లాక్కు రమ్మని దాంతో ఒక ఫిలిమ్ కంపెనీ పెడదామని ఆమెకు ఆశ గొల్పి అదే రాత్రి ఆమెను బొంబాయి పంపుతాడు. లీల బొంబాయిలో హరీష్ అనే ధనరాజు స్నేహితుని సహాయంతో శివరాంను వంచించి బంగారాన్ని అవలీలగా అపహరిస్తుంది. శివరాంను చావదన్ని స్పృహతప్పివున్న వానిని రైలు పట్టాలపై వేసి రమ్మని హరీష్ తన స్నేహితున్ని పంపుతాడు. కాని అదృష్టవశాత్తు శివరాం తప్పించుకుంటాడు. హరీష్ స్నేహితుడు రైలు కింద పడి మరణిస్తాడు. కొన్ని వస్తువుల మూలంగా చనిపోయిన వాడు శివరామేననిపోలీసులు నిర్ధారణ చేస్తారు. యజమాని ధనాన్ని కాపాడడానికి తన ప్రాణాల్ని కూడా బలిచేసినందుకుయజమాని శివరాం భార్యా బిడ్డల్ని కాపాడుతానని వాగ్దానం చేస్తాడు. శివరాం ఈసంగతంతా తెలుసు కొని తన భార్యా బిడ్డల సౌఖ్యమే తన సౌఖ్యంగా భావించి యింటికి వెళ్ళకుండా తిరిగి తిరిగి చివరకు విజయవాడలో పాకీగూడెం చేరుతాడు. అక్కడ వారి సహాయంతో మున్సిపాలిటీలో పని సంపాదిస్తాడు.

ఇక్కడ దుర్మార్గుడైన ధనరాజు శివరాం స్థానాన్ని ఆక్రమించి శివరాం కుటుంబానికి చిల్లిగవ్వయినా యివ్వకుండా నా నా హింసలూ పెట్టి, ఆఖరికి యిల్లు కూడా అప్పుల వాళ్ళ అప్పుల కింద వేలాం వేసి తనే కొనుక్కుని దానికి లీలా ధనరాజు ఫిలిమ్ కంపెనీ అని పేరు పెడతాడు.

శివరాం భార్యా బిడ్డలూ దిక్కు లేకుండా బాధపడుతూ వుంటే ఆసమయంలో బాలానందసంఘం వారు వారి నాదరించి బిడ్డలకు సంగీతము నేర్పిస్తారు. వారు ఎంతో శ్రద్ధతో సంగీతం నేర్చుకుంటూరు.

ఇట్లుపన్నెండు సంవత్సరాలు గడుస్తాయి. శివరాం పిల్లలు సంగీత రత్నాలవుతారు. ఊరూరా సంగీత కచేరీ

లిస్తూ ఆఖరికి విజయవాడ కూడా వస్తారు. ఆసంగీతం విని శివరాం మురిసిపోతాడు. భార్యా బిడ్డలపై నున్న మమకారం కొద్ది తన వూరు వస్తాడు. ఆరోజు లక్ష్మి పుట్టిన దినం. ఆసంబరానంతా శివరాం పొంచి వుండి చూచి ఆనందించుతాడు. ఇంతలో పోలీసు వచ్చి దొంగ అని పట్టుకుంటాడు. భార్యా బిడ్డలకు తెలియ కుండా తప్పించు కుంటాడు శివరాం.

దుర్మార్గుడైన ధనరాజు లక్ష్మిని ఏలాగైనా చరచాలనే వుద్దేశంతో సినీమాలో పాటలు పాడే నిమిత్తం పిలిచి వంచించ పోతాడు. ఆసమయానికే శివరాం లీలా వచ్చి లక్ష్మిని రక్షిస్తారు. అది వరకే లీలకూ, ధనరాజుకూ మనస్పర్ధల మూలాన్ని ధనరాజు కుట్రలను బైట పెట్టా లన్న వుద్దేశంతో వుండి. ఇదే అదుననుకొని పోలీసులకు ధనరాజును అప్ప చెప్పి తనే బంగారం అపహరించిన ద్రోహినని ఒప్పు కుంటుంది. శివరాం బతికే వున్నాడని తెలిసి భార్యా బిడ్డలు సంతోషిస్తారు. ధనరాజుకు కఠిన శిక్ష విధించుతారు. కథ సుఖాంతము.

నాయిల్లులో బాలానందసంఘం చూపబడింది. రేడియోలో పిల్లల ప్రోగ్రాం వినడమేకాని, అది ఏలాజరుగుతుందో ఎవరూ (అంటే బయటి వూరువాళ్లు) చూడలేదు. ఆ యదార్థాన్ని నాయిల్లులో ప్రతివారూ చూడగలుగుతున్నారు. ప్రేక్షకలోకాన్ని ఆకర్షించడానికి, పిక్చర్ ఎక్కువగా సేల్ అవడానికి ఈసంఘటనను నాయిల్లులో యిముడ్చుటవల్ల దర్శకుని చాకచక్యం మనకు బాగా విశదం అవుతుంది.

దేవులపల్లివారి కలం "మల్లేశ్వరి"లోఅంత హుషారుగా జరగలేదు. మామూలు స్థాయిలోనేవుంది, యడవల్లి రచించిన సంభాషణలు కొన్ని కొన్ని వేటికే అన్వయించ కుండా వున్నాయి- ఇంటలో సంప్రదాయకమైన చక్కటి సంగీతం వినకలుగుతాం- ముఖ్యంగా "అదిగదిగో గగన సీమ అందమైన చందమామ ఆడెనోయీ" అన్నపాటకి మ్యూజిక్ ఎంతో చక్కగా అమిరి వినుటకు ఎంతో ఆనందంగావుంది. ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం కూడ బాగానేవున్నాయనవచ్చు—

నాగయ్య నటన, భావోద్రేకం వేనోళ్ళ పొగడవచ్చు కాని శారదగా రాజకుమారి ఆ పాత్రకు సరి కాలేదు అందులో అరవ తార తెలుగు మాట్లాడ్డం, తల్లిదగ్గి: బిడ్డ ముద్దులు కురుస్తున్నట్లుగావుంది. తెలుగు స్వచ్ఛంగ పలకలేక, ఆమాటలు వినుటకే ఇంపుగాలేవు. ఇంతమంది తెనుగుతారలుంటే ఈ అరవతార నెందుకు ఇరికించారో యిందులో! ఈ పాత్రకు మరొకర్ని ఏరివుంటే నాయిల్లు యింకా ప్రజాప్రశంసలని అందుకొనేది. లింగమూర్తి పేదరైతులోకంటె యిందులో బాగా నటించాడని చెప్పవచ్చు. గిరిజ, రామశర్మ, విద్యావతి, గోపీనాథ్, యింకా తదితరులు వారి వారి పాత్రలను చక్కగా నిర్వహించేరు.

కథ చాలా పెద్దదేకాని అంతగా విసుగుపుట్టించదు. అనవసరంగా కొన్ని ఘట్టాలు పొడిగించారనవచ్చు, దర్శకుడిది అందివేసిన చేయి అయినప్పటికీ కొన్ని కొన్ని చోట్ల పప్పులో కాలుపడ్డది— అంతతెలివైనవాడు, డబ్బుయందు జాగ్రత్తగలవాడు అయిన బ్యాంకి మేనేజరు శివరాం 5 లక్షలురూపాయిల బంగారాన్ని కొనడానికి అర్ధరాత్రి ఒక్కడూ బొంబాయి వెళ్ళలేడు! వెళ్ళేడు అనుకోండి! అంత మనోనిశ్చయం వున్నవాడు, లీల చేతిలో అవలీలగా లొంగిపోడు! లొంగి పోయినా అంత బంగారం తనదగ్గిరున్నట్లు చెప్పలేడు! ఇదంతా చాలా అసందర్భంగా కనిపించింది. దీనికి తగినంత కారణం దర్శకుడు చూపలేకపోయాడు.

మొత్తానికి లోపాలు ఏవో కొద్దిగా వున్నప్పటికీ "నా యిల్లు" చిత్రం, చూచినవార్ని ఆకర్షించి, ఆనందాన్ని చేకూర్చగలదని చెప్పవచ్చు.

"రవికాంత్"



జనాభా పెరుగుదలను అరికట్టడానికి మంచిమార్గం స్త్రీల వివాహయోగ్య వయస్సు కనిష్ఠ ప్రమాణాన్ని పద్దెనిమిది సంవత్సరాలకు పెంచడమేనని, దానివల్ల అధికజనాభా సమస్య తీరడమేకాక, ప్రజల ఆరోగ్యం సైతం అభివృద్ధి పొందగలదని, కటక్ నారీసేవాసదనంలో ఉపన్యసిస్తూ, శ్రీమతి అమృత కౌర్‌గారు చెప్పారు.

# దేశ భాషలలో సాంకేతిక పదావళి

సైన్స్‌సొసైటీ కార్యదర్శి శ్రీ వేమరాజు భానుమూర్తి గారు ఇలా వ్రాస్తున్నారు:

"దేశభాషలలో విజ్ఞాన ప్రచారం ప్రధాన లక్ష్యంగా సైన్సుసొసైటీ స్థాపించబడింది. దేశభాషలలో విజ్ఞాన ప్రచారం సాగించవలసిన ఆవశ్యకతను గురించి ఇప్పుడు వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఇటీవల బహుముఖంగా సాగిన విజ్ఞాన వికాసం ఫలితంగా సామాన్య ప్రజలలో విజ్ఞాన జిజ్ఞాస, పిపాస అధికమయ్యాయి.

"ఇందుకోసమే సైన్సు సొసైటీ దేశభాషలలో విజ్ఞాన గ్రంథాలను ప్రచురించ దలచుకుంది. వైజ్ఞానిక ప్రదర్శనాలను, సైన్సు ఫిలిం ప్రదర్శనాలను, ప్రముఖుల, వైజ్ఞానికుల ప్రసంగాలను ఏర్పాటుచేస్తోంది.

"కడచిన నవంబర్ 23 వ తేదీని ప్రెసిడెన్సీ కళాశాలలో జరిగిన సైన్స్ అభిమానుల మహాసభలో సైన్స్ రచయితల జాబితాలను తయారుచేయాలని, వైజ్ఞానిక గ్రంథాలను రచించడంలో వయోజన విద్యాసంఘంతో సహకరించాలని, ప్రాంతీయభాషలలో సాంకేతిక పదావళి నిఘంటువును తయారుచేయాలని తీర్మానించ బడింది.

"ఇది బ్రహ్మాండమైన ప్రయత్నం. వైజ్ఞానికులు, దేశభాషల పండితులు ఇంకెందరో ఉత్సాహశీలురైన వ్యక్తులు, పరిషత్తులు, సంస్థలు సహకరిస్తేనేకాని పూర్తికాని పని ఇది. సాంకేతిక పదావళి తయారుచేయడం కోసం ప్రభుత్వం ఏదో కొంత ప్రయత్నం చేస్తున్నది. కాని, అది ఎంతో మందగతిని సాగుతున్నది. అందుకనే 'సైన్స్ సొసైటీ' ఇటు విజ్ఞానులయొక్క, అటు పండితులయొక్క స్వచ్ఛంద సహకారాన్ని సంపాదించి, ప్రాంతీయభాషలలో ఉండే వైజ్ఞానిక రచయితలకు మార్గదర్శకంగా, సహాయకరంగా ఉండే సాంకేతిక పదావళి నిఘంటువును తయారు చేయాలని తీర్మానించింది.

"ఈ కృషిలో సహకరించవలసిందని అందరికి విజ్ఞప్తి చేస్తున్నాను.

"వివిధ శాస్త్రాలలో నిష్ణాతులు, ఉత్సాహశీలురు తాము స్వయంగా కొన్నికొన్ని శాస్త్రాలలో సాంకేతిక పదావళిని సేకరించి, కొంతవరకు వాటిని తెలుగుచేసి పెట్టుకున్న సంగతి మాకు తెలుసు. ఈ సందర్భంలో తాము సేకరించిన వివిధశాస్త్రాల సాంకేతిక పదావళిని మాకు పంపించి మాకృషి జయప్రదం కావడానికి తోడ్పడవలసిందని ప్రార్థిస్తున్నాను.

"విజ్ఞాన రచయిత లందరు తమ చిరునామాలను, తాము ఇదివరకు ప్రచురించిన విజ్ఞాన గ్రంథాలు, పత్రికలలో అచ్చు అయిన వ్యాసాల కట్టింగులతో మాకార్యాలయానికి తెలియజేసి, సైన్స్‌రచయితల జాబితా తయారు చేయడానికి మాతో సహకరించవలసిందని కూడా విజ్ఞప్తి చేస్తున్నాను. ఇందుకు సంబంధించిన సమాచారమంతా దయచేసి క్రింది చిరునామాకు తెలియపరచండి!

సెక్రటరీ, సైన్స్‌సొసైటీ, మద్రాస్-5.

# వ్యావహారిక భాష

శ్రీ పందిరి మల్లికార్జునరావు గారు ఈవిధంగా వ్రాస్తున్నారు.

అయ్యా,

వ్యావహారిక భాష ఎవరి ఇష్టంవచ్చినట్టు వారు వ్రాస్తున్నారు. దాని కొక పద్ధతిలేదు, ఒక కట్టుబాటులేదు అనే కారణంచేత మద్రాసు ప్రభుత్వంవారున్ను. పండితులలో చాలామందిన్ని పాఠ్యపుస్తకాలలో వ్యావహారిక భాష వాడకూడదని ఇప్పటికీ దానిని వెలివేస్తున్నారు.

వ్యావహారిక భాషలో రచన చేసేవారూ. తదభిమానులూ క్రియారూపాదులు ఎటువంటివి ప్రయోగార్హములో తెలుపుతూ కొన్ని పట్టికలు తయారుచేసి, పిదప వాటిని గూర్చిన చర్చకు ఒక సమావేశం జరిపితే బాగుంటుందని నాయూహ. కనుక, రచన వ్యావహారికభాషలో చేసేటప్పుడు పదప్రయోగ, క్రియారూపాది నిర్ణయం విషయంలో కలిగే ఇబ్బందులను, కష్టములను బాగా ఆలోచించి వాటిని గురించి పట్టికలు తయారుచేసి, సాధ్యమైనంత త్వరలో నాకందజేయగలందులకు కోరుతున్నాను. ఏతత్కార్యంలో తమ సహకారం తప్పక లభించగలదని నమ్ముతున్నాను.

శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు

16. జోన్స్ స్ట్రీట్, మద్రాసు 1, ఫోను : 55063

# గ్రంథ సమీక్ష

## ఆశాజ్యోతి

"అమరేంద్ర" రచించిన కథలసంపుటి— వెల ఒకరూపాయి,
దొరుకుస్థానం : ఆంధ్రా బుక్ హౌస్, గుంటూరు.

ఇందుప్రచురించబడిన "అమరేంద్ర" గారి ఐదుకథలు, ఇదివరకు భారతి మున్నగు పత్రికలలో ప్రకటించ బడినవి. "వెలుగునీడలు" "కాలంనవ్వింది" "ఎవరిది" "చైత్రపూర్ణిమ" "నాడు—నేడు" అనునవి యీకథలు. మానవజీవితంలోని సామాన్యసంఘటనలు, వివిధ ములైన సన్నివేశాలలో, విభిన్న మనస్తత్వము గలవారి ప్రవర్తన ఈకథల యందు చాలాభాగం సహజమైనదిగా చూస్తాము. సులభమైన, జాతీయమైన ప్రయోగాలలో ఈ కథలు చదువదగినవిగా ఉన్నాయి,

* * *

## అలెగ్జాండరు

అమరగాథలు— వెల 12 అణాలు.
రచయిత : ఎమ్. ఎన్. శాస్త్రి, బి. ఎస్. సి. ఫార్మసీ.
దొరుకుచోటు : జయనికేతనమ్, మదరాసు—7

మాసిడోనియానుండి, మనదేశము వరకూగల మధ్య ప్రదేశములలో, 30 ఏండ్లలో సైనికవిజయలను సాధించిన "ప్రపంచమెరిగిన ప్రచండవీరుడు" అలెగ్జాండర్. మహాపురుషుల గాథలు, వారు ఏదేశస్థులైనా, ఏనాటివారైనా, వినదగినవి, చదువదగినవి, సంస్మరింపతగినవి, అనుసరింపదగినవి. అట్టిగాథలను, అలెగ్జాండరు కథతో ఆరంభించి. అమరగాథల శీర్షికలో ప్రచురింపదలచిన రచయిత అభిలాష అభినందనీయమై, ప్రోత్సహించ వలసినదిగా నున్నది. అలెగ్జాండరు యొక్క జననాది విషయాను క్రమణికయేగాక, గాథలలోని ప్రముఖవ్యక్తుల పట్టీలు, చరిత్రలోని ప్రధానఘట్టములు, మీదుమిక్కిలి అతనిజీవితసంగ్రహము, పుస్తకారంభములో పొందుపరచుట, చదువరులకుత్సాహముగలిగించగల క్రొత్తపంథాగా తోచుచున్నది. సులభమైన శైలి, చిన్నచిన్న అధ్యాయములు, పెద్దఅచ్చుతో, 80 పేజీలయీపుస్తకము బాలబాలికలు చదివి ఆనందింపదగినదిగా ఉన్నది.

* * *

## హస్తరేఖాశాస్త్రము

రచయిత : వడ్డాది వీర్రాజు, వెల 2 రూపాయలు
దొరుకుచోటు: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

మహర్షులచే చెప్పబడిన విషయములను, ఇంగ్లీషు భాషలో గలపెక్కుగ్రంథములను పరిశీలనచేసి, స్వానుభవమువలన గ్రహించిన విషయాలతో, విజ్ఞానాన్ని సమన్వయపరచి, ధనార్జనాభిలాషతోగాక, కేవలము శాస్త్రప్రచారాభిలాషతో, సర్వజనులకు సులభముగ బోధపడు విధముగ యీగ్రంథమును తాము రచించినట్లు రచయిత పీఠికలో చెప్పకొని యున్నారు. అనేకచిత్రములతో, సులభమైన భాషలో, మామూలుగా ఎవరు చదివినా అర్థమగునట్లుగా రచించబడినది. హస్తపరీక్ష విధానము, పరీక్షకుల కుండవలసిన శీలస్వభావములు గూడ యీగ్రంథమందు పేర్కొనబడినవి.

* * * *

## తెలుగులో "Selected Essays"

గ్రంథకర్త : గంధం అప్పారావు, వెల రు 1—4—0 లు
దొరుకుస్థానం : ఆంధ్రమహిళాసభ, మైలాపూరు, మద్రాసు.

లోకజ్ఞానమునకు సంబంధించిన అనేక విషయములలో, ఎస్. ఎస్. ఎల్. సి. మెట్రిక్యులేషన్. ఎడ్మిషన్ మున్నగు పరీక్షల కనువగు సిలబసును దృష్టిలో నుంచుకొని తయారుచేయబడ్డ వ్యాసావళి. వ్యాసరచనా విధానము, పెక్కుసామాన్యమైన విషయములకు సంబంధించిన వివరములు, గ్రాంధికమైనశైలి, నేర్చుకొనదలచిన విద్యార్థులకు ఇదిచాలా ఉపయోగమైన పుస్తకము కాగలదు.



ఆంధ్ర మహిళా సభలో కాశీ విశ్వ విద్యాలయపు ఎడ్మిషన్ పరీక్ష జూనియర్ తరగతులలోని విద్యార్థినులు, ఉపాధ్యాయ బృందము.

Regd. No. 4759



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras 4

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | | |
|---|---|---|
| మహిళా విద్యాలయము | : | హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. నృత్యము, గానము. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : | కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని | : | భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : | స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : | స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : | స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : | సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : | స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్సుఎయిడ్— మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి. |
| ముద్రణశాఖ | : | ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: మార్చి '53 :: సంచిక 11

ముఖచిత్రం : 'కానుక' చిత్రకారుడు : శ్రీ ఎల్. ఎమ్. బాబూ

సంపాదకీయం
ప్రస్తుతపరిస్థితులు ... శ్రీమతి అచ్యుతుని గిరిజ.
రాజకీయములు ... శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.
కనువిప్పు (నాటిక) ... ,, ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి.
లగ్నబలిమి (కథ) ... ,, "సులోచన"
వదలని తెగులు (కథ) ... ,, పేనుమళ్ళ కామేశ్వరరావు.
రాత (అనువాదకథ) ... ,, ఆర్. రమేష్.
ప్రభుత్వపు అప్పులు ... ,, వి. వెంకటచలం
అంత్యపిశ్వాసం (కథ) ... శ్రీమతి తంగిరాల శకుంతలాదేవి.
ఇంకా, గద్యాలు, పద్యాలు, బాలానందం, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష.

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ. మైలాపూర్.

సంవత్సర చందా : : ఆరు రూపాయలు.




సంపుటి 9 :: మార్చి '53 :: సంచిక 11

# "యథా రాజా తథా ప్రజా"

———: o :———

ప్రభువులు ఏమార్గాల ననుసరిస్తారో ప్రజలు ఆమార్గాన్నే అనుసరిస్తారన్న లోకోక్తి సర్వకాల సర్వావస్థల యందు మార్పులేని యాదార్థ్యాన్ని చాటిచెప్తూవుంది. సర్వోత్తమ గుణగణాలంకారుడగు రాజు ప్రజా శ్రేయస్సు ప్రధాన చింతగా ధర్మపరిపాలన మొనరించుచున్నప్పుడు, ప్రజలు ధర్మప్రవర్తన కలిగియుండడం అతిసహజమైన పరిణామము.

ఈ రోజుల్లో భగవంతుని పేరుచెప్తేనే సెక్యులర్ స్టేట్ విధానానికి ఎక్కడ ద్రోహముచేయడమో అన్నంత భయము కలుగుతూవుంది. దేశజనాభాలో హైందవులధిక సంఖ్యాకులవడంవల్ల, ఇదియొక హైందవ సామ్రాజ్యమన్న అపకీర్తి రాగలదేమో అన్నభయంవల్ల, ప్రధాన మంత్రి మున్నగువారు సతమతపడం వారి ఉపన్యాసాల్లో విశదమౌతూ వుంది. క్రైస్తవ మహమ్మదీయులు అల్పసంఖ్యాకులైన అదృష్టమువల్ల, వారి మత సంప్రదాయములను ఎంత తుచలు తప్పకుండా, తీవ్ర విశ్వాసముతో అనుసరించినప్పటికీ, మతోన్మాదులన్న నిశిత విమర్శకు గురికావడంలేదు. ఎంత స్వల్ప భక్తుడైనప్పటికీ, హిందువుడన్నవాడు యీ విమర్శకు యిట్టె పాల్పడే అవకాశాలు ప్రస్తుత పరిస్థితులలో చాలా ఉన్నవి. అందువల్ల యీ విషయంలో అధికారులన్నవారు ఎక్కువ అప్రమత్తతతో సంచరిస్తూ, ప్రజాబాహుళ్యాన్ని తమ ఉపన్యాసాల్లో మతోన్మాదము తగదని పదేపదే హెచ్చరించడం ప్రతిదినం వింటూ ఉన్నాము.

అలాంటి పరిస్థితులలో,, గౌరవనీయులైన మన రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు, నిన్న మొన్న చేసిన దక్షిణాది పర్యటనలో, అతి శ్రద్ధాభక్తులతో దక్షిణాది పుణ్యక్షేత్రాలకు వెళ్లి, దేవాలయములలో, హైందవ మతసాంప్రదాయముల తో, దేవాలయ మర్యాదలననుసరించి, పుణ్యస్నానములు, వరిపట్ట, శేషవస్త్రధారణలు, మున్నగునవి చేయడం, చాలా ఉత్సాహకరమైన విషయం.

లోకమంతా వ్యాపించియున్న కల్లోలమునకు కారణము ప్రజాబాహుళ్యములోనూ, పరిపాలకవర్గములోనూ, నిజమైన దైవభక్తి, గురియైన ధర్మపరాయణత క్షీణించడమే. మాతృదేశభక్తి, జండాపూజలు, పెద్ద ఆదర్శములుగా ప్రచారముచేయుచున్న ప్రభుత్వము, దైవభక్తిని పెంపొందించుట వారి పూచీకాదన్నట్లు వ్యవహరించడం కొంత శోచ నీయమైన పరిస్థితిగా భావించకతప్పదు. ఏప్రజలయొక్క సౌభాగ్యసంపదలకని, శ్రేయోభివృద్ధికని, అహర్నిశలు, అవిరామ పరిశ్రమలుచేసి తాపత్రయపడుచున్నారో ప్రజలసృష్టికి మూలకారణమైన శక్తిని ఉపాసించడం ఒక ఉన్మాద మని అభిప్రాయపడడం పొరపాటుకాక తప్పదు. జన్మించిన దేశమే పూజనీయమైనప్పుడు, ఆదేశమును జననిగా ఉపా

సించుట ప్రజాధర్మమైనపుడు, ఆ జన్మకారణమైన సృష్టికర్తను—(అది శక్తికానివ్వండి, దేవుడు కానివ్వండి, దెయ్యము కానివ్వండి)—ఆ సృష్టికర్తను ఉపాసించడం మాత్రము అవసరమైన కార్యక్రమముకాదా? వందేమాతరం పాడినప్పుడు ఉలిక్కిపడి కుర్చీనుండి లేచి నిలుచుని, భగవత్ప్రార్థన చేసినప్పుడు, ఆసనము నంటిపెట్టుకుని చలించకపోవడం, ప్రజలు ఆదర్శనీయులుగా పరిగణించి పూజించుచున్న మహాపురుషులకు తగనిపని.

అందువల్లనే పూజనీయులై, రాజస్థానము నలంకరించిన రాష్ట్రపతి, తమ దక్షిణాది పర్యటనవలన, ప్రజా సామాన్యములో ఒక నూతనమైన ఉత్సాహమును కలిగించెననుకోవడం. ప్రతిదినము అత్యంత భక్తితో, దేవాలయములలో అర్చనలు చేయించువారు ప్రజలలో ఎందఱున్ననూ గణనకురారు. వారు ప్రజలకు ఆదర్శనీయులుకాలేరు. రాష్ట్రప్రభువు కనపరచిన భక్తిశ్రద్ధలు మాత్రము ప్రజల మనస్సులలో హత్తుకొనిపోయి ద్విగుణీకృతమైన ప్రోత్సాహము నీయగలవు. ఆయన అలంకరించుకున్న బాధ్యతాయుతమైన ఉన్నతస్థానమే దీనికి కారణము.

ఈ విషయములోనేగాక, ఇంకా ఇతర రాజకీయవిషయములనుగూర్చి, రాష్ట్ర విభజననుగూర్చి, మన రాష్ట్ర అధికారులతోనూ, ప్రజానాయకులతోనూ, శ్రీ రాజేంద్రప్రసాద్ గారు చేసిన సంప్రదింపులు, ఉపన్యాసములలో వారు ఉపదేశించిన సద్భావములు, ఆద్యంతము వారు కనపరచిన, వినయము, వివేకము, వ్యవహారనైపుణ్యము ప్రజల చిత్తములలో, వారియందుగల పూజ్యభావమును, ప్రగాఢ విశ్వాసమును అధికతరమొనరించినవనుట వాస్తవము. దైవభక్తి, ధర్మచింత, సహన వినయములు, సాధు స్వభావముగల మహావ్యక్తి రాష్ట్రాధిపతిగా ఉండడం చాలాహర్షనీయవిషయము. వీరి ఉపదేశంవల్ల ప్రాంతీయ నాయకులలో కొంత సహనభావ మంకురించినదనడం అతిశయోక్తికానేరదు. ముఖ్యంగా రాష్ట్రవిభజనవల్ల ఆంధ్ర తమిళ ప్రజలలో, ఆయా నాయకులలో ఆవిర్భవించి, అతిగా పరిణమించుచున్న ద్వేషభావము. రాష్ట్రపతిగారి సదుపదేశమువల్ల కొంతగా చల్లారవచ్చునని, విభజన స్నేహ సుహృద్భావములతో జరుగగలదని ఆశించవచ్చు. పక్షపాత విద్వేషరహితులైన ప్రజాపాలకులు, ప్రజా బాహుళ్యములో, పక్షపాత, విద్వేషరహితమైన సహన సుహృద్భావములను ఉత్పత్తిచేయగలరనుట వాస్తవము.

---

## గమనిక

ఆంధ్ర మహిళాసభనుండి కాశీ విశ్వవిద్యాలయపు ఇంటర్మీడియెట్ పరీక్షకు 7 గురు, ఎడ్మిషన్ పరీక్షకు 43 గ్గురు మార్చి నెలలో కాశీ వెళ్ళుచున్నారు.

రాణీ రాజ్యలక్ష్మి పారిశ్రామికశాఖనుంచి డిశంబరులో జరిగిన ప్రభుత్వపు కుట్టు, ఎంబ్రాయిడరీ హయ్యర్, లోయర్ పరీక్షలకు మొత్తం 26 గురు వెళ్ళిరి.

ప్రస్తుతం 14 ద్వారకలోవున్న ఆంధ్ర మహిళా ప్రెస్ ఏప్రియల్ మొదటి తేదీనుండి అడ్లో ఆంధ్రమహిళాసభ స్వంతభవనములో స్థాపితమగును.

# ప్రస్తుత పరిస్థితులు

• శ్రీమతి అచ్యుతుని గిరిజ •

## వేగము—ఉద్వేగము.

మన ప్రభుత్వం నిర్వహించుచున్న శాఖలన్నింటిలోను రైల్వేశాఖ చాలా విచిత్రమైనది. రైలు అనే పదం వినగానే మనకు వేగం, స్పీడు అనే మాటలు స్ఫురణకు వస్తాయ్. ఇప్పుడు తపాలశాఖ వున్నదంటే దాంట్లో చెప్పుకోతగిన విషయాలు యేమి వుండవు. కొంచం ఆలోచించిచూస్తే వేగమే కనిపించదు అక్కడ. సవాసేరు ఆముదం పూసిన బండి చక్రంలాగా చడీచప్పుడు లేకుండ ఒకే నడకలో పని జరిగిపోతూవుంటుంది. పదేళ్ల కొకసారి అయినా తపాలాఛార్జీలు మార్చరు. రాజ్యాంగాలు మారినా వూరుకుంటారుగాని, నాలుగు రోజులు పచ్చ కార్డులు, నాలుగు రోజులు నీలం కవర్లూ అట్లా తమాషాగా బాగుండే మార్పులేమిచేయరు. వంద రూపాయలకు స్టాంపులు కొన్నా ఒక్క కాని డబ్బు తగ్గించుకోనంత నిర్మొగమాటం. పోనీ నిర్వాహకులు అధికారులు అయినా ప్రజలకు కనపడి జాయలాపాయలాగా మాట్లాడి, గబగబా నాలుగు వాగ్దానాలుచేసి అయిదు అభినందనాలు అందుకుంటారా అంటే అసలే కిమిన్నాస్తి. అసలు ఆతరహాయే వేరు. నెమ్మదిగా ఒకే చడీ చప్పుడులేని నడకతో, పనికి మాటకి జతకూర్చే స్పీడులో తపాలశాఖ పోతూవుంటుంది. మరి రైల్వేశాఖ చూడండి. అడుగడుక్కీ విశేషాలు సశేషాలే. వేగం అనే పదానికి పదవిభాగం, దండాన్వయం, తాత్పర్యం, అర్థం, పెడర్థం మొదలయిన వైద్యాలన్నీ చేసి దాని అంతు కనుక్కుంటున్నారు. వేగం అనే పదంలోనుంచి కొన్ని కొత్త పదాలకు అంటుకడుతున్నారు. ఇదేమిటని ఆశ్చర్యపడనవసరంలేదు. అదే రిసెర్చి అంటే. మామూలు ప్రదేశాల్లో మెయిలు బళ్లు ఎక్సుప్రెస్ బళ్లు గంటకి 40 మైళ్లు 50 మైళు చొప్పున నడుస్తున్నవనుకోండి. దాన్ని 40 మైళ్ల వేగము 50 మైళ్ల వేగం అని మాత్రమే అంటాము. కాని మా అపూర్వనగరం జిల్లాలో సర్వసాధారణంగా అన్ని రైళ్లు గంటకు 5 మైళ్ల ప్రకారం పాతుకుపోతాయ్. మరి దానిని గంటకు 5 మైళ్ల వేగం అంటే యేమి ఇంపుగా వుంటుంది. అందుకని ముచ్చటగా మురిపెంగా వేగం అనే పదాన్ని తుంచి మేము మావైపు రైళ్లు 5 మైళ్ల "గం"తో పోతున్నవని చెప్పుకుంటాము. నిజానికి రైల్వేశాఖవారు వారి నోటి గుండ యీపదం జారీ చేయలేదనుకోండి. కాని యింతటి శబ్ద బ్రహ్మలు, పద సృష్టి యింత తేలికగా చేయటానికి సహాయపడింది వాళ్లేగా. మెప్పును సరిఅయిన స్థలానికి చేరవేయటం ఉత్తమ పౌరులు కాదలుచుకున్నవారి విధాయకం. ఇటువంటి సాహిత్యసేవ మాత్రమే కాక రైల్వేవారు చాలా నిర్జీవ సేవకూడ జరుపుతూవుంటారు. దేశంలో పెద్దలంతా పోగై జీవకారుణ్యమంటు పెద్ద పేర్లు పెట్టి రెండు మేకలను నాలుగు దూడలను బజాన కూర్చోపెట్టుకుని ఫోటోలు తీయించుకుంటారు. అదేమి గొప్ప? పంచదారకు చీమలుపడితె బయటికితీసుకువెళ్లి జాగ్రత్తగా వాటిని దులిపి వస్తామేగాని నలిపి పారవేయం. జీవంవున్న జీవిని అంతా దయగానే చూస్తారు. కాని రైల్వేవాళ్లు జీవం అంటు జన్మాన యెరగని పట్టాలను ఇంజన్లను యెంతో దయగా చూస్తారు. ఇంగ్లాండువంటి అతి నవీన దేశాలలో ఆదరించేవారులేని వృద్ధులకు కొన్ని శరణాలయాలు కట్టించి అక్కడ సపర్యలు చేస్తారంటే ఎంతో విచిత్రంగా వింటాం. అంతదాక యెందుకు రైల్వేవారు కొన్ని జిల్లాలలో ప్రత్యేకించి వృద్ధాప్యం వచ్చిన పట్టాలను, శత వృద్ధలయిన ఇంజన్లను వుంచుతారు. అంటే అదొక శరణాలయం అన్నమాట. అక్కడి వుద్యోగస్తులంతా నిద్రాహారాలు మాని క్షణక్షణానికి వాటిని తాకిచూసి మోగించిచూసి గిల్లిచూసి తగిన సేవలు సపర్యలు చేస్తువుంటారు. వదవద వణుకుతు కిర్రు కిర్రు మోతచేస్తు గిల గిల కొట్టుకుంటున్నట్లుగా నడిచే ఆ నూటయాభై యేళ్ల వృద్ధ యింజను యింకా గంట 5 మైళ్ల "గం"లో నడుస్తున్నదీ అంటే దానికి రోజుకు యెందరెందరు పెద్దలు స్పెషలిస్టులు కంటికి రెప్పలాగా కాపాడుతున్నారో మీరే వూహించుకోండి. ఏ క్షణాన యే సేవలు అవసరమో అని రెప్ప వాల్చకుండ, మామూలుగా వుంటే మాంద్యం కలుగుతుందనే సందేహంతో ప్రాణాలన్నీ అరచేతిలో రెడీగా పెట్టుకునివుండే డ్రైవరుముందు మేనర్సు పోటీకి నిలవగలదు? ఇంతటి నిర్జీవకారుణ్యం యింకెక్కడలేదని మనమందరం ముమ్మాటికి పలుకవలదె ?

# ప్రస్తుత పరిస్థితులు

రైల్వేశాఖలో మార్పులన్నీ చకచకా జరిగిపోతు వుంటయ్. అటు మొన్న 1, 2, ఇంటరు 1, 3 వ క్లాసు లంటువుండేవి. నిన్న 1, 2, రెండులో రెండు, 3 తరగ తులు వున్నవి. తెల్లవారేటప్పటికి 1, 2, ఇంటరు, 3 తరగ తులు వుండి ఎయిర్ కండిషన్డు పెట్టెలు కొన్నిచోట్ల అద నంగా దిగుమతి అయినవి. మరి రేపటి సంగతి వినుకోండి, ఎయిర్ కండిషన్డు, 2, ఇంటరు 3 మాత్రమే వుంటవిట. మరి ఎల్లుండి సంగతి యింకా వూహకు అందటల్లేదు.

గంటలమీద ఛార్జీలు హెచ్చించారు. తరాలవారీగా తగ్గించవచ్చునని వినికిడి.

పైగా రైల్వేశాఖలో యెంత జాయలాపాయలాగా ప్రజ లను కనిపెట్టివుంటారోచూడండి. అయ్యో పాపల పసి వారు అని దయదలిచి విద్యార్థులకు కన్సెషన్సుయిచ్చారు. ఇప్పుడు పోనీ పాపం అని పంతుళ్లకుకూడ యివ్వబో తున్నారు. తపీమనిచేస్తారు తప్పదు.

బొత్తిగా రైలు యెక్కటమే మానుకుంటున్నారు యీ మూఢ మానవులు అని తమ ఆదాయంద్వార తెలుసుకొని నటువంటివారై, రైల్వేవారు రేపీపాటికి ఒక మహోప కారం చేయబోతున్నారు. 14 రోజులు నిరాఘాటంగా ఆ కోన్‌లో యెన్నితడవలు దిమ్మతిరిగినా టికెట్లు 30 రూ పాయలేట. నిజంగా యిటువంటి అవకాశం, అందులో రాష్ట్రంకోసం తలతిరిగేట్టుగా బాధలుపడుతున్న మన ఆంధ్రలోకానికి ఒకవరం. తలొకటికెట్టు కొనుక్కొని మనకున్న ఆస్తిపాస్తులు, భూమి పుట్ర అంతా వ్యయంగా చూసుకుని, యెక్కడెక్కడ యెవరుగట్టు జరుపుకుం టున్నారో, హద్దులు మింగుతున్నారో, తప్పుడు ప్రచా రాలుచేస్తున్నారో అని చూసుకురావచ్చు. పైగా పక్క భాగస్తులకు గుండె పగిలేట్టుగా నాలుగు వుపన్యాసాలిచ్చి కొంకి కర్ర వూగించి అదిలించిరావచ్చు. ఇంతటి అవకా శాన్ని జారవిడుచుకోక ఆంధ్రులంతా యీ 30 రూపాయల టికెట్లు కొని ఆంధ్ర పౌరుషం దేశమంతటా చూపిరావచ్చు. అంతే అనుకోకుండానే రైల్వేవారు రాజకీయరంగంలో కూడ అతివేగ మహావేగంతో సేవచేస్తున్నారన్నమాట. ఇప్పటివరకు గం, వేగం, అతివేగం, వేవేగం, మహా వేగం అనే పదాలుమాత్రమే విన్నారు. కాని రైల్వేశాఖ నిర్వాహకులు చేస్తున్న వాగ్దానాలు, చేయతలుచుకున్న ఉపకారాలు, వేసుకున్న పథకాలు, మంత్రుల వుపన్యాసాలు వింటుంటె యింకోపదంకూడ స్ఫురించుతుంది. అదే ఉద్వేగం. పదవిభాగంచేస్తే ఉత్ - వేగము. వేగము అనే పదానికి ఆఖరు స్థాయి ఉత్ - వేగముల కూడికఅయిన ఉద్వేగమని సాహితీపరుల నిర్ధారణ. ఎటుచూసినా వేగమే చూశారా.



# నీరాంజనము

శ్రీ సూరంపూడి భాస్కరరావు.

కర్పూరపు హారతిగైకొమ్మా మాయమ్మా, నీ
కన్నకొడుకు లిరుగో ముక్కోటిగొంతులొకటైకీ
ర్తింపనిటకు చనుదెంచిరి తెలుగుతల్లీ దీవింపగ
దమ్మా మాయమ్మా
శాతవాహనుల వంశము చాళుక్యనృపాలకులము
కాకతీయ సమ్రాట్టులు విజయనగర రాణ్మణులును
నిన్నుమున్ను పూజించిరి నేడుమమ్ము దీవింపగ
దమ్మామాయమ్మా॥
ఈ త్రిలింగ మధ్యావని నేకధర్మధామముగా
నీ త్రిలింగ భూప్రజాళి నేకధర్మనిరతులుగా
జేయశక్తియుక్తులుగా జేసి మమ్ము దీవింపగ
దమ్మా మాయమ్మా॥



# రాజకీయములు

• శ్రీ గొళ్ళపూడి రామచంద్రరావు •

జనవరి చివరివారం మొదలుకుని ఫిబ్రవరి మూడో వారం వరకూ ప్రపంచ రాజకీయాల్లో కొన్ని అతి ప్రధాన సంఘటనలు జరిగినవి— ఫార్మోజా ద్వీప "తాటస్థ్యాన్ని" అమెరికా రద్దు చేయటం, సుడాన్ స్వపరిపాలన సమస్య మీద ఈజిప్టు, బ్రిటన్‌లు ఒప్పందం కుదుర్చుకొనటం, ఇజ్రేల్‌తో రష్యా తెగతెంపులు చేసుకొనటం, ఆర్. కె. నారాయణ్‌గారికి స్టాలిన్ ప్రత్యేకాహ్వానం పంపి సంప్రదింపులు జరపటం, బ్రిటన్ నడిపే కొలంబో పథకం, అమెరికా నడిపే విదేశ సహాయ కార్యక్రమాల లోపాల గుట్టును ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ అధ్యక్షుడు బయట పెట్టటం.

* * *

జనవరి 20 వ తేదీన అమెరికా కొత్త అధ్యక్షుడు జనరల్ ఐసెన్‌హోవర్ అధికారాన్ని స్వీకరిస్తూ తన విధానాలను సూచించారు. అప్పుడే ఫార్మోజా "తాటస్థ్యం" రద్దు చేసినట్టు ప్రకటించారు. కమ్యూనిస్టుల ముందు నిలవ లేక చాంగ్‌కై షెక్ పారిపోతోన్నప్పుడు అతడికి ఆశ్రయ మివ్వటానికీ, ఫార్మోజాను కమ్యూనిస్టుల వశంకాకుండా అడ్డగించటానికీగాను అమెరికా తన నౌకా బలాన్ని అక్కడ నిలిపి చాంగ్‌ను కాపాడింది. చావుతప్పి కన్ను లొట్టపోయిన చాంగ్ చైనామీద "దాడి" చేయకుండా కూడా తాను నివారిస్తానని అమెరికా చెప్పింది. దీనికి ఫార్మోజాను తటస్థంగా ఉంచదలుస్తున్న పేరు పెట్టింది. ఇటీవల చాంగ్‌కై షేక్‌కు చాలా ఆయుధాలు సప్లయి చేసి, చైనామీద దొంగదాడులు జరపటానికి హుషార్ ఇచ్చింది. అయితే చైనా నిజంగా ఫార్మోజా మీద దాడి చేస్తే, అమెరికన్ బలాలు అడ్డగించగలవని అమెరికన్ అధికార వర్గాలు స్పష్టపరుస్తున్నారు.

ఐసెన్‌హోవర్ చేసిన ఈ నిర్ణయం యుద్ధవిస్తరణకు దారితీస్తుందని ప్రపంచదేశాలు యావత్తూ భయాన్ని వెల్లడించినవి. ఇండియా, కెనడా, బ్రిటన్ మొదలైన దేశాల నాయకులు చాలా విచారాన్ని వెల్లడించారు. కాని బర్మాకు మాత్రం ఇది ప్రాణసంకటంగా పరిణమించింది. ఇంతకు ముందునుంచే అక్కడ తిష్ఠవేసుకుని ఉన్న కొమింటాంగ్ చైనా బలాలు చైనా సరిహద్దుల్లో ఉన్న బర్మా స్థావరాలను ఆక్రమించటం ప్రారంభించినవి. కిందటి నెలలో మూంమెసూ అనే సంస్థానాన్ని ఆక్రమించి, మళ్ళీ కిందటి వారంలో మూంగ్యాన్ అనే షాన్ సంస్థానాన్నీ, క్యావోక్ అనే సైనిక స్థావరాన్నీ కూడా బర్మానుంచి ఈ సేనలు లాక్కున్నవి. కాని బర్మాలో స్థానిక ప్రజలు కొమింటాంగ్‌తో పోరాడటానికి ప్రజాసేనలను తయారు చేస్తున్నారు.

బర్మాలో తిరుగుబాటు చేస్తున్న కరేన్‌లను బ్రిటిష్ కన్సర్వేటివ్‌లు అసలు ముందు పురికొల్పారు. వాళ్ళకు అమెరికన్ సహాయం ఉన్నట్లు బర్మా విదేశాంగమంత్రి ఉ విన్ క్రిందటి నెల బొంబాయిలో వెల్లడించినట్లుగా కొన్ని పత్రికలు ప్రకటించినవి. ఇంతవరకూ ఈ కరేన్‌లు, కమ్యూనిస్టులుగా పనిచేస్తున్నారని పశ్చిమ రాజ్యాలకు చెందిన వార్తాసంస్థలు ఒకే పనిగా ప్రచారం చేసినవి. కాని వీళ్ళు కొమింటాంగ్ సేనలతో ఒప్పందాలు చేసుకున్నట్లు సాక్ష్యాలు దొరికినవని బర్మా ప్రభుత్వం ఈ నెలలో ప్రకటించటంతో అసలు బండారం బయట పడ్డది.

బర్మాలో కొమింటాంగ్ బలాలు, ఫార్మోజా పట్నంలలో ఉన్న బలాలు చైనాకు హానిచేయగలవు అన్నది సందేహమే. ప్రజల అసహ్యానికి గురి అయి పారిపోయిన చాంగ్ ప్రభుత్వం విదేశ బలాల సాయంతో మళ్ళీ చైనాలోకి అడుగు పెడితే, ప్రజలు సహిస్తారని అనుకోనక్కరలేదు. కాని బర్మాలో కొమింటాంగ్ సేనల ఉనికి మాత్రం అంతర్జాతీయ ధర్మాలను పూర్తిగా ధిక్కరించటమే అవుతున్నది. ఈ ధిక్కారం చేస్తున్న చాంగ్ ప్రభుత్వాన్నే ప్రస్తుతం ఐక్యరాజ్యసమితి గుర్తిస్తున్నది.

* * *

ఐసెన్‌హోవర్ నిర్ణయంవల్ల తక్షణం వచ్చిపడే ప్రమాదాలు లేవుగాని, ఆసియా ప్రజలు ఒకరితో ఒకరు పోరాడటమే లక్ష్యం కావలసిందని ఆయన ఎన్నికల ప్రచారంలో బయటపెట్టిన ఉద్దేశం నెరవేరటానికి అది దారి తీస్తుంది. అయితే యాల్టా ఒప్పందాన్ని ధిక్కరించి ఫార్మోజాను చైనాకు దక్కకుండా అడ్డగించటంతో తృప్తిపడక, తూర్పుయూరప్, శాఖలిన్, పోర్ట్ఆర్థర్

మొదలైన ప్రాంతాల విషయంలోకూడా పేచీలు తీసుకుని రావటానికి అమెరికా నిశ్చయించింది.

*   *   *

కాని ఈ సందర్భంలో కొరియా విషయం లేలిపోయింది. యుద్ధవిరమణ సంప్రదింపులు కేవలం యుద్ధ ఖైదీల సమస్యమీదనే భగ్నం కాలేదనీ, తన పరిసరదేశాలన్నిటినుంచీ తనమీద దాడి చేయటానికి అమెరికా ప్రయత్నిస్తున్నదనీ చైనా అభిప్రాయ పడటమే ప్రధాన కారణమని తెలిసిపోయింది. చైనాకు ఈ భయం లేకుండా చేసి. దూరప్రాచ్య సమస్యలన్నింటినీ కలిపి పరిష్కరించాలని పశ్చిమరాజ్యాలు అనేకం కూడా అభిప్రాయపడుతున్నవి. కాని అమెరికాను ఒప్పించగలస్థితిలో అవి ఉన్నట్లు తోచదు.

*   *   *

ఫిబ్రవరిలో సూడాన్ భవిష్యత్తుమీద ఈజిప్టు ప్రభుత్వానికీ. బ్రిటనుకూ ఒక ఒప్పందం కుదిరింది. ముగ్గురు సూడానీలు, ఒక ఈజిప్షన్, ఒక బ్రిటన్, ఒక అమెరికన్ కలిసిఉన్న ఒక సంఘం ఇండియా చీఫ్ ఎలక్షన్ కమిషనర్ సుకుమార్ సేన నాయకత్వాన పార్లమెంటు ఎన్నికలు జరుపబోతున్నవి. ఇది 3 సం॥ల పాటు స్వపరిపాలనను నడిపి, ఈజిప్టుతో చేరటమో, లేక స్వతంత్రంగా ఉండటమో నిర్ణయించే రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేస్తుంది. అంతవరకూ గవర్నర్‌జనరల్ పరిపాలనను కూడా అంతర్భారతీయ సంఘం ఒకటి కనిపెట్టి ఉంటుంది. అయితే సూడాన్‌ను కామన్వెల్తులో చేర్చుకోవాలన్న అభిప్రాయాన్ని బ్రిటిష్ విదేశాంగ మంత్రి వెల్లడించటమూ, ఆప్రయత్నం జరిగితే అసలు ఒప్పందాన్నే రద్దుచేస్తానని ఈజిప్టు ప్రధాని నజీబ్ స్పష్టపరచటమూ చూస్తే ఈ సమస్యమీద ఇంకా ఎన్నో పేచీలు వచ్చే అవకాశం కనిపిస్తున్నది. ఇంతేకాక దక్షిణ సూడాన్‌లో నివసిస్తున్న నీగ్రోజాతుల ప్రజలుకూడ ముందు ముందు పెద్ద సమస్య కాగలరు. వీళ్ళ విషయంలో ఈజిప్టు ఔదార్యంతో, వాస్త వికదృక్పథంతో నడుచుకోకపోతే, ఆఫ్రికన్ జాతుల ద్వేషానికి గురి కాక తప్పదు. ఈసందు చూచుకుని మళ్ళా బ్రిటన్ తిష వేయటమూ సంభవమే.

ఈనెలలోనే రష్యా ఇజ్రేల్‌తో తెగతెంపులు చేసుకున్నది. జెకోస్లవేకియా కమ్యూనిస్టులలో యూదులు కొందరు ప్రపంచ యూదు సంస్థల తరఫున విద్రోహాలు జరిపారని ఇటీవల శిక్షించబడ్డారు. ఇదే వుద్దేశంతో యూదు డాక్టర్లు సోవియట్ నాయకులను హత్యచేయ ప్రయత్నించారని ఆరోపించబడ్డది. వీటి ఫలితంగా ఇజ్రేల్‌లో దౌర్జన్యవాదులు సోవియట్ రాయబారి కార్యాలయంమీద బాంబులు వేశారు. దానితో రష్యా ఇజ్రేల్‌తో తెగతెంపులు చేసుకున్నది.

యూరప్ అంతటా యూదులు హింసింపబడుతున్న రోజుల్లోనే రష్యావారికి అన్నివిధాలా అండగా ఉండి, వారికోసం ప్రత్యేకంగా ఒక రాష్ట్రాన్నికూడా ప్రత్యేకించి, జాతీయ నివాసంగా చేయ ప్రయత్నించింది. కాని యూదులకు ఇజ్రేల్‌మీద మోజు ఎక్కువగా ఉన్నందువల్ల, ఆప్రయత్నం ఫలించలేదు. ఇజ్రేలుకు తూర్పు యూరప్ దేశాలు చాలా తోడ్పడ్డవని ఇజ్రేల్ నాయకులే మొదట్లో అంగీకరించారు. ఇది ఇట్లాఉండగా, తూర్పుయూరప్ విచారణలకు యూదుల విద్వేషంతో ప్రత్యక్షసంబంధమేమీ లేదనీ, కమ్యూనిస్టు పార్టీలలో సాధారణంగా వచ్చే కల్లోలాలే అని అనీ నేషన్ వంటి అమెరికన్ పత్రికలేసూచించినవి.

అందువల్ల ఈతెగతెంపులకు ఇజ్రేల్ అంతర్జాతీయవిధానాలు, లేక మధ్యప్రాచ్యరక్షణ వ్యవస్థను భగ్నంచేయాలన్న సోవియట్ సంకల్పమో కారణమయిఉండవచ్చును. అరబ్బులులేని మధ్యప్రాచ్యరక్షణ వ్యవస్థ అసంభవం, కాబట్టి ఇప్పటికే పశ్చిమరాజ్యాలతో తగాదలాడుతున్న అరబ్బులను రష్యాచర్య మరింత ఆకర్షించ వచ్చును. అరబ్బులను కూడగట్టుకునేందుకు పశ్చిమరాజ్యాలు కూడా పనిచేస్తున్నవి. తనకు ప్రమాదకరమని ఇజ్రేల్ గోల పెడుతున్నప్పటికీ. అరబ్బురాజ్యాలకు ఆయుధాలు పంపుచున్నవి. రష్యా తెగతెంపులు చేసుకున్నదికనుక, తనను ఆయుధసహాయం చేయాలన్న ఇజ్రేల్ విజ్ఞప్తిని అమెరికా లక్ష్యపెట్టక పోవటం ముఖ్యంగా గమనించ తగ్గవిషయం. మొత్తానికి ఇజ్రేల్‌కు ఇవిచాలా గడ్డురోజులు.

అర్జెంటీనా రాయబారి సేన్యార్‌బ్రావో ఈనెలలోనే మార్షల్ స్టాలిన్‌ను కలుసుకుని పరస్పర సంబంధాలను గురించి సంప్రదింపులు జరిపారు. ముఖ్యంగా వ్యాపారం విషయంలో సంప్రదింపులు జరిగినవి. మరొక దక్షిణ

అమెరికా దేశమయిన భీలీకూడా రష్యాకు రాగివిగుమతులు సాగించాలని ఉద్దేశిస్తున్నట్లు వార్తలు వచ్చినవి.

దక్షిణ అమెరికాదేశాలు పేరుకు స్వతంత్రంగాఉన్నవే కాని, వాటి పరిశ్రమలు, వర్తకవ్యాపారాయ పూర్తిగా అమెరికా, బ్రిటన్‌ల చేతుల్లో వున్నవి. ఆదేశాల్లో రోజు రోజుకీ వచ్చే విప్లవాలు ఆదేశాల పారిశ్రామిక సంస్థలు ఆడేనాటకాలవల్లనే వస్తున్నవి. ఆసంస్థల ఉచ్చునుంచి తమ దేశాలను విడిపించాలని ప్రజలుచేసే విప్లవాలుకూడా వాటిల్లో కనిపిస్తవి.

బ్రిటన్, అమెరికాల ప్రాబల్యాన్ని పడగొట్టటానికి దక్షిణఅమెరికా సాగిస్తున్న చర్యల్లో అర్జెంటినా మొదటి నుంచీ ముందడుగు వేస్తున్నది. అమెరికా ఉద్దేశించిన అఖిలఅమెరికా సమాఖ్యకు ప్రతికూలంగా ఉండటమేకాక, గతయుద్ధంలో జర్మనీ సహాయం తీసుకోవాలనికూడా ప్రయత్నించింది. ఇప్పుడు ఆంగ్లోఅమెరికన్ వర్గానికి ప్రతికక్షి అయిన రష్యా సహాయాన్నికూడా కోరుతున్నది.

అయితే అమెరికాకూడా ఊరుకోటంలేదు. దక్షిణ అమెరికా దేశాలను తృప్తిపరచటంకోసం స్పెయిన్‌ను మరింత చేరదీస్తున్నది.

వెనకపడ్డదేశాల సహాయానికని బ్రిటన్ కొలంబో పథకాన్నీ, అమెరికా చతుర్థసూత్ర ప్రణాళికలనీ నడుపుతున్నవి. వీటినిగురించి ఎంతోప్రచారం జరిగింది. కాని ఈనెలలో ప్రపంచ ఆహారవ్యవసాయ సంస్థ డైరక్టర్ జనరల్ నారిస్‌డాడ్ ఒకప్రకటన చేస్తూ ఇవి కేవలం రాజకీయోద్దేశాలతో ఏర్పాటు చేయబడ్డపథకాలేసనీ, ఈసహాయం స్వీకరించే దేశాలు అభివృద్ధి పథకాలని నిర్వహించటానికి తగిన శక్తిలేకుండా ఉన్నవని ప్రకటించారు. అంటే ఆయాదేశాల ప్రతినిధులుగా వ్యవహరిస్తున్న ప్రభుత్వాల నిజాయితీని, శక్తిసామర్థ్యాలను ఈయన ప్రశ్నిస్తున్నారన్న మాట. చైనాలోకొమింటాంగ్, ఫిలిప్పీన్స్‌లో క్వెరీనో, దక్షిణకొరియాలో సింగ్మన్‌రీ, సయాంలో పీబుల్‌సంగ్రామ్ ప్రభుత్వాల దుర్వ్యయాలను గురించీ, అవినీతిని గురించీ ఇటువంటి ఆరోపణలే వచ్చివున్నవని గమనిస్తే, ప్రస్తుతం ఆగ్నేయాసియాలోని ప్రజాస్వామ్యాలు ఎటువంటివో నన్న సందేహం రాకమానదు.





ఆంధ్ర మహిళాసభలో రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున సభ్యురాండ్రు.



# కను విప్పు

నాటిక

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

## ఒకటవ రంగము

(నిశీథసమయము. రమ వంటరిగా గదిలో కూర్చుంది. ఎక్కడో కొంచెం చప్పుడయినట్టు వినిపించింది. అతి భయంతో "ఎవరువారు" అని మెల్లిగా అంటోంది. ఇంతలో దగ్గరగా చప్పుడయ్యింది తలుపు కొడుతున్నట్లు. (సుబ్రహ్మణ్యం ప్రవేశం వక స్త్రీతో)

సుబ్రహ్మణ్యం :- తలుపు తియ్యి.......

రమ :- (వణుకుతూ) : ఎవరు ?

సు : ఎవరేమిటి. నేనే తలుపుతియ్యి తొందరగా.

ర : [అతిఆశ్చర్యంగా] మీరా ! ఇప్పుడా ! [తలుపుతీసి] ఎక్కడనుంచి రావటం ! ఈ తడిబట్టలేమిటి ! ఈ అమ్మాయియెవరు ? ఆ !....అట్లావున్నారే ! .

సు : [విసురుగా] : సమాధానం చెప్పటానికి సావకాశం లేదు. ముందర యీవిడకు పొడిబట్టలిచ్చి గదిలో పడుకోపెట్టు. నేనువస్తా ఇప్పుడే.

ర : [అమితభయంగా] : మీ .. రె .. క్కడికండి !

సు : [కోపంగా] అలాంటి కుంటి ప్రశ్నలు వెయ్యొద్దని లక్షతొంభైసార్లు చెప్పాను. నేను బ్రతికున్నంత వరకు మానవల్లేవుంది.

[వెంటనే నిష్క్రమణ]

ర : ఎందుకండీ అంతమాట ఎవరమ్మా నువ్వు? ఎక్కడనుంచి వస్తున్నారు. చెప్పమ్మ చెప్పు, అయ్యో అంత ఆయాస పడుతున్నావే! నీళ్ళల్లో ఎందుకు దిగారు? పడుకో అమ్మ పడుకో. అయ్యో! ఇదెక్కడిపాపం. ఈసారి వారు వూరునుంచి రాంగానే యెంతో యిదిగా వుందామనుకున్నా. వచ్చే రావడంతోనే పిడుగు పడ్డట్టయింది. నాకేం అర్థం కావటంలేదు. నాకు భయమేస్తోంది. ఎక్కడికెళ్లారు? నువ్వన్నా చెప్పవు.

[డాక్టరుగారితోసుబ్రహ్మణ్యం ప్రవేశం]

సు : ఇటురండి. ఈగదిలో వుంది.

డా : ఆఁ నాడి చాలా నీరసంగావుంది. అంతసేపు నీళ్లల్లో వున్నారంటిరి. తెలివొచ్చి అడిగితే కొంచెం కాఫీయిప్పించండి. భయపడాలసిన అవసరమేమీలేదు. ఇదుగో మందిస్తున్నాగా.

సు : చిత్తము. ఇంత అర్ధరాత్రి మిమ్మల్ని.

డా : ఆఁ దానికేముంది. అవసరం అందరికీ వకటే. వస్తాను,

[డాక్టరు నిష్క్రమణ]

సు : ఆ తలుపువెయ్యి చలిగాలి కొడుతోంది.

ర : ముందర తడిబట్టలు విప్పండి. ఎక్కడినుంచి వస్తున్నారు? ఈ అమ్మాయి యెవరు?

సు : ఆమ్మాయి యేంచేసిందినిన్ను. నేను యెట్లావున్నానో యేమిటో.

ర : అదేమిటండీ అట్లాఅంటారు, మీరు యెప్పుడు వస్తారా అని వేయికళ్లతో కనిపెట్టుకుని—

ు : నిజమే నిజమే వచ్చాగా. హాయిగానిద్రపో. నన్ను యెక్కువగా పలకరించక, పాపం యీ అమ్మాయి చచ్చిపోయేదే ఆనీళ్లల్లో, సమయానికి నేను కనక వెళ్లకపోతే.

ర : ఏం, ప్రమాదమేమన్నా జరిగిందా?

ు : ప్రమాదం యేం లేదులే. బ్రతికేవున్నాం. ప్రమాదాలుకూడ యెందుకు ?

ర : ఎందుకండీ కోపం నామీద? నేనేమన్నా పెడర్థాలు తీస్తారు.

సు : అందుకనే పడుకోమన్నా. నేను పెడర్థాలు తీసే వాణ్ణేను.

ర : క్షమించండి నేనేమీ అనను.

సు : నువ్వనక్కర్లా. ఎందుకాయేడుపు పిలుస్తే పలుకుతుందే.

ర : ఏడవటంలేదండీ, నా మనస్సులో మనస్సులేదు. ఎంత బాధపడివచ్చారో యీ రాత్రివేళ నాతో చెప్ప కూడదా?

సు : నీతో చెపితే నువ్వేంచేస్తావు? అయిపోయిన దానికి....

ల : ఈ అమ్మాయి యెవరండీ....

సు : ఎవరని చెప్పమంటావు. ఓ దిక్కులేని అనాధస్త్రీ. అప్పుడున్న పరిస్థితుల్లో, యీ అమ్మాయికి అంతా నేనే. అంతకంటె యేం చెప్పను?

ర : పాపం యెవరిఅమ్మాయో. తెల్లవారంగానే వాళ్లింటికి పంపించేశెయ్యండి, వాళ్ల తల్లి దండ్రులు యెంతబాధపడుతున్నారో!

సు : ఎవరిపిల్లని ఎవరింటికి పంపించేస్తాం!

## రెండవ రంగము

(తెల్లవారింది. శశికి స్పృహవచ్చింది. తను యిప్పుడున్న పరిస్థితి అంతా తెలుసుకుంది. తను పంటరిది మొట్టమొదటే సుబ్రహ్మణ్యాన్ని ప్రేమించింది.)

శ : ఇంతశ్రమపడి నన్ను యిక్కడికి తీసుకువచ్చి నా ప్రాణం దక్కించారు. ప్రాణదాతలు, మీ ఋణం నేను యెట్లా తీర్చుకోగలను.

సు : ఒక జీవి మరణావస్థలోవుంటే రక్షించటం, మానవుని విధ్యుక్తధర్మం. నా విధిని నేను నెరవేర్చుకున్నాను. ఇందులో వకళ్లమెప్పు పొందాలనే ప్రమేయంలేదు.

శ : మీ ఔదార్యానికి నా కృతజ్ఞత....ఇక యింటికి....

సు : అప్పుడేనా, ఇంకా శ్రమన్నా తగ్గలేదు....

ర : పాపం వాళ్లవాళ్లు యెంత కనిపెట్టుకునివున్నారో....

శ : అవును....నేను తొందరగా వెళ్లాలి....

సు : మీదేవూరు?

శ : (కొంచెం తడబడుతూ) వకవూరనేమిటి? మా తల్లితండ్రులు నన్ను వెళ్లగొట్టినప్పటినుంచి అన్ని వూళ్లూ మావే.

సు : అవుతే యిప్పుడు యెక్కడికి వెళ్ళదామని....

శ : ఎక్కడికైనా వెళదామని.

సు : ఎక్కడికైనా వెళ్ళటం యెందుకు ఇక్కడే వుండ వచ్చుగదా.

ర : ఆ అమ్మాయి యెక్కడికో వెళదాం అనుకుంటుంటే మధ్య మనం ఆపటం యెందుకు?

సు : ఫలానాచోటుకని ఆ అమ్మాయికి తెలీదుగా! పోనీ యిక్కడే వుంటుంది.

శ : అంతగా మీరు చెపుతుంటే నాకు వెళ్ళ బుద్ధిపుట్టుట లేదండీ.

ర : మీరు వేరే యెక్కడికైనా వెళ్ళదలుచుకుంటే వెళ్లి రండి. మళ్లీ రావచ్చు.

శ : అబ్బే, నాకు యింకొక చోటుకు వెళదామనిలేదు లెండి.

సు : అందుకనే యిక్కడ వుండమన్నా. నువ్వుయిక్కడ, నీసొంతయింట్లో వున్నట్టు వుండచ్చు. ఏం భయ

పడక్కల్లేదు.

ర : ఏ మండీ మనం రేపు సాయంత్రం మా వాళ్ల వూరు వెళదామనుకున్నాం కాదండీ.

సు : అనుకున్నాంలే. ఇప్పుడు మించిపోయిందేముంది? పై వారం వెళదాంలే.

ర : మించిపోయిందనిగాదు. వస్తామని వుత్తరంకూడ వ్రాశాంకదా అని.

శ : పోనీ వార్ని వెళ్ళనీయండి. పుట్టింటికి వెళదామను కోవటం సహజమేగా.

సు : అవును, ఆ పనిచెయ్యి పోనీ.

ర : తలొకసారి యెందుకు, ఇద్దరం కలిసి పై వారమే వెళదాంలెండి,

సు : మొదటే అన్లా నేను.... తొందరగా వంటకానీ. ఎప్పుడు తిన్నదో అన్నం నిన్న.

శ : నీళ్ళు పోసుకుని వస్తాను. చిరాకుగావుంది.

సు : స్నానాలు గది చూపించవే.

ర : ఏమండీ వెళతానన్న ఆ అమ్మాయిని యెందుకు ఆపటం?

సు : ఏం, నాలుగు రోజులుంటుంది. వుంటే తప్పా.

ర : తప్పువప్పులుకు కాదండీ. తనకు యెవ్వరూ లేరం టోంది. అలాంటి అమ్మాయిని మనింట్లో యెం దుకు అట్టేపెట్టుకోవటం?

సు : ఎవరన్నా వుంటే మనింట్లో యెందుకు వుంటుంది!

ర : బాగావుంది. అందుకోసం మనింట్లో వుంచుతారన్న మాట. ఎవరన్నా చూసినా బాగుండదు.

సు : ఉంటే తప్పా. నీకు బాగుందన్నమాట. పరాయి స్త్రీని యింట్లో పెట్టుకోవటం.

ర : నామాట అట్లా ఉంచండి. మీకు బాగుందా పోనీ.

సు : నాకు బాగుండకపోతే నేను యెట్లావప్పుకుంటాను!

ర : అదుగో చూడండి, యెంత చొరవగా మీగదిలోకి వెళుతోందో ! ఇదెక్కడి అన్యాయం........

సు : నీ చీరె మంచిదేమన్నాయియ్యి.

ర : మీరు మాట్లాడే మాటలు నాకేమీ అర్థం కావటం లేదు.

సు : నీకిప్పుడు అర్థం కావులే. అర్థం అయ్యే రోజులు ముందున్నాయి.

ర : అదిగో చూడండి. నాపెట్టెకూడా తీస్తోంది.

సు : చీరెకేమోలే.

ర : నేనీకొంపలో వుండలేనండి యింక. ఎవత్తినో తెచ్చిపెట్టి, యిట్లా ఆడిస్తూంటే.... అయ్యో ఆ మూనె రాసుకుంటోంది. నేను పండక్కి రాసుకుం దామని ఆసీసా కదిలించలా యింతవరకు.

శ : ఏమండీ బజారుకు వెళ్ళివద్దామా వంటయ్యేలోగా.

సు : ఈవూరు బజారు చూసేదేముంది? అయినా వెడ దాంలే. మేము వోగంటలో వస్తాము. వచ్చేటప్ప టికి వంటచేసి రెడీగా అట్టేపెట్టు.

(నిష్క్రమణ)

ర : అయ్యో! ఇదెక్కడి వుప్పలాయి. ఎవతినో తీసుకురావటమేమిటి? అదీ, వారూ కలిసి బజారు షికారుకు వెళ్ళటమేమిటి! వాళ్ళు వచ్చేటప్పటికి నేను సిద్ధంగా వార్చటమేమిటి! వంటదానికంటె కనికిష్టమైందే నా బ్రతుకు? నేను ఎంత అనుమాన పడుతూవుంటానో అంతా నిజమై తీరుతోందే. ఇక నన్నుకూడ మరిచిపోతారు గామాలు. ఇదెక్కడి కర్మమో! (కొంచెం ఏడుస్తుంది)

## మూడవ రంగము.

(ఓనాడు సినీమాకు వెళ్ళివచ్చినతరువాత శశి, సుబ్ర హ్మణ్యాం యిద్దరూ వెన్నెట్లో కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. రమ విచారంగా ఓ తలుపుమూల నక్కి కూర్చునివుంది.)

శ : ఏమండీ, సినిమాలో చంద్రవంక బాగుందా? నేను బాగున్నానా?

# కను వి ప్పు

సు : నీదగ్గర చంద్రవంకేమిటి, సూర్యవంక కూడా బలాదూరే.

శ : మీమాటలకేమి లెండి. మరి మీరు సినీమా చూశారు కదా :

సు : అవును, నువ్వూ చూశావుగా.

శ : నేను అందంగా వున్నానని అన్నారు కదూ!.... రమకంటేనా?

సు : రమ ఏంచాలుతుంది నీముందర!

శ : మీరు అట్లాగే అంటారు. రమకన్నా అవుతే, నేను అంటే మీకు యిష్టమేనా?

సు : ఇష్టం కాబట్టేగా యిన్నాళ్ళు నాదగ్గరున్నావు.

శ : అర్ధం అయింది, అర్ధం అయింది. మనిద్దరికి సాక్ష్యం అచంద్రుడే కిటికీలోంచి చూస్తున్నాడు. అవుతే నేను మిమ్మల్ని వకటి అడగదలచాను. అడుగుతే మీకేమన్నా....

సు : మనం ఇన్నిరోజులనుంచి వకచోట వున్నాం. అన్యోన్యంగా నువ్వడుగుతే నాకేం. అడుగు శశీ అడుగు.

శ : ఏమో, మీరేమన్నా అనుకుంటారేమో!

సు : బలే దానివే, అడగమంటుంటే! నేను అనుకోవడమేమిటి?

శ : ఏమో, నాకు భయమేస్తోంది, మీరు నన్నేమీ....

సు : ఇన్నాళ్ళనుంచి యిక్కడ వుంటున్నావు. నా మనస్సు కనుక్కోలేకపోయావు యింతేనా!

శ : ఈమాటలకేంగాని, మీరు నన్ను ప్రేమిస్తున్నారా?

సు : దీనికేనా యింత సందేహం. దానిలో సంశయం యేముంది? నువ్వు యిక్కడకు వచ్చినప్పటినుంచి నిన్ను యెంతో ప్రేమగా చూస్తున్నాను. ఆసందేహము యిప్పుడు కలిగిందేం నీకు.

శ : ఆఁ ఏంలేదండీ, సినిమా చూశాంకదూ యివ్వాళ. నాకేమో పెళ్ళికాలేదు.

సు : అవును, ఆవిషయం నాకు అదివరకే తెలుసుగా,– ఇప్పుడు జ్ఞాపకం చెయ్యటంలో ఆంతర్యం?

శ : ఆంతర్యం గ్రహించకుండానే మీరు మాట్లాడుతున్నారన్నమాట........

సు : మనం వకచోట వున్నాకూడ, నువ్వు నా మనస్సు కనుక్కోలేక పోయావుకాని, నీమనస్సు నేను గ్రహించలేక పోతానా!

శ : ఈ ఎత్తిపొడుపు మాటలతో యేం వుపయోగం కాని, నిజంగా చెప్పండి. మీరంటే నాకెంతో ప్రేమ. మరి నేనంటే మీకూ............

సు : అవును. చెప్పు యింకా సందేహం యెందుకు?

శ : చెపితే ఏం ప్రయోజనం. దానికి తగిన ప్రతిఫలం వుండేగా?

సు : నీమనస్సులో భావాల్ని నీనోటవెంబడిరానీ, సగం సగం మాటలెందుకు?

శ : అదికాదండీ, ప్రేమ వుందన్నారుగా.... పెళ్ళి.....

సు : పెళ్ళి! ఎవరిపెళ్లి?

శ : మనపెళ్లి!

సు : మన పెళ్లా!............

శ : మరి నన్ను ప్రేమిస్తున్నానన్నారుగా!

సు : శశీ! నీమాటలధోరణినిబట్టి నీ అభిప్రాయాన్ని నేను అదివరకే గ్రహించాను. ప్రేమ అనే మాటకు పెళ్ళి అనే అర్ధమే తీస్తే మానవుడు తోటి మానవునియందు చూపించవలసిన ప్రేమకు అర్ధమేమిటి? తల్లిప్రేమ అంటారు దీని భావమేమిటి? తండ్రి మీద కూతురుకున్న ప్రేమలో ఆంతర్యమేమిటి? ఇద్దరి ప్రాణస్నేహితులమధ్య ప్రేమ వుద్దేశమేమిటి? అప్పచెల్లెళ్ళ ప్రేమలో అభిప్రాయమేమిటి? అన్నా చెల్లెలి మధ్య వుండే అన్యోన్యంకూడా ప్రేమే. నేను నిన్ను ప్రేమిస్తున్నానంటే ఆప్రేమకు యీ అర్ధం తీసుకోవాలి–ప్రేమ అంటే భార్యా భర్తల అన్యోన్యం వక్కటే అని అనుకోవటంవలన నా రమ యిన్నాళ్ళనుంచి

(తరువాయి 21-వ పేజీలో)

విజ్ఞానము :

# భిన్న మానవులు

• శ్రీ వేమరాజు భానుమూర్తి •

మానవులలో అనేక రకాల వారున్నారు. మాటవరుసకు మనదేశంలో మన ప్రజలనే తీసుకుందాము. వారిలో భాషల భేదము లే కాకుండా మొఖ రేఖలలో కూడా అనేక తేడాలున్నాయి. కాశ్మీరీలలో కళ ఎక్కువ. బాహు బలం ఎక్కువ. అలాగే పంజాబు వీరగడ్డగా భాసిల్లింది. ఆంధ్రులలో సౌకుమార్యం ఎక్కువ. తమిళులలో ఆవేశం తక్కువ. ఆలోచన ఎక్కువ. కన్యాకుమారి దగ్గర ఉండే కేరళలలో లాలిత్యం ఎక్కువ. నేపాల్ లో ఉండే గుర్ఖాలకు పొట్టి ముక్కులు, చప్పి దవుడలు సర్వసామాన్యం.

అలాగే ఇతర దేశాలలోను ఖండాలలోను కూడా. మధ్య ఆఫ్రికాలో ఉష్ణమండల ప్రాంతాలలో ఉండే ప్రజలలో కొందరు శ్యామల గాత్రులు. జుట్టు మెలి తిరిగి ఉంటుంది. ఇంక యూరప్ ప్రజలలో శ్వేత గాత్రులు. ఉంగరాల జుట్టు. అలాగే ఉత్తర అమెరికాలోని ఆదివాసులు కొంచెం చామన చాయ రంగులో ఉండేవారు. వారి జుట్టు యూరోపియనుల కంటె కొంచెం నిడుపుగా ఉండేది.

ఇంక సాధారణంగా మనిషిని పోలిన మనిషి ఉండడం చాలా కష్టం. ఆఖరుకు కవలలలో సైతం ఎక్కడో ఒక చోట ప్రస్ఫుటమైన మార్పు ఉంటూ వుంటుంది. ఒంటి రంగులో, ఆలోచనలలో, మేధాశక్తిలో ఈ భిన్నత్వం కన బడుతూనే వుంటుంది.

ఈ భిన్నత్వానికి కారణం ఏమిటా అని ఆలోచన రావడం సహజం. బహుశా పూర్వకాలంలో వివిధ జాతుల ప్రజలు కలిసిపోయినందువలనే మానవులలో ఈ మార్పులు కలిగాయని గట్టిగా చెప్పడానికి లేదు. ఎందుకంటే మాటవరసకి మన తెలుగువారినే తీసుకోండి. తెలుగు జాతిలో అందరి రంగూ ఒకే విధంగా ఉంటుందని, అందరికీ ఒకే రకమైన తలకట్టు ఉంటుందని చెప్పగలమా? చెప్పడానికి వీలున్నదా? ఆరువేలసంవత్సరాల నాటి సమాధులను పురాతత్వ శాఖవారు త్రవ్వి చూశారు. అక్కడ దొరికిన శవాల కపాలాల తీరులో ఎన్నో తేడాలున్నాయి. ఆరోజులలో మరణించిన మనుష్యుల కపాలాలను జాగ్రత్తగా పరిశీలించి చూసినా ఇట్టి తేడాలు కనిపిస్తూనే వున్నాయి.

అంతే కాదు. మానవుల సహజ సామర్థ్యంలో శరీర దార్ఢ్యంలో, ప్రతిభలో, వంటి రంగులో, జుట్టు తీరులో ఈ విధమైన భిన్నత్వం ఉంది. మాటవరసకు నాసంగతే తీసుకుందాము నాకు విజ్ఞానాన్ని దేశభాషలలో ప్రచారం చేయడమంటే చాలా ఇష్టం. ఒక్కొక్క సారి అందు కోసమే పుట్టాననుకుంటూ వుంటాను. ఆ విశ్వాసంలోనే రోజుకు పదిహేను గంటలదాకా ఆ లక్ష్య సాధనకోసం పాటుపడుతున్నాను. అయితే కమ్మని సంగీతం ఎవరైనా పాడుతుంటే విన్నప్పుడు ఒక అవ్యక్తమైన ఆనందం కలుగుతుంది. కాని ఆపాడుతున్నది ఏరాగమో చెప్పమంటే తెల్లమొగం వేస్తాను. అలాగే ఏ శ్రీనుతి సామ్రాజ్యమో, రుక్మిణీదేవో, లేక తిరువాన్కూరు సోదరీమణులలో నృత్యం చేస్తుంటే చూచి ఆనందిస్తాను కాని వాటికి సంబంధించిన వివరాలు అడిగితే తెల్లమొహం వేస్తాను. కాని సీతాపతి గారి సంగతి అలాకాదు. ఆయన సంగీతాన్ని ఆనందిస్తూ అదే రాగమో చెప్పేస్తారు. ఇంక కృష్ణయ్యర్ గారు భరత నాట్యం చూస్తూ అందులోని మర్మమంతా ఇట్టేపట్టేస్తారు. అయితే విజ్ఞానరహస్యాలను తెలుసుకోవడానికి, ప్రచారం చేయడానికి నాకు హెచ్చు అవకాశాలు లభించని మాట వాస్తవమే. అయితే సంగీత రహస్యాలను తెలుసుకోవడానికి, నృత్య మర్మాలను అవగాహన చేసుకోవడానికి నాకు కూడా అవకాశాలు లేకపోలేదు. ఇంతకీ ఈ తర్జన భర్జన అంతా ఎందుకంటే మానవుని సాధనలో, సంస్కారంలో వ్యక్తి వ్యక్తికి ఎన్నో మార్పులు కనబడుతున్నాయి. ఇందుకు కారణమేమిటో తెలుసుకోలేక పోతున్నాము. అయినప్పటికీ, మన జీవితాలలో ఆయా వ్యక్తులు సాధించినది ఎక్కువగానో, తక్కువగానో, ఉండడానికి కారణం సహజసిద్ధంగా, పుట్టుకతో వారికి లభించిన ప్రత్యేక గుణాలేననిమాత్రం నిస్సందేహంగా చెప్పుకోవచ్చు

# భిన్న మానవులు

బహుశా మానవ మేధస్సులో అనేకములైన అంతరాలుండబట్టే మానవజాతి సృష్టిఅంతకీ మకుటాయమానమై నదిగా రాణించ గలిగిందని నా నమ్మకం. ఈ సత్యాన్ని ఈనాటి రాజకీయవేత్తలు గుర్తిస్తే మన ప్రపంచం ఇప్పుడిలా యుద్ధం భయంతో కొట్టుమిట్టాడుతూ వుండవలసిన అవసరం ఉండేదా?

అభిప్రాయ భేదాలుండడం సహజమని, ఆయా వ్యక్తుల సంస్కారాలను బట్టి, సమర్థతలను బట్టి, ఇతర విషయాలను బట్టి, వారి ఆలోచనలుంటాయని, కేవలం మనంపట్టిన కుందేటికి మూడే కాళ్లనకుండా ఎదటివాళ్ల వాదాన్ని కూడా సావధానంగా విని, అవసరమైతే మన మనస్సును మార్చుకోవచ్చుననే ఆలోచనతో నిరహంకారంగా ఈ ప్రపంచ రాజకీయ నాయకులు ప్రవర్తించిననాడు ఈ ప్రపంచం భూతల స్వర్గంకాదా?

నిజానికి స్వాతంత్ర్యం అంటే ఏమిటి? వ్యక్తుల విభిన్నతను, ప్రత్యేకతను గుర్తించడం కాక మరేమిటి? ఎందుకంటే పాఠకులలో అనేకమంది ఆలోచనల కంటె ఈ క్షణంలో నాఆలోచన భిన్నమైందిగా ఉంది కనుకనే. ఏసమాజంలో అయితే వ్యక్తులు తమప్రత్యేక సామర్థ్యాన్ని, ప్రతిభను స్వేచ్ఛగా, పెంపొందించుకోవడానికి ఎట్టి అవరోధం లేకుండా పూర్తి అవకాశాలుంటయో అట్టి సమాజమే ఎక్కువ స్వాతంత్ర్యాన్ని అనుభవించ గలుగుతుంది. మన భారత రాజ్యాంగంలో ప్రాథమిక లక్షుల నిర్వచన సందర్భంలో భారత పౌరులందరికీ ఇట్టి స్వేచ్ఛ కల్పించ బడింది. అందుకనే స్వతంత్ర సమాజంగా భారత ప్రజలు అభివృద్ధి చెందవలసివున్నది. నిజానికి ఇట్టి అభివృద్ధి సాధించ బడాలంటే ప్రతివారికి స్వేచ్ఛగా అభివృద్ధి పొందడానికి సమానావకాశాలు కల్పించాలి. అంతే కాదు మనకంటె భిన్నమైన ఆలోచనలు కలవారిపట్ల, భిన్నమైన ఆర్థిక, సాంఘిక వ్యవస్థలు కలదేశాల పట్ల సహన భావాన్ని అలవర్చుకోవాలి.

నిజానికి తన ఇచ్చవచ్చిన పద్ధతిలో కృషి చేయడానికి, తన ఇచ్చవచ్చిన విధానాలను అవలంబించడానికి, స్వేచ్ఛ లేనినాడు సమాజానికి అభివృద్ధి ఎక్కడ? అప్పుడు ఈ జగత్తే జడమై పోతుంది.

ఈ విధమైన భిన్నత్వం ఒక్క మానవులలోనే కాదు ఉన్నది. మన పెంపుడు జంతువులలో కూడా కనబడుతుంది. కుక్కలలో వేటకుక్కల తీరువేరు. మంద కుక్కల సంగతివేరు. ఊరకుక్కలకీ, సీమకుక్కలకీ బోలెడంత తేడా ఉంది. మనదేశంలో వర్ణవ్యవస్థ ఇంచుమించుగా వృత్తులను బట్టి ఒక్కొక్క ప్రత్యేక వర్గం జనులను సృష్టించడానికి జరిగిన ప్రయత్నంగా పేర్కొనవచ్చు. ఈ వర్గవ్యవస్థ ప్రకారం రాజుకొడుకు రాజు. బిచ్చగాడి కొడుకు బిచ్చగాడే. పాకీపని చేసేవారి బిడ్డలు తరతరాలుగా పాకీ పనే చేయవలసివుంది. ఇక బ్రాహ్మణుడు తరతరాలకు బ్రాహ్మణుడుగానేఉండిపోయాడు. పుట్టుకే ఆమనిషివృత్తిని కూడా శాశ్వితంగా నిర్ణయించివేస్తుంది. తరతరాలుగా మానవులకు ఒక వృత్తికి కట్టిపడవేసే ఈ వ్యవస్థ ఇప్పుడు మన కళ్ల ఎదుటనే శిధిలమైపోతున్నది. పుట్టుకచేత బ్రాహ్మణులు అనేకమంది తమ కులధర్మములైన యజన, యాజనాది షట్కర్మలను స్వస్తిచెప్పి ఇతర దీనవృత్తులను పూనుకోవడం, వీరులుగా వర్ధిల్ల వలసిందని వర్ణ వ్యవస్థలో నిర్దేశించబడిన క్షత్రియులు 'చెప్పుల' వ్యాపారం చేస్తుండడం మనకళ్ల ఎదుటే జరుగుతున్నాయి. ఇంతకీ దీనిభావం వ్యక్తి స్వేచ్ఛకు అవకాశం లేని ఏవ్యవస్థ అయినా కూలిపోక తప్పదని చెప్పడమే నా అభిమతం.

ఇంకొక సంగతి. మానవులలో అనేకజాతుల వారున్నారు. అంటే ఒక జాతికి చెందిన వారికంటె ఇంకొక జాతికి చెందినవారు తెలివి తేటలలో తీసిపోతారని కాదు. ప్రజ్ఞలో, నైతిక సిద్ధాంతాలలో, కళాకౌశలత్వంలో వీరుభయులకీ పెద్ద తేడా ఏమీ ఉండకపోవచ్చు కాని వంటి రంగులలో, కనుముక్కు తీరులలో మాత్రం తేడాలుంటాయి. ఈ రంగుతేడా ముఖ్యంగా శీతోష్ణ స్థితిలో గలభేదాన్ని బట్టి వచ్చిందిఅని చెప్పాలి. అందుకనే కాశ్మీర్ ప్రజలు సుందర గాత్రులైతే, సింహళవాసులు అంతకంటె కొంచెం ఛాయ తక్కువగా ఉంటారు. ఎండ తక్కువగా వుండే యూరోపులో ఆస్ట్రేలియాలో నివసించేవారు శ్వేత గాత్రులైతే, మధ్య ఆఫ్రికాలో, భూమధ్య రేఖ పరిసరాలలోని

ఉష్ణమండలంలో నివసించేవారు నల్లగా ఉంటున్నారు. యూరోపియనులలో అందరికంటే నల్లగా ఉంటాడనుకునే వాడు సైతం నీగ్రోలలో చామన ఛాయగా ఉండే వాడికంటే కూడా తెల్లగానే ఉంటాడు. ఈనాడు మన దేశంలో నిరక్షరాస్యులు ఎక్కువ. అయినా మన ప్రజలు స్త్రీ పాతివ్రత్యంలో, సంస్కారంలో మామూలు యూరోపియనులకన్న ఎక్కువైనవారని చెప్పడానికి ఎవ్వరికీ సందేహం అక్కరలేదు. మర్యాదలో, అనేకమంది యూరోపియన్ పండితులకంటే, నిరక్షరకుక్షియైన భారతీయుడు నిక్కంగా ఎక్కువ సంస్కారి. ఏమైనప్పటికీ ఈ భిన్నత్వం వల్ల మానవ జాతికే ఎంతో మేలు చేకూరిందని చెప్పవలసి వున్నది. ఒకజాతి కంటె మరొకజాతి భిన్నమైందని చెపితే ఒప్పుకోవడానికి ఎవరికీ ఎట్టి అభ్యంతరం ఉండకపోవచ్చు కాని, ఒకజాతి కంటె మరొకజాతి అధికమైందని అంటే మాత్రం పేచీ తప్పదు. వైజ్ఞానిక దృష్టితో నిష్పక్షపాతంగా చెప్పాలంటే ఆయాజాతులలో గల భిన్నత్వం అవి సాధించిన ఘనవిజయాలలో ద్యోతకమవుతూ వుంటుంది. మాట వరుసకు పరుగు పందెములలో ఎక్కువ దూరం గబగబా పరుగెత్తడానికి కావలసిన లక్షణాలు సహజంగా ఫిన్లాండ్ ప్రజలలో ఎక్కువ. అలాగే తక్కువ దూరం గబగబా పరుగెత్తగల చేవ అమెరికన్ నీగ్రోలకు ఎక్కువ. అలాగే వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో కూడా ఒక్కొక్క జాతి ఒక్కొక్క విషయంలో ప్రావీణ్యాన్ని సంపాదిస్తుంది. బ్రిటిష్ వారిలో నావికులెక్కువ. ఫ్రాన్సులో రచయితలెక్కువ. సంస్కారులెక్కువ. జర్మనీలో సైనికులెక్కువ. వైజ్ఞానికులెక్కువ. అమెరికాలో వర్తకులెక్కువ. భారతీయులలో కబుర్లపోగులుఎక్కువ. అలాగే చరిత్రలోకూడా ఒక్కొక్క దశలో ఒక్కొక్క వర్గానికి ఎక్కువ ప్రోత్సాహం లభించేది. మొగలాయీల కాలంలో శిల్పులకు ప్రాధాన్యం హెచ్చు. కృష్ణరాయల కాలంలో కవులకు ప్రోత్సాహం ఎక్కువ, ఇప్పుడు వైజ్ఞానికులకు పెద్ద పేట లభిస్తున్నది.

ఏమైనప్పటికీ మానవుడు సర్వతోముఖ ప్రజ్ఞాశాలిగా చతుఃషష్టి కళలలో ప్రావీణ్యం సంపాదించగల సహజలక్షణ సంపన్నుడుగా జన్మించగల సుదినం లభించేవరకు ఈవిధంగా మానవుల ప్రజ్ఞాప్రాభవాలలో, రూపురేఖలలో భిన్నత్వం ఉండడమే సమాజాభివృద్ధికి, ప్రపంచ శ్రేయస్సుకు అవసరమనిపిస్తుంది.



## స్వార్థత్యాగి, మహాతపస్వి

# కీ. శే. శ్రీ పొట్టి శ్రీరాములుగారికి జోహారు

ఆంధ్ర పుత్రా! నీకు జోహారు.
ధన్య చరితా నీకు జోహారు.
స్వార్థ రహితా నీకు జోహారు.
త్యాగమహితా నీకు జోహారు.
రామ మూర్తీ నీకు జోహారు.
రమ్యమైన ఆత్మ సంస్కృతీ గల్గిన శ్రీ
రాములు గుప్తా నీకు జోహారు.
జయ ఆంధ్రమాతకు జయ.
తెగువ గల్గిన ధీర పురుషుఁడు
సాహసికుడగు స్వార్థరహితుడు
తనదు రాష్ట్రపు ధర్మ మరసియె
అసువులను బలిదానమిడెన్.॥
చిన్మ యాత్ముడు శ్రీరామ చంద్రుని
పోల్కి దెచ్చుచు పుణ్య పురుషుడు
శ్రీ రాములు గుప్త చింత సేయకె
ప్రాణములనె తన ప్రజల కిడెన్.॥

[27 వ తేదీనాడు మద్రాసులో ఆంధ్ర మహిళాసభలో జరుప బడిన కీ. శే. పొట్టి శ్రీరాములు గారి అశ్రుతర్పణ సభలో చదవ బడినవి.]



## అశోకా స్నో & బ్రిలియన్ టైన్




లావణ్యము, యవ్వన వికాసము, మృదుత్వము,
దట్టమయిన కురులు, మనోహరలాడె
ఠీవు, పరిమళమును ఒసగునవి.

## అశోకా ఆమ్లా హెరాయిల్ & పొమేడ్

సుదీర్ఘ కుంతలములు, చల్లదనము, వసంతకుసుమ పరిమళము, ఔషధగుణము వీటి ప్రత్యేకత.







K V PILLAY

## అశోకా (బొరేటెడ్) టాల్కం & టాయిలెట్ పౌడర్సు

ఉత్తమశ్రేణికిచెందిన వస్తుచయముతో తయారైనవి. హాయి, నూతనోత్సాహము. మృదుత్వము. తన్మయత్వమునొందించు పరిమళము.




**FOR FINEST COSMETICS**

విజయా కెమికల్సు,
కాస్మెటిషియన్సు
15, క్లెమెన్సు రోడ్డు,
పురుషువాకం, మదరాసు-7

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీ రామ భక్తుడైన త్యాగరాజు నందలి గురు భక్తి వల్ల గురుస్తుతి కీర్తనలను రచించిన శ్రీమతి. ఎమ్. కె సుందరవల్లిగారు. శ్రీ నడాదూర్ అమ్మాళ్ నరసింహాచార్యులుగారి కుమార్తె. మాతృభాష తమిళం అయినప్పటికీ, తండ్రిగారి వలెనే, సంస్కృతాంధ్ర భాషలలో మంచి పాండిత్య పటిమను సంపాదించినారు. మూడు భాషలలో ఆమె కీర్తనలను రచియించినారు.

శ్రీమతి సుందరవల్లిగారు రచియించి, స్వయముగ పాడి వినిపించిన కీర్తనలను, త్యాగసేవాసక్తయైన బెంగుళూరు నాగరత్నమ్మగారు, యూనివర్సిటీ ప్రొఫెసర్ సాంబమూర్తిగారూ కూడ సంగీత సాహిత్యముల రెండింట. ఉన్నత స్థానమునందుకున్నవని స్తుతించినారు.

ఈ కీర్తనలను ఆంధ్ర మహిళలో వచ్చేసంచికనుండి స్వర రాగములతో ప్రతినెల ఇకమీద ప్రచురింప నుద్దేశించుచున్నాము.

అందుకు పూర్వము, రచయిత తొలివాక్కును ప్రకటించుచున్నాము.

శ్రీరఘుకులావతంసుడగు రామచంద్రుని దర్శచరితంబును భక్తిభావంబున ప్రస్తుతించిన మహాకవులెందరో! అట్టివారలలో, శ్రీరాముని దివ్యనామమును గానరూపమున సర్వకాల సర్వావస్థలయందును నేమరక కీర్తించి, పదివేషములలో రామవేషమే తనకు పరమప్రీతికరమైనదని నొక్కి వక్కాణించి చరితార్థత నొందిన పుణ్యపురుషులు మనత్యాగబ్రహ్మము.

రసోదంచిత గంభీరార్థప్రదములగు వారికృతులయందలి మాధుర్యమును సంపూర్ణముగా అనుభవించి గ్రోలసమర్థత వారి కృపాకటాక్షముచేకాని సిద్ధింపదు.

క॥ "హరిసేవచే యుటకు కడు,
హరిదాసుల సేవయధిక మందురు విబుధుల్॥"

కావున, భక్తిప్రపూర్ణులును, పరమ భాగవతశ్రేష్ఠులును, సంతత శ్రీరామచంద్ర కైంకర్య రూపమగు మహానందమనుభవించిన, బ్రహ్మజ్ఞాన నిధియునైన శ్రీ త్యాగరాజస్వామి గుణానుభవంబుచేయవలయునను తలంపు యీసామాన్యురాలి హృదయంబున కలిగిప్రజ్ఞ అత్యల్పము, అజ్ఞానమనల్పము అనియెంచక, ఆ భారతకులాలంకారుని కల్యాణగుణముల నించుక గీర్తించి జన్మసాఫల్యము గాంచవలయునను పేరాసతో యీకృతిరూపమగు స్తుతిరచనకుం కడంగితిని. నాదప్రియుడైన గురుని నాదరూపమున స్తుతింప నారంభించినవెంటనే, గురుకటాక్షమున వెలువడిన ఈకృతులను, సంగీతసాహిత్య ప్రియులగు కవిగాయక లోకమునకు పుస్తకరూపంబున నొసగవలెనను కోరిక మెండుగయున్నది. ప్రస్తుతము, ద్రవలోపంబువలన ఆకార్యమును విరమించుకొంటిని. త్యాగసేవాసక్తులగు సంగీతాభిమానుల వల్లయీకార్యము నెరవేరునను నమ్మకము గలిగియున్నాను.

యీకృతులను తమపత్రికలో ప్రచురించి సహాయమొనర్చుచున్న శ్రీ ఆంధ్రామహిళా సంపాదకవర్గము వారికి నా కృతజ్ఞతాసూచక వందనశతము లర్పించుచున్నాను.

ఇట్లు గురుకృపార్థిని

కె. యం. సౌందర్యవల్లి

---

## కను విప్పు

(16-వ పేజీ తరువాయి)

ర : నేను సంకుచిత బుద్ధితో, మీ పుత్రధర్మాలను గ్రహించలేకపోయాను. మీరు అంటూనే వున్నారు ఋజువు చేస్తానని. మీరు చేసిందంతా నాకు తెలియచెప్పటానికనే గ్రహింపు కూడ లేకపోయింది.... మీ మనస్సును.... ....

శ : అది మీకు తెలియచెప్పటంకాదు, నాకు బుద్ధి చెప్పటం. దిక్కులేకుండా అనది వద్దున పడి వుంటే నన్ను తీసుకొచ్చి ప్రాణభిక్ష పెట్టారు. వారి మనస్సు గ్రహించలేకపోయాను.... .... .... నన్ను క్షమించండి.... .... ....

సు : లే....అమ్మా....లే.... ఏం రమా ! ప్రేమ అంటే పెళ్ళేనా?
యెంత బాధపడుతోందో నాకు తెలుసు.... ....

★

# "త్వమేవాహమ్"

• శ్రీ వసంతరావు రామకృష్ణరావు •

కవిత్వము ఒక దేశమునకును, ఒక జాతికిని, ఒక నాగరకతను సంబంధించి ఉండదు. అది విశ్వజనీన మైనది. కవిత్వమునకు రసార్ద్రమైన హృదయము, కల్పనాశక్తి, ప్రతిభ అవశ్యకములు. అన్ని జాతులవారి ఆది కవిత్వము సామాన్యముగ గేయ రూపమున ఉవతరించిన విషయము విదితమైనదే.

కాలక్రమములో కావ్య కల్పనము. గుణము, వస్తువు మొదలైన విషయములందు మార్పులు వచ్చినవి. పరిస్థితుల మార్పుచే ప్రజల విశ్వాసములు, భావములు, ఆదర్శములు మారినవి, బుద్ధికి బలము హెచ్చినది; భావమునకు శక్తి చేకూరినది. ఈశతాబ్దములో సమకాలీన భావములను అధిగమించు కవిత్వము జనించినవి. లాక్షణికులు విమర్శకులగు వారి సూత్రములకు వశము కాని కవితా శక్తి ఉద్భవించినది.

ఆవిధముగా జనించిన కవితా ప్రపంచములో ఆరుద్ర వ్రాసిన "త్వమేవా హమ్" ఒకటి. ఈ కావ్యము సాంప్రదాయ సిద్ధముగా వచ్చిన కవితా రీతులను అధిగమించినది. గుణము, వస్తువు, ఛందో పద్ధతి సాంప్రదాయములలో, కవి సమకాలీన నాగరికతను వ్యంజించే పదజాలాన్ని ప్రయోగించేడు—నేటి సాంఘిక జీవనావిధానంలోని సంఘర్షణా శక్తులను ఆరుద్ర ఈ కావ్యంలో బాగా చిత్రించేడు. కావ్యం అంతటా ఒక విధమైన ఆవేశం కనిపిస్తుంది. కవి తన శిల్పం ద్వారా పాఠకులలో ఉద్రేకాన్ని కలిగిస్తాడు.

గేయ రూపక కివిత్వంలో ఆరుద్ర కావ్యానికి ఒక విలక్షణస్థానం ఉన్నది. ఈ కావ్యంలో ప్రదర్శితమైన టెక్నిక్ క్రొత్తది. కావ్యం అంతటా మనకు కనిపించేది ఒక్క ఆవేదన—ఒక్క బలవత్తరమైన కంఠధ్వని. ఈ కావ్యం మానవ జీవన విధానంలోని వింత తత్త్వాన్ని విచిత్రంగా చిత్రిస్తుంది. త్వమేవాహమ్‌లో ఉడుకెత్తించే ఉద్రేక విషయాలు మనకు కనిపిస్తాయి; అనూహ్యమైనఒక వింత వేదాంత తత్త్వాన్ని ఈ కావ్యం అందిస్తుంది.

ఈ కావ్యంలో రాజకీయచైతన్యానికి ఎంత ప్రాముఖ్యమున్నదో, కవితా వ్యాపారానికి అంత ప్రాధాన్యం ఉన్నది. త్వమేవా హమ్ ఆదర్శం సామ్య వాదవ్యవస్థను స్థాపించడం—కవి ఈ విషయాన్ని ఎంతో నేర్పుగా చిత్రించాడు. ఈ కావ్యం గూర్చి శ్రీశ్రీ వ్రాసిన విషయాలు ఉదహరిస్తాను. "చిరంజీవి మానవునితో మృత్యువు నీవే నేను అంటుంది. కావ్యం అంతటా తీవ్రమైన మృత్యుఝుంఝ ప్రసరిస్తుంది." మరో ప్రపంచపు మార్గానికి ఆవేశంగా పాడుకొంటూ ప్రయాణించే శ్రీ శ్రీ చక్కగా ఈ కావ్యం యొక్క ఉత్కృష్ట లక్షణాన్ని వెల్లడి చేసాడు.

"త్వమేవా హమ్" లో ఈనాటి సామాజిక వ్యవస్థలోని సంఘర్షణా సంక్షోభం, అశాంతి, అన్నీ బాగా ప్రతిబింబిస్తాయి. కావ్యం కేవలం భావస్ఫోరకమైనది. ఈ కావ్యంలోని విశ్వజనీనత మరొక గొప్పవిశేషం. ఈ కావ్యంతో కల్పనాశక్తి మృత్యువును అధిగమించి వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటుంది.

కాలంయొక్క ప్రమాణాలను తీసికొని కవి ప్రతిభావంతంగా కావ్యాన్ని సృష్టించాడు.

" బ్రెయిన్‌లో బ్రెన్‌గన్
రెయిన్‌లా ఆలోచనలో బ్రెయిన్
స్పయినల్ కార్డులో స్పెయిన్"

కావ్యం పై వాక్యాలతో, పర్వతదళతో ప్రారంభమై మనన్ని వింతలోకానికి తీసికొనిపోతుంది. పెంద్యులం అందించిన సందేశంలో కవినేటి సామాజికజీవన సంక్షోభాన్ని ఈవిధంగా చిత్రించాడు:

"వ్యక్తావ్యక్తాల
పరిహద్దులలో
బేకోర్కెలు ........
దొంగసరఫరా
అవ్యక్తంలోకి
అవిఘ్నంగా సాగుతున్నాది...
గడియో గడియో
పాదుకలతో

...వ్యక్తి ంవె[్రె]త్తి పోవచ్చు
సర్వం అయోమయం
ప్రమాదం ప్రళయం నరకం
క్రైసిస్, ఖేయాస్ .........

కవి ఆవేశం మనకు ప్రత్యక్షంగా కనిపిస్తుంది; ఆవేదనా ధ్వని మనకు స్పష్టంగా వినిపిస్తుంది.

అల్లే, చిరంజీవి మానవునితో మృత్యువు అంటుంది:
"విద్య ప్రభుత్వోద్యోగాల
త్రాటిమీద
పిల్లి మొగ్గలు వెయ్యదు;
.................................
విజ్ఞానం గడియారంలా తిరగదు;
సైన్సు సమస్యా పరిష్కారం చెయ్యదు
గణితం అధికాహారోత్పత్తి చెయ్యదు"

ఇవి అన్నీ నగ్నసత్యాలు; ఆరుద్ర ఎంత సీరియస్‌గా వ్యంజించాడో మనకు అర్థమవుతుంది. కవికి ఎఱ్ఱచేపు అంటే గిట్టదు. మనజీవన సంవిధానంలో కనుపించే ఈతి బాధలు అన్నిటినీ కవి స్పష్టంగా చిత్రించాడు.

"ఎఱ్ఱచేపుల చవిటి నేలలో
స్వాతంత్ర్యం మొలకెత్తదు;
కిరాణా కొట్లో షాహుకారు అరువియ్యడు;
నియంతల నోట్లో
ప్రజాజీవితం తెగుతుంది;
సైన్సు గడ్డుసమస్యలను
తయారు చేస్తుంది;
కిరాణా కొట్లో ధరలు
రెచ్చి తమ్ముతాము హెచ్చవేసి కొంటాయి
ఇది ప్రళయం ........"

కవి సీరియస్‌గా ఎన్నో నగ్నసత్యాలను చాటుతున్నాడు. ఎకనామిక్స్, మేథ్‌మేటిక్స్, సివిక్స్, సైన్సు, అన్నీ ఈ రచయితకు పరికరాలే. వ్యంగ్యంగా ఆరుద్ర "ఎవరెస్టు శిఖరానికి బదులు సినీతార జీవితాన్ని కొలిచేందుకు ప్రత్యేక దళాలు ప్రస్థానిస్తాయి" అంటాడు. కవిభావనా శక్తి స్వతంత్రమైనది; నేటిసంఘంలోని లోపాలన్నిటినీ వ్యంజించాడు. ధైర్యంగా సామాన్యవాద దృక్పథంతో చెప్పాడు: "ఎఱ్ఱచేపు అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తుంది ........ కిరాణా కొట్లో సామానులు చీకటిలోకి నిష్క్రమిస్తాయి. తెరతెగుతుంది. ఇదినరకం"

ఈవిషయాలు అందరూ అంగీకరించాలి. కావ్యంలో స్తవంలేదు: అంతావాస్తవం. నేటినాగరికతకూడా ఆరుద్రకు సంతృప్తికరంగాలేదు,

"ఈ సివిలిజేషనుడొల్ల
ఇక భవితవ్యము కల్ల" అని నిరాశగా, నిస్పృహతో పెదవులు విరుస్తాడు. కవి వ్రాసినది కేవలం పెసిమిస్టిక్‌గా ఉందని అనలేము. మళ్ళీఆశగా "మర్మసమస్యాపరిష్కారం నిర్మల సంఘానికి ఆస్కారం —— ఇదిధ్రువమ్" అంటాడు.

కావ్యంలో చిత్రింపబడిన ఆవేశం అప్రభావంతంగా ఉంటుంది. కాని కవి తుదివరకు సీరియస్‌గా ప్రతివిషయాన్ని వ్యంజిస్తాడు. జీవితంలో స్వల్పమైన అవకాశాలతో, ఆశయాలతో. అల్పమైన జీతాలతో బాధపడుతూన్న వారి గురించి ఆరుద్రకు గల సానుభూతికి ఈవాక్యాలే తార్కాణం:

"మాజీవితాల కల్లా
సారెగదిలోనిదే రొమాన్సు
పెద్దదొరముందు
మాట్లాడడమే ఎడ్వెంచరు;
ఇంక్రిమెంటే మోక్షం" అన్నాడు.

నీరసంగా, బాధగా, నీలుగుతూ మూలుగుతూ, సాగిలపడుతూ సాగిపోతూన్న సాంసారికజీవనం ఎట్లా చిత్రించాడో చూడండి:

"నేటిసమాజం
యథామాదిరిగా మూషికం
ఇదేమాదిరిగా జీవితం
అదోమాదిరిగా లాగుతూ
అధోలోకంలో పోవడం"

ఈ వాక్యాలు ఎంతో భావగర్భిత మైనవి. ఆరుద్ర కావ్యంలో ఒక కొత్తభావం, ఒక కొత్తవిషయం అన్నీ సాధించాడు. ఈ కావ్యం మహోద్వేలమైన కాలప్రభావాన్ని తిరస్కరించి విశ్వంతో ఏకీభవిస్తుంది. నేటి జీవితంలో వ్యక్తిగత అనుభవాలనూ, సామాజికలోపాలను ఆరుద్ర విపులీకరించి ఎంతోపింతగా విచిత్రంగా వ్యంజించాడు.



[redacted]

# ★ లగ్న బలిమి ★

"సులోచన"

నాగేంద్రం రాజేశ్వరుల వివాహం వొచ్చేనెల నాలుగో తారీఖున రాత్రి పదకొండుగంటల యిరవైనిముషాలకు జరుగుతుందని కొద్ది క్షణాలక్రితమే శుభలేఖవల్ల తెలుసుకొని. విపరీతమైన మనస్థాపానికిగురై ఆవేశపరురాలై, చేతికందుతున్నదని కలలుకన్న మహోజ్వల మహోత్కృష్ట పదార్థం ఆమడదూరం అవతలకు పోయినట్టు-జీవితానికి సంబంధించిన, భవిష్యత్తులో మధురతరం కావాల్సిన సంఘటనలకు దూరం అయినట్టు అవ్యక్తమైన వుద్రిక్తంతో, హృదయాన్ని కోపంతో నింపుకొని, చిందులు త్రొక్కుతూ గదిలో పచార్లు చేస్తూన్నది, పద్మ.

ఇంకా ఎన్నోరోజులులేవు. వారంరోజులు, పెళ్ళైయిపోతుంది, తనజీవితం అనుభూతుల్లేని మోడుకావాల్సిందే. నాగేంద్రం తనని నిలువునా పచ్చిమోసంచేశాడు. వివాహం చేసుకుంటానని యిన్నాళ్ళనుంచి అరచేతిలోస్వర్గం చూపిస్తూ కమ్మని కమ్మల్లో కబుర్లుచెపుతూ, తియ్యని మాటలతో వశం చేసుకొని తనఅవసరాల్ని తీర్చుకుంటూ చివరకు గాఢంగా నిర్మలప్రేమని అవగాహన చేసుకొని నిశ్చలంగా ప్రేమించిన, సర్వస్వాన్ని అర్పించిన వ్యక్తినా మోసం చేయాల్సింది? పద్మమనస్సు పరిపరి విధాల్లో సంచలనాన్ని పొందుతోంది. ఏమైనాకాని తను నాగేంద్రాన్ని వివాహమాడాల్సిందే; ఈ నిర్ణయం తనలోయివాళ జరగలేదు. ఎప్పుడో అతని ప్రేమచూపులకు వశమైన మొదటి క్షణంలోనే నిర్ణయించుకొంది. ఇవాళ అదిగట్టిపడింది.

త్వరత్వరగా డ్రస్ చేసుకొని బజార్లోకి వొచ్చింది నాగేంద్రందగ్గరకు వెళ్ళేందుకు. జట్కావాడు ఎక్కడకువెళ్లాలండీ అంటూవచ్చాడు. జట్కాలో ఎక్కికూచుంది. ఫలానా పేటకుపోనివ్వమంది. బండిలో ఆకాస్తకాలం కూడా స్థిమితంగా కూచోలేకపోయింది, పద్మ. ఎప్పుడు నాగేంద్రంతో కలుసుకొని మొఖంవాచేట్లు ఛీవాట్లువేసి. అతని దౌష్ట్యాన్ని వెల్లడించి, తనఅపారమైన ప్రేమని ప్రకటించి- అతని మనస్సును తనవేపుకు మళ్లించికొని, రాజేశ్వరితో వివాహం జరక్కుండా చేద్దామా అనే అమితమైన ఆత్రుత అమెలోని స్థిమితానికీ, నిశ్చలానికీ, భంగం కలిగిస్తోంది.

నాగేంద్రం యింటిముందు ఆగింది జట్కా. చప్పున దిగి, బండివాడికి డబ్బులిచ్చి చకచక నాగేంద్రం గదిలోకి నేరుగా వెళ్ళింది. నిప్పులు కక్కేకళ్ళతో పద్మ. నాగేంద్రం కుర్చీలోకూచుని కళ్ళుమూసుకొని ఆలోచించే వాడల్లా పద్మయొక్క భయానకాగమనానికి ఆశ్చర్యచకితుడైనవాడై కుర్చీలోంచి లేచాడు.

పద్మ పిచ్చిచూపులుచూస్తూ నిలబడిపుంది. కోపం అధికమైనప్పుడు, మాటలుపెకలని దౌర్బల్యం ఆమెలో అనాదినుంచి వుండటంవల్ల అట్లాచూస్తూ, అనవలసిన మాటల్ని వెతుక్కుంటూ నిలబడివుంది.

'ఎందుకు పద్మా! అట్లాచూస్తూ నిలుచున్నావ్' అన్నాడు నాగేంద్రం పద్మపై ఖరిని ఎటూఅర్థం చేసుకోలేక.

పద్మ కొంచంతేరుకొని—'ఏట్లాచూస్తున్నాను- నాచూపుల్లో నీకేమన్నా' 'మోసం' దృగ్గోచరమౌతున్నదా?" అన్నది.

'నాకేమీ అర్థంకావటంలేదు. మనస్సులో యేదో అన్యథావానికి స్థానం యిచ్చి మాట్లాడుతున్నావు' అన్నాడు నాగేంద్రం.

'నామనస్సులో అన్యభావాలులేవు. నాకురెండు మనస్సులూ, రెండునాలుకలూ. రెండు హృదయాలు నీకుమాదిరిగాలేవు. ఎల్లకాలం నామనస్సు నిర్మల తేజస్సుతో మెరుస్తూనేవుంటుంది. కాని నిన్ను నమ్ముకున్నాను. నిన్ను ప్రేమించాను, నీతోనే నాజీవితం నవ్యమార్గంలో నవ్యమైనపంథాలో, నడుస్తూందనీ, ఆనందమయ జీవనంలో అమృత వర్షాన్ని కురిపిస్తుందని ఆశించాను. అందుచాతనే నీవాంఛలన్నీ తీర్చాను.

కాని నీవు మోసగాడివిగా ఎప్పట్నుంచి మారేవో నాకు తెలియదు. నీలో ఎటువంటి కుళ్ళు, కపటం- ,మంచి

తనం, మరుగులో పరిగణింప బడుతుందో కూడా తెలుసుకో లేని మోహంలో నీవు నన్ను తేల్చి ముంచి యిప్పుడు తీరా సమయం వచ్చేప్పటికి నా కర్మకు నన్ను విడిచి పెట్టి ధూర్తంలోకి దిగావు. చదువుకున్న వాడివి, ప్రేమ, సంఘం- సమాజన్యాయం- అర్థం చేసుకున్న వాడివి. ఆపాటి జ్ఞానం తెలీదా? ప్రేమించిన వ్యక్తికి జీవితంలో యివ్వాల్సిన ప్రముఖస్థానం. రాజేశ్వరిని చేసుకుంటున్నావు. నాకంటే ఆమె యేమంత అందమైంది? నాకంటే ఆమె ఎంత ఎక్కువ చదువు కొంది? నీకు స్త్రీలోని అందం, చదువు, సంస్కారం, సత్ప్రవర్తన అక్కరలేనట్టుంది? రాజేశ్వరికి డబ్బు వుంది. ఆమె తండ్రి మిల్లు మేనేజరు. కావల్సినంత ధనం సంపాదిస్తాడు. ధనం మీద తక్కిన మానవులకు మల్లే నీకుకూడా 'మంచి'ని త్యజించే ఆపేక్ష వుండటం శోచనీయం!" ఆవేశ పడుతోంది. పద్మ- నాగేంద్రం తల వొంచుకొని కూచున్నాడు. పద్మ అనే ప్రతి మాట లతని హృదయంలో మారు మూలల్లో గుచ్చుకొని అమితమైన వ్యధని కలిగిస్తోంది.

పద్మ యేడుస్తో అంది- "ఏమిటీ? యెట్లా వొప్పుకున్నావు, రాజేశ్వరితో పెండ్లికి? నన్ను యేంచేద్దామని- చెప్పు. నీకు నామీద ప్రేమ లేదా? ఇన్నాళ్ళ నుంచి చూపిన ప్రేమ నటనేనా? అవసరాలు తీర్చు కొనేందుకవలంభించిన వలపు చూపులేనా?"

నాగేంద్రం నిరుత్తరుడై నిశ్చలంగా ముఖం దించుకు కూచున్నాడు. లోపల రగిలే అలజడికి అంతులేదు.

"యేమిటి? నామీద నీకు మోహం తప్ప ప్రేమలేదా? మరి ఎందుకు నన్ను యిట్లా మోసం చేసి బాధ పెట్టడం? ఎప్పుడో చెప్పేస్తే పోయేదిగా?" నాగేంద్రం భుజాలు పట్టుకొని వూపుతూ అన్నది పద్మ.

నీళ్ళు కమ్మిన కళ్ళతో జాలిగా తల పైకెత్తి "యేంచేయను పద్మా! పరిస్థితులు అట్లా సంభవించినవి. ఎదుర్కో లేనంత బలంగా విషమించినవి" అన్నాడు నాగేంద్రం.

"కాదు. నువ్వే రాజేశ్వరి ధనం కోసం ఆశ పడి వుంటావు. నేను దురదృష్ట వంతురాల్ని. నిన్ను పొందని నాజీవితం అడివి కాచిన వెన్నెల చందాన్ని కాక మరేముంది? నేనింకా బ్రతకటం దేనికి? ఎవరి కోసం?" అని చిందులు తొక్కుతున్నది పద్మ. కోపమూ, అసూయా, విచారమూ కలసి ఆమె లోని మనసత్వానికి వికృత రూపాలు కల్పించినవి.

"అట్లా అయితే ఎట్లా? నన్నేం చేయమంటావు. చెప్పు నాన్న గట్టి పట్టుదల పట్టాడు. అమ్మ ఈ వివాహమే కనుక కాకపోతే ఏ నుయ్యో, గొయ్యో, చూసుకుంటానంటుంది. మామయ్య వాళ్లంతా గట్టి పట్టునే పడుతున్నారు. ఇన్నిటికీ ముఖ్యం నాన్న అచంచలమైన పట్టుదలే. రాజేశ్వరిని పెళ్ళాడని పక్షంలో తలితండ్రుల్ని, బంధువుల్ని, వొదులు కోవాల్సిందని మరీ మరీ నొక్కి చెప్పాడు. శైశవంనించీ అతిగారాబంగా పెంచిన తలిదండ్రుల అభిప్రాయాలు అవిధంగా వుంటే యేంచేయమటావు పద్మా?" అని బావురు మన్నాడు నాగేంద్రం- పద్మని వారించటం తేలికగా అయ్యే పని కాదని తెలుసుకున్నాక.

"యేమైనా కానీ యిది నేను సహించలేను. నాహృదయం నీకోసం తపించి పోతున్నది. లేకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను" అని గబగబ గది దాటి యింటి కెళ్లేందుకు బజార్లోకి వొచ్చేసింది.

"పద్మా!" అని పిచ్చిగా పెద్ద పెట్టున కేక వేశాడు నాగేంద్రం.

అతను పద్మను ప్రేమించిన మాట వాస్తవమే. ఆమె నాగేంద్రాన్ని ఎంతపట్టుగా ప్రేమించిందో అతనూ పద్మని అంత గాఢంగా ప్రేమించాడు. పద్మనే వివాహం చేసుకోవాలని కూడా అతని నిర్ణయం. కాని తలిదండ్రుల బంధువుల వొత్తిడి అందుకు పూర్తి వ్యతి రేకం కావటం మూలాన అది అసాధ్యంగా పరిణమించింది. నాగేంద్రానికి తనవాళ్ళని వొదులుకోవడం యిష్టం లేదు. పద్మకి తనస్వార్థం చూసుకొని తను అన్యాయం చేస్తున్నాడు అన్న బాధ కూడా నాగేంద్రానికి వుంది. ఏటూ తేల్చుకో లేక పోతున్నాడు. రాజేశ్వరి, నాగేంద్రం తండ్రి చెల్లెలు కూతురు. వీళ్ళకి చాలా ఆస్తి వుంది. ఒక్కతే ఆడపిల్ల. దగ్గరి బంధుత్వం. అన్ని హంగులూ వున్నవి. అమ్మాయికి తగిన సంబంధం అని తల్లి తండ్రుల ఘోష. నాగేంద్రం బి.ఏ. చదవ టానికి ఆర్థిక స్తోమతని కలిగించింది నిజానికి రాజేశ్వరి తండ్రే.

# లగ్న బలిమి

పద్మంటే నాగేంద్రానికి అమితమైన ఆకాంక్ష. నిజంగా అన్నంతపనిచేస్తుందేమో కొంపదీసి- అనిలోపల కించ పడుతూ ఎట్లాగైనా పద్మని ఒదార్చాలని ఆరాత్రి పద్మ యింటికి వెళ్ళాడు, నాగేంద్రం.

పద్మ పరుపుమీద పడుకుకొని ఏడుస్తోంది. "అధైర్య పడవాకు పద్మా ! నాకంటేకూడా ఉత్తమమైన వరుడు దొరకొచ్చునీకు" అనిఅన్నాడు, నాగేంద్రం పద్మని ఓదారుస్తూ.

పద్మ ప్రళయభీకరస్వరూపిణైంది. "ఈవేదాంతం చెప్పటానికే ఒచ్చావా నీవు ! కొద్దిరోజులకే నీపద్మ నీకళ్ళకు దూరమవుతుంది.

ఆమెకు ఈ లోకంలో స్థానంలేకుండా చేశావు. ఇంకా కొన్నిరోజులు గడిస్తే నివల్లనే ఆమెకు 'వ్యభిచారిణి', 'కులట' అన్న అపకీర్తి పేర్లు కూడా వాడుకలో వుంటవి. ఇంకాదేనికి అసలుసంగతిని దాచిపెట్టడం. "నాకు మూడో నెల" అని కళ్ళనీళ్లుకార్చింది, పద్మ.

"ఆ! మూడోనెల !" నాగేంద్రం కుర్చీలో కూలబడ్డాడు హృదయంలో రాయిపడింది.

"మనజీవితాల్ని అప్రదిష్టపాలుగాకుండా చూడు. నీస్వార్థాన్ని, తలిదండ్రుల్ని, బంధువుల్ని చూసుకుంటే నాగతేం కాను? స్త్రీని, అందులో ఈసమాజంలో పెళ్ళికాకుండానే గర్భంధరించిన స్త్రీలకు ఎటువంటిదుర్గతి పడుతుందో ఆలోచించు" ఇట్లా అనేకవిధాల నాగేంద్రాన్ని వేడుకొంది పద్మ.

నాగేంద్రం హృదయంలోని కాఠిన్యత ద్రవించింది. పద్మ ఏవ్యక్తికారణంగా ఈస్థితికి వొచ్చిందో పూర్తిగా అర్థంచేసుకున్నాడు. పద్మ జీవితం బాగుపడాలంటే తనుముఖ్యం అనికూడా నిశ్చయించుకున్నాడు. కాని తను త్యాగంచేయాలి. తలిదండ్రుల్ని అవసరమైతే వీడిపోవాలి. కొంచంసేపు తర్కించుకొని ఒకనిశ్చయానికి వొచ్చి, పద్మని దగ్గరకు తీసుకొని-

'పద్మా ! నీయిష్టప్రకారమే చేద్దాం. కాని అదియిక్కడ వీలుపడదు. ఇద్దరమూలేచిపోయి ఏబస్తీలోనో వివాహం చేసుకోవాలి. ఇక్కడ నాతలిదండ్రులూ, బంధువులూ ఈవివాహనికి చస్తే అంగీకరించరు. రెండుమూడురోజుల్లో యేర్పాట్లన్నీ చేస్తాను. లేచివెళ్ళిపోదాము" అని అన్నాడు నాగేంద్రం. పద్మ యెగిరి నాగేంద్రం కంఠాన్ని కౌగలించుకొని ఆనందబాష్పాలు విడిచింది.

ఆరాత్రి నాగేంద్రం ఇంటికి చేరుకొనేప్పటికి పదకొండు గంటలైంది. 'ఇంతరాత్రివరకూ ఎక్కడవున్నావురా?' అని అడిగిన తండ్రిప్రశ్నకు- 'సినిమాకు వెళ్ళాను' అని తప్పుడు జవాబు ముక్తసరిగా యేడు అక్షరాల్లో చెప్పి పడకగదిలోకివెళ్ళాడు.

రెండురోజుల్లో పోయ్యేందుకు సన్నాహాలు చేసాడు నాగేంద్రం. ఆరాత్రే రైలు ఎక్కటం. వాడిదగ్గరా వీడిదగ్గరా మొత్తం అరువందల రూపాయలు పోగుచేసాడు నాగేంద్రం. ఆరాత్రి మెయిల్ ఎక్కారు. యెరిగినవాళ్ళ కంట బడకుండా, తెల్లవారేసరికి తెనాలిలో దిగారు. అక్కడ రెండురోజులున్నారు.

తెనాలికి ఆరుమైళ్ళ దూరంలోవున్న కొలకలూరులో నాగేంద్రానికి ఒక స్నేహితుడున్నాడు. వాడు ఎన్నివుత్తరాలు వ్రాసినా నాగేంద్రం యేదో తీరికలేని కారణంవల్ల వెళ్ళటానికి పడలేదు. ఈసమయంలో నాగేంద్రానికి ఆస్నేహితుడి సంగతి స్ఫురణకు వొచ్చింది.

"కొలకలూరులో నా క్లాసుమేటు నాగేశ్వరరావు వున్నాడు చూసివద్దాం"అని నాంగేద్రం పద్మతో అన్నాడు.

పద్మ వొప్పుకుంది.

ప్రొద్దునపూట ఇద్దరూ యేడుగంటలకల్లా కాఫీత్రాగి జట్కాచేసుకొని బస్‌స్టాండ్ దగ్గరకువొచ్చారు. తెనాలి నించి కొలకలూరు వెళ్ళటానికి ప్రయాణికులకు ముఖ్యంగా రెండు అవకాశాలున్నవి. రైలుమీద వెళ్లొచ్చు, కారుమీద వెళ్లొచ్చు. కారుమీదే సుఖం. ఎందువల్లనంటే కారుమీదైతే వూళ్లోదిగొచ్చు. ట్రయిన్ మీదపోవటం అయితే స్టేషనునించి వూళ్లోకి మైలుమారం నడవాలి. అందువల్ల కారు ఎక్కారు.

ఎనిమిది గంటలకు కారు తెనాలిలో బయలుదేరింది. కారు కొలకలూరు వంతెన దాటగానే ఘోరమైన ప్రమాదం జరిగింది. వంతెన మలుపు తిరుగుతూండగానే ఎదురుగా పెద్దశక్తిలాగ లారివొచ్చింది. అందువల్ల డ్రైవరు

(తరువాయి 37-వ పేజిలో)

# రాత

మూలం : సుభద్రా కుమారీ చౌహాన్.

అనువాదం : రమేష్.

"వదినా, నువ్వెప్పుడూ తెల్ల పంచలే కట్టుకుంటా వేమ్"? "వదిన యెలాగుంటే నీకెందుకూ, పోయి ఆడుకో" "ఏం వదినా? అమ్మ, నీకు కట్టుకోటానికి రంగు చీరలివ్వ దూ?" "లేదు లక్ష్మి, నా నుదుటి రాత ఇలా చేసింది. అమ్మ మట్టుకు ఏం చేస్తుంది?" "వదినా మరి "ఆ రాత" అనేది ఎవరు? అది కూడా దేనికో దానికి దెబ్బ లాడుతూ ఉంటుందా?"

ఆరు సంవత్సరాల లక్ష్మి, రమ వీపుపై కూర్చొని చేతులు మెడకు పెనవేసి, "రాత యెక్కడ వుంది వదినా? చెప్పవూ?" అని జాలిగా అడిగింది. దీర్ఘ నిశ్వాసాన్ని విడుస్తూ లేచి "ఏం చెప్పగలను లక్ష్మి", అని కండ్లొత్తు కుంటూ వంటింట్లోకి నడిచింది రమ. వెనుకనే ఆమె భావాన్ని అర్థం చేసుకోలేక అనుసరించింది లక్ష్మి. అం తలో లక్ష్మి తల్లి "పది గంటలు పైగా అయింది. పిల్లలు తిండి లేకుండా బడికి పోనే పోయారు, ఇక ఆయన గారు వచ్చి ఏం తింటారు? ఇంట్లో ఏం పనులున్నాయని, యెవరి తలపుళ్ళు కడగాలని ఇలా కాల్చుకు తింటున్నావ్? ఏమైనా అంటే అత్తగారిముండ రాసి రంపాన్ని పెడు తోందని పేరా?" అంటూ ఒక్క గుక్కలో పది ఏకరువు పెట్టింది. 'అత్తా, వంటంతా అయింది. పచ్చడిలో పోపే తరువాయ్. అర్థ గంటలో అన్నీ సిద్ధమౌతాయ్. ఇంకా పది కొట్టలేదుగా" అని భయపడుతూ జవాబిచ్చింది రమ. "ఏమి టేమిటీ నేనన్నది తప్పా? ఇది చెప్పకమ్మా, నేను వినడమూ అనేకదూ? ఇంక నడూ అవతలకి." అని చేతులూ పుసుంటూ రెండు బుగ్గ పోట్లు పొడిచింది రమని ఆమె అత్త. కండ్లనీరు కారుస్తూ వంటింట్లోంచి వెళ్ళిపోయింది రమ. అనునిత్యం ఈ విధంగా విధవ యగు రమ జీవితం బండి చక్రములా దొర్లిపోతోంది.

పదిగంటలవగానే కామశాస్త్రి ఇంట్లో కాలు పెట్టేడు. ఎక్కడా సందడిలేదు. "పిల్లలేరీ?" అని ప్రశ్నించేడు భార్యని. "బడికి వెళ్ళేరు" అన్నది లక్ష్మితల్లి. అతను వాచీచూస్తూ "ఇంకా పది గంటలవలేదే" అన్నాడు. "ఆ మీకోకదటి ఖర్మమా అని తిండిలేకుండా వెళ్ళిపోయేరు. ఇదిగో చెప్తున్నా వినండి. ఈ ఇంట్లో ఒక క్షణం వుండలేను. అందరూ నిజమైన వారు, నేను అబద్ధం చెప్పేదాన్ని." అని బుడి బుడి దుఃఖం మొదలెట్టింది. "అబ్బే, నేనలాగు అనలేదే నువ్వు అబద్ధంచెప్పే వని. బహుశా గడియారం తప్పై ఉంటుంది; ఇంతలో ఏడవ డానికి ఏముంది.?" అంటూ కామశాస్త్రి స్నానా నికి వెళ్ళి పోయాడు. రమ భార్య మాటలకి, పెట్టే బాధలకి ఎంత దుఃఖిస్తూ గడుపు తున్నదో శాస్త్రికి తెలుసు. అభాగ్యయైన ఆ వితంతు బాలిక తన అభిమాన సానుభూతు లపై ఆధారపడిఉందని ప్రతి క్షణం అనుకుంటూ ఉంటాడు శాస్త్రి. కాని, భార్య నోటికి తాళము వేయలేకపోయాడు. ఈరోజుకూడా రమని ఏదోసాకుతో బాధించిందని, అందుచే ఆ దినము రమకి తిండి ఉండదని కామశాస్త్రికి తెలుసు. దుకాణానికి బయల్దేరుతూ రమ గదిలోకి ప్రవేశించి "అమ్మా! ఆకలితో పస్తుండకు. ఏదో తిని కడుపు నింపుకో వాలి. లేదా నాకు దుఃఖాన్ని కల్గించిన దానివి అవుతావు." అన్నాడు. ఈ మాటలు వంటింట్లో ఉన్నలక్ష్మి తల్లి చెవులో పడగానే అరికాలు మంట తలకెక్కింది. "దీనిబతుక్కి ఘరం ఘ్న క్షించాలా? చూస్తా ఏమి తింటుందో?" అని మనసులో అను కుంది. రమవంటింట్లో అడుగు పెట్టగానే గిన్నెలన్నీ తోమ డానికిసిద్ధంగా ఉన్నాయ్. వక్క మెతుకైనా లేదు. అలాగే గుమ్మానికి చేర పడ్డది. దారి తెన్ను లేని తనజీవితం ముళ్ళకంచకు అంటగట్టి ముంచి తేలుస్తున్నట్లయింది. ఇంత బాధకి తానేంపాపం చేసిందో అర్థమైంద కాదు. ఒక్క సారి భర్తతో తాను గడపిన దినాలు, "రమ తన భార్యగా లభించడం పూర్వజన్మ సుకృతం" అని భర్త అన్న ప్పుడు కల్గిన ఆనందానుభూతి రమ కండ్ల ముందు పరుగెత్తి పోయే మేఘాల్లా మెదిలినయ్. బరువుగా వూపిరి వదలి ప్రవహిస్తున్న కన్నీటి బిందువులను వ్రేలితో తుడుచుకుంటూ గదిలోకి పోయింది.

ఆదినము పని లేనందున వేగంగా ఇల్లు చేరుకున్నాడు కామశాస్త్రి. లక్ష్మితల్లి పొరుగమ్మలతో పెత్తనాలకు పోయింది. భార్య కనబడక పోగానే శాస్త్రి రమ ఉన్న గదివేపు బయల్దేరాడు. ఒక చేయి తలక్రింద ఉంచి, సం

(32-వ పేజీ చూడండి)

చిన్న కథ:

# వదలని తెగులు

* శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావు *

"ఓనాగీ! ఓనాగీ!" అని పిలచింది సత్యవతి పొద్దుటి పూట.

"ఏ మండి అమ్మగారూ!" అని అడిగింది సావిడిలో కూర్చుని కునికి పాట్లు తీస్తున్న నాగి.

"ఏంచేస్తున్నావే అక్కడ?"

"ఊరికే కూకుండా నండమ్మా"!

"ఇదిగో ఈ కాఫీ గళాసు తీసుకు వెళ్ళు!"

"ఊఁ" అంటూ మూలుగుతూ లేచింది నాగి.

"పాపం కాఫీ తాగితే కాని ఏపనులూ చెయ్యే లేదు!" అంటూ విచారించింది సత్యవతి.

సత్యవతికి ఇరవై యేళ్ళుంటాయి. ఆమె తండ్రి పెద్ద గవర్నమెంటు నౌఖరీ చేశాడు. ఆమె స్పష్టంగా చెప్పనే చెప్తుంది. "నాకు కాఫీ తాగి కూర్చోడానికంటె మరి దేనికీ ఓపిక లేదు" అని. అది చూసి మిగతా వాళ్ళు 'ఆవిడకి రాయసం!' అంటారు. మొగుడు ఏదీ అనడు.

నాగి పనిమనిషి. దానికి నలభై ఏళ్ళుంటాయి. ఎర్రగా పచ్చగా ఉంటుంది. పిల్లిని సృష్టించిన దేవుడే దానిని కూడా సృష్టించేడు. దానికి అవసరమైన వస్తువులు కనబడతాయి. అనవసరమైనవి కనబడవు. పైనుంచి చూసిన వాళ్ళు మట్టుకు, 'దానిని మినుగుడు కళ్ళు' అంటారు.

జానెడు కాఫీలోటా పట్టుకు వెళ్లింది నాగి. సుఖంగా పీల్చి వేసింది. ఇంటి పనులు పింగళించి చక్కా పోయింది.

శివయ్య తాలూకా కచ్చేరీలో గుమాస్తా. వేళకి అక్కడ హాజరవాలి. అందుచేత తొందరగా పనులు చేసుకొని భోజనానికి లేచాడు.

పీట దగ్గర అన్నీ అమరుస్తూ సత్యవతి వెండిగ్లాసు కోసం ఇక్కడ వెతికింది, అక్కడ వెతికింది. ఇల్లంతా వెతుకుతూంది.

'ఇంకా వడ్డించ లేదేమి?' అని తొందర పడ్డాడు భర్త.

"వడ్డిస్తానుండండి!"

"నేను త్వరగా పోవాలి మరి!"

"మీరు కాని క్షవరం చేసుకోడానికి వెండి గ్లాసుతీసేరా ఏమిటి?"

"నేనేమిటి! క్షవర మేమిటి! వెండి గ్లాసేమిటి!" అని ఆశ్చర్య పోయేడు శివయ్య.

"ఏమో మరి! కనబడడం లేదు".

"ఏదీ? పెద్దగ్లాసే!" అతని గుండె గుభేలుమంది.

"గ్లాసుకి పెద్దేమిటి, చిన్నేమిటి?" అంది వేదాంతి సత్యవతి.

"ఇంతకీ కనబడిందా!" అని పట్టి అదుర్దా వెలిబుచ్చేడు శివయ్య.

"కనబడితే మిమ్మల్ని ఎందుకు అడగడం? పనిలేకా?"

"ఇల్లు దాటిందన్నమాటే!"

"అదే మీ మొదటి ఆశీర్వచన! కాస్త వెతికిచూడండని నేను మొర్రపెడుతూంటే!"

"ఇదివరకు పోయినవాటినే కలుసుకోడానికి వెళ్లింది ఇదికూడా. ఇంకెందుకు వెతకడం?"

"అబ్బబ్బ! కాస్త వెతకండి అంటూంటే!"

"ఎక్కడ వెతకమన్నావో చెప్పు."

"పరుపులు, మంచాలుకూడ వెతకండి!"

"ఎవరో నీవంటిదే పెసరచేలో నత్తుపోతే పప్పుకుండలో వెతికిందిట!"

"ఊరికే మాటాడక కాస్త వెతుకుదురూ!"

"అదొక దండగపని కూడ ఎందుకు అని నేనడగడం!" అన్నాడు శివయ్య. కాని పెళ్లాం మాట తీసివెయ్యలేక, లేదు లేదనుకొంటూనే పరుపులు, మంచాలు వెతికేడు.

"మొదట మిమ్మల్ని అవతలికి పంపించి మళ్లీ మరొక మాటు ఇల్లంతా గాలించివేస్తాను లెండి!" అంటూ సత్యవతి భర్తకి వడ్డించింది.

అతను భోంచేసి గుమ్మందాటేడు.

# వదలని తెగులు

సత్యవతి మరొకమాటు లంకంత ఇంటిని ఓపికగా వెతికింది పాపం !

సాయంత్రం శివయ్య ఇంటికివచ్చి మొదటి ప్రశ్నగా "దొరికిందా?" అన్నాడు.

"లేదు !"

ఆ గళ్లాసు ఎవరిచేతులలో పడిందో ఇద్దరికీ తెలుసు కాని ఏమిలాభం?

మరి నాలుగురోజులయింది. సత్యవతి తలంటి నీళ్లుపోసుకుంటూ ముక్కువి, చెవులవి తీసి స్నానాల గదిలో గూటిలో జాగ్రత్తగా పెట్టింది. నాగే నీళ్లు పోసింది. సత్యవతికి నగలసంగతి సాయంత్రంకాని జ్ఞాపకం గాలేదు. అప్పుడు తక్షణం వెళ్లిచూసింది. ఏవీ?

భర్తకి కూడ తెలిసింది. "ఏలాపోయేయి?" అని అడిగేడు శివయ్య.

"ఏమో? ఏకాకులో ఎత్తుకు పోయేయో ఏమిటో?" అంది సత్యవతి.

"మరే కాకులూకావు! బుర్రకాకే ఎత్తుకుపోయింది!",

"సొమ్ముపోయినవాడు పాపాన్ని పోయేడని సామెత. మనం చూడందే ఒకళ్లమీద పెట్టకూడదు." అని సత్యవతి లాయరు పాయింటు ఎత్తింది.

శివయ్య అనుమానం పనిమనిషిమీదే. కాబట్టి "ఇప్పటికేనా నాగిని విడిచిపెట్టుకోంటేనో!" అన్నాడు సూచనగా.

"మీకేమి తెలుసు! మీరు ఎన్నైనా చెప్తారు! ఇంటి చాకిరీచేసేవాళ్లకి తెలుస్తుంది, దాని బాధ! ఇంతకీ ఎవరు తీసేరో రుజువేదీ?" అంది భార్య.

తన మాట సాగకపోగా శివయ్య నోరు మూసుకొన్నాడు. సాగి కుదరని జాడ్యంలాగు తోచింది.

ఇది నాగి పనేఅని సత్యవతికి నమ్మకంగా తెలుసు. కాని పైకి అంటే ఎంతో ప్రమాదం అని ఆమె విశ్వాసం.

ఏదో సందర్భంలో శివయ్య ఒక రోజున "ఈ నాగి కాకపోతే మరొకర్తె దొరకక పోయిందా పనికి? ఇది మన కేమేనా ఉత్తపుణ్యానికి చేస్తూందా?" అని ప్రశ్నించేడు.

"ఇది పోతే వచ్చేది మట్టుకు ఇంతకంటె వెలగ బెడుతుందనుకొంటున్నారు కామాలు!" అంది సత్యవతి.

"ఏమో మన ఖర్మం ఏలాగుందో ఎవరు చూశారు. ఇదేం ఈ ఇంటికి పుస్తి కట్టెంబా?" అన్నాడు శివయ్య.

"ఈకాలంలో ఎక్కడ పట్టినా పనివాళ్లు ఇంతేనండి!" అని సత్యవతి పది ఉదాహరణలిచ్చి శివయ్య నోరు మూసింది.

శివయ్య చేతి మునివేళ్లతో నుదురు కొట్టుకొన్నాడు.

శివయ్య కళ్లజోడు హఠాత్తుగా మాయమయింది. ఇంటి పనికి మాత్రమే ఇబ్బందయితే ఏలాగో సర్దుకొనేవాడు. కాని ఆఫీసుపని ఏలాగు? కళ్లు ఉండికూడ అంధుడితో సమానమయి. తనలో పదివేలెత్తి చూపించినట్లు. కాగా, శివయ్య ఒక చెంపని కళ్లజోడుకోసం రెండో చెంపని దృష్టిలోపం కోసం ఏడ్చేడు.

"ఇది దాని పనే! ఇంకెంతకాలం దానిని భరించడం?" అని తనలో తాను గట్టిగా విసుగుకొన్నాడు శివయ్య.

"అది తియ్యలేదని బల్లగుద్ది చెప్పవచ్చండి!" అంది భార్య.

"అది తియ్యకపోతే ఇల్లు తినేస్తుందా ఏమిటి చెప్మా!" అని శివయ్య ఎదుర్కొన్నాడు.

అదే సమయంలో నాగి అలా వెళుతూండగా శివయ్య "ఏమే నాగీ! కళ్లజోడు ఎందుకుతీశావే?" అని అడిగేడు.

కాని దాని నోటినుంచి ఇంకా జవాబు రాకుండానే సత్యవతి అడ్డువచ్చి "శివ! శివ! అది ఎన్నడేనా అటువంటి పనిచేసి ఎరుగునా? ఎవరేనా వింటే నవ్విపోతారండీ!"అంది.

"నీకేం తెలుసు మధ్య నువ్వు వస్తావు!" శివయ్య సాహసించి అన్నాడు.

"దాని గుణం నాకు కాకపోతే మీకా తెలుస్తుంది! శివ! శివ!"

నాగి పన్నె చిన్నెలుగా మొదలుపెట్టింది. అది పదమో. పాటో, ఏడుపో, భాగవతమో తెలియలేదు. నాగికి రోషంపుట్టి అక్కడ ఒక్కక్షణం నిలుచోలేదు.

(తరువాయి 48-వ పేజీలో)

(23-వ పేజీ తరువాయి)

సంస్కారము లేని కేశాలతో నేల పొర్లాడుతున్న రమ అతని దృష్టి పథాన్ని పడ్డది. తన భీరుత్వానికి చేతగాని తనానికి, తన్ను తానే దూషించుకున్నాడు. అను నిత్యం రమ కోమల హృదయం గాయం పొందుతూ ఉంటే, సాగిపోతున్న తన్ను ఏం చేసినా పాపం లేదనుకున్నాడు. అలికిడవగానే లేచి కూచొని ఎదుట నున్న మామగారిని చూచింది రమ. చెదరిన పైటను ముందుకు లాక్కుంది. చిరిగి ఉన్న పైట కాస్తా చిరిగి చేతులోకి వచ్చింది. కన్నీటితో బరువెక్కిన కండ్లు, ఆవేదనామిళితమైన ముఖభావాలు గమనించి శాస్త్రి బోరున ఏడ్వాలనుకున్నాడు. అంతలో తెప్పరిల్లి "తల్లీ, తిండి తినలేదా?" అని ప్రశ్నించాడు. అంతర్గత కల్లోలాన్ని అర్థం చేసుకొన్నాడని తెలుసుకోగానే దుఃఖం పట్టలేక, రెండు చేతులతో ముఖం కప్పుకుంది రమ. అప్రయత్నంగా వచ్చిన "లేదు" అనే శబ్దాన్ని సరిచేస్తూ "తిండి తిన్నా" అని సమాధానం ఇచ్చింది. "నీవు కూడా మాట వినక ఈ ముసలి వానికి దుఃఖము కలిగిస్తున్నావ్ గదూ!" బొంగురు పోయిన కంఠంతో అన్నాడు శాస్త్రి. రమ మామగారి మాటకు జవాబివ్వలేదు. కొంచెం ఆగి "మీ వద్ద దాచే విషయం ఏముంది? వున్నదేదో తిన్నాను" అన్నది. బడి నుంచి అప్పుడే వస్తూన్న లక్ష్మి "నాన్న, నాన్న, వదిన అంతా అబద్ధం చెబుతోంది. అమ్మ వదినకి అన్నం పెట్టలేదు" అని ఫిర్యాదు చేసింది. కోడలి సౌజన్యానికి, భార్య కఠినత్వానికి శాస్త్రి హృదయం సంతోష క్రోధాలతో ఆక్రోశించింది. ఆమెలో ఎంత నిగ్రహము! ఎంత ఓర్పు! జేబులోనుండి ఐదు పదిరూపాయిల నోట్లు తీస్తూ "తల్లీ ఇవి ఉంచుకో ఏది అవసరమైనా ఖర్చు పెట్టుకో" అన్నాడు. రమకి, నవ్వాలో ఏడ్వాలో తెలీలేదు. డబ్బు, పాపిష్టి డబ్బు, ఇదేనా తనలో అనుక్షణం అశాంతి, సంఘర్షణ కలిగిస్తున్నయ్. కాదు, ఇది కాదు. తన దుఃఖమయ జీవితానికి కావలసినవి అభిమాన సానుభూతులు. ఇంతలోనే క్షేత్రాలకి వెళ్ళిన లక్ష్మి తల్లి ఇంట్లో అడుగు పెట్టింది. భర్త చేతిలో నోట్లను, మౌనంగా నిలచిన రమను చూస్తూనే గాలివానలా లక్ష్మి తల్లి వారిమధ్య విరుచుకు పడ్డది. "ఎలాంటి కొంప ఎలా తగలపడ్డది! ఇందాకా వచ్చిందీ వ్యవహారము? మీకేం బుద్ధిలేదండీ దీని గదిలోకి రావడానికి?" అంది. శాస్త్రికి వేయి తుపాకులతో కాల్చినట్లైంది. తల చేత్తో పట్టుకొని తన గదిలో కూలబడ్డాడు. క్షోభతో హృదయం దహించుకు పోయింది. "రమ, నీ కూతురు. అమ్మ మూర్ఖత్వానికి సంకుచితత్వానికి దాన్ని బలిదానం చేయకు" అని అంతిమ గడియల్లో కుమారుడన్న మాటలు చెవుల్లో గింగురుమన్నాయ్. తలగడలో తల దూర్చి, చంటి పిల్లాడిలా ఏడ్వసాగాడు శాస్త్రి.

లక్ష్మి మెల్లగా రెండు చేతులూ తండ్రి వీపుపై ఉంచి "నాన్నా ఎందుకేడుస్తున్నావ్?" అన్నది. విరక్తిభావంతో "నా రాతకు" అని శాస్త్రి అన్నాడు. ఉదయాన్నే వదినగారి నోటితో ఇదేమాట విన్నది. ఇప్పుడు తండ్రి కూడా ఈ మాటే అంటూ దుఃఖిస్తున్నాడు. అర్థం గాక విస్మయంతో "నాన్నా, రాత అనేదెక్కడవుంది? అది అమ్మకు ఏమౌతుందీ?" అని ప్రశ్నించింది. ఈ ప్రశ్నతో దుఃఖంలో ఉన్న శాస్త్రికి నవ్వొచ్చింది. "అవును లక్ష్మి, అది మీ అమ్మకు అక్క అవుతుంది. మీ అమ్మ బుర్రలో పీఠం వేసుకొని కూర్చుంది." అని అన్నాడు. తన విశ్వాసాన్ని ప్రకటిస్తూ 6 సం॥ల, లక్ష్మి- "అందుకే నాన్నా అది నిన్నూ, వదిన్నీ సాధించుకు తింటూన్నది" అని బదులు చెప్పింది.

శాస్త్రిలోని మానసత్వం మాత్రం "రాత అనే ముసుగుతో మనమే అభాగినుల జీవితాలను మట్టి చేస్తున్నాం" అని ఘోషింప మొదలు పెట్టింది.



# ప్రభుత్వపు అప్పులు

• శ్రీ వారణాసి వెంకటచలం •

ప్రభుత్వపు ఆర్థిక వ్యవహారాలు ప్రజాసామాన్యము అర్థంచేసికొనడం చాలాకష్టం. ప్రభుత్వపు ఆర్థికస్థితి కాలానుగుణ్యంగా మారుతూయుండును.

సామాన్య కుటుంబములో ఆర్థికస్థితి ఎట్టిమార్పులు చెందుతూయుండునో అదేరీతిని ప్రభుత్వపు ఆర్థికస్థితి కూడ మారుతూయుండును. జాయంటు కుటుంబములో పెద్దవాడైన యింటి యజమాని కుటుంబ వ్యవహారాలు ఎట్లునిర్వహించునో అదేవిధముగా ప్రభుత్వముకూడ దేశ పరిపాలనయందు, ఆర్థిక వ్యవహారాలను చక్కబెట్టుచుండును. దేశమునకు ప్రభుత్వము ఒక సమిష్టి కుటుంబము వంటిది.

పూర్వకాలమందు దేశమును రాజు పరిపాలించగా, వర్తమానకాలమందు ప్రజలచే ఎన్నుకోబడిన మంత్రుల ద్వారా పరిపాలన చేయబడుచున్నది.

ప్రభుత్వం పరిపాలన చేయుటకయే ఖర్చునంతనూ ప్రజలవద్దనుండి వసూలు చేయబడేవివిధ పన్నులు, శిస్తులు వగైరాల రాబడివల్ల భరించబడును. వ్యయము ఆదాయమును మించిన ప్రభుత్వము కూడ అప్పులుచేస్తూయుండును.

పూర్వము 18 వ శతాబ్దములో, బ్రిటిషు సార్వభౌముడు విదేశాలలో యుద్ధములు చేయడం కొరకు లండను పట్టణ మందుగల ధనికులవద్ద అప్పులుచేసెను. యుద్ధానంతరం ఆ అప్పులుతాను దేశసంరక్షణార్థం, లోకకళ్యాణం కొరకు, వినియోగపరచెను గనుక. తాను తీర్చజాలననెను. అట్టితరి వారువెంటనే రొఖ్ఖరూపేణ యివ్వనక్కరలేదనియూ, ప్రత్యామ్నా ప్రభుత్వపు అప్పుపత్రాలు యిస్తేచాలునని కోరిరి. అంతట వెంటనే అప్పు మొత్తంనంతకూ పత్రాలు యిచ్చెను. ఈపత్రములే ప్రభుత్వపు అప్పుగా మారెను. తదుపరి ప్రభుత్వం అవసర సమయములందు, ప్రజాసౌకర్యార్థం, అప్పులుచేసేహక్కు ఏర్పడినది. ఈ అప్పునే **Public debt** అనెదరు.

ప్రభుత్వపు అప్పులు రెండు విధములైనవి యుండును. స్వదేశాలలో చేసేఅప్పులు విదేశాలలో చేసేఅప్పులు.

స్వరాజ్యం సిద్ధించిన తరువాత ప్రభుత్వపు **Sterling** అప్పు 1200 కోట్లుయుండెడిది. లోగడ బ్రిటనులోగల **Sterling** నిల్వలను మార్చుకొనినప్పుడు షుమారు 700 కు తగ్గిపోయినది.

ఇండియా ప్రభుత్వం తరపున విదేశాలలో చేసే అప్పులు, మనదేశంలో నిర్మింపబడే రైలుమార్గములు, విద్యుత్‌శక్తి యంత్రములు, ఇరిగేషను ప్రాజక్టులకు అవసరమైన యంత్రసామాగ్రులు కొనేనిమిత్తం, ఇత్యాది ప్రజాహితైక కార్యములకు అవసరమయ్యే ఖర్చుకొరకు అప్పు చేయుచుందురు. ఈ అప్పుకు పత్రాలుయిచ్చెదరు. పూర్వము ఈపత్రాలమీద మూడున్నర, నాలుగు ఐదున్నర, పెరసంటు వడ్డీయిచ్చేవారు.

ప్రభుత్వ ఆదాయము ప్రజలవద్దనుండి వసూలు చేయబడుచున్న భూమిశిస్తు, నోటిపన్ను, వృత్తిపన్ను, **Sales and commercial taxes** యిత్యాది వివిధ పన్నుల వల్లవస్తుంది. కాని ఈఆదాయమంతయూ ప్రభుత్వ నిత్యపరిపాలనావసరములకు సరిపోవుచుండును. ప్రస్తుతంలో ప్రభుత్వవ్యయం హెచ్చి, ఆదాయమును మించియుండుటవల్ల నిల్వఏమీలేదు.

స్టేటుప్రభుత్వములకు అవసరమైనప్పుడెల్ల అప్పులు చేసే అధికారముకలదు, గాని ఇండియాప్రభుత్వము వద్ద అనుమతి మాత్రము పొందుతూ యుండవలయును. కాని యీఅప్పు చేయడానికి నిబంధనలు కొన్నికలవు. ఇరిగేషను ప్రాజక్టులు, చెరువులు, కాలవలు, నిర్మించడం, విద్యుచ్ఛక్తి కారాగారములు నిర్మించడం, పెద్దఫాక్టరీలు, బట్టల మిల్లులు, పంచదార ఫాక్టరీలు, మొదలైన ఖర్చుల కవసరమయే మూలధనం నిర్మాణంకొరకే చెయవలసియున్నది. ప్రాతఅప్పుల తీర్మానంకొరకు కూడా క్రొత్తఅప్పుచేయవచ్చును.

ప్రస్తుతం నిత్యఖర్చులంతయూ ప్రభుత్వం సాలీనవచ్చే ఆదాయంలో నుండియే వ్యయంచేయును. భవిష్యత్కాలంలోగాని అనుభవమునకురాని ప్రజాహితైక కార్యములకు ప్రస్తుతంలో ప్రజల మీదహెచ్చు పన్నులు విధించడం

న్యాయంకాదు గనుకనే ప్రభుత్వం అప్పులు చేస్తూయుం టుంది. మద్రాసుప్రభుత్వం ప్రప్రథమమున, శ్రీ రాజాజీ యాజమాన్యమున ఏర్పడిన కాంగ్రెసు పరిపాలనయందు, మద్యపాన నిషేధం అమలు జరుపబడినప్పుడు వచ్చిన నష్టం భరించే నిమిత్తం, మద్రాసు గవర్నమెంటు పత్రాలు వేసినది. తదుపరి ఈ గుణపాఠమే అవలంబింప బడు చున్నది.

ఈనెలారంభమున షుమారు 10 కోట్లకుమించి స్టేటు ప్రభుత్వాలు అప్పుచేసినవి. మద్రాసుస్టేటు 2 కోట్లపత్రాలు వేసినది. యీపత్రాలు అంతచురుకుగా అమ్మకం కాలేదు. కొంత రిజర్వుబ్యాంకు, షెడ్యూ బ్యాంకులు, ధర్మాదాయ ట్రస్టులు, ఇంసూరెన్సు కంపెనీలు, మొదలైనవన్నీ కొన్న ప్పటికీకూడ, అప్పుమొత్తం రావడానికి రెండుమూడు దిన ములు పట్టినది. వడ్డీరేటు మూడునుండి మూడున్నర వరకూపెంచిరి. కాని ప్రజాసామాన్యము వద్ద నిల్వఏమీ లేదు. ఆహారపదార్థముల ధరలు అమితముగా పెరిగి సామాన్యముగా సంపాదించెడి సంపాదనలకు అలవిగాని ఖర్చుపెరిగి నందున, ప్రభుత్వపు అప్పుపత్రాలను, కొనలేక పోయిరి. కొత్తపత్రాలకు వడ్డీపెంచుటచే పాతపత్రాలధరలు బజారులో తగ్గినవి.

ప్రభుత్వం నిర్ణీతకాలంలో అప్పులు తీర్చగలిగినప్పుడే తమగౌరవము కాపాడుకుందురు. కాని యీఅప్పు ఎల్ల ప్పుడూ ప్రజాహితైక కార్యములకే వినియోగింప బడును. కనుక ప్రజాసామాన్యము యీపత్రాలు కొనడంలో ఉత్సా హము చూపడం న్యాయం. వ్యక్తి తనకష్టార్జితంలో శక్త్యా నుసారం నిల్వచేసికొనిన రొక్కమును, ప్రభుత్వ అప్పు పత్రాలను కొనడం మంచిది. ఇందు భద్రతకూడ కలదు. వడ్డీ యితరత్రా వచ్చేదానికంటే తక్కువైననూ, అసలు వడ్డీకూడ నికరంగా ముట్టును. అవసరమునకు, ఇబ్బంది లువచ్చిన, వెంటనే బజారులో ఇతరులు ఎవరైనను ప్రతా లను ఆనాడు అమలులోగల ధరకు కొనెదరు.

గనుక ప్రజాసామాన్యము యీప్రభుత్వపు అప్పులకు శాయశక్తుల సహాయం చేయవలయును. ప్రభుత్వం ప్రజ లదేగనుక, ప్రజాస్వానుభూతి చాలాఅవసరం. మీదుమిక్కిలి ప్రజాప్రభుత్వం, అనగా స్వరాజ్యం అనుభవించుచున్నాము కనుక ప్రతివ్యక్తి విధిగా తోడ్పడవలసి యున్నది. దేశా భ్యున్నతికి ప్రభుత్వ ఆర్థికబలం పునాదిగా పాటించవల యును. ఈ పునాదిపైన గట్టికట్టడములు కట్టవలెననిన, ప్రభుత్వం పదేపదే కోరెడు అప్పులకు, ప్రజలు పరిపూ ర్ణసహాయం చేయవలసియున్నది. అత్యవసర సమయము లందును, మీదుమిక్కిలి ప్రజాశాంతి కొరకు, లోకకళ్యా ణం కొరకు, ప్రభుత్వము చేసెడిఅప్పులు, ప్రజలస్వంత అప్పులుగా భావించవలసి యుండును. ఈ సూత్రమును ప్రజాసామాన్యం చక్కగా గమనించి ప్రభుత్వపు ఆర్థిక వ్యవహారం చక్కబరచే నిమిత్తం చేసెడి అప్పులన్నిటికీ అమితోత్సాహముతో సహాయంచేయడం విధిగా భావించ వలయును. ప్రభుత్వపు ఋణపత్రాల ధరలు యీక్రింద ఉదహరించెదను.

| | |
|---|---|
| 1938 లో | 100 లు |
| 1947—48 లో | 103-1 |
| 1-9-1951 న | 98-2 |

1951-31 ఆగస్టున తయారుచేయబడి రిజర్వుబ్యాంకు బుల్లెటిన్ నిరూపించిన ప్రభుత్వపు అప్పులమొత్తం. రు—519,00,00 ....





# అంత్య విశ్వాసము

• శ్రీమతి రంగిరాల శకుంతలాదేవి •

"ఎక్కడికత్తా వెడుతున్నావూ, కాలవకా?"

"ఎవరే, నువ్వా. కాలవకే, మడికట్టుకోవద్దూ"

ఇందాక సున్నానికి కబురుచేశావు. ఎవరికైనా దెబ్బ తగిలిందా?"

ఆ. ఏదో సామెత చెప్తారుచూడు, "వేలుమీద గోరు మొలిచింది, వెర్రిమగడా వేరుందాం" అని. అట్లాగే కోడలుకి ఎక్కడో చిన్న ముల్లు గుచ్చుకుందమ్మా. ఇహ చూసుకో, రాత్రి పగళ్లు ఏకంచేసి గడబిడ చేస్తోందికదా. అసలేవాడు పంచప్రాణాలు దానిమీద పెట్టుకుని బ్రతుకుతూ వుంటే, వాడిని మరింత హడలకొట్టేస్తోందికదా !

"అట్లాగా పాపం, ఎందుకు గుచ్చుకుందీ?"

"ఏం చెప్పమంటావు. మా ప్రారబ్ధం. భార్య, భర్త ఇద్దరూ పెరట్లో ఏదో పూలమొక్క నాటుదామని వెళ్లారటమ్మా. ఆవిడే పాతాలా ఏమిటే, అక్కడికి తనే అంత పనీచేస్తున్నట్లు నటనతప్ప (మెల్లిగా) "అసలింతకీ గుచ్చుకుందోలేదో, ఇంక ఆవిడగారి నటన ఏంచెప్పను. ఒక కాచటమేనా, ఒక కట్టుకట్టటమేనా ఎంత అవస్థ పడుతున్నానో ఆ పరమాత్ముడికెరుక. అసలు మొదటనే చెప్పా, "నాయనా, చదువుకున్నవాళ్లు మనకి సరిపడరురా" అని విన్నాడా. చదువో, చదువో అని అఘోరించాడు. తనుమాత్రం ఏం సుఖపడుతున్నాడు. మూడేసిరోజుల కొకసారి ముహం ముడవటమేగా. ఏమిటో ఇంతకీ మా అదృష్టం ఇట్లావుంది. "ఆర్నెల్లు ఉపవాసం చేసినా ఆరోజు జొన్నకూడే"నని.

"నువ్వు మరీచెబుతావత్తా, మీకోడలు చాలామంచిదని ఇరుగు పొరుగు అంతా మెచ్చుకుంటూవుంటే"

"ఏం మంచే, కామంచి. నాకు పనికిరానిమంచి నాకెందుకే తల్లీ. మారోజుల్లో ఇట్లాగే వున్నామటే, ఎన్ని దెబ్బలు తగిలాయి, ఎన్ని ముళ్లు గుచ్చుకున్నాయి. నేను బ్రతికున్న రోజుల్లో ఒకసారి పొలంలో గడ్డి ఇంటికి తీసుకొస్తూవుంటే, ఎంత ముల్లు గుచ్చుకుందనుకున్నావు. పాపం, మీ మామగారు అప్పుడు............ నా అమ్మ కడుపుకాలి, తనచేత్తో ముల్లు తీసి, పాపం చాలా ఉపచారం చేశారు. నా సుఖమంతా ఆయనతోటే పోయింది, ఇంతకీ ఒక్కమాట. ముసలిముండను, నే వున్నాగదే. చాకిరీచేయించుకోటానికి. దానికేమమ్మా మహారాణిలాగ మంచమెక్కి, వాడిచేతే చేయించుకుంటుంది."

"అట్లా అనకత్తా, నిజంగా బాధగానే వుందేమో?"

"వుండటానికి వుండా, బూచా, ఎదోకాస్త ముల్లు విరిగింది, అదేపోతుంది."

"ఇంకేముల్లు గుచ్చుకున్నా అంతబాధగా వుండదు. ఈతముల్లుమాత్రం చాలా బాధపెడుతుంది. ప్రమాదం కూడాట!"

"సాగితే అన్నీప్రమాదాలే. పెద్దముండనికదా, కాస్త ఏపనికో, పాటకో, సాయంలేదుకదా, మొగుడు ఇంట్లో ఉన్న నాలుగు ఘడియలూ ఏం సంతోషంగా తిరుగుతుందో అంతే. అప్పైన పుస్తకం పుచ్చుకుని "రాజెవరి కొడుకా" అని కూర్చుంటుంది

"పోనీ రాత్రిళ్లు వాళ్ళని వండుకోమనకపోయావూ?"

"ఆ భగ్గు. వెలుగు. వంటకూడాను. ఆ మాల గుడ్డలతో. అంటూ, సొంటూ ఏమీలేదుకదా. అంతా పరబ్రహ్మస్వరూపమే. అదేమే అంటే అడిగినమాటకు సమాధానం కూడా రాదు,"

"మొదట్నించీ బస్తీలో పెరిగిన పిల్లాయె. నీ ఆచారం రమ్మంటే ఎట్లా వస్తుందే. ఏదో సర్దుకుపోవాలికాని"

"అయితే మీరంతా పెరగలేదుటే అమ్మాయీ,"

"సరే ! మాసంగతే అడిగావు. మా వారు రోజూ చెప్పుతూనే వుంటారుకదా. చదువురాని మొద్దును కట్టుకున్నానని"

"పోన్లేమ్మా, అంటే అంటాడు. నిక్షేపంగా పనీ, పాటా చేసుకుంటున్నావు, నీకేంతక్కువా? సంసారం చక్కగా దిద్దుకుంటున్నావు. మా మొహాన ఆయోగం

కూడా లేదుకదా. వెడతా. మడికట్టుకుంటాను. అబ్బాయి భోజనానికొస్తాడు."

"ఎప్పుడన్నా వస్తూవుండత్తా"

"అట్లాగేనమ్మా. ఇంట్లో తీరుబడికావద్దూ"

౨

"కమలా, కమలా,

"ఆ, వస్తున్నా. ఏమిటి?"

"ఈపూట ఎట్లావుందే నెప్పి, కాస్త తగ్గిందా?"

"ఏం తగ్గటం చచ్చిపోతున్నాను-బాధపడలేక. మంటా పోటు కూడాను.''

"అమ్మని కాసిని వేడినీళ్ళుపెట్టి యిమ్మనకపోయావు, కాస్తే తగ్గుతుందేమో."

"అమ్మ పెట్టినట్లే వున్నారు. ఆవంట కాస్తా చేసి బయటపడేటప్పటికి ఆవిడ పని అయిపోతోంది. ఇంకా నాకెంచేస్తారు. ఈరోజుకు నాలుగు స్నానాలయ్యాయి. ఇంకా ఎన్నిచెయ్యాలో. ఈనాల్గు రోజులనుంచే పనిచెయ్య లేక పోవటంవల్ల వూరువాడకూడా ఏకం చేస్తున్నారు. మాకోడలు చుమపుకుంది, పనిచెయ్యదనిన్ని."

"ఏదో కాస్త పెద్దది. మనం కాస్త వూరుకుంటే అదే పోతుందే."

"వూరుకోక నేనేమంటున్నానూ. ఒక చెంప నాబాధ. మరోచెంప ఈ సాధింపు. ఏమిటో నాఅవస్థ నాదే"

"ఇదిగో డాక్టరు ఈమందు రాసి, కాస్తకాచమన్నాడు. నేను త్వరగా ఆఫీసుకెళ్ళాలి"

"పోనీ నన్ను మా అమ్మదగ్గిరికి పంపండి, తగ్గిన తర్వాతవస్తాను" (లోపల్నించి 'అబ్బాయి అన్నానికిరారా')

"ఆ, వస్తున్నానమ్మా"

"వెళ్ళిరండి, మీరు భోజనంచేసి రండి."

(భోజనం చేస్తూ)

"కమలకి కాస్త వేడినీళ్లు పెట్టి కాచాలమ్మా"

"అయ్యో, అట్లాగేనాయనా, నాతో ఏమన్నా చెప్తుందా ఏమన్నానా? అసలు దానికి ఓర్పు తక్కువరా. నువ్వుచూడు. నూటనాలుగు జ్వరం వచ్చినా పడుకునే వాడివికావు. నిన్నెంత గారాబంగా చూశానో, ఇప్పుడంత కష్టపడుతున్నావు, నా ప్రాణం కొసేసినట్లుంది."

"నేనేం కష్టపడుతున్నానమ్మా. కమల చాలా బాధ పడుతోంది. నేను చెయ్యకపోతే మరెవ్వరుచేస్తారమ్మా కమలకి."

"ఏమో నాయనా. మా కాలంలో పెనిమిటిచేత గుక్కెడునీళ్ళు పోయించుకోటానికి అభిమానపడి చచ్చే వాళ్ళం. అయినా ఇప్పటి ఆడవాళ్ళకు బొత్తిగా సిగ్గు, లజ్జా లేవుకదా. మొగుడంటే చాకిరీ నౌకరన్న మాట. అందులోనూ చదువు కున్న వాళ్ళ ..................నా కెందుకు మజ్జిగ పోయనా"

(కొద్ది రోజుల తరువాత)

"అబ్బ. బాధ. కదల్లేనూ"

"ఉండండి అత్తయ్యా. నే లేవతీస్తాను. కాస్తజావ పుచ్చు కోరూ. మరీ నీరసం వస్తుందే" (అని కొంచం పోసిన తరువాత)

"అమ్మయ్య. కాస్త ప్రాణం కుదుట పడిందమ్మా"

"కాస్సేపు పడుకోండి. విసురు తాను"

"వద్దమ్మా. వద్దు నువ్వు వెళ్ళి భోజనం చెయ్యి పొద్దు దేరిపోయింది. నాకోసం ఇంతసేపు కనిపెట్టుకు కూర్చు న్నావా?'

"మీకు బాధ తగ్గితే నాకేం శ్రమలేదు. భోజనం నిమ్మ దిగా చెయ్య వచ్చు"

"అబ్బ ఆయాసంగావుందే. అబ్బాయి రాలా?"

"వచ్చే వేళయింది. అదుగో మాటలోనే వచ్చారు. నేవెళ్ళి త్వరగా భోజనం చేసి వస్తాను. అందాక దగ్గర కూర్చుంటారు"

"కమలని చాలా బాధ పెట్టానురా."

"మరేం ఫరవాలేదమ్మా. కాస్సేపు పడుకో. మాట్లా

డితే ఆయాసం ఎక్కువ వుతుంది.''

"పరాయి అమ్మ కన్న పిల్లకదా అని చాలా చులకన చేశాను"

"....... ....... ......."

"ఏదీ కమల ఇంకారాలా .—అబ్బ — ఆయాసంగా వుంది నేనింక ఆట్టే సేపు బ్రతకను."

"ఏంమాటలమ్మా. పడుకో కాస్సేపు. ఆదేతగ్గుతుంది"

"కమలని కష్ట పెట్టకు నాయినా"

అంటూ కళ్ళు మూసింది ముసలమ్మ.



లగ్నబలిమి (27-వ పేజీ తరువాయి)

హఠాత్తుగా విధిగాప్రక్కకు కారును తప్పకోవాల్సి వొచ్చింది. ఆతప్పుకోవడంలో ప్రక్కన ఎక్కువస్థలం లేకపోవటం వలన- రోడ్డుప్రక్కన చాలాలోతైన ప్రదేశం వుండటంవల్ల కారు పడిపోయింది. డ్రైవరు, పద్మ, ఇంకోమనిషీ చనిపోయారు. వెంటనే నాగేంద్రానికి దెబ్బలు తగిలినవి.

అనుకోని ఈసంఘటనవల్ల జీవితాలు తారుమారైనై. పద్మని వొళ్ళోయిరికించుకొని చాలాసేపు కుమిలి కుమిలి యేడ్చాడు నాగేంద్రం. కాని యేంలాభం- పద్మ చనిపోయింది.

ఎల్లుండి పెళ్లి. పెళ్లికొడుకు కనబడకపోవటంవల్ల నాగేంద్రం తలిదండ్రులు చాలా గాబరా చెందుతున్నారు. నలుగుర్నీ నాలుగు దిక్కులకు పంపించారు.

పెళ్లిరోజుకి నాగేంద్రం వొచ్చాడు. తలకూ, చేతులకూ, మోకాలికీ కట్లుకట్టి వున్నాయ్. అందరూ ఆశ్చర్య పోయారు. కారు ప్రమాదం సంగతి చెప్పాడు. కానీ, ఎందువల్లనో నాగేంద్రం ఆకారులో పద్మకూడా వుందని, మరణించిందనీ చెప్పలేదు.

ఆరాత్రి పదకొండుగంటల యిరవైనిముషాలకు సక్రమమైన లగ్నానికే రాజేశ్వరితో నాగేంద్రానికి పెళ్లి జరిగింది. మరి లగ్నబలిమి !



# మిత్రుని కోసం

"శ్రీ గులపల గోపాలరావు"

[గత సంచిక తరువాయి]

[వెనుకటికథ :___ సుశీల ఒక వికసించిన గులాబీ పువ్వు. ఆ పువ్వులోని పరిమళం అందర్నీ తన వైపుకు ఆకర్షిస్తుంది.

సుశీల పినతల్లి సుందరమ్మగార్కి బిడ్డలు లేనందున, సుశీలను చిన్నప్పటి నుంచీ తమ దగ్గిరే పెట్టుకుని విద్యాబుద్ధులు చెప్పించేరు. వాస్తవంగా సుశీలంటే సుందరమ్మకు, హరినారాయణగారికి చెప్పలేని గౌరవం,అభిమానం. ఆగౌరవాన్ని సుశీల తగుమైన నడవడికలచేత అధికపరచుకుంది.

సుశీలకు ఈడువచ్చిన దగ్గిరనుంచీ ఆమె విద్యా బుద్ధులకు తగిన వరుని కోసం హరినారాయణ వెదుకు తాడు. కాని ఎవరూ సరి అయినవారు కుదరలేదు. కొన్నాళ్లకు ఒక వరుడు వస్తాడు. అతని పేరు వెంకట్రావు. అందగాడు. బి. ఎ. పాసు అయినవాడు. ఆస్తివుంది. మంచి సంబంధమే అని అందరూ మెచ్చుతారు. కాని సుశీల ఎటూ చెప్పలేకుండా వూరు కుంది.

సుశీల తలిదండ్రులకు తెలియ పరచందే ఏ సంగతీ చెప్పలేమని వెంకట్రావుతో చెప్తారు. వెంటనే సుశీలతో సుందరమ్మ, హరినారాణ తమ స్వగ్రామానికి వెళతారు. వూళ్లో వారందరూ సుశీలను చూచుటకు వస్తూ పోతూ వుంటారు. ఈలా కొన్నాళ్లి తరువాత ఎదురింటి కామాక్షమ్మ గారికీ, సుందరమ్మ గారికీ స్నేహం కుదురు తుంది. మాటల సందర్భంలో సు శీల పెళ్ళి విషయం తెస్తారు. కామాక్షమ్మ గార్కి సత్యమనే కొడుకు వున్నాడు. అతనికి సుశీలను చేసుకుంటే బాగుంటుందని మనస్సులో వుబలాట పడుతుంది. ఇంతవరకూ జరిగింది కథ. ఇకముందు కథ చదవండి.]

ఇప్పుడు పడమటింటి రూము సుశీల పుస్తకాల గదిగా మారిపోయింది. ప్రొద్దస్తమానం సుశీల ఆగదిలోనే గడుపుతూంటుంది. ఆనాటి సాయంకాలం సత్యనారాయణ వేసిన చిత్రం సుశీలను ఆకర్షించింది. సుశీల విచిత్రంగా ఆ చిత్రాన్ని చూస్తూ కిటికీదగ్గిర నిలుచుంది. కాస్సేపటికి ఆ చిత్రం ప్రక్కన సత్యనారాయణ ప్రత్యక్షమయ్యాడు. సుశీల సత్యాన్ని చూడ్డం యిదే మొదటిసారి. సుశీల సౌందర్యాన్ని చూచి సత్యం ముగ్ధుడై అలాగే నిలుచుండి పోయాడు. అతని హృదయఫలకంలో సుశీలను చిత్రించుకుని కుంచె తీసుకున్నాడు.

సత్యనారాయణఆర్టులో జీవం తొణికిసలాడుతుంటుంది. అతను చిత్రించిన చిత్రం ప్రతివానిని తన వైపుకు ఆకర్షిస్తుంది. సత్యం కూడ ఆ చిత్రాన్ని చూచి కదల్లేకపోతాడు. కాని అటువంటి చిత్రాలన్నీ యిప్పుడు సుశీలముందు నిరుపయోగమైన చెత్తబొమ్మల క్రింద తయారైపోయాయి.

సుశీల చూచిన చిత్రం స్థానే ఇప్పుడు సుశీల ప్రతిబింబించింది. అది చిత్రము కాదు- అందులో జీవమున్నది కాని మాట్లాడదు, నవ్వుతుంది, విలపిస్తుంది, హృదయంతో ఏకీభవిస్తుంది. అది హృదయంతో గీసినబొమ్మ

అందువల్లనే దానిలోనూ హృదయమున్నది. అంతశక్తి ఒక్క సత్యంలోనే వున్నది.

సుశీలహృదయంలో సత్యం ప్రతిఫలించాడు. ఎందుకో నవ్వుతాడు, వెంటనే విలపిస్తాడు. సుశీల జీవితంలో యీనాటినుండి క్రొత్తరోజులు బయలుదేరాయి.

"సుశీలా ! నువ్వు సాధారణమైన మనిషికాదు, నీలోని ఏదో ఒక ఉత్కృష్టమైన శక్తి నన్ను నీవైపుకు లాగుతున్నది" అంటూ సుశీల హృదయంలో సత్యం పలవరిస్తున్నాడు. సుశీల యిది విన్నది. "ఔ"నని తల వూపింది. చిత్రం వంక చూచింది. అది తన చిత్రం. ప్రక్కనే సత్యం వున్నాడు. చెయి చాచుతాడు "రా,రా" అంటాడు. తను కదలగలదు కాని చుట్టూ ముండ్లపొదలు.

"తిరిగిరావా?"

"రాలేను"

"సరే"

సుశీల కన్నీరు కార్చింది. తల వూపింది, దానికన్న చేయగలిగినది లేదు. హృదయంలో ఏదో బాధ, ఆరాటం తీర్చుకోవాలి. ఎల్లానో తెలియదు. ఎదురుగా చూచింది. సత్యం కనబడలేదు, వెనక్కి తిరిగింది. ఇప్పుడు సుశీల పూర్తిగా మారిపోయింది.

ఉదయంనుండి చదువుతున్న పుస్తకాన్ని సుశీల ఓమాటు తెరిచింది. సత్యం కనపడతాడు. నవ్వాడు, "ఇంతేనా?" అంటాడు. సుశీలకు బాధ. పిలవాలి, మాట్లాడాలి. పేరు తెలియదు. ఏమని పిలవను? అందుకే ఏదో అసంతృప్తి. హృదయంలో చెప్పరానినొప్పి. సుశీల ఒక్క నిట్టూర్పు విడిచి పుస్తకం మూసేసింది.

"అక్కాయ్ !" పద్మ పిలుస్తోంది. సుశీలకు వినబడ లేదు. మళ్ళా పిలిచింది "అక్కాయ్" అని.

"ఏమిటి పద్మా?"

"చూడవే, ఏన్ననుకున్నావ్ ! మనమప్పుడు వెళ్ళామే ఆ బొమ్మలన్నీ అక్కడ వున్నాయక్కాయ్. ఎంతబావున్నాయ్"

"ఏం బొమ్మలు? ఎక్కడున్నాయి?"

"అదే అక్కాయ్, అప్పుడు వెళ్ళేమే ఆ బొమ్మలు కామాక్షత్తమ్మింట్లో వున్నాయే."

"సరే"

"అయితే అక్కాయ్, ఆ బొమ్మలన్నీ సత్యం మామయ్య వేసాడన్నది కామాక్షత్తమ్మ అవునా?"

"అవును"

"అన్నిబొమ్మలు ఎలాగేస్తారక్కాయ్?"

"ఎలాగంటే? చేత్తో"

"ఊఁ హుఁ కాదు"

"బ్రెష్‌తో"

"అక్కాయ్, నాకూ ఒకటి ఆలాంటిదే చేసి పెడతావ్? బొమ్మలు గీయించుకుంటాను"

"సరే"

పద్మకు కలర్‌బాక్సు, బ్రష్ కొనిపెట్టాలి. దానితో పద్మ చేసేదేమీలేదు. అది సుశీలకు తెలిసిన విషయమే ! కాని కొనిపెట్టాలి. ఇటువంటి వస్తువులు పద్మ అప్పుడప్పుడు అడుగుతూంటుంది. సుశీల కొనిపెడుతూం టుంది. అదంతా సుశీలకో సరదా. కాని యిది మాత్రం సరదాకాదు. ఇది కొనిపెడితే తనకూ కొంత వుపయోగమున్నది.

సుశీల కలర్‌బాక్సు కొన్నది. పద్మ ఆనందానికి మేరలేదు. "పద్మా ఎవరిదగ్గిర గీయించుకుంటావు బొమ్మలు?" అని అడిగింది సుశీల.

"ఏం? సత్యం మామయ్యదగ్గర"

"ఏం బొమ్మ గీయించుకుంటావు పద్మా?"

"నాకు పడవబొమ్మ కావాలి"

"పడవ బొమ్మనా? దాన్నేంచేస్తావ్?"

"అందులో నిన్నూ, సత్యం మామయ్యనీ కూర్చోపెట్టి లాక్కుపోతా" అంటూ పద్మ పకపకా నవ్వింది.

"ఆఁ, ఎంతపిల్లే" అంటూ సుశీల కూడా పద్మతో కలిసి పకపకా నవ్వింది.

# మి త్రు ని కో స ం

"అయితే వెళ్లు" అన్నది సుశీల పద్మచేతికి బ్రష్, కలర్ బాక్సు యిస్తూ.

ఒక నెలరోజులు గడిచిపోయాయి. ఆరోజు వెంకట్రావు తన తండ్రితో శ్రీనివాసరావుగారింటికివచ్చాడు. వెంకట్రావుకు సత్యనారాయణ ఫలానాచోట వున్నాడని తెలియదు. హైస్కూల్లో చదువుతున్నప్పుడు యిద్దరూ అమిత స్నేహంగా వుండేవారు. వారు ఎంత స్నేహంగా వుండేవారంటే, ఒకర్ని విడిచి ఒకరు ఒక్క నిముషం గూడ వుండలేరు. తర్వాత విడిపోవలసివచ్చినప్పుడు ఎంతో కష్టంమీదగాని ఎడబాయలేకపోయారు. అది జరిగి ఇప్పటికి ఐదు సంవత్సరాలయింది. ఇప్పుడు వెంకట్రావు సత్యాన్ని చూడ్డంతోటే ఆనందం పొంగి పొరలివచ్చి ఆనందభాష్పాలతో సత్యం తల తడి అయిపోయింది. ఎప్పుడో చూచిన సత్యం ఇప్పుడు సత్యంలో ఎంత మార్పు!

"సత్యం! ఎంతమారిపోయావోయ్!"

"వెంకట్రావ్, నువ్వు కులాసాగానే వున్నావుకదూ!"

"ఆc"

"ఇప్పుడు నువ్వేంచేస్తున్నట్టు వెంకట్రావ్? మన మిత్రులంతా కులాసాగానే వున్నారా?"

"ఆc" అంటూ వెంకట్రావు లేచి మెల్లిగా డ్రాయింగు రూములోకెళ్ళాడు. గోడమీద తగిలించిన చిత్రాల్ని చూస్తూంటే మధ్యన సుశీల చిత్రం కనిపించింది. వెంటనే గుండెలో రాయిపడ్డట్టయింది. "సత్యం యీ బొమ్మ లన్నీ.... ..."

"అవును, నేను గీసినవే, ఎలాగున్నాయి?"

"ఊc, కాస్సేపటికి మళ్ళావస్తా" అంటూ వెంకట్రావు బరువెక్కిన హృదయంతో తిరిగి వచ్చాడు.

వెంకట్రావు తండ్రితోకూడ వచ్చాడని సుశీలకు తెలిసింది. కాని ముందులాగా ఇప్పుడు అతనిమీద సుశీలకు ప్రేమలేదు. అతడేదో యిప్పుడు తనకు అపరిచిత వ్యక్తిలాగా కనబడుతున్నాడు. పెళ్ళి విషయమై సుశీల తండ్రితో ప్రసంగం జరిగింది.

ఇది విన్నప్పటినుండి సుశీల హృదయంలో తుపాను రేగింది. "సత్యం! నిన్ను నమ్మకుందుకు యిదా నువ్వు చేసేది? నేను మా నాన్నతో తిరుగుమాట ఎలా చెప్పను? వెంకట్రావు స్నేహితుడుకదా, ఉన్నవిషయం వెలిబుచ్చ రాదూ?" అంటోంది సుశీల హృదయం.

సత్యం కిటికీదగ్గర నిలబడ్డాడు. సుశీల యిప్పుడు అతన్ని చూడగానే లజ్జాన్వితకాలేదు. అలాగే చూస్తూ నిలుచుంది. కళ్ళల్లో నీళ్లు టపటప రాలుతున్నాయ్. దీనంగా దిక్కులేని దాసివలె అతన్ని చూచింది. సుశీల బాధను సత్యం అర్థం చేసుకున్నాడు. అదే బాధతో అతనూ కృంగిపోతున్నాడు. సుశీల బరువైన హృదయంతో వెనక్కి తిరిగింది.

ఆనాడు సాయంత్రం వెంకట్రావు సత్యాన్ని కలుసు కున్నాడు. సత్యం ముఖకవళిక మారియుండడం వెంకట్రావు స్పష్టంగా గమనించాడు. సత్యం తన హృదయాన్ని పూర్తిగా విప్పి తన మిత్రునికి చెప్పేశాడు.

"............ఊc, ఇంతవరకూ జరిగిందన్నమాట, అయితే సత్యం, యీసంగతి ఉదయమే నాతో చెప్పక పోయావ్"

"నువ్వేమి చెయ్యగలవు వెంకట్రావు. అది వారి తలి దండ్రుల మీదకదా ఆధారపడియున్నది"

"అవును"

కాస్సేపు ఇద్దరూ ఏవేవో మాట్లాడుకున్నారు.

"సత్యం, నేను వుదయం ప్రయాణమయి వెళ్లాలి"

"ఎక్కడికి వెంకట్రావ్?" అని ఆశ్చర్యంగా అడిగాడు సత్యం.

"ఊరికి వెళ్ళాలి కాస్త జరూరు పనివుంది, తప్పితే లాభంలేదు"

"అయితే యిక్కడకెందురువచ్చినట్టు?"

"ఆc ఏముందలే, మా నాన్న ఏదో పొలం పనిమీద వస్తే కూడా వచ్చాను. అంతే, రేపు తప్పకుండావెళ్ళాలి"

వెంకట్రావువెళ్ళి నాలుగు రోజులయింది. ఆనాడు పోస్టుమేన్ శ్రీనివాసరావుగారికి ఒక కవరిచ్చి వెళ్ళిపోయాడు. శ్రీనివాసరావు దాన్ని విప్పి చదువుతున్నాడు.

"...............సుశీల తనజీవితాన్ని సుఖప్రదంగా గడపాలంటే నా మిత్రుడు సత్యనారాయణకిచ్చి వివాహం చేయడమే మీ కర్తవ్యం" అన్న కడపటి వాక్యం గదిలోకి వెడుతున్న సుశీలకి వినపడింది.



ఆదర్శంలో విషాదం :

# "నాయకుడు"

• శ్రీ రామ్‌చంద్ •

పవిత్ర ప్రశాంత జీవితం
పెక్కు వక్ర రేఖలతో కూడిన
ఒక రేఖా గణితసూత్రం.
నమ్మే వారికి ఆదర్శం
నిజంగాని రూపకాలంకారం,
నిర్భాగ్యులకు దౌర్భాగ్యులకు
విశ్వాసమనే శక్తిని కూర్చిన కథనం
తోటలో వికసించిన పరిమళపుష్పం.
తరతరాల నుండేతెంచే
తారతమ్యంలేని బాధ్యత
తలకుమించిన భారంతో
నాయకుడనే మానవుని జీవితం
నిరంతరం కంటక మార్గాల్లో పయనించే
ఆదర్శంలో విషాదం.
జీవులకు కొరగాని
కించిత విషయాల నాశం
మానవ జీవితం— ఒప్పుకోదు.
రక్తంలోని ముడిలవణాలు
ముడివీడని నరాలు
వీడి పోరని మనస్సు, భావాలు,
నాయకుడు కోపాన్నణుచుకోగల్గు
సమరంలో వీరుడనిపించుకోగల్గు
అయితే అతడు ఆదర్శవాది....
ఎప్పుడూ ఏదో కించిత్ తరుగు....
ఎందుకో కొంచెం అనిర్ణయం
మానసికంగా అతనుపొందేబాధ ఎవరికి
— తెలుసు ?

ఎవరుచదువగల రాతని హృదయాన్ని ?
స్పష్టంగా కన్పించే చిక్కుసమస్యలు
క్లిష్టమై, పరిష్కారా భేద్యమైనపుడు
చారిత్రిక మహాపురుషులు తలలొంచినా,
చరిత్ర తారుమారైనా
తను మారు త్రోవతొక్కాలని
తనకు తెలుసు !— అది తప్పదు
విశ్వం విశ్వసించిన మహానమ్మకస్థుడు
నలుదిక్కులకూ వెలుగును ప్రసరిస్తు
నౌకాభంగాన్ని వారించే
వెలుగు శిఖరంవలె,
విశ్వమంతకు విజ్ఞానాన్ని జాటి
మానవ నైతిక పతనాన్ని
వారించేందుకు కలకాలం
జీవించాలాతడు.
మానవ సమాజం అవ
మానాన్ని భరించలేదు ; కాని
తనుమాత్రం తృణప్రాయంగా
తృణీకరించి....
జంకు గొంకనేది లేక
అగ్ని త్రోవలను పొడిగిస్తూ
శక్తి అనే ప్రియజీవితంలో
ప్రకాశిస్తాడు.
అర్థంలేని వ్యర్థపు ఆచారాలతో
ధర్మమనే ముసుగుచాటున తమ
స్వార్థంకోసం పాటుపడే సంఘాన్ని
ఎదిరించే మానవుడు —

బలవంతుడైనా — 'ఏకాకే' అతడు, మూడు రెట్లు అధికభారమైన విషాదకిరీటాన్ని ధరించక తప్పదు.

---

# కృతజ్ఞత

ఆంధ్రమహిళాసభ—నర్సింగ్‌హోమ్ రోగులకు మిసెస్—నారాయణన్ ఒకస్ప్రింగ్‌కాట్, శ్రీ నరసింహులునాయుడుగారు, రెండు ఉయ్యాలలకు రూ. 75లు విరాళంగా యిచ్చారు. వీరికి మా కృతజ్ఞత.



శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

కోరా శిస్తులు :

1 పౌను మైదాపిండి.
2 గరిటెలు (టేబిల్ స్పూనులు) వెన్న.
2 ,, పంచదార (చక్కెర)
2 కోడిగ్రుడ్లు.
6 టీస్పూనుల బేకింగు పౌడరు.
½ కప్పు—పాలు.

పై వస్తువులన్నీ ఒక ముద్ద చేయవలయును. ఆ ముద్దను బాగుగా పిసికి మెత్తగా చేయవలయును. రొట్టెల పీటమీద రొట్టెలను వత్తినట్లు వత్తవలెను. ఆ రొట్టెను దోసి చుట్టినట్లు చుట్టి ఆ చాపచుట్టను ఎనిమిది సంఖ్య (∞ ) ఆకారముగా చేయవలయును. ఆ ఎనిమిది సంఖ్య నేతిలోగాని, డాల్డాలోగాని వేయించ వలయును.

ఐదు కప్పుల నీళ్ళు, ఐదుకప్పుల పంచదారను కలిపి లేత పంచదార పాకముచేసి పెట్టి వుంచవలయును. ఈ పాకములో వేడివేడిగా వేగిన ఎనిమిది ఆకారపు చుట్టలను వేయవలయును.

వీటినే కోకోశిస్తులందురు — తినుటకు బాగా రుచిగా నుండును. ఇది ఆఫ్రికాదేశపు వంట. దీనికి పౌలము సిద్ధులతో ఎట్టి సంభంధము లేదు.

ఏటంబాంబులు :

1 గిద్దెడు — పొట్టుతీసిన మినపప్పు.
6 గిద్దలు — బియ్యము.

పెద్ద శబ్దమువింటే భయపడే పిల్లలుగాని, పురుషులుగాని పెద్దలుగాని ఇంటిలో వుండిన వారికి ఏటంబాంబు శబ్దము వినగలరని హెచ్చరించుట మరువరాదు.

మినపప్పునీ బియ్యాన్ని వేరు వేరుగా దోరగా వేయించ వలెను. కమ్మని వాసన వచ్చును. అప్పుడు వాటిని కలపి తిరగలిలో గాని మిషనులోగాని పిండిచేయ వలయును. ఆ పిండిలో కొద్దిగా పొట్టు తీసిన నువ్వులను కలప వలయును. నిమ్మకాయంత పిండిని చేతిలోనికి తీసికొని వ్రేళ్ళతో సన్నగాత్రిప్పుతూ చక్కిలాలచుట్టలవలె తయారు చేయవలయును. ఇది చేయుటకష్టమే. మొదట ప్రయత్నంలో సఫలీకృతులగుటకష్టమే. కొంత సేపు సాధన చేయ వలయును. ఈ విధముగా చక్కిలాల చుట్టలు చుట్టుట చేతగాని యడల గచ్చకాయంత పిండి తీసికొని గోళీలవలెను, కోపునా పాలకాయలు వలెను, చేసి, కాగునేతిలో వేయవలెను. కొద్ది క్షణములలో పెద్దశబ్దము విన వచ్చును. అంతేకాదు ఆ గోళీకాయలు వగైరా నేతిలో నుండి ఎగిరి వంటచేయువారి ముఖము మీద పడవచ్చును కావున చాలా జాగ్రత్తగా నుండుట ముఖ్యమే. అది నెయ్యిలో అలా ఎగురుతున్నవని ఖంగారు పడి పైన ఏదైనా తేలిక అల్యూమినియము పళ్లెము వంటిది మూసినా ఆ పళ్లెమును ఎగిరి మీ పై పడవచ్చును—**(Flying Saucer)** ను తయారు చేయుట కంటె ఏటం బాంబుల తోనే సంతృప్తి పడుట మంచిది.

జాగ్రత్త సుమండీ !
చేసేవి ఏటంబాంబులు,

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ఏమి లాభ ముందండి....



# అభ్యర్థన

శ్రీ జంపాల వేంకటనరసింహము
(సుధీమిత్ర ఉభయభాషాప్రవీణ)

అమల విశాలభావ సముదంచిత వర్తన మించి దేశదే
శములు ప్రశంససేయ జనసమ్మతి కిమ్మగు రాజ్యపాలనం
బమరగ, భారతీయులు సమైక్యమునన్ గృషిసల్పఁ
బూన్కిఁదో
రసులు ధరింపఁగావలయుఁ బ్రాజ్ఞత మాతృ
ధరిత్రిసేవకై. ౧

పలు మతవాదతత్త్వములఁ గ్రుంగక, మానవజాతి
ధర్మముల్
దలఁగక, గాంధితాపసు సుధామృదుబోధల కాత్మలొగ్గి, ని
స్తులశుభశాంతి సౌఖ్యములతోఁ దులఁదూఁగఁగ
భారతప్రజల్
వలతులటన్సుకీర్తి నిలుపన్ దృఢదీక్ష వహింపఁ
బూనుఁడీ. ౨

కలుగు స్వతంత్రరాజ్యము, సుఖంబగు జీవితమెల్ల
వారికం
దెలసిన భారతీయ సమభీప్సితసిద్ధికి సత్ప్రయత్నముల్
సలుపఁ బ్రతిజ్ఞ సేయుఁడు, ప్రశస్యగతిన్ బహుపక్ష
భేదముల్
దొలఁచుఁడు, సత్త్వవర్తనముతోడ స్వదేశము
నుద్ధరింపుఁడీ. ౩

పదవులకాంక్షఁజేసి బహుపక్షపుటీర్ష్యలు పెల్లెసంగ సం
పదలు దొలంగ, దేశము విపద్దశఁ గూలికృశింప,
స్వార్థముల్
పొదలఁ జరించుమేని పడిపోవును జాతి యటన్న
సత్యమున్
హృదయములం గ్రహింపవలదే ? యువభారతలోక
మెల్లడన్ ౪

చెడిదప్పుఁ జేతలన్ బ్రజలఁ బీడ యొనర్చి వహించుపాలనం
బెడయక తక్షణంబ రహియించునొకో యెపుడేని
భారతిన్
బెడదలపాలుగాని, పరపీడకులోగని శాంతిరాజ్యమె
ప్పుడఁ గృషిసల్ప నాయకులు బాధ్యులుగారె ?
సమష్టిపద్ధతిన్ ౫

ఎవరికివారె తోఁచినటు లేదియొ పక్షమటంచు వ్యష్టిగా
యువజనముల్ చరింపఁగఁ బ్రయోజనశూన్యమకాక
లోకమం
దవమతియున్ దురాక్రమణయానుల ధౌష్ట్యఫలాను
భూతియున్
జవిఁగొననౌనొ యేమొ ! విలసన్మతిఁగాంచుఁడి
దేశసేవకుల్. ౬

నేటికి నేడు వర్షములునిండె స్వతంత్రతగల్గి నిత్యమా
రాటమెసంగఁగాఁగు జనరాజిదురంతము, స్వార్థ
చింతయున్
దాటిఁగలంప, నాయఁక సుధానిధు లైక్యమునంజరింపమిన్
బాటిలదయ్యెశాంతి మన భారతమాత కొకింత
యేనియున్. ౭

కొంచెపుఁ జేతలన్, బరులకొంపలుగూల్చెడి
కృత్రిమత్వముల్,
వంచకజీవితం, బనృతవర్తన మున్నగు
దుష్కృతంబులన్,
గొంచకడంచ దీక్షఁగయికొండు స్వజాతిసముద్ధరింపఁ బ్రే
మాంచితమైన దివ్యహృదయంబుల భారతపౌర
వర్గముల్. ౮

భారతజాతి గౌరవశుభస్థిరశాంతి సమిద్ధజీవితో
ద్ధారణకార్య నిర్వహణతత్పరతన్ బ్రతినన్ వహింపుఁడీ
ధీరత దుష్టశక్తులఁగుదింపఁ బరిశ్రమ చేయఁబూనుఁడీ
భారత పౌరులార ! మన భాగ్యమువర్ధిల
శ్రద్ధఁజూపుఁడీ. ౯

కలయికలేనిజాతిని వికాసవిహీన దరిద్రజీవితం,
బలఁతి తనంబు, దుర్నయ మనాదరమున్ బరదాస్య
దుష్టశ
కలఁచి దురంతదుఃఖశిఖిఁ గ్రాఁచుటతప్పదు కాన భారతీ
యులు సతతైకమత్య విభవోన్నత వర్తనమున్
వహింపుఁడీ. ౧౦

పాలకవర్గమందు, జనపక్షములన్ వెలుఁగందు నాయకుల్
కాలపరిస్థితుల్ ప్రబలగాఢ విమర్శను గుర్తెఱింగి చి
త్తాలసమైక్యవర్ధన సుధాపరిశుద్ధమొనర్చి, దేశభా
గ్యాల ప్రవృద్ధిసేయ శుభకంకణముల్ ధరియింపఁ
గావలెన్. ౧౧

క్రూరదురాశలంబిపుకు మత్సరజాతి దురంతముష్కరుల్
భారతజాతికింతకు విపద్దశ గూర్చుచున్న ధీరతన్
భారతిభక్తులార ! తమ స్వాతంత్ర్యమున్ పెంపొంది
మెరయ్యే
పార స్వదేశరక్షకయి పాయఁగఁజేయుఁడి భేద
వాదముల్. ౧౨

చంద్రసేనుడు అడవిలో ఉన్న భవనమునకు వచ్చెను. సూర్యప్రభనుచూచి చంద్రసేనుడు తనువచ్చిన రహస్యము తెల్పెను. అంతయువిని సూర్యప్రభ చాలా సంతోషించెను. చంద్రసేనుడు సూర్యప్రభతో "నీవు రాక్షసుని యొక్క ప్రాణము ఎక్కడ వున్నదో చెప్పమని అడుగుము" అని చెప్పెను సూర్యప్రభ రాక్షసునివద్ద మనిషిని మాయచేయుట నేర్చుకొనెను. వెంటనే చంద్రసేనుని సాలీడు వలె చేసి తన గదిలో ఉంచెను. రాక్షసుడు వచ్చుట చూచి విచారముతో ఉండెను. రాక్షసుడు చూచి "అమ్మా ! సూర్యప్రభా ఎందులకు విచారముగా యున్నావు?" అని అడిగెను. సూర్యప్రభ "చెప్పెను నీ ప్రాణము ఎక్కడ వున్నదో చెప్పేవరకూ నేనిట్లే యుందును." అందులకు రాక్షసుడు "నాప్రాణం ఇక్కడనుండి ఏబదికోసుల దూరములో మర్రి చెట్టునందు తొర్రలో యున్నది. దానిచుట్టూ నాగుపాములు బుసతో ఎవ్వరిని లోన చేరనీయవు. ఇచ్చట ఒక ఎర్రని ఆకు కలదు దానిని వంటికి రుద్దినయెడల ఎవ్వరు వాళ్ళని ఏమియూ చేయలేరని" చెప్పి వెళ్ళిపోయెను.

సూర్యప్రభ వెంటనే సాలీడును మనిషిగా చేసి సమాచారమంతయు చెప్పెను. వెంటనే చంద్రసేనుడు ఆకు రాసుకొని బయలుదేరి వెళ్ళెను. అతనికి పాములు కనిపించు చున్నవి. వాటికి అతడు కన్పించుట లేదు. వెంటనే బరిణను తీసుకొని దానిలోని తుమ్మెద రెక్కలు విరచి మాయభవనముకు వచ్చెను. రాక్షసుడు రెక్కలు విరిగి అరవసాగెను. ఇదిచూచి పీకనలిపెను. ఇంతటితో రాక్షసుని పీడవదలెను. చంద్రసేనుడు సూర్యప్రభతోపాటు చంద్రనగరము వచ్చెను. ఇదిచూచి రాజు,రాణి,ప్రజలు చాలాసంతోషించిరి. అటుపిమ్మట జయంతీపురమునకు సుభవార్త పంపెను. ఆరాజు వారి పరివారము వచ్చిరి. శాంతమూర్తి తన కుమార్తెతో పాటు తన రాజ్యమును చంద్రసేనునకు పట్టాభిషేకము చేసెను. చంద్రసేనుడు తనతండ్రి రాజ్యము, మామగారి రాజ్యము శాంతముతో పాలించుచుండెను.



# డాబు

"ద్వారకా జవహర్"

ఒక ఊళ్ళో నలుగురు స్నేహితులున్నారు. వారిలో ఒకడు చెవిటివాడు, ఇంకొకడు గ్రుడ్డివాడు, మూడవవాడు సొట్టవాడు, ఆఖరువాడు దిగంబరి. అంటే ఒంటిమీద బట్టగాని, ఒక వస్తువుగాని లేనివాడన్నమాట.

ఒకనాడు వీరు నలుగురూ, ప్రక్కఊరు వెళ్తున్నారు. అందులో చెమిటివాడు ఇలా అన్నాడు: "ఒరే తమ్ములూ! నాకేదో పెద్ద ధ్వని వినిపిస్తున్నది" అని. "ఔను నిజమే" అన్నట్లు ఆమాటకి గ్రుడ్డివాడు "అవున్రోయ్ నాకు ఆ కొండలమధ్య దొంగలగుంపు కనిపిస్తోంది." అన్నాడు. దానిని బలపరుస్తూ, మన సొట్టవాడు "నిజమేన్రోయ్ ! నాకు చాలా దిగులుగావుంది. పరిగెత్తిపోతాను"అన్నాడు. వెంటనే నాలుగవవాడైన దిగంబరి "ఒరే మీరంతా వెళ్ళిపోతే, నాదగ్గరున్న ఆస్తంతా దొంగలెత్తుకుపోతారు" అన్నాడు ఏడుస్తూ.

బాలలూ! వీరి నలుగురి డాబు కబుర్లూ మీకు తెలిశాయా?



# వదలని తెగులు

(31వ పేజీ తరువాయి)

నాగి ఇంటికి వచ్చేసరికి ఇంకా ఒక్కపని ముట్టుకోలేదు. కాఫీతాగి చేసుకోడం అలవాటు. కాగా పాచి ఊడవడం, అంట్లు తోమడం, ఇల్లు తుడవడం. నీళ్లు తోడడం మొదలైనవి అట్టే ఉన్నాయి. సత్యవతి గుండెబద్దలయిపోయింది. గబ గబ కాఫీ తయారుచేసింది. కాఫీ గ్లాసులో పోసుకొని అరిటాకుతో పట్టుకొంది. గూడానికి బయలుదేరి వెళ్లింది. "నాగీ! ఓ నాగీ! ఇదిగో కాఫీతాగు మొట్టమొదట! పాపం ఇంకా కాఫీయేనా పుచ్చుకోకుండాపచ్చి పడిందే పోరు! పోరుబొగ్గులా!" అని విచారించింది.

"నాకు కాఫీ అక్కర్లేదు. అసలు మీ ఇంటి నౌకరీయే అక్కర్లేదండి అమ్మగారూ!" అంటూ నాగి కళ్లొత్తుకుంది.

"చాలులే! నీ ఇంటికి నువ్వు కాకపోతే మరెవరు చేసుకొంటారే! వెర్రిదానా! లే పాపం! మొదట ఇన్ని కాఫీ నీళ్ళు పడనీ తస్సాంతమన్నతుంది!"

"అయ్యగారు ఎంతేసి మాటలన్నారండి అమ్మగారు! అది తలపుకి వచ్చినప్పుడల్లా పొర్లి పొర్లి వస్తూంది!" అని నాగి బట్ట మొహానికి చాటుగా వేసుకొంది.

"శివ! శివ! ఆయనకేమి తెలుసులే! మొగాళ్ళ మాటలనే మాట నువ్వు ఇంతకు ముందు వినలేదులే!"

"ఏమోనండి అమ్మగారు. మీ మొహం చూస్తేగాని ఏ సమాధానం చెప్పబుద్ధవడంలేదు!" అంటూ నాగి కుమిలి కుమిలి ఏడ్చింది.

సత్యవతి ఎంతో ఓదార్చింది. ఎంతో నొచ్చుకొంది.

బలవంతంమీద నాగి కాఫీగ్లాసును నోటిమోలకి తాకించగా ద్రవపదార్థం జర జర లోపలికి ప్రవహించింది. "పదండి మీరు ముందమ్మగారు! నేను దొడ్డి కసువు ఊడ్చి చేసుకొని కాళ్ళుచేతులు కడుక్కొని వస్తాను." అంటూ నాగి మరొక్కసారి కళ్ళు తుడుచుకొని, మొహానికి పైటచాటు చేసుకొంది.





దక్షిణాది పర్యటనలో మహాబలిపురంలోని పక్షితీర్థమందు ఆలయమర్యాదగా తలకు "వరిపట్టం" చుట్టుకొని నమస్కారం చేస్తున్న రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాదుగారు, మదరాసు గవర్నరు శ్రీ ప్రకాశగారు.

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో

భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 .... సీనియర్ తరగతికి రూ. 9-0-0

నృత్యోపాధ్యాయిని:

శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2—0—0

సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని:

శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.